# భక్త లీలామృతము

అను భక్తవిజయ గ్రంథము.



శ్రీ భక్త నరసింహంగారి పుత్రులు
సత్యనారాయణగారిచే రచియింపబడినది

1952

 వెల.

# ప్రస్తావన



కలియుగమునందు సర్వులు సహజముగ భగవత్ప్రాప్తిని బొందుటకు ముఖ్యసాధనము భక్తియని మహాత్ములెందరో వర్ణించిరి. జ్ఞానయోగాది సాధనములు సర్వులు నాచరించుటకు సాధ్యములుకావు. జ్ఞానసంపన్నులకు మాత్రమే ఆ మార్గము లాచరణయోగ్యములు. సప్రేమభావముతో నీశ్వరప్రాప్తిని బొందుటకు భక్తిమార్గ తత్త్వము మిగుల ఉదార స్వభావము గలిగియున్నది. ఈ భక్తిమార్గమునందు స్త్రీ-పురుష, బ్రాహ్మణ-శూద్ర భేదభావ మెంతమాత్రము లేదు. దీనిని భాగవతధర్మము (వైష్ణవధర్మము) అనెదరు. ఈ భాగవతధర్మ మనుష్ఠించి యనేకు లజ్ఞానులు ఉద్ధరింపబడిరి. శ్రవణము కీర్తనము, స్మరణము, పాదసేవనము, అర్చనము, వందనము, దాస్యము, సఖ్యము ఆత్మనివేదన మను నవవిధ మార్గము లున్నవి. పరమేశ్వరుని కృప నపేక్షించి ఆతని అనంత కళ్యాణ గుణములను అవతార పురుషులగు భక్తుల సచ్చరిత్రలను అనన్య భావముతో శ్రవణముజేయుట నవవిధభక్తిమార్గములలో మొదటిది

శ్రవణభక్తి, పుణ్యాదిబలములపై భజనమార్గాధారపడియున్నది. భక్తిమార్గమను భవనము పుణ్యాదిబలముగు శ్రవణభక్తి యాధారముపై యుండును. శ్రవణభక్తి అలవడిన పిదప మిగిలిన భక్తిమార్గములు సహజముగనే యలవడును.

కృత త్రేతా ద్వాపరయుగములందు శుక సనకాది భక్తోత్తము లెందరో యుండిరి. వారలాకాలపు ధర్మముల ననుసరించి కృతయుగమున ధ్యానధారణయు, త్రేతాయుగమున యజ్ఞ యాగాదులును ద్వాపర యుగమున బరిచర్య (సేవ)యును భగవత్ప్రాప్తి బొందుమార్గములని నిర్ణయించిరి. ఆయాయుగములయందు మానవులా ప్రకారము నడిపించి భగవత్ప్రాప్తిని బొందిరి. కలియుగమున మానవు లల్పజ్ఞానము గలవారలగుటచే వారల ప్రవృత్తి అధర్మమున లీనమైయున్నది. అందుచే కలియుగమున మానవులు తరించుటకు భక్తిమార్గమునందు రెండవదియగు కీర్తన భక్తి సర్వశ్రేష్ఠమైనది. ఈ కీర్తనభక్తి శ్రవణభక్తివలన కలుగును. భగవదాజ్ఞ ప్రకారము ఈ కలియుగమున జ్ఞానేశ్వర, నామదేవ, ఏకనాథ, తుకారామ్, రామదాస, జయదేవ, తులసీదాస, కబీరు, నరసీ మెహతా, మొదలగు మహాపురుషు లెందరో ఈ భూలోకమునందుజన్మించి తమ భక్తి సామర్థ్యములవలన అజ్ఞానులను భక్తిమార్గమున ప్రవేశింపజేసి భగవన్నామసంకీర్తన జేయుమని వారల కుపదేశించి తద్వారాతరింపజేసిరి.

కలియుగమునందు భగవత్ప్రాప్తికి సులభమగు భగవన్నామసంకీర్తన యలవడుటకు శ్రవణభక్తి ఆవశ్యకము భగవంతుని యొక్కయు, ఆతని భక్తులయొక్కయు మహిమ విశేషములను శ్రవణము జేసినచిత్తము శుద్ధమై భక్తి గలుగును. కలియుగమున భగవంతుడు బౌద్ధరూపమున నుండియు, భక్తులయందు తనకుగల వాత్సల్యమును ప్రకటన జేయుటకై సగుణరూపముతో సాక్షాత్కరించి నానావిధముల భక్తులకు గలిగిన సంకటములను దొలగించెను. భూలోకమునందు భారతదేశ మత్యంత పుణ్యభూమియని మహాపురుషు లెందరో వర్ణించిరి. ఈ పుణ్యభూమి యందెందరో మహాత్ము లవతరించిరి. వారలు తమ ఈశ్వరనిష్ఠ పవిత్రాచరణ, నీతిశ్రద్ధలవలన జనుల హృదయములలో కర్తవ్య జాగృతి నుత్ప

శ్రీ గణేశాయనమః

శ్రీ

# పాండురంగ మాహాత్మ్యము

## (పుండలీక చరిత్ర)



ఓం నమో ఆదిపురుషా దిగంబరా, జయజయ భీమాతీర విహారా, పాండురంగా, పుణ్యశ్లోకరా, భువన సుందరా, సద్గుణ పంచాననా, ప్రసన్నరూపా పరాత్పరా, బ్రహ్మానందా, ఉదారా, సుఖసాగరా, శ్రీవిఠ్ఠలా.

పద్మపురాణమందతి శ్రేష్ఠమై వర్ణింపబడిన శ్రీపాండురంగ మాహాత్మ్య శ్రవణపఠనముల వలన మహా పాపములు హరించి శాంతి సుఖములు లభించును.

ఒకానొక సమయమునందు పార్వతీదేవి శంకరునికి సాష్టాంగ ప్రణామము లాచరించి "ఓ మహాదేవా! శ్రీపాండురంగ మాహాత్మ్యమును వినవలెనని కుతూహలముగ నున్నది. మేఘశ్యాముడగు భగవంతుడు శ్రీ పంఢరీక్షేత్రమున నివసించుటకు కారణమేమి తెలుపు"మని ప్రార్థించెను. అంత కైలాసనాథుడు "ఓ గౌరీ! సావధానచిత్తముతో వినుము. ఒకానొక సమయమున సహస్ర నేత్రుని లలనయగు శచీదేవి వైకుంఠమునకేగి శ్రీమన్నారాయణుని సేవించి మృదుమధుర వచనములతో "ఓ మురారీ, నీయంకముపై నధిష్ఠింపవలెనని నాకు గోరికయున్నది." అని చెప్పగా భగవంతుడు చిరునవ్వు నవ్వుచు "నీవరువదివేల వర్షములు తపమొనరించినచో నేను శ్రీకృష్ణరూపమును ధరించు సమయమున నీవు రాధవై

జన్మించెదవు. ద్వారకలో నొక క్షణకాల మిందిరాదేవిని విడచి సత్యముగా నిశ్శంకముపై గూర్చుండబెట్టుకొనెద" నని చెప్పెను

భగవదాజ్ఞ ప్రకారము శచీదేవి దారుణముగ తపమొనర్చి గోకులమున రాధయై జన్మించి బాల్యమందు శ్రీకృష్ణునితో నానందముగ లీలావైభవ సుఖముల భోగించెను. మనోమోహనుడు మధుర కేగ వియోగమును సహింపజాలక రాధ గుప్తముగ దంతవేషమును మార్చి ద్వారకలో ప్రకటనకాగా శ్రీరుక్మిణీసమక్షమున దామెను జూచి ప్రీత్యానందనుడై పరమలావణ్య స్వరూపవతియగు యామె నాలింగనము జేసికొని తన యంకముపై గూర్చుండబెట్టుకొనెను.

శ్రీరుక్మిణీదేవి ఈ దృశ్యమునుగాంచి క్రోధపూరిత మానసయై విలపించుచు తత్క్షణమే "ఇక నీముఖమును జూడ" నని యలుకమై బయలు దేరెను. శ్రీరుక్మిణీదేవి "ఏకాంత స్థానమును జూచి దారుణముగు తపస్సు జేసినచో జగజ్జీవనుడు వెదకుచు తనయొద్దకు జేరు" నని నిశ్చయించెను. పరమ పావనంబగు గోదావరీ నదీతీరమునగల దండకారణ్యమున కుత్తర దిశయందు సుందరమగు తీర్థముగలదు. దానికంటె మిగుల విశేషముగు స్థలము దక్షిణమున గలదు. దక్షిణమునయున్న కొల్హాపురము కాశీక్షేత్రముకన్న శతగుణముల విశేషముగలది. అచట నొక రాత్రియుండిన ప్రాణులుద్ధరింపబడుదురు. దానికి తూర్పున ద్వాదశ యోజనముల దూరములో సుందరమగు కృష్ణాతీరము గలదు. దానిని శూర్పాల క్షేత్రమందురు. ఆ క్షేత్రమును దర్శించినచో జన్మాంతరములలో జేసిన పాపములు నశించును. దాని కుత్తరదిశయందు ద్వాదశ యోజనముల దూరములో మహాఘోరమగు దిండిరవనమున లోహదండ క్షేత్రమొకటిగలదు. అది గోదావరీ నదీతీరమునకు షోడశగ్రామముల దూరమునుండి పశ్చిమ భాగమున ద్వాదశ యోజనముల దూరములో కరవీర క్షేత్రమును గలిగియుండెను.

దిండిరవనమున సర్వసౌభాగ్య కారిణియగు శ్రీ రుక్మిణీదేవి చింతించుచు తపమున గూర్చుండెను. ద్వారకలో జగజ్జీవనుడగు భగవంతుడు

శ్రీ రుక్మిణీదేవి వియోగమును సహింపజాలక ఖేదముతో నామెను వెద
కుటకై బయలుదేరి నానావిధములగు వనములందును, పర్వత గుహాలం
దును తీర్థక్షేత్రములందును, శోధించి గోకులమునకుజేరి గోపులను గోపా
లురను వెంటబెట్టుకొని పసువుల మేపుచు దండమును ధరించి శంఖమును
కమండలముగా నొనర్చి, తానొక విరక్త సన్యాసివేషమును ధరించి
దక్షిణదిశకు బోయెను. గళమున వనమాలా ధారుడును, శ్రీవత్సాంకిత
మనోహరుడును, రత్నఖచిత కనక కిరీట ధారణుడును, మకరకుండల
శోభాయమానుడును, నీలమేఘశ్యాముడును నగు భగవంతుడు విరక్త
సన్యాసిరూపమును ధరించెను. గోగోపాలుర వెంటబెట్టుకొని తాను
మాన్యనుండి గొల్లప్రాయముగల సన్యాసిరూపముతో వనోపవనముల
శోధించి, అతిపవిత్రమగు దిండీరవనముగల లోహదండ క్షేత్రము
జేరెను. గోగోపాలుర నచటవిడచి చక్రపాణియగు భగవంతుడు వనాం
తరమున జొచ్చి "ఓ దిండీరవనమా, క్షేత్రాధినయయు, పద్మా
క్షియు, నా ప్రియురాలును నగు శ్రీరుక్మిణిని గాంచితివా" యని కేక
లిడుచు అశోక, చంపక, చందన, బకుళ, నారికేళ, దాడిమీ, పనస,
నేరేడు, జాంబూ, ద్రాక్ష ఫలవృక్షములతోను, గులాబి, మల్లె,
చామంతి, గన్నేరు, సంపెంగ, పారిజాత, సన్నజాజి, మొదలగు పుష్ప
లతలతోను, పిక కీరశారికాది పక్షితతుల కలకలంబులచేతను,
శరభ శార్దూల వరాహ కిశోరాదిమృగముల గర్జనలచేతను, శోభిం
చుచు చంద్ర కిరణములకు సహితము తావొసంగని మనోరమగు నా
తపోవనముంగాంచి "భూమండలమున నిట్టి ప్రశాంతంబగు స్థాన మెచ
టను గనబడలేదు. నిశ్చయముగా శ్రీ రుక్మిణీదేవి యిచట నుండ
వచ్చు" నని తలచి యా వనమును బరికించి జూడగా నకస్మాత్తుగా
తపో మగ్నమానసయైయున్న శ్రీ రుక్మిణీదేవి కనబడెను. అంత భగ
వాను డత్యానందభరితుడై ఏకాంతంబుగ తపంబొనర్చుచుండిన శ్రీ
రుక్మిణీదేవి కభిముఖముగా నిలచి మంజుల వచనంబులతో "పద్మనేత్రీ,
శాంతిమయి, మమప్రియే! నీ వొంటరిగ ఈ ఘోరవనంబున తపం
బొనర్చుచు గృశించుటకు గారణంబే" మని యడుగగా శ్రీ రుక్మిణీదేవి

కన్నులందెరచి చూచి "నీ వెవరవు? ఎచటనుండి వచ్చితివి? వేష ధారింబోలె గానిపించుచున్నావు. నిశ్చయముగా పరాంగనను జతుకుడ వగు నీవు భగవంతుని భయమునకైన వెరువక "ప్రియే" యని బిలచు చుంటివి. బాల్యమునుండియు స్త్రీలోలుడైన చోరునివలె గనపడుచు నిశ్చయముగ నిలుచుంటివి" అని జెప్పెను అంత భగవానుడు "ఓ శుభ కళ్యాణి! నీవు పలికినదంతయు సత్యము నేను కలికాలమునకు, కాలు నకు వెరచువాడనుగాను, వారు నా ఆజ్ఞకు బద్ధులై యుందురు. నా చరిత్ర యతి విచిత్రమైనది. నీవు భ్రాంతితో నన్ను గుర్తించవైతి" వని పలికెను.

శ్రీ రుక్మిణీదేవి వేషధారుని పలుకులు విని "నీ వెవ్వరవు? సనాతన దేవుడవా? లేక ఘనశ్యాముడగు మహావిష్ణువా? లేక జలంధరా సనుడవా? లేక చంద్రశేఖరుడవా? లేక శచీరమణుడవా? గొప్ప గొప్ప చాతుర్యపు పలుకుల నుడువుచున్నావు వ్యర్థముగా నిచటికే కార్యార్థ ముగా వచ్చితివి. నాతో మాటలాడు పనియేమి? నీవు వచ్చిన పని చూచుకొనుటకు బొమ్మని చెప్పెను."

శ్రీ రుక్మిణీదేవి వచనములను విని జగజ్జీవనుడు తన్మయుడై యానందాశ్రుధారలను విడచుచు, దిగంబర సన్యాసి రూపమును మార్చి శ్యామలవర్ణుడై కటిప్రదేశమున గరములుంచుకొని, సమచరణ ములతో నిలువబడి, రత్నఖచిత కనకకిరీటమును, మకరకుండలములను, కంఠమున కౌస్తుభమణిని, గళమున కోమల తులసీ మిశ్రిత పుష్పహార ములను, నమూల్య పీతాంబరములను ధరించి, నాసాగ్రదృష్టిధారిణ వరుడై శ్రీ రుక్మిణీదేవిని జూచుచు, మహానముతో శ్రీకృష్ణావతార యుగమగు యిరువదెనిమిదవ ద్వాపరయుగమునుండి యటులనె నిలువ బడియున్నాడు" అని శంకరుడు పార్వతీదేవికి జెప్పెను. అంత పార్వతీ దేవి "ఓ మహాదేవా! ఆ వనమునకు దిండీరవనమని నామమేర్పడుటకు కతంబే"మని యడుగగా శంకరుం డిట్లు పలికెను. "ఓ పార్వతీ! వినుము, ఆ వనమునందు దిండీరుండను దైత్యుడుండెను. అతడు లోకా

లోకములో నెల్లజీవులను బీడించుచుండెను. వాని ప్రతాపాగ్నికి దేవ యక్ష కిన్నర గంధర్వాదు లెల్లరును, సకల ఋషులును భీతులై వణకుచు శ్రీ లక్ష్మీకాంతుని ప్రార్థింప ఆతడు సాక్షాత్కరించి 'మీరు బయపడవలదు నేను మల్లికార్జున నామమున నవతరించి మీ బాధల దొలగింతును" అని వరమిచ్చెను.

పూర్వము శ్రీచంద్రుడను నామముగలరాజుండెను. ఆతడు శంకరునారాధించుచు సహస్రవర్షములు ఘోరతపం బొనర్చెను. పార్వతీ రమణుడు సాక్షాత్కరించి ఏమి గోరుమని, చంద్రునితో జెప్పగా ప్రత్యక్ష విష్ణువుతో సమానుడగు తనయు ననుగ్రహింపుమని యాతడు గోరెను. అంత శంకరుడు "ఓ నృపవరా! శ్రీ మహావిష్ణువే నీకు పుత్రుడై జన్మించు"నని వరమిచ్చెను. పిదప నాతనికి శ్రీహరి పుత్రుడై జన్మించెను. పండ్రెండవ దినమున ఆ బాలునకు జాతకర్మం బొనర్చి మల్లికార్జునుడని నామకరణము జేసిరి. ఆతడు దినదినప్రవర్ధమానముగా పెరిగి ఇరువదివత్సరముల ప్రాయము గలవాడై ఒకదినమున మృగయా వినోదార్థము దిండీరవనమున జొచ్చెను. దిండీరరాక్షసునకును మల్లికార్జునునకును యుద్ధము సంఘటించి, సహస్రవర్షములు దారుణముగ జరిగి మల్లికార్జునుడు అంత్యమున దిండీరునిసంహరించెను. ఆదైత్యుడుప్రాణము లను విడచుచు హరిహరనామములనుచ్చరింప జగన్నాధుడు సాక్షాత్క రించి నీకు వలయునదేమి వేడుమన ఆదైత్యుడు "లోహదండమువలన నాకు మృత్యువు సంఘటించుటచే ఈ క్షేత్రము లోహదండ నామమున ప్రసిద్ధిగాంచునట్లును, నాకు గదతో మృత్యువు సంప్రాప్తించుటచె నిచ్చట గల తీర్థమునకు, గదా తీర్థమని సార్థకనామ మొందునట్లును, ఈ తీర్థము నందు గ్రుంకులిడి గదనాలింగన మొనర్చు కొనువారు పునరావృత్తిరహి తులగునట్లును, నా నామముతో నీ వనము దిండీరవనమని ప్రసిద్ధి జెందు నట్లును ననుగ్రహించి నీవిచట వసించి ప్రాణుల నుద్ధరింపజేయు వలెనని వరము గోరెను.

పూర్ణమానుష విగ్రహుడగు భగవంతుడు "నీ ఇచ్ఛప్రకారము జేసెద"నని యాప్రైవ్వనికి తన సాయుజ్యమనుగ్రహించెను. దిండీరునికి భగవంతుడిచ్చిన వరముల ననుసరించి శ్రీరుక్మిణీదేవి దిండీరవనమున తపము మొనర్చుచుండ శ్రీపాండురంగడు శోధించుచు వచ్చి సమచరణములను నా[illegible]ములను కటిప్రదేశమున హస్తములను ధరించి శ్రీరుక్మిణీ దేవిని నిరీక్షించుచు నిలచియుండెను.

లోహదండక్షేత్రమునందు జన్ముడను పేరుగల బ్రాహ్మణోత్తముడుండెను. అతడు జ్ఞాని, సాత్త్వికుడును, నిష్పాపియు, జితేంద్రియుడును సత్యవాదియు నైయుండెను. అతనికి పరమ భాగ్యశాలినియు పతివ్రతా శిరోమణియు పరమసుశీలయు సదా పతిసేవా పరాయణయు సాత్త్వకయను పేరుగల సత్కళత్రముండెను. ఈ దంపతులిరువురును సంతతికై బహుకాలము భగవంతు నారాధన మొనర్చిరి. ఈశ్వరానుగ్రహమున నొక సుపుత్రుడు జన్మించెను. ఆ బాలునకు పుండలీకుడని నామకరణం బొనర్చిరి. ఆ బాలుడు దినదిన ప్రవర్ధమానుడగుచుండ జననీ జనకులతని కైదవ సంవత్సరమున అక్షరాభ్యాసము నెనిమిదవ సంవత్సరమున నుపనయన సంస్కారమును జేసిరి. పుండలీకుడు వేదశాస్త్రముల బఠించుచు కావ్య వ్యాకరణములందు ప్రవీణుడై శాస్త్రవేత్త యయ్యెను. ఈతనికి వివాహము ద్వాదశ వర్షములకే జేయబడెను.

పుండలీకుడు సదా దుర్జన సాంగత్యము జేయుచు దురభ్యాసములకులోనై ద్రవ్యమును దుష్కార్యములకు వెచ్చించుచు జననీ జనకుల హింసించుచు షోడశవర్ష ప్రాయమునసే విభక్తుడై వసించుచుండెను. వినోద వాక్యములందును, వేశ్యా సాంగత్యములయందును మక్కువ గలవాడై స్నేహితులతో గలసి వేశ్యాగృహము లందధికముగా వసించుచుండెను. జననీ జనకులతని నీచపు ప్రవర్తనకు చింతించి యెంత బోధించినను వినక అపశబ్దములతో వారిని నిందించుచు "మీకింకను చావు రాలేదా? మీరు మరణించినపిదప నేను సుఖింతునని పలుకుచుండెను. వృద్ధులగు నా దంపతులు బహుకాలము బోధించినను పుత్రుడు సత్ప్రవర్తకుడు

గానందున చింతించుచు, ఆతను దండించునని భయపడి కాశీక్షేత్రములో జీవితము గడుపుకొనుట యుచితమని యాలోచించి ఒకదినమున కాశీ క్షేత్రమునకు బోవుటకు బయలుదేరి కుమారుని యొద్దకువచ్చి వారణాసీ క్షేత్రమునకు బోవుదమంటిమని చెప్పగా "మీ కింకను మృత్యువాసన్నము కాలేదా? పొండు నేనిప్పటినుండి సుఖింతునని" చెప్పెను.

పుండలీకుని జననీజనకులు కాశీక్షేత్రమునకేగుచుండ దిండీర వనమునుండి మరికొందరు గృహస్థులు వారివెంట జనిరి. కొన్ని దినములు గడచినపిమ్మట నొకానొకదినమున పుండలీకుడు తన భార్యతో ("మనమును కాశీక్షేత్రమునకు బోవుదమురమ్ము) ఆ యందరను మెల్లుండునో జూతము. నాయొద్ద ద్రవ్యమపారముగా నున్నదని" పలికి రెండశ్వములను దెప్పించి ఒకదానిపై తానుగూర్చుండి భార్యను మరియొక దానిపై గూర్చుండబెట్టి యతివేగమున జనుచుండెను. మార్గమధ్యమున పాదచారులై బోవుచున్న జననీజనకులగని వారిని పరామర్శింపకయే బోవుచు కొంతకాలమునకు కాశీక్షేత్ర సమీపమునకు జేరెను. ఆక్షేత్రమునకు దక్షిణభాగమున కుక్కుటమహర్షి యాశ్రమముండెను. పుండలీకుడు మార్గముదప్పి యా ఆశ్రమము జేరెను. ఆ యోగీంద్రుని స్మరించిన మాత్రమున సర్వదుఃఖములు హరించబడును. ఆతనిమహిమ విశేషములు వర్ణించుట కెవరికినీ సాధ్యముకాదు. బృహస్పతికి మించిన జ్ఞానమును భాస్కరునిమించిన తేజస్సునుగల యా యోగీంద్రుడు తన జననీజనకులకు సదా సేవజేయుచుండెను. పావనాత్ములగు జహ్నువును సాత్యకియును, నాతనియాశ్రమము జేరిరి. కుక్కుట యోగీంద్రుడు అహర్నిశములయందు జననీజనకుల సేవాపరిచర్యలు జేసి మిగిలినకాలము వారి సమక్షమున బురాణ కాలక్షేపమును రాత్రి వేళలయందు భజనము జేయుచుండెను. ఆతడు కాశీక్షేత్రమునుగూడ జూచి యెరుగడు.

ఓ కళ్యాణీ, పార్వతీ! వినుము. సరస్వతీ యమునా భాగీరథులు నదీరూపములుగనుండి తమలో గ్రుంకులిడు పాపుల పంచమహాపాతకములను హరించుటచే మలినరూపులై తత్పరిహారమునకై ప్రతిదినమును

నర్ధరాత్రి సమయమున కుక్కుటముని యాశ్రమము జేరి ఆశ్రమప్రదేశమంతయును శుభ్రపరచి యుదకప్రోక్షణ జేసి పలువిధములగు ముగ్గులతో నలంకరించి యథాపూర్వముగ దివ్యరూపములను బొందుచుండిరి. విశ్వజనుల పాతకములను గంగా యమునా సరస్వతులు హరించుచున్నవి. వారికంటిన పాపములు కుక్కుట యోగీంద్రుని సేవచే దగ్ధమగుచున్నవి. ఓ పార్వతీ ఆ కుక్కుటమహర్షి మహిమ విశేషమును వర్ణించుటకు నాకసాధ్యము. ఆ యాశ్రమమున కెదురుగా నున్న ధర్మశాలలో పుండలీకుడు విడిదిజేసెను. జన్హువును సాత్యకియును ఇతరయాత్రికులును నచటనే విడిదిజేసిరి. పుండలీకు డా యాశ్రమములో ప్రవేశించి కుక్కుట స్వామిని జూచి "అయ్యా! కాశీక్షేత్రమిచటి కెంతదూరమునందున్నది తెలుపుడని" యడుగగా, కుక్కుటయోగీంద్రుడు నేను కాశీక్షేత్రమును జూడలేదు. అది ఎంతదూరమున నున్నదియు నాకు దెలియ'' దని చెప్పెను. "ఇంత సమీపమున నున్న కాశీక్షేత్రమును జూడని వ్యర్థజన్ముడవు. కడుపునకై యోగివేషమును ధరించి గ్రామము వెలుపల జేరితివి. నీ దొక బ్రతుకా?" యని పుండలీకుడు పలికెను. ఆ రాత్రి జనులెల్లరును నిద్రించుచుండ గంగా యమునా సరస్వతీ నదులు వికృతములగు స్త్రీరూపములను ధరించి జలకుంభములను శిరమునందుంచుకొని యాశ్రమము జేరిరి.

పుండలీకుడు జాగరూకుడై వికృతాకారులగు నా స్త్రీలను జూచి పిశాచములని దలచి భీతితో నుండెను. గంగా యమునా సరస్వతులు ఆశ్రమ ప్రదేశమంతయు శుభ్రపరచి ఉదకము జల్లి పలువిధములగు ముగ్గులతో నలంకరించి దివ్యరూపములను ధరించి లక్ష్మీ గౌరి సావిత్రులవలె శోభించుచుండిరి. పుండలీకు డది జూచి యత్యాశ్చర్యంబున నచటికి బోయి "తేజోవంతులగు మీ రెవరు. ఇచటికి వచ్చి సేవా పరిచర్యలు జేయు కారణమేమి? తెలుపుడు" అనెను. అంత భాగీరథి "ఓరీ దురాత్మా!, పాపమతీ, సాధునిందకా, చండాలుడా, మాతా పితృద్రోహీ! మా యెదుట నిలువకు'' మని చెప్పెను. పుండ



శ్రీ విఠ్ఠలనాయుడు పుండరీకునకు దర్శన మిచ్చుట.

లీకుడు భయముతో వణకుచు ఆమె చరణములకు వందనము లాచరించి పతితుడగు నన్నుద్ధరింపజేయుమని ప్రార్థించెను గంగాదేవి కనికరించి "ఓ బ్రాహ్మణకుమారా! నీ వనంతజన్మలలో జేసిన సుకృతముచే నిచటికి రాగలిగితివి, కుక్కుటస్వామి దర్శనముచే పాపవిముక్తుడవై మా దర్శనము చేయగలిగితివి. మమ్ముల దర్శించుటచే నీ యజ్ఞానము పూర్తిగా దొలగి జ్ఞానోదయమైన" దని చెప్పగా పుండలీకుడు సూర్యుని మరుగుజేయు ప్రకాశము గల మీరెవ్వరు దెల్పుడనెను. ఆ ముగ్గురు స్త్రీలును "మేము గంగ యమున సరస్వతులము. నదీరూపములుగ నున్న మాలో గ్రుంకులిడువారి పాతకములను మేము దొలగించుటచే వారి పాపములు మాకంటి మేము మలినరూపుల మగుచున్నాము. ప్రతి నిత్యము కుక్కుటయోగీంద్రుని సేవాపరిచర్యలు జేయుటచే మా యథా రూపములు తిరిగి పొందుచున్నాము. ఈ యోగీంద్రుని మహిమ విశేషములను వర్ణించుటకు బ్రహ్మాదిదేవతలకును సాధ్యము కా" దని చెప్పిరి.

అంత పుండలీకుడు "తల్లులారా! ఆ యోగీంద్రున కంత ప్రభావ మెటుల వచ్చెను. ఆత డే పుణ్యకార్యము లొనర్చెను. బాలకుడనగు నాపై గోపింపక కృపతో దెలుపు" డని యడుగగా గంగాదేవి ఇట్లు చెప్పెను. "కుక్కుటయోగీంద్రుని పూర్వపుణ్యమెవరును వర్ణింపజాలరు. కాని దెలిసినంతవరకు జెప్పెదను. తన జననీ జనకులనే శ్రీ లక్ష్మీ నారాయణులనుగ భావించి దివారాత్రములందును సేవ జేయు చున్నాడు. జననీ జనకుల సేవకు మించిన పుణ్యకార్య మేదియును లేదు. పృథ్వీప్రదక్షిణము ముమ్మారును, కాశీక్షేత్ర ప్రదక్షిణము రెండులక్షల పర్యాయములును జేసినఫల మొకపర్యాయము జననికి నమస్కరించిన గలుగును, జనకుని సేవించువారి కద్భుతజ్ఞానము గలుగును. జననీ జనకులే ప్రత్యక్షదైవములని వేదశాస్త్రములు వర్ణించు చున్నవి. జననీ జనకుల సేవా పరిచర్యలు జేయువారలకు శ్రీ లక్ష్మీ కాంతుడు దర్శనమిచ్చును. జననీ జనకుల నిందించువారు ఘోరరౌరవ

నరకమును భోగింతురు. జననిని హింసించువాడు బహు జన్మలవరకు వ్యాధిగ్రస్తుడుగ నుండును. జనకుని నిందించువాడు పిశాచమగును. జననీ జనకుల నిందించువానిని జూచినను, వానితో సంభాషించినను మహాదోషము.''

పుండలీకుడు పశ్చాత్తాపచిత్తముతో ''నీ పాపములన్నియు నే జేసితిని. ఉత్తమమైన నరదేహమును బొంది నేను వ్యర్థముగా విష యోప భోగములకై యమూల్యమగు నాయువును వెచ్చించితిని. నేను మహాదుర్జనుడను చండాలుడ నని వెక్కి వెక్కి ఏడ్చుచుండెను పశ్చాత్తాపాగ్ని పుండలీకుని హృదయమును శుద్ధముజేసెను. అతడు దుఃఖించుచుం టను జూచి గంగాదేవి బుజ్జగించి "కుమారా! నీవు మాతాపితరుల సేవా పరిచర్యలు జేయుచు శ్రీ లక్ష్మీకాంతుడగు భగవంతుని కృపకు పాత్రుడవై త్రిలోకములందును కీర్తిబొందెద"వని చెప్పి పిదప గంగా యమునా సరస్వతులు అంతర్ధానులైరి

పుండలీకుడు కుక్కుటయోగీంద్రునకు నమస్కారములాచరించి జననీ జనకుల నశ్వములపై గూర్చుండబెట్టి యథావిధిగ కాశీ, గయ ప్రయాగ క్షేత్రములను సేవించి తిరిగి కొంతకాలమునకు లోహదండ క్షేత్రము జేరెను. తన ఆశ్రమములో జననీ జనకులకు సేవజేయుచు వారేసమయములం దేమేమి కోరుచుందురో వానిని దెచ్చి ఇచ్చుచు కుక్కుట యోగీంద్రునివలె మహాత్ముడాయెను.

ఓ పార్వతీ! పూర్వము దేవేంద్రుని శత్రువగు వృత్రాసురుడు త్రిముఖములతో నహోరాత్రములందును త్రికర్మలు జేయుచుండెను. ఒక ముఖమునుండి వేదాధ్యయనమును, రెండవముఖమునుండి గాన మును, మూడవ ముఖమునుండి ఘోరమగు తపశ్చర్యను జేయు చుండెను. అతని తపశ్శక్తి వలన పృథ్వియంతయు గంపించుచుండెను. అతని తపము ఫలించినచో ఇంద్రత్వమునకు హానికలుగునని దలచి దేవేంద్రుడు వృత్రాసురునికి వెనకభాగముగబోయి ధ్యానస్థుడై యున్న

యా దైత్యుని త్రిముఖములను వజ్రాయుధముతో నొకేపరి ఛేదించెను. ఆ మూడు శిరములును క్రిందపడి పకపక నవ్వుచు క్రోధముతో "ఓరీ దుర్జనా! నేననుష్ఠానమున కూర్చుండియుండగా నీవు వెనుకభాగమున వచ్చి నా త్రిశిరములను ఛేదించితివి. నీకు బ్రహ్మహత్యాదోషము సంప్రాప్తించెను. ఓరీమూర్ఖా! నీవు దిండీరవనమునం దిటుకరాతివై పడియుండుమని" శపించెను. వృత్రాసురుడు తత్‌క్షణమే ప్రాణముల విడచెను. దేవేంద్రుడు శోకించుచుండ శ్రీ మహావిష్ణువు దర్శనమిచ్చి "దేవేంద్రా! నీవు శోకింపకుము. నేను నీశాపవిముక్తిజేసి యుద్ధారణ జేసెదను. నీవు తత్‌క్షణమే దిండీరవనముననున్న పుండలీకుని యాశ్రమమందు పాదములు కడుగుకొనుటకై ఉపయోగించు ఇటుకరాతివై పడియుండుము" అని చెప్పెను. తత్‌క్షణమే దేవేంద్రుడు పుండలీకుని యాశ్రమమున నిటుకరాయి రూపముతో బడెను.

ఓ భవానీ! శ్రీరుక్మిణీకాంతుడు ద్వారకనుండి బాలవేషముతో వచ్చి శ్రీరుక్మిణీదేవి కెదురుగా నిలువబడి యుండుట నీవు వినియుంటివి గదా! పిదప భగవంతుడు శ్రీరుక్మిణీదేవిని సమాధాన పరచి యచ్చట నుండి పుండలీకుని యాశ్రమమునకు జేరెను. పుండలీకుడా సమయమున జననీ జనకుల చరణప్రక్షాళనము జేయుచుండెను. భగవంతుడు పుండలీకుని వెనుక భాగమున నిలచి హస్తములు కటిప్రదేశమునందుంచుకొని స్మిత వదనుడై రత్నఖచితమగు కనక కిరీటమును మకర కుండలములును ధరించి యమూల్య పీతాంబర ధారియై వామహస్తమున శంఖమును, సవ్యహస్తమున గమలమును ధరించి కోటి సూర్యప్రకాశమాన మగు ప్రభతో నిలచి యుండెను. ఆ శోభను వర్ణించుటకు పంచముఖ, షణ్ముఖ, సహస్రముఖులకును, వేదశాస్త్ర పురాణములకును, బ్రహ్మదేవునకును, సరస్వతీదేవికిని, ముప్పదిమూడుకోట్ల దేవతలకును, యక్ష, కిన్నర గంధర్వాదులకును, సిద్ధులకును, యోగులకును, రమాదేవికిని సాధ్యముకాదు.

అంత పుండలీకుడు ఈ ప్రకాశమెచ్చట నుండి వెలువడినదని ఆశ్చర్యముతో విలోకించి చూడగా నాతని వెనుక భాగమున భగవంతుడు నిలచియుండెను. పుండలీకుడాసమయమున సవ్యహస్తముతో పితృచరణములను దుడుచుచు భగవంతునిగాచి "ఓ దేవాధిదేవా! జననీ జనకుల సేవ ముగించుకొని ఇప్పుడేవచ్చెదను అంతవరకు దీనిపై నిలచియుండుడని" వామహస్తముతో నచ్చటపడియున్న యిటుకరాతిని విసరగా భగవంతుడు దానిపై సమచరణములతో నిలువబడెను. పుండలీకుడు జననీ జనకుల సేవ ముగించుకొని భగవంతుని వద్దకువచ్చి సాష్టాంగ నమస్కారము జేయుచుండగా శ్యామసుందరుడు "ఓ పుండలీకా! నీ భక్తికి మెచ్చితిని. నీతో సమానులగు భక్తులు త్రిభువనములందును లేరు వలయు వరము గోరుమని" చెప్పెను. అంతపుండలీకుడు "ఓ రుక్మిణీకాంతా! ఇదేరూపమున చిరకాలమువరకు నిలచియుండి భక్తులకు దర్శన మిచ్చుచుండుము. ఈ స్థలము నొక మహాక్షేత్రముగా జేయుము. నీరూపము త్రిమూర్త్యాత్మకముగ నున్నందున నీకు శ్రీ విఠలనాథుడని నామకరణము జేయుచున్నాను, త్రిలోకములందీ నామము విఖ్యాతిజెందవలెను. ఈ క్షేత్రమునకు నాపేరుతో పుండలీకపురము లేక పంఢరీపురమనియును, ఈ తీర్థమునకు పుండలీకతీర్థమనియును, నీవు నాకు వరదుడవుగాన పుండలీక వరదుడవు లేక పాండురంగ డనుపేర్లతో తీర్థక్షేత్ర దైవములును నాపేరుతో ప్రసిద్ధిగాంచవలె"నని కోరెను అంత భగవంతుడు "ఓ పుండలీకా! సత్యముగా నీవు కోరినట్లే సర్వము జరుగును త్రిభువనములందుగల తీర్థములన్నియును మధ్యాహ్న సమయమున రాగలవు. నా దర్శనమాత్రముననే ప్రాణులకు భక్తిజ్ఞానములు వృద్ధియగునని" చెప్పెను అప్పటినుండియు నా క్షేత్రమునకు పంఢరీపురమనియు, భగవంతుని శ్రీ విఠ్ఠలమూర్తియనియు సార్థకనామములు గలిగెను.

ఓ పార్వతీ! నేను త్రిపురదైత్యుని మర్దించి భీమాశంకరక్షేత్రమున శ్రీవిఠ్ఠల ధ్యానముచే దారుణమగు తాపంబోవుచుండ నాశరీర

మునుండి చెమట నదీప్రవాహముగ బయలుదేరి భీమ రూపముతో గర్జించుచు పంఢరీపురముదనుక ప్రవహించుచుబోయి పుండలీకుని కభిముఖముగ భగవంతుడుండుటజూచి విస్మయ మొందెను. అచట క్షేత్రపాలకుడు గదాప్రయోగముజేయ భీమ గర్వవిడచి దక్షిణ దిశ నుండి తూర్పుదిశకు చంద్రవంకవలె దిరిగి సౌమ్యముగ స్థిరరూపమును దాల్చి భీమానదియని ప్రసిద్ధిజెందెను. అందు స్నానముజేయువారి సర్వ పాపములు నశించును. భాగీరథి ఎట్టివిఖ్యాతి నొందెనో భీమానదియును యట్లే పరమపావనంబై ప్రసిద్ధిగాంచెను. (శివుడు తిస్థానశక్తి నారూపముగ ప్రకటించెను.) భీమానదీ స్నానముచేసిను శ్రీవిఠ్ఠలనాథుని దర్శనమువలనను పితరులు సహాతి ముద్ధరింపబడుదురు.

ఓ పర్వతనందినీ! బృహస్పతి భార్యయగు తారను చంద్రుడు భోగించుటవలన గురువుగారు కోపముతో "ఓరీ చంద్రా, ధర్మభ్రష్టా! పాపరూపా, నీవు గురుపత్నీ గమనమును జేయుటచే క్షయరోగ పీడితుడ వగుదువుగాక! యని శపించెను. పిదప చంద్రుడు గురువునకు సాష్టాంగ నమస్కారముచేసి అపరాధ క్షమాపణ కోరగా బృహస్పతి దయదలచి "ఓ చంద్రా! నీకొక ఉపాయము జెప్పెదను వినుము. నీవు లోహదండ క్షేత్రమునకుబోయి యచట పరమ పవిత్రమగు భీమానదిలో స్నానము చేసి శ్రీ విఠ్ఠలమూర్తిని దర్శించినయెడల నీ క్షయరోగము పోవున"ని చెప్పగా తత్ క్షణమే చంద్రుడు లోహదండక్షేత్రమునకు బోయి భీమానదిలో స్నానముజేసి శ్రీవిఠ్ఠల నాథుని దర్శించి శాపవిముక్తు డాయెను. అప్పటినుండియు భీమానదికి చంద్రుని దోషము పరిహారము జేసినందున చంద్రభాగయని సుందరమగు సార్థకనామముగలిగి పరమ పవిత్రముగ నుండి సర్వజనుల పాపవిముక్తి జేయుచున్నది.

ఓ భవానీ! పుండలీకునికి పశ్చిమ ముఖముగ భగవంతు డప్పటి నుండియు నిలువబడి యుండెను. క్షేత్రమూర్తి పూర్వాభి ముఖముగను వానికెదురుగ భీమా(చంద్రభాగ) నదిలో తీర్థమూర్తియును వెనుక

భాగమున మూర్తి మూర్తి (విఠలుడు)యును శోభించుచుండెను. అచటికి సమీపమున లక్ష్మీ తీర్థముగలదు. ఇది త్రిలోకములందలి శోభలచే శోభించుచు, ప్రసిద్ధిగాంచెను. చంద్రభాగయొక్క మధ్యభాగమున బిందు తీర్థముగలదు. దాని మహాత్మ్య మగాధమైనది. ఆకాశరూపమైన త్రికూట స్థానమును దానిమధ్య కేవల మద్వితీయాకృతిని విఠలపీఠము నాబిందు తీర్థములో గలదు. అచ్చట భగవంతుడు గుప్తముగ నున్నాడు. బిందు తీర్థ దర్శనము దేవతలకు దుర్లభము. అచట భగవంతుడు లక్ష్మీసమేత ముగ నున్నాడు. ఆ క్షేత్రము చంద్రాకారమై షోడశాకారణ సుందరమై యున్నది. పంఢరీపురము ప్రత్యక్ష భూవైకుంఠము. ఆ క్షేత్రమునందు సకల పాషాణములుగను, వృక్షములుగను, దేవత లవతరించిరి. భీమా నదిలోని రాళ్లుగ ఋషికన్యలు గంధర్వాదు లవతరించిరి. మధ్యాహ్న కాలమందు సకల తీర్థములును శ్రీ విఠల నాథునకు 'మంగళహారతి' జేయుటకై వచ్చుచుండును. నారద తుంబురులు గానము జేయుచుందురు. ఋషులు అహోరాత్రములందును వేదఘోష జేయుచుందురు. క్షేత్రములో ముఖ్యప్రదేశము శ్రీపాండురంగస్థానము. అది కేవలము వైకుంఠ భువనము. ద్వారకనుండి సర్వసంపత్సమేతముగ భగవంతుడు విచ్చేసి పుండలీకునకు దర్శనమొసంగెను. తపమునందున్న శ్రీరుక్మిణీదేవి హాస వదనయై శ్రీ విఠలనాథునకు వామభాగమున నిలువంబడెను. అప్పటి నుండియు నేటివరకు భగవంతునికి వెనుక వామభాగమునందు హసిత వదనయై నిలువబడియున్నది. భగవంతుడు ద్వారకకంటె పంఢరీపురమునందు విశేషసౌఖ్యమును బడుచే సుదర్శన చక్రముపై పంఢరీపురము నుంచెను.

ఓ భవానీ! చతుర్వేదములసారమగు శ్రీ పాండురంగ మంత్రమును జపించి యోగులు పవిత్రులగుచున్నారు. వేదశాస్త్రాదులను పఠించినను, నామమంత్రము లభింపనేరదు. ఇక భగవంతునకు ముఖ్య స్థానమగు బిందుస్థానమును గురించి చెప్పెదను వినుము. క్షేత్రపాలకుడగు భైరవమూర్తి యచటగలదు. వానిని ప్రథమమున బూజించవలెను

అట్లొనర్చినచో హరిపూజ సార్థమగును. అచ్చటకు సమీపమునగల కుండలతీర్థము భగవంతునకు ప్రియమైన స్థానము. అచ్చట నొకానొక సమయమునందు భగవంతుడు దైత్యులతో యుద్ధముజేసి కుండలము బెట్టెను. అందుచే దానికి కుండలతీర్థమని సార్థకనామ మేర్పడెను. దానికి సమీపమున నతి శ్రేష్ఠమగు నృసింహ స్థానము గలదు. దానిని దర్శించినచో నేడు తరముల వారుద్ధరింపబడుదురు. అచటికి వాయువ్యభాగమునందు మూడు యోజనములదూరమున మహా నృసింహస్వామి షోడశ భుజములతో నున్నాడు. భయంకరుడగు నాస్వామిని దర్శించిన సకల విఘ్నములును దూరమగును. మరియు నగస్త్య తీర్థము గణేశతీర్థము, సంకర్షణతీర్థము, జావాళతీర్థము, శంఖతీర్థము, గదా తీర్థము, కోల్హాలతీర్థము, గోపీతీర్థము, సంగమతీర్థము, సూర్యతీర్థము, సరస్వతీ తీర్థము, దుర్గాతీర్థము, హరిహరతీర్థము, మత్స్యకూర్మతీర్థము, నారదతీర్థము, ప్రఖ్యాతములైనవి. నారదతీర్థమునకు సమీపమున సిద్ధేశ్వరస్థానము గలదు. దాని కాగ్నేయమున రమారమణ మేఘశ్యామ స్థానముగలదు దానికెదురుగ సోమేశ్వరముగలదు. పద్మతీర్థమును విష్ణుపుత్రుడచ్చట స్థాపించెను. సకల తీర్థముల హోరాత్రము లందు పద్మ తీర్థములో గలియును దానికెదురుగా దుర్గాస్థానముకలదు. ఆస్థానమునందు శ్రీరాముడనుష్ఠానముజేసి పిదప దశాననునివధించెను. భూలోకమున పంఢరీపుర క్షేత్రము మిగులధన్యమైనది. మధ్యాహ్న సమయమున సకల తీర్థములచ్చట గలియును. కాన నాసమయమున స్నానమాచరించినవారనంత ఫలమును బొందెదరు. ఈ భూమండలమున జన్మించిన మానవులలో పుణ్యవంతులు పంఢరీపురమునకుబోయి శ్రీ విఠలనాథుని దర్శింతురు.

ఓ భవానీ! నీకు ప్రథమమున త్రికోణము గల యంత్రమును మధ్యభాగమందున్న బిందుస్థానమును భగవంతునికి ముఖ్యస్థానములని చెప్పియుంటిని. అచట భూమిలో బిందుతీర్థము గుప్తముగనున్నది. అది ఒక క్రోసు విస్తీర్ణము గలిగి యత్యుత్తమస్థానమై తేజోమయముగ

విరాజిల్లుచున్నది. ఆ స్థలమున సువర్ణమయమై, మణిమయ నానారత్న ఖచితమై ఒక దేవాలయము భూగర్భమున గుప్తముగ నున్నది. భగవంతుడచ్చట సూర్యప్రభతో సమమగు ప్రకాశముతో సింహాసనమందు శోభించుచున్నాడు. అది ప్రత్యక్ష భూవైకుంఠము. మణిమయ ఖచితములగు నాలుగు ద్వారములును, జయ విజయులును గలిగి పూర్వద్వారమున ఐరావతారూఢుడైన యమరనాథుడును, దక్షిణమున యముడును, పశ్చిమమున వరుణుడు, నుత్తరమున కుబేరుడును సావధానులై వేష్టించియుండ సచ్చిదానందమూర్తియగు శ్రీ విఠ్ఠలనాథుడు నిలచియుండుట జూచి నేనమితానందముతో నా నేత్రమును నా హృదయభువనమున నిలిపికొని యఖండముగా సేవించుచుంటిని.

ఓ కాత్యాయనీ! వినుము. ఉత్తర కాళిందీతీరమున సుశర్మాఖ్యుడను పేరుగల విప్రుడొకడుండెను. అతడు నిష్పాపియు, సాత్వికుడును, సుశీలుడును, సత్యవ్రతుడునై యుండెను. ఒకదినమున నాతడు స్వప్నములో బిందుతీర్థమును, పంఢరీపుర క్షేత్రమును జూచెను. తత్‌క్షణమే నిద్రనుండి మేల్కొని స్వప్నమునందు జూచిన క్షేత్రమును నాకెవ్వరు జూపెదరని విచారించుచు, భగవంతుని మనస్సున నిలపి, "ఓ రమారమణా! దయానిధీ! జగన్నాథా! నేను స్వప్నములో జూచిన తీర్థక్షేత్ర మెద్దియో దెలుపుమని" ప్రార్థించెను. సుశర్మాఖ్యుడు తనకు కనబడు బ్రాహ్మణోత్తములెల్లరినీ "మీ రెచ్చటినుండి విచ్చేసిరి! నాకు స్వప్నమునందొక తీర్థము గనబడినది. అది యెచటనుండెనో దెలియుట లేదు. మీరు చెప్పగలరా?" అచటి కొకస్నాతుగా నొక విప్రుడు రాగా సుశర్మాఖ్య డాతనిని జూచి సాష్టాంగనమస్కారముజేసి "స్వామీ! తా మెచటనుండి వేంచేయుచుంటిరి; తెలుపుడని" యడుగగా నా విప్రుడు "నేను దక్షిణదేశనుండి తీర్థయాత్రలు సేవించుచు వచ్చుచుంటిని. భూవైకుంఠమగు శ్రీ పాండురంగక్షేత్రము ద్వారకకంటె మిగుల వైభవముగ నున్నది. ఆ క్షేత్రమున శ్రీ విఠ్ఠలనాథుడు విరాజమానుడై యున్నాడు. పంఢరీపురము షోడశావర్ణ యంత్రాకారమును మధ్య



శ్రీ పంఢరీపుర విఠోబా రఖుమాయి దేవాలయము.

పవిత్రమగు విష్ణుస్థానమును గలిగియుండి అతి సుందరమై విరాజిల్లు చున్నది. అత్యద్భుతమగు ఆ క్షేత్రమహిమను వర్ణించుటకు దేవ యక్ష కిన్నర గంధర్వాదులకును, సిద్ధులకును సాధ్యముకాదని" చెప్పెను. అంత సుశ్రావ్యుడు "తాము నాకు గురుతుల్యులు. ఆ స్థాన మెచట నున్నది తెలుపుడని" యడుగగా నా విప్రుడిట్లు పలికెను. "భూలోక మందు వైకుంఠమే పంఢరీపురక్షేత్రముగ వెలసినది. ద్వారకనుండి భగ వంతుడు పుండరీకభక్తునికి దర్శనమిచ్చుటకై వచ్చి శ్రీ విఠ్ఠలమూర్తి యను పేరుతో వసించి భక్తులకు దర్శనమిచ్చుచున్నాడు. భీమా నదీ తీరమున కృష్ణా గోదావరీ మధ్యభాగమునం దీ క్షేత్రమున్నదని" సవి స్తరముగ క్షేత్ర వైభవములను జెప్పి విప్రుడు స్వస్థానమునకు బోయెను.

అంత సుశ్రావ్యు డచ్చటనుండి బయలుదేరి కొంతకాలమునకు పంఢరీక్షేత్రము జేరెను. ఆతడు చంద్రభాగానదీ స్నానమాచరించి, శ్రీ పాండురంగదేవుని దర్శనము జేసికొని, యోగీశ్వరుల కలభ్యమగు బిందుస్థానమును జూచెను. దాని మహిమ మిగుల విశేషమైనది. దానికి దక్షిణభాగమునందొక వాపి గలదు. అచటసుందరములగు కమలములు పూర్ణముగ వికసించి భ్రమరముల సమూహముల నాకర్షించును. ఆ తీర్థ మమృతమయమై గ్రుంకులిడువారిని పావనము జేయును. అచట భావికజనుల కర్ధరాత్రిసమయమున మంజులధ్వనితో గానము వినబడు చుండును. భావికులాగానమును విని తన్మయులగుదురు. అచ్చట నొక శిల యున్నది. దానిపై విష్ణు పాదములును, ధ్వజ. వజ్రాంకుశములును, చిహ్నములుగ నగుపడుచుండును. దేవత లా వాపి నుండి మంగళ హారతులను దీసికొనివచ్చి బిందుతీర్థమున నర్ధరాత్రివేళ హారతులిచ్చె దరు. అష్టనాయకు లచ్చట నృత్యమాడుచుందురు. నానావిధములగు సుగంధపరిమళములు వెలువడును. ఛిద్రమయములగు బహుశిల లా వాపి యందుండును.

ఆ క్షేత్రమందు ముఖ్యమైనది శ్రీ పాండురంగ స్థానము. దేవతలెల్లరు నర్ధరాత్రివేళవచ్చి శ్రీవిఠ్ఠలనాథుని బూజించు చుందురు. ఆ పరిమళము గగనాంతమునర్కు వ్యాపించురు. కిన్నరులును, గంధర్వులును, గానము జేయుచుందురు. దేవాలయమునకు సమీపమున లక్ష్మీతీర్థముగలదు. భగవంతుడు ద్వారకనుండివచ్చి శ్రీ రుక్మిణీదేవినచట సమాధాన పరచెను. ప్రహ్లాదుడును, నారదుడును, భీష్ముడును, విభీషణుడును, బలిచక్రవర్తియు, హనుమంతుడును, నుదవ్రుడును, పూర్ణమగు దృఢభావముతో లక్ష్మీతీర్థమునద్ద తపమొనర్చిరి. భీమానదిలోని పాషాణములు శంఖచక్రాకారముగను, శివలింగములవలె నుండును. బిందు తీర్థమునకు తూర్పుభాగమున రామేశ్వర లింగము తేజోనంతముగ నున్నది. అచ్చట ననుష్ఠాన మొనర్చిన త్రిమాసములలో పూర్ణసిద్ధియగును. దాని కభిముఖముగ కౌసల్యాతీర్థమును, వ్యాసేశ్వరమును గలవు. వ్యాసులచ్చట దపమొనర్చిరి. దానికెదురుగ సరస్వతీ తీర్థము గలదు. అచ్చట ననుష్ఠాన మొనర్చిన విద్యాపూర్తియగును. దానికెదురుగ శోభాకారమగు శివలింగముగలదు. అచ్చట ననుష్ఠాన మొనర్చిన మృత్యువు తొలగును. దానికెదురుగ దామోదర తీర్థమును, పశుపతి తీర్థములు గలవు. ఆ తీర్థములను సేవించి తిరిగి చక్ర తీర్థమునకు నచ్చి స్నానమాచరించిన పూర్వజన్మవృత్తాంతము స్మరణకు నచ్చును. దానికెదురుగ మహాలింగ కోటేశ్వరముగలదు. దానినియుధిష్ఠిరుడు స్థాపించెను ఈ ప్రకారము పంఢరీక్షేత్రము షోడశావరణ యంత్రాకార మధ్యమున నున్నది.

ఓ భవానీ! కాత్యాయని యనుపేరుగలదేవి పంఢరీ పురమునకు తూర్పుభాగమున స్థాపింపబడియున్నది. అచ్చట ననుష్ఠాన మొనర్చిన సర్వ సంపదలు లభించును. దానికెదురుగ మండలాదేవి గలదు. మరియు ధర్మాత్మికయను శక్తిగలదు. అచ్చట ననుష్ఠానము జేసిన దివ్యజ్ఞానము గలుగును. అనంత శక్తులకు స్థానమగు శ్రీ రుక్మిణీదేవియును, ఆమె పతియగు శ్రీ విఠ్ఠలనాథుడును శోభించుచుండ దేవతలెల్లరును వారిని

సేవించుచుండిరి. సుశ్రావ్యుడు సంపూర్ణముగా శ్రీ ఫండరీపురయాత్ర జేసి శాశ్వత కైవల్యా రూపమొందెను.

ఓ భవానీ! శ్రీ పాండురంగ క్షేత్రము పుష్కరముకంటె త్రిగుణములును, కేదారముకంటె షడ్గుణములును, వారణాసికంటె దశ గుణములును, శ్రీశైలముకంటె అనంత గుణంబులై శోభించుచున్నది. ఇతర క్షేత్ర దైవముల బూజించుఫలముకంటె శ్రీ పాండురంగ దేవుని పూజించు ఫలము వెయ్యిరెట్లధికము. అన్యక్షేత్రములందు జీవితాంతము వసించుటకంటె ఈ క్షేత్రమున నొకదినము వసించు ఫల మధికంబైయుండును. ఈ క్షేత్రమున బుట్టు జంతుజాలములకెల్ల విశేష జ్ఞానయు కలుగును. ఈ క్షేత్రమున దానము జేసిన ననంతఫలము గలుగును. ఈ క్షేత్రమున పిండప్రదాన మొనర్చిన వారి పితరులు సంతసింతురు. ఈ క్షేత్రమందు క్షేత్రపాలకుని, సరస్వతీదేవిని, సిద్ధేశ్వరుని, నారదమహర్షిని, శ్రీ విఠ్ఠలనాథుని సేవించినవారి కక్షయఫలము గలుగును. శ్రీ పాండురంగ దేవునికి పంచామృతాభిషేకమును, వస్త్రాభరణముల నర్పించిన వారికి సకల భోగభాగ్యములును గలుగును. ఈ క్షేత్రము తీర్థమూర్తి. క్షేత్రమూర్తి, మూర్తి మూర్తియను త్రివిధ మూర్తులతో శోభించుచున్నది.

ఓ పార్వతీ! పంఢరీపురముతో సమానమగు క్షేత్రమును శ్రీవిఠ్ఠల మూర్తివంటి ప్రత్యక్షదైవమును, చంద్రభాగతో సమానమైన నదియును, త్రిలోకములందెచ్చటను లేదు. ఈ క్షేత్ర మాహాత్మ్యమును శ్రవణము జేసినను పఠించినను ఈశ్వర సాయుజ్యము లభించునని శ్రీకైలాస నాథుడు పార్వతీదేవికి దెలిపెను.

శ్రీ పాండురంగ మాహాత్మ్యము సంపూర్ణము.

శ్రీ పాండురంగ పరబ్రహ్మార్పణ మస్తు

శ్రీ గణేశాయ నమః

# పంఢరీభక్తి సాంప్రదాయ ధర్మములు

పంఢరీపుర వార్కరీ (భక్తి) సాంప్రదాయమునకు ఉపాసనా దైవము శ్రీ పాండురంగభగవానుడు. ఈ సాంప్రదాయము సగుణ నిర్గుణసమభావము శ్రీ మహావిష్ణువుయొక్క అనంతావతారములు పూజనీయములు. శ్రీ విఠ్ఠలోపాసన అనగా కృష్ణోపాసన.

ముఖ్యగ్రంథములు:- జ్ఞానేశ్వరీ (భగవద్గీత), ఏకనాథభాగవతము, సనాతనధర్మ ప్రతిపాదనచేయు వేదశాస్త్ర పురాణములు, వాల్మీకి రామాయణము, శ్రీ మహాభారతము పఠనీయములు, హరిపాఠఅభంగములు ముఖ్యపఠనీయములు:

అద్వైతభక్తి:- అభేదభక్తి, ముక్తికిమార్గము. అద్వైతసిద్ధాంతము స్వీకరించదగినది. జ్ఞానముభక్తియొక్క ఏకరూపత్వము, తుకారామ్ వాక్యము "తేచిభక్తి తేచిజ్ఞాన ఏక విఠ్ఠలాచాజాణ" ద్వైతాద్వైత భావములచే ఒక్క విఠ్ఠలుడు సర్వవ్యాపిఅని అనుభవమున తెలిసికొనవలెను.

ముఖ్యసాధన:- నవవిధభక్తులు, అందునిరపేక్షతో అఖండ నామస్మరణజేయుట విశేషము.

ముఖ్యమంత్రము:- "రామకృష్ణహరి" శ్రీహరియొక్క అనంతావతారములలో విష్ణుసహస్రనామములు.

సాంప్రదాయభక్తులు:- గరుడ, హనుమంత, పుండలీకులు.

సాంప్రదాయ పరంపర:- ఆదిగురుశంకరుడు, హరిహరులయందు అభేదభావము.

ధర్మోద్ధారకులు:- నారద, ప్రహ్లాద, ధ్రువ, అర్జున, ఉద్ధవ, నివృత్తిదేవ, జ్ఞానదేవ, సోపానదేవ, ముక్తాబాయి, ఏకనాథ, నామదేవ, తుకారామ్ — ఇట్టి నిష్కామ భక్తులు ధర్మస్థాపకులు.

భజన:- "జయజయ రామకృష్ణహరి" లేక "జయజయవిఠోబారఖుమాఈ" భక్తుల నామమంత్రము మిగులతర సోపాయము "జ్ఞానేశ్వరమాఉలీతుకారామ్" దేవుడేభక్తుడు, భక్తుడేదేవుడని సిద్ధాంతము.

పూజార్హులు:- విప్రులు, అతిధులు, శ్రీకృష్ణభగవానుడీపద్ధతి తానుస్వయముగా ఆచరించి పలికెను. కాన ఇది ముఖ్యాచరణీయము. ద్వారమున కెదుట తులసిబృందావనము గళమున తులసిమాలధారణ, భగవంతున కర్పించుటకు తులసీహారము ఆవశ్యకములు.

మహావ్రతము:- ఏకాదశి, సోమవారము, ఆషాఢ కార్తీక బ్రహ్మోత్సవములకు పంఢరీయాత్రచేయుట. కనీసము సంవత్సరమున కొకసారియైనను యాత్రజేయుట ఆవశ్యము, ఈనియమము దేహావసాన పర్యంతము ఆచరణీయము, మహాశివరాత్రివ్రతము ముఖ్యాచరణీయము ఎప్పుడును విడువరాదు.

మహాతీర్థము:- చంద్రభాగ.

మహాక్షేత్రములు:- పంఢరీపురము. అళంది. దేహు. త్ర్యంబకేశ్వరము, పైఠనపురము, సాసవద ఇట్టిసజ్జన నివాసస్థానములు మహాస్థలములు,

వర్జనీయములు:- పరస్త్రీ, పరనింద, పరద్రవ్యము, మాంసాహారము, హింసాకాండలు.

అహింస:- మనోవాక్కాయముల అహింసముఖ్యాచరణీయము.
ఆచారము:- వర్ణాశ్రమ, జాతిధర్మ, ఆశ్రమధర్మ, కులధర్మములు అవశ్యాచరణీయములు. విధినిషేధములను పాలించుచు కులధర్మముల యందు దక్షులగుట ముఖ్యాచరణీయము.

పరోపకారము:- శక్త్యనుసారము ఇతరుల కుపకారము జేయుట తరణోపాయము.

ఈపైన చెప్పబడిన నియమములనాచరించువారు పంఢరీపురభక్తి (వార్కరీ) సిద్ధాంతమునకు చెందినవారు. ఏ జాతిలోజన్మించినను అట్టి వైష్ణవులు పూజ్యులని సిద్ధాంతెము.

---

## —♦ నామదేవుల ఉపదేశ వాక్యములు ♦—

సుఖము అనుభవింపవలెనని నీ వనేక విధముల శ్రమపడు చున్నావు. నీవొకసారి పంఢరీపురము బోయినచో నీకు యదార్థమగు నాశరహితమగు సుఖ మచట లభించును. నీవు సుఖరూపుడవై జన్మ జన్మాంతరములనుండి వచ్చుచున్న దుఃఖముల నుండి తొలగెదవు. చంద్రభాగానదిలో స్నానముజేసినచో సమస్తదోషములు (పాపములు) పటాపంచలగును. పంఢరీక్షేత్ర మునకు సరియగు క్షేత్రమును, పాండురంగనితో సమమగు దైవ మును భూలోకమునం దెచ్చటను కానము” అని నామదేవులు చెప్పిరి.

---

# భగవదాజ్ఞ

## —: ప్రథమాధ్యాయము :—

ఓ భీమానదీతీరవిహారా! భక్తవత్సలా! కృపాసాగరా! చరాచరాత్మకమగు సర్వ ప్రపంచమునందు వ్యాపించి, అలిప్తుడవై సర్వమున కతీతమైన ఓ పాండురంగదేవా! నీకు జయము.

శ్రీ కృష్ణావతారానంతరము పృథ్వియందు కలిప్రభావము దినదిన ప్రవర్ధమానముగ వృద్ధిజెందుచుండెను. యజ్ఞయాగాదిక్రతువులు నిలచిపోయెను. దేవ బ్రాహ్మణభక్తి క్షీణించెను. భూదేవి గోరూపమును ధరించి క్షీరసాగరమునకు బోయి శ్రీ మహావిష్ణువునకు సాష్టాంగ నమస్కారముజేసి, "ఓ దేవాదిదేవా! ధర్మము పూర్ణముగ నశించినది. సత్యము నామమాత్రమునకైన గనబడుటలేదు. రాజులు కపటస్వభావులుగ నున్నారు. స్త్రీలు చపలస్వభావులైరి. తాపసులు విలాసభోగములకు లోనగుచున్నారు. దుర్జనులు సజ్జనుల హింసించుచున్నారు. భక్తిమార్గము నశించినది. మహాపాపుల భారము దుస్తరముగనున్నది. తాము భూలోకమున తత్క్షణమే ధర్మమును స్థాపింపవలె" నని చెప్పి యశ్రుధారలను విడచుచుండెను.

అంత శ్రీమన్నారాయణుండు భూదేవిని జూచి, నీవు దుఃఖింపకుము. నేనును, భక్తులు నవతరించి ధర్మమును స్థాపించెదమని" చెప్పి తత్కాల మందంతర్థానుండయ్యెను. పిదప శ్రీమన్నారాయణుం డొకనాడు సభ నేర్పాటుజేయ, భక్తులెల్లరు నా సభకు బోయి భగవంతుని చుట్టును కూర్చుండియుండిరి. నక్షత్రములలో చంద్రుడును, పర్వతములలో మేరువును, సిద్ధులలో దత్తాత్రేయుడును, తపస్వులలో శంకరుడును, శోభించునట్లు వైకుంఠములో సభాస్థలమున భక్తులమధ్య భగవంతుడు శోభించుచుండెను. భగవంతుడు తన చుట్టును కూర్చుండియున్న భక్తులను జూచి "భూలోకమున భక్తిమార్గము నశించినది. పాప మధి

కముగ సర్వత్ర వ్యాపించినది. భక్తిమార్గము వృద్ధిపరచి భాగవతధర్మమును స్థాపించుటకు తగిన యుపాయ మాలోచించవలయు" ననగా భక్తులెల్లరును చేతులు జోడించి భగవంతునకు వందనములుజేసి, "దేవరవారి యాజ్ఞను శిరసావహించెదమని" జెప్పిరి.

భగవంతుడు భక్తులను జూచి, "నేను పూర్వము దుష్టులను శిక్షించుటకును, ధర్మమును స్థాపించుటకు ననంతావతారములు ధరించితిని. కలియుగమగుటచే నేనిప్పుడు బౌద్ధరూపమున నున్నాను. మీరెల్లను భూలోకమున గల మహాక్షేత్రములలో జన్మించి మీ మీ యుపదేశవాక్యములచే ప్రజలను ముక్తిమార్గన ప్రవేశపెట్టుడు. నేనును మీవెంట నవతరింతునని" చెప్పగా భక్తులెల్లరను జయజయధ్వనులు జేసి, "ఓ దేవాధిదేవా! ఎవరెవరెచట జన్మింపవలెనో యాజ్ఞాపింపుడని" కోరిరి.

పిదప భగవంతుడు "ఉద్ధవుడు పంఢరీపురమున నామదేవను పేరుతో, అక్రూరుడు మధురాక్షేత్రమున సురదాసను పేరుతో, వాల్మీకి హాస్తినాపురమందు తులసీదాసను పేరుతో, (శ్రీ) శుకుడు కాశీక్షేత్రమున కబీరుదాసను పేరుతో, హనుమంతుడు సజ్జనగడయందు రామదాసస్వామియను పేరుతో, జన్మింతురుగాక! నేను జ్ఞానేశ్వరులను పేరుతో, నీలకంఠుడు నివృత్తినాధుడను పేరుతో, విధాత సోపానదేవను పేరుతో, ఆదిశక్తి ముక్తాబాయియను పేరుతో జన్మించెదము" అని చెప్పగా, భక్తులెల్లరు జయజయధ్వనుల జేసిరి. దేవతలు పుష్పవృష్టిని గురిపించిరి. పిదప భగవదాజ్ఞప్రకారము భక్తులెల్లరును జన్మించిరి. వారు జూపిన అత్యద్భుత మహిమ విశేషములు ముందు అధ్యాయములందు ప్రకటింపబడినవి.

ప్రథమాధ్యాయము సమాప్తము.

—♦ భక్తక్రీతాయనమః ♦—




భగవదాజ్ఞ ప్రకారము భక్తులు భూలోకమునకు అవతరించుట.

# జయదేవ చరిత్ర

## —♦ రెండవ అధ్యాయము ♦—

నేడు భాగ్యోదయమైనది. భక్త విజయమును శ్రవణముజేయు వారి యానందమును వర్ణించుటకు సాధ్యముకాదు. కల్పతరువు గృహమునకు వచ్చినట్లును, చింతామణి వాంఛితార్థములను సమకూర్చినట్లును, భూమిపై నపారముగ సుధారసము వర్షించినట్లును, ద్వాదశ సూర్యులొకేసమయమున జల్లబడి యుదయించినట్లును, సర్వనదులందు నమృతజలము ప్రవహించినట్లును, రత్నముల, చింతామణుల మాణిక్యముల గనులు దొరకినట్లును, దైవయోగమున భక్తుల సచ్చరిత్రలు లభించినవి. సభాగ్యులగు శ్రోతలారా! అలసటను సమూలముగ త్యజించి శ్రవణము జేసిన దో నానావిధములగు సంకల్ప వికల్పములను, దారిద్ర్యమును దొలగి ప్రేమామృతము లభించును. ప్రేమామృత మమృతమునకంటె విశేషమైనది, అమృత పానముజేయు నమరులు ప్రేమామృతమునే వాంఛించెదరు. అమృత పానము దేవతలు చేయుదురు. వారు కల్పాంతమునందు నాశనము నొందుదురు. ప్రేమామృతమును సేవించువారు చిరంజీవులై యక్షయపదము నొందెదరు. కాబట్టి శ్రవణ మాత్రమున సకల దోషములను నశింపజేయు భక్తుల సచ్చరిత్రముల నాకర్ణింపుడు.

ఒకానొక దినమునందు క్షీరసాగరమున జగన్నియంత యగు భగవంతుడు వ్యాసులనుబిలచి 'ఓ వ్యాసా! భూలోకమున కలిప్రభావము బూర్ణముగ వ్యాపించుటచే భాగవత ధర్మము లోపించియున్నది. నీవు భూలోకమున జయదేవ నామముతో నవతరించి భక్తిప్రచారముచే పామరజనుల నుద్ధారణ జేయుమని" చెప్పెను. అంత వ్యాసులు భగవంతునికి సాష్టాంగ నమస్కారము జేసి "స్వామీ! తమ యాజ్ఞానుసారముగా భూలోకమున జన్మింతునని" చెప్పి పరమపవిత్రమగు శ్రీజగ

న్నాథ క్షేత్రమునకు సమీపమునగల తిందుబిల్వ గ్రామమునందు చాతుర్వర్ణములలో నుత్తమమగు బ్రాహ్మణవర్ణమున నవతరించెను. దినదిన ప్రవర్ధమానముగ నాబాలకుడు పెద్దవాడగుచుండెను. తల్లిదండ్రు లాతని కుపనయనమును జరిపించిరి. ఆతడు విశేషాభ్యాసము చేయకయే సర్వశాస్త్రములందు నిపుణుడాయెను. తారాగణములలో చంద్రుడును దేవతలలో ఇంద్రుడును, తాపసులలో శంకరుడును, యాదవులలో శ్రీరుక్మిణీరమణుడును. సువర్ణములలో రత్నమును, సేనలో ప్రతాపశూరుడును, అజ్ఞానులలో నిపుణశ్రోతయు హరికీర్తనలో వక్తయు, పక్షులలో రాజహంసయు, ఆకాశమున సూర్యుడును, సర్వ సాధనములలో శుద్ధభావమును, నెట్లు శోభించునో, యట్లే బ్రాహ్మణ వంశమునందు జయదేవులు నిపుణవక్తయై శోభించుచుండెను.

శృతి శాస్త్రాదులు శోధించినను, బురాణములు సంపూర్ణముగ వెదకినను, కలియుగమునందు సర్వులు సహజముగ తరించు సాధనము హరినామ సంకీర్తనయే యని, శ్రీ కృష్ణపరమాత్మ యుద్ధవునికి దెలిపిన విషయమును జయదేవులు గీతగోవింద గ్రంథమునందు వర్ణించెను. పద్మపురాణమునం దితిహాసరూపముగ గోకులమునందు భగవంతుడు శ్రీకృష్ణరూపముతో క్రీడించిన లీలావైభవములను జయదేవులు గీత గోవింద గ్రంథమునందు వర్ణించెను. శ్రీహరియొక్క లీలలను జయ దేవకవి యొక్క పద్యరచన, సువర్ణకంకణమునకు రత్నము లమర్చిన నెట్లు శోభించునో, యట్లు హృదయాకర్షణీయముగ నుండెను. సర్వజను లును గీతగోవిందగ్రంథమును శ్రవణముజేసి, యానందపరవశులై, యా పద్యములను వ్రాసికొని, శ్రీ హరి లీలలను నిత్యపఠన జేయుచుండిరి. ఎల్ల గృహములందును గీతగోవిందకావ్యము గానరూపముగ వ్యాపించు చుండెను. పుష్ప మొకేతావున నున్నను, దాని పరిమళము సర్వత్ర వ్యాపించునటుల గీతగోవింద గ్రంధప్రతిష్ఠ భూలోకమున వ్యాపించెను.

జగన్నాథ క్షేత్రమునందు సాత్వికరాజను పేరుగల రాజుండెను. ఆతడు జయదేవులవలె నొక గ్రంథమును రచియించెను. ఆ గ్రంథ

మును సర్వప్రజలు పఠించవలెనని రాజాజ్ఞాపించెను. జగన్నాథక్షేత్రమున నున్న పండితులకు కోపముగలిగి, సభనేర్పాటుజేసి, పురజనులను రప్పించి, వారల కీ విషయమును దెలిపిరి. ప్రజలెల్లరును ఖేదాయత్తచిత్తులై పండితులతో గలసి రాజసభలో ప్రవేశించి "ఓ రాజా! నీవు రచియించిన గ్రంథమును జయదేవుల గ్రంథముతో సమముగ ప్రజలను పఠింపుమని యాజ్ఞాపించితివి. సర్వజ్ఞులు తమ కీర్తిని తాము వర్ణించుకొనరు. విద్యయు, హరికీర్తనయును; గురుమంత్రమును, బ్రహ్మజ్ఞానమును; పుష్పహారమును, మహారత్నమును; క్రయమునకు దీసికొమ్మని కోరి చెప్పిన విలువ తగ్గును. ఓ రాజా! నీ చిత్తమునం దహంకారమున్న కారణమున నీవు రచియించిన గ్రంథము శ్రీ జగన్నాథుని కంగీకారముగాదని" చెప్పిరి. అంత సాత్వికరాజు బ్రాహ్మణోత్తములతో "రెండు గ్రంథములును జగన్నాథుని సమక్షమున నుంచుడు. జయదేవులు భగవద్గుణము లెట్లు వర్ణించిరో, నేనును నట్లే వర్ణించితిని. భగవదంగీకారము కాని గ్రంథము దేవాలయ సింహద్వారము వెలుపలపడియుండును అంగీకారమైన గ్రంథము దేవుని సమక్షమున నుండును. ఈ దృష్టాంతము జూడుడ"ని చెప్పెను. ఆ రాత్రి పండితులు జయదేవులు రచియించిన గ్రంథమును, రాజు రచియించిన గ్రంథమును, గలిపి శ్రీ జగన్నాథుని పాదముల యొద్దనుంచిరి. అర్చకులు నిత్యోపచారములు ముగించి తలుపులు బిగించి తాళములువేసి తమ నివాసములకు బోయిరి. మరుదినము ప్రాతఃకాలమునందు, ప్రభాత సేవాసమయమునకు పూజా సాహిత్యములను సిద్ధపరచి యర్చకులును, దృష్టాంతము జూచుటకు విప్రులును, దేవాలయములో ప్రవేశించిరి.

జయదేవులు రచియించిన గ్రంథమును శ్రీ జగన్నాథుడు తన సన్నిధి యందుంచుకొని, సాత్వికరాజు రచియించిన గ్రంథమును సింహద్వారము వెలుపల పడవైచెను. అర్చకులును, విప్రులును, ఇతర ప్రజలును, నీ దృశ్యమును జూచి యానందపరవశులై కరతాళములను వేయుచు, జయజయ ధ్వనులను జేసిరి. సాత్వికరాజు భగవంతుడు

కృపతో జూడనందున నధోముఖుడయ్యెను. పండితోత్తములు రాజును జూచి "ఓరాజా! క్షీరమును, నీరమును, వేదాంతమును, కోకశాస్త్రమును, రాజహంసయు, కాకియు; పండితుడును, పామరుడును, లోహమును, సువర్ణమును, సాధువును, నిందకుడును, గాజుటియు, భావికుడును నింద్రుడును, భిక్షుకుడును, సజ్జనుడును, దుర్జనుడును, నెట్లు సమకారో, యట్లే నీ గ్రంధము, జయదేవుల గీతగోవింద గ్రంధమునకు సమము కావు. అందుచే శ్రీ జగన్నాధుడు నీ గ్రంధమును సింహద్వారము వెలుపల పారవేసెనని చెప్పిరి.

సాత్వికరాజు లజ్జావమానములతో గూడినవాడై జగన్నాధుని యెదుటకుబోయి నిలువబడి చేతులు జోడించి, "ఓ జగన్నాధా, నీచరిత్ర నాకిప్పుడు బాగుగా బోధపడినది. పతితపావనుడవను నీ నామధేయ మిప్పుడు నా విషయమున నసత్యమైనది. ఒకరిని గౌరవించి మరియొకరి నవమాన పరచితివి. నీవు సర్వఘటములందును, సమానముగ వ్యాపించి యున్నప్పుడు భక్తులు నభక్తులును, నీ సత్తావలననే వర్తింతురు. సర్వ ఘటములందును సూర్యుడు ప్రతిబింబించును. వ్యాఘ్రమునకును, గోవునకును నుదకము సమానముగ నుండును. శలభమునకును, గరుడపక్షికినీ నాకాశము సమానముగ నుండునట్లు జగధీశ్వరుడవగు నీకు సర్వులు సామాన్యులేగదా? రాజునకును దరిద్రునకును సమానముగ చంద్రుడు శైత్య మనుగ్రహించునట్లు నీవు సర్వులను కృపాదృష్టితో నను గ్రహింతువుగదా? జయదేవుల వాక్కునందుండి వర్ణింపించిన నీవే నా దేహము నందుండి చలన వలనాదుల జరుపుచు నాచే బలికించలేవా? ఓ అనంతా! నీవు నాగ్రంథమును బైట పారవేసితివి. పక్షపాతముగల నీకు నా ప్రాణముల నర్పింతునని" చెప్పెను. ఈ ప్రకారము కరుణావచనములను బలుకుచు విలపించుచున్న సాత్వికరాజుపై శ్రీ జగన్నాధునకు కరుణ గలిగి, రాజురచియించిన గ్రంథములో నిరువదినాలుగు శ్లోకములను జయదేవు గ్రంధములో జేర్చిసాత్వికరాజునకు జగజ్జీవనుడు దర్శనమిచ్చి సమాధానపరచెను.

జగన్నాథ క్షేత్రమునం దగ్నిహోత్రుడను బ్రాహ్మణోత్తము డుండెను. ఆతని గర్భమందు పద్మావతియను కన్యారత్నము జన్మించెను ఆబాలికయొక్క రూపలావణ్యముల కావిప్రోత్తముడు "పద్మాక్షి" లేక "పద్మావతి" యని నామకరణము జేసెను. రూపలావణ్య గుణరాశియగు నాకన్యక దినదిన ప్రవర్థమానముగ బెరుగుచుండ, విప్రోత్తముడు మన మునం దాలోచించి "ఈమె రూపమునకు తగిన వరుడు లభించుట దుస్తరముగాన నీమెను శ్రీ జగన్నాథుని కర్పించుట యుచితమని" యాలోచించి మనోభావ పూర్వకముగ శ్రీ కృష్ణార్పణ జేసెను. ఇట్లు కొంత కాలము జరిగిన పిదప పద్మావతి యుక్త వయస్క యయ్యెను. ఆమెను తండ్రి శ్రీకృష్ణార్పణ జేసినటుల సర్వప్రజలకు దెలిసెను. ఒకనాటిరాత్రి శ్రీ జగన్నాథుడు విప్రోత్తమునికి స్వప్నమున సాక్షాత్కరించి "వత్సా! "నేను కలియుగమునందు బౌద్ధరూపమున నున్నాను. నీవు కన్యకను నా కర్పించితివి. నా పూర్ణాంశముతో జన్మించిన మహాభక్తుడు జయ దేవ కవి. గాన నాయాజ్ఞను సారముగా నీకన్యకయగు పద్మావతిని జయదేవులకిచ్చి సాలంకృత కన్యాదానము జేయుమని" చెప్పి యంత ర్థాను డయ్యెను.

విప్రోత్తముడు నిద్రనుండి లేచి స్వప్నవృత్తాంతమును మననము జేసి, హర్షచిత్తుడై జయదేవులను రప్పించి ఆతనిని సమాధానపరచి, పండితులను దేవబ్రాహ్మణులను రప్పించి, యలంకార యుక్తముగ సర్వసాహిత్యములను సిద్ధపరచి, శుభలగ్నమునందు పాణిగ్రహణ మహో త్సవము మిగుల వైభవముగ జరిపించెను. నానావిధములగు వాద్యములు ప్రయోగింపబడెను. దేవబ్రాహ్మణులు స్వస్తి వచనములను జెప్పుచు, మంగళాష్టకము లిట్లు బలుకుచుండిరి. కేశవా!, నారాయణా!, మాధవా!, గోవిందా!, గోపాలా!, దేవాదిదేవా!, మధుసూధనా!, కృష్ణా!, విష్ణూ,! వామనా!, శ్రీరామా!, భక్తవత్సలా!, గుణధామా!, బలిబంధనా!, త్రివిక్రమా!, గోకులవాసీ!, పంఢరీశా!, హృషీకేశా!, జగత్పాలకా! సద్గుణరాశీ!, రుక్మిణీరమణా!, వైకుంఠవాసా!, శేషశయనా!, రాఘు

వేశా!, అయోధ్యావాసీ!. భక్తసంకట నివారీ!, మానవుల రక్షించుము" వివాహవైభవములు పూర్తియయిన పిదప భగవదాజ్ఞ ప్రకారము జయదేవులు జగన్నాథ క్షేత్రమునందే నివసించుచు, త్రికాలముల యందు శ్రీజగన్నాథుని సేవించుచు భగవద్గుణానుభవము కీర్తనల రూపముగ సప్రేమతో గానము చేయుచుండెను.

ఆ క్షేత్రమునకు సమీపగ్రామమునందొక శ్రీమంతుడుండెను. ఆతడు ఉదారుడును, భావుకుడునై యుండి నిత్యము జయదేవులను దర్శించుచు, ఆతడు జేయు హరినామ సంకీర్తన శ్రవణము జేయుచుండెను. కొంతకాలము జరిగిన పిదప నా శ్రీమంతుడు తనకు మంత్రోపదేశమును జేసి శిష్యునిగా నంగీకరింపుమని జయదేవులను గోరెను అంత జయదేవు లాతని యోగ్యతను బరీక్షించి శాస్త్రములను శోధించెను.

(ఉపదేశమున కనర్హులగువారి లక్షణములు)

అవిశ్వాసియు, కృపణుడును, పరుల దోషముల వెదకువాడును, పరద్రవ్యము నపేక్షించువాడును, ననాచారియు, పితృద్రోహియు, నతి వాచాలుడును, హరికీర్తనమునం దిచ్ఛలేనివాడు, ననుభవము లేకయే బ్రహ్మజ్ఞానమును జెప్పువాడును, వేదశాస్త్రములందు విశ్వాసము లేనివాడును. సజ్జనుల వచనములను పాలించనివాడును, సర్వభూతములందు దయలేనివాడును, నుపదేశమున కనర్హుండు.

నా శ్రీమంతుడు పై చెప్పబడిన యవగుణములు లేనివాడై నిరంతరము గురుసేవయందు తత్పరుడైనందున జయదేవు లాతనికి మంత్రోపదేశము జేసి శిష్యునిగా నంగీకరించిరి.

ఇట్లు కొంతకాలము జరిగిన పిదప నా శ్రీమంతు డొకదినమున జయదేవులను సేవించి,తన నగరమునకువిచ్చేయవలయునని ప్రార్థించెను. జయదేవు లాతని ప్రార్థన నంగీకరించుటచే నా శ్రీమంతుడు రథమును రప్పించి, దానిపై జయదేవుల నధిష్టింపజేసి, తన నగరమునకు దీసికొని

పోయి, యోగ్యస్థలమునందుంచి సేవించుచుండెను. భగవద్గుణ కీర్తన యును, నాత్మచర్చా బ్రహ్మజ్ఞానమును. క్షమ, శాంతియు దయ నిష్కామబుద్ధియు, యజ్ఞయాగాదులును, ఔదార్య ధైర్యనిష్ఠాజ్ఞానము లును, ప్రాణాయామాది వజ్రాసనములును సత్సమాగమము లేనిది ప్రాప్తించవు.) కాబట్టి ఆ శ్రీమంతుడు మిగుల నుత్సాహముతో తన గృహమునందు జయదేవస్వామికి దివారాత్రములు భక్తిశ్రద్ధలతో సేవ జేయుచుండెను. జయదేవులచ్చట నహర్నిశములు హరినామ సంకీర్తన జేయుచుండెను. ఆతని యుపదేశవాక్యములు విని దురాచారులును, నజ్ఞాన మూఢజనులును భక్తిమార్గములో బ్రవేశించిరి. జయదేవు లా నగరమున నొక మాసము వసించి జగన్నాథక్షేత్రమునకు బయలు దేరెను. ప్రయాణవిషయ మా శ్రీమంతుడెరిగి జయదేవులను దర్శించి 'ఓ సద్గురుమూర్తీ! తమ అభయ ప్రదహస్తము నా శిరమునందుంచి నన్నాశీర్వదింపుడని" ప్రార్థించి, కనకాసముపై జయదేవుల గూర్చుండ బెట్టి, ప్రేమతో సద్గురువుల పూజించి, గురుదక్షిణ ఏమి సమర్పింపవలె నని తన మనంబునందిట్లాలోచించెను. "రత్నములు, రూప్యములు, సువర్ణము, గురుదేవులకు మట్టితో సమానము. వీరికేమి సమర్పించినను నంగీకరింపరు. గురుమాతకు మాత్రము ద్రవ్యము బంపుట యుచితమని" యాలోచించి జయదేవులకు దెలుపకయే నానావిధములగు రత్నము లను, సువర్ణాభరణములను, నమూల్యములగు పీతాంబరములను, ద్రవ్య మును రథములో నుంచెను.

జయదేవు లా రథములో గూర్చుండి బయలుదేరిరి. శ్రీమం తుడు గురుదేవులవారివెంట బంపుటకు మేధావంతులగు తన సేవకులను బిలచి "మీరు బహు జాగ్రత్తతో గురుదేవులను జగన్నాథక్షేత్రము నకు దీసికొనివెళ్ళి నాశ్రమమందు ప్రవేశింపజేసి, గురుమాతకు నా వందనములు దెలిపి, గురుదేవులకు దెలియకుండ నీ రథములో నే నుం చిన యమూల్య వస్త్రాభరణాదుల నర్పించి తిరిగిరండని" జెప్పెను. శ్రీమంతుడు గ్రామము వెలుపలవరకు జయదేవులవెంబడి బోయి,సాగ

నంపి, వారిగొయ్యొద్ద నాజ్ఞ దీసికొని దిరిగి స్వస్థానమునకు జేరెను. జయ దేవులక్కు శ్రీమంతుడు గు ప్తదానము జేసి పంపినటుల ఇరువురు చోరులు విని, దత్క్షణమే జయదేవులు పోవుచున్న మార్గమున బోవుచుండిరి. శ్రీమంతుడు జయదేవుల వెంట రక్షణగ పంపబడిన మనుష్యులు కొంత దూరము బోయిన పిదప జయదేవులకు నమస్కరించి "స్వామీ! మా కంటివొయ్యొద్ద నేడు మిగుల నవసరమైన గార్యములున్నవి. దయచేసి నాజ్ఞ నిచ్చిన గృహములకు బోయి గార్యములు చక్కబెట్టుకొనెదమని" చెప్పిరి. జయదేవులు మనంబునందు దాసీదాసులును, భార్యయు, పశువులును, క్రిమికీటకాది జాతులును, పరాధీనములని భావించి, వారిని జూచి "నాయనలారా! నాకేమియు భయము లేదు. నేనొంటరిగ వెళ్ళె దను. మీ రింటికిబోయి మీమీ కార్యములను జూచుకొనుడని" చెప్పెను. వారు జయదేవులను విడచి తమ నివాసముల కేగిరి.

జయదేవులు రథముతో నరణ్యమార్గమున బోవుచుండ చోరు లిరువురు నాతసిని గలిసికొని నమస్కరించిరి.

దుష్టుడు, కపటి, దురాచారి, చోరుడు, జారుడు, నిందకుడు, నభావికుడు, వంచకుడు, మొదలగు వారిని జ్ఞాతలు దూరమునుండియే గు ర్తింతురు. జయదేవులు చోరుల చిహ్నములను జూచి గు ర్తించి "నాయనలారా! మీ మనస్సులో నేకోరిక యున్నదో తెలుపుడు. నేను బూర్తిచేసెదను. వస్త్రములు నలంకార భూషణములు నానావిధము లగు రత్నములును, రథములో నున్నవి. మీకర్పించితి దీసికొనిపొండని చెప్పెను. జయదేవులు మనంబునందు "ద్రవ్యములో నతి యనర్థమున్నది ద్రవ్యమువలన ప్రాణాపాయము తటస్థించుననని" యాలోచించి రథమును త్యజించి త్వరితముగ బోవుచుండెను. అంత దస్కరు లిరువురును "జయ దేవులు రథమును మనకర్పించి బోవుచున్నాడు. శ్రీమంతున కీ వృత్తాం తము దెలిపి మకలను శిక్షించును. గాన ఈతనిని జంపి రథమును దీసి కొని బోవుట యుచితమని" యాలోచించి తత్క్షణమే పరుగునబోయి జయదేవుల సమీపించి ప్రాణముదీయుటకు వెరచి జేతులను కాళ్లను



క్రౌంచభూపాలుడు జయదేవుని శరణుబొందుట.

నరికి పాడుభావిలో బడవేసి చోరులిరువురును రథమును దీసికొని పోయిరి. జయదేవులు దేహాతీతుడై "దేహమునకిట్టి ఘాతములు సంప్రాప్తించును. (ఆత్మారాముడలిప్తుడై సుఖదుఃఖములకు దూరముగ నుండును. దేహము సకల రోగములకు వాసస్థానము. దేహము కామక్రోధాదులకు మూలస్థానము) సత్వ రజ స్తమోగుణములయొక్క వికారములు దేహమునుండి బయల్వెడలునని" యోచించి క్షీరసాగర విలాసుడగు భగవంతుని బ్రార్థించుచుండెను.

ఆ దిన మానసమందు క్రౌంచభూపతి మృగయా వినోదార్థమై సంచరించియుండెను. ఆకస్మికముగ పాడుపడిన భావిలోనుండి ప్రకాశము గనబడుచు, శబ్దము వినబడుచున్నందున క్రౌంచ భూపాలుడు తత్క్షణమే ఆభావియొద్దకుబోయి జూడగా, పరమ తేజస్వియు, దేదీప్యమానముగ ప్రకాశించుచున్న విష్ణుభక్తుడు, 'రామకృష్ణ గోవింద, యను భగవన్నామముల నుచ్చరించు ధ్యానధారణలో నుండుటనుజూచి భృత్యులచే భావిలోనుండి జయదేవులను దీయించి సాష్టాంగ నమస్కారము జేసి, కాళ్ళును చేతులును ఛేదింప బడియుండుటను బరీక్షించి జూచి భీతితో "మహాత్మా! తమకిట్టి దురవస్థ ఎందుకు సంప్రాప్తించినదని" విచారించెను. అంత జయదేవులు రాజుతో "నాథునా! నేను కరచరణ విరహితుడుగనే జన్మించితినని" చెప్పెను.

క్రౌంచభూపాలుడు తన మనంబునందు "వీరు విష్ణుభక్తులు. పూర్వజ్ఞాన వంతులు. ఇతరుల దూషింపరు. తమ కపకారము జేసిన వారికి సహిత ముపకారము జేయుదురు. వీరికి దుష్టులెవరో యపకారమీవిధముగ జేసిరని" నిశ్చయించి యొకపల్లకిని రప్పించి తన నగరమునకు దీసికొనిపోయెను. క్రౌంచభూపాలుడు తనకోటలో బ్రవేశించి, కనకాసనముపై జయదేవులను గూర్చుండబెట్టి, ప్రేమతో షోడశోపచారవిధుల బూజించి, నమ్రతతో బ్రార్థించి, మంత్రోపదేశమును బొందెను. క్రౌంచభూపతి సింహాసనముపై గురువర్యుల నధిష్టింపజేసి భృత్యుల

రప్పించి "నాయాజ్ఞానుసారము మీరు శ్రీగురుదేవుల సేవ సర్వకాలములయందును జేయుచుండ వలెనని" జెప్పెను. సేవకులు రాజుతో "మహాప్రభూ! మాభాగ్యము విశేషమైన దగుటచే మహాత్ముల సేవ లభించినదని చెప్పిరి.

ఒకదినము క్రౌంచరాజు గురువులవలన తను కోపాయ సాధనము వినవలెనని కుతూహలముతో వారి యొద్దకుపోయి సాష్టాంగ నమస్కారముజేసి నమ్రుడై "ఓ సద్గురుమూర్తీ! తరుణోపాయమునకు సులభ మార్గము దెలియజేయుడని" ప్రార్థించెను. అంత జయదేవులు 'ఓరాజా! వైష్ణవసేవకు మించిన సులభసాధన వేరొకటిలేదు. గాన నీవు వైష్ణవుల కిచ్ఛాభోజన మర్పించి పూజింపుము; వారలు గోరినచో వస్త్ర భూషణ ద్రవ్యముల నర్పింపుము; ఈ విధముగ వారల సేవించినచో వాసుదేవుడు సంతసించును; భక్తులకు సేవజేయువారు భగవంతునికి లక్ష్మీదేవికంటె నధిక ప్రియులై యుందురని" చెప్పెను. క్రౌంచ భూపాలుడు జయదేవులతో "ఓ గురుదేవా! అజ్ఞానాంధకారమునందున్న నేను వైష్ణవుల నెట్లు దెలుసుకొనగలను, వైష్ణవ లక్షణములను, వారిని సేవించు విధమును దెలుపుడని" ప్రార్థించెను. పద్మావతీ రమణుడు హాసవదనుడై "ఓ క్రౌంచభూపాలా! వసుదేవ సుతుడగు మన్మథునియందు రతులగు వైష్ణవు లెందరోగలరు. వారు వైష్ణవులు కాజాలరు. వాసుదేవుడగు శ్రీకృష్ణభగవానుని చరణకమలములందు రమా విలాసులగు వారే వైష్ణవులు. వారి స్వభావము జెప్పెదను వినుము. ఉత్తములను ధరించి, అధముల ద్యజించవలెనను స్వభావము భూమికుండునట్లును, రాజు దేహములో చలన వలనాదులలో సంచరించుచు, దరిద్రుని దూరము జేయవలెనను భేదము ప్రాణవాయువున కుండనట్లును; గోవునకు గలిగిన దప్పికను దీర్చి, వ్యాఘ్రమునకు విషమై జంపవలెనను స్వభావము జలమున కుండనట్లును; గృహములోని వారికి మాత్రము వెలుతురునిచ్చి, ఇతరుల కంధకార మివ్వవలెనను తలంపు దీపమున కుండనట్లును; తన్ను గొడ్డలితో నరకువానికిని, నీరుబోసి పెంచువానికిని వృక్షము నీడనిచ్చు

న్నులు; శ్రేష్ఠ కనిష్ఠ విచారణ జేయక సర్వులయందు సమబుద్ధిగలిగి వర్తించువారు వైష్ణవులు. వారు మనస్సునందును, వాక్కునందును నాచరణయందును విషమభావము లేకుందురు. మనస్సునందు సచ్చింతనయు వాక్కునందు సద్వచనమును, క్రియయందు సత్కర్మను గలిగి సుఖదుఃఖములను సమానముగ భావించి, పరులకును నపకారము జేయు తలంపు లేక, తమ కపకారము జేసినవారికి సహిత ముపకారమును జేయుదురు. గాన నీవువారికి మహాత్సేవ జేయుము. వారి సేవ వలన ధర్మమునందు శ్రద్ధయు, తద్ద్వారా భగవత్కథాశ్రవణము నందు బ్రవృత్తియు దానివలన విమలజ్ఞానమును, గలుగును. విమలజ్ఞానము వలన ఈశ్వరుని యందు దృఢభక్తి నిలుచును. దృఢభక్తివలన భగవత్తత్వ జ్ఞానము సహజముగ బ్రాప్తించును. గాన నీవు వారి నఖండముగ సేవించుచుండుమని చెప్పెను.

గుర్వాజ్ఞానుసారముగ క్రౌంచరాజు భక్తులకు (వైష్ణవులకు) సేవ జేయుచుండెనను కీర్తి నలుదిశలందును వ్యాపించి వృక్షచ్ఛాయను జూచి బాటసారులును, ఆహారమును జూచి పక్షులును, దాత కీర్తివిని యాచకులును, చక్కెరను జూచి చీమలును, ఆవునుజూచి దూడయు నుల్లాసముతో జేరునట్లును, పర్వతములపై మేఘము లానందముతో వర్షించునట్లును, మేఘ గర్జనవిని నెమళ్ళానందముతో నృత్యము జేయునట్లును, రణరంగమునకు బ్రతాపశూరుడు సత్వర మేగునట్లును, క్రౌంచరాజు యొక్క భక్తి చిహ్నములను జూచుటకై విశేషముగా భక్తజనులు వచ్చి ప్రథమమున జయదేవులను దర్శించి పిదప రాజదర్శనమును జేసిరి.

క్రౌంచరాజు భక్తజనులను జూడగనే సాష్టాంగ నమస్కారము జేసి చాతుర్మాస్యము దన భవనము నందుంచుకొని ఇచ్ఛా భోజనముల నేర్పాటు జేసెను. రాజు భక్తులు కోరునట్టి వస్తువులను, వస్త్రాభరణములను. ద్రవ్యమును, వారి కపరిమితముగ నిచ్చుచుండెను. ఈ వర్త

మానము జయదేవుల కరచరణములు ఛేదించిన చోరులువిని తాము
భక్తులవేషములతో క్రౌంచరాజు యొద్దకుబోయి అపరిమిత ద్రవ్యసన్మా
నముల బొందవలెనని యోచించిరి. జయదేవులు రాజసమక్షమున
నున్నవార్త చోరులకు దెలియనందున కపటముతో తులసీమాలలను
గోపీచందన తిలకమును భక్తులవలె ధరించి శోభించుచుండిరి. వేషధారు
లగు నా చోరులిరువురును మహాభక్తుల వేషములతో శోభించుచు,
అంతః కరణమునందుగల కపటము కించిన్మాత్రమైనను బాహ్యమునకు
గనబడనీయక; జేతిలో జపమాలలను ధరించి విరక్తులవలె నటించుచు
నగరములో బ్రవేసించి, రాజమందిరములో జేరి సభను విలోకించి
జూడగా జయదేవులు సింహాసనముపై నధిష్టించి యుండిరి. చోరులిరు
వురును జయదేవులను జూచి నిశ్చేష్టితులై "మనము దెలియక ఈ య
గ్నిగుండమున వచ్చిపడితిమి. మన కపటమునకు తగిన ఫలమనుభవింప
వలసి వచ్చినదని" ఒకరి కొకరు జెప్పుకొనుచుండిరి.

సర్వభూతములందును నిర్వైరిగా సహజస్థితిని వర్తించువాడును,
క్షమ, శాంతి, మొదలగు సుగుణములు గలవాడును, శత్రు మిత్రులను
సమముగ జూచువాడును, పరుల దోషగుణములను వర్ణింపని వాడును,
సర్వజీవులను భగవద్రూపముగ జూచువాడును, దనసంపదను చోరులప
హరించినటుల విని మనమునందు ఖేదములేక చిత్తమునందు సమాధా
నము గలవాడు భక్తుడు, తనశాలువను, పరుల శాలువను, నేదుచ్చ
చుండ తత్కాలమునందిరువురియందు సమముగ ప్రేమాదరణలను
జూపువాడు భక్తుడు, రాజు వస్త్ర భూషణము లర్పించినను దరిద్రుడు
పత్ర మర్పించినను రెంటిని సమముగ స్వీకరించువాడు భక్తుడు.

జయదేవులు తత్కాలమందు దన కర చరణముల ఖండించిన
చోరులిరువురును వచ్చి యుండుటనుజూచి, దత్‌క్షణమే సింహాసనము
నుండి దిగెను. కపటవేషధారులగు చోరులిరువురును జయదేవులకు
సాష్టాంగ నమస్కారముజేయ పద్మావతీ రమణుడు వారి నాలింగనము

జేసికొని సేవకులనుబిలచి "వీరిరువురును మహనీయులు. రాజునకు దెలిపి వీరికి ప్రత్యేకముగా సన్మానములను జేయుమని దెలుపుడని" చెప్పెను. సేవక జనులు జయదేవుల యాజ్ఞను రాజునకు దెలియజేసిరి. క్రౌంచ భూపాలుడు తత్క్షణమేవచ్చి వేషధారులకు సాష్టాంగ నమస్కారము జేసి, నానా విధోపచారములతో బూజించి, భోజన తాంబూలాదుల నర్పించెను. చోరులిరువురును భుజించిన పిదప క్రౌంచ భూపతి వారలకు నమస్కారముజేసి "మహాత్ములారా! తమ ఇచ్ఛయున్నన్ని దినములిచట వసింపుడనగా" వేషధారు లిరువురును "నవశ్యముగ నుండెదమని" చెప్పిరి. ఆరాత్రి చోరు లిరువురును నానావిధముల యోచించి యంత్యమున తమకేమి దుర్గతి సంప్రాప్తించునోయని యుపచారములందు విముఖులై యుండిరి.

ఒకనాడు క్రౌంచరాజు జయదేవులతో "గురువర్యా! తమ సమక్షమునకు విచ్చేయు భక్తులకు తాము దూరమునుండియే ప్రతినమస్కారము జేయుచు, నూతనముగా విచ్చేసిన వారిరువురకు సాష్టాంగ నమస్కారమెందులకు జేసిరి? నేను నానావిధములగు నుపచారములు జేయించుచున్నను, వారు నానాటికి కృశించుచున్నారు. దీనికి కారణమేమి తెలుపుడని" యడిగెను. అంత జయదేవులు "ఓ రాజా! భక్తులకు విషయభోగములు రుచింపవు. విరక్తులు మాయా మమతలను విషతుల్యములుగ భావింతురు. ఇదివరకెందరో వైష్ణవు లిచటికి వచ్చిరి. ఇంకెందరో వత్తురు. వీరందరి కంటె సంపూర్ణ విరక్తులు, నీ భాగ్యవిశేషముచే వీరిచట వసించిరి. వారు వెళ్లెదమని చెప్పినచో వారు గోరిన సన్మానములర్పించి బంపుమని" చెప్పెను. అవశ్యమని చెప్పి క్రౌంచ భూపాలు డంతర్మందిరమునకు జేరెను.

ఒకనాడు వేషధారులిరువురును బోవుటకు నిశ్చయించుకొని రాజ సమక్షమునకు వచ్చి "మేము తీర్థవాసులము. స్వస్థానములకు బోవుచున్నామని" చెప్పిరి. క్రౌంచభూపాలుడు వారలకు వందనములను జేసి

"మహాత్ములారా! తమకేమి కావలయునో గోరుడని" జెప్పగా చోరు లిరువురును దమకు రెండు రథములును ద్రవ్యమును గావలెనని చెప్పిరి. క్రౌంచరాజు వారలకు వస్త్రాలంకార భూషణములును, ద్రవ్యమును, రెండు రథములలోనుంచి, నవి వారి కర్పించి, దూతలను వారివెంట బంపెను. మార్గమధ్యమున రాజభటులు వేషధారులతో "అయ్యలారా! మా రాజసమక్షమున కెందరో మహనీయులు వచ్చిరిగాని మీయందు జయదేవులు జూపిన వాత్సల్యము నిదివర కెవ్వరియందును జూపియుండ లేదు. దీనికేమి కారణమో దెలుపుడని" యడుగగా చోరులు దూత లతో "పూర్వాశ్రమమునందు మేమును జయదేవులును నొక రాజు సేవలో నుంటిమి. జయదేవులు ప్రధానిగను, మేము సేవకులముగను నుండగా జయదేవు లొక యపరాధము జేసినందున రాజు క్షోభించి యరణ్యమునకు గొనిపోయి శిరశ్ఛేదనము జేయుడని మా కాజ్ఞాపించెను. రాజాజ్ఞప్రకారము మేమరణ్యమున కాతని దీసికొనిపోయి, శిరశ్ఛేదనమునకు బదులుగ గరచరణములను ఛేదించి, పాడుభావిలో బారవైచి, యప్పటినుండి రాజసేవను ద్యజించి, విరక్తిమార్గమునను సరించి, విష్ణుభక్తులమై దీర్ఘాటన జేయుచు నీ నగరము జేరితిమి. రాజ మందిరములో ప్రవేశించగనే జయదేవులు మమ్ములను జూచి, ప్రాణదానము జేసిన యుపకారము స్మరణకు దెచ్చుకొని, రాజున కాజ్ఞాపించి మాకు సన్మానముల జేయించెనని" చెప్పిరి.

తత్క్షణమే భూమి చీలిపోయి యసత్యవాదులగు వేషధారు లిరువురును రథములతో భూగర్భములోనికి బోయిరి. ఈ చమత్కారమును జూచి రాజభటులు భయపడుచు, రాజువలన దమకేమి ప్రమాదము సంభవించునో యని పరిపరివిధముల యోచించి, తుదకు జరిగిన యదార్థము జెప్పుటకు నిశ్చయించి, నగరములో ప్రవేశించి, జయదేవులను దర్శించి, జరిగిన వృత్తాంతమంతయును జెప్పిరి. జయదేవులు నేత్రములనుండి ఆనందాశ్రుధారలు విడచుచు, భటులతో గలసి, యాస్థలమునకు బోయి గద్గదస్వరముతో "ఓ కృష్ణా! పతితపావనా! భక్త

వత్సలా! రుక్మిణీరమణా! నీకు విరోధియగు రావణునకు సాయుజ్య మొసంగితివి. మరి నా శత్రువుల కధోగతినిచ్చుట ధర్మమా?" యని ప్రార్థింప జయదేవుల కరుణావచనములకు సంతసించి చతుర్భుజుడగు నారాయణుండు సాక్షాత్కరించి, ఆతనికి కరచరణముల ననుగ్రహించి, చోరుల నిరువురుని పుష్పకవిమానమునం దధిష్ఠింపజేసి, వైకుంఠమునకు దీసికొనిపోయెను. భక్తుల మాహాత్మ్యమును దెలిసికొనుటకు బ్రహ్మాదులకు సహితము సాధ్యము కాదు. అంత శ్రీ రుక్మిణీరమణుడు జయదేవులతో "ఓ భక్తాగ్రగణ్యా! నీ భక్తి ధన్యమైనది. దయ క్షమ శాంతి నీలో మూర్తీభవించియున్నవి. శత్రులను మిత్రులను సమానముగ జూచువారికి హృషీకేశుడనగు నేనధీనుడనై యుండెద" నని చెప్పి దత్కాలమునం దంతర్ధానుడయ్యెను. జయదేవులకు కర చరణము లుద్భవించుట జూచి క్రౌంచభూపాలునికి జిత్తమునం దాశ్చర్యముగలిగి చేతులు జోడించి నమస్కరించెను. జయదేవులు జరిగిన వృత్తాంత మంతయు రాజునకు దెలుపగా సభలోనివారెల్లరు జయజయధ్వనులు జేసిరి. క్రౌంచరాజిందిరాదేవి యవతారమును, మహా పతివ్రతా శిరోమణియునగు పద్మావతీదేవిని పల్లకీలో రప్పించి, వస్త్రభూషణా ద్యలంకారములను, ముక్తాహారముల నామెకర్పించి, భావపూర్వకముగ నమస్కారమును జేసెను. రాజంతఃపురమందు బ్రవేశించి రాణిని బిలచి మన గురుపత్నియగు పద్మావతీదేవికి రాత్రిందివములు సేవ జేయు చుండుమని యాజ్ఞాపించెను. రాణి భక్తిశ్రద్ధలతో పద్మావతీదేవిని సేవించుచుండెను.

ఒక దినమునందు రాణిసభలో గూర్చుండియుండ ముఖ్యాసనమున పద్మావతీదేవి గూర్చుండెను. నదులలో భాగీరథియు, పతివ్రతలలో సావిత్రీసతియును, సర్వమంత్రములలో గాయత్రీమంత్రమును శోభించునటుల ముఖ్యాసనమందు పద్మావతీదేవి శోభించుచుండెను. ఆ సమయమున నకస్మాత్తుగా రాజదూత వచ్చి రాణియొక్క సోదరుడు మరణించినట్లును, భార్య భర్తను స్మరించుచు సహగమనమునొంది

నట్లును, జెప్పగా సభలోనున్న యువతులెల్ల రత్యాశ్చర్యమునొందిరి. పద్మావతీదేవి మాత్రము నిశ్చలముగా నుండు టెల్లరకు జిత్రముగ దోచెను. రాజకాంత పద్మావతీదేవికి వందనములుజేసి "ఓ తల్లీ! నా సోదరుడు మరణమునొందుటయు మా వదినె సహగమనము నొందుటయు మీ చిత్తమునకేమియు నాశ్చర్యము గలుగజేయకుండు టకు కారణమేమి? భర్తను స్మరించుచు, మాయామమతలను త్యజించి భర్తతో సహగమనమొనర్చిన పతివ్రత సప్తజన్మలవరకు భర్తతో గూడి యుండునని శాస్త్రమందు జెప్పబడియుండ దను కేవిధమగు నాశ్చర్యము గలుగకుండుట జిత్రముగ నున్న" దనెను.

అంత పద్మావతీదేవి రాణితో "భర్త దేహత్యాగమైన పిదప ఆతనితోపాటుగా నిర్బంధ సహగమనమువలన విశేషమేమియును లేదు. పతివ్రత తన భర్త మరణమునొందెనను వార్త వినిన తత్క్షణమే సూర్యుడస్తమించగనే ఆతనితో కిరణములదృశ్యమగునట్లు, ప్రాణములు విడువవలె" నని పద్మావతీదేవి చెప్పెను. రాజకాంత విస్మయము జెంది యనుభవములేని మాటలుగ భావించెను. (అనుభవము లేని బ్రహ్మజ్ఞానమును, ప్రాణము లేని శరీరమును నీశ్వర కృపలేని పలుకులును, ధాన్యాదులులేని గృహమును, నాసిక లేని ముఖమును, మహాత్తములేని పరివారమును, ధనలుబ్ధుని ప్రేమయు, వృక్షములేని గ్రామమును వ్యర్థములు,) పిదపరాణి తనమంత్రిని బిలచి "నీవు నాకొరకొక యసత్యము బలుకవలెను. అరణ్యమునకు రాజుగారును, జయదేవులును బోయినపిదప నీవొక భటునితో నేనును పద్మావతీదేవియు మాటాడు చుండుసమయమున జయదేవులు మరణించిరని వార్త బంపవలెనని చెప్పెను. ఆదినమందు వనక్రీడనిమిత్తమై రాజరణ్యమునకు బయలుదేరి జయదేవులను బల్లకిలో దనవెంట దీసికొనిపోయెను. ప్రధాని యరణ్యము నుండి యొకభటుని నగరమునకుబంపి వ్యాఘ్రి మాకస్మికముగవచ్చి జయదేవులపై బడి చంపెననిచెప్పి రక్తముతో తడిసిన వస్త్రములను జూపుమని చెప్పగా ఆ భటుడు రాజభవనములో ప్రవేశించి రాణితో

వృత్తాంతమంతయు జెప్పెను. రాజకాంత ఏడ్చుచు పద్మావతీదేవి యొద్దకువచ్చి "ఓతల్లీ! గొప్పయనర్థము జరిగినది. జయదేవుల నరణ్యమునందాకస్మికముగ నొక వ్యాఘ్రము జంపెనని చెప్పెను. తత్క్షణమే పద్మావతీదేవి రాణితో సత్యము చెప్పుమని యడుగగా రాజకాంత ముమ్మాటికీ సత్యమే యనిచెప్పెను. సూర్యాస్తమయము కాగానే కిరణములస్తమించునట్లును, పూర్ణిమానంతరము చంద్రునికళ లోపించు నట్లును, దీపమారినపిదప ప్రకాశమంతరించునట్లును, జయదేవుల మరణవార్తవినిన వెంటనే పద్మావతీదేవి "హా! ప్రాణేశ్వరా!" యని కేకవేసి ప్రాణములవిడచెను.

క్రౌంచరాజరణ్యమునుండి తిరిగి నగరములో ప్రవేశించి పద్మావతీదేవి మరణవార్త ప్రధానివలన దెలిసికొని రాణిని సంహరించుట కుద్యుక్తుడై స్త్రీహత్యాపాపము సంప్రాప్తించునని వెఱచి, తానే ప్రాణముల విడువదలచి, నగరము వెలుపల నగ్నిగుండ మేర్పరచెను. రాజు జయదేవులకు నమస్కారముజేసి "ఓ సద్గురుమూర్తీ! నావలన మహానర్థముసంప్రాప్తించె' నని చెప్పెను. అంతసాక్షియగు జయదేవులు రాజును బుజ్జగించి యాత్మహత్య మహాపాపమని జెప్పి పద్మావతీ ప్రేతముయొద్దకు బోయి, తంబురయును, చిరుతలును జేబట్టి భగవంతు నిరువది నాల్గష్టపదులతో గానముజేసెను. "కేశవా! నారాయణా! ముకుందా! భక్తవత్సలా! ఆనందకందా! గోకులపాలా! జగద్వంద్యా! తత్ క్షణమే రక్షింపుము. గజేంద్రు నార్తధ్వని విని రక్షించితివి. ప్రహ్లాదుని సంకటములనుండి దొలగించితివి. ద్రౌపదీ మానమును కాపాడితివి. పద్మావతిని సత్వరమే బ్రతికింపు" మని ప్రార్థించెను.

ఆర్తనాదముతో గానము జేయుచున్న జయదేవుల ఎదుట శ్రీ రుక్మిణీరమణుడు సాక్షాత్కరించి యాలింగనము జేసికొని వరదాన మిచ్చి "భక్తాగ్రగణ్యా! నీయష్టపదులను గానము జేయువారును శ్రవ

ణము చేయువారును నా కృపకు పాత్రులగుదురని" చెప్పి లక్ష్మీకాంతుడు పద్మావతీదేవిని లేపి యాలింగనము చేసికొనెను. భక్తజనులు జయ జయధ్వనులు చేసిరి. ఆకాశమునుండి విమానములలో గూర్చుండి దేవతలు పుష్పవృష్టిని గురిపించిరి. సర్వజనులు నానంద పరవశులైరి. క్షేత్రప్రజలును, రాజును, జయదేవులకు సాష్టాంగ ప్రణామములు జేసిరి.

వ్యాసుల పూర్ణావతారుడును, శత్రు మిత్రులను సమముగ జూచినవాడును, మహా భక్తుడునగు జయదేవుల యుత్తమచరిత్ర శ్రవణ పఠనములవలన భగవంతుని కృపకు పాత్రులగుదురు.

రెండవ యధ్యాయము సమాప్తము.

శ్రీ గోపాల కృష్ణాయనమః

# తులసీదాస చరిత్ర

## —♦ మూడవ యధ్యాయము ♦—

ఈరోజున భక్తవిజయమను వసంతము సంప్రాప్తించినది. కాబట్టి యద్ధమను ప్రభయు, బోధయను శీతలవాయువును, వ్యాపించి తత్త్వ విచారణయను యంకురము బయల్వెడలెను. జిజ్ఞాసయను పల్లవశాఖల నుండి జ్ఞానపుష్పములు వికసించి, దుర్లభమగు ననుభవస్థితి వలన నవి నాశరూపములగు ఫలములు లభించినవి. శృంగార యుక్తమగు నీసజ్జన రూప వనమతి శోభాయమానమై యుండెను. త్రివిధ తాపములచే సంతృప్తులగు జనులీచ్ఛాయల గూర్చుండియుండిరి. జీవన్ముక్తులను రాజ హంసలీ స్థలమున క్రీడించుచుండిరి. రసవంతమగు భక్తుల సచ్చరిత్రలు రాజసులు ప్రేమతో సేవించుచుండిరి. అజ్ఞాన జనులీవనమును దూర మునుండి విలోకించుచుండిరి. పుష్ప ఫలయుక్తమై శోభాయమానమైన యీ వనమును జూచుటచే సంపూర్ణముగ మనశ్శాంతి గలుగును.

ఒకానొక సమయమునందు క్షీరసముద్రమున భగవంతుడు శేషశాయియై యుండ నుద్ధవ, అక్రూర, వాల్మీకి, ధ్రువ, ప్రహ్లాద, శుకాదులు, విచ్చేసి యదునాయకునకు వందనములు చేసిరి. జగదుద్ధారుడు తనయెదుట నిలువబడియున్న భక్తులలో వాల్మీకిని బిలచి "మహా దోషములతో గలియుగము దుస్థితిలో నున్నది. గాన నీవు భూలోకమున నవతరించి జడజీవుల యుద్ధారణ జేయుము. నాగుణనామకీర్తన మగు రామాయణము సంస్కృత భాషయందుండుటచే, కలియుగమున గల యజ్ఞాన జనులకు గ్రాహ్యముగాదు. నివు బాకృత భాషయందు సర్వజనులు భజనరూపమున గానము జేయుటకు గ్రంధరచన జేయుమని" చెప్పెను వాల్మీకి భగవంతునకు సాష్టాంగ నమస్కారము జేసి యుత్తర దేశమునందుగల హస్తినాపురమున కనోజ బ్రాహ్మణ గృహమునం దవతరించెను.

హస్తినాపురము నగ్బురు చక్రవర్తి పాలించుచుండెను. రాజసేవ యందు జతురుడును, ధర్మశీలుడును, పుణ్యపురుషుడును, రాజకృపా

పాత్రుడును, బ్రాహ్మణోత్తముడును నగు నాత్మారాముడను నామము గల సద్బ్రాహ్మణుడుండెను. ఆత్మారామునికి పుత్రరూపమున వాల్మీకి జన్మించెను. జాతకర్మ నామకర్మ జరిపించి 'తులసీదాసు' అని యాబాలకునికి నామకరణము జేసిరి. ఈ బాలకుడు దినదిన ప్రవర్థమానముగ బెరిగి బెద్దవాడగుచుండెను. తల్లిదండ్రులు లీతని కుపనయనమును గావించిరి. తులసీదాసు పండ్రెండు సంవత్సరముల వరకును బ్రహ్మచర్య దీక్షలో విధి యుక్తముగ స్నాన సంధ్యా వేదాధ్యయనములను జేసెను. జననీ జనకు లీతనికి యోగ్యురాలగు వధువునుజూచి వివాహము జేసిరి. బాల్యావస్థ అజ్ఞానస్థితిలో జరిగి కఠినదశ సంప్రాప్తించి భార్య కాపురమునకు వచ్చినపిమ్మట తులసీదాసు భార్యయం దనురాగముచే నొక క్షణ కాలమైన నామెనెడబాసి యుండజాలకుండెను. నానావిధ వస్త్రభూషణములు ముక్తాహారములు, దివ్యరత్నములు, కస్తూరి చందనాది పరిమళ ద్రవ్యములు ఏలకులు లవంగములు జాపత్రి జాజికాయ మొదలగు భోగ పదార్థములతో విలాస మనుభవించుచు తులసీదాసు భార్య నొక క్షణమైనను విడువకుండెను. తులసీదాసుయొక్క భార్య మమతాదేవి పతివ్రతా శిరోమణియు, అహర్నిశములందుచితరీతిని భర్తకు సేవజేయుచుండునదియునై యుండెను.

ఒకనాడు అక్బరు చక్రవర్తి స్వారీజేయుచు బోవుచుండ తులసీదాసాతని వెంటబోయెను. ఆ సమయమున మమతాదేవి మాతృగృహమునుండి యామె తల్లికి ప్రమాదమగు జబ్బుగా నున్నందున మమతాబాయి నొకసారి తక్షణమేవచ్చి తల్లినిజూచి పొమ్మని వర్తమానము వచ్చెను. తల్లికి జబ్బుగా నున్నదను వార్తవిని మమతాదేవి మిగుల దుఃఖించుచుండెను. మమతాదేవి మాతృ గృహమునుండి వచ్చిన గృహస్థు "తల్లీ! నీవు దుఃఖింపకుము. నీ భర్తనిన్ను బహుదినములనుండి బంపని కారణమున నీవిధముగ నాతో నీజననీ జనకులు వర్తమాన మంపిరి. నీజనని యారోగ్యముగనే యున్నదని చెప్పెను. తులసీదాసుఅక్బరు చక్రవర్తితో బోయినందున మమతాదేవి యత్తమామల యాజ్ఞను

దీసికొని "శీఘ్రముగ తల్లినిజూచి తిరిగివచ్చెదను. ఈ విషయము నాథ ర్తకు దెలుపుడని" చెప్పి మాతృగృహమున కేగెను.

తులసీదాసు సంధ్యాసమయమునకు గృహమును జేరి భార్యగన పడనందున, తల్లిని విచారించి విషయమంతయు దెలిసికొని, ప్రియురాలు తననువిడచి పోయినదని మిగులచింతించి శయనించుటకు నిద్దుర రాక, సత్వరమే యచటనుండి బయలుదేరి, మైదుక్రోసుల దూరమా రాత్రి వేళ నడచి, శ్వశురగృహమును జేరెను. రాత్రి రెండుఝాముల వేళ దాటినందున తలుపులు బంధించి గృహములోని వారె ల్లరును గాఢనిద్రలో నుండిరి. తులసీదాసు విలోకించుచు గోడలనెక్కి మేడపైకెక్కుట కాలోచించెను, ఒక సుదీర్ఘమగు మహా సర్పము గోడపై వ్రేలాడుచు పడియుండెను. తులసీదాసు చీకటిలో దానిని బరీక్షించి జూడక తాడని భావించి దానినాధారముగ బట్టు కొని గోడపైకెక్కి మేడలో బ్రవేశించెను. సేవకజనులు నిద్రనుండి మేల్కొంచి తులసీదాసు వచ్చినటుల మమతాదేవికి దెలిపిరి తత్ క్షణమే మమతాదేవి నిద్రనుండి మేల్కొంచి భర్తకెదురుగ వచ్చి వందనములను చేసెను. అంత తులసీదాసు భార్యతో "ఓ లలనామణీ! నీవు నన్ను విడచి వచ్చినందున నడిరాత్రివేళ నైదుక్రోసులు దూరము నడచి నీకొరకై వచ్చితినని" చెప్పెను, అంత మమతాదేవి "ఓ ప్రాణే శ్వరా! యమునాప్రవాహము విశేషముగ నున్నది. గాఢాంధకార మగు నీ సమయమునం దెట్లు వచ్చితిరి ? గృహ కవాటములన్నియు బంధించియుండ పైకెట్లు వచ్చితిరని" యడిగెను. తులసీదాసు భార్యను జూచి "ప్రేయసీ! నీకు నాయందున్న విశేషప్రేమవలన నా రాకకను కూలముగ నీవు గోడపైనుండి వ్రేలాడవైచిన తాడు నాధారముగా బట్టు కొని గోడపైకెక్కి వచ్చితినని" చెప్పెను, మమతాబాయి మిగుల నాశ్చర్యముతో సత్యాసత్యముల జూచుటకై దీపమును వెలిగించి సేవకజనులను వెంటబెట్టుకొని బోయి జూడగా అతి దీర్ఘమగు మహా సర్పము వ్రేలాడుచు పడియుండుటను జూచి ఎల్లరును విస్మయము

నొందిరి. మమతాదేవి తులసీదాసును వెంటబెట్టుకొని యంతర్మందిరమును జేరి "ఓ ప్రాణనాథా! నే జెప్పు వచనములను సావధానముగ వినుడు. మీరు చతురులని జెప్పెదరు. మీ రవివేకముతో నహర్నిశముల జ్ఞాన మదముతో నున్నారు. తల్లిదండ్రులను, సజ్జనులను, సర్వసంపదలను త్యజించి, యీ రాత్రివేళ నాకొరకై యేల వచ్చితిరి? స్త్రీసాంగత్యమువలన నెందరో నాశనమైరి. మహాసర్పము కాటునైచిన మీకు ప్రాణాపాయము గలిగియుండెడిదిగదా! ఓ ప్రాణనాథా! సంసార మనిత్యమని మీకు దెలియదు. నాయందు గల ప్రేమచే నీ రాత్రివేళ నిట్లు వచ్చితిరి. అహల్యాసౌందర్యమును జూచి ఇంద్రుడు లుబ్ధుడాయెను. సీతపై కామముగల రావణుడు నాశనమొందెను. దీపప్రకాశమున కాశించి యెన్నియో పతంగములు మరణమునొందుచున్నవి. హృదయస్థుడగు ఆత్మారాముని గుర్తింపలేక స్త్రీసాంగత్యము నపేక్షించి సర్వులకును విశ్రాముడగు శ్రీరాముని విముఖులగు వారధములు. దారపుత్ర సుఖసంపదలయందు తన ప్రాణమునకంటె ప్రేమ యధికమై యుండును. ఆ ప్రేమయే భగవంతునిపైనుంచి శ్రీహరి చరణములను స్మరించినచో జన్మ సార్థకమగునని" చెప్పెను. మమతాదేవి చెప్పిన వాక్యములను విని తులసీదాసు హృదయమునందు పశ్చాత్తాపము గలిగి దిగ్గునలేచి భార్యను తల్లిగా భావించి సాష్టాంగ నమస్కారము జేసి "ఓ జననీ! మాతృదేవత బిడ్డకు ఉత్తమధర్మముల బోధించునటుల నా జన్మ సార్థకమగు మార్గమును బోధించితివి" యని చెప్పి సత్వరమే యచ్చటనుండి బయలుదేరి పూర్వజన్మ వృత్తాంతమును స్మరణకు దెచ్చుకొని "గతజన్మమునందు నేను శ్రేష్ఠుడగు వాల్మీకినై యుండి శ్రీరామచంద్రుని సచ్చరిత్రను గానముజేసి యజ్ఞాన ప్రజలకెందరికో భక్తిమార్గదర్శకుడనైతిని. ఈ జన్మమునందు నాశవంతములగు విషయభోగములలో దగుల్కొని ఆయుర్దాయమును వ్యయపరచితినని" చింతించుచు ననుతాపచిత్తుడై యానందవనమను కాశీక్షేత్రములో ప్రవేశించెను. భాగీరథిలో స్నానముజేసి, యన్నమును వర్జించి, గలితపత్రముల భుజించుచు తీవ్రమగు ననుష్ఠానము జేయుచుండెను.

తులసీదాసు ప్రాతఃకాలమునందు స్నానముజేసి శ్రీ రామ నామస్మరణ జేయుచు, "ఓ అయోధ్యావాసా! జానకీజీవనా ! నాకు దర్శనమిమ్ము" అని ప్రార్థించి అరణ్యమునందు శౌచ విసర్జనజేసి, మిగిలిన నుదకము నొక వృక్షమునకు బోయుచుండెను. ద్వాదశవర్షముల పర్యంత మహోరాత్రములు—నామస్మరణ జేయుచు నొక క్షణకాల మైనను వ్యర్థపరుపక తీవ్రానుష్ఠానము జేసెను. ఒకదినమున తులసీదా సరణ్యములో శౌచవిసర్జనజేసి మిగిలిన యుదకమును వృక్షమూలముల యథాప్రకారముగ బోసెను. ఆ సమయమున భయంకర వికృతా కారము గల పిశాచ మాకస్మికముగ నచటికి వచ్చి తులసీదాసెదుట నిలచి చేతులు జోడించి "నేను నీకు బ్రసన్నుడనైతిని- వరముగోరు మిచ్చెదనని" చెప్పెను. తులసీదా సా పిశాచమును జూచి "నీ వెవ్వరో జెప్పుము. నీ పలుకులు నా కర్థముగాకున్నవి. ప్రసన్నమైతిని వరము గోరుమంటివని" యడుగగా పిశాచ మిట్లు చెప్పెను. "నేను పిశాచ మును, బహుదినములుగ నిచ్చట నున్నాను. నిత్యము మీరిచ్చట బోయు జలమును ప్రాశనము జేయుచుంటిని. వాపీకూప తటాక సము ద్రములందు జలప్రాశనము జేయుట కధికారము నాకు లేక కడు దప్పి కతో నుంటిని. పన్నెండు సంవత్సరములుగ నా కుదకపాన మును గ్రహించిన మీకు గోరినదాని నీయదలచితినని" చెప్పెను.

తులసీదాసు విస్మయచిత్తుడై "నేను శ్రీరామ దర్శన మపే క్షించినందుకు భూతదర్శనమాయెను, కామధేనువును జూడబోయిన సూకరము గనబడినట్లును, రాజహంసను గోరినవానికి కాకి గనబడి నట్లును, సత్సంగ మపేక్షించినవానికి నిందకుడు లభించినట్లును, సధ్యాత్మ విద్య గోరినవానికి కోకశాస్త్ర శ్రవణము లభించినట్లును, కల్పవృక్షచ్ఛాయ గోరినవానికి సింధీవనము గనబడినట్లును, సిద్ధాంత జ్ఞానమపేక్షించినవానికి పాఖండగాథలు దొరకినట్లును, శ్రీరామదర్శన మపేక్షించిన నాకు పిశాచదర్శనమాయె" ననెను. అంత ఆ పిశా చము "నీవు చతురుడవు, విచక్షణుడవుగా గనబడుచున్నావు. మన

మున సందేహము విడచి నీకు యోగ్యమగుదాని గోరుము. కార్య సాధనకు చిన్న పెద్దయను తారతమ్యము విచక్షణ మవసరములేదని" చెప్పెను. తులసీదాసు "నాకే కోరికయు లేదు. శ్రీరాఘునాథుని దర్శనము మాత్రము గావలెనని" చెప్పెను. రామనామము కర్ణములో బడగానే పిశాచము వణకుచు తులసీదాసునకు వందనములను చేసి "అయ్యా! ఆ అక్షరములుచ్చరించిన నేను సర్వనాశనమగుదును. నీవు దర్శనమపేక్షించినవారి సేవకుడు హనుమంతుడు. అతని దర్శనము నీకిప్పింతును" నని చెప్పగా తులసీదాసు పిశాచముతో "వాయుసుతు డెచ్చటనున్నాడు. అతనిని నాకు జూపిన వానివలన నాకోరిక పూర్తి చేసికొనెద" నని చెప్పెను. పిశాచము తులసీదాసును జూచి అయ్యా! మీరు నిత్యము పురాణ శ్రవణము జేయునప్పుడొక వృద్ధ బ్రాహ్మణుడు వచ్చుచున్నాడు. అతడే హనుమంతుడు మీకొక గుర్తు చెప్పెదను. అతడందరికంటె ముందుగ పురాణస్థలమునకు వచ్చి కూర్చుండి పురాణశ్రవణము జేసి జనులందరు బోయినపిదప నొంటరిగ బోవును. మరియు నాతడు జీర్ణవస్త్రములను, శిరమున టోపిని ధరించి చేతకఱ్ఱను బుచ్చుకొని యుండునని" చెప్పెను. తులసీ దాసచ్చటనుండి బయలుదేరి యాశ్రమమునకు జేరెను.

మరునాడు తులసీదాసు స్నానమును జేసి నిత్యానుష్ఠానములను బూర్తిచేసికొని నామస్మరణ జేయుచు, పురాణకాలక్షేపము జరుగు ప్రదేశమునకు బోయెను. పిశాచము జెప్పిన లక్షణములుగల వృద్ధ బ్రాహ్మణుడొక డకస్మాత్తుగ నచటికివచ్చి కూర్చుండెను. పురాణ శ్రవణానంతరము సర్వజనులు బోయినపిదప వృద్ధబ్రాహ్మణుడు మౌనముగ బోవుచుండ తులసీదాసాతనిని గలిసికొని నగరము వెలుపలకు బోయినపిదప నాతని చరణములపై సాష్టాంగ నమస్కారము జేసి "స్వామీ! సమర్థులగు తమకృప నాయందు బూర్ణముగ నుండవలెనని కోరగా వృద్ధబ్రాహ్మణుడు "ఓరీ! నీవెవ్వరవు? అనాథుడను, దీనుడను, దరిద్రుడనగు నాపాదములు తాకితివేలయని?" యడిగెను. అంత



తులసీదాసు రామాయణము పారాయణము చేయుట.

తులసీదాసు చేతులుజోడించి "స్వామీ! తాము శ్రీరామభక్తులగు నాంజనేయులని" పలుక హనుమంతు డాలోచించి వాల్మీకియే యిటుల నవతరించెనని దెలిసికొని, అతని నాలింగనము జేసికొని "నేను నీకు దర్శన మిచ్చితిని నీమనస్సునందే కోరికయున్నదో కోరుము తీర్చెదనని" చెప్పగా "నాకు శ్రీరామదర్శన మిప్పింపుమని" తులసీదాసు కోరెను. హనుమంతుడు హాసవదనుడై "నీవు కోరినట్లే ఆవశ్యముగ శ్రీరామ దర్శనము జేయించెదనని" చెప్పి యంతర్ధానుండయ్యెను.

హనుమంతుడు శ్రీరాముని సమక్షమునకు బోయి, "ఓ రామ చంద్రా! వాల్మీకియొక్క యవతారమగు తులసీదాసునకు దర్శనమిచ్చి నా మనోరథమును బూర్తిజేయుమని" రఘునందను "డవశ్యముగ నాతనికి దర్శన మిచ్చెదనని" చెప్పి మహావీరులగు వానరులను సైనికులనుగ జేసి తాను తురుష్కరాజు వేషమును ధరించి తులసీదాసాశ్రమము నెదుటనుండి బోవుచుండెను. తులసీదాసాతనిని జూచి తురకప్రభువని దలచి నమస్కరించక యూరకుండెను. వాయుపుత్రుడు తులసీదాసు యొద్దకు వచ్చి "నీకోరిక శ్రీరామచంద్రుడు నెరవేర్చె"ననగా తులసీదాసు "నాకు శ్రీరామదర్శనము కాలేదని" చెప్పెను. హనుమంతుడు తులసీదాసునుజూచి "ఇప్పుడే శ్రీరాముడు సైన్యమును వెంటబెట్టుకొని నీ యాశ్రమము ముందునుండి బోయెనని" చెప్పగా, తులసీదాసు హనుమంతునితో "ఓ వాయుపుత్రా! శ్రీరామ చంద్రుడుకాదు తురుష్కప్రభువు సైన్యముతో బోయెనని చెప్పెను. హనుమంతుడు హాసవదనుడై మార్గమున బోవుచుండ నయాచితముగ స్పర్శదేవి లభించిన దానిని రాయియని త్యజించినట్లును, చిలుక యాశ్రమములోనికి వచ్చిన దానిని కపోతమని భావించినట్లును, కల్పవృక్ష వనమునకు సిందీవనముగ గనబడినట్లును, సర్వకాలమునందు విప్రుడువచ్చిన భిక్షుకుడని దలచి యనాదరణ జూపినట్లును, రాజహంసల సముదాయమును కాకులగుంపని నీవు దలచినట్లును నిర్ధనుని గృహమునకు లక్ష్మీదేవిబోయిన నాతడు దాసియని యుపేక్షించినట్లును, శ్రీరామచంద్రమూర్తి నీ ఎదుటనుండి వానర

సైన్యముతో బోగా ఏమియు రాజని నిరాకరించితి''నని చెప్పెను. అంత తులసీదాసు "నాయందు దోషమేమియును లేదు. విశ్వంభరుడగు చక్ర పాణి విశ్వమందు వ్యాపించి దుర్గోచరుడై యున్నాడు. సువర్ణాలంకార మును జ్ఞానియగువాడు సువర్ణమని చెప్పును. నీరమునుండి క్షీరముత్పన్న మగును. కాని నీరమును క్షీరమని పలుకరు. నీరమొకటైయున్నను చాతకపక్షులు భూమిపైనున్న జలమును స్వీకరించవు. అట్లే శ్రీరామో పాసకులు బహురూపములకు మన్ననసీయరు. వాల్మీకి రామాయణ మందు వర్ణించిన ప్రకారము అయోధ్యావాసియగు జానకీ రమణుడు ధనుర్బాణములను ధరించి నాకు దర్శన మీయవలెనని'' చెప్పగా, 'నీ మనోరథమును జానకీరమణుడు పూర్తిజేయునని' హనుమంతుడు పలికి యంతర్థానుడయ్యెను.

హనుమంతుడు హృదయమున శ్రీరాముని నిలపి ప్రేమతో "జయజయ అయోధ్యావాసీ, సీతారమణా, రావణాంతకా, ధనుర్ధారణా, పతితపావనా, దీనోద్ధారణా, దానవమర్దనా, శ్రీరామా!" అని స్తోత్రము జేయుచుండ శ్రీరామచంద్రుడు సాక్షాత్కరించెను. అంత హనుమంతుడు "ఓ శ్రీరామా! భక్త కామకల్పద్రుమా, సుగుణ స్వరూపా, మేఘశ్యామా! తులసీదాసునకు దర్శనమీయవలెనని" హనుమంతుడు ప్రార్థించెను. అంత శ్రీరామచంద్రుడు హనుమంతుని జూచి "ఓ భక్తశ్రేష్ఠా! కలియుగమునందు సాక్షాత్కార మిచ్చుటెట్లని" యడుగగా, "ఓ హృషికేశా! వాల్మీకికి భూలోకమున తులసీదాసను పేరుతో నవతరించి తన యుపదేశవాక్యములచే ప్రజల భక్తి మార్గమున ప్రవేశపెట్టుమని తామాజ్ఞనిచ్చియుంటిరిగదా" యని పలుక రఘునందనుడు హాసవదనుడై "ఓ హనుమంతా! కల్పాంతమందైనను నీ కోరికను నిరాకరించ" నని చెప్పి సీతా లక్ష్మణులను వెంట బెట్టుకొని హనుమత్సమేతముగా తులసీదాసునకు దర్శనమిచ్చుటకై బయలుదేరెను. హనుమంతుడు ముందుగ తులసీదాసునియొద్దకు వచ్చి "ఓ భక్తాగ్రగణ్యా! శ్రీరాముడు సీతాలక్ష్మణులతో నీకు దర్శనమిచ్చు

టకై వచ్చుచుండె" నని చెప్పగా అత డమితానందమునొందెను. తత్ క్షణమే యయోధ్యాధీశుడు దేదీప్యమానమై ప్రకాశించు కిరీటమును, నమూల్య పీతాంబరములను ధరించి- ధనుర్బాణములతో సీతాలక్ష్మణ సమేతముగ తులసీదాసునకు దర్శనమిచ్చెను. తులసీదాసు అనన్యభావముతో సాష్టాంగ నమస్కారము జేయుగా శ్రీ రఘునందను డాతని నాలింగనము జేసికొనెను. అంత హనుమంతుడు తులసీదాసును జూచి "నీవు మహాభాగ్యశాలివి. శ్రీరాముడు కృపతో దర్శనమిచ్చెను. నీవు గతజన్మమున లిఖించిన శ్రీరామచరిత్రను ప్రాకృతభాషయందు వర్ణింపుము. కలియుగమునందు యోగ యాగ వేదాధ్యయనాది సాధనములు నిరుపయోగములు. కాన నామ మాహాత్మ్యమును ప్రకటన జేసి ప్రజలను భక్తిమార్గమున ప్రవేశింపజేయుమని" చెప్పి హనుమంతుడు శ్రీరామునికి వందనములనుజేసి "ఓ రామచంద్రా! తులసీదాసు మస్తకముపై తమ అభయప్రదాన హస్తమునుంచి యనుగ్రహింపు"డన శ్రీ రఘురాముడు కృపాదృష్టితో తులసీదాసు ననుగ్రహించి వరదానమిచ్చి యంతర్ధానుడయ్యెను.

తులసీదాసు భగవదాజ్ఞను శిరసావహించి శ్రీరామ చరిత్ర (రామాయణము) ను ప్రాకృతభాషలో వర్ణించుట కారంభించెను. వారణాసి క్షేత్రములోని సర్వప్రజలును తులసీదాసు కృతమగు శ్రీ రామ చరిత్రను శ్రవణము జేయుచుండిరి. భావికుడగు ఒక శ్రీమంతుడు తులసీదాసువలన మంత్రోపదేశమును బొంది, క్షేత్ర ప్రజలను ప్రోత్సాహపరచి మఠనిర్మాణమును జేయించి; నానావిధములగు పదార్థములను నిత్యము తులసీదాసాశ్రమమునకు రప్పించుచుండెను. తులసీదాసు పంక్తిలో సహస్ర బ్రాహ్మణ భోజనములు జరుగుచుండెను. అన్నార్థులగు దీనులు నిత్యము సంతోషముతో భుజించి పోవుచుండిరి. తులసీదాసు కీర్తి నలుదిశల వ్యాపించి, ప్రజ లాతనికి నపారద్రవ్యమును రజత కనకపాత్రలను సమర్పించుచుండిరి. తులసీదాసు ప్రజలు సత్కరించినను లేక తస్కరించినను, నిందించినను లేక స్తుతించినను వార్ని

శోక విరహితుడై ఆకాశము త్రికాలములయందు సంగదోషము లేక నలిప్తమై యుండునట్లుండెను. బ్రాహ్మణ భోజనానంతరము నిత్యము భగవన్నామసంకీర్తన జేయుచుండెను. భావుకజను లపారముగ శ్రవణమునకు వచ్చుచుండిరి. రాత్రివేళలందు మరము తలుపులను దెరచి నిద్రించుచుండిరి. వారు స్వప్న సుషుప్తులయందు సహితము శ్రీరామ చరణముల సేవించుచుండిరి.

ఒకనాడిరువురు తస్కరులు నిర్భయముతో తులసీదాసాశ్రమములో ప్రవేశించి హరినామ సంకీర్తన పూర్తియై సర్వజనులు నిద్రించుచుండ స్వర్ణపాత్రల నపహరించిమూటలుగట్టుకొని త్వరితముగ బోవుటకుద్యుక్తులై ద్వారమువద్దకు వచ్చుసరికి ప్రతాపవంతులగు ధనుర్ధను లిరువురు రక్షకభటులుగ ద్వారమున కిరువైపులనుండిరి. తస్కరులు విస్మితచిత్తులై ఉత్తరద్వారమునుండి బోదలచి యచటికేగ కిరీటకుండలధారులు దేదీప్యమానమగు ప్రకాశముతో ధనుర్బాణములను ధరించి ద్వారపాలకులుగ నుండిరి. తస్కరులు దూరమునుండి వారిని జూచి భీతితో దక్షిణద్వారమునకు బోగా నచటను ద్వారపాలకులుండుట వలన వార లాశ్చర్యచకితచిత్తులై రక్షకభటులు పోయిన పిదప బోదలచి కొంతసేపు మౌనముగ గూర్చుండి ద్వారము లన్నింటియొద్ద రక్షకభటులు కూర్చుండియుండుటచే భయభ్రాంతులై స్వర్ణపాత్రలచట విడచి వెలుపలకు బోవుచుండగా ధనుర్ధారులగు రక్షకభటులు వారిని బోనీయరైరి. ఆ రాత్రియంతయు నీవిధముగ జరిగిన పిదప ప్రభాతసేవకై భక్తజనులెల్లరు నిద్రనుండి లేచిరి. తస్కరు లా సమయమున వెలుపలకు బోవుచుండ ధనుర్ధారు వారినడ్డగించిరి. తులసీదాసు ప్రభాతసేవను ముగించుకొని వెలుపలికి రాగా చోరు లిరువురును తులసీదాసు పాదములకు సాష్టాంగ నమస్కారము జేసి, "తాము శ్రీరామ భక్తులు, మిగుల ఉదారులు చోరులమగు మేము ఆశ్రమద్వారములు తెరచి యుండుట వలన లోపల ప్రవేశించి కనక పాత్రల నపహరించి వెలుపలకు బోవుచుంటిమి. ద్వార

ముల యొద్దనున్న రక్షక భటులనుజూచి కనక పాత్రలను యథాస్థానము సందుంచి మేముబోవుచుండ రక్షకభటులు బోనీయరైరి. రాత్రియంతయు ద్వారము లన్నిటివద్దకుబోయి ప్రతి ద్వారమువద్దను రక్షకభటు లుండుటవలన భీతితో కాలము గడిపితిమి. తాము దయావంతులు, మా యపరాధమును క్షమింపుడని" ప్రార్థించిరి.

తులసీదాసు శిష్యులను బిలచి "ద్వారములయొద్ద రక్షకభటుల నెవ రేర్పరచితిరి! ఎవరేదిచ్చినను తీసికొనకను సమాధాన చిత్తముతో నుండి శ్రీరాముని భజింపుడని నేనిదివరలో జెప్పియుండ నాకు దెలుపక భటుల నెందుల కేర్పరచితిరని" యడిగెను. అంత శిష్యసముదాయము తులసీదాసునకు వందనములుజేసి "గురుదేవా! మీ చరణసాక్షిగ రక్షక భటులను మేమెరుగము. ద్వారములయొద్ద రక్షణ కెవరును లేరని చెప్పిరి. తస్కరు లిరువురును తులసీదాసునుజూచి "మహాత్మా! శ్యామలా కారులును కిరీటకుండల ధనుర్ధారులు నగు రక్షకభటు లింకను ద్వారముల యొద్దనే యున్నారు మీరు జూడుడని" చెప్పగా ఎల్లరును ఆశ్చర్య చకితులై ద్వారముల యొద్దకుబోయి చూచిరి. తస్కరులకు దప్ప నితరులకు వారు గనబడనందున నచట నున్నవారెల్లరును చిత్రముగ జూచుచుండిరి. తులసీదాసు నేత్రములనుండి ఆనందాశ్రువులను విడచుచు "శ్రీ రామలక్ష్మణులే రక్షకభటులుగ ద్వారములయొద్ద నుండిరని" దలచి "ఓ రామచంద్రా! నానావిధములగు యోగములు జేయువారికిని, తీర్థములందు గ్రుంకులిడు వారికిని, దుర్లభుడవగు నీవు ద్వారపాలకుడ వైతివా? ఏకపత్నీవ్రతుడవును రావణాంతకుడవగు నీవిచ్చట ద్వారపాలకుడ వైతివా? చరణ స్పర్శచే శిలారూపమున నున్న యహల్య నుద్ధరించి కైవల్యదాన మనుగ్రహించిన నుదారుడవగు నీవు ద్వారపాలకుడ వైతివా? రఘువరా, పరమపురుషా, శంభుప్రియకరా, విశ్వోద్ధారా. లక్ష్మీకాంతా, ఉపమన్యుడు కించిత్ క్షీరమును కోరిన వానికి క్షీర సాగర మనుగ్రహించితివి. తండ్రితొడపై గూర్చుండుటకు స్థానమీయ నిరాకరించి నందున రోదనముజేయుచు నిన్ను బ్రార్థించిన ధ్రువబాలున

కక్షయ పద మనుగ్రహించితివి. విభీషణుడు నీకు బ్రియుడైనందున వానికి సువర్ణనగర మర్పించిన యుదారుడవగు నీకు దస్కరులు సువర్ణ పాత్రలను దీసికొనిపోవుచుండ నింత కృపణత్వ మేలవచ్చినదని" ప్రార్థించి తస్కరులను జూచి "అయ్యలారా! మీరు సందేహింపక యిచ్చినవచ్చిన వస్తువులను దీసికొని పొండని" చెప్పగా దస్కరు లిరువురును "మహాత్మా నే మజ్ఞానముచే నావరింప బడితిమి. పతితులమగు మాకు మీ సాంగత్యమువలన శ్రీరాముని దర్శనము సంప్రాప్తించినది. స్పర్శవేది తన స్పర్శచే లోహమును స్వర్ణము జేయునట్లు, దస్కరత్వమునకు వచ్చిన మాకు దేవతలకు సహితము దుర్లభమగు భగవద్దర్శనము లభించినది. సూర్యోదయమువలన అంధకారము దొలగునట్లు తమ దర్శనముచే మాయజ్ఞానము దొలగినదని" చెప్పిరి.

తులసీదాసు వారలతో "అయ్యలారా! మీ భాగ్య మపారమైనది. ఏవిధమగు నాయాసము లేకయే భగవద్దర్శనమును బొందితిరని" చెప్పెను. తస్కరు లిరువురు నప్పటినుండియు తులసీదాసాశ్రమములో సేవజేయుచు నాతనికి శిష్యులైరి. సత్సమాగమమువలనను, హరినామ సంకీర్తనచేతను, చోరులు, జారులు, దుర్జనులు, సహితము నా ప్రాప్తి ననాయాసముగా బొందెదరని శ్రీకృష్ణ భగవాను డుద్ధవునితో జెప్పిన విషయ మీ తస్కరుల విషయమున బుజువాయెను.

ఇట్లు కొంతకాలము జరిగినపిదప ఒకనాడు తులసీదాసాశ్రమములో బ్రాహ్మణులు భోజనమునకై కూర్చుండియుండిరి. నానావిధములగు భోజన పదార్థములు, ఘృత, శర్కర సహితముగ వడ్డింపబడెను. విప్రులు తీర్థముదీసికొని "బ్రహ్మార్పణ" మని జెప్పిరి. ఆ సమయమున ద్వారమునొద్ద నొకబ్రాహ్మణుడు నిలువబడి 'సీతారామ్' అని కేకవేసి అయ్యా! నేను బ్రహ్మహత్యను జేసితిని. క్షుద్బాధ యధికముగా నున్నది నాకు భోజనము బెట్టుడని" యడిగెను. భోజనమునకై కూర్చుండియున్న బ్రాహ్మణులెల్లరును, దటస్థముగా గూర్చుండి వినుచుండిరి.

తులసీదాసు వెలుపలకుబోయి విప్రు నాలింగనము జేసికొని నాతని లోనికి దీసికొనిపోయి, పంక్తిలో గూర్చుండబెట్టి, "ఓ కృపామూర్తీ! నా ప్రార్థన నాలకింపుడు! తాము 'సీతారామ్' అని భగవన్నామ ముచ్చరించితిరి. బ్రహ్మహత్యా పాపమప్పుడే దగ్ధమైనది కాన మీరు పంక్తిలో గూర్చుండి భుజించవలె" నని చెప్పగా, షట్శాస్త్రములందు నిపుణులగు పండితులు తులసీదాసును జూచి, 'అయ్యా! బ్రహ్మహత్యా పాపము జేసినవానిని పంక్తిలో జేర్చుట కే శాస్త్రాధార మున్నదని యడిగిరి. అంత తులసీదాసు వారితో, 'భూరామసులారా! దీనికొక యాధారమున్నది. భావ పూర్వకముగా రామనామము చ్చరించిన బ్రహ్మహత్యాపాపము నశించు నని భాగవతమునందు శ్రీకృష్ణ భగవాను డుద్ధవునకు దెలిపిన నిజ గుహ్యార్థ మేమన, కలియుగమునందు రామనామ మాహాత్మ్య మద్భుత మైనది. నామస్మరణచే బ్రహ్మహత్యాది మహాపాపములన్నియు క్షణకాలములో నశించును. ఈ విషయమును మహాత్ము లెందరో వర్ణించిరి. స్నాన సంధ్యాదులు జేయునప్పుడు ప్రథమమున జెప్పు సంకల్పము భగవన్నామము లగు కేశవా, నారాయణనామములై యున్నవి. పితృకర్మాది శ్రాద్ధములందు అంత్యమున జనార్దన స్వరూపమున కర్పించుటయు జరుగు చున్నది. కర్మకాండకు సహితము భగవన్నామము గావలసియున్నది. వివాహ నిశ్చయము జేసికొనునప్పుడు ముప్పదియారు గుణములు సరిగా జూచి చివరకు లక్ష్మీకాంతస్మరణ జేయుదురు. అంత్యకాలమునందు ప్రాయశ్చిత్తము జేసికొనునప్పుడు భగవన్నామముల నుచ్చరించెదరు. కైలాస పతియగు పార్వతీరమణుడు ప్రేమతో సదా రామనామమును జపించు చుండును. మహా పాపియగు గణిక, చిలుకను రాఘవా యని పిలచిన మాత్రమున దాని పాపములు నశించెను. భ్రష్టుడగు నాజామేళు డంత్య కాలమునందు పుత్రుని "నారాయణా!" యని బిలచినమాత్రమున వాని పాపములు దగ్ధమాయెను. ఎట్టి దారుణమగు మహా పాపములైనను భగవన్నామవహ్నిలో దగ్ధమగు" నని చెప్పెను. బ్రాహ్మణులు సంశయ చిత్తులై "ప్రత్యక్ష దృష్టాంతము లేనిది మే మంగీకరించమని" చెప్పిరి.

తులసిదాసు ధరామరులకు వందనములను జేసి "భూదేవులారా! మీ కే దృష్టాంతము గావలెనో దెలుపుడని" యడిగెను. అంత విప్రులెల్లరును "విశ్వనాథుని సమక్షమున నున్న నందీశ్వరుని కెదుట నన్న పాత్రనుంచి ప్రార్థింపుము, శిలావిగ్రహమున నున్న నందీశ్వరుడు భుజించినచో మే మంగీకరించెదము, నానా విధములగు శాస్త్ర దృష్టాంతములతో నామమహిమ యని మీరెంత చెప్పినను మేము పరమప్రమాణముగా నంగీకరించమని" చెప్పిరి. విప్రోత్తముల మాటలు విని తులసీదాసానంద భరితుడై యన్నపాత్రను దీసికొని శ్రీ విశ్వేశ్వరస్వామి యాలయములో ప్రవేశించెను. విప్రోత్తములెల్లరు తులసీదాసువెంట సభామంటపములో జేరిరి. తులసీదా సన్నపాత్రను నందీశ్వరుని ఎదుట నుంచి "జయజయ చంద్రమౌళీ, నీలకంఠా, మృడానీవరా, త్రిపురారీ! దీనుడనగు నా ప్రార్థన నాలకింపుము; నీవు హాలాహలము భక్షించి నప్పుడు గలిగిన తాపమును హరించుటకు నామస్మరణ జేసితివి. రామ యను రెండక్షరములు నీవు జపించగనే తాపము చల్లారెనని శాస్త్రములు ఘోషించుచున్నవి. విప్రోత్తములు ప్రత్యక్షప్రమాణము తప్ప శాస్త్రాధారములతో నంగీకరించమని పలుకుచున్నారు. రామనామోచ్చారణవలన నీ తాపము దొలగినది యదార్థమైనచో ఓ విశ్వనాథా! ఎల్లరును జూచుచుండ నందీశ్వరు డీ పదార్థములను భుజింపవలెనని" ప్రార్థించెను. తత్ క్షణమే శిలావిగ్రహముగ నున్న నందీశ్వరుడు శ్వాస విడచుచు లేచి యెల్లరు జూచుచుండ నైవేద్యముంచిన పదార్థము లారగించెను. ఈ కౌతుకమును జూచి యెల్లరును "నేడు మిగుల సుదినము, భక్తుల మహాత్మ్యమును దెలిసికొనుటకు వేదశాస్త్రములకు సహితము దుస్తరమని" పలికిరి. వైష్ణవులు హరినామగర్జన చేసిరి; సర్వజనులు జయజయధ్వనుల జేసిరి. విప్రులెల్లరును తులసీదాసునకు సాష్టాంగ నమస్కారము జేసి "మహాత్మా! మీరు ధన్యులు, వైష్ణవవీరులు, సిద్ధాంత జ్ఞానమునం దతిచతురులు. వాల్మీకియొక్క పూర్ణావతారులని మేము దెలిసికొంటిమి. తారాగణములలో చంద్రుడును, పక్షులలో గరుత్మంతుడును, దేవతలలో విష్ణువును, తాపసులలో పినాకపాణియు, ఋషు

లలో వ్యాసులును, ధనుర్ధరులలో జానకీవరుడును, సాగరములలో క్షీర సముద్రమును, చతుర్విధ ముక్తులలో సాయుజ్యముక్తియు, యాదవులలో కమలాసన పితయు, పండితులలో వేదాంతవక్తయు, నవగ్రహములలో సహస్రకరుడును, కవీశ్వరులలో నుశనుడును, పర్వతములలో మేరుపర్వతమును శ్రేష్ఠమైనట్లు భక్తులలో మీరు శ్రేష్ఠులని స్తవము జేసి యెల్లరును తులసీదాసువెంట నాశ్రమములో బ్రవేశించి బ్రహ్మహత్య జేసిన బ్రాహ్మణుని పంక్తిలో గూర్చుండబెట్టుకొని భుజించిరి. వారణాసి లోని సర్వజనులును దేహభ్రాంతిరహితులై తులసీదాసు రచియించిన రామాయణమును నిత్యము శ్రవణము జేయుచుండిరి.

ఇట్లు కొంతకాలము జరిగిన పిదప ఆ క్షేత్రమునందు క్షైత్రపాలుడను శ్రీమంతుడు మరణించెను. పతివ్రతా శిరోమణియగు నాతని భార్య మాయా మమతలను ద్యజించి భర్త కళేబరముతో సహగమనమును జేయుటకై గంగాతీరమందు గల వనమునకు బోవుచు తులసీదాసు నాశ్రమములోనికి బోయి భగవన్నామస్మరణ జేయుచున్న తులసీదాసునకు సాష్టాంగ నమస్కారము జేసెను. తులసీదాసామెను 'అష్టపుత్ర సౌభాగ్యవతీ' యని యాశీర్వదించెను. అంత నా సతి "ఓ విష్ణుభక్తా! నా భర్త మరణించెను. నేను సహగమనమునకు భర్త కళేబరముతో బోవుచు మిమ్ముల దర్శించుటకై వచ్చితిని. నిర్భాగ్యురాలనగు నావిషయమున దమ యాశీర్వచనము వ్యర్థమైన' దని పలికెను. తులసీదాసా పతివ్రతను జూచి "ఓ తల్లీ! నేను దెలియక యాశీర్వదించినను శ్రీరామచంద్రుడు నా యాశీర్వచనమును సత్యము జేయు" నని చెప్పెను. పిదప నా సతీమణి తులసీదాసునకు మరల వందనము జేసి యగ్నిసంస్కారమున కేర్పాటుచేసిన స్థలమునకు బోయి చితిపై భర్త గూర్చుండియుండుటను జూచి నమితాశ్చర్యమును బొందెను. స్మశానమున గల జనులెల్లరును ఈ కౌతుకమును జూచి జయజయధ్వనులు జేసిరి. క్షైత్రపాలుడు పునర్జీవితుడైన పిదప—సతీసమేతముగ తులసీదాసు నాశ్రమములో బ్రవేశించి యాతనికి సాష్టాంగ నమస్కారమును

జేసెను. వారణాసిలోని సర్వప్రజలును ఈ కలికాలమున జడజీవులను దరింపజేయుట కవతరించిన మహాభక్తుడని తులసీదాసును పరిపరివిధముల కొనియాడుచుండిరి.

హస్తినాపురమును బాలించు అక్బరు చక్రవర్తి పరస్పరముగ ప్రజలవలన తులసీదాసాశీర్వాదించుట వలన ప్రేతము పునర్జీవి యగుటయు, నందీశ్వరుడు భుజించుటయు మొదలగు విశేషములను విని కౌతుకమున జూడదలచి జతురుడగు తన ప్రధానిని బిలచి నీవు రథమును పరివారమును దీసికొనిపోయి తులసీదాసు నిచటికి దీసికొని రమ్మని యాజ్ఞాపించెను. రాజాజ్ఞప్రకారము మంత్రి పరివారముతో కాశీక్షేత్రము జేరి తులసీదాసాశ్రమమునకు బోయి ఆతనికి వందనములు జేసి "స్వామీ! తాము వైష్ణవులు, ప్రేమభక్తులు, అత్యద్భుతమగు తమ మహిమ విశేషములను మా రాజు విని తమను దర్శింపవలెనని మిగుల కుతూహలముతో దమను దీసికొని రావలయునని మా కాజ్ఞాపించి మమ్ముల నిచటికి బంపి" రని చెప్పెను. అంత తులసీదాసానంద భరితుడై యా ప్రాంతప్రజలచే భగవన్నామస్మరణ జేయించుట కిందు మూలముగ నవకాశము గలిగినదని దలచి హస్తినాపురమునకు బయలు దేరెను. నిరాశాపరులగు భగవద్భక్తులు పామరజనుల యుద్ధారణకై — భగవదాజ్ఞ ననుసరించి దేశాటన జేయుదురు.

తులసీదాసు హరినామస్మరణ నఖండముగ జేయుచు హస్తినాపురము జేరగనే నక్బరుచక్రవర్తి యెదురుగ వచ్చి స్వాగతమిచ్చి తన కోటలోనికి దీసికొనిపోయి సింహాసనముపై నధిష్ఠింపజేసి షోడశోపచార విధుల బూజించి "మహాత్మా! తమ మాహాత్మ్యమును బ్రజల వలన వింటిని. ఈశ్వరావతారులగు తాము శిలారూపముగ నున్న నందిచే భుజింపించుటయు, నాశీర్వచనముచే బ్రేతమును పునర్జీవితునిగా జేయుటయు వినినది మొదలు తమ్ము దర్శింపవలెనను కోరికతో నున్నానని" చెప్పెను. తులసీదాసు అక్బరుచక్రవర్తిని జూచి "ఓ రాజా! నేననాథు

డను. శ్రీరాముని చరణములందు చిత్తమును జేర్చి సేవజేయు సేవకుడను. అంతయును శ్రీరాముని మహిమయేగాని వేరుకాదని" చెప్పెను. అగ్బరుచక్రవర్తి తులసీదాసునకు వందనములు జేసి "మహాత్మా! నాకు మీ శ్రీరాముని దర్శనమిప్పించి మీ రిచటనుండి కదలవలె" నని చెప్పి సేవకులను రప్పించి తులసీదాసును నిర్బంధపరచి అంతర్మందిరమునకు జేర్చెను. రాజభటులు తులసీదాసును జూచి "అయ్యా! మా ప్రభువునకు శ్రీరాముని దర్శనమిప్పించిన మీరు నిజమైన భక్తులుగా భావించెదము. లేనిచో మిమ్మిచటనుండి కదలనీయ" మని చెప్పిరి.

తులసీదాసు తత్క్షణమే హనుమంతుని స్మరించగా తత్కాలమం దాంజనేయమూర్తి తులసీదాసునకు దర్శనమిచ్చెను. తులసీదాసు హనుమంతునికి వందనములు జేసి "ఓ ఆంజనేయా! అతిదారుణమగు యీ ప్రమాదకాలమునందు భగవన్నామ మాహాత్మ్యమును వ్యాపింపజేసి యదిష్టము దొలగింపు" మని ప్రార్థించెను. హనుమంతుడు సంకల్పించగనే నాకాశమునుండి మహావీరులగు వానరులు దిగుచుండిరి. వర్షాకాలమునందు మేఘములు బయల్వెడలునట్లును, భూమిపై వర్షముబడిన యపారముగ గడ్డి మొలచునట్లును పదివేలమంది మహావీరులగు వానరులు వచ్చి హనుమంతునికి వందనములుజేసి యేమియాజ్ఞ యని విచారించిరి. అంత హనుమంతుడు వారలతో "మీ సహజ స్వభావగుణములను రాజునకు విశదమగునట్లు జూపు" డని చెప్పెను. తత్క్షణమే వానరులు మహావృక్షములను బెల్లగించి జనులపై బడవేయుటయు, మేడలను మిద్దెలను కూలద్రోయుటయు మొదలగు విపరీతపు పనులను జేయుచుండిరి. ఈ దృశ్యమును జూచి హస్తినాపురములోని సర్వప్రజలును భయభ్రాంతులైరి. పిమ్మట వానరులు నగరమందంతయు వ్యాపించి కొందరికి ముక్కు చెవ్వులను గోసిరి; కొందరికి మానభంగమును చేసిరి. మరి కొందరిని కాళ్లుబుచ్చుకొని తలక్రిందలుగా నాకాశమునకు దీసికొనిపోయిరి. జలమునకై గంగాతీరమునకు బోవుచున్న స్త్రీల వస్త్రములను బలాత్కారముగ లాగుకొని గంగలో బారవేచిరి. శ్రీరాము

భజన విముఖులను, భక్తుల నవమానముజేయువారిని నెత్తుకొనిపోయి, గొంతుకలు పిసికి దూరముగ శారవేయుచుండిరి. దుర్జనులగు శ్రీమంతులయొక్కయు, నెన్నడును నన్నదానము జేయనివారలయొక్కయు, దుకాణములను కొల్లగొట్టి నగరమంతయు నల్లకల్లోలపరచి, రాజమందిరములో బ్రవేశించి గనబడినవారల ముక్కుచెవ్వులను గోసి గగ్గోలు పరచిరి. నాటకశాలయందు గూర్చుండియున్న నైదువంపల రాజస్త్రీలపైనను మల విసర్జనజేసిరి. చోర జార కుటిల దుర్జనుల నకస్మాత్తుగా నెత్తుకొనిపోయి, ఆకాశమునుండి పడవైచిరి. రాజభవనములోని వస్త్రాభరణ ద్రవ్యముల నెత్తికొనిపోయి యనాథులకు సంతోషముతో నిచ్చుచుండిరి. దరిద్రులను భాగ్యవంతులనుగ, నసత్యములు బలుకు శ్రీమంతులను దరిద్రులనుగ జేయుచుండిరి. సైనికులీ విషయమును రాజునకు దెలిపిరి. నవాబు వానరక్షోభయు, నగరమునాశనమగుటయు స్వయముగ జూచి బ్రళయకాల మాసన్నమైనదని నిశ్చయించెను. ఆ సమయమున నగరమునుండి భావుకజనులు నవాబునొద్దకు వచ్చి "ఓ రాజా! మహాభక్తుడగు తులసీదాసును నిర్బంధపరచుటచే నిట్టి ప్రమాదము సంభవించిన" దని చెప్పిరి. అంబరీషు నవమానపరుపదలచి దుర్వాసుడవమానము నొందినట్లు తులసీదాసు నవమానపరుపదలచిన తనకును, తన నగరప్రజలకు నష్టకష్టములు సంప్రాప్తించినవని యగ్బరుచక్రవర్తి గుర్తించి పశ్చాత్తాపముతో తులసీదాసుగొద్దకు బోయి సాష్టాంగనమస్కారముజేసి "ఓ విష్ణుభక్తా! అజ్ఞానమునలన నే జేసిన యపరాధమును క్షమింపు, మని బ్రార్థించెను. అంత తులసీదాసు "ఓ రాజా! నీవు శ్రీరామదర్శనము గోరితివి. సూర్యు డుదయించుటకు ముందు ఆతని ప్రభ పృథ్వియందు వ్యాపించునట్టుల శ్రీరామ దర్శనమునకు ముందా తని సేన వచ్చును. ఇప్పుడు నగరమున పదివేల వానరదళమొకటి ప్రవేశించినది. ఇంకను మహావీరులగు వానరులెందరో, వెనుక నున్నారు. పదునేడుదళములు వచ్చిన పిదప వారల వెనుక శ్రీరాముడువచ్చును. నీ భాగ్య మపారమైనది. శ్రీరామదర్శనమును గోరితి" వని చెప్పెను.

అక్బరు చక్రవర్తి తులసీదాసు పాదములపైబడి "నాకు శ్రీరాముని దర్శనమైనది. పదివేలమంది వానరులు నగరమునల్లకల్లోలపరచిరి. ఇంకను పదునేడు దళముల సైనికులు వచ్చినచో తప్పక ప్రళయము సంభవించు"నని కరుణావచనములతో దీనుడై ప్రార్థించెను. తత్క్షణమే వానరసైనికు లంతర్ధానులైరి. తులసీదా సొక సంవత్సర పర్యంతము హస్తినాపురము ననివసించి యద్భుతమగు శ్రీరామచరిత్ర నిత్యము వర్ణించుచు నజ్ఞాన మూఢజనులను సజ్ఞానులనుగా జేసి యక్బరుచక్రవర్తి యొద్ద నాజ్ఞ దీసికొని యచటనుండి మధురాక్షేత్రమునకు బోయి యమునానదిలో స్నానముజేసి శ్రీకృష్ణు సేవించి యాక్షేత్రమునందు గల భక్తుల దర్శించెను.

ప్రియాదాసు డను పేరుగల నాగర బ్రాహ్మణోత్తముడు భక్తిజ్ఞాన వైరాగ్యపరుడై యుండెను. ఆతడు కలియుగమునం దవతరించిన భక్తుల సచ్చరిత్రలను సంస్కృతమునం దద్భుతముగ రచియించెను. తులసీదా సీ విషయమును దెలిసికొని ప్రియాదాసును దర్శించి "అయ్యా! తాము రచియించిన భక్తుల సచ్చరిత్రలు విననలెనని వచ్చితి" నని జెప్పగా ప్రియాదాసు డానందించెను. ప్రియాదాసు భక్తులందరి చరిత్రలు రచియించెనుగాని తులసీదాసుచరిత్ర లిఖించనందులకై మిగుల చింతించెను. ప్రియాదాసునకు దెలియకయే శ్రీరామచంద్రుడు తులసీదాసు చరిత్ర నా గ్రంథమునందు వ్రాసియుంచెను. గ్రంథశ్రవణమునకై యపారమగు వైష్ణవులును, చతురులగు పండితులును, మహాద్వారమున గూర్చుండి శ్రవణముజేసి యానందపరవశులైరి. తులసీదాసు ప్రియాదాసును జూచి మీవాక్కునందు భగవంతుడు ప్రవేశించి భక్తుల చరిత్రల వర్ణింపించెనని చెప్పెను. పిదప ప్రియాదాసుడు తన గ్రంథమునందు తులసీదాసు చరిత్రను శ్రీరాముడు లిఖించియుండుటను జూచి అమితానందమును బొంది శ్రవణమునకు గూర్చుండియున్న భావుక జనులకు తెలిపెను. భక్తుల మహిమ విశేషములు దెలిసికొనుటకు వేదశాస్త్రములకు సాధ్యము కాదని యచటనున్న

వారెల్లరు గాని యనుచుండిరి. శ్రీరాముడు రచియించిన తులసీదాసు చరిత్రను సర్వజనులుజూచి భగవంతుని హస్తాక్షరములలో నుండుట కానందించి భగవంతునికి భక్తుల యందత్యంత ప్రేమ యుండునని దెలిసి కొనిరి.

భగవంతుని కత్యంత ప్రియుడును, వాల్మీకియొక్క పూర్ణావతారుడును నగు తులసీదాసు చరిత్ర వరమపవిత్రమైనది. ఈ చరిత్రను ప్రేమతో శ్రవణపఠనాదులు జేసిన వారలు శ్రీరామకృపకు పాత్రులగుదురు.

మూడవ యధ్యాయము సమాప్తము

శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః

# నామదేవ చరిత్ర

## — నాలుగ వధ్యాయము —

నేడు సభాగ్యులగు శ్రోతృజనులు కల్పవృక్షచ్ఛాయను గూర్చుండిరి. శ్రోతల మనోరథములు దప్పక ఫలప్రదములగును. స్పర్శవేది స్పర్శచే ఇనుమునకు మలినరూపము దొలగునట్లు భక్తవిజయ శ్రవణముచే సందేహములు దొలగును. పయోబ్ధి స్నానముచే సకల తీర్థస్నానము లభించునట్లును, సూర్య ప్రకాశముచే సర్వపదార్థములు గనబడునట్లును, నమృతమును సేవించినచో రోగములు పటాపంచ లగునట్లును, భక్తుల సచ్చరిత్రల శ్రవణముచే భవదుఃఖములు దొలగును.

ఒకానొక సమయమందు క్షీరాబ్ధిపై శేషశయనుండైయున్న శ్రీమన్నారాయణుం డుద్ధవ శుకులను బిలచి మర్త్యలోకమున నవతరింపుడని యాజ్ఞాపించెను. అంత నుద్ధవుడును శుకుడును భగవంతునికి వందనములర్పించి, "పయోబ్ధివాసా! గర్భవాసమునందు మాకిచ్ఛలేదు. అయోనిసంభవులుగా జన్మించునటు లనుగ్రహింపు" మనిరి. జగజ్జీవనుడగు భగవంతు డుద్ధవ, శుకులను, బాలురుగజేసి ముత్తెపు చిప్పలలో బెట్టి యొకదానిని భాగీరథియందును, మరియొకదానిని భీమానదియందును బడవేసెను. భాగీరథియందు ప్రవాహమున గొట్టుకొని పోవుచున్న ముత్తెపు జిప్పలోని బాలుడు రామరామ యని స్మరణజేయుచుండెను. భీమానదీ ప్రవాహములో గొట్టుకొని పోవుచున్న ముత్తెపు చిప్పలోని బాలుడు విఠ్ఠలభజన చేయుచుండెను. రామభజన జేయుచున్న బాలుడు శుకుడును, విఠ్ఠల భజనచేయుచున్న బాలుడుద్ధవుడునునై యుండిరి.

పరమ పవిత్రమగు పంఢరీపుర క్షేత్రమునందు పుణ్యవంతుడును, పరమభావుకుడును, భక్తిజ్ఞాన వైరాగ్యపరుడునగు దాముసేటి యను పేరుగల 'దర్జీ' కులస్థుడుండెను. అతడు ప్రతిదినమును నియమముతో చంద్ర భాగానదీ స్నానముజేసి శ్రీపాండురంగ దేవుని బూజించి పిదప

తన కార్యములను జూచుకొనుచుండెను. ఆతనికి పరమ భావుకురాలును పతివ్రతా శిరోమణియునగు గోణాబాయి యనుపేరుగల సత్కళత్ర ముండెను. ఈ దంపతులిరువురును నియమముతో బహుకాలముగ శ్రీ పంఢరీనాథుని సేవించుచుండిరి. గోణాబాయి మనస్సులో సంతతి లేదనుచింత యధికముగ నుండెను. ఒకనాడు గోణాబాయి భర్తతో "నాథా! 'పుత్రస్య గతిర్నాస్తి' యని పెద్దలు పలుకుదురు. కాన మీరు శ్రీ విఠ్ఠలనాథుని సమక్షమునకుబోయి ఒక సుపుత్రు ననుగ్రహింపుమని ప్రార్థింపు"డని చెప్పెను, అంత దాముసేటి "నీవజ్ఞానముచే నిట్లు పలుకుచున్నావు. మనమిరువురము వృద్ధులమైతిమి. మనకు భగవంతుడెట్లు సంతాన మనుగ్రహించును? పుచ్చిన బీజము నాటినను అంకురించనట్లును, వర్షఋతువైన పిదప గొప్పవర్షములు కురియనట్లును, శ్రావణ మాసమునందు మామిడి వృక్షమునకు ఫలములు ఫలించనట్లును, చమురైనపిదప దీపము వెలుగనట్లును, వృద్ధులమై మరణమునకు సిద్ధముగ నున్న మనకీ వయస్సునందెట్లు సంతతి కలుగు"ననెను. అంత గోణాబాయి "ప్రాణనాథా! బుద్ధిదోషమున నాపై నుంచుచున్నారు. ఈశ్వర శక్తి యన్నిటికంటె నతిశ్రేష్ఠమైనది. రామావతారమునందు శ్రీరాముడు సముద్రముపై రాళ్ళను దేల్చెను. గోవులను బ్రహ్మదేవు డపహరించినప్పుడు స్వయముగా గోగోప జనుల రూపములను ధరించెను. భగవంతునికి వృద్ధులమగు మనకు సంతతి నీయుట యసాధ్యమా?" యనెను దాముసెట్టి భార్యనుజూచి "నీ కోరిక భగవంతుని కిప్పుడే దెలిపెద" నని చెప్పి దేవాలయమునకు బోయి సాష్టాంగ నమస్కారము జేసి శ్రీ విఠ్ఠలనాథు నాలింగన వందనాదులు జేసికొని "ఓ దేవాదిదేవా! నాభార్య పుత్రసంతానము నపేక్షించుచున్నది. దాని కోరిక దీర్పుడని ప్రార్థించి నిదుర వచ్చుచున్నందున మంటపములో బరుండెను.

శ్రీ పంఢరీనాథుడు దాముసెట్టి స్వప్నమునందు సాక్షాత్కరించి నీకు పుత్రదాన మొసంగితిని. నీవుఉదయము చంద్రభాగలో స్నానము జేయునప్పుడు ప్రవాహము నందొక బాలుడు ముత్తెపు జిప్పలో గొట్టు



నామదేవులు శ్రీ విఠలనాథునకు
నైవేద్యము సమర్పించుట.

కొనివచ్చును. సత్వరమే ఆతనిని గృహమునకు దీసికొనిపోయి గోణా బాయికిమ్ము. ఆ బాలుడుద్ధవావతారుడును, విశ్వోద్ధారకుడును, నానిజ భక్తుడై యున్నాడు ఆతనికీర్తి త్రిభువనములందు వ్యాపించునని” చెప్పి యంతర్ధానుం డయ్యెను.

దామసేటి నిద్రనుండి లేచి స్వప్నమును మననముజేసి హర్ష చిత్తముతో గృహముజేరి స్వప్నవృత్తాంతమును భార్యకు జెప్పెను. పిదప దామసేటి చంద్రభాగా నదికిబోయి స్నానము జేయుచుండెను. ఆ సమయమున ప్రవాహమున నొక ముత్తెపుచిప్ప గొట్టుకొనివచ్చు చుండ దామసెట్టి యమితానందముతో దానిని బుచ్చుకొని తెరచి జూడగా మాతృగర్భమునుండి యప్పుడే జన్మించినటుల సుందరాకారు డగు బాలకుడు గాన్పించెను; దామసేటి మనంబునం దీబాలకునికి స్తన్య పాన మెవరిత్తురని జింతించి నుత్తరీయమును బాలకునిపై గప్పి గృహము నకు దీసికొనిబోయి భగవంతుడిచ్చిన కుమారుడని భార్యకిచ్చెను. ఈశ్వరానుగ్రహమున గోణాబాయి స్తనములనుండి పాలుద్భవించెను, వృద్ధాప్యమున క్షీరముద్భవించుటచే దామసేటియును నాతనిభార్యయు నమితానందమునొంది భగవన్మహిమ విశేషములను వర్ణించుట కెవరి కినీ సాధ్యముగాదని తలచి యాబాలకునికి స్నానముజేయించి క్షీరపాన మిడిరి. పండ్రెండవ దినమునందు శ్రీవిఠ్ఠలనాథుడు సాక్షాత్కరించి దామసేటిని గోణాబాయినిజూచి “నానామమద్ధారకుడగు నీబాలుడు మీ పూర్వజన్మ సుకృత విశేషమువలన పుత్రుడుగ లభించెను. వీనికి ‘నామదేవ’ని నామకరణము నేజేసితి” నని చెప్పి యంతర్ధానుం డయ్యెను. దినదిన ప్రవర్ధమానముగ నామదేవుడు పెరిగి పెద్దవాడగు చుండెను.

ఒకనాడు దామసేటి బట్టల నమ్ముటకై సంతకుబోవుచు భార్యతో “నేను సంతకు బోవుచున్నాను. వస్త్రములన్నియు విక్రయించి సాయం కాలమునకు తిరిగివచ్చెదను. మధ్యాహ్న సమయమున నామదేవునికి




దాముసేటికి ముత్తెపుచిప్పలో నామదేవులు దొరకుట.

బూజా సామగ్రుల నిచ్చి భగవంతునికి నైవేద్యము బంపుము. ఆతడు స్వహస్తములతో భగవంతునికి నైవేద్య మర్పించు ననగా గోణాబాయి యట్లే చేసెదనని చెప్పి మడిగట్టుకొని వంటజేసి పళ్ళెములో పక్వాన్న ములను వడ్డించి నామదేవుని బిలచి "నాయనా! నీతండ్రి సంతకుబో యిరి. భగవంతునికి నైవేద్యమువేళ యతిక్రమించుచున్నది. మడిగట్టు కొని త్వరితముగ నైవేద్యము దీసికొనిబోయి భగవంతుని కర్పింపు"మని చెప్పెను. నామదేవు డానందభరితుడై మడిగట్టుకొని నైవేద్యము పళ్ళెము దేవాలయమునకు దీసికొనిపోయి శ్రీ విఠ్ఠల నాధునకు సాష్టాంగ నమ స్కారముజేసి, చందన, పుష్పాదులతో బూజించి ధూప దీపముల నర్పించి సింహాసనముపై నైవేద్యపు పళ్ళెమునుంచి "ఓ దేవా! పాండు రంగా, తండ్రిగారు సంతకుబోయిరి. తల్లినాతో నైవేద్యము నంపెను. నే నజ్ఞాన బాలకడను. నిన్ను బూజించు విధానము నాకుదెలియదు. కాలమతిక్రమించుచున్నది. త్వరితముగ భుజింపుమని ప్రార్థించెను. నామ దేవుని చిత్తమందు ప్రబలిదినము దాముసేటి సమర్పించు నైవేద్యమును భగవంతుడు భుజించుచుండెనను భావముగలదు., అందుచే నాతడు చేతులుజోడించి "ఓ దేవాదిదేవా! దాముసేటి నీభక్తుడు ఆతడు సం తకు బోవుటచే నాచే జనని నైవేద్యము నంపెను. నీవుభుజింపనిచో నాతల్లినన్ను దండించును. నేనేమి యపరాధము జేసితిని. మరి నీవేల భుజింపవని వెక్కి వెక్కి ఏడ్చుచు శ్రీ విఠ్ఠనాధుని చరణములపై తన శిరమును మోదుకొనబోయెను. నామదేవుని చిత్తమందు శిలావిగ్ర ముగనున్న భగవంతుడెట్లు భుజించునను వికల్పభావన లేనందున శ్రీరు క్మిణీకాంతుడు సాక్షాత్కరించి నైవేద్యమును బూర్తిగా నారగించి నామ దేవునుజూచి "నేను భుజించితినని యెవరికినీ దెలుపకు"మని చెప్పెను. నామదేవుడు భగవంతునియొద్ద ననుజ్ఞ దీసికొని గృహమునకు బోయెను గోణాబాయి నామదేవుడు దేవాలయమునుండి ఖాళీపళ్లెము దీసికొని బోవుటచే నైవేద్యము నేమిజేసితివని యడుగగా నామదేవు డానంద మునతో "ఓ జననీ! శ్రీరుక్మిణీకాంతుడు పూర్తిగా భుజించె"నని చెప్పెను.

ఆ సమయమున దాముసేటి సంతనుండివచ్చి భార్యవలన విషయమం
తయు దెలిసికొని నామదేవునిబిలచి "భగవంతుడు నైవేద్యమెట్లు భుజిం
చెనో నేనుజూడవలెను. మనమిరువురమును గలసి దేవాలయమునకు
బోవుదమురమ్ము. నేను చూచుచుండ భగవంతునిచే మరల దినిపింపు"
మని చెప్పెను.

దాముసేటియును నామదేవులును పూజాసామగ్రులను దీసికొని
దేవాలయములో బ్రవేశించి సాష్టాంగ నమస్కారము జేసిరి. నామ
దేవుడు శ్రీ పంఢరీనాథుని షోడశోపచార విధుల పూజించి, ధూపదీప
నైవేద్యముల నర్పించి "ఓ గరుడధ్వజా! త్వరితముగ భుజింపు"మని పదా
ర్థముల పళ్లెమును భగవంతుని సింహాసనముపై నుంచెను. అంత శ్రీ
రుక్మిణీకాంతుడు, నామదేవులతో "నీతండ్రి వెంట యుండుటచే నేనాతనికి
దర్శనమీయక నీకుమాత్రమే కనబడెద"నని చెప్పగా నామదేవులు,
"ఓ దేవా! నీయందు గపటమున్నది. నాజనకునకు దర్శనమీయనని
చెప్పుచుంటివి ఇంత కృత్రిమస్వభావము తగదని" చెప్పెను. శ్రీ విఠల
నాథుడు హాసవదనుడై దాముసేటికి దర్శనమిచ్చి నైవేద్య మారగిం
చెను. దాముసేటి యానందపరవశుడై నామదేవు నాలింగనముజేసి నెత్తు
కొని "నామదేవా! నీవు మావంశమున పుత్రరూపముతో నవతరించి
నాకు భగవంతుని దివ్యదర్శన మిప్పించితి"వని పలికి నామదేవుని చేయి
బుచ్చుకొని గృహముజేరి గోణాబాయిని బిలచి నామదేవుడు భగవం
తుని కంతరంగభక్తుడని పలికి జరిగిన వృత్తాంతమంతయు నామెకు సవి
స్తరముగ జెప్పెను. గోణాబాయి హర్షచిత్తయై నామదేవుల నెత్తు
కొని ముద్దాడెను.

ఇట్లు కొంతకాలము జరిగినపిదప శ్రీ విఠలనాథుడొక దినమున
దాముసేటికి దర్శనమిచ్చి "బీదర్ నగరములో మిగుల ధనికుడును, భగ
వద్భక్తుడునగు బాబూరావుసేట్ పుత్రికయగు రాజాబాయిని నామ
దేవులకిచ్చి వివాహము జేయుట కేర్పాటు జేసెద"నని చెప్పి భగవంతు
డొక శ్రీమంతుని వేషముధరించి బీదర్ నగరము జేరి బాబూరావు

కుమార్తెను నామదేవుల కిచ్చుటకు మాట్లాడి తనయాజమాన్యమున వివాహము మిగుల వైభవముగ జరిపించెను. కొన్ని దినములైన పిదప నామదేవులకు కుమారుడు గలిగెను. బారసాలకు శ్రీ పంఢరీనాథుడు వస్త్రాభరణాదుల దీసికొనివచ్చెను. గోణాబాయి భగవంతునికి వందనములు జేసి "ఓ దేవా! నామదేవుల పుత్రునికి మీరు నామకరణము జేయుడని" కోరగా భగవంతుడా బాలునకు 'నారాయణు' డని నామకరణము జేసెను. బంధువులును బ్రాహ్మణులును వచ్చిరి, పుణ్యాహవాచనము జరిపిన పిదప నామదేవులకును రాజాబాయికిని భగవంతుడు నూతన వస్త్రములిచ్చి దేవాలయమున కేగెను. కొన్ని దినములైనపిదప గోణాబాయి యొకనాడు నామదేవులతో "కుమారా! మీ తండ్రియు నేనును వృద్ధులమైతిమి. నీ వహర్నిశములు హరిచింతన జేయుచు క్షణకాలమైనను దేహభ్రాంతి లేక హృదయమున శ్రీవిఠ్ఠలనాథుని నిలుపుకొంటివి. సంసారములో నున్నంతవరకు ధనార్జనమావశ్యకము. నీభార్యాబిడ్డ లన్నవస్త్రాదులకిబ్బందిపడుచుండజూచియూరకొనుచుంటివిఅశక్తులమగుమేమింకేవిధముగ శ్రమజేసి ధనమార్జింపగలము. భగవద్భక్తులెందరో ప్రపంచమును పరమార్థమును సాధించిరి. నీ నడవడి విపరీతముగనున్న" దన నామదేవులను తాపముతో గూడినవాడై దేవాలయమున బ్రవేశించి భగవంతుని కెదుట నిలచి "ఓ పంఢరీనివాసా, శ్రీహరి! నన్ను దుఃఖరూపమగు భవసాగరమున బడవేసెదవేల!" యని యడుగగా శ్రీ పంఢరీనాథుడు నామదేవుల నాలింగనముజేసికొని "వత్సా! నీ కెవరివలన నిట్టి చింతగలిగినదని విచారింప నామదేవుడు "ఓ దేవాదిదేవా! నేను సర్వకాలములయందు నిన్ను భజించుచుండుట నాతల్లికిష్టములేదు. ఆమె నన్ను ప్రపంచవ్యవహారములలో దగుల్కొని ధనమార్జించి కుటుంబపోషణ జరుపుమని కోరుచున్న" దని చెప్పెను. శ్రీ విఠ్ఠలనాథుడు హాసవదనుడై "నామదేవా! నీవు నన్ను భజించుచుండిన మాయామోహము లెట్లుబాధించును. నీవు పూర్ణముగ నాయంశ సంభూతుడవు నేను నీ స్వరూపుడను. సూర్యుడును నాతని కిరణములును నభిన్నముగ నున్న

ట్లును, దీపమును ప్రకాశము యభిన్నముగ నుండునట్లును, చక్కెరయు మాధుర్యమును, రత్నమును దానిజ్యోతియు, తీర్థమును గంగాజల మును, సువర్ణమును నలంకారమును, వేరుకానట్లు నీవును నేనును వేరు కాము. గంటనుండి నాదము బయలుదేరి తిరిగియందు లీనమగునట్లు నీవునాలోగలసి ద్వైతభావమును ఖండనజేసికొనవ”ని చెప్పెను.

అంత నామదేవుడు “ఓ హృషీకేశా! ఈ జ్ఞానము నాకేల జెప్పెదవు. నీనామము నావాక్కునందాలాపింప బడుచుండ సంసారదుఃఖము నన్నేమిజేయును. హృదయమున నీరూపము ప్రతిబింబించుచుండ భవతాపమెట్లుకలచును. జననీ జనకులు నీవైయుండ నన్ను సంసారతాపమెట్లు శాధించును. నీవు దేవుడవుగను నేనుభక్తుడనుగను, నేను నీనామ సంకీర్తన నఖండముగనోటితోజేయునట్లును అనంతజన్మలవరకిట్లు జరుగవలెను. మోక్షసుఖమునందు నాకిచ్ఛలేదని పలుక భగవంతుడు రుక్మిణీ దేవిని జూచి నామదేవునకి సగుణస్వరూపమునందు ప్రేమ లయమై యున్నది నేనధ్యాత్మజ్ఞానము బోధింప నతనికి సమాధానము కాలేదని చెప్పి నామదేవునాలింగనము జేసికొని “నామదేవా! నీ గృహ పరిస్థితులెట్లున్నవి సంశయింపక దెలియజేయుమని” యడుగగా నామదేవుడు భగవంతునికి వందనములు జేసి “ఓ దేవా! నీ ప్రసాదమువలన నానాకేమియు గొదువలేదు. నీకు వైకుంఠ భవనమున్నది మాకు జీర్ణమగు పర్ణశాలయున్నది. అష్టసిద్ధులు నీయొద్దనున్నవి. దరిద్రము మా యొద్దనున్నది. నీవమూల్య పీతాంబరములను ధరించుచున్నావు. నాదారపుత్రులకు జీర్ణవస్త్రమైనను లేదు. నీవు బంగరుపళ్లెరములో భుజింతువు. మేమాకులలో భుజింతుము. నీ భవనములో రూప్యసువర్ణము లఖండముగానున్నవి. మా హృదయమునందు నీ నామమున్నద”ని పలుక మధుసూదనుడానందించెను.

నామదేవుల భార్య గృహమున జింతించుచు నోణాబాయితో “ఓ అత్తా! ధరించుటకు వస్త్రమును భుజించుట కన్నమును లేక నానా విధములగు దరిద్రమును భోగించుటకు మీ గృహమునకువచ్చితిని. నీ

కుమారుడెన్నటికినీ శ్రీ విఠ్ఠలనాథుని సేవాభక్తులనుండి విముఖుడుగాడు. మీరు వృద్ధులైతిరి. ధనాదాయము వచ్చుమార్గములేదు. గృహస్థధర్మము సక్రమముగ నెట్లు జరుగు"నని చింతించెను. రాజాబాయి గృహమున చింతించుచుండ శ్రీ పంఢరీనాథునికి కృపగలిగి నామదేవులకు దెలుపక కేశవశెట్టి యను పేరుగల వర్తకుని రూపముధరించి ద్రవ్యమును రత్నములను నొకసంచిలో వేసికొని గరుత్మంతుని వృషభరూపునిగజేసి నామదేవుని గృహమెక్కడ యని ప్రజల నడుగుచుబోవుచుండెను. గ్రామస్థులాతనినిజూచి నవ్వుచు తిండిలేక నామదేవుని దారపుత్రాదులు పీడింపబడుచుండ ఆతని గృహమునకు బోవుచున్నాడని పరిహసించుచుండిరి. ఎగురుచున్న పతాకమును తులసి బృందావనమును గలిగిన యాజీర్ణకుటీరమే నామదేవుల గృహమని ప్రజలవలన కేశవశెట్టి తెలిసికొనినామదేవుల గృహములో ప్రవేశించి రాజాబాయినిజూచి "తల్లీ! నామదేవుడెచటనున్నాడని విచారించుచు గూర్చుండెను.

అంత రాజాబాయి చింతాక్రాంతురాలై పీడెవడో తిండికొరకు జేరినాడని దలచి నామదేవుడింటిలో లేడు. తిరిగి పొమ్మని చెప్పెను. ఇరుగుపొరుగుస్త్రీలచ్చటకువచ్చి రాజాబాయితో "అమ్మా! ఆతడు మీ బంధువుడా?" యని యడుగగా రాజాబాయివారితో "తల్లీ! బంధువులకేమి తక్కువయున్నది. నిత్యము తిండికొరకెందరో వచ్చుచుందురు. నా భర్త లౌకికలజ్జావమానములను త్యజించి భేదాభేదములను విడచి, హృదయమునందు యదునాయకుని నిలపి దేవాలయములో నృత్యకీర్తనలు జేయుచుండును. గృహమున నన్న సామగ్రులేమియును లేవు. బిడ్డలును నేనును నఖండముగా దరిద్రస్థితి ననుభవించుచున్నాము. మేము తిండిలేక పస్తులుండ నిటువంటి పెద్దలెందరో నిత్యము దర్శనమిచ్చుచుందు" రని చెప్పెను. భగవంతుడు రాజాబాయి కఠోరముగ బలికిన పలుకులువిని "అమ్మా! నేను నామదేవుని బాల్యమిత్రుడను. నన్ను కేశవశెట్టియని బిలతురు. నామిత్రు డన్నవస్త్రాదులులేక మిగుల దుఃఖస్థితియందున్నాడని విని ఆతనిని సత్కరించుటకై రత్నములను ద్రవ్యమును

దెచ్చితి'నని పలికెను. రాజాబాయి వర్తకునిమాటలువినిసన్నానవాక్యముల బలుక భగవంతుడు హాసితవదనుడై రాజాబాయితో "తల్లీ! ద్రవ్యము దెచ్చితినని వినివపిదప మొదట బలికిన నిష్ఠురవాక్యముల నాపి గౌరవ వచనములు బలుకుట కారంభించితివి. నేను రిక్తహస్తములతో వచ్చె దనా? వివాహామునకు బోవునపుడును, రాజదర్శనమున కేగునపుడును, కన్యాసోదరీ జనముల జూడబోవునపుడును, తీర్థక్షేత్రముల దర్శనమున కును, రిక్తహస్తములతో బోగూడదు. శక్త్యనుసార మధమపక్షము తులసీదళమైనను దీసికొని పోవలెనని శాస్త్రములు దెలుపుచున్నవి. అతి దరిద్రుడగు కుచేలుడు సహితము శ్రీకృష్ణభగవానుని దర్శనమునకు బోయినప్పుడు రిక్తహస్తములతో బోక భావపూర్వకముగ నిడికెడటు కులు దీసికొనిబోయి సమర్పించెను. జను లాశాబద్ధులైయున్నారు. నేనును వారిభావము ననుసరించి ప్రవర్తింతును. నామదేవుడు నిర పేక్షుడై భగద్భజన జేయుచున్నాడు. అతనికిని నాకునుగల స్నేహాసంబం ధముచే నాశక్తికి దగిన సన్మానము దెచ్చితి"నని చెప్పి ద్రవ్యమును రత్న ములుగల సంచిని రాజాబాయిచేతికిచ్చి "అమ్మా! నేను వచ్చినట్లు నామదేవులకు జెప్పు"మనగా, రాజాబాయి "అయ్యా! నేను నిష్ఠుర వాక్యములు పలికి నందులకు కించిన్మాత్రమైనను కోపింప వలదు. తాము భోజనముచేసి వెళ్లుడని" చెప్పగా, "తల్లీ! నేను నామదేవులను విడచి భుజించని వైకుంఠనాథుడు పలికి యచటనుండి బయలుదేరి దేవాలయ మున బ్రవేశించి జరిగిన వృత్తాంతమంతయు శ్రీ రుక్మిణీ దేవితో జెప్పెను.

రాజాబాయి యానంద భరితురాలై సంచిలోని ద్రవ్యమును గొంత దీసికొని బజారునకుబోయి వలయు వస్తుసామగ్రుల ఖరీదుజేసి గృహామునకు దీసికొనిపోయెను. గోణాబాయి గృహామున తినుబండార ములు లేనందున బంధువుల గృహాములో ధాన్యమును బదులు దెచ్చు టకై గ్రామములోనికిబోయి ధాన్య సేకరణ జేసికొని గృహామునకు తిరిగి బోవుచుండెను. తత్పూర్వమే నామదేవుని కఠినముగ దుర్భాష

లాడినందున నాతడేడ్చుచు దేవాలయమునకు బోయెను. గోణాబాయి నామదేవుని సమాధానపరచి బోవుటుచితమని దలచి మహాద్వారములో బ్రవేశించి సాష్టాంగ నమస్కారము జేసి గర్భాలయములో జేరెను. నామదేవులు తల్లివచ్చుటజూచి కోపించునని భయపడి దేవుని వెనుక భాగమున దాగియుండెను. గోణాబాయి భగవంతుని కెదురుగ నిలచి "ఓ జగజ్జేత! నామదేవుని నీ సన్నిధి యందుంచుకొని వాని సంసారమును నాశనము జేసితివి. నీ సాంగత్యమువలన నాతడు పనిపాటలు చేయక విషయోపభోగములను మాయా మమతలను త్యజించి నీ చరణార విందముల దృఢముగా నాశ్రయించెను. మా సంసారస్థితి జూచి బంధువులు నవ్వుచున్నారు. నీ వద్వైతబోధ జేయుటచే నామదేవుడు దేహబుద్ధిని విడచి సమాధి సుఖమును భోగించుచున్నాడు. పూర్వము నిన్నాశ్రయించిన వారిని నీవలె జేసికొంటివి. వారలు తిరిగి ప్రపంచ వ్యవహారములలో బ్రవేశించుట కనివిని యెఱుగము. నేను దేవాలయములో బ్రవేశించుట జూచి నామదేవుని నీ వెనుకదాచితివి. గృహములో రాజాబాయియును బిడ్డలును నన్నవస్త్రాదులులేక విలపించుట నీకు గనికరము లేకున్నది. మాకుటుంబమును నాశనము జేయుటకై నామదేవుని నీ స్వాధీనమున నుంచుకొంటివి. ఓ రుక్మిణీరమణా! నీ చర్యలు సర్వజనులకు దెలిపెదను. నానావిధములగు కష్టములకోర్చి నామదేవుని బాల్యమునుండి పోషించి పెద్దవానినిగా జేసి వృద్ధాప్యమున మాకుసుఖము లేకుండ మమ్ముల హీనస్థితికి జేర్చితివి. నీవు స్వలాభపరుడవు. కుచేలుడు పిడికెడటుకు లిచ్చిన పిదప వానికి హేమపురము నిచ్చితివి. నీ కేమైనను నీయనిది నీవెవ్వరికినీ నేమియు నీయవు. రావణుడు బలాఢ్యుడని విభీషణుని నీపక్షము జేర్చుకొని గుట్టంతయు గ్రహించి లంకాదానము జేసితివి! కష్టస్థితియందున్న ద్రౌపది నీకాకుకూర నర్పింప దానిని స్వీకరించి పిదప ఋషులకు భోజనమిడి నీ యౌదార్యమును జూపితివి. ఇట్టి యవగుణములు గల నిన్నాదిశేషుడు సుగుణవంతుడనియసత్యముగా స్తుతించుటచే వానినాలుకలు జీలిపోయెను. నేనభిమానముతో నింటి దేవుడవని బూజించుటచే నీకు దేవత్వము నిలచినద"ని కఠోరముగ బలికెను.

గోణాబాయి ఈవిధముగ కఠోరవాక్యములు బలుక శ్రీ విఠల నాథుడు హాసవదనుడై "గోణాబాయీ! వ్యర్థముగా గోపముతో కఠోర వాక్యములను బలికితివి. విదేహియైన నీకుమారుని నేను నిర్బంధముగ బంధించితినా? నీపుత్రుని నీస్వాధీనము నందుంచుకొనక నితరులతో పోరాడిన ఫలమేమి? నీబిడ్డయందు ప్రేమ చెడకుండ నన్ను నశబ్దములతో నిందించితివి. నావలన దోషమేమియును లేదు. నీపుత్రునిప్పుడే వెంట దీసికొనిపొమ్ము. నేనజుడను నవ్యయుడను, గుణాతీతుడనై యుండియు నామదేవునిపై గల ప్రేమచే సగుణస్వరూపుడనైతిని. నామదేవులకు నా యందత్యంత ప్రేమయున్నది. నీవు నాతో గలహించుట యుక్తము కాదు. వృక్షము ఫలించినపిదప తోటమాలి ఫలములనుగోసి తానను భవింపజాలడు. అవి ఇతరులపాలగును. జగదాకారుడనగు నేను వృక్ష మునై యున్నాను. ప్రేమభక్తుడగు నామదేవుడమృత ఫలమైయున్నాడు. తోటమాలివలె నీవువచ్చి ఫలమును ద్రుంచి వేయుచుంటి"వని చెప్పెను. అంత గోణాబాయి "ఓజగజేరీ! బహు న్యాయశాలివలె మాటలాడుచు నాబిడ్డను నాకు దూరము జేయుచుంటివి. నానావిధముల కష్టపడి రైతు సేద్యము జేసి ధాన్యమును పండించగా రాజు పన్నులను పేరుతో దోచు కొనునట్లు నామదేవుని నేబెంచి పెద్దవానిగ జేసినపిదప నీవాతనిని స్వాధీన పర్చుకొంటివని పలికెను.

శ్రీపంఢరీనాథుడు గోణాబాయి పలుకులువిని మంచిమాటలతో నామెను సమాధానపరుపనిచో నిశ్చయముగ నపకీర్తి కలుగునని దలచి గోణాబాయితో "నీసుకృతము శ్లాఘనీయమైనది గనుక నే ప్రేమభక్తుడు పుత్రుడుగా జన్మించెను. దైత్యవంశము నందు ప్రహ్లాద భక్తుడు జన్మించి నటుల, సరస్వతీ కమలోద్భవులకు మహాభక్తుడగు నారదుడు జన్మించి నటుల, సభాగ్యులగు నీకును దాముసేటికినీ నామదేవుడు పుత్రుడై జన్మించెను. చప్పన్నకోటి యాదవులలో నుద్ధవుడు శ్రేష్ఠుడైనట్లును, సిద్ధులలో ననసూయానందనుడు శ్రేష్ఠుడైనట్లును, భక్తులలో నామ దేవుడు శ్రేష్ఠుడు. నీవాతనికి స్తన్యపానమిడి బెంచి పెద్దవానిగ జేసితివి.

నీభాగ్యము యెవరు వర్ణింపగలరు. భోజనము జేయునప్పుడు పుత్రుని పంక్తిలో కూర్చుండి యానందముతో భుజించు మహాభాగ్యశాలివి, నీతో సమమగు పుణ్యాంగన త్రిలోకములందును లేదనెను. అంత గోణాబాయి: "ఓ జగజ్జీవనా! విశ్వవ్యాపకా! మనమోహనా! నా కుమారుడు నీ భజనజేయుచున్నను సరియేగాని అతడు నా స్వాధీన మందుండ వలెనని కోరగా భగవంతుడుమహాసవదనుడై "ఓగోణాబాయీ! నామదేవుడు ప్రపంచవ్యవహారములలో కష్టపడుట నేను సహింపజాల నని" చెప్పి మౌనముగ నుండెను. గోణాబాయి విషయము గ్రహించి "అన్నిటికంటె శ్రేష్ఠమైనది తర్కజ్ఞానమని సజ్జనులు బలికెదరు; పదు నాల్గు విద్యలభ్యసించినను, సకల చాతుర్యములతో గూడియున్నను, తర్కజ్ఞానము లేనియెడల వ్యర్థమగును. రాజసభలయందు పాండిత్యము నకును, న్యాయనీతి విచారణకును, సభనుచూచి మాటలాడుటకును తార్కికజ్ఞానముండవలెను. పాత్రనుచూచి దానముజేయుటయు, రోగిని జూచి ఔషధము నిచ్చుటయు, సభనుజూచి కీర్తనజేయుటయు. నత్యా వశ్యకమని" యోచించి, భగవంతుడు మౌన మవలంబించుటచే రాధా రుక్మిణీ సత్యభామలను బిలచి, "అమ్మలారా! నా వచనములను వినుడు. మీభర్త దీనదయాళుడని శ్రుతిశాస్త్రములు వర్ణించుచున్నవి. నాకు లేక లేక ఒకడే కుమారుడు జన్మించుటయు, వానిని విదేహినిగా జేసి సర్వకార్యముల యందును సన్నిధిని సేవాకీర్తనలు జేయించుకొని తానే మియు నెరుగనివానివలె మౌనముగనున్నాడు. అతడు జేయు పనులెంత యుక్తములో మీరాలోచించుకొనుడు. మేము దుర్బలులము, అనా థులము, దీనులము; అన్నవస్త్రాదులులేక దుస్థితి ననుభవించుచున్నాము. నాకుమారునిచట నుంచుకొనుట తగదని మీ నాథునికి దెలుపుడు. ఎందరో గొప్పగొప్ప దేవతలను జూచితిని. మరియు వారల కీర్తిని వింటిని కాని యిట్టి యగోచరుడగు కపటనాటక సూత్రధారిని నేనెచటను జూచియుండ లేదు; కులదేవుడని యభిమానముతో నిత్యము పాదముల పైబడి నమస్కరించుచున్నాము కాని యాతడు తన దుష్టస్వభావమును మాపై జూపుచున్నాడు; నేను గౌరవ మర్యాదలతో నేటి వరకూరక

కుంటిని. ఇక దప్పక నమర్యాద పొందగలడు. తల్లులారా! నేను జెప్పినది వింటిరిగదా మీ భర్తకు బుద్ధిచెప్పి యాతని మనోగతమేమో దెలిసి కొనుడని" చెప్పెను.

గోణాబాయి భగవంతుని వెనుక దాగియున్న నామదేవుని జూచి "ఓరీ! ఏమిరా! చాటున దాగియుంటివి. హృషీకేశుడు జూచుచుండగ నేనిన్ను బలత్కారముగ నీడ్చుకొని పోయెదను. నీవు సంసారమునందు దొంగవైతివి. జగన్మోహన డగు శ్రీవిఠ్ఠలుడును దొంగయే. పుండలీకుడు వీనికి గదలకుండ నిలుచుండుమని శిక్ష విధించెను. నిన్నిచ్చటనుండి దీసి కొనిపోవుట నిశ్చయమని" చెప్పి శ్రీవిఠ్ఠలనాథుని జూచి "ఓరీ! లీలా నాటక సూత్రధారీ! జాగ్రత్త! నిన్ను దేవాలయము నుండి బైటకు దరిమెదను. నాకుమారుని నాకప్పగించి శాశ్వతకీర్తిని బొందుము. మా దుస్థితిని దెలిపి ఎంత ఏడ్చినను నిమనస్సు గరుగకున్నదని చెప్పెను. భగవంతుడు గోణాబాయితో "వ్యర్థముగ నాయందు దోషముల నారోపించెదవేల ? నీకుమారుని గృహమునకు దీసికొని పొమ్మని చెప్పి నామదేవుని చేయి బుచ్చుకొని యామె కప్పగించెను.

గోణాబాయి నామదేవుని వెంటబెట్టుకొని మార్గమున బోవుచు "నామదేవా! నీకు కొంచమైనను బుద్ధిలేకున్నది. అతి వృద్ధులమగు మేము నీభార్యాబిడ్డల కన్నవస్త్రాదులను కల్పించుటకెన్నియో ఇక్కట్లు పడుచుండ కొంచమైనను దెలిసికొనక ప్రపంచవ్యవహారములను త్యజించి శ్రీ పండరీనాథుని సన్నిధియందుండుట యుక్తమా ?" అని పలుక నామదేవు డధోముఖము ధరించి నేత్రములనుండి యశ్రుధారలు విడచుచుండెను. గోణాబాయి నామదేవుని వెంటబెట్టుకొని గృహము జేరెను. రాజాబాయి నానావిధములగు పక్వాన్నములను భక్ష్యములను దయారు జేయుచుండెను. గృహమునవంటపాత్రలను, భోజనసామగ్రులను వస్త్రాభరణములుండుటను జూచి పాశమున దగుల్కొనిన లేడి తబ్బిబ్బగునట్లును, గాలివలన దీపము తేజోహీనమై గంపించునట్లును, గ్రహణ

కాలమున సూర్యుడు కాంతిహీనుడగునట్లును, దక్షిణవాయువుచే మేఘములు దిగంతరమునకు బోవునట్లును, పరాజయమునొందిన రాజుద్విగ్నచిత్తుడగునట్లును, ననుష్ఠానమున గూర్చుండియుండి యున్న శ్రీశుకుడు రంభను జూచి ననహ్యపడినట్లును, నామదేవు వ్యాకులచిత్తుడై, ఐశ్వర్యమెచటనుండి వచ్చినదని తల్లిని విచారించగా గోణాబాయి నాకు తెలియదని చెప్పెను.

రాజాబాయి నామదేవులతో "నాథా! భోజనమున కాలస్యమైనది. త్వరితముగా రండని" పిలువగా నామదేవుడు విస్మయముతో "నేడుగృహమున ధనధాన్యాదులుండుట వలన భార్య నమ్రవచనములు బలుకుచున్నద"ని భావించి ద్రవ్యహీనుని బంధువులు శత్రువులుగా దలచి బరిహసింతురు. పురుషుడు ద్రవ్యహీనుడైనచో నాతని భార్యయు పుత్రులును నిర్లక్ష్యముగా జూతురు. ద్రవ్యమున్నంతవరకు లోకమున గౌరవ మర్యాదలన్నియు నుండును. విషమ కాలమునందెవ్వరును సహాయపడరని" తలచి ద్రవ్యమెచటనుండి తెచ్చితివి దెలుపుమని రాజాబాయి నడుగ నామె మానమవలంబించెను. అంత నామదేవు గృహమున దాస్యము చేయుచున్న భక్తురాలగు జనాబాయిని బిలచి ద్రవ్యమెచటనుండి వచ్చినదని విచారించెను, జనాబాయి నామదేవునికి సాష్టాంగ నమస్కారము జేసి "స్వామీ! రాజాబాయి గృహమున దుఃఖించుచుండ కర్నాటకలింగాయతుని వేషముతో నొకగృహస్థువచ్చి తన పేరు కేశవశెట్టి యనియు నామదేవు నాపరమ మిత్రుడనియు జెప్పి నా మిత్రుడగు నామదేవుని కుటుంబము అన్నవస్త్రాదులులేక దుస్థితియందున్నారని విని సన్మానముగా ద్రవ్యము దెచ్చితినని చెప్పి ద్రవ్యపు సంచిని రాజాబాయి కిచ్చి ఆతడిప్పుడేపోయె" నని చెప్పెను.

నామదేవుడు నేత్రములనుండి ఆనందాశ్రువులు విడచుచు "ఓ పతితపావనా, భక్తవత్సలా, కరుణాసింధో, జగజ్జీవనా, శ్రీవిఠ్ఠలా, నీవజితుడవు, అవ్యయుడవు, మాయాతీతుడవు, నిరామయుడవు అనాథ

నాథుడవు నాకొరకు మిగుల కష్టపడితివి. యోగసాధనలు జేయువారికి దుర్లభుడనగు నీవు కేశవశెట్టియను వర్తకుని వేషమును ధరించితివి. నేను నిన్ను గోరనిది నీవేల యీ ధనమును దెచ్చితివి. ధన సంపదలను గోరు కాముకభక్తులకీధనము నిచ్చిన వారలు సంతసింతురు. సాగరమున వర్షము బడుటవలన ప్రయోజనముండనట్లు నాకీ ధనమువలన ప్రయోజనమేమి? బుద్ధి సిద్ధులును, రాజ్యసంపదయును, సాలోక్యాది చతుర్విధ ముక్తులును త్యజించి దివారాత్రములు నీ నామస్మరణనే జేయుచుంటిని. తీర్థవ్రత జప తపానుష్ఠానములెరుగని నాకీ ఐశ్వర్యము నేల నిచ్చితివని ప్రార్థించి, గ్రామమునగల దీనజనులను బిలిపించి యింటి యందున్న వస్త్రాభరణములను, భోజన సామగ్రులను దానముజేసి యుపాధి రహితుడై సద్భావముతో పురుషోత్తముని భజించుచుండెను.

మహాభక్తుడును, నయోని సంభవుడును నుద్ధవుని యవతారుడగు శ్రీనామదేవుని ప్రేమభక్తి వర్ణించుటకు బ్రహ్మాది దేవతల కసాధ్యము. జ్వరముతో నున్నవానికి బక్వాన్నములు రుచింప నటుల దారపుత్రాది ప్రపంచ మోహములలో దగుల్కొన్నవారికి భక్తుల సచ్చరిత్రలు రుచింపవు. నిష్కాములగు భావుక జనులకు భక్తుల సచ్చరిత్రుల యందత్యంత ప్రేమ యుండును. తమోగుణయుక్తులగు నభక్తులకు భక్తచరితములయందు విముఖత్వముండును. కాకికి మాంసాహారము కావలెను కనుకనే యది క్షీరసాగరమునకు బోజాలదు. అటులనే యభక్తులకు భక్తుల మహాత్మ్యము లసత్యముగ దోచును. సత్వగుణప్రధానులు వికల్పనలులేక సప్రేమతో శ్రవణముజేయుదురు.

పరమ పవిత్రమగు శ్రీనామదేవుల సచ్చరిత్ర భావపూర్వకముగ శ్రవణ పరనాదు లొనర్చిన శ్రీరుక్మిణీరమణుడు వారిని సర్వవిధముల గాపాడి తన సాయుజ్య మనుగ్రహించును.

నాలుగవ అధ్యాయము సమాప్తము.

శ్రీ పాండురంగాయ నమః

# కబీర్దాసు చరిత్ర

## —♦ ఐదవ యధ్యాయము ♦—

శ్రోతృజనులారా ! అతిపావనమైన భక్త చరితమును సావధానముగ శ్రవణముజేయుడు. భక్తుల సచ్చరిత్ర లుపమాన రహితములై యమృతమునకంటె మిగుల పవిత్రము గలవియును సముద్రమునకంటె మిగుల గాంభీర్యమును, కల్పవృక్షమున కంటె మిగుల యౌదార్యమును, చంద్రునికంటె మిగుల శైత్యమును, రత్నమునకంటె మిగుల ప్రకాశమును గలవై యున్నవి. భక్తుల మాహాత్మ్యమును పంచవదనుడు గానము జేయుచుండును. ఇంద్రాది దేవతలకు సహితము దుర్లభమైనవియు, పరమ పవిత్రము లైనవియును, భక్తుల సచ్చరిత్రలు గతాధ్యాయమునందు చంద్రభాగానదిలో నామదేవు ముత్తెపు చిప్పలో నయోని సంభవుడై దాముసేటికి దొరకుట వినియుంటిరి. రెండవ ముత్తెపుచిప్పలో శ్రీశుకావతారుడును, మహాయోగియు నయోని సంభవుడును నగు బాలకుడు గంగానదీ ప్రవాహములో గొట్టికొనిపోవుచు పరమ పవిత్రమగు శ్రీ కాశీక్షేత్రము లోని మణికర్ణికాఘట్టముజేరెను.

వారణాసి క్షేత్రమునందు పరమభావుకుడును, శ్రీరామభక్తుడును, మ్లేచ్ఛ కులస్థుడునగు తమాల్ మోమీన యను గృహస్థు డుండెను. ఒక దినమున నాతడు గంగానదికి బోగా నాకస్మికముగ మణికర్ణికా ఘట్టములో ప్రవాహమునందు ముత్తెపుచిప్ప గొట్టుకొనివచ్చుటను జూచి త్వరితముగా నదిలోనికి దిగి ముత్తెపు చిప్పను బట్టుకొని దానిని దెరచి చూచెను. అందు మాతృగర్భమునుండి యప్పుడే జన్మించిన శిశువువలె బాలకుడొకడు రామ రామ యని భగవన్నామము నుచ్చరించుచుండెను. తమాలు అప్రయత్నముగ దొరకిన యాబాలకుని జూచి ఆనందభరితుడాయెను. కూపజలమునకై ప్రయత్నించుచుండ క్షీరసాగరము గనబడినట్లును, యమపురిని జూడబోయిన వానికి వైకుంఠము దృష్టి కగపడినట్లును, డప్పువాద్యము వినబోయినవానికి హరికీర్తన విన

వచ్చినట్లును, వోరుల సాంగత్యము జేయువానికి సద్గురువు దర్శనము లభించినట్లును, సహజముగ గంగానదికి బోయిన తమాల్ నకు జగద్గురువును, విశ్వోద్ధారకుడును, మహాయోగియును, (శ్రీ) శుకాంశ సంభూతుడగు బాలకుడు దొరకెను.

తమాల్ సత్వరమే యాబాలకుని గృహమునకు దీసికొనిబోయి యమితోత్సాహముతో భార్యను బిలచి "ముప్పదిరెండు సులక్షణములు గలిగి లావణ్య భరితుడగు నీబాలకుడు గంగాప్రవాహములో లభించెను. వీనిని బహుజాగరూకతతో బోషించు చుండుము" పలుక యామహా పతివ్రత యొప్పుకొనెను. ఆసమయమున ఈశ్వర కృపచే ఆమె స్తనముల నుండి క్షీర మూద్భవించెను; తమాలును నాతని భార్యయు నమితానంద మొంది యాబాలకునికి స్తనపానమిడి పోషించు చుండిరి. అవింద వంశమునందు జన్మించిన ఆభక్తునికి కబీరని నామకరణము జేసి యపార ప్రేమతో బెంచుచుండిరి.

ఆ బాలకుడు భగవన్నామస్మరణ జేయుచుండుట జూచి సర్వజనులు నాశ్చర్యముతో తమాలేమిపుణ్య మొనర్చెనో తపోనిధియును, వైష్ణవుడును, నగు నీ బాలుడు పుత్రుడుగ లభించెను, దైవబలము సానుకూలముగనున్నప్పుడు విద్యా బల మనవసరమగునట్లు, నీచయోని యందు దుష్టుడు జన్మించినను, వాని ప్రారబ్ధవిశేషముచే నెల్లరును నమస్కరింతురు. అట్లే తమాల్ భాగ్యమఘటితమైనందున విష్ణుభక్తుడు లభించెనని వారణాసి క్షేత్రమున సర్వజనులును పరస్పరముగ జెప్పుకొనుచుండిరి.

కబీరు దినదిన ప్రవర్ధమానముగ పెరిగి పెద్దవాడయ్యెను. జననీజనకు లతనికి సుగుణవతియను కన్యకనువివాహము జేసిరి. కబీరునకు తల్లిదండ్రులు ప్రపంచ వ్యవహారము లెన్నివిధముల బోధించినను నాతని చిత్తము ప్రపంచ వ్యవహారములలో దగుల్కొనదయ్యె. ఆతనికి తనది, పరులదను సమవిషమ భావములు లేకుండెను. రాజునందును దరిద్రుని యందును సమభావమేర్పడెను; ద్రవ్యమెదుట గనబడినచో దీసికొనవలె

ననుకోరికయు, తనద్రవ్యమును దస్కరు లపహరించకుండ భద్రముచేయు దలంపును లేక శ్రీరామ భజన జేయుచుండ నగరమునగల దురాచారు లిదిచూచి పరిహసించుచుండిరి. అగ్నికిని జలమునకును, వేశ్యకును పతివ్రతకును, కృపణునకును, నుదారునకును, నిందకునకును, బుద్ధిమంతునకును, రాహువునకును, చంద్రునకును, పతంగమునకును, దీపమునకును, నగస్యునకును, సముద్రమునకును, ప్రేమ సఖ్యాదులుండవు. శ్రీకృష్ణుని చరిత్ర వినుటకు శిశుపాలునికినీ, రాముని ప్రతాపము వినుటకు రావణునకును, ఇచ్ఛలేకుండునట్లును; అమృతమునకును విషమునకును అఖండవైర ముండునట్లును, వ్యవహారిక జనులకును పరమార్థపరులకును సదా వైమనస్య ముండును. జననీజనకులు కబీరును జూచి "కుమారా! నీవు హృదయమున శ్రీరాముని నిలుపుకొని విదేహస్థితి యందుండినచో ప్రపంచ వ్యవహారము లెట్లు జరుగునని చెప్పి యాతనిని బలత్కారముగ బట్టలునేయు మగ్గమువద్ద గూర్చుండబెట్టి వస్త్రము నేయుమనిరి.

కబీరు నేత్రములు మూసికొని శ్రీరాముని మనమున నిల్పి దేహభ్రాంతి రహితుడై యుండెను. కబీరు తల్లి యాసమయమున నచటికివచ్చి విదేహియై యున్న పుత్రుని జూచి క్రోధముతో "ఓరీ, కబీరూ! ఏమిచేయుచుంటి"వని కేక వేయుగా కబీరు జాగరూకుడై తల్లి కొట్టునను భయముతో వస్త్రము నేయుట కుద్యుక్తుడాయెను. కొంత సేపటికి తిరిగి కబీరు పరవశుడై రామనామస్మరణ జేయుచుండ కోదండపాణిచూచి "ఈతడు నా నామస్మరణ జేయుచున్నాడు. వీని తల్లి జూచిన దండించు"నని తలచి కబీరు వెనుకభాగమునందు తాను గూర్చుని వస్త్రము నేయుచుండెను. క్షీరసాగర విలాసియు బ్రహ్మాండ నాయకుడును, యోగీశ్వరుల ధ్యానమునకు గోచరించనివాడును, శ్రుతిశాస్త్ర పఠనాదుల కలభ్యుడును, సనకాదుల ధ్యానమునం దహర్నిశ ముండువాడును, సముద్రతనయచే సేవింపబడువాడును, నీలగ్రీవ ప్రియభూషణుడును, నగు శ్రీరామచంద్రమూర్తి వస్త్రము నేయుచుండెను. అంత

కబీరుజాగరూకుడై వస్త్రము నేయుచుండ భగవంతుడు దూరముగ గూర్చుండి చూచుచు ఆతడు తన్మయుడై యున్న సమయమున తాను వస్త్రమును నేయుచు తన్మాకరిని విడచి, యొకరు నేయుచుండిరి. గంగా సరస్వతీ జలముల భేదమైనట్లు దేవభక్తులిరువురను భేదములేక వస్త్రము పూర్తిగ నేయబడెను.

కబీరు వస్త్రమును తల్లికిచ్చెగా నామె సంతకుబోయి విక్రయించి ద్రవ్యము దీసికొనిరమ్మని చెప్పెను. కబీరు వల్లెయని చెప్పి వస్త్రమును దీసికొని సంతకుబోయి యొకచోట గూర్చుండి వస్త్రమును తనయెదుట నుంచుకొని ఆనందాశ్రుధారలను విడచుచు గద్గద స్వరముతో దేహ భ్రాంతి రహితుడై శ్రీరామనామ స్మరణ జేయుచుండెను. గ్రాహక జనులు కబీరుకడకు వచ్చి వస్త్రమును జూచి తమ శక్తికి మించిన విలువ గల వస్త్రము మనము కొనలేమని దలచి మూల్యము నడుగకుండ బోవు చుండిరి. శ్రీరామమూర్తి హస్తముతో నేయబడిన వస్త్రమగుట వలన గ్రాహక జనుల దృష్టికమూల్య పీతాంబరముగ గనబడుచుండెను. ఐదు రూప్యముల ఖరీదుగల వస్త్రమును కొనదలచి సంతకుబోయిన వారికి పదిరూప్యముల విలువగలదిగను, పదిరూప్యముల ఖరీదులో గొనదల చినవారికిరువది రూప్యముల మూల్యము గలదిగను నిరువదైదు రూప్య ములలో గొనదలచినవాని కేబదిరూప్యముల కిమ్మత్తుగలదిగను, ద్విగుణీ కృతమూల్యముగ గనబడుచున్నందున సంతకువచ్చిన స్త్రీ పురుషు లెల్లరును, నొకరి ముఖములొకరు జూచుకొని "నాయొద్ద ద్రవ్యము లేదు. సంతను జూచుటకు వచ్చితి"నని చెప్పుకొనుచుండిరి. ఎవరేవిధ మగు వస్త్రమును గొనదలచి సంతకుబోయిరో వారల కావస్త్రముగనే గనబడుచుండెను. భూమిలో నాటిన చెరకు నుల్లిగడ్డ కంద మొదలగు వానికి నీళ్లుబోసి పెంచినచో దేనికే సహజగుణముగలదో జలమట్లై యగునట్లును నెన్ని వాద్యములు ఘోషించిన నాకాశమునుండి యన్ని వాద్యములు ప్రతిధ్వనించునట్లును, నొకే సువర్ణ మలంకార భిన్నమై నట్లును, మంగలిమాపు నద్దములో జూపరులు జూచునట్లు గనబడు

నట్లును, కబీరు వస్త్రము గ్రాహికుల కట్లు గనదుచుండెను. సూర్యాస్త మయమై సంతనుండి జనులు స్వస్థానములకు బోవుచుండిరి. కబీరు దేహ భ్రాంతి గలిగి నేత్రములుదెరచి జూడగా సంతలో జనులెవ్వరును లేనందున గృహమునకు బోయిన తల్లి దండించునని చింతించి యాకస్మికముగ నచటకు గనబడిన శిథిల గృహముజేరి అందేకాంతముగ సప్రేమతో శ్రీరామభజన జేయుచుండెను, అత్తకు జడిసి కోడలు దాగియుండు నట్లను, ధ్రువుడు సవతితల్లికి వెరచి విలపించుచు నరణ్యమునకు బోయినట్లును, పరమహంసలు సంసారమునందు దాసీనముగ నుండునట్లును, విష్ణుదాసుడు తల్లికి జెదిరి పాడుపడిన గృహములో భజనచేయుచుండుటను జగన్నివాసుడుజూచి అతని సత్వమును బరీక్షింప దలచి వృద్ధ బ్రాహ్మణ రూపియై, యతి జీర్ణవస్త్రములను ధరించి గజ గజ వణకుచు, చలిచే బీడింప బడినవానివలె గనబడుచు, కబీరునొద్ద నిలచెను. హరిశ్చంద్రుని బరీక్షింప దలచిన విశ్వామిత్రుని వలెను, శ్రీయాళుని యొద్దకుబోయిన శంకరునివలెను, అంబరీషుని బరీక్షింపదలచిన దుర్వాసునివలెను, బలిచక్రవర్తి వద్దకు బోయిన వామనమూర్తివలెను, మాయావేషధారియగు భగవంతుడు దీనాలాపములతో "ఓ భక్త శ్రేష్టా! నేననాథుడను, దీనుడను వృద్ధబ్రాహ్మణుడను, కప్పుకొనుటకు వస్త్రములేక చలిచే బాధపడుచున్నాను. నీవు విష్ణుభక్తుడవు, ఉదారుడవు నీవద్ద వస్త్రమున్నచో గప్పుకొనుటకు నాకిమ్మని" కోరెను.

అంత కబీరు బ్రాహ్మణునికి నాస్తి శబ్దము జెప్పినచో సత్వమునకు హాని గలుగునని మనంబున విచారించి తనయొద్దనున్న వస్త్రములో సగము జింపి యాతనికిచ్చెను, భగవంతుడావస్త్రమును గప్పుకొని వెలుపలకువచ్చి వేరొకరూపంబున మరల బోదలచి, శిరమున జడలును మెడలో గాజుపూసల దండలును, విశాలమైన యారక్తనేత్రములును, గల పకీరువేషము ధరించి కబీరునెదుటనిలచి "పరమేశ్వరుడు నిరాకారుడైయున్నాడు. అధ్యానము జేయక రామభజన జేయుటలో యర్థమేమని" యడుగ కబీరు మంజుల వచనములతో "సగుణ నిర్గుణములనియు

ములు. సువర్ణమును నలంకారమును నొకటైయున్నట్లును, నవ్యక్తము నవినాశ మగు పరబ్రహ్మమే భక్తకార్యార్థమై సగుణవేషము ధరించె" నని చెప్పెను. ఫకీరువేషధారి యగు భగవంతుడు నవ్వుచు "నీవుచతురుడవు. శాస్త్రధర్మములు బాగుగా నెరుగుదువు. నాకు చలి యధికముగనున్నది. నీయొద్ద వస్త్రమున్నదో త్వరితముగ నాకిమ్ము" అని పలుకగా కబీరు తనయొద్ద నున్న సగము వస్త్రమును ఫకీరునకిచ్చి యుపాధిరహితుడై శ్రీరామ భజన జేయుచుండెను. వర్షాకాలమైన పిదప నాకాశము నిర్మలముగ నుండునట్లును, మాలిన్యము లేని సువర్ణము ప్రకాశించునట్లును, కబీరు వస్త్రమును గొనుటకెవరును రాలేదను చింత దొలగి యుల్లాసముతో నుండెను.

ఫకీరు రూపముననున్న భగవంతుడు తిరిగి బ్రాహ్మణరూపమును ధరించి కబీరు గృహమునకుబోయి యాతని తల్లిని బిలచి "కబీరుసంతలో గూర్చుండి భజనజేయుచుండెను. ఎందరో గ్రాహిక జనులు వచ్చి వస్త్రము ఖరీదును విచారించినను వారికి ప్రత్యుత్తరమీయక మౌనముగ నుండుటచే జనులెల్లరు దిరిగిబోయిరి. సాయంకాలమైన పిదప శిథిల గృహములో బ్రవేశించి శ్రీరామభజన జేసికొనుచు తనవద్దనున్న వస్త్రమును సగము జింపి ఒక బ్రాహ్మణునకిచ్చి, మిగిలిన, సగమొక ఫకీరున కిచ్చెను. నేను దూరమునుండి యాతని చర్యలుజూచి నీకు జెప్పుటకై వచ్చితిని. నేను బ్రథమమునుండి మీరు మంచి స్థితిలో నుండవలెనను గోరికతో నున్నవాడనుగాన జూచి సహింపజాలక నీయొద్దకు వచ్చితిని. నీ కుమారుని మనస్సు ప్రపంచ వ్యవహారము లందెంత మాత్రమును లేదని" చెప్పెను.

బ్రాహ్మణ వేషధారియగు భగవంతుడు చెప్పిన పలుకులు విని కబీరు జనని క్రోధముతో వాడింటికి వచ్చిన పిదప దండింతునని చెప్పగా



భక్తకబీర్‌నకు శ్రీరాముడు దర్శన మిచ్చుట.

భగవంతుడు "ఆతడిప్పుడు గృహము జేరడు. కాటువేసిన తేలు దాగి యుండిన ట్లాతడేకాంతముగ దాగియున్నాడు. నావెంటరమ్ము ఆతనిని జూపెద" నని చెప్పి కబీరు మాతను తనవెంటబెట్టుకొని కబీరునొద్దకు దీసుకొనిపోయి తాను దూరముగనుండి చూచుచుండెను. వాల్మీకి యనుష్టానమున గూర్చుండియున్నట్లును, రామనామస్మరణతో సీత అశోక వృక్షచ్ఛాయను గూర్చుండినట్లును కబీరు లౌకికాభిమాన మును విడచి భగవన్నామ స్మరణ జేయుచుండెను. కబీరుమాత "ఓరీ కబీరూ! ఇచట గూర్చుంటివేల? వస్త్రమేమిచేసితివి చూపుము లేనిచో శిక్షించెద" ననగా ఆతడు మౌనముగా నుండెను. తల్లి క్రోధముతో కఠోరముగ బలుకుచుండ బ్రాహ్మణ వేషధారియగు శ్రీరాముడామెతో "శిక్షించనిది వీడు స్వాధీనుడుగాడు నీవు పుత్రమోహముతో నుంటి" వనగా "కొట్టుటకేమియు లేదని" నామె చెప్పెను. భగవంతుడొక కఱ్ఱను దెచ్చి కబీరు జననికిచ్చెను. ఆమె క్రోధముతో కబీరు వీపుపై గొట్టెను. కబీరు దేహాతీతుడై రామభజన జేయుచున్నందున భగవం తుని వీపుపై ఆ దెబ్బ తగిలెను. వృద్ధబ్రాహ్మణ వేషధారి యగు భగ వంతుడు కబీరుమాతనుజూచి "తల్లీ! నీవు కొట్టిన దెబ్బ నాకు తగిలి నది. ఇక చాలునని" చెప్పెను.

భక్త కబీరును తల్లిగొట్టిన దెబ్బకు భగవంతుడు గంపించెను. భగవంతుడు మనంబునం దిట్లాలోచించెను. "బలిచక్రవర్తిని జయింపదలచి నేను ద్వారపాలకుడనైతిని. ఎందరో గొప్పగొప్ప భక్తులున్నారు. కాని నెవరివలనను నాకు దెబ్బలు తగులలేదు. నాకంటె భక్తకబీరతి శ్రేష్ఠుడని" దలచి బ్రాహ్మణవేషమును మార్చి దేదీప్యమానమగు కనక కిరీటమును, మకరకుండలములను, కౌస్తుభహారమును, ధనుర్బాణము లను, అమూల్య పీతాంబరములను ధరించి సీతాసమేతముగ దర్శన

మిచ్చెను కబీరు నేత్రములు దెరచి కోటిసూర్యప్రకాశ మానమగు భగవంతుని స్వరూపమును సేవించి సాష్టాంగ నమస్కారము జేసెను. జానకీరమణుడు కబీరు నాలింగనము జేసికొని "వత్సా! నేనెప్పుడును నీ హృదయమునందే యుండెద" నని చెప్పి, కబీరుమాత నాలింగనము జేసికొని "తల్లీ! నీభాగ్య మెవరు వర్ణించగలరని" చెప్పి భగవంతుడు కృపాదృష్టితో వీక్షించి యంతర్ధాను డయ్యెను. కబీరుమాత, కుమారుని కౌగలించుకొని "నాయనా! నీవలన దుర్లభమగు శ్రీరామదర్శనము సంప్రాప్తించినదని పలికి యాతని చేయిబుచ్చుకొని గృహమునకు దీసికొనిబోయెను.

ఐదవ యధ్యాయము సమాప్తము

శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః

———

# భక్త కమాల్ చరిత్ర

## —♦ ఆరవ యధ్యాయము ♦—

నేడు దసరా దీపావళి పండుగలు రెండును గలసివచ్చినవి. సభాగ్యులగు శ్రోతజనులు భక్తుల సచ్చరిత్రలను శ్రవణము జేయుటవలన సర్వేంద్రియ సౌఖ్యమును బొందెదరు. సర్వులకు చంద్రుడు సమునైనను, చకోరపక్షు లాదిలోనే తృప్తిబొందునట్లు భక్తుల సచ్చరితలు శ్రవణ పఠనములు జేసినవారు ప్రథమముననే భాగ్యవంతులగుదురు. ఆకాశమునందు మేఘము లావరించియుండుట జూచి ప్రథమమున చాతకములు దృప్తిబొందునట్లును, పుష్పమునందలి మకరందమును భ్రమరములు మొదట సేవించినట్లును, పుణ్యాహవాచనము జరుపునప్పుడు ప్రథమమున విఘ్నేశ్వరుడు బూజింపబడునట్లును, పంక్తిలో భక్త కథారసము వడ్డింపగా సభాగ్యులగు శ్రోతృజను లాదిలోనే దృప్తిబొందెదరు. శ్రవణానంతరము మననమును, పిదప నిదిధ్యాసయు గలిగి సాక్షాత్కారమును బొంది సాధకులు జ్ఞానసంపన్నులగుదురు. జ్ఞానేంద్రియములలో శ్రేష్ఠమైనది శ్రవణము. దానిని కర్ణభూషణముగా సమూల్యములగు భక్త కథారత్నముల నమర్చి ధరింపవలెను. భక్తకథా శ్రవణము జేయువారి కోరికలను శ్రీ రుక్మిణీరమణుడు సంతసముతో బూర్తి జేసి యక్షయ వరదానమును గ్రహించును.

ఓ ప్రేమభక్తులగు శ్రోతలారా! సావధానముగా వినుడు. ఈ చరిత్ర మిగుల రసవంతమైనది. కబీరునకు శ్రీరాముడు దర్శనమిచ్చి తత్కాలమున నంతర్ధానుడయ్యెను. కబీరు మాతకు భగవద్దర్శనముచే చిత్తశాంతి గలిగెను. రాజునకు కృప గలిగినచో ప్రధానియును నితర జనులును మారు బలుకనట్లును, కోడలు ప్రవర్తన యత్త కంగీకారమైనచో జనులు నిందించునట్లును, సరస్వతి ప్రసన్నమైనచో పాషండులు వాదన జేయజాలనట్లును, అమృతపానము లభించిన రోగము బాధించనట్లును, గజవదనుడు ప్రసన్నుడైనచో విఘ్నములు పటాపంచ

లగునట్లును, అయోధ్యాధీశుని దర్శనముచే కబీరుతల్లికి దివ్యజ్ఞానము గలిగి యుదాసీనవృత్తితో లోకాచారము ననుసరించి సంసారమునం దుండి నిశ్చింతతో శ్రీరాముని భజించుచుండెను. కబీరుకాంత యతనితో సమముగు పతివ్రతా శిరోమణియై యుండెను. దీపమును ప్రకాశమును, నక్షరమును నర్థమును, మేఘములును నురుములును, గలిసియుండునట్లు కబీరును నాతని భార్యయు నేకమనస్కులై వర్తించుచుండిరి. చక్కెరయు దాని మాధుర్యమును, చంద్రుడును నాతని కళలును వేరుగాకుండునట్లు సంసారమునందు కబీరునకు సుఖదుఃఖములు సమముగ నుండెను.

భక్తి వైరాగ్య సంపన్నురాలగు కబీరుభార్య గర్భవతియై నవమాసములు నిండినమీదట నొక సుముహూర్తమున బ్రసూతియై సుపుత్రుని గనెను. ఆ బాలకుడు బుట్టుకతోనే వైరాగ్యశీలుడును,నుదారుడును, మహాజ్ఞానియు, స్థిరచిత్తుడైయుండెను. పండ్రెండవ దినమున నా బాలునకు 'భక్త కమాల్' యని నామకరణము జేసిరి. దినదిన ప్రవర్ధమానముగా కమాల్ పెరిగి పెద్దవాడగుచుండెను. ఆతడు నిరంతరము తన జనకునితో గలసి శ్రీరామ భజన జేయుచుండెను. కమాల్ ఏడు సంవత్సరముల వయస్సుగలవాడై ఒక దినమునందు జనకుని యొద్దకు బోయి నమస్కారము జేసి "ద్వారకాక్షేత్రమును దర్శింపవలెని గుతూహలమున్నది. ఆజ్ఞ నిచ్చినచో త్వరితముగ సేవించి వచ్చెద" నని నమ్రవచనములతో పలికెను. కబీరు ఆశ్చర్యచిత్తుడై ఏ డే ప్రాయమున తీర్థాటనమునకు సంసిద్ధుడాయెనని యానందించి "కుమారా! నీ మనోరథమును త్వరితముగా బూర్తిజేసికొని రమ్మని" చెప్పెను. భూమండలమును జయింతునని రాకుమారుడు బలికిన నాతని తండ్రి సంతసించినట్లును, చంద్రుడు కళాయుక్తుడై యుండుటను జూచి సాగర ముల్లాసముతో నుండునట్లును, గజాననుడు తాండవమాడుచుండ శంకరుడు బరవశుడగునట్లును, సరస్వతీదేవి గానమును విని కమలోద్భవు డానందించునట్లును, వైరాగ్యభరితుడగు పుత్రుని జూచి కబీరును, నాతని భార్యయును హర్షచిత్తులైరి.

భక్త కమాల్ జననీ జనకుల యాజ్ఞ ఁ డీసికొని లౌకిక మానావ మానములను త్యజించి హరినామ సంకీర్తన జేయుచు తీర్థయాత్రలకె బయలుదేరెను. వస్త్రభూషణ ధారణయందును, నుత్తమ భోజన పదార్థములందును, నిచ్ఛలేక దంభరహితుడై శ్రీరామ భజన జేయుభక్తుడు భక్త కమాల్ యని మార్గమధ్యమున నగరప్రజలు దెలిసికొని స్వాగత పూర్వకముగ నాతని నాహ్వానించుచుండిరి. బ్రహ్మపుత్రుడగు నారద మహర్షి అహర్నిశములు సంకీర్తన నిష్ఠలో నుండునట్లు కమాల్ దివారాత్రములు హరినామసంకీర్తనలో లీనుడైయుండెను.విజ్ఞానస్థితియందున్న కమాలీ ప్రకారముగ మార్గమధ్యమున ప్రజల కోరికననుసరించి ఆయా గ్రామములలో నొక్కొక్కదినము వసించుచు హరినామ సంకీర్తనచే వారల నానంద పరవశులనుగా జేయుచు గొంతకాలమునకు ద్వారకా క్షేత్రములో బ్రవేశించెను. అనుతాపము లేని తీర్థాటన శ్రమ మాత్ర మగును. సంతానహీను డార్జించు నైశ్వర్యము వ్యర్థమగునట్లును, ధన హీనుడు సంతకు బోయినను లాభముండనట్లును, ప్రేమ లేక జేయు కీర్తన శోభాహీనమగునట్లును, కృపణుని ధనము సత్పాత్ర కుపయోగ పడనట్లును, శౌర్యవిహీనుడగు క్షత్రియుడు శస్త్రమును ధరించుట ప్రయోజన హీనమగునట్లును, విధవ జేసికొను నలంకారము వ్యర్థమగు నట్లును, భూతదయాహీనుడు జేయు జ్ఞానబోధ నిరుపయోగమగు నట్లును, నీశ్వరకృప లేనిది కవిత్వరచన జేసిన శ్రమమాత్రమగునట్లును, తర్కజ్ఞానశూన్యు డరువదినాలు కళలు గలిగినను శోభారహితమగు నట్లును, అనుతాపము లేని తీర్థాటన వ్యర్థమగును.

భక్తకమాల్ గోమతీతీరమున సచేలస్నానము జేసి పాపములను నిర్మూలించి జనన మరణ విముక్తినిగ జేయుమని గంగాదేవిని బ్రార్థించి గోపీచందన తిలకమును ధరించి దేవాలయమున బ్రవేశించి మహాద్వారములో సాష్టాంగ నమస్కారము జేసి శ్రీకృష్ణ భగవానుని సేవించి యథావిధి బూజించెను. కమాల్ నిత్యము హరినామ సంకీర్తన జేయుచు త్రికాలములయందును ద్వారకానాథుని సేవించుచు సత్సమాగమము,

జ్ఞానచర్చ, కవిత్వ రచనలతో నాలుగు మాసములా క్షేత్రములో గడపి యచ్చటనుండి బయలుదేరి మార్గమధ్యమున హరినామ సంకీర్తన జేయుచు చిత్రకూట నగరమున బ్రవేశించెను. విష్ణుదాసుడును పరమ శాంతుడును, నతి యుదారుడును, నఖండైశ్వర్యవంతుడగు నొక గృహస్థు కమాల్‌నకు బ్రేమతో సాష్టాంగ నమస్కారము జేసి మూర్తి హృదయుడై దన భవనమునకు దీసికొనిపోయి యాతని చరణ క్షాళన జేసి యుచితవిధిని బూజించి భోజన తాంబూలాదుల నర్పించెను. ఆరాత్రి శ్రీమంతుని గోరిక ననుసరించి కమాల్ హరినామ సంకీర్తన జేసెను. అసంఖ్యాకులగు జనులు శ్రవణముజేసి యానంద పరవశులైరి.

శ్రీమంతుడు కమాల్‌నకు సన్మానముజేయ నాలోచించి తన ధనాగార మందున్న యొక యమూల్య మాణిక్యమును దెచ్చి యాతని పాదములయొద్ద దానినుంచి "మహాత్మా! ఇది మిగుల ప్రకాశవంతమగు మాణిక్యము. దీనియెదుట దీపప్రకాశము లోపించును. తాము దీనిని దీసికొనిపోయి గృహము నందుంచుకొనుడు. నిశాకాలమున నిదియున్న స్థలమున నంధకారముండదని పలుక కమాల్ ఆశ్రీమంతునికి వందనములు జేసి "అయ్యా! మేము విష్ణుభక్తులము. అతివిరక్తులము ఈ మాణిక్యము మాకేల? మీకోరికకు లోబడి నే నంగీకరించిన నాతండ్రి కోపించును బ్రాహ్మణులకు ద్రవ్యమును, రాజులకు రత్నమాణిక్యాదులును, భూతమాత్రుల కన్నదానమును, శౌచవంతులకు భోజన సామగ్రులును, యతులకు కాషాయ కౌపీనములును, నర్పించుట విధియైయుండ నిచ్ఛారహితులమగు మాకు బలాత్కారముగ మాణిక్యము నర్పించుటవలన సార్థకమేమి? ఆకలితో నున్నవానికి దృప్తిగా పక్వాన్నములను బెట్టిన సార్థకమగును. కాని, భుజించినవానికి బెట్టిన సార్థకముగాదు. సాదరమునకు వర్ష మనావశ్యమగునట్లు, నాకర్పించు మాణిక్యము వ్యర్థమగు"నని పలుక నా శ్రీమంతుడు కమాల్‌నకు దండప్రణామముజేసి నాతనికి దెలుపకయే నామాణిక్యమును నాతడు ధరించిన వస్త్రమునకు గట్టెను. కమా లచ్చటనుండి బయలుదేరి కొన్నిదినములకు గృహమునకుజేరి

కబీరునకు సాష్టాంగ నమస్కారముజేసి యాత్రావిషయములను దెలిపి చిత్రకూట నగరమున శ్రీమంతుడు చెప్పిననువినక బలత్కారముగా దనకు దెలుపకయే వస్త్రమునకు మాణిక్యమును గట్టినవిషయమును సవిస్తరముగా దెలిపెను.

కబీరు వ్యాకులచిత్తుడై దీర్ఘముగా రోదనజేయుచు నేలపైబడి మూర్ఛిల్లెను. మహా పతివ్రతయగు కబీరు కాంతవచ్చి భర్తను సమాధానపరచి దుఃఖమునకు గారణమడుగ కబీరు భార్యతో "ప్రేయసీ! కమాల్ భగవన్నామమును విక్రయించి నంశమున కపకీర్తిగా మాణిక్యమును దెచ్చెను; సంతనుండి కస్తూరికిబదులు బూడిదను దెచ్చినట్లును శాస్త్రజ్ఞానునికి బదులస్పృశ్యుని గౌరవించినట్లును, గంగాజలమును విడిచి మురికి గుంటలోని జలమును స్వీకరించినట్లును. తీర్థవాసులను విడచి తస్కరుల బూజించునట్లును, వేదాంత గ్రంధములనిచ్చి కోక శాస్త్రమును దీసికొనినట్లును, అశ్వమునిచ్చి గాడిదను దెచ్చినట్లును, సుధారసమిచ్చి మద్యమును దీసికొన్నట్లును, పుత్రుడు రామనామమును విక్రయించి మాణిక్యమును దెచ్చెను. దీనివలన గొప్పయనర్థము సంప్రాప్తించినద"ని చెప్పెను.

భక్తకమాల్ తండ్రిమాటలువిని తత్‌క్షణమే యచటనుండి బయలుదేరి చిత్రకూట నగరముజేరి శ్రీమంతునకు మాణిక్యము నిచ్చి యతివేగమున స్వస్థానముజేరి వృత్తాంతమంతయు జననీ జనకులకుదెలిపి వారిని సమాధానపరచెను. కబీరు కుమారుని మనోనిశ్చయమునుజూచి మిగుల యానందించెను. శిష్యుడు విరక్తుడైనచో సద్గురు వానందించునట్లును; పుత్రు డారోగ్యవంతుడైనచో జనని సంతసించునట్లును, నుపాధరహితుడగు కమాలునుజూచి జననీజనకు లానందించిరి. ఇట్లు కొంత కాలము జరిగినపిదప ఒకనాడు తీర్థవాసులగు సాధుజనులు కాశీక్షేత్రము జేరి గంగానదిలో స్నానముజేసి విశ్వేశ్వరుని సేవించి క్షేత్రవాసుల విచారించుచు రామభక్తుడగు కబీరు గృహమునకు బోయిరి, కబీరునునాతని

భార్యయు నయాచితముగా భక్తసముదాయము తమ గృహమునకు వచ్చుటవలన నమితానందమునొంది సగౌరవముగ వారికి స్వాగత మిచ్చిరి. కమాల్ వారలు గూర్చుండుట కాసనములువేసి యధిష్ఠింపుడని ప్రార్థించెను. సనకాదుల దర్శనమువలన శచీరమణు డానందించినట్లును, క్షామకాలమున వర్షములు బడిన జనులు సుఖించునట్లును, సజ్జనుల దర్శనముచే కబీరును వాని దారపుత్రులును నానందించిరి. రోగి కమృత పానములు చాతకపక్షులకు చంద్రామృతమును, దీపమునకు చమురును, లభించిన శోభించునట్లు కబీరానంద భరితుడై భార్య నేకాంతముగ బిలచి "ఇప్పుడు ఘూముర్రాత్రి వేళయైనది. సాధుజనులభోజనముగ నున్నారు వారలుపవాసముతో బరుండిన సత్వమునకు హాని సంప్రాప్తించును. త్వరితముగ భోజన మేర్పాటు జేయుమని చెప్పెను.

కబీరుకాంత భర్తవచనముల నాలకించి గృహమున భోజన సామగ్రులేవియు లేనందున చింతించి భర్తనుజూచి "ప్రాణేశ్వరా! గృహమున నన్నసామగ్రు లేవియును లేవు. కరినసమయ మాసన్న మైనది ఇరుగుపొరుగువారిని బదులడిగితిని. వారలిచ్చుటకు నిరాకరించిరి. సామగ్రులను గొనుటకు ద్రవ్యము లేదు ఉపాయమేమియును దోచుట లేదు. మీరీసమయమున పుత్రుని వెంటబెట్టుకొని బజారునకుబోయి పెద్దదుకాణమునందు సామగ్రులను దొంగిలించి దీసికొనిరండు లేనిచో సాధుజనులకు భోజన మేర్పాటుచేయజాలము"ని చెప్పగా కబీరు అవశ్యమని చెప్పి కత్తిని బుచ్చుకొని కమాల్‌నకు గడ్డపలుగునిచ్చి యారాత్రిసమయమున వివుపురును నన్నసామగ్రులను దొంగిలించుటకై బయలుదేరిరి. ఆ సమయమునందు 'బజారు'లో దుకాణములన్నియు మూయబడి వర్తకులు నిద్రించుచుండిరి. కబీరొక దుకాణమునకు కంతగొట్టి కమాల్‌తో "నాయనా! నీవు రంధ్రమునుండి లోపలకుబోయి నలయు నన్నసామగ్రులను దీసికొని త్వరితముగ రమ్మ"ని చెప్పెను.)

కమాల్ పితృాజ్ఞానుసారము ఛిద్రమునుండి దుకాణములో ప్రవేశించి పరికించిజూడ నానర్తకులు గాఢముగ నిద్రించుచుండెను. దుకాణమునం

దమూల్యవస్త్రాభరణాదులును, ద్రవ్యమును జూచి కమాల్ వ్యాకులచిత్తుడై లోపల ప్రవేశించి గదులన్నియు శోధించి భోజనసామగ్రులున్న గదిలో బ్రవేశించి గోధుమపిండి, చక్కెర, ఘృతము, పప్పు, దినుసులను దీసి కొని మూటగా గట్టి తండ్రికిచ్చెను. యుద్ధమునుండి పలాయనమగు వాసని దగుముటయు, నిద్రించుచున్న శత్రువును వధించుటయు, కాపుర మున్న గృహమునకు నిప్పంటించుటయు మహాపాపమని కమాల్ భావించి ఛిద్రమునుండి బైటికి బోక వెనుకకు మరలి వర్తకుడు గాఢ ముగ నిద్రబోవుచున్నాడు, నీతనిని మేల్కొలిపి బోవుట యుచితము లేనిచో నీ ఛిద్రమునుండి దస్కరులెవరైనను బ్రవేశించి గృహములోని వస్త్రాభరణాదుల నపహరింతురని దలచి ధైర్య మవలంబించి వర్తకుని యొద్దకు బోయి ఆతనివీపుపై చేతితో తట్టి: "ఓ సెట్టీ! మే మిరువురము తస్కరులము, నీ దుకాణమునకు వెనుకభాగమునందు కంతను గొట్టి లోపల బ్రవేశించి మాకు గావలసిన భోజనసామగ్రులను మాత్రమే దీసి కొని బోవుచున్నాము. నీవు మేల్కొనియుండుము. చోరులెవరైనను లోపల ప్రవేశించినచో నమూల్య వస్త్రాభరణాదు లపహరించెదరు. నే నిక బోవుచున్నాను. దుకాణమును భద్రముగా జూచుకొమ్మని" చెప్పి సత్వరమే కమాల్ ఛిద్రమునుండి దూరి పోవుచుండగా నకస్మా త్తుగా నా వర్తకుడు కమాల్ పాదములను గట్టిగా బట్టుకొని లాగుచుం డెను. నాభిపర్యంతము వెలుపలను మిగిలిన భాగము లోపల నుండెను. బోయవా డమర్చిన వలలో లేడి చిక్కుకొన్నట్లును, చిలుక పంజరమున బంధింపబడినట్లును, కౌరవులమధ్య చక్రవ్యూహమునందు సౌభద్రుడు పడినట్లును, కమాల్ పలాయనమగుచుండ వర్తకు డాతని బట్టుకొని లాగుచుండెను. అంత కమాల్ తండ్రితో "నాయనా! రామకార్యా ర్థము హనుమంతుడు ద్రోణగిరిని దెచ్చుచుండ భరతుడు బాణప్రయో గము జేసినట్లుల మనకు బ్రమాదము తటస్థించినది. వర్తకుడు వెలుప లకు వచ్చి కేకలువేయును, ఆతని కంఠధ్వని విని నగరవాసులు జేరె దరు. మనము గ్రామస్థులము దొంగలము. స్త్రీ పురుషులెల్లరు మనల గుర్తింతురు. గాన మీరు త్వరితముగా నా శిరమును గోసి తీసి

కొని పొంము. మీరు చిత్తమునందు మాయామమతలతో నున్నచో సత్యమునకు హాని సంప్రాప్తించును. మనము చోరత్వము జేసినటుల సాధుజనులు వినినచో క్షణకాలమైనను వారు మనగృహమున వసింపరు. జారిణి వృత్తాంతమును వినినచో పతివ్రత తత్క్షణమే లేచిపోవునట్లును, నస్పృశ్యుడు వచ్చినచో విప్రుడు లేచిపోవునట్లును, ఈ విషయమును వినిన సాధుజనులు అభోజనముగ బోయెదరు. కాన ఓ విష్ణుభక్తా! శాంతిసాగరా, సద్గుణభరితా, మాయామమతల ద్యజించి త్వరితముగా నా శిరమును భేదించి గృహమునకు దీసికొని పొమ్మని" చెప్పెను.

కబీరానందభరితుడై కత్తిని దీసి కమాల్ శిరమును గోసి భోజనసామగ్రుల మూటను, కుమారుని శిరమును దీసికొని గృహమునకు బోయి కమాల్ శిరమును గుప్తస్థలమున దాచి యున్నసామగ్రుల మూటను భార్యకిచ్చి త్వరితముగా సాధువులకు భోజన మేర్పాటుచేయుమని చెప్పెను. శ్రోతలారా! కబీరుధైర్యమును వర్ణించుటకు నాకు శక్తి చాలదు. యోగ్యమగు దృష్టాంతము లు లభించుటలేదు శ్రీయాళుని మందిరమున కతిథిరూపముగ శంకరుడు వచ్చి నరమాంసభోజనము గోరెను. అందుచే నాతడు తన పుత్రుని వధించి వంటజేయించిపెట్టెను. కబీరట్లే చేసెననివర్ణించుటకీ దృష్టాంతము యోగ్యముగలేదు, సాధుజనులుకొరకయే కబీరు తనకుమారుని జంపెను. పృథ్వికంటెఘనవస్తువును, నాకాశముకంటె విశాలమైనదియు, నశ్వత్థవృక్షముతో సమమగు వృక్షమును, గరుత్మంతునితో సమమగు పక్షియు, భాగీరథితో సమమగు నదియు, కామధేనువుతో సమమగు గోవును ననసూయతో సమమగు పతివ్రతయును బలిచక్రవర్తితో సమమగు నుదారుడును, వాల్మీకితో సమమగు గ్రంథకర్తయు, త్రిభువనములందు శోధించినను లభింపనేరరు. అట్లే కబీరుతో సమునగు భక్తుడెచటను జన్మించియుండలేదు.

కబీరుభార్య పక్వాన్నములను దయారుజేసి సాధుజనులకు వడ్డన జేసి పంక్తిలో గూర్చుండుటకు కుమారుడెచట నున్నాడని భర్తను విచా

రించగా సాధుజనుల సామగ్రులను బజారులో రక్షణ చేయుచున్నాడని కబీరు ప్రత్యుత్తరమిచ్చెను. సాధుజనులు రసవంతమగు పక్వాన్నములను తృప్తిగా భుజించి కరశుద్ధి జేసికొనిరి. కబీరు వారలు నిద్రించుట కాసనము లేర్పాటు జేసెను. సాధుజనులు నిద్రించిన పిమ్మట కబీరుకాంత భర్తతో "ప్రాణేశ్వరా! అర్ధరాత్రివేళయైనది. కుమారుడొక్కడు బజారులో నిద్రనాపుకొని యుండజాలడు. మీరచటికిబోయి వాని నింటికి బంపుడని చెప్పగా కబీరు గుప్తముగా దాచిన కమాల్ శిరమునుదెచ్చి ఆమెకిచ్చి జరిగిన వృత్తాంతమంతయు జెప్పెను. కుమారుని శిరమును బుచ్చుకొని ఆమె ఏడ్చుచు "నాయనా! కమాలూ! నీవెంత భాగ్యశాలివి. సాధువుల భోజనమునకై ప్రాణ మర్పించి జన్మసార్థకము జేసికొంటివి! నీవు మావంశమున జన్మించి వంశము నుద్ధరింప జేసితి" వని యారాత్రియంతయు కమాల్ సుగుణములను, కబీరును ఆతని కాంతయు వర్ణించుచు విలపించిరి. ప్రభాతసంకీర్తనలు జేయుటకై సాధుజనులు నిద్రనుండి లేవగనే కబీరును నాతని భార్యయును, కమాల్ శిరమును గుప్తముగా దాచి సాధుజనులకు వందనములుజేసి సంకీర్తనలో పాల్గొనిరి. సూర్యోదయ సమయమున కబీరును సాధుజనులును స్నానమునకై గంగానదికి బయలుదేరిరి.

వర్తకుడు రాత్రి తనయింటిలో జరిగిన చోరత్వమును గురించి రాజవీధిలో నెల్లరకు దెలుపుచు శిరోవిహీనమైన మొండెమును జూపెను. జనులెల్లరు నాశ్చర్యముతో నిదివిచిత్రమగు దొంగతనము, ద్రవ్యరత్న భూషణములను త్యజించి అన్నసామగ్రు లపహరించుట లోకమున జరిగి యుండలేదు. ఈ మొండెము గుర్తించుటకు సాధ్యము గాకున్నది. ఈచోరత్వమును జేసినవారు గౌరవనీయులగు తండ్రి కుమారులై యుండవచ్చును. ఎవరును గుర్తించ కుండుటకై ధైర్యముతో శిరమును గోసికొని ఈబాలకుని తండ్రిపోయెను. వర్తకుని యదృష్టము బాగున్నది. అన్నసామగ్రు లపహరించిన చింతలేదు. ప్రాణాపాయము తటస్థించలేదు ద్రవ్యము దగ్గరనుంచుకొని యొంటరిగా నిద్రించరాదు. ద్రవ్యము వెంట

మహాభయమును ప్రమాదమును నఖండముగ వసించియుండును.) ద్రవ్యమువలన బంధువులును సఖులును వైరులగుదురు.) ద్రవ్యమునందు రెండు గుణము లున్నవి ఒకసమయమునందు రక్షణయు, వేరొకసమయమందు ప్రాణహానియు గలుగునని త్రివిధజనులు పరిపరివిధముల జెప్పుకొనుచుండిరి. అంత వర్తకుడు రాజసమక్షమునకు బోయి జరిగిన వృత్తాంతమంతయు నాతనికిదెలిపి శిరోహీనమగు నా కళేబరమును రాజునకుస్వాధీన పరచెను.

రాజు మిగుల కోపోద్దీపిత మానసుడై తనసేవకులను బిలచి ఘోరత్వము జేసినవీనిని నడిబజారులో శూలమునకు దిగవేయుడని యాజ్ఞాపించెను. మృతప్రేతమును దండించుటయు, బుద్ధిమంతులతో వాదించుటయు, పరదేశమున గలహించుటయు కులక్షణములు. కబీరును సాధుజనులును గంగానదిలో స్నానముజేసి దేవతార్చన ముగించుకొని తిరిగి పోవుచుండగా నడిబజారులో శూలమునకు శిరోవిహీనమగు మొండెము దిగవేయబడి యుండుటను జూచి ఆశ్చర్యపడుచుండ యా మొండెము చేతులుజోడించి సాధుజనులకు నమస్కారము జేసెను! అంత సాధుజనులు కబీరుతో "ఇదియేమి యాశ్చర్యము శిరస్సులేని మొండెమునకు ప్రాణమెట్లుండును. ఇదిమిగుల విపరీతముగ నున్నది. దీనిరహస్యమేమి తెలుపుమని" యడిగిరి. కబీరు సాధుజనులకు నమస్కరించి "మహాత్ములారా! తమకు తెలియని విషయ మేముండును, ఈ మొండెము నమస్కరించుట మాకు చిత్రముగా నున్నది. భీష్ముడు శరపంజరమున బడినను దేహమున బ్రాణముండెను. అభిమన్యుడు రణరంగమున మరణించినను నర్జునునకు దుఃఖము దెలుపుటకై ప్రాణములతో నుండెను. అట్లే "ఈతస్కరుడు వైష్ణవుడై యుండవచ్చును. ఈతడు మిమ్ముల దర్శించుటకై ప్రాణముతో నున్నాడు. ఆతని మనోరథము పూర్తి అయినది. నాశవంతమగు శరీరమునువిడచి యక్షయపదమును బొందె"నని చెప్పెను. సాధుజనులు కబీరునుజూచి, "కబీరూ! ఈరహస్యము నీకు దెలియును. మభ్యపరుపక ఈ తస్కరుడెవరు? తెలుపుమని" యనుగగా కబీరు వృత్తాంతమంతయు దెలిపెను.

సాధుజనులు నిశ్చేష్టులై "ఇదియేమి విపరీతము. మేము భోజనమును గోరనిదే వ్యర్థముగా భక్తశిఖామణి యగు పుత్రుని జంపితి"వనిరి. అంత కబీరు మహాత్ములారా! ఈ సంసారము నాశవంతమైనది. దృశ్యమగు సర్వవస్తువులును చివరకు నశించును. నేను కమాల్‌ను సంహరింపనిచో వాడమరుడగునా యని పలుకగా కృపావంతులగు నా సాధుపుంగవులు కబీరు కాంతను బిలపించి కుమారుని శిరము దెమ్మని చెప్పిరి. ఆమహా సాధ్వి తత్‌క్షణమే గృహమునకుబోయి కమాలు శిరమును దెచ్చి సాధు జనులకిచ్చెను. సాధుజనులు కొలమునందున్న మొండెమును క్రిందికి దింపి కమాల్ శిరమును మొండెముపై నుంచి యాశీర్వదించిరి. ఈశ్వరి కృపవలన కమాల్ వెంటనే పునర్జీవితుడై నిద్రనుండి లేచినవాని వలెలేచి సాధుజనులకు సాష్టాంగ నమస్కారము జేసెను. ఈ విషయము కాశీక్షేత్రమునందలి స్త్రీ పురుషు లెల్లరికినీ దెలిసి అసంఖ్యాకులగు జనులు కౌతుకమునుజూచి యాశ్చర్య చకితులైరి. సాధుజనులు కబీరును కమాల్‌ను, కబీరుకాంతను యాశీర్వదించి యచటనుండి తీర్థక్షేత్రములకు బోయిరి.

ఆరవ యధ్యాయము సమాప్తము

భక్తాభీష్ట ఫలప్రదాయ నమః

# కబీరు రామానందస్వామి నాశ్రయించుట

—♦ ఏడవ యధ్యాయము ♦—

ఒకనాడు కబీరు తంబుర చిరుతలు ధరించి హరినామ సంకీర్తన జేయుచు 'బజారు' వెంట బోవుచుండెను. ఒక స్త్రీ గృహమునందు దిరుగలిలో గోధుమలను బోసి పిండిగా విసరుచుండెను. కబీ రీ దృశ్యమును జూచి దీర్ఘముగా వెక్కి వెక్కి ఏడ్చుచుండెను. జనులు గుంపులుగా గుమిగూడి, నానావిధముల పరిహసించుచుండిరి. కొందరు కబీరును జూచి "నీకేమి ప్రమాదము సంభవించినది ఏడ్చుచుండుటకు గారణమేమని" యడిగిరి. కబీ రెవరికినీ ప్రత్యుత్తర మీయకుండెను. కష్టములో నున్న వానికి సుఖవార్త జెప్పినచో సంతాప మధికమగునట్లును, కప్ప, పాముతో స్నేహము జేయదలచిన నణుమాత్రమైనను సౌఖ్యము లభించనట్లును, అపారమగు దప్పిక గలిగినను చాతకపక్షులు నదీజలమును స్వీకరించనట్లును, నిందకుని కేకాంతముగా జ్ఞానులు బోధించి నట్లును, మాయాలోభములలో దగుల్కొన్న యజ్ఞానజనులతో మాటలాడక కబీరు ఏడ్చుచుండ నచట జేరిన జనులు కబీరునకు పిచ్చి పట్టినదని జెప్పకొనుచుండిరి.

నిపట నిరంజనుడను పేరుగల సాధు వా సమయమున నచటికి వచ్చి కబీరును ఏడ్చుటకు కారణమేమని యడుగగా నాతడు కన్నులు దెరచి సాధుపుంగవుడు తన యెదుట నిలువబడి యుండుటను జూచి ధైర్యమవలంబించి, వైద్యునకు తన వ్యాధిని దెలుపుటకు రోగి వెనుకాడనట్లును, అత్తవారింట నున్న కోడలు తన తల్లితో తన కష్ట సుఖములను జెప్పుటకు సంశయించనట్లును, శిష్యునికి సందేహము గలిగినచో గురువునొద్దకు బోయి తన సందేహమును నిశ్శంకతో జెప్పునట్లును, "ఓ సద్గురుమూర్తీ! నా చిత్తమునందు పశ్చాత్తాపము గలిగినది. తాము ప్రేమతో నడుగుటచే తెలుపుచున్నాను. ఒక స్త్రీ తిరుగలిలో గోధుమలను బోసి పిండిగా విసరుచున్నది. నే నా దృశ్యమును

జూచువరకు భయము గలిగినది. భవచక్రమను దిరుగలిలో జీవులను-గోధుమలను బోసి మృత్యువను స్త్రీ విసరుచున్నట్లు నాకు గ్రాహ్యమైనది. భవచక్రమున బడియున్న అనాధుడనగు నన్ను దమబోటి సత్పురుషులు తప్ప అన్యులెవ రుద్ధరింప జేయగలరు?" అని ప్రార్థించెను. అంత నిపటనిరంజనుడు, "ఓయీ కబీరూ! వ్యర్థముగ నేల శోకించెదవు? విష్ణుభక్తుడవగు నీ కీ సంశయమేల? దిరుగలిలో నున్న గోధుమలన్నియు పిండికాజాలవు. మధ్యభాగమందుండు మేకునకు, జుట్టు నున్న గోధుమలు పిండిగాక యట్లే యుండును. నీవు జెప్పినట్లుగా భవచక్రమను దిరుగలికి మధ్య రామనామమను మేకున్నది. దాని చుట్టు నాశ్రయించి యున్న గోధుమలను జీవులట్లనే యుండును. నీవు సత్వశాలివి, వైరాగ్యశీలుడవు, శాంతి క్షమలు నీలో పర్వతములవలె నున్నవి. స్వప్నమును జూచి యజ్ఞానులు భీతిజెందునట్లు నీవు దిరుగలిని జూచి భయపడితివి. కాన మనమునందుగల సందేహమును విడువు" మని చెప్పెను. కబీరు ప్రేమభావముతో నిపటనిరంజనునికి సాష్టాంగనమస్కారము జేసి యాతనిని నాలింగనము జేసికొని త్వరితముగా గృహము జేరెను.

కబీరు నానావిధములగు ప్రబంధములను రచియించుచు నిత్యము నానందభరితుడై ప్రేమతో భగవంతుని కళ్యాణగుణములను వర్ణించుచుండెను. ఒకసమయమున కబీ రేకాంతముగ గూర్చుండి "సద్గురుసేవ జేయని జీవితము విధవ జేసికొను అలంకారమువలెను, ఫలించక పెరుగు వృక్షమువలెను, పురుషార్థము లేని రాజువలెను, లవణహీనమగు పక్వాన్నమువలెను, నాయువులేని తరుణశరీరమువలెను, ద్రవ్యము లేని వర్తకునివలెను, మహాత్త్వము లేని పరివారమువలెను, మేఘములు లేని వర్షాకాలమువలెను, జలము లేని తటాకమువలెను, తీర్థము లేని పర్వకాలమువలెను, ప్రేమలేని సంకీర్తనవలెను, మర్యాదలేని మైత్రివలెను, భూతదయలేని జ్ఞానమువలెను, పశ్చాత్తాపములేని సన్యాసగ్రహణమువలెను. ద్రవ్యములేని విలాసపురుషునివలెను, నియమములేని వ్రతము

వలెను, శాంతములేని మహాపురుషునివలెను, చంద్రుడులేని చాతకముల వలెను, శోభావిహీనమై మృతప్రాయముగ నుండు" నని తలచెను.

ఒకనాడు కబీరు రామానందస్వామి యాశ్రమమునకు బోయి సప్రేమతో నాతని చరణములకు వందనములుజేసి బద్ధాంజలియై నిలువబడి "ఓ సద్గురుమూర్తీ! కృపతో నన్ను మీ శిష్యునిగా నంగీకరించి మంత్రోపదేశము జేయు" డని ప్రార్థించెను. అంత రామానందస్వామి "ఓరీ, కబీరూ, అవింధ వంశమున జన్మించిన నీ కుపదేశమిచ్చుటకు నా కధికారము లేదని" చెప్పెను. సీతాదేవి రాజులనెందరినో జూచి శ్రీ రాముని వర్ణించినట్లును, శ్రీకృష్ణుని కీర్తి విని రుక్మిణీదేవి వర్ణించినట్లును, కబీరు మానసమున రామానందస్వామిని సద్గురువుగ వరించుటచే గురుదేవునకి నమస్కారముజేసి "ఓ సద్గురుమూర్తీ! నేను త్రికరణశుద్ధితో మీ చరణములను నాశ్రయించితిని. ఏకలవ్యుడను కిరాతకుడు మట్టితో ద్రోణాచార్యుని విగ్రహముజేసి భావపూర్వకముగ నాతనిని మానసికముగ వరించి సర్వవిద్యల నభ్యసించెను. నేనును మానసమున మిమ్ముల సద్గురునాథునిగా వరించితిని. గాన నా మనోరథము దప్పక నెరవేరు" నని చెప్పెను.

ఒకనాడు కబీరు సద్గురువు వలన రామనామము వినవలెనని కోరికతో గంగానదికి బోవుమార్గమున నొక గొయ్యిని ద్రవ్వి యందు శయనించెను. సూర్యోదయమునకై నిరీక్షించు కమలములవలెను, క్షుదచే తల్లిరాక కెదురుచూచు బాలకునివలెను, క్షామకాలమున వర్షముల కాశించు జనులవలెను. రామానందస్వామి గంగాస్నానమున కామార్గమున నెప్పుడు వత్తురాయని నిరీక్షించుచుండెను. ఆరాత్రి నాలుగవ ఝామున గంగాస్నానమునకై రామానందస్వామి బయలుదేరి మార్గమధ్యమున కబీరు పరుండియుండుటను జీకటిలో జూడక నాతని ద్రొక్కెను అంత రామానందస్వామి రామ-రామ పొరపాటున ఎవరినో ద్రొక్కితి నని పరిపరివిధముల చింతించుచు నిశ్చేష్టుడై చూచుచుండెను. తత్క్ష

జూచువరకు భయము గలిగినది. భవచక్రమను దిసుగలిలో జీవులను-గోధుమలను బోసి మృత్యువను స్త్రీ విసరుచున్నట్లు - నాకు గ్రాహ్యమైనది. భవచక్రమున బడియున్న అనాథుడనగు నన్ను దమబోటి సత్పురుషులు తప్ప అన్యులెవ రుద్ధరింప జేయగలరు ?" అని ప్రార్థించెను. అంత నిపటనిరంజనుడు, "ఓయీ కబీరూ! వ్యర్థముగ నేల శోకించెదవు ? విష్ణుభక్తుడవగు నీ కీ సంశయమేల ? దిసుగలిలో నున్న గోధుమలన్నియు పిండికాజాలవు. మధ్యభాగమందుండు మేకునకు, జుట్టు నున్న గోధుమలు పిండిగాక యట్లే యుండును. నీవు జెప్పినట్లుగా భవచక్రమను దిసుగలికి మధ్య రామనామమను మేకున్నది. దాని నట్లు నాశ్రయించి యున్న గోధుమలను జీవులట్లే యుండును. నీవు సత్వశాలివి, వైరాగ్యశీలుడవు, శాంతి క్షమలు నీలో పర్వతములవలె నున్నవి. స్వప్నమును జూచి యజ్ఞానులు భీతిజెందునట్లు నీవు దిసుగలిని జూచి భయపడితివి. కాన మనమునందుగల సందేహమును విడువు" మని చెప్పెను. కబీరు ప్రేమభావముతో నిపటనిరంజనునికి సాష్టాంగనమస్కారము జేసి యాతనిని నాలింగనము జేసికొని త్వరితముగా గృహము జేరెను.

కబీరు నానావిధములగు ప్రబంధములను రచియించుచు నిత్యము నానందభరితుడై ప్రేమతో భగవంతుని కళ్యాణగుణములను వర్ణించుచుండెను. ఒకసమయమున కబీ రేకాంతముగ గూర్చుండి "సద్గురుసేవ జేయని జీవితము విధవ జేసికొను అలంకారమువలెను, ఫలించక పెరుగు వృక్షమువలెను, పురుషార్థము లేని రాజువలెను, లవణహీనమగు పక్వాన్నమువలెను, నాయువులేని తరుణశరీరమువలెను, ద్రవ్యము లేని వర్తకునివలెను, మహత్త్వము లేని పరివారమువలెను, మేఘములు లేని వర్షాకాలమువలెను, జలము లేని తటాకమువలెను, తీర్థము లేని పర్వకాలమువలెను, ప్రేమలేని సంకీర్తనవలెను, మర్యాదలేని మైత్రివలెను, భూతదయలేని జ్ఞానమువలెను, పశ్చాత్తాపములేని సన్న్యాసగ్రహణమువలెను, ద్రవ్యములేని విలాసపురుషునివలెను, నియమములేని వ్రతము

వలెను, శాంతములేని మహాపురుషునివలెను, చంద్రుడులేని చాతకముల వలెను, శోభావిహీనమై మృతప్రాయముగ నుండు" నని తలచెను.

ఒకనాడు కబీరు రామానందస్వామి యాశ్రమమునకు బోయి సప్రేమతో నాతని చరణములకు వందనములుజేసి బద్ధాంజలియై నిలువబడి "ఓ సద్గురుమూర్తీ! కృపతో నన్ను మీ శిష్యునిగా నంగీకరించి మంత్రోపదేశము జేయు డని ప్రార్థించెను. అంత రామానందస్వామి "ఓరీ, కబీరూ, అవింధ వంశమున జన్మించిన నీ కుపదేశమిచ్చుటకు నా కధికారము లేదని" చెప్పెను. సీతాదేవి రాజులనెందరినో జూచి శ్రీరాముని వర్ణించినట్లును, శ్రీకృష్ణుని కీర్తి విని రుక్మిణీదేవి వర్ణించినట్లును, కబీరు మానసమున రామానందస్వామిని సద్గురువుగ వరించుటచే గురుదేవునకు నమస్కారముజేసి "ఓ సద్గురుమూర్తీ! నేను త్రికరణశుద్ధితో మీ చరణముల నాశ్రయించితిని. ఏకలవ్యుడను కిరాతకుడు మట్టితో ద్రోణాచార్యుని విగ్రహముజేసి భావపూర్వకముగ నాతనిని మానసికముగ వరించి సర్వవిద్యల నభ్యసించెను. నేనును మానసమున మిమ్ముల సద్గురునాథునిగా వరించితిని. గాన నా మనోరథము దప్పక నెరవేరు" నని చెప్పెను.

ఒకనాడు కబీరు సద్గురువు వలన రామనామము విననలెనని కోరికతో గంగానదికి బోవుమార్గమున నొక గొయ్యిని త్రవ్వి యందు శయనించెను. సూర్యోదయమునకై నిరీక్షించు కమలములవలెను, క్షుదచే తల్లిరాక కెదురుచూచు బాలకునివలెను, క్షామకాలమున వర్షముల కాశించు జనులవలెను, రామానందస్వామి గంగాస్నానమున కామార్గమున నెప్పుడు వత్తురాయని నిరీక్షించుచుండెను. ఆరాత్రి నాలుగవ ఝామున గంగాస్నానమునకై రామానందస్వామి బయలుదేరి మార్గమధ్యమున కబీరు బరుండియుండుటను జీకటిలో జూడక నాతని ద్రొక్కెను అంత రామానందస్వామి రామ-రామ పొరపాటున ఎవరినో ద్రొక్కితినని పరిపరివిధముల చింతించుచు నిశ్చేష్టుడై చూచుచుండెను. తత్క్ష




రామానందస్వామి గంగాస్నానమునకు బోవుమార్గమున
కబీరు పరుండి యుండుట

ణమే కబీరులేచి చేతులుజోడించి "ఓ గురుదేవా! నేను మీకృప నాపై
వర్షించినది. సహజముగ తమ చరణధూళియును తమ వాక్కునుండి
శ్రీరామ నామమంత్రమును లభించినవి. నావలె సమములగు సభాగ్యులీ
త్రిభువనము లందెవరు నుండరు. నేననంత జన్మలలో జేసిన సుకృతము
ఫలించినది. జననమరణ ప్రవాహమునుండి విముక్తినిచ్చు సద్గురుచరణ
ములు లభించినవి. అదృష్టకాలమునందు మట్టె బంగారమగు"నని పలికి
ఆనంద నృత్యమాడుచుండెను. ఆకలితో నున్నవారికి మృష్టాన్నములు
లభించునట్లును, వాడినవృక్షముపై వర్షము గురిసినట్లును, నాయుష్య
హీనునికి ఇంద్రు డమృతపాన మిడినట్లును, దుర్బలునకు ద్రవ్యరాశి లభిం
చినట్లును, రోగికి దివ్యరసము దొరికినట్లును, సాధకునికి సత్సాంగత్యము
లభించునట్లును, నత్తవారింటనున్న కోడలుకు తల్లి గనబడినట్లును, గౌత
మునికి గోదావరి లభించినట్లును, భాగీరథి దర్శనముచే భగీరథుడానందిం
చినట్లును, శ్రీరామదర్శనముచే హనుమంతుని కానందము గలిగినట్లును,
నారదునిజూచి వ్యాసులానందించినట్లును, కబీరు మనమున నానందము
గలిగెను. రామానందస్వామి జరునవ్వు నవ్వుచు మౌనముగా స్నానము
నకై గంగానదికిబోవుచు కబీరుతో సముడగు నిశ్చయచిత్తుని జూడ లేదని
మనమున దలచెను.

ఒకనాడు రామానందస్వామి కబీరును బరీక్షింప నిశ్చయించెను.
కబీరాసమయమున బజారువెంటబోవుచు నేత్రములనుండి ఆనందాశ్రు
వులు గారుచుండ గద్గదస్వరముతో కీర్తనలు బాడుచుండెను. ఆకీర్తన
లలో నాగురువు రామానందస్వామివారు కృపతో నాకు మంత్రోప
దేశముజేసి జననమరణ విముక్తునిగా జేసెనని వర్ణింప బడియుండెను.
రామానందస్వామి కబీరుపాడినకీర్తన దూరమునుండి విని క్రోధముతో
నచటికివచ్చి "ఓరీ. కబీరూ! నీవు నాశిష్యుడవా? నేను నీకుపదేశ మెప్పు
డిచ్చితిని? నీకుపదేశ మిచ్చినప్పుడు జూచిన సాక్షులెవరు? దెలుపు"మని
తన పాదుకనుదీసి కబీరు మస్తకముపై గట్టిగా గొట్టెను. విద్యవచ్చు
టకై బాలునుపాధ్యాయుడు గొట్టునట్లును, కన్యకు పనిపాట్లు రావలెనని

తల్లి దండించునట్లును, కబీరు నిశ్చయచిత్తమును బరీక్షించుటకై రామానందస్వామి గొట్టెను. రామానందస్వామి గొట్టిన దెబ్బకు కబీరుశిరముపై గాయముపడి రక్తము ధారలు ధారలుగ గారుచుండెను. కబీరు సంతోషముతో నచట గూడినజనులనుజూచి "అయ్యలారా! మీరెల్లరును సావధాన చిత్తముతో నేజెప్పునది వినుడు! గురుదేవులు తానుపదేశమిచ్చినప్పుడు జూచిన సాక్షులెవరని యడిగిరి; ఇప్పుడు మీరెల్లరును జూచుచుండగనే తన పాదుకను నాశిరముపై నలంకరించిరి; మీరెల్లరును బాగుగ నాలోచించు కొనుడని" చెప్పి రామానందస్వామికి నమస్కారము జేసి "ఓ సద్గురుమూర్తీ! పృధివ్యప్తేజో వాయురాకాశములను సాక్షులనుగ నుంచుకొని మీచరణములనే సేవించితి"నని చెప్పగా, రామానందస్వామి యానందభరితుడై తన వరదాభయహస్తమును కబీరు మస్తకముపైనుంచి "కబీరూ! భూమిని బరీక్షించి విత్తుల జల్లుటయు, సత్పాత్రనుజూచి దానము జేయుటయు, వరునిజూచి కన్యనిచ్చుటయు, యోగ్యములని శాస్త్రకారులు వర్ణించిరి. నేను నీచిత్తమునట్లు బరీక్షించితి"నని చెప్పి శ్రీరామమంత్ర ముపదేశించెను.

కబీరానంద పరవశుడై దురాశా లౌకికమానములను, నింద్రియ ధ్యానములను, జ్ఞానాభిమానమును, జిత్తములో జేరనీయక యహర్నిశములు హరినామసంకీర్తన జేయుచుండెను కాశీక్షేత్రములోని సర్వజనులును కబీరు ధన్యుడని కొనియాడుచుండిరి. ఆతనికీర్తి నలుదిశలయందును వ్యాపించెను. సజ్జనుల కీర్తినివిని దుర్జనులు శంకితులగునట్లును, సూర్యుడుదయించిన దీపము లజ్జపడునట్లును, చంద్రోదయమును జూచి తస్కరులు వ్యాకులచిత్తు లగునట్లును, దాతయొక్క కీర్తినివిని పాపాండులు మనస్సున జల్పించునట్లును, పతివ్రతయొక్క కీర్తివిని జారిణి మనమున సంతాపము గలుగునట్లును, కబీరుప్రతిష్ఠ దేశమంతయు వ్యాపించుచుండ కాశీక్షేత్రములోని నిందకులు సహింపజాలక యాతని కవమానముజేయుటకై పరిపరి విధముల నాలోచించుచుండిరి.

కబీరఖండముగా సాధుజనులకు సేవజేయుట వలనను, కుమారుని శిరమును గోయుటవలనను, ప్రత్యేకము మరల పునర్జీవితు డగుట వలనను నాతనికీర్తి దేశమంతయు వ్యాపించు చుండుటచే సర్వజనులును నాతనికి నమస్కారము జేయుచుండిరి. ఒకనాడు దుర్జనులెల్లరు నొకస్థలమున గూర్చుండి "కబీరుపేరుతో సంతమేళ (సాధుసమావేశము) నేర్పరచి దేశదేశములకు కరపత్రములను బంపినచో విశేషముగా సాధుజనులే తెంచ్చురు. కబీరువారలకు గౌరవ మర్యాదలు జేయజాలక పలాయితుడగును. అసంఖ్యాకముగ వచ్చియు సాధుజనులకు కష్టము గలిగిన వారలు నాతనిని శపింతురు. అందుచే కబీరునకు నిశ్చయముగ నపకీర్తి గలుగు"నని యాలోచించి హరిద్వారము, మధుర, గోకులము, బృందావనము ద్వారక మొదలగు పుణ్యక్షేత్రములకు కబీరు పేరుతో కరపత్రములనుబంపి ఒకేసమయమున కాశీక్షేత్రములనుండి సాధువులును, భక్తులును, విరక్తులును, వచ్చుట కేర్పాట్లు జేసిరి.

కబీరు పేరుతో బంపబడిన యాహ్వానపత్రికలను జూచి సాధుజను లమితానంద భరితులైరి. కబీరు నీ సమయమున దర్శింపవలెనని కుతూహలచిత్తులై వివిధక్షేత్రములనుండి యసంఖ్యాకులగు సాధుజనులును, వైష్ణవులును భజనలు జేయుచు కాశీక్షేత్రము జేరిరి. దుర్జనులు కబీరునకు రహస్యమును దెలియనీయక తేము స్వంతద్రవ్యమును వచ్చించి ఆతని కవమానము గలిగిన జూచి యానందింపవలెనని నిశ్చయించుకొనిరి. సాధుజనులు కబీరుగృహమెచటయని క్షేత్రవాసులను విచారించుచు దెలిసికొని యచటికి బోయిరి. కబీరు గృహమునుండి వెలుపలకు వచ్చి యానందముతో హరినామ సంకీర్తనలను జేయుచున్న అసంఖ్యాకులగు సాధుజనులను జూచి ఆనందపరవశుడై "నేడు మిగుల సుదినము. మహాపురుషుల దర్శనమైన" దని హర్షించుచు వారి నాలింగన వందనాదులచే పూజించుచుండెను.

శ్రీరామచంద్రుడు "తన భక్తుడును, నిస్సంగుడునగు కబీరు గృహమునకు సాధుజను లసంఖ్యాకములుగా వచ్చిరి వారి నుచితరీతిని గౌరవింపనిచో కబీరున కవమానము గలుగు" నని యోచించి తాను కబీరురూపమును ధరించి గంగానదీతీరమునకు బోయి యొక్కొక్క సాధుని కొక్కొక్క కబీరురూపమున గనబడుచు వారలకు సేవ జేయు చుండెను. కాశీక్షేత్రములోని స్త్రీ పురుషులెల్లరును ఈ కౌతుకమును జూచి నిశ్చేష్టితులైరి. భగవంతుడు ప్రతి సాధువునొద్దయు కబీరు రూపమున నుండి కొందరికి చరణప్రక్షాళనము జేయుచుండెను. కొందరికి స్నాన వసతుల నేర్పాటు చేయించుచుండెను. కొందరికి దేవపూజకై చందనము దీయుచుండెను. కొందరికి చరణసేవ జేయుచుండెను. కొందరి యెద్ద చేతులు జోడించి నమస్కరించుచుండెను. కొందరి పాదుకలు మోయుచుండెను. కొందరియొద్ద గానము జేయుచుండెను. కొందరికి భోజనము వడ్డించుచుండెను. కొందరికి తాంబూల మిచ్చుచుండెను. కొందరికి నిద్రాసనము లేర్పరచుచుండెను. కొందరితో మధురోక్తము లను బలుకుచుండెను. కొందరిని గృహమునకు రమ్మని కోరుచుండెను. కొందరికి తిలకమునకై గోపీచందన మిచ్చుచుండెను. కొందరి కద్దము జూపుచుండెను. కొందరికి తులసీమాలలు వేయుచుండెను. కొందరికి చందనము బూయుచుండెను. కొందరికి కస్తూరితిలకము దిద్దుచుండెను. కొందరికి వస్త్ర భూషణముల నర్పించుచుండెను. కొందరితో నేకాంతముగ నాత్మజ్ఞానమును జర్చించుచుండెను. కొందరికి విసరుచుండెను. కొందరివెంట నడచుచుండెను. కొందరియొద్ద పురాణము శ్రవణము జేయుచుండెను. కొందరిని పని యాజ్ఞాపింపుడని యడుగుచుండెను. కొందరికి ఫలహారము లిచ్చుచుండెను. కొందరికి చామరములతో విసరుచుండెను. సూర్యుడొకడే సర్వఘటములందును నలిప్తుడై ప్రతిబింబించునట్లు చక్రపాణియగు భగవంతుడు కబీరురూపమున సాధువులను సేవించు

చుండెను. శ్రీకృష్ణభగవంతుడు బాల్యమున గోపికల కనంతరూపములు జూపినట్లును, కౌరవుల పంక్తికి ద్రౌపదీదేవి వడ్డన జేయుచుండ నామెకవమానము గలుగకుండ శ్రీకృష్ణుడు ద్రౌపదీరూపమును ధరించి దుర్యోధను నవమానపరచినట్లు, శ్రీరాము డనంతరూపములు ధరించి తన భక్తుడగు కబీరున కవమానము గలుగకుండ మూడుదినములు సాధువులకు సేవజేసి వారలకు వస్త్ర భూషణాది సన్మానములను జేసి సాధుజనుల నెల్లరి నొకచోట జేర్చి శ్రీరాము డంతర్ధాడయ్యెను. దుర్జనులనుతాప చిత్తముతో కబీరునకు సాష్టాంగ నమస్కారము జేసి "మహాత్మా! నీ మహిమవిశేషము నెరుగక యపచారము జేసితి" మని క్షమార్పణ గోరుకొని నాటినుండియు కబీరుతో గలసి నిత్యము హరినామ సంకీర్తన జేయుచు ధన్యులైరి.

ఏడవ యధ్యాయము సమాప్తము.

శ్రీ రామచంద్రాయనమః

---

# శ్రీ జ్ఞానేశ్వర చరిత్ర

## — ఎనిమిదవ అధ్యాయము —

నేడు భక్తుల సచ్చరిత్రలు భక్త విజయగ్రంథమున శ్రవణము జేయు యోగము లభించుటచే సుదినము. ప్రేమతో శ్రవణము జేయు వారికిని, జదివి జెప్పువారికిని సుధారసము లభించును. భక్త కథలను సుధారసములని వర్ణించుటకే దృష్టాంతమును యోగ్యమైనది లభించుటలేదు. అమృతపానమువలన నింద్రునికి స్థిరమగు నక్షయపదము ప్రాప్తించలేదు. భక్త కథారసము సేవించువారికి నిశ్చయముగ నక్షయ పదమ్ము లభించును. భక్తచరిత్ర శ్రవణమువలన జనన మరణ విముక్తి యగును. భక్తుల సచ్చరిత్రలకు గంగ నుపమానముగ సరిపోల్చుట యోగ్యముగ గనబడుటలేదు. పర్వకాలమున త్రివేణీసంగమమునందు స్నానము జేసినవారికి మోక్షము లభించును భక్తకథారస మట్లుగాక శ్రవణము జేయు శ్రోతలను సర్వకాలములందును పావనము జేయును. కనుకనే చతుర్ముఖులగు సర్వజ్ఞులు భక్త కథారసములను సుధారసమని నిరూపించిరి. సూర్యునికంటె నతి ప్రకాశమును, చంద్రునికంటె మిగుల శీతలమును, నాకాశముకంటె నైర్మల్యము గలవి, భక్తుల సచ్చరిత్రలని నిరూపింపబడినవి.

ఒకానొక సమయమున నాకస్మికముగ కైలాసనాథుడును, విధాతయు, క్షీరసాగరమునకేగి శ్రీ మహావిష్ణువుకు సేవించిరి. క్షీరాబ్ధివాసుడు బ్రహ్మను, శంకరుని జూచి "భూలోకమున భక్తిమార్గము నశించినది. మనము నివృత్తిదేవ, జ్ఞానదేవ, సోపానదేవులను నామములతో నొకప్రదేశమున సోదరులముగను, నాదిశక్తి ముక్తాబాయియను నామముతో మనకు సోదరిగను నవతరించి భక్తిమార్గమును దిరిగి ప్రతిష్ఠించి వత్తము రండు" అనగా బ్రహ్మయు, శంకరుడును శ్రీ మహావిష్ణువునకు వందనములర్పించి "తమ యాజ్ఞానుసారము జన్మింతు" మని చెప్పిరి.

మహారాష్ట్ర దేశమును సుమారు ఏడువందల సంవత్సరముల క్రితము రామదేవరాయను పేరుగల యాదవరాజు పాలించుచుండెను ఆతడు ధర్మనిష్ఠాపరుడై, ప్రజల హితము నపేక్షించువాడై యుండెను. ఆ కాలమున నా రాజధానిలో గోదావరీతీరమున దుత్తరభాగమున పైఠనపురమను పేరుగల మహాక్షేత్రముండెను. ఆ క్షేత్రమునకు నాలుగు క్రోసుల దూరమున "ఆపేగావ్" అను పేరుగల గ్రామముండెను. అచ్చట జ్ఞానేశ్వరుల పూర్వజులు కొన్నితరములనుండి కరిణీకము జేయుచుండిరి. మాధ్యందిన శాఖకుజెందిన పంచప్రవరుడును, వత్సగోత్రీకుడును, యజుర్వేదిదేశస్థ బ్రాహ్మణ గృహస్థుడును, పరమ భాగ్యవంతుడును, విష్ణుభక్తుడును, జ్ఞానేశ్వరుల పితామహుడును నగు గోవిందపంత్ అను సత్పురుషుడుండెను. ఆతనికి ధర్మనిష్ఠాపరురాలును, పతివ్రతా శిరోమణియును నగు నీరాబాయి యను పేరుగల సత్కళత్రముండెను. ఈ వంశీయులు నాథ సాంప్రదాయ శిష్యులుగను, గోరక్షనాథు ననుగ్రహపాత్రులై యుండిరి. ఈ దంపతులకు సంతతి లేదను చింత బాధించుచుండ సద్గురుకృపచే గోవిందపంత్ న కేబదియైదవ సంవత్సరమున నాతని భార్యయగు నీరాబాయి గర్భవతియై ఈశ్వరానుగ్రహమున నొక శుభ ముహూర్తమందు ప్రసూతియై భక్తిజ్ఞాన వైరాగ్యములే బాలకుని రూపమున నవతరించినవనదగు బాలకుడు జన్మించెను. ఈ బాలుడే జ్ఞానేశ్వరుల జనకుడు. పన్నెండవ దినమున జాతకర్మ గావించి 'విఠోబా' యను నామకరణము జేసిరి.

విఠోబా దినదిన ప్రవర్ధమానముగ పెరవాడగుచుండ నక్షర స్వీకారమును, నుపనయనసంస్కారమును నేడవదవ సంవత్సరముల వయస్సు లోపలనే గావింపబడెను. విఠోబా వేదశాస్త్రముల సాంగోపాంగముగ నభ్యసించి కావ్య వ్యాకరణములయందు ప్రవీణుడయ్యెను. కొంతకాలము జరిగినపిదప విఠోబాకు దీర్ఘాటన జేయ దృఢసంకల్పము గలిగి యనుతప్తచిత్తుడై పుష్కరాది తీర్థముల సేవించి వచ్చుటకు తన కాజ్ఞనీయుడని జననీ జనకుల ప్రార్థించెను. వారాతని మనోనిశ్చయమున కానందించి త్వరితముగ యాత్రల సేవించి రమ్మని యాశీర్వదించిరి.

విసోబా జననీ జనకుల యాజ్ఞ దీసికొని యనుతప్తచిత్తుడై తీర్థయాత్రల సేవించుటకు బయలుదేరెను. వైరాగ్యము చిత్తమునందు గలుగకయెడల జేసిన శాస్త్రాభ్యాసములును, జెవిటివానికి పెద్దచెవులుండుటయు, నెమలిశరీరమునందన్నియు నగుపడని నేత్రములుండుటయు, భగవద్గుణానుభవములేగాని సుందరగానమును, విధవ యూవనమును, నాసికావిహీనమగు ముఖమును, మహత్త్వములేని పరివారమును, పురుషత్వములేని పురుషుడును, వ్యర్థములు. అవి మత్స్యమునకై బకము జేయు నసుస్థానమువలె నుండును. కాబట్టి విసోబా పశ్చాత్తాపముతో మాయామమతను త్యజించి హరినామ సంకీర్తన జేయుచు గొంతకాలమునకు ద్వారకాక్షేత్రము జేరెను.

విసోబా గోమతిలో స్నానముజేసి శ్రీకృష్ణ భగవానుని దర్శించి ప్రేమతో సాష్టాంగ నమస్కారము జేసెను. అచ్చటనుండి బయలుదేరి పిండారమును మంగళహూడాను సేవించి ద్వారకా కలశమునుజూచి సుధామపురిని శ్రీ రుక్మిణీకృష్ణుల వివాహము జరిగినమూల మాధవ క్షేత్రమును దర్శించి శ్రీకృష్ణుడవతారము చాలించిన భాలుకా తీర్థమును ప్రభాసలింగమును దర్శించి పిదప త్వరితముగా సోరటి సోమనాథమును, కాలయవనమును, విశ్రాంతి స్థానమగు ధవళపురిని, మార్గమధ్యమునందు జగద్విఖ్యాతములగు పురాణ ప్రసిద్ధ తీర్థక్షేత్రములను దర్శించి, సప్తశృంగముజేరెను. ఆదిమాయకు నమస్కరించి అరుణావరుణ స్నానముజేసి, యచ్చటనుండి బయలుదేరి ప్రాచీన గోదావరినిజూచి కపాలేశ్వరమును, త్ర్యంబకమును సేవించి, కుశావర్తి స్నానముజేసి గంగాద్వారమునకు వందనముజేసెను. ప్రతిదినము మార్గమధ్యమునందు హరినామసంకీర్తనలతో గాలము గడుపుచు, పూనా నగరమునకు పదునాలుగు మైళ్ళ దూరములోనున్న యలకావతియను అళందీ క్షేత్రము జేరెను.

విసోబా చక్రతీర్థములో స్నానముజేసి, ఘట్టమున గూర్చుండి దేవతార్చన జేయుచుండెను. ఆ క్షేత్రమున బుర్యానంతుడును, ఎరనుభాపుకుడును, సిద్ధోపంత్ అను పేరుగల సద్బ్రాహ్మణ గృహస్థుడుండెను

అతడు ప్రతిదినము ప్రాతఃకాలమునందు చక్రతీర్థములో స్నానముజేసి సిద్ధేశ్వరుని దర్శించి, నదీతీరమునగల నతిథుల దీసికొని తన పంక్తిలో గూర్చుండబెట్టుకొని నియమముతో భుజించుచుండెను. పూర్వపుణ్య విశేషమువలన సిద్ధోపంతునకు పుష్కలముగ నైశ్వర్యమును, సత్కళత్ర మును, దేవాంశతో జన్మించిన యొకపుత్రికయు ప్రజలలో మానమర్యా దలును, పూర్ణముగ నుండెను. ఒక దినమున సిందోపంత్ చక్రతీర్థ ములో స్నానముజేసి సిద్ధేశ్వరస్వామి దర్శనము జేసికొని తన నియ మాను సారముగ నదీతీరమున నతిథుల కొరకు జూచుచుండెను. దైవ యోగముచే నాదినము నతిథులెవ్వరును వచ్చుట గన్పించక ఘట్ట మున దేవతార్చన జేయుచున్న విఠోబా బ్రహ్మచారి మాత్రముండు టనుజూచి సిదోపంత్ సత్వరమే నాతనియొద్దకుబోయి సాష్టాంగ నమ స్కారముజేసి "స్వామీ! తామెచటనుండి విచ్చేసితిరి. తమ స్థాన మును నామమును దెలుపుడని కోరెను.

విఠోబా సిద్ధోపంత్‌కు ప్రతినమస్కారము జేసి "అయ్యా! గంగా నదీతీరమునందు 'ఆపేగావ్' యను గ్రామము గలదు. అచ్చట చిర కాలమునుండి కరిణీకవృత్తి చేయుచున్న వృద్ధులగు నా జననీ జనకు లున్నారు. నేను వారియాజ్ఞను బొంది తీర్థయాత్రాపరుడనై ద్వార కాది సర్వయాత్రలను సేవించి యలకావతీక్షేత్రము జేరితి" నని జెప్పెను. అంత సిద్ధోపంత్ హర్షచిత్తుడై "స్వామీ! నేడు గొప్ప సుది నము. అయాచితముగా తమ దర్శనము లభించినది. నా యాశ్రమమ్ము నకు దయచేసి భిక్ష స్వీకరించి మమ్ము పవిత్రులనుగా జేయుడని" ప్రార్థిం చెను. విఠోబా సిద్ధోపంత్ ప్రార్థనకు లోబడి యాతనివెంట నాశ్రమము నకు బోగా, సిద్ధోపంత్ బ్రహ్మచారి పాదములనుగడిగి యుచితాసనం బున గూర్చుండబెట్టి, ధూపదీపాదులచే బూజించి భోజన తాంబూలాదు లర్పించెను. ఆ దినమంతయు విఠోభాయును సిద్ధోపంతు నాధ్యాత్మిక విష యముల జర్చించుకొనుచు కాలము గడపి రాత్రి యిరువురును నొకే ప్రదేశమునందు నిద్రించిరి. సిద్ధోపంత్ స్వప్నమున శ్రీ పంఢరీనాథుడు

సాక్షాత్కరించి "వత్సా! ఈ బ్రహ్మచారి దేహాంశ సంభూతుడు. ఈతనికి నీపుత్రికయగు రుక్మాబాయినిచ్చి వివాహము జేయుము. వీరి గర్భము నందు మానవరూపములతో త్రిమూర్తులును, నాదిశక్తియు, లోకోద్ధారణకై యవతరించ నున్నార"ని చెప్పి యంతర్ధాన మయ్యెను. సిద్ధోపంత్ తక్షణమే నిద్రనుండి మేల్కాని స్వప్నవృత్తాంతమును మననము జేసికొని యత్యానందము నొంది, స్వప్నవృత్తాంతమును భార్యకును కుమార్తెకును దెలుపగా వారును నానందించిరి. పిదప సిద్ధోపంత్ బ్రహ్మచారికి "నాస్వప్నములో మీకు సాలంకృత కన్యాదానము జేయుమని భగవంతు డాజ్ఞనిచ్చె"నని చెప్పెను. అంత విఠోభా సిద్ధోపంత్తో "అయ్యా! స్వప్నవిషయమును భగవదాజ్ఞగా భావించుట యుక్తము గాదు. భగవంతుడు యదార్థముగా మీకు మార్తెను నాకిచ్చి పెండ్లి జేయుమని యాజ్ఞ నిచ్చినయెడల నాకుమాత్రము మీకుమార్తెను వివాహము జేసికొమ్మని యెందుల కాజ్ఞ నీయడు. నేనీ విషయమును యథార్థముగ భావింప"నని చెప్పెను.

సిద్ధోపంత్ చేతులుజోడించి "అయ్యా! తాము జెప్పినవిషయము యదార్థము, నాకు స్వప్నమున నాజ్ఞనిచ్చిన భగవంతుడు మీకును నాజ్ఞనిచ్చు"నని జెప్పి యాదినముకూడ బలాత్కారముగా విఠోభాను తన గృహమునందుంచుకొనెను. విశ్వవ్యాపకుడగు శ్రీ పంఢరీనాథుడా రాత్రి విఠోభా స్వప్నమున సాక్షాత్కరించి "వత్సా! నాయాజ్ఞ నుల్లంఘన జేయకుము. సిద్ధోపంత్ కుమార్తెయగు రుక్మాబాయిని వివాహమాడుము. మీ గర్భములందు లోకోద్ధారణ జేయుటకై త్రిమూర్తులును నాదిశక్తియు జన్మించనున్నార"ని జెప్పి యంతర్ధాన మయ్యెను. తత్ క్షణమే విఠోబా నిద్రనుండి లేచి కూర్చుండి స్వప్నవృత్తాంతమును మననము జేయుచుండెను. సిద్ధోపంత్ నిద్రనుండి లేచి విఠోభాకు భగవంతుడు స్వప్నమున నాజ్ఞనిచ్చి యుండునని దలచి, ఆతనికి సాష్టాంగ నమస్కారముజేసి "స్వామీ! భగవంతుడు స్వప్నమున గనబడి యాజ్ఞ నిచ్చెనా? యని విచారించెను. విఠోబా తన స్వప్నవృత్తాంతమును సవి

స్తరముగ దెలుప సిద్ధోపంత్ ఆనందభరితు డాయెను. పిదప సిద్ధోపంత్ శాస్త్రజ్ఞులను రప్పించి విఠోబా రుక్మాబాయిలకు రాశి నక్షత్రము లందు ముప్పదియారు గుణములును బలయుక్తముగ నున్నవని దెలిసికొని కన్యాదానమునకు సుముహూర్తము స్వల్పవ్యవధిలో గుదురుటచే నానందించి వలయు ఏర్పాట్లన్నియు జేసి బంధుమిత్రాదులకు శుభాహ్వానములు బంపిరి.

దేవబ్రాహ్మణోత్తములును, బంధుమిత్రాదులును విశేషముగ వచ్చిరి. సుముహూర్తమున మంగళవాద్యములతోను, పురోహితుల స్వస్తివచనములతోను మిగుల వైభవముగా విఠోబాకును రుక్మాబాయికిని పాణిగ్రహణ మహోత్సవము జరుపబడెను. బ్రాహ్మణభోజనము సీమంత పూజనాదులు సక్రమముగ జరుపబడెను. విప్రోత్తములిట్లు మంగళాష్టకములను బలికిరి. "జయజయ ముకుంద మురారీ పురాణపురుషా, మధుకైటభారీ, భక్తభూషణా, సర్వవిధముల వధూవరుల రక్షింపుము. జయజయ శంఖాసురమర్దనా, కూర్మరూపా, సముద్రమథనా, వరాహవేషా, హిరణ్యాక్షభంజనా, వధూవరుల రక్షింపుము. జయజయ నృసింహ ప్రహ్లాదరక్షకా, వామనరూపా, బలిఛలకా, పరశుధరా, సహస్రబాహ్వాంతకా, వధూవరుల రక్షింపుము. జయజయ దశరథకుమారా, నిశాచరమర్దనా, గోకులనటకా, నందనందనా, బుద్ధరూపా, జనార్దనా వధూవరుల రక్షింపుము. జయజయ కల్కిరూపా, మ్లేచ్ఛమర్దనా, ధర్మస్థాపకా, జగజ్జీవనా, పుండలీకవరదా, రుక్మిణీరమణా వధూవరుల రక్షింపుము.

విప్రోత్తములు మంగళాష్టకములతో సావధానవచనములు బలికిరి. వివాహవైభవములు నాలుగుదినములు మిగుల వేడుకతో జరుపబడెను. విఠోబా తన మామయగు సిద్ధోపంత్‌కు నమస్కారము జేసి పంఢరీపురములో జరుగు నాషాఢైకాదశీ బ్రహ్మోత్సవము సమీపించుచున్నది. నేను పోయి శ్రీ పాండురంగదేవుని దర్శించి వచ్చుటకు నా కాజ్ఞ నిప్పింపుడని కోరెను. అంత సిద్ధోపంత్ "విఠోబా! సతీసమేతముగ

యాత్రజేయుట యావశ్యకము నేమును సకుటుంబముగో వచ్చెద” మని జెప్పి బయలుదేరెను. విఠోబా అత్తమామలతోను భార్యతోను గలిసి హరినామ సంకీర్తన జేయుచు, పంఢరీపురములో బ్రవేశించెను. చంద్రభాగానదిలో స్నానముజేసి పుండలీకభక్తుని సేవించెను. పంఢరీపురమునకు సమమగు క్షేత్రము భూలోకమున లేదు. ఉపమానముగ వర్ణించుటకు యోగ్యమగు నుపమానము లభించదు. చంద్రునితో సమమగు నక్షత్రమును, సువర్ణముతో సమమగు ధాతువును, విష్ణువుతో సమమగు కీర్తి గలవారును, కౌస్తుభమణితో సమమగు రత్నమును, నందీశ్వరునితో సమమగు వృషభమును, శంకరునితో సమమగు తపస్వియు, గీతతో సమమగు శాస్త్రగ్రంథమును, రామకృష్ణ నామముతో సమమగు మంత్రమును, భాగవతధర్మముతో సమమగు ధర్మమును లేనట్లు పంఢరీపురముతో సమమగు క్షేత్రము భూమండలమున లేదు. ఆ క్షేత్రదర్శనమాత్రము చేతనే పాపసమూహములు గూలిపోవును. మోక్షదాయకమగు సప్తపురి (ద్వారక) కంటె శ్రేష్ఠమైనది పంఢరీపురము. ఆ క్షేత్ర దర్శనమువలన నభిమానము నశించును. ఇతర క్షేత్ర దర్శనమువలన నభిమానము వృద్ధిబొందును. పంఢరీపురములో తంబుర తాళ మృదంగాది వాద్యములతో భక్తులు నృత్య సంకీర్తనలు జేయుచుండ కౌతుకమును జూచి కైలాసపతియగు శంకరుడు స్వానందముతో నూగులాడుచుండును. సిద్ధోపంతయును, విఠోబాయును క్షేత్ర ప్రదక్షిణజేసి మహాద్వారములో బ్రవేశించి సాష్టాంగ నమస్కారముజేసి గరుడ హనుమంతులను సేవించి కన్యా జామాతలతో సిద్ధోపంత్ శ్రీ పంఢరీనాథుని షోడశోపచారవిధుల నర్ఘ్య దీప ధూపాద్యుపచారములచే బూజించి యాలింగన వందనాదులు జేసికొని బ్రహ్మోత్సవము పూర్తిగా సేవించి సిద్ధోపంత్ కుటుంబ పరివారసమేతుడై స్వస్థానమగు అళందీక్షేత్రము జేరెను. విఠోబా యచట గొలది దినములుండి మామగారితో తన యాత్ర యింకను బూర్తికాలేదనియు, రామేశ్వరాది దక్షిణయాత్రలు సత్వరమే బూర్తిజేసికొని వచ్చుట కాజ్ఞ నీయవలయు

నని గోరెను. విఠోబా యాంతర్యమును సిద్ధోపంత్ గ్రహించి శీఘ్రమే యాత్రలను సేవించి రమ్మని జెప్పెను.

విఠోబా శ్రీ పాండురంగదేవునికి నమస్కరించి సత్వరమే యచట నుండి బయలుదేరి మార్గమధ్యమున గల పురాణ ప్రసిద్ధక్షేత్రములను సేవించుచు, శ్రీశైలము జేరి మల్లికార్జునుని దర్శించెను. దర్శనమాత్రము ననే పాపముల భస్మముజేయు నివృత్తిసంగమమును సేవించి, హృదయ మున శ్రీ విఠ్ఠలమూర్తిని నిలుపుకొని, యఖండముగా హరినామ సంకీ ర్తన జేయుచు, అహోబలము, నారసింహ క్షేత్రమును, వెంకటాచల మును, అరుణాచలమును చిదంబరమును, దర్శించి యచ్చటనుండి బయలుదేరి గోకర్ణము సేవించి హాటకేశ్వర స్నానముజేసి యచ్చట నుండి సీతాదేవిని శోధించుటకై హనుమంతు డెగిరిన పర్వతమును జూచి, యచటనుండి జనార్దమును సేవించి పిదప రామేశ్వరము జేరి తన కోరికను బూర్తిజేసికొని యచ్చటనుండి కొల్హాపురము జేరి పంచ గంగలలో స్నానముజేసి, మహాలక్ష్మిని సేవించి, యచ్చటనుండి కృష్ణా తీరము జేరి మాహులీసంగమములో స్నానముజేసి సత్వరమే యచట నుండి బయలుదేరి గొన్ని దినములకు అలకావతీక్షేత్రము జేరెను. విఠోబా శ్వశురగృహమున నాలుగు దినము లుండి, అత్త మామలకు వందనములుజేసి, "తల్లిదండ్రులను సేవించుటకు బోయెదను. ఆజ్ఞనిప్పించు" డని సిద్ధోపంత్‌ను గోరెను. "జననీజనకుల సతీసమేతముగా నవశ్యముగా సేవింపుడు. మీవెంట మేమును వచ్చెద"మని జెప్పి సిద్ధోపంత్ పుత్రికా జామాతలనువెంటబెట్టుకొని ఆపేగాంవ్ జేరి తన వియ్యంకుడగు గోవింద పంత్‌ను దర్శించెను. విఠోబా తన జననీజనకులకుసాష్టాంగనమస్కారము జేసెను. సిద్ధోపంత్ వియ్యంకునితో "భగవదాజ్ఞ ప్రకారము మీకుమారు నికి నా కుమార్తెనిచ్చి వివాహము దేవబ్రాహ్మణులు సమక్షమున జరిపించితిని. వ్యవధిలేనందున తమకు వర్తమాన మంపుట కవకాశము కలుగలేద"ని జెప్పెను. నీరాబాయి ఆనందభరితురాలై శ్రీరఘునాధుడు, సీతాదేవిని వివాహమాడి యయోధ్యా పట్టణముజేరగా, సీతారాము

లను జూచి కౌసల్య యమితానందము బొందినట్లును, నర్జునుడు మత్స్య యంత్రమును గొట్టి ద్రౌపదిని దీసికొనిరాగా 'ద్రౌపది అర్జునుల' జూచి కుంతీదేవి యానందించునట్లును, నీరాబాయి కుమారుని గోడలిని జూచి యానందాబ్ధి నోలలాడెను. సిద్ధోపంత్ వస్త్రభూషణాదులను గోవింద పంత్ కును నీరాబాయికిని యిచ్చి వారియాజ్ఞ దీసికొని స్వస్థానమగు అళందీక్షేత్రము జేరెను.

ఇట్లు కొంతకాలము జరిగినపిదప ఒకానొక దినమందు విఠోబా జననీజనకులు దేహమును దృజించి యీశ్వరసాన్నిధ్య మలంకరించిరి. సంసార చింతావిముఖుడగు విఠోబా త్రికాలములయందును సమాధాన చిత్తుడై యుండెను. సర్వనదులువచ్చి సముద్రములో గలిసినను సముద్రము పెద్దదిగానట్లును, వేసవికాలమునందు సముద్రజలము ఉష్ణము గానట్లును, విఠోబా సుఖదుఃఖములను మనంబున సమముగా జూచు చుండెను. గోవిందపంత్ను, నీరాబాయియు, మరణించినట్లు సిద్ధోపంత్ కు దెలిసి అల్లునికి ఖేదము గలుగునని దలచి సత్వరమే నాతనిని పరామర్శించుటకై ఆపేగ్రామముజేరి విఠోబాను దర్శించి సమాధాన వచనములతో పరామర్శజేసి 'మీరు ఉదాసీనులును విరక్తులునై యున్నారు. గృహస్థాశ్రమములో నిత్యానిత్యములందును సర్వపదార్థములును గావలసి యుండును. నాయందు కృపయుంచి నాతో అళందీ క్షేత్రమునకు వచ్చి యచ్చటనే వసింపుడు. మీయాచరణ లోకమునకు విపరీతముగా నున్న"దనిజెప్పి విఠోబాను సమాధాన పరచి పుత్రికా జామాతలను వెంటబెట్టుకొని సిద్ధోపంత్ అళందీక్షేత్రము జేరెను.

విఠోబా అళందీ క్షేత్రమున వసించుచు నహర్నిశములు హరి నామసంకీర్తన జేయుచు సత్పురుషులను సేవించుచు, నాషాఢ కార్తీక శుద్ధైకాదశులకు పంఢరీక్షేత్రమునకుబోయి బ్రహ్మోత్సవమును దర్శించి వచ్చుచుండెను. ఇట్లు బహుకాలము జరిగెనుగాని విఠోబాకు సంతానము గలుగలేదు. విఠోబా ఒకనాడు తనభార్యతో "నాచిత్త ముదాసీనముగ

నున్నది. నేను వారణాసీక్షేత్రమునకు బోయి సన్యాసాశ్రమము స్వీకరిం పవలెనను కోరికతో నున్నాను. కాన ననుజ్ఞనిమ్ము"ని రుక్మాబాయి నడి గెను. రుక్మాబాయి చింతాక్రాంతురాలై ప్రాణనాథుడు సన్యాసాశ్రమ మును స్వీకరించుట కనుజ్ఞ నడుగుచున్నాడని తండ్రితో జెప్పెను. సిద్ధో పంత్ కుమార్తెనుజూచి తల్లీ! నీవు దుఃఖింపకుము. సంతానము గలు గక పూర్వము సన్యాసాశ్రమము స్వీకరించరాదని శ్రుతి చెప్పుచున్నది. నీభర్త వేదశాస్త్రములను బూర్ణముగా నభ్యసించినవాడు. శ్రుతివాక్య మునకు విరుద్ధముగా నాత డెప్పుడును బ్రవర్తింపడు. సంతతి గలుగక పూర్వము సన్యాసాశ్రమము స్వీకరించుటకు భార్య యనుమతి ముఖ్యము గాన నీవు సావధానముగ నుండుము. ఏ సమయము నందైనను ఈవిష యమున మరపులో నుండక యాత డడిగినప్పుడు మౌన మవలంబించు చుండుమని జెప్పెను. రుక్మాబాయి తండ్రి జెప్పినప్రకారము సావధాన చిత్తముతో బ్రవర్తించుచు విఠోబా యడిగినప్పుడు మౌన మవలంబించు చుండెను.

ఇట్లు కొన్ని దినములు జరిగిన పిదప నొకనాటిరాత్రి రుక్మాబాయి గాఢనిద్రలో నుండుటజూచి విఠోబా యామెదగ్గరకుబోయి జేతితోదట్టి కాశికి బోవుచున్నానని బలుకగా రుక్మాబాయి గాఢనిద్రలోనుండి గడ లుచు 'ఊ' యన విఠోబా ఆనందముతో భార్య యనుజ్ఞ నిచ్చినదని దలచి తత్క్షణమే బయలుదేరెను. గారడివానియొద్ద నున్న పాము దప్పిం చుకొనిబోయి యరణ్యములో బ్రవేశించినట్లును, పంజరమున నున్న చిలుక తప్పించుకొని వృక్షముపై కెగిరిపోవునట్లును, కుటిలజనుల సభ నుండి దొలగిపోయి సజ్జనుడు సమాధానము బొందునట్లును, పతివ్రత జారిణులనుండి తప్పించుకొనిపోయి యేకాంతముగ నుండునట్లును, వ్యాఘ్రమునుండి లేళ్ళు దప్పించుకొని యకస్మాత్తుగా బరుగిడునట్లును, నిందక గ్రామమునుండి సజ్జనుడు మహాక్షేత్రము జేరునట్లును, రంభ యొద్దనుండి శ్రీశుకులు లేచి దూరముగా బోవునట్లును, నగస్త్యఋషి యుదరమునుండి సముద్రము వెలుపలకు వచ్చునట్లును, విఠోబా సమా ధాన చిత్తుడై కాశీక్షేత్రములో బ్రవేశించెను.

విఠోబా నిత్యము గంగాస్నానమును, శ్రీవిశ్వేశ్వర దర్శనము జేయుచు, సాధువులను, వైష్ణవులను, సేవించుచుండెను. ఒకనాడు శ్రీరామాశ్రమమునకు బోయి గీతావ్యాఖ్యానమునందు సన్యాస యోగము శ్రవణము జేసెను, దుస్తరమగు సంసారమును మాయా మోహములను త్యజించి జననమరణ విముక్తి బొందుటెట్లని విఠోబా పరిపరివిధముల యోచించెను. ఆ యాశ్రమమునందు మహావిరక్తుడును, తపస్వియు, శ్రుతిశాస్త్రజ్ఞుడును, శ్రీపాదస్వామి యను యతీశ్వరుడుండెను. విఠోబా శ్రీపాదస్వామికి సాష్టాంగ నమస్కారము జేసి తనకు సన్యాసాశ్రమ దీక్ష ననుగ్రహింపుడని ప్రార్థించెను. అంత శ్రీపాదస్వామి పూర్వాశ్రమమునందు "నీకు భార్యాపుత్రులు బంధువులు పరివారము నెవరున్నా"రని విచారించగా విఠోబా చేతులుమోడించి "అయ్యా! నే నేకాకిని, దారపుత్రాదు లెవరును లేరు. పశ్చాత్తాప తప్తచిత్తుడనై తమ్మా శరణుబొందితినని ప్రత్యుత్తర మిచ్చెను. విఠోబా విరక్తుడుగ గనబడు చుండుటవలనను నేకాకినని జెప్పుట వలనను, శ్రీపాదస్వామి యుపదేశ్య మని మంత్రోపదేశము జేసి సన్యాసాశ్రమదీక్ష ననుగ్రహించెను.

విఠోబా చతుర్థాశ్రమము కాశీక్షేత్రములో స్వీకరించెనని కర్ణాకర్ణికగా కొంతకాలమునకు సిద్ధోపంతునకు దెలిసెను. రుక్మాబాయి యీ వార్తను విని చింతాక్రాంతురాలై "ప్రాణనాథా! నన్నీ వనమునందు విడచిపోతివా?" యని రోదనము జేయుచుండెను. పాండవుల వియోగము వలన ద్రౌపదీసతియును, నలుని వియోగము వలన దమయంతియు, హరిశ్చంద్రుని వియోగము వలన తారామతియు, దుఃఖించినట్లును, సత్యవంతుని మరణమువలన సావిత్రి ప్రాణము విడువదలచినట్లును జయదేవుల నిర్యాణ వార్తవలన పద్మావతి మూర్ఛిల్లినట్లును, రుక్మాబాయి మూర్ఛిల్లెను తల్లిదండ్రులామెను సమాధాన పరచి ధైర్యముజెప్పి యశ్వత్థనారాయణునికి నియమముగా ప్రదక్షిణ నమస్కారముల జేసిన నిచ్ఛితకార్యములు సానుకూలమగును నీ భర్త త్వరలో నీకు లభించు నని జెప్పి అప్పటినుండియు రుక్మాబాయి ప్రతిదినము ప్రాతఃకాల మింద్రా

యణీనదిలో స్నానము జేసి యశ్వత్థనారాయణునికి ప్రదక్షిణాలు జేయుచు, కాలమును వృథాగాబోనీక గీతాభాగవతాది సద్గ్రంథ పఠనములకును, హరినామ సంకీర్తనలకును నుపయోగించుచు నన్నాహారముల ద్యజించి ఘోరమగు ననుష్ఠానము జేయుచుండెను.

రుక్మాబాయి జేయు ననుష్ఠానశక్తి శ్రీపాదస్వామి మనమును కదలించెను. శ్రీపాదస్వామి తన మనస్సు స్వాధీనము తప్పుటచే నాశ్చర్యములో మనస్సు గుదుట పడుటకు తీర్థయాత్రలు జేసి మహాపురుషుల సేవించవలెనని నిశ్చయించుకొని యాశ్రమయాజమాన్యము విఠోబా కప్పగించి బయలుదేరెను. రుక్మాబాయి జేయుచున్న ననుష్ఠానశక్తి శ్రీపాదస్వామి నలకావతీక్షేత్రమునకు దీసికొనిపోయెను. శ్రీపాదస్వామి యింద్రాయణీనదిలో స్నానము జేసి యశ్వత్థనారాయణు నొద్ద గూర్చుండి యనుష్ఠానము జేసికొనుచుండెను. రుక్మాబాయి నియమానుసారముగా ప్రదక్షిణాలకై వచ్చి యనుష్ఠానములోనున్న శ్రీపాదస్వామిని జూచి మహాత్ము లెవరో విచ్చేసిరి; వారిని సేవించుట యావశ్యకమని దలచి ప్రథమమున శ్రీపాదస్వామికి సాష్టాంగ నమస్కారము జేసెను. అంత శ్రీపాదస్వామి రుక్మాబాయినిజూచి కృపతో 'అష్టపుత్ర సౌభాగ్యవతీ' యని యాశీర్వదించెను. రుక్మాబాయి ఆశ్చర్యముతో నవ్వుచు, పిదప నేడ్చుచు నుండుటను శ్రీపాదస్వామి జూచి తల్లీ! నీవు ప్రథమమున నవ్వుచు మరల దుఃఖించుటకు కారణమేమి దెలుపుమన రుక్మాబాయి చేతులుజోడించి "ఓ యతిరాజా! తాము సౌభాగ్యదాయక పుత్రవతీయని నన్నాశీర్వదించితిరి. అందుచే సంతోషము గలిగినది. మహాత్ములగు తమ యమోఘాశీర్వచనము భర్తలేని నావిషయమున నిష్ఫలమైనదని దుఃఖము కలుగుచున్న" దని జెప్పెను. అంత శ్రీపాదస్వామి నిశ్చేష్టుడై "ఓ తల్లీ! నీ భర్త విషయమేమి దెలుపు" మన రుక్మాబాయి అశ్రుధారలు విడచుచు యతీశ్వరా! నా ప్రాణేశ్వరుడు నన్నువిడచి యనుతాపముతో కాశీక్షేత్రమున శ్రీపాదస్వామి యొద్ద సన్న్యాసాశ్రమమును స్వీకరించెను. నిర్భాగ్యురాలనగు నన్ను

తా మాశీర్వదించితిరి. అగ్నిలో మాడిన బీజము భూమిలో నాటిన దో మేఘరాజు కృపతో వర్షించినను నంకురించనటుల, తాము యోచించక వ్యర్థముగా నన్నాశీర్వదించుటచే దమ యాశీర్వచనము నిరుపయోగ మైనది. అంధునకు జూపిన అద్దమును, చెవిటివాని యెదుట జేయు గాన మును, రోగికి వడ్డించు బక్వాన్నములను వ్యర్థములగునట్లు తమ యాశీ ర్వచనము నా విషయమున వ్యర్థమైనది. కట్టెలులేనిది యూదినను నగ్ని ప్రజ్వలింపనట్లును, తైలములేనిది దీపము వెలుగనట్లును, వర్షించనిది భూమిలో విత్తులు నాటిన వ్యర్థమగునట్లును, నాయుర్విహీనునికి దివ్యౌష ధము వైద్యుడిచ్చినట్లును, సూర్యాస్తమానమైన పిదప నర్ఘ్యదానము జేసినట్లును, చంద్రబలము లేనిది జ్యోతిష్కుడు ముహూర్తము బెట్టి నట్లును, తాము దెలియక నన్నాశీర్వదించుటచే తమ యాశీర్వచనము వ్యర్థమైనదని జెప్పెను.

శ్రీపాదస్వామి యాశ్చర్యముతో 'అమ్మా! నీ భర్తకు సన్న్యా సాశ్రమ స్వీకారమిచ్చిన నేను శిక్షార్హుడను. నాకు ప్రాయశ్చిత్త మావ శ్యకము. తరుణవయస్సు నందున్న సంతానహీనురాలగు భార్యను త్యజించి సన్న్యాసాశ్రమము స్వీకరించినయెడల గురుశిష్యు లిరువురకును శాస్త్రమందు దండన విధింపబడి యున్న" దనెను. చంద్రుడు కళంక ముతో నుండియు తారాగణమును జూచి నవ్వినట్లును, సముద్రము క్షారత్వము గలిగియుండి గంగను పరిహసించినట్లును, విషజ్వరముతో నున్నవాడు పక్వాన్నములను జేదుగా నున్న వన్నట్లును, గర్భాంధుడు సూర్యునియందు దోష మారోపించినట్లును, సరళనాసికము లేనివా డద్దముపై గోపించినట్లును, దీపము తన క్రిందిభాగమున నంధకార ముండగా నితరులకు ప్రకాశ మిచ్చునట్లును, తా ననుచితముజేసి యిత రుల నిందించుట వ్యర్థమని దలచి యీ దోషమువలన దన సుకృత మంతయు క్షయించునని యోచించి "అమ్మా! నీకు తల్లిదండ్రులు, బంధువర్గము మొదలగువా రున్నారా!" యని విచారించెను. రుక్మా బాయి నమ్రవచనములతో "ఓ సాధుపుంగవా! మాతా పితలును,

బంధు మిత్రాదులును, పరివారమును నైశ్వర్యము నుండియు భర్తృవియోగమువలన నన్నియు లేనట్లే యనాథనై యున్నా" నని జెప్పగా శ్రీపాదస్వామి రుక్మాబాయి వలన విషయమంతయు దెలిసికొని సిద్ధోపంత్‌ను రప్పించెను.

సిద్ధోపంత్ యతీశ్వరునికి సాష్టాంగనమస్కారము జేసి తన గృహమునకు దీసికొనిపోయి యుచితాసనంబున గూర్చుండబెట్టి యర్ఘ్యపాద్య పూజాద్యుపచారములచే బూజించి భోజన తాంబూలాదు లర్పించి నమస్కారము జేసి "గురుదేవా! తామెచటనుండి యేమి కార్యార్థమై విచ్చేసితిరి? ఇచ్చటనుండి యెచ్చటకు బోదలచితిరి? దెలుపు"డనెను. అంత శ్రీపాదస్వామి "నాయనా! మాయాశ్రమము కాశియందున్నది. నేను రామేశ్వరాది దక్షిణయాత్రలు సేవించుటకై బయలుదేరి యిచ్చటికి వచ్చితిని. మీకుమార్తెవలన నాతప్పిదమంతయు దెలిసికొని కాశీక్షేత్రమునకు దిరిగి బోవుచున్నాను. శాస్త్రయుక్తముగ నేను మహాదోషిని., నేను దెలియక మీయల్లునికి సన్యాసదీక్ష నిచ్చితిని. అందుచే నాసుకృతమంతయు క్షయించును. మీకుమార్తె తపశ్శక్తి నాకు మన శ్చాంచల్యమును గలిగించి తీర్థయాత్రా మిషతో నన్నిచటికిరప్పించెను. అశ్వత్థ నారాయణుని సన్నిధిని మీకుమార్తెను నే నాశీర్వదించితిని. మీ యల్లుని వృత్తాంతమంతయు, మీకుమార్తెవలన దెలిసికొంటిని. మీరు నావెంట కుమార్తెను దీసికొని కాశీక్షేత్రమునకు బయలుదేరుడ"ని జెప్పెను. దయావంతుడగు యతీశ్వరుని యాజ్ఞానుసారము సిద్ధోపంత్ తనకుమార్తెను వెంటబెట్టుకొని యతీశ్వరునితో కాశీక్షేత్రమునకు బయలుదేరెను. సిద్ధోపంత్ యతీశ్వరునితో మార్గమధ్యమున వేదాంత ప్రసంగములతో గాలము గడపుచు కొంతకాలమునకు కాశీక్షేత్రము జేరెను.

శ్రీపాదస్వామి సిద్ధోపంత్‌ను రుక్మాబాయిని యాశ్రమము వెలుపలనుంచి, తానుమాత్రము లోపలప్రవేశించి విఠోబాను దగ్గరకు బిలచి "నీకు గృహస్థాశ్రమమున భార్య యున్నదా? లేదా? యదా

ర్థము దెలుపుమని క్రోధముతో నడుగగా విఠోబా సద్గురునిజూచి గజ గజ వణకుచు, అపరాధము జేసిన బాలుని తల్లి క్రోధముతో నడుగగా భీతితో ప్రత్యుత్తర మిచ్చునట్లును, దోషిని శిక్షించుటకై రాజు విచారించగా భయముతో బలుకునట్లును, తప్పు జేసిన కోడలి నత్త కోపముతో నడుగగా భయముతో జవాబు చెప్పునట్లును, అసత్యము బలికిన చో సద్గురునాథుడు శపించునని భయముతో నిట్లు ప్రత్యుత్తర మిచ్చెను. "గురువర్యా! తరుణవయస్సునందున్న సంతానహీనురాలగు భార్యను సత్యముగా ద్యజించి వచ్చితి"నని బలుకగా శ్రీపాదస్వామి యాశ్రమము వెలుపలనున్న సిద్ధోపంత్ ను రుక్మాబాయిని నాశ్రమములోనికి రప్పించెను.

శ్రీపాదస్వామి విఠోబాను దగ్గర కూర్చుండబెట్టికొని "నీకు నాయాజ్ఞ పరమప్రమాణము. నీవు భార్యను వెంటబెట్టుకొని సత్వరమే స్వదేశమునకుబోయి స్వధర్మాచారివై గృహస్థాశ్రమము నందుండుము. అవిధికర్మయని వికల్పచిత్తుడవుగాక నాయాజ్ఞను పాలింపుము. నీ వీశ్వర కృపాపాత్రుడ వగుదువుగాక" యని యాశీర్వదించెను. గురునాజ్ఞను శిరసావహించి భార్యను మామను వెంటబెట్టుకొని విఠోబా స్వదేశమునకు బయలుదేరెను. అగస్త్యుని యాజ్ఞ శిరసావహించి వింధ్యాచలము పృథివిపై బడినట్లు, సద్గురు వచనమున కంగీకరించి విఠోబా గృహస్థాశ్రమములో ప్రవేశించెను. పుత్రికా జామాతలను వెంటబెట్టుకొని సిద్ధోపంత్ అళంది క్షేత్రము జేరెను. దుష్టులు విఠోబానుజూచి "సన్యాసాశ్రమము స్వీకరించినవీడు దిరిగి గృహస్థాశ్రమమున కేట్లువచ్చె" ననిరి. కొందరు విషయ లంపటు డనుచుండిరి. మరి కొందరు కృపణకంటకు డనుచుండిరి. మరికొందరు వీని ముఖము జూడరాదను చుండిరి. " అమృత పానము జేసినవాడు మద్యపానము జేసినట్లును, వేదాంతము నభ్యసించినవాడు కోకశాస్త్రమును బుచ్చుకొన్నట్లును, విష్ణు నుపాసించినవాడు భేతాళు నారాధించినట్లును, బ్రాహ్మణుని సాంగత్యమును ద్యజించి యంత్యజుని ప్రేమతో నాశ్రయించినట్లును, క్షేత్రవాసమును

ద్యజించి కుగ్రామములో వసించునట్లును, వీడు సన్యాసాశ్రమమును విడచి గృహస్థాశ్రమములో జేరె"నని జనులు నిందించుచుండిరి.

విఠోబా శాంతచిత్తుడై వర్షమునకు బర్వతములు జలించనటుల జనులు నిందించుచుండ కామక్రోధములను ద్యజించెను. విఠోబాను ద్విజులును, నా ప్రవర్గమును జాతినుండి బహిష్కరించిరి; ఆతడు గ్రామమును ద్యజించి యరణ్యములో బ్రవేశించి పర్ణశాల నేర్పాటుజేసికొని భార్యతో గలిసి యందు వసించుచు కుటుంబపోషణకై భిక్షాటన జేయుచుండెను. జనులు పరిహసించుచు "ఓరీ! భ్రష్టుడా! గ్రామములో నేల బ్రవేశించితివి? పోపొమ్మని" కసరుకొనుచు భిక్ష వేయుటకు నిరాకరించుచుండిరి. విఠోబా భిక్షాన్నము లభింపని సమయములందు పర్ణభక్షణయు, నదియు లభింపనిచో వాయుభక్షణయు, జేయుచు పండ్రెండు సంవత్సరములకాల మరణ్యములో నఖండముగా హరినామ సంకీర్తనతోను, గీతా భాగవతాది పురాణ శ్రవణ పఠనములతోను కాలము గడిపెను.

రుక్మాబాయి గర్భవతియై నవమాసములు నిండిన పిదప 1195 విక్రమశకమునకు సరియగు శ్రీముఖనామ సంవత్సర మాఘ బహుళ పాడ్యమి సోమవార ముదయము ప్రసూతి యయ్యెను. సాక్షాత్ శంకరుడే పుత్రరూపముగ నవతరించెను. ఆ బాలునికి పండ్రెండవ దినమున జాతకర్మజేసి నివృత్తిదేవుడని నామకరణము జేసిరి.

కొంతకాలము జరిగిన పిదప రుక్మాబాయి మరల గర్భవతియై 1197 విక్రమశకమునకు సరియగు యువనామసంవత్సర శ్రావణ బహుళ అష్టమీ గురువారమునాడు రోహిణీ నక్షత్రమందు మధ్యరాత్రిసమయమున ప్రసూతియయ్యెను. శ్రీ మహావిష్ణువు పుత్రరూపమును ధరించి దర్శనమిచ్చెను. ఆ బాలునికి పండ్రెండవ దినమున 'జ్ఞానేశ్వర'ని నామకరణము జేసిరి.

మరల 1199 విశకమునకు సరియగు నీశ్వరనామ సంవత్సర కార్తీక శుద్ధ పూర్ణిమ ఆదివారము రాత్రి మొదటిజామునందు రుక్మాబాయి ప్రసూతియయ్యెను. సాక్షాత్ సృష్టికర్తయే పుత్రరూపము నవతరించెను. ఆ బాలకునికి పండ్రెండవ దినమున జాతకర్మ గావించి 'సోపానదేవ'ని నామకరణము జేసిరి.

కొంతకాలము జరిగిన పిదప 1201 విశకమునకు సరియగు ప్రమాదినామ సంవత్సర ఆశ్వీజ శుద్ధ పాడ్యమి మధ్యాహ్న సమయ మందు రుక్మాబాయి ప్రసూతియయ్యెను. సాక్షాత్ ఆదిశక్తియే పుత్రికా రూపమును ధరించి యవతరించెను. ఈ బాలికకు 'ముక్తాబాయి' యని నామకరణము జేసిరి.

ఈ బిడ్డల నలుగురిని జూచి విఠోబా ముక్తాబాయి లమితానందము నొందిరి.

ఎనిమిదవ అధ్యాయము సమాప్తము.

శ్రీ రామచంద్రాయనమః

*

# జ్ఞానేశ్వరులు మహిషముచే వేదములు జెప్పించుట

— ♦ తొమ్మిదవ అధ్యాయము ♦ —

భక్తుల సచ్చరిత్రలు వర్ణించు యోగము దటస్థించుటచే నేడు గొప్ప సుదినము. భక్త కథలను శ్రవణము జేయువారు ప్రేమభక్తులై భగవంతుని కృపకు పాత్రులగుదురు. భక్తుల సచ్చరిత్రలలోని ప్రత్యక్షరమును సావధానముగా శ్రవణముజేసి హృదయములో నిలిపినచో శాంతియు, క్షమయు, వైరాగ్యమును, భూతదయయు, జ్ఞానదృష్టికి సంప్రాప్తించి వికల్పనలు పటాపంచలగును. భక్త విజయగ్రంథ మింటి యందుండినచో భగవంతుడు సుదర్శన చక్రమును ధరించి వారి కే విఘ్నములును రాకుండ సర్వవిధముల రక్షించును. ఎవరు భక్తుల సచ్చరిత్రల నఖండముగా గానముజేయుదురో వారికి శ్రీ రుక్మిణీకాంతుడు దర్శనమిచ్చి మనోరథములను బూర్తిచేయును.

నివృత్తి జ్ఞానదేవ సోపానదేవులును ముక్తాబాయియు బెరిగి పెద్దవారగుచుండిరి. "సన్యాసికి కలిగిన సంతాన" మని జనులు హేళన జేయుచు వీరి ముఖము జూచిన నపశకున మనుచుండిరి. జనులు తమ బిడ్డల నవమానపరచుచుండుటవలన విఠోబాకును రుక్మాబాయికిని మిగుల దుఃఖము గలిగెను. తాము జేసిన యపరాధమువలన నిట్టి దుస్థితి కలిగెనని విఠోబాకు చింత నానాటికి వృద్ధియగుచుండెను. ప్రథమ పుత్రుడు నివృత్తినాథున కేడుసంవత్సరముల వయస్సు వచ్చెను. ఒక దినమున రుక్మాబాయి భర్తతో "నాథా! తాము ధర్మాధికారుల యొద్దకు బోయి మనకు ప్రాయశ్చిత్తముజేసి కులబహిష్కారణను, గ్రామ బహిష్కారణను దొలగించి బిడ్డల కుపనయన సంస్కారములు జేసికొనుట కనుజ్ఞ నిమ్మని ప్రార్థింపు" డని జెప్పెను.

విఠోబా ఒకనాడు భార్యా పుత్రులను వెంటబెట్టుకొని బ్రాహ్మణ సభకు బోయి పండితశ్రేష్ఠులగు ధర్మాధికారులకు సాష్టాంగనమస్కా-

రము జేసి "ధర్మశాస్త్రప్రకారము మాకు ప్రాయశ్చిత్తము విధించి కులబహిష్కరణను గ్రామబహిష్కరణను దొలగింపు" డని వినయముతో ప్రార్థించెను. అళందీక్షేత్రములోని పండితబృందము వారి ప్రార్థన నిరాకరించిరి.

దేహాశ్రమ జేసి తపశ్చర్యతో భగవంతుని కరుణబొందు టావశ్యకమని రుక్మాబాయి బలుక విఠోబాయును బిడ్డలును నంగీకరించిరి. పిదప వారెల్లరును త్ర్యంబకక్షేత్రము జేరిరి. ప్రతిదినము మధ్యరాత్రివేళ కుశావర్తిలో స్నానముజేసి విఠోబాయును, రుక్మాబాయియును బ్రహ్మగిరి పర్వతమునకు ప్రదక్షిణలు జేయుచుండిరి. వా రారు నెలలు శరీర దండన జేయుగా నొకదినము రాత్రి బ్రహ్మగిరికి ప్రదక్షిణ జేయుచుండగా భయంకరమగు నొక పెద్దపులి గర్జనజేయుచు నెదురుగా వచ్చుచుండెను. విఠోబా బిడ్డలను మరుగుప్రదేశమున దాచెను. వ్యాఘ్రము గర్జనకు భయపడి నివృత్తినాథు డచటనుండి పారిపోయెను. విఠోబా యెంత వెదకినను వాని జాడ తెలియలేదు. నివృత్తినాథుడు భీతితో పరారై యొక గుహలో ప్రవేశించెను. అచ్చట గైనీనాథను యోగి కనబడెను. గైనీనాథుడు నివృత్తిదేవులను జూచి యానందముతో దనయొద్ద జేర్చుకొని యాతనికి మంత్రోపదేశము జేసి శిష్యునిగా స్వీకరించెను. నివృత్తిదేవు తన గురువుల సన్నిధి నేడుదినము లుండెను. గైనీనాథుడు నివృత్తిదేవులకు శ్రీకృష్ణోపాసన నేర్పి నామసంకీర్తనము (భజన) ను ప్రచారము జేయుమని యాజ్ఞాపించెను. గైనీనాథుని కృపవలన నివృత్తిదేవులకు బూర్ణమగు నాత్మబోధ గలిగి యోగమార్గ దీక్ష లభించెను. పిదప నివృత్తినాథుడు సద్గురువునొద్ద ననుజ్ఞ దీసికొని జననీ జనకుల సమక్షమునకు జేరెను. నివృత్తినాథుడు గురుకృపాపాత్రుడైన విషయము విని విఠోబాయును రుక్మాబాయియు నమితానందమునొంది తమ తపశ్చర్య ఫలించినదని భావించి యచటనుండి బయలుదేరి అళందీక్షేత్రము జేరిరి.

విఠోబాయును, రుక్మాబాయియు "ధర్మాధికారులు ప్రాయశ్చిత్తమునకు విముఖులైయున్నారు. బిడ్డలకైన ప్రాయశ్చిత్తము జేయించి

వారి కుపనయనాది సంస్కారముల కాజ్ఞనిమ్మని ధర్మాధికారుల మరల ప్రార్థించుట యుచితమ"ని యాలోచించి ఒకనాడు బ్రాహ్మణ సభకు బోయి ధర్మాధికారులకు సవినయముగ సాష్టాంగ నమస్కారము జేసి "మే మపరాధులము. మా నేరమునకు దగిన ఘోరప్రాయశ్చిత్త మేది విధించినను నానందముతో భోగించుటకు సిద్ధముగా నున్నాము. నిరప రాధులగు బిడ్డలకుపనయనసంస్కారములకై న ననుజ్ఞ ననుగ్రహింపుడ"ని ప్రార్థించిరి. అంత ధర్మాధికారులు శాస్త్రగ్రంథములను శోధించి మీకు దేహాంతప్రాయశ్చిత్తముదప్ప శాస్త్రమం దింకేమియు జెప్పియుండలేదని జెప్పిరి. తత్ క్షణమే విఠోబా ధర్మాధికారుల నాజ్ఞశిరసావహించి దార పుత్రాదులను ద్యజించి ప్రయాగక్షేత్రమునకుబోయి త్రివేణీసంగమ ములో దేహమును ద్యజించెను. రుక్మాబాయియును బిడ్డల ద్యజించి భర్త వెనుకనే బోయి గంగలో దేహమును ద్యజించెను.

విఠోబాయును రుక్మాబాయియు బిడ్డలనువిడచి పోయిన పిదప నిరాధారులగు ఆ నలుగురు బిడ్డలును నొకదినమున దిరిగి బ్రహ్మసభకు బోయి ధర్మాధికారులకు వందనములు జేసి "అయ్యా! మే మనాథుల మైతిమి. మా జననీ జనకులు మమ్ము ద్యజించి బోయిరి. ఇప్పుడు మా కేమిగతి! శాస్త్రమందు మాకే దండన విధింపబడియున్నది. దయచేసి శాస్త్రగ్రంథముల శోధించి మాకు ప్రాయశ్చిత్తమును విధింపు" డని నివృత్తినాథుడు ప్రార్థించెను. అంత విప్రోత్తములు దయార్ద్రహృదయులై జననీ జనకులు లేని అనాథులని జాలికలిగి, "మీరు పైఠనపురమునకు బోయి ధర్మాధికారుల బ్రార్థించి యంగీకార పత్రమును దీసికొని రం"డని జెప్పిరి. నివృత్తిదేవుడు విప్రులకు వందనములుజేసి "అయ్యా! మేము పైఠనపురమునకు బోయి ధర్మాధికారులకే వర్ణమని, లేక యే జాతి యని లేక యే కులమని జెప్పవలెను? మేము బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులము గాము శూద్రులమును గాము. అప్తేజో గగన మహీ మారుత మహత్తత్త్వమును గాము, విరాటస్వరూపులముగాము. సగుణ నిర్గుణ నిరాకారులముగాము. మే మవినాశులము. నిజబోధస్వరూపులమె

యున్నాము'' అని పలికె జ్ఞానేశ్వరులను జూచి జ్ఞానేశ్వరా! మన స్థితి పరంపర యున్నన్నది. మనము పైఠనపురమునకు బోయి ద్విజుల కేమి చెప్పవలెనో యాలోచించుమని జెప్పెను. అంత జ్ఞానేశ్వరులు చేతులు జోడించి "అన్నా! నివృత్తిదేవా! వేదవిహిత ధర్మమునకు విరుద్ధముగా ప్రవర్తించుట పరమ దూష్యము. జీవన్ముక్తులగు జ్ఞానులుసహితము వేద విహిత ధర్మములను త్యజించరాదు తా మాచరించి యితరులకు బోధించవలెను. కారణ మేమనగా, సామాన్యజను లెల్లరును పెద్ద లనుసరించు మార్గముననే బోయెద" రని జెప్పెను. పిదప సోపానదేవు నిలువబడి "అన్నలారా! జాతి కులములతో నేమి నిమిత్తము. భక్తి లేనిది శ్రీహరిచరణ ప్రాప్తి లభించదుగదా. దుర్వాసులును, వశిష్ఠమునియు, గౌతములును, వ్యాసులును, వాల్మీకియు, నగస్త్యుడును, ఏ కులమున జన్మించిరి? పాండవుల కుల ముత్తమమని యే శాస్త్రమందు జెప్పబడి నది. ఉత్తమకులమందు జన్మించినను, శ్రుతిశాస్త్రముల బూర్ణముగ నభ్యసించినను భక్తిలేనిది వ్యర్థములగును. భగవంతు ననుసరించిన భక్తుల కుత్తమజాతితో బనియే" మని జెప్పెను.

ఈ విధముగ నా నలుగురును బరస్పర సంవాదము జేసికొని బ్రాహ్మణులకు నమస్కరించి వారియొద్ద పైఠనపుర ధర్మాధికారులకు శ్రీముఖమును దీసికొని బయలుదేరిరి. నివృత్తి, జ్ఞానదేవ, సోపాన దేవులును ముక్తాబాయియు మార్గమధ్యమున హరినామ సంకీర్తన జేయుచు కొన్ని దినములకు గోదావరీ నదీతీరమందు గల పైఠనపురము జేరిరి. ఆ కాలమునందు పైఠనపురము గొప్ప ధర్మ పీఠస్థానముగ నుండెను. అచ్చట ధర్మాధికారులు జేసిన నిర్ణయమున కా దేశపు ప్రజ లెల్లరును నంగీకరించుచుండిరి. ఒకనాడు పైఠనపురమున గొప్ప సభ జరుగుచుండెను. ఆ సభలో గొప్ప శాస్త్రవేత్తలును, వైదిక బ్రాహ్మ ణులును నుండిరి. నివృత్తినాథుడు సోదరులను, జెల్లెలను వెంటబెట్టుకొని సభామంటపమున బ్రవేశించి సాష్టాంగనమస్కారము జేసి యలకావతీ క్షేత్రమునుండి విప్రులు వ్రాసి యిచ్చిన శ్రీముఖమును ధర్మాధికారుల

కిచ్చి "మే మనాథులము, మిమ్ము శరణుబొందితిమి. మా చరిత్రను విచారించి మా కుచితరీతిని ప్రాయశ్చిత్తమును విధింపుడు. తాము సర్వ శాస్త్ర పారంగతులగు ధర్మాధికారులు" అని ప్రార్థించిరి.

ధర్మాధికారులు శ్రీముఖమును జదువుకొని విషయమంతయును గ్రహించి "మీరు సన్న్యాసికి కలిగిన బిడ్డలు-భ్రష్టులు. మీకు ప్రాయశ్చిత్తమేమి? శూద్రుని గంగలో ముంచిన బ్రాహ్మణు డగునా? పెంకుకు స్పర్శవేది నంటించిన బంగారమగునా? అట్లే మీకు ప్రాయశ్చిత్తము శాస్త్రమం దెచ్చటను విధించియుండలేదు. కాని యొక యుపాయ మున్నది. మీ రాజన్మము బ్రహ్మచర్యదీక్షలో నుండి యీశ్వర భజనలో జీవితమంతయు నుపయోగపరచి జగత్తంతయు భగవత్స్వరూపముగా భావించి బ్రాహ్మణుని మొదలు చండాలుని వరకును, గో, ఖర, గజ శ్వానాదులను సమముగా జూచుచు సర్వజీవులలో నీశ్వరుడు వసించి యున్నాడను భావము గలిగి సమదృష్టితో భజించుచుండిన మీయంతట మీరే శుద్ధు లగుదు" రని జెప్పిరి.

ధర్మాధికారుల వచనములకు నివృత్తినాథు డానందించెను. జ్ఞానదేవ సోపానదేవులును పరమానందభరితులైరి. ముక్తాబాయి జ్ఞానేశ్వరులతో "అన్నా! మనచిత్తమం దే సంకల్పముండెనో యట్లే ధర్మాధికారులును జెప్పి" రనెను. పరస్పరముగా వారు నలుగురును మాట్లాడు కొనుచుండ విప్రులు సన్న్యాసికి గలిగిన సంతతికి నివృత్తిదేవ జ్ఞానదేవ సోపానదేవ ముక్తాబాయి యను నామములా యని నవ్వుచు "ఏమిరా మీ కీ పేర్లేమి? శ్రుత్యభ్యాసము పూర్ణముగా జేసితిరనియా? లేక బురాణ వ్యాఖ్యానములు జేసితిరనియా? మరి జ్ఞానదేవు డనుటలో నర్థమేమి? కర్తృత్వము లేనివారిని పెద్దయనుట వ్యర్థము. పాలీయని యావునకు పెద్ద కొమ్ము లుండిన నేమిసార్థకము? గ్రుడ్డివానికి పెద్ద నేత్రములుండిన నుపయోగమేమి? గౌరవ మర్యాదలు లేనిది బెద్దరిక మనుటలో నర్థమేమి? పురుషార్థము లేనివానికెంత వయస్సుండిన సార్థకమేమి? భూతదయ లేని బ్రహ్మజ్ఞానమును, ప్రేమలేని గానమును, లవ

ణములేని బక్వాన్నములును వ్యర్థములు. అట్లే మీకు నివృత్తిదేవ, జ్ఞానదేవ, సోపానదేవ, ముక్తాబాయి యని పేర్లు పెట్టుట యర్థవిహీనము. మీ పేరులలోని యర్థమేమి? దెలుపు" డని యడిగిరి.

నివృత్తిదేవులు నిలువబడి చేతులు జోడించి "ధరామరులారా నన్ను నివృత్తిదేవు డనెదరు. ప్రవృత్తిమార్గమునం దున్నవారి నామార్గమునుండి దొలగించి వారల కఖండ స్వసుఖామృతముల ననుభవింపజేయు రాజయోగి" ననెను. పిదప జ్ఞానేశ్వరులు నిలువబడి "అయ్యా! నన్ను జ్ఞానదేవు డనెదరు. నేను సకలాగమవేత్త నని ద్రిచాథముల దెలుపుచున్నా" ననెను. సోపానదేవుడు నిలువబడి "అయ్యలారా! నన్ను సోపాన దేవుడందురు. కేశవుని భజనమార్గమును జూపి భక్తులను వైకుంఠమునకు జేర్పించుటయే నా కర్తవ్య" మనెను. పిదప ముక్తాబాయి నిలువబడి "భూదేవులారా! నన్ను ముక్తాబాయి యనెదరు. నేను ముక్తిద్వారమును దెరచి జగదీశ్వరుని లీలలను జూపించుటకై జన్మించితి" నని జెప్పెను.

బ్రహ్మసభలో నున్నవారెల్లరును వీరు చిన్నవయస్సు గలవారై యుండియు జతురవాక్యములు బాగుగా నభ్యసించిరని పరస్పరముగా జెప్పుకొనుచుండిరి. ఆ సమయమున నొక తురుష్కు డా మార్గమున దున్నపోతును దోలుకొని బోవుచుండెను. అంత నొక విప్రుడు లేచి "నామమువలన బ్రయోజనమేమి? అదుగో జూడుడు నే నా దున్నపోతునకు జ్ఞానదే వని పేరుపెట్టుచున్నాను. నామము పెట్టినమాత్రమున దానిలో జ్ఞానమున్నదా?" అని యడిగెను. జ్ఞానేశ్వరులు ధరామరులకు వందనములుజేసి "భూదేవులారా! నే జెప్పునది వినుడు. ఆ దున్నపోతునకును నాకును భేద మేమియును లేదు. ఆత్మ సర్వభూతములయందును నంతర్యామియై సమముగా నున్నది. అనంతఘటములందును సూర్యుడు ప్రతిబింబించునట్లును, నొకే సువర్ణము వివిధాలంకారరూపమై భిన్నముగా గనబడునట్లును, నొకేనూలుతో నేయబడిన వస్త్రము భిన్నరూపములుగా గనబడునట్లును, చక్రపాణియగు భగవంతుడు సర్వభూతములందును వ్యాపించియున్నా" డని జెప్పెను. బ్రాహ్మ

గోత్తములు వీడు వాక్చాతుర్యము బాగుగ నేర్చెనని పలికి యొక కఱ్ఱ దీసికొని దున్నపోతు వీపుపై క్రోధముతో గొట్టిరి. జ్ఞానేశ్వరు లా దెబ్బకు కంపించి క్రిందబడెను. ఆతని వీపుపై దెబ్బ గనబడుచుండెను. ద్విజులు జ్ఞానేశ్వరుల వీపుపై దెబ్బతగిలి యుండుటను జూచి జ్ఞానేశ్వరు లతో నీకును దున్నపోతునకును భేదము లేనియెడల దాని నోటినుండి వేదము బలికించుమని కోరిరి.

జ్ఞానేశ్వరులు విప్రులకు నమస్కరించి "ధరామరులారా! నా కంతటి శక్తి లేదు. తాము ప్రత్యక్షభూదేవులు. తమవాక్కునుండి వెలు వడిన విషయము ఫలప్రదమగు" నని బలికి యా దున్నపోతుయొద్దకు బోయి తన వరదాభయ హస్తము దాని మస్తకముపై నుంచి "మహి షేశ్వరా! ధర్మాధికారులు నీ వాక్కునుండి వేదములను వినవలెనని గుతూహలముతో నున్నారు. వారి కోరిక నెరవేర్పు" మని జెప్పగా నా మహిషము స్వరయుక్తముగా చతుర్వేదములను బలికెను. సభలో నున్న విప్రులును నితరప్రజలును దున్నపోతు వేదములు బలుకుట జూచి యాశ్చర్యచకితులై జ్ఞానేశ్వరుల యలౌకిక సామర్థ్యమును పరిపరివిధ ముల కొనియాడుచుండిరి. రోగి యమృతమును సేవించినచో వ్యాధి తత్క్షణమే దొలగిపోవునట్లును, కామధేనువు కృపాదృష్టితో జూచిన దరిద్రుని కష్టములు తొలగునట్లును, అంధునికి సూర్యుడు ప్రసన్నుడైనచో గోచరించని వస్తువుండనట్లును, మూగవానికి గృపతో సరస్వతి వర మిచ్చినచో బూర్ణముగా మాటాడునట్లును, గణపతి ప్రసన్ను డైనచో బదునాలుగు విద్యలును కరతలామలక మగునట్లును, శంకరుని సాంగత్యమువలన యోగు లష్టాంగ యోగములు సాధించు నట్లును, జ్ఞానేశ్వరుల హస్తస్పర్శచే దున్నపోతు వేదము బలుకుట వలన బ్రాహ్మణులెల్లరును పశ్చాత్తాపచిత్తులై మనము వేదాంతగ్రంథ ములను, ఉపనిషత్తులను పఠించితిమి గాని యీశ్వరుడు మనకిట్టి సామర్థ్య మనుగ్రహించలేదు. భూలోకమున నిదివరకెన్నడును నెవరును నిట్టి సామర్థ్యమును జూపియుండుట కని విని యెరుగము. వీరు ముగ్గురును

త్రిమూర్తులు. వీరి చెల్లెలు ముక్తాబాయి ఆది మాయావతారము. గంగ వలె పవిత్రులగు వీరికి ప్రాయశ్చిత్తమేమి? మనము ధర్మముల నితరులకు బోధించుటతప్ప యదార్థముగా నాచరణ జేయుటలేదు. ప్రజల వలన ధనమానముల నార్జించుచు జీవితములను వ్యర్థము జేసికొంటిమి. వీరితో సమమగు బ్రాహ్మణ శ్రేష్ఠులను సృష్టిలో జూడజాలము. వీరిని గనిన తల్లిదండ్రులు ధన్యులు. వారెంత సుకృతమాచరించిరో" యని బొగడుచుండిరి. అంత జ్ఞానేశ్వరులు "అయ్యలారా! ఇది యంతయు మీ సామర్థ్యమేగాని వేరుకాదు. మేము యదార్థముగ నజ్ఞానులము. మీయాచరణ ప్రతాపమునలననే యంతయు జరిగిన"దని చెప్పెను. పైరన పురజనులెల్లరును ప్రేమభావముతో సాష్టాంగనమస్కారములు జేసి యప రాధ క్షమాపణ గోరుకొనిరి.

నివృత్తిదేవ జ్ఞానదేవ సోపానదేవులు ముక్తాబాయి యును ప్రతి దినము గోదావరీ స్నానమును, వేదాంత వ్యాఖ్యాన పురాణ కాలక్షేపములును, రాత్రి హరినామసంకీర్తనయును జేయుచుండిరి. శ్రవణము జేయుటకు జనులపారముగావచ్చి శ్రద్ధాభక్తులతో శ్రవణము జేయుచుండిరి. ఆ క్షేత్రమునందొక బ్రాహ్మణగృహస్థు వారికి తన గృహమున వసించుట కొక గదినిచ్చెను. కొన్నిదినములు జరిగినపిదప నొకదినమున నా గృహస్థునింట పితృశ్రాద్ధము వచ్చెను. బంధువులకును ద్విజులకును నామంత్రణ జేయు "యతీశ్వరుని సంతతికి నీవాశ్రయ మిచ్చితివి. అందుచే నీయింట మేము భుజింపమని జెప్పిరి. ఆ గృహస్థు చింతాక్రాంతుడై గృహమున గూర్చుండియుండ జ్ఞానేశ్వరు లాతనినిజూచి "అయ్యా! నేడు మీరు మిగుల చింతతో నున్నట్లు కనబడుచున్నారు. కారణమేమి? తెలుపుడ"ని యడుగగా నా గృహస్థు జ్ఞానేశ్వరులకు వందనములుజేసి, "మహాత్మా! నేడు నాయింట పితృశ్రాద్ధము. మిమ్ముల నింటిలోనుంచితి నని విప్రులు భోజనమునకు వచ్చుటకు నిరాకరించిరి. శ్రాద్ధము నెరవేరు టెట్లని విచారించుచుంటి"నని పలికెను. అంత జ్ఞానేశ్వరులు "అయ్యా! మీరు చింతింపక స్వస్థచిత్తముతో నుండుడు. భోజన పదార్థములన్నియు

నింటిలో సిద్ధముచేయించి పిదప పితృదేవతల నాహ్వానించినచో సాక్షాత్పితృదేవతలే స్వయముగావచ్చి భుజించెదర''ని చెప్పెను. ఆ గృహస్థు స్నానసంధ్యాదులు నెరవేర్చుకొని పవిత్రుడై నానావిధ పక్వాన్నములను పాత్రలలో వడ్డించెను. జ్ఞానేశ్వరులు మంత్రాక్షతలనుజల్లి పితృదేవతల నిమంత్రణ జేసిరి. తత్క్షణమే పితృదేవతలు సాక్షాత్కరించి యాసనములపై గూర్చుండిరి. గృహస్థు డమితానంద భరితుడై పాదపూజ జేసి వస్త్రభూషణములను తులసీమిశ్రిత పుష్పహారములను, యజ్ఞోపవీత సహిత సువర్ణ దక్షిణాదులను, ధూపదీపాదులను, నర్పించెను. పితృస్వరూపీ జనార్దనాయని సంకల్పము జెప్పువరకు ప్రేమతో పితృదేవతలు తృప్తిగా భుజించి కరశుద్ధి జేసికొనిరి. విప్రులు నితర ప్రజలును నీ దృశ్యమునుజూచి యాశ్చర్య చకితులైరి. గృహస్థు పితృదేవతలకు తాంబూలాదు లర్పించగా వారలు జనులెల్లరు జూచుచుండ గృహస్థు నాశీర్వదించి యదృశ్యులైరి.

పైఠన పురమునగల బ్రాహ్మణు లెల్లరును జ్ఞానేశ్వరులు పితృదేవతలను రప్పించి భుజింపించిరి. ఇట్టి యాశ్చర్య కరమగు విషయము భూలోకమున నిదివర కెన్నడును జరిగినట్లుల కనివిని యెరుగము. మనము కర్మాభిమానులమై యామంత్రణ నిరాకరించితిమి. పితృదేవతలే స్వయముగా వచ్చి దక్షిణలు దీసికొనిపోయిరి. శంకరుడేవచ్చి నైవేద్యము భుజించి పోయినచో దేవాలయములోని యర్చకు డాశ్చర్యముతో జూచునట్లును, సూర్యుడే స్వయముగవచ్చి యర్ఘ్యదానము స్వీకరించిన నాశావంతుడగు జ్యోతిష్కుడు విఫలుడగునట్లును, క్షేత్రపాలకుడే యజ్ఞమునందు బలిదానము గ్రహించిన యాజ్ఞికు లాశ్చర్యపడినట్లును, సాక్షాత్పితృ దేవతలేవచ్చి పక్వాన్నముల నారగించి పోవుటవలన బ్రాహ్మణు లెల్లరు విఫలులై యాశ్చర్య పరవశులైరి. "నివృత్తిదేవ జ్ఞానదేవ సోపానదేవులు సాక్షాత్రిమూర్తులు. ముక్తాబాయి యాదిమాయయవతారము. జగద్గురువులును, దేహాతీతులును, జీవన్ముక్తులునగు వీరికి ప్రాయశ్చిత్తముతో నిమిత్తమేమి? వీరల దర్శనముచే మనమెల్లరము

శుద్ధులమైతిమి" అని పైఠనపుర బ్రాహ్మణులెల్లరు బలుకుచు సన్మాన శుద్ధిపత్రము లిఖించి సోపానదేవుల కిచ్చిరి.) మహిషీ పుత్రు డటులనే శ్రుతి బలుకుచుండెను. లోహము స్పర్శవేది స్పర్శచే కనకముగా మారునట్లు జ్ఞానేశ్వరుల హస్తస్పర్శచే నామహిషము వేదాంతజ్ఞానముల నహోరాత్రములు బలుకుచుండెను. ధ్రువునకు భగవంతు డక్షయపద మనుగ్రహించినట్లు జ్ఞానేశ్వరులు మహిషమున కక్షయజ్ఞాన మనుగ్రహించిరి. క్షీరసాగరమున గూర్చుండి యుపమన్యు డఖండముగా పయఃపానము జేసినటుల మహిష మఖండముగా వేదములను వర్ణించుచుండెను. వజ్రాసనమునందు గూర్చుండియున్న యోగు లఖండముగా సమాధిసుఖమును భోగించునట్లు, మహిషము వేదాంత జ్ఞానములో లీనమయ్యెను. జ్ఞానేశ్వరు లిది గ్రహించి మహిషము గుహ్యములగు వేదాంతజ్ఞానముల బహిరంగ పరచుచున్నది. అందుచే కర్మమార్గము నశించి యజ్ఞయాగాదులు నిలిచిపోవునని నివృత్తిదేవులతో జెప్పిరి.)

నివృత్తినాథుడు విప్రోత్తములకు నమస్కారముజేసి మహిషమును తమ కప్పింపుడనికోరెను. విప్రులు తుమష్కనియొద్ద మహిషమును క్రయమునకు గొని జ్ఞానేశ్వరుల కప్పగించిరి. ఆ కాలమున పైఠనపుర క్షేత్రము వైదిక ధర్మముల కగ్రస్థానమైయుండి వైదిక ధర్మ రక్షణకై యేర్పడిన రాజ్యమనునట్లు శోభించుచుండెను. జ్ఞానేశ్వరులు తమ యవతారకార్యక్రమము నచట ప్రారంభించిరి. ధర్మమార్తాండులును, దేశగురువులును, నగు వైదికబ్రాహ్మణులు సహితము జ్ఞానేశ్వరుల యుపదేశవాక్యముల వలన కలియుగమున కేవలము భక్తిమార్గమే తరణోపాయమని దెలిసికొని హరినామసంకీర్తన జేయుచుండిరి. పైఠనపుర మఖండ హరినామగర్జనలతో భక్తిక్షేత్రముగా మారెను. భక్తియుగ మచ్చటనే జ్ఞానేశ్వరులు స్థాపించి "భగవా జెండా" (కావిజెండా) నెగురవేసిరి.

నివృత్తి జ్ఞానదేవ సోపానదేవులును ముక్తాబాయియు పైఠనపుర వాసులయొద్ద శెలవు దీసికొని స్వస్థానమునకు బయలుదేరిరి. పైఠనపుర

మున గల స్త్రీ పురుషులును, నాబాలవృద్ధులును గ్రామము వెలుపలి వరకు సాగనంపిరి. అర్ధక్రోసుదూరము వారివెంట ప్రజలు వెళ్ళి యశ్రు ధారలు విడచుచు "తమ రాకచే మేము పవిత్రులమైతిమి. సుఖముగ దినములుగడచినవి. మరల తమదర్శనమెన్నడు లభించు"నని గద్గదస్వరముతో విలపించుచుండిరి. జ్ఞానేశ్వరులు వారల సమాధానపరచి క్షేమాలింగనముల ననుగ్రహించి మీరిక స్వస్థానములకు బొండని చెప్పెను. స్త్రీ పురుషు లెల్లరును నివృత్తిదేవ జ్ఞానదేవ సోపానదేవులకును ముక్తాబాయికిని సాష్టాంగనమస్కారములు జేసి వారలయొద్ద నాజ్ఞ దీసికొని స్వస్థానములకు జేరిరి.

మార్గమధ్యమున జ్ఞానేశ్వరాదులు స్వానందభరితులై ప్రేమతో భగవద్గుణముల వర్ణించుచు నవరసయుక్తములగు నానావిధ చతురకవిత్వములు జేయుచు కొంతకాలమునకు మహాలయక్షేత్రము జేరి యచట వసించిరి. నిత్యము ప్రవరతీర్థమునందు స్నానము జేసి మోహినీరాజును దర్శించుచుండిరి. ఒకనాడు నివృత్తినాథుడు భగవద్గీతను మహారాష్ట్ర భాషయందు "జ్ఞానేశ్వరీ" యను టీక జేయుమని జ్ఞానేశ్వరుల కాజ్ఞాపించెను. జ్ఞానేశ్వరులు సద్గురుడగు నివృత్తినాథునకు సాష్టాంగనమస్కారము జేసి వారి యాశీర్వచనము గైకొని జ్ఞానేశ్వరీ గ్రంథము నా క్షేత్రమున రచియించిరి. జడ మూఢాజ్ఞాన జనులకు సహాత మా గ్రంథము నిత్యపఠనగా నుపయోగపడుచుండెను. ప్రకాశవంతమగు కనకాభరణమునకు రత్నము లమర్చిన శోభించునట్లును, ధాన్యమును పక్వాన్నములు జేసిన జిహ్వకు రుచించునట్లును, సువర్ణాలంకారము శరీరమునకు శోభనిచ్చునట్లును, సూక్ష్మబీజము వృక్షమై ఫల పుష్పయుక్తముగ శోభించునట్లును, గుప్తమైయున్న కల్పతరు మహిమ కల్పనచే గ్రాహ్యమగునట్లును, గంభీరమై గహనమై యున్న గీతార్థము సర్వులు దెలిసికొనునటుల జ్ఞానేశ్వరులు జ్ఞానేశ్వరీ గ్రంథము నుపమాలంకారముతో సిద్ధము జేసిరి. పిదప నివృత్తినాథుడు "జ్ఞానేశ్వరా! నీ స్వబుద్ధి నుపయోగించి యమృతానుభవ మను పేరుతో నొక గ్రంథమును రచియింపు"

మని చెప్పెను. జ్ఞానేశ్వరు లావశ్యమని జెప్పి సద్గురు చరణములపై మస్తకముంచి స్వబుద్ధితో యోచించి నమృతానుభవమను గ్రంథమును రచియించిరి. విధాతకు గల నహంకారమును దొలగించుటకై శ్రీకృష్ణ నాథుడు గోగోపాలుర సిర్శించినటుల పాఖండుల యహంకారమును దొలగించుటకై జ్ఞానేశ్వరు లమృతానుభవమును రచియించిరి. కొంత కాలము జరిగిన పిదప స్వదేశమునకేగవలెనని సంకల్పము గలిగి యచటనుండి బయలుదేరిరి. మార్గమునందు హరినామస్మరణ జేయుచు రాత్రివేళలయందు నగరములలో బురాణ ప్రవచనములును, హరికథా కాలక్షేపములును జేయుచుండిరి పూనామండలమునందు 'ఆళీ' గ్రామ పరిసరముల జేరువరకు వేదములు బలుకుచున్న మహిషము ప్రాణముల విడచెను. జ్ఞానేశ్వరు లా మహిషమునకు సాయుజ్యపదవి ననుగ్రహించి సమాధిజేసి దీపధూపాదులచే బూజించి యా సమాధికి 'మ్హసోబా' యని నామకరణముజేసి యచటనుండి బయలుదేరిరి.

జ్ఞానేశ్వరులు పైఠనపురమున మహిషముచే వేదములను బలికించుటయు, శ్రాద్ధమునకు పితృదేవతలను రప్పించుటయు, కర్మాభిమానులగు ధర్మాధికారులెల్లరు శరణుబొందుటయు మొదలగు నఘటితకార్యములను జేసిరను కీర్తి వాయువువలె స్వల్పకాలములో నలుదిశల వ్యాపించెను.

అలకావతీ క్షేత్రవాసు లీ విషయములను విని యానందభరితులై జ్ఞానేశ్వరుల రాకకు నిరీక్షించుచుండిరి. నివృత్తి జ్ఞానేశ్వర సోపానదేవులును, ముక్తాబాయియు నలకావతీ క్షేత్రములో బ్రవేశించువరకు బ్రజలెల్లరును నానందముతో స్వాగతమిచ్చి యాలింగన వందనాదులు చేసిరి. సోపాన దేవులు పైఠనపురమున ధర్మాధికారులు తమకిచ్చిన సన్మానపత్రము విప్రోత్తముల కిచ్చెను. శ్రీవ్యాసులు నోటినుండి వెలువడిన పురాణ గ్రంథములను పండితులు గౌరవించినట్లును, గుర్వాజ్ఞకు సచ్ఛిష్యుడు బద్ధుడగునట్లును, పైఠనపుర ధర్మాధికారుల నిర్ణయము నలకావతీ ప్రజలెల్లరు నామోదించిరి. ప్రతినిత్యము జ్ఞానేశ్వరాదులు జేయు



జ్ఞానేశ్వరుల వీపుపై ముక్తాబాయి భక్ష్యములను గాల్చుట.

హరినామ సంకీర్తన శ్రవణము జేయుటకై పరిసరప్రాంతములనుండి జను లపారముగా వచ్చుచుండిరి. విశోబాయను పేరుగల కుటిలుడగు బ్రాహ్మణుడు దివారాత్రములందును "వీరు సన్యాసిసంతతియని నిందించు చుండెను, శలభములు దీపప్రకాశమునకు సహించనట్లును, ప్రహ్లాదుని జూచి హిరణ్యకశిపుని మనస్సు జల్పించినట్లును, ధర్మరాజు కీర్తి విని దుర్యోధనుడు వ్యాకుల చిత్తుడైనట్లును, రాముని ప్రతాపము విని దశ కంఠుడు సంతాపము నొందినట్లును, ప్రాకృత గ్రంథమునుజూచి పండి తుడు నిషేధించినట్లును, చంద్రునిజూచి దస్కరులు హేళన జేయునట్లును సహదేవ మతమును జ్యోతిశ్శాస్త్రజ్ఞులు ద్వేషించు నట్లును; విశోబా జ్ఞానేశ్వరాదుల నిందించుచుండెను.

ఒకనాడు నివృత్తినాథుడు ముక్తాబాయిని బిలచి నేడు దీపావళి పండుగ. నూతన మృత్తిక పాత్రదెచ్చి భోజనమునకు భక్ష్యములను జేయుమనెను. ముక్తాబాయి ఆవశ్యమనిజెప్పి సామగ్రుల సిద్ధపరచి మట్టి మూకుడు దెచ్చుటకు కుమ్మరి గృహమునకు బోయెను. విశోబా పరు గునబోయి ముక్తాబాయిని గలసి యెచటి కేగుచుంటివని క్రోధముతో నడిగెను. దప్పికతో నున్న లేడి వనములో జలము నన్వేషించుచుండ కిరాతకుడు గనబడినట్లు ముక్తాబాయికి విశోబా గనబడెను. ముక్తా బాయి భయముతో వణకుచు నేడు దీపావళిపండుగ. భక్ష్యముల దయారు జేయుమని నివృత్తినాథు డాజ్ఞాపించెను. మట్టిమూకుడు దెచ్చుటకై కుమ్మరి గృహమునకు బోవుచుంటినని ప్రత్యుత్తర మిచ్చెను. తత్క్షణమే విశోబా ముక్తాబాయి చంపపై గొట్టి కుమ్మరి గృహమున కేగి దీనికి మట్టి పాత్ర నిచ్చినచో నిన్ను శిక్షింతును, నీవు నాకివ్వవలసిన ద్రవ్యమును నిర్బంధముతో నిప్పుడే వసూలు జేయుదునని చెప్పెను. కుమ్మరి చింతా క్రాంతుడై గృహస్థాశ్రమమున దారిద్ర్యమును, వృద్ధాప్యమున పుత్ర శోకమును, పూజ్యస్థానమున నిందయు, క్షోభనీయము లగునట్లు విశోబా

వచనములకు క్షోభించి ముక్తాబాయికి మట్టిపాత్రనియ నిరాకరించెను. ముక్తాబాయి యాశ్రమమునకు దిరిగివచ్చి చింతాక్రాంతురాలై యుండ జ్ఞానేశ్వరు లామె నెత్తుకొని బుజ్జగించి దుఃఖమునకు కారణము దెలుపు మని యడిగెను. అంత ముక్తాబాయి తాను కుమ్మరియింటికి బోవుటయు మార్గమునందు విశోబా నిందించి చెంపపై గొట్టుటయు, కుమ్మరి మట్టి పాత్రనీయ నిరాకరించుటయు, మొదలగు విషయములను జ్ఞానేశ్వరులకు సవిస్తరముగ జెప్పెను. గవాక్ష ద్వారమునుండి విశోబా వృత్తాంత మంతయు వినుచుండెను. జ్ఞానేశ్వరులు ముక్తాబాయితో నీవు చింతింప కుము. వాని సహజస్వభావము మార్చుటకు దగిన యుపాయము యోచించెదనని చెప్పెను.

జ్ఞానేశ్వరులు గూర్చుండి యోగధారణజేసి పంచాగ్నిని ప్రజ్వ లింపజేసిరి. కన్ను లెఱ్ఱబడి నోటినుండి యగ్నిజ్వాలలు వచ్చుచుండెను. వీపు నిప్పువలె అరుణవర్ణ మాయెను. విశోబా వెలుపలనుండి యుదియం తయు వీక్షించుచుండెను. జ్ఞానేశ్వరులు ముక్తాబాయిని బిలచి తనవీపుపై భక్ష్యములను గాల్చుకొమ్మని చెప్పెను. తత్ క్షణమే ముక్తాబాయి జ్ఞానే శ్వరుల వీపుపై భక్ష్యములను గాల్చెను. ఒక క్షణకాలములో జ్ఞానేశ్వ రులు జఠరాగ్నిని శాంతపరచిరి. జ్ఞానందమను పళ్ళెములో ప్రేమభక్తి యను క్షీరమునుబోసి, శాంతిసుఖమను చక్కెరగలిపి నవృత్తి సోపాన జ్ఞానేశ్వరులును ముక్తాబాయియు గూర్చుండి శ్రీహరి భోక్తయని గ్రాసము దీసిరి. విశోబా వెలుపలనుండి కౌతుకమున జూచుచు. పశ్చా త్తాపతప్తచిత్తుడై కేవలము వీ రవతారమూర్తులు. వ్యర్థముగా నేను నిందించితినని చింతించి రత్నమునుజూచి గాజురాయని భావించినట్లును, కల్పవృక్షమును జూచి సిందీవృక్షమని దలచినట్లును, స్పర్శవేది శిలయని భావించినట్లును, గంగాజల మున్మత్తునకు మద్యముగా గన్పడినట్లును, పరబ్రహ్మావతారుడగు శ్రీకృష్ణుని దుర్యోధనుడు సామాన్య మానవు

నిగా నెంచినట్లును, నజ్ఞానముచే నేను వికల్పచిత్తుడనై వీరిని నిందించితి నని చింతించుచు బయుగునబోయి బలాత్కారముగ ప్రసాదమును భక్షించుటకు ప్రయత్నించెను. జ్ఞానేశ్వరు లాక్షణమున పళ్లెమునుదీసి వెనుక బెట్టిరి. బలత్కారముగా నెగిరిపడి విశోబా పళ్లెములోని యుచ్ఛిష్ట ప్రసాదమును స్వీకరించెను. జ్ఞానేశ్వరులు విశోబాతో "నీవు ఖేచరుడ వైతివేల" యని యడిగిరి. తత్క్షణమే విశోబా జ్ఞానేశ్వరులకు సాష్టాంగ నమస్కారము జేసెను. నారదుల దర్శనముచే వాల్మీకి తమోగుణమును ద్యజించినటుల జ్ఞానేశ్వరుల సాంగత్యము వలన విశోబాకు సాత్త్విక లక్షణ మలవడెను. జ్ఞానేశ్వరులు విశోబాను ఖేచరుడ వైతివేల యని నందున నాటినుండియు నాతనికి విశోబా ఖేచరుడని సార్థక నామము కలిగెను.

తొమ్మిదవ అధ్యాయము సమాప్తము

శ్రీ రామచంద్రాయనమః

# జ్ఞానేశ్వరులు, నామదేవులు తీర్థయాత్రకు బోవుట

—♦ పదియవ అధ్యాయము ♦—

నేడు భాగ్యోదయమైనది. భక్తవిజయమును శ్రవణము జేయు శ్రోతల యానందము వర్ణనాతీతము కల్పతరువు గృహమునకు వచ్చినట్లును, చింతామణి వాంఛితార్థములను సమకూర్చినట్లును, భూమిపై నపారముగ సుధారసము వర్షించినట్లును, ద్వాదశ సూర్యులు నొకే సమయమున జల్లబడి యుదయించినట్లును, సర్వనదులందు నమృత జలము ప్రవహించినట్లును, రత్నముల చింతామణుల మాణిక్యముల గనులు దొరకినట్లును, దైవ యోగమువలన భక్తుల సచ్చరిత్రలు వెలువడినవి. కాన సభాగ్యులగు శ్రోతృజనులారా! అలసటను సమూలముగ ద్యజించి భక్తకథలను శ్రవణము జేసినచో నానావిధములగు సంకల్ప వికల్పములును దొలగి ప్రేమామృతము లభించును. ప్రేమామృతమమృతముకంటె యోగ్యమైనది. అమృతపానము జేయు నమరులు కల్పాంతమున నాశనము నొందుదురు. ప్రేమామృతమును సేవించువారు చిరంజీవులై యక్షయపదమును బొందెదరు. కాబట్టి శ్రవణమాత్రముచే సకల దోషములను నశింపజేయు భక్తుల సచ్చరిత్రల నాకర్ణింపుఁడు.

ఒకనాడు జ్ఞానేశ్వరులు నామదేవులను దర్శించుటకై పంఢరీపురమున కేగిరి. నామదేవులు దూరమునుండి మందిర ప్రవేశ మగుచున్న జ్ఞానేశ్వరులను జూచి యెదురుగా బోయి సాష్టాంగనమస్కారము జేసెను. నామదేవులు యథోపచారముల జ్ఞానేశ్వరులను బూజించి "నా భాగ్య మను సూర్యుడు నే డుదయించెను. నా పూర్వపుణ్యము ఫలించెను. సాక్షాత్పాండురంగదేవుడే సంసారపాశములో దగుల్కొన్న జడజీవినగు నన్నుద్ధరించుటకై వచ్చె" నని బలికి తిరిగి సాష్టాంగనమస్కారము జేసెను. అంత జ్ఞానేశ్వరులు "ఓ నామదేవా! నీ భాగ్య మపారమైనది. నీవు హృషీకేశుని సాన్నిధ్యమం దఖండముగ సేవించు భాగ్య

శాలివి. ప్రేమ సుఖములు నీలో మూర్తీభవించి యున్నవి. ఆశారహితుడవగు నీవు జన్మించిన కులమును వంశమును పవిత్రములైనవి. నేనొక కోరికతో నిన్నాశ్రయింప వచ్చితిని. నా మనంబున బహుకాలము నుండియు గుప్తముగ వేధించు విషయము నీకు దెలిపెద" నని చెప్పి యాతని చేయి బుచ్చుకొని యంతర్మందిరమందు ప్రవేశించి "పవిత్రులగు జీవన్ముక్తులు సహితము గురుదేవ తీర్థ భజనలను విడువక జేయుచుండవలయును. నీతో గలసి భూతలమున గలసర్వ తీర్థములను సేవించవలెనని వచ్చితిని. నా మనోరథము పూర్తిజేసెదవా? లేదా? దెలుపు" మని యడిగెను.

నామదేవులు దిగ్భ్రమానసులై "జ్ఞానేశ్వరా! అమూల్యమగు కస్తూరిని త్యజించి బూడిదను గ్రహించినట్లును, కల్పతరుచ్ఛాయను విడచి సిందీవనమున బ్రవేశించినట్లును, బక్వాన్నముల త్యజించి గలిత పత్రముల భుజించినట్లును, రాజహంసను విడచి కాకిని దెచ్చినట్లును, రత్నములను విడచి రాళ్లు దెచ్చినట్లును, సామగానమును విడచి డప్పు వాద్యము వినినట్లును, బంఢరీక్షేత్రమును విడచి తీర్థాటనమునకు బోవలసిన యవసరమేమి? నేను స్వతంత్రుడను గాను. త్రికరణశుద్ధిగా నన్ను పాలించి పోషించు (శ్రీ) రుక్మిణీవల్లభుడగు పుండలీకవరదునికి సర్వవిధముల నధీనుడనై యున్నాను. మీరు వారిని బ్రార్థించి యాజ్ఞబొందు" డని చెప్పెను. అంత జ్ఞానేశ్వరులు నీ భావము నాకు బాగుగ దెలిసినది. భక్తి జ్ఞాన నిక్షేపమగు నీవు చతురుడవును, సర్వజ్ఞుడవును, నుదారుడవునునై యున్నావని బలికి యాలింగనము జేసికొని మనమిరువురము దేవాలయమునకు బోయి (శ్రీ) విఠ్ఠలనాథునియొద్ద యాజ్ఞ గోరుదము రమ్మ"ని చెప్పెను.

నామదేవులును జ్ఞానేశ్వరులును మహాద్వారములో బ్రవేశించి గరుడసన్నిధిని సాష్టాంగనమస్కారము జేసి గర్భాలయములో బ్రవేశించి సింహాసనముపై బ్రకాశించుచున్న (శ్రీ) పంఢరీనాథుని సద్భావముతో నాలింగనవందనాదులు జేసికొనిరి. జ్ఞానేశ్వరులు తన మనోభావ

మును భగవంతునికి దెలుపగా శ్రీ విఠ్ఠలనాథుడు నవ్వుచు "జ్ఞానేశ్వరా నీవు కేవలము చిద్రూపుడవై యున్నావు. సర్వసంగములకు నలిప్తుడవై శుద్ధ స్ఫటికమువలె నీవు నిర్మలుడవై యున్నావు సాక్షా దాత్మస్వరూపుడవగు నీకు తీర్థయాత్రలతో బనియేమి? సూర్యునికుష్ణోపచారములును చంద్రునికి శీతలోపచారములును, గజవదనునకు విద్యాభ్యాసమును, సరస్వతికి చతుష్షష్టికళల నేర్పుటయు వ్యర్థములగునట్లు శ్రమకరమగు తీర్థాటన మీరు చేయుట వ్యర్థమ"ని చెప్పెను. జ్ఞానేశ్వరులు చేతులు జోడించి "దేవాదిదేవా! తాము చెప్పిన విషయము యదార్థము. ప్రేమభక్తుడగు నామదేవుల సాంగత్య మపేక్షించి జన్మ సార్థకము జేసికొన దలచితిని. నా కోరిక నెరవేర్పు" డని నమస్కారము జేసెను.

శ్రీ పండరీనాథుడు హాసితవదనుడై నామదేవులను జూచి "జ్ఞానేశ్వరులు సాక్షాత్పరబ్రహ్మమూర్తి. నీ సాంగత్య మపేక్షించి వచ్చెను. కాబట్టి నీవు త్వరితముగా నాతనివెంట బోయి శీఘ్రముగా యాత్ర ముగించుకొని రమ్ము. ఆసన శయనములందు సహితము నన్ను మరువవల" దని చెప్పి గద్గదస్వరముతో నానందాశ్రుధారలు విడచుచు జ్ఞానేశ్వరులను జూచి సర్వజ్ఞమూర్తివగు నిన్నొక కోరిక గోరుచున్నాను. నీ చిత్తమందు స్మరణలో నుంచుకొనుము; నామదేవు డొక క్షణకాలము నన్ను విడచి యెఱుగడు. నా యఖండప్రేమ అతనియం దున్నది. రమావియోగమునైన సహింతును కాని యీతని వియోగము సహింపజాలను. నీ కోరిక తిరస్కరింపలేక నీవెంట పంపుచున్నా" నని చెప్పి నామదేవుల చేయి బుచ్చుకొని జ్ఞానేశ్వరుల కప్పగించి యహోరాత్రములు సర్వవిధముల రక్షించు భారము నీవని చెప్పెను. జ్ఞానేశ్వరులు భగవంతునికి వందనము జేసి నామదేవులను వెంటబెట్టుకొని చంద్రభాగానదికి బోయి యుభయులు స్నానము జేసి తీర్థయాత్రకు బయలుదేరిరి. శ్రీ విఠ్ఠలనాథుడు జ్ఞానేశ్వరులను నామదేవులను చంద్రభాగా నదీతీరమున విడచి దేవాలయమున ప్రవేశించెను. కనకపాత్రలో శ్రీ రుక్మిణీదేవి జలము దీసికొనివచ్చి

భగవంతుని చరణములను గడుగుచుండ నేత్రములనుండి యశ్రుధారలు విడచుచు, గజగజవణకుచు సర్వాంగములనుండియు జెమట కార్చుచున్న భగవంతుని శ్రీముఖమును జూచి జగన్మాతయగు శ్రీ రుక్మిణీదేవి విస్మయము నొందెను.

భగవంతుని పాదములకు శ్రీ రుక్మిణీదేవి సాష్టాంగ వందనములు జేసి "నేడు నాకు చాల నాశ్చర్యము గలుగుచున్నది. మీ రీ విపరీతావస్థలో నుండుటకు కారణమేమి? దెలుపు"డనెను. అంత శ్రీ విఠ్ఠలనాథుడు "నామదేవుని వియోగ బాణమువలన హృదయమునుండి దుఃఖము బయల్వెడలుచున్నది. వానియందు నాకపార ప్రేమ యున్నది. నామతి యేవిధము చేతను నుద్వేగమునుండి తొలగి స్థిరరూపము నొందజాలదు. నేనుతప్ప నామదేవుల కిష్టులు, మిత్రులు, బంధువులు, సజ్జనులు, నెవరును లేరు. ఆతఁడు తన ప్రాణమునెట్లు కాపాడుకొనునోయని చింత దారుణముగ నాకు గలుగుచున్నది. కృపణునియొద్ద ధనమును యాచకుడు దోచుకొనిపోయిన దుఃఖించునట్లును, వృద్ధాప్యమునందున్న వాని బాలకుని తస్కరు లపహరించిన దుఃఖించునట్లును, నా భక్తరత్నమగు నామదేవులను జ్ఞానేశ్వరులు తీర్థాటన మిషతో దొంగిలించెనని చెప్పెను. శ్రీ రుక్మిణీదేవి "స్వామీ! ఎవరి నోటినుండి మీ నామోచ్చారణ యఖండముగ జరుగుచుండునో వారికి శోక దుఃఖ మోహాములు బాధింపజాల"వనెను.

శ్రీ విఠ్ఠలనాథుడు రుక్మిణీదేవితో "నీవు యదార్థము వచించితివి. భక్తులను విడచి నేనొక క్షణమైనను నుండజాలను. అవ్యక్తుడనగు నేను నిరాకారుడనై యుండి భక్తులకొరకు సగుణ రూపుడనై, భక్తులకొరకే వైకుంఠమును విశ్రాంతి స్థానముగా నిర్మించితిమి. నా యైశ్వర్యమున కధికారులు నిజభక్తులై యున్నారు. వారి మనోగతము నేనును, నామనోగతము వారును నెరుగుదుము. నా భక్తులను విడచి నేనును, నన్ను విడచి నాభక్తులును నుండుట తటస్థించినచో క్షణమొక యుగకాలముగ నుండు"నని చెప్పి మరల నశ్రుధారలు విడచుచు గద్గదకంఠుడై

"అహంకారమును ద్యజించి నాలోఁగలసి భక్తులు సమరసు లగుచున్నారు. దీపమును ప్రకాశమును, సూర్యుడును కిరణములను, కనకమును కాంతియు, నభిన్నమగునట్లు నేనును నా భక్తులును నభిన్నముగ నున్నాము. విజ్ఞానులగు భక్తరాజుల చరణధూళి నామదేవుడై యున్నాడు. వాని వియోగమువలన నేడు నాకు దుఃఖము గలిగినదని" చెప్పి తత్కాలమందు మూర్ఛిల్లెను. విశ్వజననియగు శ్రీ రుక్మిణీదేవి నానా విధోపచారములు జేయుచు ధైర్యము జెప్పుచుండెను. భక్త జనులు విచ్చేసి నానావిధముల నుజ్జగించుచుండిరి. కొంతసేపటికి భగవంతుడు సావధానుడై, "నామదేవులుతప్ప నన్యపదార్థములయందు నాకిచ్ఛలేదు. ఆతని నాలింగనము జేసికొనుటకు నాహృదయము తొందరపడుచున్నది. నే నఖండముగ నిర్లజ్జతో భక్తులకు సేవజేయుచుందును. నామదేవు లెన్నడును నాకు కష్టము కలుగజేయలేదు. నేనాతనికి ధర్మార్థ కామమోక్షముల నను గ్రహింపలేదు, ఆతడు జేసిన సేవా ఋణమునకు నేను బంధింపబడి యుంటిని, లోభదంభములను దూరముగ దొలగించి, శత్రువులగు మాయామోహములను ద్యజించి కామక్రోధ మదమత్సరములను జయించి సంసారమును విడచి నానావిధ దేవతోపాసనలయందు విముఖుడై నన్నొకనినే యాశ్రయించి తన జీవితమునకు విశ్రాంతి స్థానము నేనేయని నమ్మెను. ఆతడు మార్గమునందు పోవుచుండగా నాకలి దప్పు లెవ్వరు విచారింతురను చింత దారుణముగా నన్ను బాధించుచున్నదని చెప్పెను. భక్తజనులు జయజయ ధ్వనులుజేసి ప్రేమతో భగవంతునికి వందనము లర్పించి గరుడ మంటపమున తాళమృదంగాది ధ్వనులతో నృత్యకీర్తనలు జేయుచుండిరి. కొంతసేపటికి శ్రీ విఠలనాథుడు సావధానుడయ్యెను.

నామదేవులు మార్గమధ్యమున క్షణక్షణమును వెనుకకు దిరిగి జూచుచు "ఓ పంఢరీనాథా! నేనేమి యపరాధము జేసితిని. నన్ను దూరము చేసితివేల? నాకష్టసుఖము లెవ్వరితో జెప్పుకొందు"నని భూమిపై బడి మూర్ఛిల్లెను. మాతృవియోగమువలన బాలకుడు దుఃఖించునట్లును,

క్షుధాతురు డన్నములేక తబ్బిబ్బగునట్లును, దప్పిక గొన్నవా డుదకము నకై ప్రయత్నించునట్లును, జాతక పక్షులు మేఘములకై యెదురుజూచు నట్లును, చకోరపక్షులు చంద్రోదయమును నిరీక్షించునట్లును, జలవియో గమువలన మత్స్యము తత్తరపడునట్లును, శ్రీవిఠ్ఠలనాథుని వియోగము వలన నామదేవులు మూర్ఛిల్లి "ఓ చక్రపాణీ! నాజననీ జనకులును, బంధుమిత్రులును, కులదేవతయు, మోక్షసాధనమును, సంతసాక్షియు, నీవై యున్నావు. ఓ కృపాసాగరా! జకజేశీ! నీవియోగమువలన నా హృదయము దుఃఖరూపమైనది. కృపాదృష్టితో నా కాలింగనమిమ్ము"ని ప్రార్థించెను.

నామదేవు డీ ప్రకారముగా కరుణావచనములు బలుకుచు విలపిం చుచుండ జ్ఞానేశ్వరులు సంభోధించి ఓ భక్తరాజా! నీ హృదయమునం దానంద స్వరూపుడై శ్రీ విఠ్ఠలుడు సాక్షాత్కరించియుండ వ్యర్థముగా విలపించెదవేల? మృగనాభియందు సుగంధముండగా వనమంతయు శోధించినటుల నీవాత్మస్వరూపమును దెలిసికొనక దుఃఖించుచున్నావు. నిర్భాగ్యుని గృహమునం దపరిమిత ద్రవ్యము పూడ్వబడియుండ వాడు చూడక యుపవసించినట్లు, శ్రీ విఠ్ఠలుడు నీ హృదయస్థుడై యుండ వియోగదుఃఖమని విలపించెదవేల?" యనెను.

నామదేవులు జ్ఞానేశ్వరులకు సాష్టాంగ నమస్కారములు జేసి "సింహాసనముపై నిలువబడి రెండుపాదములు సమముగ నుంచుకొని కటి ప్రదేశమున హస్తములుంచి పీతాంబరధారియై కనక కిరీటమును, మకర కుండలములను ధరించియున్న సాక్షాత్పర బ్రహ్మమూర్తిని నాకు జూపుము. సనకాదుల నిజధ్యానమును, శంకరుని ప్రియభూషణుడును, శ్రీ రుక్మిణీరమణుడగు విఠ్ఠలుని నాకు జూపుము. దివారాత్రములు ప్రేమతో నఖండముగా నారద తుంబురులచే గానము చేయబడు భగ వంతుని నాకు జూపుము. నేను యోగ యుక్తి సాధనల నెరుగను. జగ జ్జీవనుడే నా విశ్రాంతిస్థానము. ఆతని దర్శనము లేకున్న ప్రాణము విడతు" నని చెప్పెను. అంత జ్ఞానేశ్వరులు "ఓ నామదేవా! ఆ విఠ్ఠ

లుడు లేని తావులేదు! భేదభావము విడచి హృదయమునం దద్వైతు డగు (శ్రీ) విఠ్ఠలుని గుర్తింపు" మని చెప్పెను. నామదేవులు జ్ఞానేశ్వరులతో "చాతకపక్షులు నదీజలమును విడచి వర్షజలమునే యపేక్షించును. పతివ్రత భర్తవిషయము తప్ప నన్యవిషయము వినుటకు నిరాకరించు" నని జెప్పెను. పిదప జ్ఞానేశ్వరులు "నామదేవా! జ్ఞాను లుపాసించు నవినాశుడగు (శ్రీ) విఠ్ఠలుడు నీ హృదయస్థుడై యున్నా" డని చెప్పగా నామదేవులు "నాకు సగుణరూపమునందు ప్రేమ యున్నది. నేత్రములతో (శ్రీ) విఠ్ఠలుని దివ్యమంగళ విగ్రహ స్వరూపమును జూచుటయు, కర్ణములతో హరినామ సంకీర్తనలను వినుటయు దప్ప నన్యసాధనములయందు నా కిచ్ఛలే"దని చెప్పెను. జ్ఞానేశ్వరుడు నామదేవా! నీవు హృషీకేశుని స్వాధీనము జేసికొంటివి. ఈశ్వరప్రాప్తి కే మార్గముత్తమమో నవిస్తరముగ జెప్పుము. భజన యెట్లు చేయవలెను? శ్రవణమననము లెట్లు చేయవలెను? నిధిధ్యాసన మెట్లుండును? ధృతిధారణయని దేనినందురు? విశ్రాంతి యననేమి? తెలుపుము. బహుదినములనుండియు నీవలన నీవిషయముల దెలిసికొనవలెనని బహు కుతూహలుడనై యుంటిని. నీ యనుభవములో నున్న సాధన దెలుపు" మని చేతులు జోడించి ప్రార్థించెను.

నామదేవులు జ్ఞానేశ్వరుల చరణములను దృఢముగ బట్టుకొని "నే నజ్ఞానిని. మీ రాధ్యాత్మికజ్ఞానములను విచారించుచుంటిరి. కల్పవృక్షము కృపణుని యింటికి యాచనకు బోయినట్లును, హిమాలయపర్వతము తనకు గాలి కావలెనని కోరినట్లును, భాస్కరుడు దీపప్రకాశము నపేక్షించినట్లును, నాకాశము తాను వసించుటకు విస్తీర్ణస్థలము గావలెనని నట్లును, భూదేవి రాజు నీనాము గోరినట్లును, నఖండజ్ఞాన పరిపూర్ణులగు తాము నన్నాధ్యాత్మజ్ఞానము విచారించుచుంటి" రని చెప్పెను. అంత జ్ఞానదేవులు "ఓ నామదేవా! నీ మనస్సునం దే సందేహమును బెట్టుకొనక ద్వైతభావమును విడచి నీ యనుభవము మాత్రము జెప్పుము. సరళములగు నీ వాక్యములు సముద్రముకంటె

లోతుగ నున్నవి. నా కర్ణములు వినుటకై క్షుధతో నున్నవి. నీవు విశ్రాంతికి విశ్రామస్థానమవై యున్నావు. భగవంతుని కంతరంగభక్తుడవై యున్నావు. ప్రేమరసములేని విశేషజ్ఞానము వ్యర్థమగును. ఆకాశమునందు పెద్దనక్షత్రము లహోరాత్రములు సంచరించునుగాని చిన్నదగు ధ్రువనక్షత్రము మాత్రము చలింపనేరదు. అట్లే నామదేవా! నీ దల్పజ్ఞానమనుటకు వీలులేదు. ఎంత యగ్నియైనను దీపజ్యోతి సమమగు ప్రకాశము నీయనట్లును, ఔషధము లెన్నియైనను నమృతమునకు సమముగానట్లును, శాస్త్రాధికారు లెందరైనను నీ జ్ఞానమునకు సమము గారు. ప్రత్తిపువ్వు పరిమళశూన్యమైనను రాజును దరిద్రుడును గౌరవించునట్లు నీ జ్ఞానము విశ్వోద్ధారకముగ గన్పడుచున్నది. నీ యనుభవమునందున్న సాధన దెలిసికొనవలెనని బహుకాలమునుండియు నాసక్తితో నున్నాను. మానమును త్యజించి నా కోరిక దీర్పు". మని చెప్పెను.

అంత నామదేవులు "ఓ స్వామీ! నాయనుభవమును జెప్పెద వినుడు. శరీరమునందు ముఖ్యముగా వైరాగ్య బలముండవలయును. సర్వభూతములయందు దయవుండవలయును. నేను మీరను భేదభావనయు, ప్రపంచభ్రాంతియు, లేక స్థిరచిత్తముతో నుండవలెను. దీనినే శుద్ధ భజనమనెదరు. ఈ చిహ్నములు లేనిచో జేయు సాధనము వ్యర్థమగును. బాహ్యమునకు నమస్కారముజేసి దోషగుణములను వెదకినచో మక్షికసహిత పక్వాన్నము నాదరముతో భుజించినట్లగును. ఉత్తమ మధ్యమము లెరుగక యుండుటయే యఖండగమనము. విశ్వమంతయు విశ్వంభరుడు వ్యాపించి యున్నాడని మనస్సులో స్థిరముగా దెలిసికొనుటయే ధ్యానము. నాదమందు లీనమైన వేళ్ళు దేహభ్రాంతిని విడచునట్లితర విషయముల విడచి నిశ్చలమనస్సుతో హరికీర్తన వినవలెను. దీనినే సజ్జనులు శ్రవణభక్తి యనెదరు. కృపణుడు వ్యాపారములు జేసికొనుచు భూమిలో బూడ్చిన ద్రవ్యముపై తన మనోలక్ష్యముంచునట్లు స్వహితమును విచారించుచుండవలెను. దీనినే మనన మం

దురు. జారిణి గృహమునందుండి పరపురుషునియందు ప్రేమ యుంచి నట్లును, చాతక పక్షులు భూమండలమునందు వసించి మేఘమండల మున లక్ష్యముంచినట్లును. సరోవరము నందున్న కమలపుష్పములు సూర్యునియందే మనస్సుంచునట్లును, నరణ్యమున సంచరించు గోవు దూడపై జిత్తముంచునట్లును, కృపణుడు ద్రవ్యముపై మనస్సుంచి బజారులో దిరుగునట్లును, జలభాండముల శిరమునందుంచుకొని స్త్రీలునడచు చున్నను వారి లక్ష్యము జలభాండములమీదనే యున్నట్లును, భ్రమర మాకాశమున దిరుగుచున్నను పుష్పముపై చిత్తముంచునట్లును, బాహ్యమున సంసారము నందుండి యంతఃకరణము శ్రీధరునిపై నుంచి సర్వ భూతములయందును శ్రీ విఠ్ఠలుని రూపమును జూచుచు రజస్తమో గుణములను త్యజించి ప్రేమతో నుండవలయును. నిత్యనియమముతో నేకాంతముగ గూర్చుండి హరినామసంకీర్తన జేయు చుండవలెను. ఇవి లేక శేయు సాధనలు బంధనలుగా భావింపవలెను. మనోవాక్కాయము లతో నాయనుభవమును శ్రీ విఠ్ఠలుడు పలికించె"నని చెప్పెను.

జ్ఞానేశ్వరు లాశ్చర్యచిత్తులై "ఎందరో విష్ణుభక్తులు పూర్వము జన్మించిరి. ఇంకెందరో ముందు జన్మించెదరు. కాని నామదేవునితో సమమగు భక్తుడు జన్మింపబోడు. ఈతడు చెప్పిన విషయములు వ్యర్థములుకావు. నాపై నమృతవృష్టిని వర్షించెను. ఇట్టి యపార సుఖ విశ్రాంతి యెవరికిని గల్పాంతము నందైనను లభింపదు. శాస్త్ర వక్తలు గావచ్చును. బుద్ధిమంతులు గావచ్చును. కర్మనిష్ఠ విద్యావంతులు గావచ్చును. పూజనీయులు గావచ్చును. వాక్చాతుర్యముల నెరిగిన కవీశ్వరులు గావచ్చును. సాధకులు గావచ్చును, కాని నామదేవునితో సమమగు భక్తుని భూలోకమున జూడబోము. యోగయుక్తులగు నాత్మ జ్ఞానులును, జీవన్ముక్తులును, నిష్ఠావంతులును, విరక్తులును, మరి త్రిభువనము లందెవ్వరైనను నామదేవులకు సములుగారు. నామదేవుల భక్తిని వర్ణించుటకు శ్రీ రుక్మిణీరమణుడగు విఠ్ఠలునికిదప్ప నన్యులకు సాధ్యము కాద"ని తలచెను.

ఈవిధముగా ప్రతినిత్యము మార్గమునం దిరువురును స్వానంద భరితులై తీర్థక్షేత్రములను సేవించుచు హరినామసంకీర్తన జేయుచు హస్తినాపురము జేసిరి. నగరవాసులగు జనులు తాళమృదంగాది వాద్యములతో భజనజేయుచు నెదురుగవచ్చి స్వాగతమిచ్చిరి. నామదేవుల సంకీర్తనవిని యసంఖ్యాకులగు జనులు జయజయధ్వనులు జేయుచుండిరి. హస్తినాపురము హరినామ సంకీర్తనలతో నానంద నిలయమాయెను. ఆనగరమును బాలించు నవిoధరాజు, పంఢరీపురమునుండి తీర్థయాత్రలు జేయుచు జ్ఞానేశ్వరులును, నామదేవులును తన నగరమునకేతెంచి హరి నామ సంకీర్తనల జేయుచు స్త్రీపురుషులను మోహితులనుగా జేసిరను వార్తవినెను. చంద్రుడుదయించగనే తస్కరులు నిందించునట్లును, వేదాంతజ్ఞానమునువిని పాఖండులు వ్యాకుల చిత్తులగు నట్లును, దుష్ట రాజు ద్వేషకలుషిత చిత్తుడై నామదేవుల హరికథకు బోయి యవమాన పరుప నిశ్చయించి పరివారసమేతుడై కథాస్థలమునకు బోయెను. బ్రాహ్మణసభ కస్పృశ్యుడు పోయినట్లును, పాకగృహములో శ్వానము జేరినట్లును, దరుణదశలో కుష్ఠువ్యాధి సంప్రాప్తించినట్లును, దుష్టుడగు నారాజు సంకీర్తన స్థలములో ప్రవేశించెను.

నామదేవులును జ్ఞానేశ్వరులును తంబుర తాళ మృదంగాది సుస్వరవాద్యములతో హరినామ సంకీర్తనము నాదబ్రహ్మముగ జేయు చుండిరి. అసంఖ్యాకులగు శ్రోతజనులు దేహభ్రాంతి విరహితులై యుండిరి. అవివేకియగు నారాజు గోశవమొకదానిని రప్పించి నామ దేవుల యొద్ద బరుండబెట్టి "గోవును బ్రతికించినచో మీరు యదార్థ ముగ భక్తులు. లేనిచో మిమ్మిచటనే వధింతు"నని బలికెను. అసంఖ్యా కులగు జను లిదివిని చింతాక్రాంతులైరి. పళ్లెమునందు వడ్డింపబడిన పక్వా న్నములలో నాకస్మికముగ విషముపడినట్లును, ప్రకాశవంతమగు దీప ముపై బతంగము పడినట్లును, గానముచేయు సమయమున కంఠమున కడ్డముగా కఫము చేరినట్లును, చంద్రుని యందు లక్ష్యముంచిన చకోర పక్షులకు రాహువు కనబడినట్లును, నానంద యుక్తముగ హరినామ

సంకీర్తనము జరుగుచుండ నవింధరాజు విక్షేపము గలిగించుటచే నగ స్న్యుడు సముద్రపాశనము జేయుచుండ జలచరములు తబ్బిబ్బైనట్లును, శ్రోతలు చింతాక్రాంతులైరి. అవింధరాజీ గోవునెప్పుడు బ్రతికించెదవో తెలుపుమన నామదేవులు నాలుగుదినములలో గోవు బ్రతుకునని చెప్పెను. తురుష్కరాజు వార్త విని స్వస్థానమునకుబోయెను. నామదేవులును, జ్ఞానేశ్వరులును సప్రేమతో భగవంతు నిట్లు ప్రార్థించిరి.

"జయ దీనదయాళో, పతితపావనా, భక్తవత్సలా, కరుణాఘనా, అంతస్సాక్షీ, గుణనిధానా, భక్తభూషణా, గోవిందా, విధిజనకా, పయోబ్ధివాసా, సగుణస్వరూపా, హృషీకేశా, పుండలీకవరదా, పంఢరీశా, అవినాశా, జగద్గురూ, రాఘవేశా, రావణాంతకా, నందనందనా, కంసచ్ఛేదకా, కౌరవనాశకా, పాండవరక్షకా, శ్రీకృష్ణా, గుణసముద్రా, ఆనందఘనా, ద్రౌపదీలజ్జా నివారణా, రుక్మిణీకాంతా, కమలలోచనా, భక్తభూషణా, పాండురంగా!" యని యశ్రుధారలు విడచుచు గద్గదస్వరముతో ప్రార్థించుచుండ నసంఖ్యాకులగు శ్రోతృజనులును రోదనము జేయుచు నొక దినమంతయు నచ్చటనే యుండి మరునాటి యుదయమున జనులెల్లరు తమతమ స్వస్థానములకు బోయిరి. శీతాకాలము రాగానే మేఘములు గగనమునుండి పోవునట్లును, సూర్యుడుదయించనే పతంగము లెగిరిపోవునట్లును, యుద్ధమునందు రాజపజయమొందగనే సేన చెల్లాచెదరుగా బోవునట్లును, నాయువు పూర్తి కాగానే ప్రాణము లెగిరిపోవునట్లును, శ్రోతృజనులెల్లరును దారుణమగు నరిష్టమును జూచి లేచిపోయిరి. నామదేవులు తన తొడపై గోశిరము నుంచుకొని రోదనము జేయుచు "ఓ పంఢరీనివాసా! శ్రీహరీ! సత్వరమే మమ్ము గాపాడుము. ఇంత యాలస్యము జేయుచుంటి వేల? రుక్మిణీదేవితో క్రీడించుచుంటివా? లేక ప్రేమభక్తుల కీర్తనలు వినుచుంటివా? లేక యోగీశ్వరుల ధ్యానమందు దగుల్కొంటివా? భక్తుల ప్రమాదములను దీర్చుచుంటివా? సగుణోపాసకులు నిన్ను బూజించుచుంటిరా? అమృతపానమున కింద్రుడు తీసికొనిపోయెనా? లేక యాత్రాజనులు దర్శనమునకు విశేషముగా జేరినారా? నానావిధాలంకార వస్త్ర




హాస్తినాపురమున జ్ఞానేశ్వరులు నామదేవులు గోశవమును బ్రతికించుట

భరణములను శ్రీమంతు లర్పించుచుండిరా? మరియెందుచేత నాపైమరపు కలిగినది?” అని నాలుగుదినము లహోరాత్రములు ప్రార్థించుచుండెను.

నామదేవుల కరుణాశబ్దములను శ్రీ పంఢరీనాథుడు విని తత్క్షణమే సాక్షాత్కరించి హృదయస్థుడై దర్శనమిచ్చెను. ఆ సమయమున గోవు పునర్జీవితయై లేచి నిలువబడెను. శ్రీ విఠలనాథుడు “ఓ నామదేవా! గోవు బ్రతికినది చూడు” మన నామదేవులు భగవంతుని పాదములకు నమస్కరించి “ఓ యధోక్షజా! నాపై యింత యపకృపయేల? నాలుగుదినములు నన్ను బరీక్షించుచుంటివా?” అని పలికెను. అంత భగవంతుడు “ఓ నామదేవా! నీవు నాలుగుదినములలో గోవు బ్రతుకునని రాజుతో జెప్పితివి. నీ వచనములను సత్యముజేయుటయే నా కర్తవ్యము. నీ వా సమయమందే బ్రతుకునని జెప్పియుండినచో నే నట్లే జేసియుందును. భక్తులవాక్కునుండి వెలువడు వచనములను నేను యదార్థము జేయుచుందును. వాల్మీకి భవిష్యద్గ్రంథమున రచియించినటుల నే వర్తించితిని. అద్దములో జూచు చూపరులకు బ్రతిబింబమగు పడున ట్లెవరే భావనతో భజింతురో వారల కట్టి ఫలితమును నే ననుగ్రహింతు” నని చెప్పి భగవంతు డంతర్ధానుడయ్యెను.

నామదేవులు నేత్రముల దెరచి చూడగా గోవు పునర్జీవితయై లేచి నిలువబడియుండెను. ఆశ్చర్యకరమగు నీ విషయమును భటులు రాజునకు దెలియజేసిరి. తత్క్షణమే చిత్రము జూచుటకై యవిధరాజచ్చటికి వచ్చి యాశ్చర్యచకితుడై జ్ఞానేశ్వరులకును, నామదేవులకును సాష్టాంగనమస్కారముల జేసి క్షమార్పణ వేడుకొనెను. సర్వజనులును నానందభరితులై మహాభక్తులగు జ్ఞానేశ్వరులయొక్కయు, నామదేవులయొక్కయు మహామ విశేషములను గొనియాడుటకు బ్రహ్మాదుల కసాధ్యమని పలికిరి. భక్తులెల్లరు గూడి హరినామ సంకీర్తన జేయుచుండిరి. నామదేవులు భావపూర్వకముగ శ్రీ పంఢరీనాథునికి మంగళహారతి చేసిరి.

పదవ అధ్యాయము సమాప్తము

---

# జ్ఞానేశ్వర నామదేవులు కాశీయాత్రకు బోవుట.

—♦ ఏకాదశాధ్యాయము ♦—

శ్రోతృ జనులారా! సావధానముగ శ్రవణము జేయుడు. మీాక మృతము లభించినది. అద్భుతములగు భక్తుల సచ్చరిత్రలు ప్రాకృత భాషయందు వెలువడి వికసించుచున్నవి. విప్రునింట 'దయాను' చేసిన పక్వాన్నముల సర్వజాతుల వారును భుజించుట కుపయోగపడునట్లును, కనకాలంకారములు ధరించు వారందరికి సోభనిచ్చునట్లును, నూలుతో నేయబడిన వస్త్రము జనులెల్లరకును జలిబాధ నివారణ జేయునట్లును, నవనీతము దీసియుంచిన జెడనట్లును, భూమిలో నాటినబీజము వృక్షమై విస్తరించునట్లును, రాళ్ళను బగులగొట్టి దేవాలయము నిర్మించి యందు శంకరుని స్థాపించినట్లును, సర్వజనులకు నర్థమగు సరళభాషలో భక్త విజయగ్రంథము వెలువడినది.

జ్ఞానేశ్వరులు, నామదేవులును, హస్తినాపుర ప్రజలయొద్ద ననుజ్ఞ దీసికొని యచ్చటినుండి బయలుదేరి హరినామ సంకీర్తన జేయుచు, మార్గ మధ్యమునగల పుణ్యక్షేత్రముల సేవించుచు నాయాభాషలలో గవిత్వము జేయుచు గొంతకాలమున కానందవనమును జేరిరి.

భాగీరథిలో స్నానమాడి విశ్వేశ్వరుని సేవించి కృతార్థుల మైతి మని యమితానందమును బొందిరి. చాతుర్మాస్య మచటవసించి యాక్షే త్రమునగల మహాత్ములను సేవించుచు నాకస్మికముగ నొక దినమున కబీరు గృహమున కేగిరి. రాత్రివేళ యగుటచే బ్రజలెల్లరు నిద్రించుచుం డిరి. కబీరును, నాతని భార్యయు తత్క్షణమే సాష్టాంగ నమస్కారము జేసి స్వాగత పూర్వకముగ నతిజీర్ణమైయున్న తమ కుటీరములోనికి జ్ఞానేశ్వర నామదేవులను దీసికొనిపోయిరి. ఇంటియందు దన్నసామగ్రు లేవియు లేవు. కమాల్ ఉపవాసముజేసి నిద్రించుచుండెను. ఆతనిని లేపి చాపను దీసి కూర్చుండుటకై వేసిరి. నామదేవులును, జ్ఞానేశ్వరులును జాపపైగూర్చుండి కుశలప్రశ్నలు వేయుచుండ కబీ రంతర్మందిరమున



నామదేవులు జ్ఞానేశ్వరులు కబీరు గృహమునకు బోవుట

ప్రవేశించి భార్యనుబిలచి భక్తులకు భోజన మేర్పాటుజేయుమని చెప్పెను. అవశ్యమని కబీరుభార్య వ్యాకులచిత్తురాలై "గృహమున నన్నసామగ్రు లేవియు లేవు. పొరుగిండ్లవారు బదులీయరు. ఏమిచేయవలెన"ని పరిపరి విధముల జింతించి తుదకు ధైర్య మవలంబించి యొంటరిగా బజారున కేగెను. మార్గమున నడచుచు హరినామ సంకీర్తన జేయుచు భక్తులకు భోజన మేర్పరచుట కన్నసామగ్రులు లభించు నుపాయ మాలోచించు చుండెను. బజారులో నాయర్ధరాత్రి వేళ నొకే దుకాణము తెరువబడి యుండెను. కబీరుభార్య యచటకుజని మృదుమధురోక్తులతో "నాయనా మాగృహమునకు మహాత్ములు విచ్చేసిరి. వారికి భోజన మేర్పరచుట కన్నసామగ్రులు కావలయును. దయచేసి సామగ్రులనిమ్ము. మూల్య మును నేను తెచ్చియిచ్చెదను" అని చెప్పెను. అంత వర్తకు డామెను జూచి నీవెవరో తెలుపుమని విచారింప నామె యిట్లుచెప్పెను. "తురుష్క వంశమందు జన్మించిన వైష్ణవుడగు భక్తకబీరు నాభర్త. ఆలసింపక సామగ్రుల నిమ్ము. గృహమున మహాత్ములు వస్తుపడి యున్నారు. అన్న దాన ఫలితము నీకు లభ్యమగును."

అహల్యనుజూచి యింద్రుడు కామాతురు డైనట్లును, పార్వతి సౌందర్యమునుజూచి భస్మాసురునకు కామేచ్ఛ గలిగినట్లును, సీతను దశ కంఠుడు పాపపు దృష్టితో జూచినట్లును, దుర్యోధనుడు ద్రౌపదీదేవిని దుష్టబుద్ధితో జూచినట్లును, వర్తకుడు కబీరుకాంతనుజూచి కామాతురు డయ్యెను. "నామనోరథమును బూర్తిచేసిన ద్రవ్యవస్త్ర భూషణాదులను, నన్న సామగ్రులను, నీకు గావలయునంత చేకొనుము. నీ మనస్సున సంకోచమున్న దో దిరిగిపొమ్ము" అని దుర్జనుడగు నావర్తకుడు పలికెను.

అంత కబీరుకాంత చింతాక్రాంతురాలై వర్తకుని కోరిక తిరస్కరించిన నాయర్ధరాత్రివేళ నన్నసామగ్రులు లభింపవనియు, మహాత్ములు వస్తుండిన సత్యమునకు హానికలుగుననియు నాలోచించెను. సమయానుకూలముగ వర్తించుటయు, ప్రసంగము ననుసరించి బదులు

చెప్పుటయు, సభనుజూచి కీర్తన జేయుటయు, భూమినిజూచి విత్తనములు జల్లుటయు నత్యావశ్యకములు.) సత్యశీలుడగు హరిశ్చంద్ర నృపతి సమయముననుసరించి యస్పృశ్యుని గృహమున నీరుమోసెను. ఆతని భార్యయగు రాణి చంద్రమతి నానావిధ కష్టము లనుభవించెను. కుటుంబ పోషణమునకై ద్విజులు కలికాలమందు యవనసేవ జేయుట తటస్థించెను. మనుజుల కొఱకే శాస్త్రమందు ధర్మాధర్మములు వర్ణింపబడెను. భగవత్సేవకును, భాగవత సేవకును, నధర్మ మాచరించినను క్షంతవ్యము. జననీ జనకుల సేవకును, కులగురువుల సేవకును, నభ్యాగతుల నాదరించుటకును, దీర్ఘముల సేవించుటకును, నధర్మము నొనర్చినను దోషములేదు. భరతుడు తల్లిమాటలు వినినచో రామసేవ లభ్యమగునా? ప్రహ్లాదుడు తండ్రియాజ్ఞకు బద్ధుడైన నారసింహుడు ప్రసన్నమగునే? బలిచక్రవర్తి శుక్రవచన మాలకించిన త్రిపాదదాన మర్పించునే? గోపికలు భర్తలను త్యజించుటచే కృష్ణసేవ లభ్యమాయెను. శాస్త్రవచనముల ప్రమాణముగా నంగీకరించినచో, భగవంతునకు విముఖులగుదురు. నేను శాస్త్రవిచారణము జేయుచుండిన మహాత్ములు పస్తుండవలసి వచ్చున”ని చింతించి కార్యసాధనతత్పరయై ధైర్యముతో వర్తకునిజూచి “అయ్యా! నాకు ముందు సామగ్రి నిమ్ము నిశ్చయముగ నేను తిరిగివచ్చి నీ కోరిక దీర్తును. ఇంట భక్తులు కలరు. చాలసేపైనది. ఆలస్యమగునేని వారు నిద్రింతురు. నేను సత్వరమే చని వారికి భోజన మేర్పరచి త్వరితముగ దిరిగవచ్చెద” నని చెప్పెను. దుర్యోధనుని దృష్టిలో సాత్వికులు కనబడనట్లును, తస్కరులకు జంద్రుడు మలినుడుగా నగపడునట్లును, రోగికి పక్వాన్నములు రుచింపనట్లును, కృపణునకు భూతదయ యుండనట్లును, మాంసభక్షకులకు గరుణ యుండనట్లును, క్షయరోగికి శరీరము క్షీణించియుండనట్లును, కబీరుభార్య వచనములందా వర్తకునకు నమ్మకములేక వచ్చెదనని ప్రమాణము జేసినచో సామగ్రి నిచ్చెద నని చెప్పెను.

అంత కబీరుకాంత కొంత ధైర్యమవలంబించి వీనివచన మంగీకరింపనిచో సామగ్రులు లభింపవని యోచించి భగవత్సాక్షిగ దాను త్యాగి

తముగ దిరిగి వచ్చెదనని ప్రమాణమాచరించెను. వర్తకు డామెకు భోజనసామగ్రి నీయగా కబీరుసతి సామగ్రుల దీసికొని త్వరితగతిని గృహము జేరెను. జ్ఞానేశ్వర నామదేవులు స్వహస్త పాకములను జేసి కొందుమని చెప్పనకతంబున వంటపాత్రలను, భోజనసామగ్రులను కబీరు భార్య వారికొసంగెను. నానావిధములగు పక్వాన్నములను దయారు చేసి పాత్రలలో వడ్డించి, భగవంతునకు నైవేద్యమునిడి తృప్తితో నా మహాత్ములు భుజించిరి.

కబీరుకాంత పతి నేకాంతముగ బిలచి "మీరు భక్తుల సేవజేయు చుండుడు. మహోపకారియగు నా వర్తకుని కోర్కెను బూర్తిచేయు టకు నేను పోవలసియున్న" దని చెప్పి జరిగిన వృత్తాంతమంతయు సవిస్త రముగ నెరింగించి నాకాజ్ఞ నిమ్మని కోరెను. అంత కబీరుభక్తుడు "వర్త కుడు మహోపకారము జేసెను. ఈ దినమున మహాత్ములకు భోజనము వాని పుణ్యముచే లభ్యమాయెను. వాని యుపకారమునకు మన మేమియు బ్రత్యుపకారము జేయజాలము. నీకను మంచి యాలోచన గలిగినది. మహాత్ముల భోజనమునకై శరీరము నర్పించుచుంటివి. వర్షము పడుటచే వీధులన్నియు పంకమయములై యున్నవి. ఈ యంధకారమున నీ వొంటరిగ జనుట కష్టము. నేనును నీవెంట వచ్చెద" నని చెప్పి భార్యను భుజముపై గూర్చుండబెట్టుకొని మార్గమున నిరువురును భగవ న్నామస్మరణ జేయుచు "నేడు గొప్ప సుదినము. మహాభక్తులు మన గృహమునకు విచ్చేసి" రని చెప్పికొనుచు వర్తకుని దుకాణమునొద్దకు జేరిరి. కబీరు తన సతిని భుజముపైనుండి దింపి "నీవు లోనికి బోయి వర్త కుని కోర్కె దీర్పుము. నేనింటికి జని భక్తుల సేవింతు" నని చెప్పి గృహ మున కేగెను.

కామాతురుడగు నా వణిజుడు కబీరుకాంత రాక కెదురు చూచుచు తన్ను మోసగించినదని భావించుచుండెను. తత్క్షణమందు కబీరుకాంత వర్తకునియొద్దకు వచ్చి "అయ్యా! నీ మనోభీష్టము నెర వేర్చుకొను" మనెను. అంత వణిజుడు "ఘోరముగ వర్షము కురిసినది. వీధులన్నియు పంకమయములై యున్నవి. అంధకార మధికముగనున్నది.

ఈ సమయమున నీవెట్లువచ్చితివి. నీ పాదములకు పంకమేమియు నంట లేదేమి! యదార్థము నుడువు" మనెను. అంత కబీరుకాంత వర్తకునితో "గుణవంతుడవైన ఓ సెట్టీ! నేను యదార్థమును జెప్పెద వినుము. నీ యొద్ద ప్రమాణమును స్వీకరించి నే నింటికజని భక్తజనులకు భోజన మేర్పరచితిని. నీ పుణ్యమునవలన వారు తృప్తిగా భుజించి నిద్రించుచుం డిరి. నీ యుపకారము వర్ణనాతీతమైనది. పతివ్రతనగు నాకు భర్తయాజ్ఞ పరమ ప్రమాణము. నీకోరికను నాప్రాణనాథుడగు కబీరున కెఱింగించి తిని. మహోపకారివగు నీకోరిక సందేహింపక దీర్పుమని నాప్రాణనాథుడు నాకాజ్ఞనిచ్చి తనభుజముపై నన్ను గూర్చుండబెట్టుకొని యిచటకుదీసు కొనివచ్చి విడచి వెళ్లెను. త్వరితముగా నీకోరిక దీర్చుకొమ్ము" అని పలుక వణిజుడు పశ్చాత్తాపచిత్తుడై "నేను జన్మించి సాత్విక కార్య మేమియు జేయలేదు. ఎనుబది నాలుగులక్షల జీవజాతులందును బుట్టుచు గిట్టుచుండ ననేక జన్మార్జిత పుణ్య ఫలితముగా మనుష్యదేహము లభిం చినది. నేను స్వార్థముగ విషయ భోగములందు దగుల్కొంటిని. మహా భక్తుడగు కబీ రతి విరక్తుడును, నుదారుడును నైయున్నాడు. పతివ్రత యగు నీమెవిషయమున నేను దుష్టసంకల్పము జేసితిని. తన భార్య నిత రుల కర్పించు భర్త యెచ్చటను గాన్పింపడు" అని మానసమున జిం తించుచు కబీరుసతికి సాష్టాంగ నమస్కారముజేసి "ఓమాతా! జగజ్జ ననీ! అజ్ఞాన బాలకుడనగు నాయపరాధములను క్షమించుము. కృపా పూర్వకముగ నా కభయదాన మిచ్చి నన్ను నీవెంట దీసికొనిపోయి జనకుడగు కబీరు పాదములపై బడవైచి యాతని కృపకు బాత్రుడనగు నట్లు జేయు"మని ప్రార్థించెను.

కరుణా వచనములను బలుకుచున్న వర్తకుని జూచి కబీరుసతి "ఓసెట్టీ! నీ మనస్సు నవనీతముపోలె నతి మృదువై యున్నది, పాప కార్యము లమితముగ జేసినను సత్యమున బశ్చాత్తాపము గలిగినచో దురితములెల్ల బటాపంచలగునని శాస్త్రములు చెప్పుచున్నవి. విష భక్షణ జేసినపిదప నమృత పానముజేసిన నిశ్చయముగ మృత్యువు దొల

గును. నీచిత్తము పశ్చాత్తాపముచే దహింపబడినది. భవరోగ విముకుడ నైతివి. నీకిప్పుడే కబీరుదర్శన మిప్పించెదను. రమ్ము” అని చెప్పెను.

అంత వణిజుడమితానందములో రజస్తమోగుణములను, దాంభికాభిమానములను, మోహభ్రాంతులను త్యజించి సాత్వికలక్షణుడై కబీరు భార్యలోజని యనన్యభావములో కబీరునకు సాష్టాంగ నమస్కారము జేసి, చేతులుజోడించి “నే నజ్ఞానబాలకుడను. తెలియక ననంతాపరాధములను జేసితిని. అవి యన్నియు క్షమించి నన్ను మీదాసునిగా నంగీకరింపుడు” అని ప్రార్థించెను. కబీరు పూర్ణముగ నంతస్సాక్షియైనందున, వర్తకునకు పశ్చాత్తాపము గలిగినదని గ్రహించి, యాతని నాలింగనము జేసికొని యభయపు వరదాన మనుగ్రహించెను. అనుతప్తచిత్తుడగు వర్తకుడు శ్రీరామభజన జేయుచుండెను. సత్సాంగత్యముయొక్క మహిమ వర్ణింప వేదశాస్త్రముల కసాధ్యము. జ్ఞానేశ్వరులు కబీరు నాలింగనము జేసికొనిరి. జ్ఞానేశ్వరులు నామదేవులతో “గతవృత్తాంతము స్మరణయందున్నదా? క్షీరసాగరమందు శ్రీ మహావిష్ణువు నిన్నును, కబీరును భూలోకమున నయోనిసంభవులుగ బంపెనుగదా! నీవు సాక్షాదుద్ధవుడవు. శుకావతారుడీ కబీరు, భక్తిమార్గము మలినమైన కతంబున దరిగి యుద్ధరించుటకు మీ రిరువురును జన్మించితి రని చెప్పెను.

కబీరును, నామదేవులును జ్ఞానేశ్వరులకు సాష్టాంగ నమస్కారము జేసి “గుహ్యములగు మా పూర్వవృత్తాంతములను మాకు తెలియజెప్పి” రని చెప్పి యానందించిరి. జ్ఞానేశ్వరులు “దక్షిణదేశమందు మహాక్షేత్రమగు పంఢరీపురమున పుండలీకభక్తునకు దర్శనమిచ్చుటకై లీలానాటకసూత్రధారియు జగజ్జీవనుడును నగు పరబ్రహ్మమూర్తి వైకుంఠమును త్యజించి వచ్చియున్నాడు. ఈ నామదేవుని కాతడు జీవనము. నీ వొకపర్యాయ మా క్షేత్రమును దర్శింపు” మని జ్ఞానేశ్వరులు చెప్పగా నవశ్యముగా కార్తీకశుద్ధయేకాదశికి వచ్చెదనని కబీరు ప్రత్యుత్తర మిచ్చెను. జ్ఞానేశ్వర నామదేవాదులు కబీరునొద్ద సెలవుగొని బయలుదేరిరి.

ఏకాదశాధ్యాయము సమాప్తము.

# జ్ఞానేశ్వర నామదేవులు సంకీర్తన జేయుచుండ నాగనాధుని ఆలయము తిరుగుట

—♦ ద్వాదశాధ్యాయము ♦—

నేడు త్రిభువనములందు సుకాలము సంప్రాప్తించినది. భక్త విజయమను మేఘము చైతన్యరూపమును నాకసమున వ్యాపించి గర్జించుచు నాత్మానందమను వర్షమును గురిపించుచున్నది. సత్వశీలురను చాతకపక్షు లాదియందే తృప్తిపొందుచున్నవి. త్రిగుణాత్మకులగు నితరజనుల కొఱకనేక ధాన్యము లుత్పన్నమగుచున్నవి. కేవలము పశుసమానులగు తమోగుణసంభూతుల కపారముగ తృణ ముత్పన్నమగుచున్నది. భూమియందు పడిన యీ యపారజలము సర్వోపయోగకరమగుచున్నది. స్వానందమను తరంగములు జ్ఞానసాగరమున గలియుచున్నవి. జ్ఞాన భావుకజనులను మీనములు స్వానందప్రవాహమున నానంద ప్రవాహముతో క్రీడించుచున్నవి.

జ్ఞానేశ్వర నామదేవులు కాశీక్షేత్రములో కబీరునియొద్ద సెలవుగైకొని గయ, ప్రయాగ, అయోధ్య, మధుర, గోకుల బృందావనము, ద్వారక మొదలగు క్షేత్రములను సేవించి తిరిగి మార్వాడదేశమునుండి పోవుచుండిరి. వేసవికాలమగుటచే నొకదినమున నిరువురును దప్పికచే జలమునకై యన్వేషించుచుండిరి. ఆకస్మికముగ నపారమగు లోతు గల నొక కూపము కానబడెను. ఉదకమును తోడుట కేమి యుక్తి చేయవలయునని యిరువురును యోచించుచుండిరి. అంత జ్ఞానేశ్వరులు నామదేవులతో "నాకొక యుపాయము సాధ్యమైయున్నది. అష్టసిద్ధులలో నొకటగు లఘిమాసాధనచే నేను కూపమున బ్రవేశించి యుదకపానము జేసెదను" అని చెప్పి భావిలో బ్రవేశించి దప్పిక దీర్చుకొనెను. నామదేవులకు దప్పిక యధికమై యుపాయము తోచనందున జింతాక్రాంతులయ్యెను. పిదప జ్ఞానేశ్వరులు "ఓ నామదేవా! లఘిమాయోగము నీకసాధ్యము. చింత విడువుము. నేను భావినుండి దోసిలితో నీటిని దెచ్చి యిచ్చెదను. సందేహింపక త్రాగవలె" నని చెప్పెను.

అంత నామదేవు లిట్లు ప్రత్యుత్తరమిచ్చెను. 'ధైర్యముతో నొక క్షణములో జరుగబోవు కౌతుకమును జూడుము.'' పిదప హృదయములో విఠ్ఠలమూర్తిని నిలుపుకొని ప్రేమతో నామదేవులు భగవంతు నిట్లు ప్రార్థించెను. "రుక్మిణీకాంతా! సత్వరమే దర్శనమిమ్ము. అనాథుడ నగు నాపై నవకృప నీకేల? జననీ జనకులును, బంధు మిత్రులును, కుల దేవతయు, నైశ్వర్యమును, సిద్ధాంతజ్ఞానమును నీవై యున్నావు. త్వరితముగా దర్శనమిమ్ము. అనాథనాథా! రుక్మిణీపతీ! దీనుడనగు నన్ను జాగు సేయక కాపాడుము. త్రికరణశుద్ధిగ నేను నీ యజ్ఞానబాలకుడను. దప్పికచే వ్యాకులచిత్తుడనైన నేను నిన్నుతప్ప నెవరిని ప్రార్థింతును. వేదశాస్త్ర పురాణములు నిన్ను అనాథనాథుడవని వర్ణించినవి. నీ కీర్తికీ దినమున భంగము కలిగెను. గజేంద్రుడు మకరితో బాధపడుచు నిన్నుప్రార్థింప నతి వేగమున వానిని రక్షించితివి. ద్రౌపది వస్త్రాపహరణ సమయమున ప్రార్థింపగా సత్వరమే యామెను కాపాడితివి. జ్ఞానేశ్వరులతో దీర్ఘయాత్రలకై పంపి కృపామూర్తివగు నీవీరోజున నుదాసీన వృత్తితో నుండుట కతంబేమి? నీవు జగదీశ్వరుండవు. నాకుగలిగిన దురవస్థను దొలగింపుము. నీవు నన్నీ క్షణమున గాపాడనిచో జనులు నిన్నుపరిహాసింతురు. తత్ క్షణమే దీనుడనగు నన్ను కాపాడుము.

భూలోక వైకుంఠమగు పంఢరీ పురమునందు భగవంతుడు ప్రతి క్షణమునందును నామదేవుల వియోగము సహింపలేక రుక్మిణీ దేవిని జూచి "నామదేవులు కనబడువరకు నా చిత్తమునకు శాంతి కలుగ ద" నెను. అంత జగజ్జనని యగు శ్రీ రుక్మిణీదేవి "ఓ దేవాదిదేవా! నామ దేవుని కేదైన కష్టము సంప్రాప్తించెనా? నీవిట్లు ఖిన్న మానసుడవగుటకు కారణమేమి? తెలుపుము" అనెను. దేవాది దేవుడగు పంఢరీనాథు డొక్క క్షణము మౌనమువహించి "నామదేవుల యార్తధ్వని యొకస్మారెర్తిగా వినబడు చున్నది, తృష్ణాక్రాంతుడై యాతడు జలము నపేక్షించుచున్నాడు. విలంబన జేయక నేనిప్పుడేపోయి యాతని దప్పిక దీర్చెద" నని చెప్పి తత్ క్షణమే శ్రీ పంఢరీనాథుడు కూపమున ప్రవేశించి జల ప్రవాహమును బొంగింప జేసెను.

జ్ఞానేశ్వరులీ కౌతుకమును జూచి యచ్చెరువొందుచు "ఓనామదేవా! భగవంతుని నీవు ఋణస్థునిగా జేసికొంటివని" చెప్పి, యాతని నాలింగనము జేసికొనెను. శ్రీరామ సైన్యమునందు వానరులు పాషాణముల నీటిపై దేల్చినట్టులను, వశిష్ఠాదులు తమ తాపమును యోగదండమునకు మార్చినట్లును, తనప్రతాపముతో కౌశికుడు ప్రతిసృష్టి చేసినట్లును, భగీరథుడు ప్రయత్నించి భాగీరథిని భూలోకమునకు దెచ్చినట్లును గౌతముడు శంకరుని ప్రసన్నునిగా జేసికొని గోదావరిని దెచ్చినట్లును, నీ మహిమ లపారముగ నున్నవి. హస్తినాపురమున గోవును బ్రతికించితివి. దప్పిక తీర్చుకొనుట కిప్పుడు పాతాళగంగను రప్పించితివని" చెప్పెను. నామదేవులు సావధానముగ దప్పిక దీర్చుకొని జ్ఞానేశ్వరులతో "నేనిచ్ఛగించినది దేవుడు చేయుచున్నాడు. ఈ నేత్రములతో పంఢరీనాథుని జూచుట యెప్పుడు తటస్థించునో" అని చెప్పెను. జ్ఞానేశ్వరులు నామదేవులను జూచి యోగులు సమాధిలో గూర్చుండెదరు. వారిని జూచిననాకు విశ్రాంతి లభింపదు. నీ సాంగత్యము వలన నాకపారమగు విశ్రాంతి లభించినది. రుక్మిణీపతి నీకు వశమై యున్నాడు. నీవు జన్మించిన కులము ధన్యమైనది. ఆవునుజూచి దూడ గంతులువేయునట్టుల నీ సద్గుణములను జూచి నామనస్సులో ప్రేమానందము లుప్పొంగుచున్నవి. నీకీర్తన శ్రవణమునకు తీర్థ యాత్రలు సమముకావు. శ్రుతి, స్మృతి, పురాణములును, యోగధ్యానములును, నీ ప్రేమకు సమముకావు. ఋషిగణములును, గంధర్వులును, విరించియు, నింద్రాది దేవతలును ప్రేమభావముతో నీరూపము నుపాసింతురు. కాని వారలకు దుర్లభమగు పరబ్రహ్మమును నీవు స్వాధీన పరచుకొంటివని చెప్పగా నామదేవులు సాష్టాంగ ప్రణామము నాచరించిరి. నామదేవులు దప్పిక దీర్చుకొనిన కూపమునుండి జలప్రవాహ మిప్పటికిని వెలువడుచునే యున్నది. మార్వాడ దేశమునందు మార్గశిర మాసమున స్మారకచిహ్నముగ యాత్రోత్సవములు జరుగుచున్నవి.

పిదప జ్ఞానేశ్వర నామదేవులు పురాణ ప్రసిద్ధములగు తీర్థక్షేత్రముల సేవించుచు బదరికాశ్రమమును దర్శించి యటనుండి జగన్నా

థమును, ఓంకారమును, అమలేశ్వరమును, కేదారమును, ఉజ్జయినిని, మహా కాళీశ్వరమును జూచిరి, అచటనుండి తిరిగి పరళీవైజనాథము పోరటి, సోమనాథము, దర్శించి శ్రీశైల క్షేత్రమును జేరిరి. భక్తుల రాక నపేక్షించు మల్లికార్జునుని దర్శించి ఘృష్ణేశ్వరమును, సేహాళ తీర్థమును సేవించి నాసికా త్ర్యంబకమును జేరి కుశావర్తిలో స్నానమాడి పంచవదనునకు నమస్కారము జేసిరి. అచటనుండి బయలుదేరి పశ్చిమ సముద్రమును జూచి భీమాశంకరిని, జనార్దనమును సేవించి రామేశ్వరము జేరిరి. కొలదిదినము లటనుండి, హరినామ సంకీర్తనలు జేసి మోక్ష దాయకములగు సప్తపురములను జూచి, ద్వాదశ జ్యోతిర్లింగములను సేవించిరి. భూమండలమునగల పురాణ ప్రసిద్ధములగు పుణ్యక్షేత్రములను దర్శించిరి. చంద్రుని జూచిన నానాయాసముగ నక్షత్రములు కన బడునట్లును, నమృతపానము జేసిన నౌషధములెల్ల సేవించిన ఫలితము గలుగునట్లును, వేదాంత పఠనము జేసిన శ్రుత్యర్థము తెలియునట్లును, సర్వజ్ఞ నారాయణునకు నమస్కరించిన వనస్పతులను బూజించినట్లును, నాదిశేషుని జూచిన నితర నాగములను జూచినట్లును, విష్ణువునకు కలసి హారమర్పించిన షోడశోప చారములు జేసినట్లును, శంకరుని బూజించిన తాపసులందరిని బూజించినట్లును, నైరావతమును దర్శించిన పృథ్విలో నన్ని యేనుగులను జూచినట్లును, నింద్రుని దృష్టిపించిన సురలెల్లరు సంతసించునట్లును, మోక్షదాయకములగు సప్త పురములను, ద్వాదశ జ్యోతిర్లింగమును, వర్ణించుట తటస్థించినప్పుడు పృథ్వియందుగల సమస్త తీర్థముల నాయాసముగ వర్ణించినట్లగును. జ్ఞానేశ్వర నామదేవాదులు కొంతకాలమునకు నాగనాథ క్షేత్రమును జేరిరి. ఆ క్షేత్రమున విశేష పర్వకాలమగు మహాశివరాత్రినాడు కైలాసమువలె నానంద దాయక ముగ నుండును. అచట తీర్థమున స్నానమాడి మహాద్వారములో ప్రవే శించి, జ్ఞానేశ్వర నామదేవులు నాగనాథునకు సాష్టాంగ నమస్కారము లాచరించి "హేఅనాథనాథా! పార్వతీవరా! శ్మశానవాసీ! ఖట్వాంగ ధరా! కైలాసపతే! దిగంబరా! విశ్వేశ్వరా! విశ్వపతే! "అని ప్రార్థించిరి.

జ్ఞానేశ్వరులును, నామదేవులును తిరిగి మహాద్వారమును జేరి తంబుర తాళములను చేకొని, హృదయములో విఠ్ఠలమూర్తిని నిలుపుకొని దేహభ్రాంతిని విడచి, మానావమానములను, దాంభిక లోకాచరణయు ద్యజించి, భేదభావము లేక ప్రేమతో నానందముగ నృత్యకీర్తనలు జేయుచుండిరి. అసంఖ్యాకులగు జనులు చేరి శ్రద్ధతో శ్రవణము చేయుచుండిరి. పూర్ణిమనాడు చంద్రుడు సంపూర్ణకళలతో శోభించుట జూచి సముద్రము త్సాహముగ నుండునట్లును, పూర్ణముగ తైలమున్నచో దీపము ప్రకాశవంతముగ నుండునట్లును, ద్విజులర్ఘ్య దానము జేసినచో సూర్యుడు సంతుష్టుడగునట్లును, నమృతపానముచే దేహ మమరత్వము నొందునట్లును, సుదాతుడగు దాత ధనమిచ్చినచో యాచకుడు సంతోషించునట్లును, పక్వాన్న భోజనముచే బ్రాహ్మణులు సంతుష్టి జెందునట్లును, నామదేవులు చేయు హరినామ సంకీర్తన విని జనులు నేత్రములనుండి యశ్రుధారలు విడచుచు పరవశులై విదేహస్థితి యందుండిరి. రాజు శౌర్య తేజోయుక్తుడైనచో సేన సహజముగ నట్లే యుండును. మనస్సులో విషయసంకల్పములను విడచిన నింద్రియాదులు చలింపనట్లు నామదేవులు విదేహస్థితి నొందుటవలన శ్రోతలుగూడ నట్లే యుండిరి. తంబుర, తాళ, మృదంగాది వాద్యములతో విఠ్ఠల నామ సంకీర్తన నాదబ్రహ్మమై యఖండముగ జరుగుచుండెను.

విప్రోత్తములు స్నానమాడి ధౌతవస్త్రములను ధరించి, సర్వాంగములకు భస్మలేపన జేసికొని యభిషేకమునకై మడితో జలమును దీసికొని పూజాసామగ్రిని దీసికొని మహాద్వారములో బ్రవేశించిరి. నామదేవు లప్పుడానందముతో నృత్యకీర్తనలు జేయుటవలన అసంఖ్యాకులగు యాత్రాజనులు శ్రవణము జేయుచు కూర్చుండిరి. అర్చకు లాలయమున బ్రవేశించుటకు మార్గము లేనందున కోపోద్దీపిత మానసులైరి. (అంతఃకరణమునందు క్రోధమును గలిగియుండువానికి దృష్టియం దమంగళ మగుపించును.) హరినామ సంకీర్తనమునకును, బ్రహ్మసభా స్థలమునకును, దేవాలయ దర్శనమునకు బోవునప్పుడును. నమంగళమని భావింపరాదు.

గీతా భాగవతములును, వేదాంత గ్రంథములును సమంగళముగ భావింపరాదు. బ్రాహ్మణునకు సంధ్యాస్నానములు జేసి యంతఃకరణము నందు వికల్పముతో నుండి యితరులకు "మమ్ము ముట్టకూడు. నేమడికట్టు కొంటి" మని చెప్పుచుందురు. అట్టి నాగనాథస్వామి దేవాల యార్చకులు శబ్దములను పల్కుచు "ఏమిరా! వ్యర్థముగా పాటలు పాడెద రేల ఈ తాళముల ధ్వనియు, కేకలును పంఢరీపురమందే కాని యిచ్చట జేయరాదు. మా నాగనాథుడు మీరు చేయు భజనలకు విముఖుడు. ఎచ్చట నేది యనవసరమో దాని నుపయోగింపవలెను. పాలలో లవణము వేయుటయు, కూరలో జక్కెర గలుపుటయు రుచిహీనము లగును. కర్ణములకందించు పుష్పపరిమళమును, నోటికి జూపు నద్దమును వ్యర్థమగునట్లు కైలాసపతియగు నుమారమణుడు మీరు చేయు భజనల కానందింపడు. కాన పంఢరీపురమునకు బోయి నిర్లజ్జతో గేకలును, గంతులును వేసికొను" డని చెప్పిరి.

అంత శ్రోతృజనులు వ్యాకులచిత్తులై "అయ్యలారా! మీరు హరి హరులయందు భేదము కల్పించి యిట్లు చెప్పుచున్నారు. తీర్థమును జలమును, మాధుర్యమును బెల్లమును, దీపము ప్రకాశమును, పుష్పమును మకరందమును, మేఘమును జలమును, రత్నమును ప్రభయు, వాద్యమును నాదమును నభిన్నములై యుండునట్లు శివ కేశవు లభిన్నులని సర్వజ్ఞులు చెప్పెదరు. హరినామ సంకీర్తన వినిన శంకరు డానందముతో నూగులాడుచుండు' నని జ్ఞానేశ్వరులు నామదేవులతో జెప్పిరి.

శ్రోతలు చెప్పిన వాక్యములకు ద్విజవరు లాగ్రహపరవశులై "పామరులైన మీరు గొప్పతనమునకై మాకు జ్ఞానమును బోధింతురా? మేము గొప్పకులమున జన్మమందిన బ్రాహ్మణులము. శాస్త్రమున కధికారులము సర్వజ్ఞులము. నామదేవుని సిద్ధాంతజ్ఞానమును మే మెన్నడును నంగీకరింపము. శివపూజకు విలంబనమగుచున్నది. లోని కేగుటకు మార్గములేదు. త్వరితముగ లేచిపొండు. మేము మడి గట్టుకొంటిమి. ఎవరైన తాకినచో సచేలస్నాన మాచరింప వలసి వచ్చును.

జాగుచేసిన నవమానము నొందెదరు. అని కసరుకొనుచుండిరి. జను లెల్లరు మౌనముగా ప్రత్యుత్తర మీయక జూచుచుండిరి. అర్చకులు క్రోధముతో "ఓరీ! నామదేవా! దేహభ్రాంతివిమోహితుడవై యపారజనులను మోహింపజేసి సిద్ధాంతజ్ఞానములు జెప్పుచు మా కర్మమార్గమున కడ్డము వచ్చుచుంటివి తత్క్షణమే నీవు దేవాలయము వెనుకకుబోయి నిర్లజ్జతో గంతులువేయుచు గానము" మని చెప్పిరి

నామదేవు లవశ్యమని చెప్పి తత్కాలమందు చేయుచున్న సంకీర్తన నాపిరి. నీటిబిందెలో మత్స్యముపడినట్లును, పాలలో లవణము పడినట్లును, చందనము తీయునప్పు డం దుల్లిగడ్డ పడినట్లును, కస్తూరిలో నింగువ పడినట్లును, నామదేవుల నగటనుండి యర్చకులు పొమ్మనుటచే తాత్కాలికముగా సంకీర్తన నాపుటవలన నానందరసము ఖండితమాయెను. శ్రోతృజను లెల్లరును వ్యాకుల చిత్తులైరి. పాత్రతో వడ్డించిన పక్వాన్నము నాకస్మికముగ కాకి యెత్తుకొని పోయినట్లును, దూరప్రయాణమునుండి తిరిగి వచ్చుచుండ తస్కరులు ధనమును దోచుకొనినట్లును, సభలో నెల్లరును దుఃఖాక్రాంతులై లేచి యాలయము వెనుక భాగమునకు నామదేవునితో నరిగిరి. సూర్యాస్తమయమంగనే కిరణములు గాలినితో నంతర్ధాన మగునట్లును, రాజరాజ్యము పోయిన సైన్యమాతని వెంట నరుగునట్లును, గాలిననుసరించి మేఘము చలించునట్లును, ప్రజలు జనులు నామదేవులతో వెనుకకుబోయిరి. ఆహ్లాదముతో వాద్యములు మ్రోగుచుండ నామసంకీర్తన నాదబ్రహ్మముగ జరుగుచుండెను.

నామదేవు లశ్రుధారలు విడుచుచు "ఓ పతితపావనా! అనాథ నాథా! రుక్మిణీరమణా! నన్ను విదేశీయుల పాలుజేసితివేల! లేడిని విడచిన లేగవలె, తల్లిని విడచిన బిడ్డవలె క్షోభించుచున్నాను. అహో! పండరీ పురనివాసీ! కులస్వామీ! నాపై మనుపేల గలిగినది. పృథ్వియంతయు దిరిగితిని. తీర్థ క్షేత్రములన్నియు జూచితిని. నీతో సమానమగు దైవమును మాత్రము జూడలేదు. నిను చరణములును, సుఖసారస్వరూపమును సేవించిన మాత్రమున దేహభ్రాంతి నశించును. ప్రాణ




నామదేవులు సంకీర్తల జేయుచుండ నాగనాధుని దేవాలయము పశ్చిమముఖముగా తిరుగుట

మృదంగ ధ్వనులతో, పతాకముల శోభతో నానందముగ హరినామ సంకీర్తన జరుగుక్షేత్రము పృథ్వియందెచ్చటను గనబడలేదు" అని పరి పరి విధముల శ్రీ పంఢరీనాథుని ప్రార్థించుచుండెను.

శ్రీ రుక్మిణీకాంతుడు నామదేవుల కీర్తి జగద్విఖ్యాతము జేయ దలచి పతాకహస్తులగు తొమ్మిదిలక్షల జనుల నకస్మాత్తుగా నచట దింపెను. తొమ్మిదిలక్షల పతాకహస్తులకు జనులేగాక నవవిధ భక్తులును నవరసములును, మూర్తీభవించి సభా జనులకు గనబడుచుండెను. ఈకౌతుకమునుజూచి సకలజనులు నాశ్చర్య చకితులై దేహభ్రాంతిని విడచి చిత్రప్రతిమలవోలె జూచుచుండిరి. నామదేవు లపుడానందాబ్ధి నోలలాడుచు నృత్యకీర్తనల జేయుచుండిరి. ఆ నిశాసమయమున కృష్ణపక్షపు జీకటియను కొఱతలేక పతాక హస్తులై వచ్చిన నవలక్ష దేవతల ప్రకాశము దశదిశల వ్యాపించెను. దేవతలు పుష్పవర్షము గురిపించుచుండిరి. భక్తజనులు జయజయధ్వనులు జేయుచుండిరి. అఱువది నాలుగు కళలును కథాస్థలమున దటస్థముగ నిలువబడి కౌతుకమును జూచుచున్నవి.

నామదేవులు "ఓ పంఢరీనాథా! సర్వసాహిత్యములు ననుకూలముగ జేసితివి. కాని నాగనాథుడు భజనకు విముఖుడై యుండుట కొఱతగ నున్నది. నాగనాథుడే నీయెదురుగ నున్నచో నింకను కాలక్షేపమానందముగ నుండును. నేనేమి యపరాధమొనర్చితిని. నాయందు నాగనాథునకు కోప మేల కలిగెను. జయ క్షీరసాగరవిహారా! లక్ష్మీకాంతా! అత్యుదారా! అనాథనాథా! కరుణాకరా! సత్వరమే నన్ను గాపాడుము. జయ గజేంద్రమోచకా! కరుణాలయా! విధిజనకా! యాదవరాయా! నీ నామమాత్రముననే మాయ తొలగును. త్వరితముగ నన్ను గాపాడుము. ఉపమన్యునకు క్షీరసముద్రమనుగ్రహించితివి. ద్రౌపది మానమును గాపాడితివి. హస్తినాపురమున గోవును బ్రతికించితివి. మార్వాడదేశమున దృష్టాంతుడనైయుండ కూపమునుండి జలప్రవాహమును వెలుపలకు బంపితివి. ఉదారుడవగు నీవు నాగనాథుడు విముఖుడై

యుండుట జూచి సహించెదవేల? నీ సంకీర్తనను నాగనాథుడు వినునటుల ననుగ్రహింపుము" అని ప్రార్థించెను.

తత్క్షణమే శ్రీ పంఢరీనాథుడు నామదేవులకోరిక దీర్చదలచి పూర్వాభిముఖముగ నున్న శివాలయమును పశ్చిమాభిముఖముగ ద్రిప్పెను. సర్వజనులును, నాగనాథుడు దేవాలయ సహితముగ దిరిగి నామదేవుని కెదురై యుండుటనుజూచి యచ్చెరువొందుచు నేడు ధన్యమగు సుకాలమని జయజయ ధ్వనులు చేయుచుండిరి. నామదేవుల సంకీర్తన వినుటకై శ్రీ పార్వతీరమణుడు తన దేవాలయమును పశ్చిమదిశకు ద్రిప్పి శ్రవణము జేయుచుండెను. శ్రోతృ జనులెల్లరు నానంద భరితులై జాగరణ జేసిరి.

మరునాడు సూర్యోదయ సమయమున పూజ సమాప్తము జేసికొని యర్చకులు దేవాలయము వెలుపలికి వచ్చిరి. ఎదురుగ నామదేవులు నృత్యసంకీర్తనల జేయుచుండిరి. అర్చకులు స్నానమాచరించి యర్ఘ్యదానమిచ్చుటకు జూడగా "సూర్యుడు పశ్చిమదిశ నుదయించుచున్నాడా?" అని యాలోచించి "మనము భ్రాంతిచే దిశలు మరచిన ట్లున్నాము. రాత్రియంతయు జాగరణచేయుటచే పైత్యదోషముచే నిట్లు గనబడుచున్నదా?" అని పరిపరివిధముల చింతించిరి. కొంతసేపటికి పరికించి చూడగా దేవాలయముమాత్రము నామదేవుల కభిముఖముగా దిరిగియుండుటయు, పతాకహస్తులగు నవలక్ష సూరవరులు సభలో శోభించుచుండుటయు జూచి యచ్చెరువడి నామదేవు మాహాత్మ్యము వర్ణించుటకు బ్రహ్మాది దేవతలకును దరముకాదని నిశ్చయించి "మనము కర్మాభిమానులమై యుద్ధవుని యవతారమగు నీ మహాత్ము నవమానపరచితి' మని పశ్చాత్తప్తచిత్తులై సభాస్థలమునకు వచ్చి నామదేవులకును జ్ఞానదేవులకును సాష్టాంగ ప్రణామములు చేసి "మీరు ధన్యులు. అవతారమూర్తులు. మే మజ్ఞానముచే నపరాధమొనర్చితిమి. పృథ్వియందు కనివిని యెరుగని యమోఘదృశ్యమును మీరు చూపితిరి. పృథ్వి సూర్యచంద్రాదు లున్నంతవరకు మీ చరిత్రను లోకమున

చాటుటకునాగనాధుడు పశ్చిమాభిముఖుడాయెను. అంబరీషునియపరాధము డవమానపరచుటచే భగవంతుడు గర్భవాసమును సహించెను. పైఠన పురమున ద్విజోత్తములీ జ్ఞానదేవుల నవమానపరచుటచే మీరు మహిమ ముచే వేదములను బల్కించిరి అని పరిపరివిధముల బొగడుచు నప రాధ క్షమార్పణ గోరుకొనిరి.

అంత నామదేవులు నేత్రములు తెరచి శివాలయము తిరిగి యుండుటను గమనించి యానందపరవశులై సాష్టాంగనమస్కార మాచ రించిరి తత్క్షణమే పతాకహస్తులగు సురవరులు వైకుంఠమునకు జనిరి. జనులెల్లరు నూర్ధ్వముఖములో నాశ్చర్యంబున జూచుచుండిరి. నాగ నాధుడు నామదేవుల కీర్తిని బ్రకటించుచు నేటికిని తన యాలయ సమేత ముగ పశ్చిమాభిముఖుడై యున్నాడు. దేవతలలో శ్రేష్ఠుడు రుక్మిణీ కాంతుడును, భక్తులలో శ్రేష్ఠుడు నామదేవుడును నై యున్నారు ఉప మానముగ వర్ణించుటకు త్రిభువనములం దేదియు లభించుటలేదు.

ద్వాదశాధ్యాయము సమాప్తము.

శ్రీ రామచంద్రాయనమః

---

# జ్ఞానేశ్వర నామదేవులు తీర్థయాత్ర ముగించుకొని పంఢరీపురము చేరుట.

—♦ త్రయోదశాధ్యాయము ♦—

శ్రోతలారా! అత్యద్భుతమగు నీ విషయమును సావధానచిత్తముతో శ్రవణము జేయుడు. నేడు జిహ్వకు పరమామృతము లభించినది. మీతో సమమగు భాగ్యవంతు లెచ్చటను గాన్పింపరు. దేవతలలో శ్రేష్ఠుడు వైకుంఠనాథుడు. ఆతడు భక్తుల బ్రేమించును. ఆ భక్తుల సచ్చరిత్రము లత్యాశ్చర్యకరములు. భాగ్యవశమున నే డవి వెలువడినవి. భక్తుల చరిత్రలు గానముచేసినను, శ్రవణముచేసినను రుక్మిణీపతి సంతసించును. చంద్రు డుదయింపగనే క్షీరసాగరము సంతసించునట్లును, గజవదనుని స్తుతించినచో గౌరీశంకరులు సంతుష్టులగునట్లును, శిష్యుడు జ్ఞానియైనచో గురువు సంతోషించునట్లును, బాలుని బొగడిన తల్లి హర్షించునట్లును, భక్తుల సచ్చరిత్రలను వర్ణించిన జగన్నాథుడు సంతసించి ప్రసన్నుడై శ్రోతృజనులకు, వక్తకు నక్షయపద మనుగ్రహించును.

జ్ఞానేశ్వర నామదేవులు నాగనాథునియొద్ద సెలవుగైకొని పంఢరీపురమునకు బయలుదేరిరి. అత్తవారింటియొద్ద నున్న యతివ మాతృగృహమునకు జనునప్పు డుల్లాసముతో నుండున ట్లుభయులును సంతోషచిత్తులై శ్రీ పంఢరీనాథ దేవాలయ కలశమును దూరమునుండియే చూచి సాష్టాంగ నమస్కారము జేసిరి. నామదేవులు మూర్ఛితుడై యుండ జ్ఞానేశ్వరు లాతనిని సావధానపరచి యాతని చేతిని బట్టుకొని దేవాలయములో బ్రవేశించెను. శ్రీ పంఢరీనాథుడు సింహాసనము దిగి యెదురుగా వచ్చి పరవశుడై యానందాశ్రుధారలను విడుచుచు జ్ఞానేశ్వర నామదేవులకు స్వాగతమిచ్చి మంగళహారతి జేసెను. నామదేవు లానందబాష్పములు విడచుచు భగవంతుని చరణ కమలములకు బ్రణామము జేసి మంజులవచనములతో "ఓ దేవాధిదేవా! జగజెట్టీ! అజ్ఞానదశచే నిన్ను విడచి యెన్నియో దేశములు తిరిగివచ్చితిని. కాని పంఢరీ

సౌఖ్య మెచ్చటను లభింపదు. ఎన్నియో దేశములును, శ్రేష్ఠమైన తీర్థములను జూచినను నా మనస్సు సమాధానము కాలేదు. నాకు ప్రతి నిత్యమును చంద్రభాగా తీర్థమును, నీవును స్మరణయందే యున్నారు. గరుడస్తంభమును, కాషాయవర్ణ పతాకమును లేని స్థలమును క్షేత్ర మనిన నాకు శంకగలుగును; నే నే క్షేత్రమును జూచినను, మానసిక ముగ నిన్ను జూచుచు నీ నామమును స్మరించుచు వచ్చితిని. ఇష్టులు, మిత్రులు, బంధువులు, ఆప్తులు కులదేవతయు నీవుతప్ప నాకెవ్వరును లే" రని చెప్పెను.

అంత రుక్మిణీకాంతుడు "నీవియోగము నేను సహింప లేకపోయి తిని. నిద్రాహారములు నాకు రుచింపలేదు. నీ వియోగముచే పంఢరీ పురము కళావిహీనమైనది. ఇప్పటినుండి నీవు నాదృష్టినుండి దూరము కావలదు. నాయందు నీకత్యంత ప్రేమయున్నది. నాప్రేమ పూర్ణముగా నీయందున్నది. మా ధుర్యము బెల్లమును విడువనట్లును, చాతకపక్షులు మేఘమును విడువనట్లును, చంద్రుడు సముద్రమును ప్రేమించునట్లును, పసిబాలుడు తల్లిని విడువనట్లును, నీవు నన్నును, నేను నిన్నును, ప్రేమిం చు కొనుచుండుటచే పరస్పరము విడచియుండుట స్వప్నమందైనను తట స్థింప రా"దని చెప్పి నామదేవు నాలింగనము జేసికొని తనమెడలో నున్న తులసీహారమును నామదేవుని కంఠమునవైచి సర్వాంగములను చేతితో దడవి కృపాదృష్టితో జూచెను. అప్పుడు దేవాలయముననున్న జ్ఞానేశ్వర, నివృత్తి, సోపానదేవులును, ముక్తాబాయియును వీశోబా ఖేచరుడును; నామదేవులకు సాష్టాంగ నమస్కారములుజేసి జయజయ ధ్వానములు చేసిరి. దేవత లాసమయమున పుష్పవృష్టి గురిపించిరి. గంధర్వులును, ఋషిగణములును, చతురాననుడును, నింద్రాది దేవత లును దర్శనమునకై విచ్చేసిరి. పంచహారతులు తీసికొని రుక్మిణీదేవి యెదురుదెంచి (శ్రీ) పంఢరీనాథునకును, నామదేవులకును మంగళ హారతి జేసి నామదేవులను కృపాదృష్టితో వీక్షించెను.

అంత జగన్నివాసుడు "ఓ నామదేవా! నేనొక విషయమును జెప్పెదను వినుము. నీవు తీర్థయాత్రలుజేసి జన్మ సార్థకము జేసికొంటివి.

విధియుక్తముగ 'నుద్యాపము'న జేయనిది యాత్రాఫలితము పూర్ణము గాదు. నీవు బహు కష్టపడినందుల కుద్యాపన జేయుటయే సార్థకము. అనేక తీర్థముల సేవించి యుద్యాపన జేయనిచో షడ్రసయుక్తములగు పక్వాన్నములను 'దయూరు' చేయించి భుజింప నట్లగును. పురాణములు విని మననము జేయనిచో వ్యర్థమగునట్లును, నలంకారములను ధరింపక దాచిన వ్యర్థ మగునట్లును, నారోగ్యమునకై యౌషధసేవ జేసినను పథ్యము జేయనిచో నిరుపయోగ మగునట్లును, సప్త పురములను నానా విధ క్షేత్రములను సేవించియు నుద్యాపనము చేయనిచో వ్యర్థమగును. భూలోకమునందు వైకుంఠుని నిలయమగు నీ పంఢరీ క్షేత్రమున కుప మానము వర్ణింప సాధ్యముకాదు. ఇచ్చట నన్నదానము జేసినచో నేనొక కల్ప పర్యంతము సంతుష్టుడ నయ్యెదను. క్షేత్రవాసులగు బ్రాహ్మణులను రక్షించి పూజోపచారముల జేసి షడ్రసోపేతాన్నము లను, తాంబూల దక్షిణలను భావపూర్వకముగ నర్పింపవలెన"ని చెప్పి నామదేవుని చేయిబుచ్చుకొని గర్భాలయ ప్రవేశ మొనర్చెను.

శ్రీ పంఢరీనాథుడు హాస వదనుడై రుక్మిణీదేవిని జూచి "నామ దేవునకు నాయందత్యంత ప్రేమకలదు. వీని నిక దూరము జేయరాదు. నానా తీర్థముల సేవించి నేడుద్యాపన జేయుచున్నాడ"నెను. అంత రుక్మిణీదేవి "ఓ బ్రహ్మాండ నాయకా! నామదేవుడు నీ బరమసఖుడు. మాయామమతలను త్యజించి పనిపాట్లువిడచి ప్రేమాభావముతో నిన్ను భజించుచున్నాడు. అహంకార మమకారములను త్యజించి నిన్ను సేవా ఋణమున బంధించెను. ఎన్నియో నదు లుద్భవించి సాగర సంగమ మగునటుల సర్వభావ యుక్తుడై నామదేవుడు నీలోగలిసెను. అతని సేవా ఋణ మనంత జన్మలవఱకు నిన్నుబంధించును; ఉద్యాపన నెవరు చేయుదురు? కౌతుకముతో మీరే స్వయముగా జేయవలె"నని చెప్పగా జగజ్జనని వాక్యములువిని శ్రీ పంఢరీనాథుడు హాసితాననుడయ్యెను.

అంత రుక్మిణీదేవి "ఓ పురుషోత్తమా! నామదేవుని ప్రేమ యద్భుతమై దినదిన ప్రవర్ధమానమై యున్నది. దానిని బ్రహ్మకూడ

వర్ణింపజాలను. ఓ చక్రపాణీ! మీరు త్వరితముగ నామదేవుల వెంట బెట్టుకొని బ్రాహ్మణుల కామంత్రణ జెప్పుడు. సర్వసిద్ధులు వశవర్తులై యుండ జింతింప బనిలేదు. ఇచ్ఛా మాత్రముననే సర్వ సాహిత్యములును సమకూరగలవు. భాస్కరునకు దీపమును, సముద్రమునకు వర్ష జలమును నమృతము సేవించువారికి పథ్యమును, చంద్రునకు శీతలోపచారములును ననవసరములు. విఘ్న నివారణార్థము గజవదనుడు ప్రయత్నింప బనిలేనట్లును, కావ్యరచన జేయుటకు సరస్వతీదేవికి శ్రమ యుండనట్లును, ముంజేతి కంకణమును జూచుట కద్ద మక్కర లేనట్లును, నామదేవుల యుద్యాపనకు మీకేమియు నాయాసముండదు" అని చెప్పగా తత్‌క్షణమే వైకుంఠవాసుడు నామదేవుల చేయిబుచ్చుకొని నివృత్తిదేవ, జ్ఞానేశ్వర, సోపానదేవ, ముక్తాబాయిలను, విశోబా ఖేచరుని, చోఖామేళుని, నరహరి భక్తుని, సనకాది మహాత్ములను తన కిరు ప్రక్కల వరుసగా నిల్చుండబెట్టి మధ్య నామదేవులనుంచి తాను నామదేవులవెనుక నుండి క్షేత్రవాసులగు బ్రాహ్మణుల నామంత్రించుటకై బయలుదేరెను. ఎల్లరును కౌతుకమును జూచుచు జగన్నివాసుడు నామదేవుల వెనుకనిల్చుటకు కతంబేమని శంకించుచుండిరి (నామదేవుల పాదధూళి నపేక్షించి భగవంతుడు వెనుక నడచుచుండెను. తీర్థావళి గ్రంథమందీ విషయమును భగవంతుడు స్వయముగ నిరూపించెను.) నిజ భక్తులయందు వాత్సల్యముచే శ్రీ పంఢరీనాథుడు బ్రాహ్మణ గృహస్థు వేషమును ధరించి భక్తులను వెంటబెట్టుకొని క్షేత్ర ప్రదక్షిణముచేసి చంద్రభాగా నదీతీరము జేరెను.

అనాథ నాథుడగు శ్రీ రుక్మిణీవరుడు నదీతీరమునగల పండిత వైదిక బ్రాహ్మణులను సదాచారులనుజూచి సాష్టాంగ నమస్కారము జేసెను. జగజ్జీవనుడు బ్రాహ్మణ గృహస్థు వేషమును ధరించినను షడ్గుణైశ్వర్య చిహ్నములు (ధర్మైశ్వర్య కీర్తి లక్ష్మీజ్ఞాన విజ్ఞానములు,) లోపింపక నిత్తడి ముందు సువర్ణమును ప్రాపంచిక జనులలో ప్రేమభక్తులును, పాషాణములలో స్పర్శవేదియు, వనస్పతులలో తులసియు

నదులలో గంగయు, బక్ష్యాన్నములలో సుధారసమును, నక్షత్రములలో చంద్రుడును, లోపింపనట్లు భక్త సమాజములో భగవంతుడు లోపింపక నుండెను. ద్విజవరు లెల్లరును బ్రాహ్మణ గృహస్థు వేషమునను్న శ్రీ రుక్మిణీకాంతుని జూచి యాశ్చర్య చకితులై "మిమ్ము జూచుటచే మా త్రివిధ తాపములును జల్లారెను. తా మెటనుండి విచ్చేసిరి? తమ నామధేయ మేమి? తమవృత్తి వ్యాపారము లేమి? ఎట బసచేసితిరి. సవిస్తరముగ తెలుపుడ"ని యడిగిరి.

అంత జగన్నివాసుడు ద్విజులతో "అయ్యలారా! నే జెప్పునది సావధానముగ వినుడు నే నజితుడను. అసంగుడను. నేనవంత జన్మలనుండి వీరి సాంగత్యము జేయుచుంటిని! నాకులమును, వృత్తియు, వీరిని సేవించుటై యున్నది. మీ చరణముల సాక్షిగా ముమ్మాటికి నీనామదేవ్రుల మిత్రుడను. మీకు సందియ మొదవిన నీభక్తుల నడిగి నిస్సందేహులు కండు. ఈ నామదేవులు తీర్థయాత్రలనుండి వచ్చి నేడుద్యాపన జేయుచున్నాడు. దేవాలయములో భోజనవసతులుజేయబడివి. దయచేసి మీరెల్లరు స్నానమాచరించి త్వరితముగ రండు" అని చెప్పెను. అమృతతుల్యములగు భగవద్వచనముల నాకర్ణించి భూదేవు లానందించి "అవశ్యము త్వరితముగ వచ్చెద" మని చెప్పిరి. భగవంతుడు భక్తులతో దిరిగి దేవాలయమును బ్రవేశించి జరిగిన వృత్తాంతమంతయు శ్రీ రుక్మిణీదేవికి జెప్పెను.

అంత జగజ్జనని "ఓ ప్రాణేశ్వరా! నేను చెప్పునది వినుడు. మీరు విప్రోత్తముల నాహ్వానించి వచ్చితిరి. వారలు కర్మాభిమానులు. మిమ్మెట్లు గుర్తించిరి?" అని యడిగెను. భగవంతుడు రుక్మిణీదేవిని జూచి "ప్రేయసీ! నా కులవృత్తులను, గ్రామనామములను జెప్పుమని యడుగగా భక్తుల సాంగత్యము జేయుచుందుననియు, నామదేవుడు నా పరమమిత్రుడనియు, భోజనపు టేర్పాట్లు జరుగుచున్నవనియు జెప్పి నామమునుమాత్ర మనంతుడ నని చెప్పితిని! కాని నన్నెవరును గుర్తింపరైరి" అని జగజ్జీవనుడు నవ్వుచుండెను. శ్రీ రుక్మిణీదేవి భగవానునితో "ఓ దేవాధిదేవా! సదా భేదభావము గలిగి విద్యాభిమానముతో

గుల గోత్రములు పవిత్రములని గర్వించి యనుపతాపరహితులై యుండు వారికి మీ దర్శన మెట్లగును? నేత్రములకు కామెర్లు వచ్చినచో జూచు వస్తువు పచ్చగా గనబడునట్లును, జ్వరపీడితున కన్నము చేదుగనుండు నట్లును, కర్మాభిమానులకు భక్తిజ్ఞానములు రుచింపవు; సద్భావము లేనిదే నీ దర్శన మెట్లగును? వారల భాగ్యము విశేషమగుటచే వైకుంఠాధిపతివగు నీవు నామదేవులతో దర్శనమిచ్చితి” వని చెప్పెను. ఇచ్ఛామాత్రమున నష్టసిద్ధులు భోజనపదార్థములను, సర్వసామగ్రిని మహాద్వారమున సర్వసిద్ధముగ నుంచెను. భాగవతధర్మ ప్రకారము ముగ్గులును, బీటలను, నాసనములును వేయబడి పతాకాతోరణములతో శోభించుచు చూపరులకు శృంగారయుక్త భవనముగ గనబడుచుండెను.

భక్తజనులెల్లరు నానందముగ జయజయధ్వనులు చేయుచుండ నామదేవులచే విధ్యుక్తపూజయు, పుణ్యాహవాచనమును జరుపబడెను. రాధా రుక్మిణీ సత్యభామలు నానావిధములగు నమూల్య వస్త్రాభరణా దుల ధరించి దేదీప్యమానమగు ప్రకాశముతో వచ్చి పరులు చేయుచుండిరి. శ్రీ పంఢరీనాథుడు స్వహస్తములతో నామదేవులకు వస్త్రాభరణముల నలంకరించెను. భక్తులకు స్వయముగ సేవ జేయుటకు మేఘశ్యాముడును, ననాథుడును, సర్వోత్తముడును, రుక్మిణీవరుడునునగు భగవంతుడతి ప్రేమానందముతో సేవ జేయుచుండ సర్వులును నాశ్చర్యచకితులై నామదేవుని భక్తి ధన్యమైనదనియు నాతని మాహాత్మ్యము దెలిసికొనుటకు బ్రహ్మదేవునకు సహితము సాధ్యము కాదనియు చెప్పుకొనుచుండిరి. ద్విజోత్తము లెల్లరును మహాద్వారములో బ్రవేశించి యాసనములపై నధిష్ఠించిరి. హృషీకేశుడు స్వయముగ విప్రుల బూజింపనారంభించెను. దేవత లాకసమునుండి యీ దృశ్యమును జూచుచు నొకరితో నొకరిట్లు చెప్పుకొనుచుండిరి. “విష్ణు భక్తులకెట్టి యపారసౌఖ్యము లభించినది. మన మమృత పానము జేయుచున్నాము. కాని ప్రేమామృత మంతరించినది. సాలోక్యముక్తి నపేక్షించిన సాయుజ్య మంతరించును. కవిత్వ రచన జూచిన ప్రాసాదిక మంతరించును. నిత్యకర్మ జేసిన నైమిత్తిక మంత

రించును క్షుద్రదేవతను పూజించిన విష్ణుపూజ యంతరించును. ద్విజులను భోజనార్థ మాహ్వానించిన నతిథులు విముఖు లగుదురు. మన మమరపదమందుండుటచే భక్తిప్రేమ యంతరించినది."

భగవంతుడు రత్న ఖచితాసనములపై భూదేవుల నధిష్ఠింపజేసి, విప్రుల చరణక్షాళనజేసి తన పీతాంబరముచే వారిచరణములను దుడిచి ద్విజుల చరణ తీర్థమును సంతసంబున స్వీకరించి భూసురులెల్లర కష్టగంధ లేపనము జేసి తులసీయుక్త పుష్పమాలలువేసి యక్షతలచే బూజించి ధూపదీపాదు లర్పించి మంగళహారతి జేసెను. రెండు పంక్తులుగా గూర్చుండియున్న విప్రోత్తములకు జగజ్జననియగు రుక్మిణీదేవి నానావిధ ములగు భక్ష్యములను దివ్యములగు పక్వాన్నములను వడ్డింప భగవంతుడు నామదేవులచే సంకల్పము జెప్పించెను. భక్తులెల్లరు జయజయ ధ్వానముల జేయుచుండ భోక్త రుక్మిణీవరుడని యూహలుతి యూనుబడెను. భర్త, భోక్త, కర్త, తానే స్వయముగనుండి యచట కార్యకలాప మంతయు జరిపించుచుండెను. సూర్యునెదుట నంధకారము పొడచూప నట్లును, సరస్వతి గానము జేయుచుండిన శ్రోతలకు నిద్రరానట్లును, సముద్రుని వివాహమున కుదకమునకై చింత యుండనట్లును, వేసవికాల మందు చంద్రునకు విసర నవసరము లేనట్లును, సింద్రభవనమున వసించు వానికి వ్యాధియుండనట్లును, జ్ఞానేశ్వరీ శుద్ధగ్రంథమున సంశయము గన బడనట్లును, నామదేవుల యుద్యాపనలో నేకొరతయు లేకుండెను.

శ్రీ రుక్మిణీవరుడు ద్విజవరులను ప్రతి కబళి కునకును భగవన్నా మము జేసిన భోజనము సుఖకరముగ నుండుననియు, మీరెల్లరట్లు చేయుడనియు ప్రార్థించెను. విప్రోత్తము లెల్లరు తృప్తిగ భుజించి కరశుద్ధి చేసికొనిరి. విప్రుల నాసనములపై నధిష్ఠింపజేసి భగవంతుడు త్రయోదశ గుణయుక్తములగు తాంబూలముల నొసంగెను. భక్తులెల రును సాక్షాద్భగవంతుడు నామదేవునికి దర్శనమిచ్చి లీలావైభవములు జూపుచున్నాడని పరిపరివిధముల గొనియాడుచుండిరి. అంత భగవంతుడు ద్విజులకు నమస్కరించి తమసమక్షమున భుజింపవలెనని నాకు మిగుల గోరికయున్నది. తామొక్కక్షణము కృపతో గూర్చుండుడు మీభో




(శ్రీ) విఠ్ఠల నాధుడు బ్రాహ్మణ సమారాధన జేయుట

జనము లైనపిదప దృప్తితో దక్షిణలు స్వీకరించి స్వస్థానములకు బోవచ్చు"నని చెప్పెను. ముందుగా దక్షిణలిచ్చిన విప్రులు లేచిపోదురని భగవంతుడు దక్షిణ లీయుట నాపెను.) వివాహమునకు వచ్చిన బంధువులు సూత్రధారణ కానిది పోవుటలేను,, యాచకుడు దానమీయనిది సంతుష్టుడు కానట్లును,) బ్రాహ్మణోత్తములు దక్షిణలకై కూర్చుండిరి. భగవంతుడు బ్రాహ్మణోత్తములతో "ధరామరులారా! ఈ నామదేవుని వలన మీసేవ నాకు సంప్రాప్తించినది.) మీరు కేవలము బ్రాహ్మణులై జన్మించితిరి. బ్రహ్మాదులచే పూజింప బడుదురు. కృపా మూర్తులగు మీరు నన్ను సర్వవిధముల రక్షించుచుండు"డని చెప్పగా నమృత తుల్యములగు నావాక్కులువిని ద్విజు లానంద భరితులైరి. అంత ధరామరులు భగవంతునిజూచి "మీరు చాల శ్రమపడినారు. భోజనవేళ యతిక్రమించినది. మీ యాజమాన్యమున నేవిధమగు కొదువయు లేక నీ యుద్యాపన వైభవముగ జరిగినది. నేడాశ్చర్య యుక్తమగు సమారాధన వైభవమును మీరుచేసిన గౌరవ మర్యాదలును వర్ణనాతీతము" లని చెప్పిరి.

చతుర్వేద శాఖల బ్రాహ్మణులును మహామంత్ర ముచ్చరించుచు మంత్రాక్షతలు తీసుకొని "మీ రఖండైశ్వరములతో సర్వకాలము లందును తులతూగుచు బ్రాహ్మణుల సత్కరించుచు నాకల్ప పర్యంతము చిరంజీవులై బ్రహ్మాండమందు కీర్తిని బొందెదరుగాక!" యని యాశీర్వదించిరి. భగవంతుడు ద్విజోత్తము లాశీర్వదించి తన పీతాంబరములో వేసిన మంత్రాక్షతలు నామదేవుని శిరముపై నుంచి విప్రోత్తములవైపు జూచి మీయెల్లరి ప్రేమ సర్వకాలముల యందీ నామదేవులపై నుండవలెనని కోరెను.) పిదప భగవంతుడు భక్తులను తన పంక్తిలో గూర్చుండ బెట్టుకొని భోజనమునకై కూర్చుండెను. రుక్మిణీదేవియు, సత్యభామయు బంగారు పాత్రలతో పక్వాన్నములను వడ్డించిరి. భగవంతుని పంక్తిలో నుద్ధవా క్రూరులును, నారద తుంబురులును, గూర్చుండిరి. నామదేవుడు మహా ద్వారములో బరవశుడై యుండెను. భగవంతు డాతని నెత్తి యాలింగనము జేసికొని తనపంక్తిలో గూర్చుండ బెట్టుకొనెను. అంత

గరుడధ్వజుడు నామదేవులతో "నీమనస్సులో నేకోరిక యున్నదో లజ్జ పడక తెలుపుము. నీ రహస్యమును నేనును, నారహస్యమును నీవును బాగుగ నెరుగుదుము." అని చెప్పగా నామదేవులు వందనము జేసి "స్వామీ! నీవు దేవుడవుగను, నేను భక్తుఁడగను నుండునట్లును, నీపై నాకఖండ ప్రేమయు, నాపై నీకపూర్ణ కృపయు ననంత జన్మముల వరకుండునట్లును, ప్రేమదాన మనుగ్రహింపు" మనెను.

అంత భగవంతుఁడు పక్వాన్న గ్రాసమును నామదేవుల నోట బెట్టెను సనకాదుల కభయమిచ్చిన హస్తముతోను, పూతనను జంపిన హస్తముతోను నామదేవునకు భగవంతుఁడు దినిపించుచు "నేవిధము గను సంశయింపకుము. నిన్ను సర్వవిఘ్నముల రక్షించి విశ్రాంతి నిచ్చుటకు సంసిద్ధుడనై యున్నాను. తీర్థయాత్రచేయుచు మార్గములో నీవు చాల శ్రమపడితివి. శరీరము కృశించినది నేత్రములు లోతునకు బోయినవి. నీవు దూరదేశము పోవుటచే నీవియోగము సహింపలేక నేనును విలపించితిని. నీ వెప్పుడు వచ్చి కనబడెదవా యని ప్రతి క్షణ మును నీరాకకై నిరీక్షించితిని నీవు స్మరణకు వచ్చినప్పుడెల్ల నీవు వచ్చు చుంటివేమోయని చంద్రభాగా నదివరకు వచ్చి యెదురు చూచుచుం టిని" అని పలుకుచు నామదేవునియందు తనకున్న ప్రేమ బహిరంగ పరచుటకై యాతని యుచ్ఛిష్టమును భుజించెను. విప్రులది చూచి విస్మ యముతో ముఖములు క్రిందికిదించి యొకరి కొకరిట్లు చెప్పుకొనుచుండిరి.

"మన కర్మమార్గమంతయు నీట మునిగినది. ఇప్పుడేమి చేయ వలయును. ఈతని భార్యలే మనకు వడ్డించిరి. ఏ దే జాతివాడో గుర్తింప శక్యముగాదు. బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్రులు గాడు. వీని సౌంద ర్యము జూడగా నాలుగుజాతులలో జేరినట్లు కనబడుటలేదు. బహుశః వీడు నామదేవునికి తండ్రియైయుండవచ్చును. మంత్రాక్షతలు తీసికొని నామదేవునకె శిరముపైనుంచి సంకల్ప మాతనిచే జేయించెను. ఈ యరి ష్టము మన మెవరికి దెల్పినను నవమానము నొందెదము. కాన గుప్త ముగా నుంచవలయును."

త్రయోదశాధ్యాయము సంపూర్ణము.

# పండరీనాథునకు
# విప్రులు ప్రాయశ్చిత్తము జేయుట.

—♦ చతుర్దశాధ్యాయము ♦—

నేడు మనస్సునం దమితానందము గలిగినది. నామదేవులు చేసిన సమారాధనలో పంక్తిభోజనమునకై సజ్జనులగు మీకెల్లరకిని నిమంత్రణ బంపిరి. స్వానందమను బంగారుపళ్లెరములో నవరసయుక్తమైన పక్వాన్నములను వడ్డించిరి. వైష్ణవులగు భక్తులు దాని సేవించి శాశ్వతమగు నక్షయపదమును బొందిరి. ఈ పంక్తిలో నివృత్తిదేవ, జ్ఞానేశ్వర, సోపాన దేవులును, గోరాకుంభారును, నరహరిభక్తుడును, సుద్ధవాక్యారులును, నారద తుంబురాది వైష్ణవులును నపారముగ కూర్చుండియుండిరి. శ్రీ పంఢరీనాథుడును భక్తులతో నా పంక్తియందే భోజనమునకై కూర్చుండెను. బ్రహ్మరసమును బ్రేమతో సేవించి భక్తులెల్లరును సంతృప్తులైరి. వారి యుచ్ఛిష్ట మయాచితముగ మాకు లభించెను. భూమిలో నే బీజము నాటిన నావృక్ష మంకురించి ఫలించునట్లు భక్తుల యుచ్ఛిష్ట ప్రసాదలభ్యయోగముచే భక్త విజయగ్రంథము లభించినది.

"ప్రయాణములో జేసిన భిక్షాన్నమును, దుష్కాలమందు చేసిన శూద్రాన్నభోజనమును, నజ్ఞానావస్థలో జేసిన వ్యభిచారమును నెవ్వడును జెప్పరాదు. మిత్రుడు చెప్పిన రహస్యవిషయమును, కృపణుని యొద్ద జూచిన ధనవిషయమును, సంసారమునందున్న దుస్థితియు నెవ్వడును జెప్పరాదు. వేల జనులకు సమారాధన జరుగు సమయమున శ్వానము పదార్థముల ముట్టినదో జూచిన జ్ఞానులెవ్వడును జెప్పరాదు."

ద్విజోత్తముడొకడు పై జెప్పినట్లుపన్యసించుచుండెను. "మన యొద్ద సదాచరణ లేనప్పుడు యదార్థమును 'మభ్య'పరచి యితరుల దోషములను వర్ణించుట యుక్తముకాదు. తెలియక నకస్మాత్తుగ దోషము తటస్థించిన ప్రాయశ్చిత్తముతో దోషపరిహారమగునని జను

లెల్లరికి దెలియును. మనయొద్ద నవగుణములుండినచో బశ్చాత్తాపముతో జెప్పిన జనులెల్లరు నిందింతురు. అందుచే దోషపరిహారమగును. కాబట్టి నిస్సంశయచిత్తముతో మనమెల్లరమును గాయత్రిమంత్రమును జపించిన పవిత్రుల మగుదుము" అని విప్రులాలోచించి మౌనముగ బోవుచుండిరి. అంత రుక్మిణీకాంతుడు బ్రాహ్మణోత్తములను బిలచి ధరామరులారా! తామెల్లరు సందేహచిత్తులై యున్నట్లు మీ ముఖకవళికల వలన దెలియుచున్నది. కాబట్టి మీ మనస్సులో నే సందేహమున్నదో సంశయింపక దెలుపుడని చెప్పి రత్నములను, సువర్ణ నాణెములను, దులసీదళ మిశ్రితములుగ దక్షిణ లిచ్చెను. పిదప భగవంతుడు నామదేవుల నెత్తి బ్రాహ్మణుల పాదములపై బడవేసి "వీనిపై కృపయుంచుడు. మీ కింకేమైన సందేహములున్నచో నాకు దెలుపు" డని పలికెను.

అంత విప్రోత్తములు భగవంతునిజూచి "మీ నామదేవుడు దర్జీజాతి వాడని ప్రత్యక్షముగ నెల్లరెరుగుదురు. మీరు వానిని సహపంక్తిలో గూర్చుండబెట్టుకొని భుజించుటయు, బ్రాహ్మణాచారమును త్యజించి యాతనికన్నము దినిపించి యవిచారముతో నుచ్ఛిష్టము దింటిరి. మీకును వీనికిని యింత ప్రేమయున్నదనియు నీ పరిణామము తటస్థించుననియు మేమెరుగక మోసపోతిమి. చిత్తమునం దాలోచించి చూడగా మీ రెవరో వేషధారియైనట్లు క్షణక్షణము మీరు జూపుచున్న విలక్షణములగు నద్భుతలీలలవలన దెలియుచున్నది. యిందాస్తుతులు మీకు సమానముగ నున్నట్టున్నవి. ద్వైతకల్పన మీలో గాన్పింపదు, స్పర్శవేదికి లోహమును, సువర్ణమును సమానమగునట్లు మీకెల్లరును సమానులే. జనులెల్లరు మీవలెనుందురని మీరు తలచుచున్నారు. గంగయును, మురికికాలువయును సముద్రమునకు సమానమగునట్లును; వ్యాఘ్రమును, గోవును నుదకమునకు సమానమగునట్లును; శీతోష్ణపర్జన్యకాలములాకాశమునకు సమమైయుండునట్లును నదీపర్వత ప్రదేశములు మేఘమునకు సమమైయుండునట్లును, చోరజారసజ్జనులు సూర్యునికి సమమగునట్లును, కల్పవృక్షమునకు రాజును దరిద్రుడును సములై యుండునట్లును,

ంమ్యులు, వంద్యులును మీకు సములైయున్నట్లు తోచుచున్నది. ధర్మ రాజునకు దుష్టుడొకడును గనబడక జనులెల్లరు ధర్మమూర్తులై యుండు నట్లు, మానవునకు సహజముగ జనులు తనవలెనుందురని తోచును. వర్ణాశ్రమ ధర్మములు మీలో గనబడుటలేదు. బ్రాహ్మణవేషధారులై యుండుటచే మేము విశ్వాసముతో మీ యాంతర్యమును గ్రహింపక వచ్చితిమి స్వహితములను, పాపపుణ్యములను మనస్సులో నాలోచించుకొని వేదవచనమును సత్యముగ భావించి ప్రవర్తింపవలెను. మీరు జ్ఞానసంపన్నులును, సర్వశాస్త్రనిపుణులునుగా గనబడుచున్నారు. ఇప్పుడు వేదవచనమును ప్రమాణముగ నంగీకరించి కర్మాచరణచేయవలెను" అనిచెప్పిరి.

విప్రోత్తముల వాక్యములువిని భగవంతుడు "అయ్యా! నామదేవుల యుచ్ఛిష్టము దినుట మాత్రము దోషమని తలపవలదు. చైతన్యము సర్వగతమై సర్వమందును సమముగా వ్యాపించి యున్నది. దానిని వంద్యమనిగాని నింద్యమనిగాని యెవరువర్ణింపగలరు. పాపపుణ్యములు నిశ్చయముగ నన్నెప్పుడును భాధింపవు, నేను శుద్ధుడను, నిరంజనుడను, సర్వవ్యాపకుడను, చైతన్యఘనుడను, అంతస్సాక్షినై సర్వమందున లిప్తుడనైయున్నాను. నామదేవుల దేహము దర్జీకులమని మీరు చెప్పుచున్నారు. అట్లుకాక పంచభూతములతో గూడిన దేహమై, యాకాశమునకు మేఘ మడ్డము వచ్చిన గనబడనట్లు జ్ఞానముచే పంచభూతతత్త్వముగా నగుపడుటలేదు. తేజమును, జలమును, గాలియు,భూమియు నాకాశమును మీదృష్టిలో దోషయుక్తములుగా గనబడునా? మీరు వేదవిదులగు బ్రాహ్మణోత్తములు. సర్వశాస్త్రములయందు నిపుణులు. కాని బ్రహ్మనిష్ఠా లక్షణములు మీ యాచరణలో నున్నట్లగుపడుట లేదు. దర్జీవాని యన్నమును మేము సేవింపజాలమని ప్రథమమున మీరు చెప్పియుండలేదు. నేను స్పష్టముగ నామదేవులవలన మీ సేవ నాకు లభించినదని తెలిపియుంటిని. మీ రిచ్చిన మంత్రాక్షతలను నామదేవుల శిరముపై నుంచితిని. నిరాలంబుడనగు నేను సకాముడనైతిని.

అకర్తనగు నేను కర్తనైతిని. మీవలన కృతార్థుడనైతిని. ఇప్పుడైనను నావచనములు విని మీరు మనస్సులయందు సందేహమును వీడి నన్ను గుర్తింపుడు. యథార్థముగ నేను నామదేవుల యుచ్ఛిష్టము స్వీకరించితిని. సందేహము మిమ్ము బాధించుచున్నచో విధియుక్తమగు ప్రాయశ్చిత్తము శాస్త్రమందే రీతిని చెప్పియున్నదో చెప్పుడు! హరిదాసుల పాదధూళివలనను, మీ చరణ తీర్థస్వీకారమువలనను పవిత్రుడనగుదునని నా మనో నిశ్చయము. ఇదితప్ప నితరసాధనములు వ్రత తపోదానములు, వ్యర్థములుగా నాకు దోచుచున్నవి. నేను వానినే సత్యముగా భావింతును. తల్లి బిడ్డను విడువనట్లును, కృపణుడు ధనమును విడువనట్లును, పక్షి యండజమును విడువనట్లును, మీనము జలమును విడువనట్లును, నేను నిజభక్తులను విడువను. నాకు నాయంతరంగికులైయున్నారు. వారు తత్త్వవిచారణ చేయు భాగ్యము నొంది, భక్తివైరాగ్యములవలన నఖండముగ ప్రేమరసమును సేవించుచున్నారు సత్సంగ మమృతసంజీవని వంటిది. అది వజ్రకవచ తుల్యము. ధర్మార్థ కామమోక్షములను భక్తులిచ్ఛగింపరు. అఖండముగ నహర్నిశము నా నామస్మరణయే జేయుచుందురు. ఇంద్రపదము వారికి నాశవంతముగా దోచును. అభ్రచ్ఛాయను జూచిన జ్ఞానులు శాశ్వతమని భావింపరు. ఈ విధముగ జ్ఞానులు దాసులై యమరపదము నాశింపక నఖండముగ నా సేవనే వాంఛింతురు. అట్టి భక్తు లెవ్వరని శోధించి చూడగా నీ నామదేవు డొక్కడే గనబడుచున్నాడు. నేననుభవ పూర్వకముగ నిది తెలిసికొని ప్రేమతో నాతని సాంగత్య మపేక్షించితిని. ఆతని యుచ్ఛిష్టము బ్రహ్మారసమును మించినదని నాకు తెలియుటచే స్వీకరించితిని. అనుపమును, సర్వతీర్థములకు భాండారమును, ముక్తిప్రదమును నగు పంఢరీపురమునకు సమమగు క్షేత్రము గనబడదు. జీవన్ముక్తుల లోను, జ్ఞానులలోను, భక్తులలోను నగ్రగణ్యుడగు పుండలీకముని పరమలక్ష్యముతో ధ్యానమందు గూర్చుండి యున్నాడు. సర్వ సౌఖ్యములకుమాతృస్థానమగు నీ భీమానది యమృత సంజీవని వంటిది. ఇట్టి మహత్తర క్షేత్రమందు హరిదాసులు దివారాత్రములందును ప్రేమతో నఖండ

హరినామస్మరణ జేయుచున్నారు. హర్షచిత్తుడగు నామదేవులుచేయు హరినామ సంకీర్తనలోని సౌఖ్యము త్రిభువనములందు వెదకినను గన బడదు. ఓ ద్విజోత్తములారా! సకాముకులైనను, నిష్కాములైనను, వాక్యతో నానామము నుచ్చరించినవారు నాకు పరమసఖులు, నాప్తులునై యుందురు. నాజీవమునకంటె వారియందమిత ప్రేమ యుండును. వారే కులదేవతలని సద్భావముతో నేను పూజింతును. సచ్చిదానంద ఘనుడును, వనమాలియునగు నేను భక్తుల సన్నిధి నుందునని జగత్ప్రసిద్ధము. భక్తులయందు నాకమితానురాగము గలిగి యుండుటచే నయత్నముగ లభించు నుచ్ఛిష్ట ప్రసాదమును నేను పరమప్రీతితో స్వీకరింతును. అయ్యుచ్ఛిష్ట ప్రసాదమును సేవించుటవలన శ్రేష్ఠమగు దేవత్వమును, నఖండన వినాశమునగు శరీరమును నాకు లభించినది. నేను భక్తులు కనబడు దినమును దీపావళి పండుగ యని భావింతును. చకోర పక్షులు చంద్ర దర్శనమునకై నిరీక్షించి చంద్రోదయమైన పిదప నానందించునట్లు నే నార్తచిత్తుడనై భక్తుల రాకకై నిరీక్షించుచు వారి దర్శనముచే శాశ్వతానందమును బొందుచున్నాను. అందుచేతనే నేనీ నామదేవుల యుచ్ఛిష్టమును స్వీకరించితిని. మీ రన్యథా భావింపవలదు. మీ యభిప్రాయ మేమి? తెలుపుడు" అని చెప్పెను.

అంత ధరామరులు వేషధారియగు రుక్మిణీకాంతునిజూచి "మీరు యదార్థముగ గుణసముద్రులని తెలిసికొంటిమి. కాని వేదమునందే ధర్మములు తెలుపబడి యున్నవో ఆయా విహిత కర్మలను వారివారి వర్ణాశ్రమ ధర్మముల ననుసరించి యాచరించు చుండవలెను. ఆచారము సత్యము, శౌచము, తపము, భూతదయ, స్వస్వరూపాను సంధానము, స్నాన సంధ్యలు, దేవతార్చన, అగ్నిహోత్ర హోమదానములు, నధ్యయనము, సంతుష్టచిత్తత, వైశ్య దేవాతిథిపూజ బ్రహ్మయజ్ఞము నను నివి నిత్యనియముతో జేసిన పిదప భుజించి మూడవ జామున పురాణ శ్రవణముజేసి సంతుష్టచిత్తులై యుండుట బ్రాహ్మణ ధర్మమని వేదములందు చెప్పబడి యున్నది. మీరు సర్వజ్ఞాన సంపన్నులుగా గన్పట్టు

చున్నాము. మీరు స్వహితమును బాగుగ నాలోచించుకొని వేదధర్మ మును పాలింపుడు. స్వధర్మమును ద్యజించినచో దరించు టెట్లు? జలచర ములు నీరమును ద్యజించినచో మరి జీవనోపాయ మేది? శిశువు తల్లి యొద్ద స్తన్యపానము జేయుటకు మించిన యుపాయము లేదు. పక్షు లంతె రాశిమును ద్యజించినచో మఱి గమన మెచట జేయవలెను? కమల పుష్పము భాస్కరుని జూడనిచో నెట్లు వికసించును? భ్రమరము మక రందమును సేవింపనిచో నెట్లు సుఖించును? చకోరరాశిని త్యజించినచో నీగలకు సౌఖ్యమెట్లుంకును? అట్లే స్వకర్మను ద్యజించిన బ్రాహ్మణుడు దుస్థితి బొందును. కాన నభిమానమును విడచి పశ్చాత్తాప చిత్తముతో శుద్ధులై యుభయ లోకములందు గీర్తిబొందుడు. చంద్రభాగానదికి బోయి మంత్రయుక్తముగ విధితో స్నానము జేసి బ్రాహ్మణులకు సువ ర్ణ దానమొసంగి పుణ్యాహవాచన జేయవలెను. క్షేత్ర ప్రదక్షిణ జేసి నచో మీకులము పవిత్రమగును. ఓ చతుర విచక్షణా! నామదేవుల యుచ్ఛిష్టమును భుజించిన దోషము హరించును. మేము చెప్పినట్లు చేసి శాశ్వత కీర్తి బొందుము అని చెప్పిరి.

అంత రుక్మిణీకాంతుడు "అవశ్యముగ పరమ ప్రమాణమగు మీ యాజ్ఞను త్రికరణశుద్ధితో బాలింతును. నామదేవుని మాత్రము సర్వవిధముల గాపాడుడు. ఈతనితో సమమగు భక్తుడు శోధించినను దొరకడు. మీరు సదాచారులగు బ్రాహ్మణులు, తీర్థ రూపములగు మీ సత్యవచనములను జలములో స్నానము జేసిన నేనాదియు, నజితు డను, నధోక్షజుడనై యుండి విశ్వమంతు పూజింప బడుచున్నాను. మీరు నాకు పూజనీయులు, పరమ దైవతములని నా విశ్వాసము. మీరు నన్ను స్నానము జేయుమని చెప్పిరి. స్నానము చతుర్విధ లక్ష ణములు గలదిగ నున్నది. అందే స్నానము జేయవలెనో యోచించి తెలుపుడు. పురాణ హరికీర్తనలను బ్రేమతో శ్రవణ మననములను జేయుట యన్నింకంటె నుత్తమమగు ప్రథమ స్నానము. అనుభవ మును, నిధిధ్యాసయు, నాత్మ సాక్షాత్కారమును మించిన స్నానమున్న

దని వేదశాస్త్రము లందెచ్చటను జెప్పి యుండలేదు. ఇది ద్వితీయస్నాన విధానము. అంతర్బాహ్య శుచిర్భూతుడై పైజెప్పబడిన స్నానములను జేసినవో నితర సాధనములతో బనిలేదు. ఇంద్రియములను స్వాధీనము నందుంచుకొని విషయవాసనలను త్యజించుటయు సత్యాహింసల నాచరించుట తృతీయస్నానవిధానము. సర్వభూతములందు కరుణ యన్నిటికంటె శ్రేష్ఠమగు స్నానము. ఇది నాల్గవ స్నానవిధానము. ఈ సాధనములు వేల సజ్జనులలో నొకరైనను నాచరించుట దుర్లభము. శరీర మాలిన్యమును బోగొట్టుకొనుటకై లౌకికముగ జేయు జలస్నాన మైదవ స్నానవిధానము. కామ క్రోధ మోహ మద మత్సరములు దేహమునందు స్థిరముగ వసించియుండును. ఇవి జలస్నానముతో బోజాలవు. అనంత జన్మములం దొనర్చిన దుష్కృతములు చిత్తశుద్ధితో సత్సాంగత్యము జేయుచు రామకృష్ణ గోవింద యని యుచ్చరించినవో బటాపంచలగును. దీనికి మించిన ప్రాయశ్చిత్తమే శాస్త్రములందును విధింపబడియుండలేదు. వేదములు వారివారి భావనానుసారముగ నర్థమగును. నాకుమాత్రము నామదేవుడు నిష్కళంకుడుగ గనబడుచున్నాడు. విప్రులారా! సందేహమును దొలగించుకొనుడు. మీ కోరికప్రకారము మీరును, నేనును, భక్తజనులును గలిసి చంద్రభాగానదికి బోవుదము. రండు. మీరు మీ యిచ్ఛానుసారముగ ప్రాయశ్చిత్తము జేయింపుడు" అని చెప్పెను.

లీలానాటక సూత్రధారియు, శ్రీ రుక్మిణీరమణుడును, నిజభక్తుల ప్రియభూషణుడును నగు శ్రీ పంఢరీనాథుడు తన భక్తులయందు గల వాత్సల్యమును బ్రకటనజేయుటకై హర్షచిత్తముతో నామదేవుల చేయి బుచ్చుకొని భక్తులను వెంటబెట్టుకొని విప్రోత్తములతో చంద్రభాగానది జేరి పుండలీకభక్తునియాలయమునకు బ్రదక్షిణము జేసి సాష్టాంగనమస్కారము జేసెను. భక్తులెల్లరును జయజయధ్వానములతో హరినామ సంకీర్తనము జేయుచుండిరి. భగవంతుడు ద్విజవరులకు ప్రదక్షిణ నమస్కారములు జేసి విధియుక్తముగ ప్రాయశ్చిత్తము పొందుట కంగీకరించెను.



పంఢరీ నాథునకు విప్రులు ప్రాయశ్చిత్తము చేయుట

అంత విప్రోత్తములు దేవాధిదేవుని నదీజలములందు గూర్చుండబెట్టి స్నానము జేయించుచు వేదోక్త మంత్రములను బఠించుచు గోమయ

మును భస్మమును శరీరమునకు బూసిరి. పీతాంబరధారియగు జగజ్జీవనుడు ద్విజులచే ప్రాయశ్చిత్తము జేయించుకొనుచుండెను. నానావిధములగు ననుష్ఠానములను జేసినను, యోగసాధనలు జేసినను, దుర్లభుడగు శ్రీ రుక్మిణీవల్లభుడు భక్తులయందు తనకుగల వాత్సల్యమును ప్రకటించుటకై ప్రాయశ్చిత్తమును జేయించుకొనుచుండెను. నామమాత్రముచేతనే దోషముల హరింపజేయువాడును, భక్తుల భవబంధ విమోచకుడును, శ్రుతిశాస్త్రముల కగోచరుడును, నిష్కళంకుడును, జగదీశ్వరుడును నగు పుండలీకవరదుడు ప్రేమతో ప్రాయశ్చిత్తమును జేయించుకొనుచుండెను. ఎవని చరణములనుండి యుద్భవించిన పావన గంగ లోకాలోకముల శుద్ధిచేసెనో యా భగవంతుడే యా గంగలో నిలువబడి ప్రాయశ్చిత్తము జేయించుకొనుచుండెను. అచలుడును, పూర్ణావినాశుడును, సర్వవ్యాపకుడును, చైతన్యఘనుడును నగు భగవంతునకు ద్విజులు గోమయమును, భస్మమును, లేపనము జేయుచుండిరి. వైకుంఠవిహారియు, హృషీకేశుడును, భక్తభూషణుడును నగు జగదీశ్వరునిపై దోషమారోపించి విప్రులు ప్రాయశ్చిత్తము జేయుచుండిరి. పిదప భగవంతుడు సుస్నానముజేసి విప్రులిచ్చిన తీర్థము స్వీకరించి వందనముజేసెను. నిత్యము నిజభక్తుల కభివందనముజేసి పిదప సంధ్యాస్నానముల జేయు నియమముగల భగవంతుడు బ్రాహ్మణుల బూజించి యథావిధి దక్షిణల నిచ్చి "నన్ను పవిత్రునిగా జేసితిరి. మీ కోరిక ననుసరించి నేను ప్రాయశ్చిత్తము జేసికొంటిని. ఇక మనస్సునందు సందేహము లుంచుకొన" వలదని చెప్పి దేవాలయమున ప్రవేశించెను.

భక్తజనులెల్లరు సభామంటపమున నానందముగ హరినామ సంకీర్తనలు జేయుచుండిరి. రాధయు, రుక్మిణీ సత్యభామలును బంగరు పళ్లెరములతో పక్వాన్నములను దెచ్చిరి. భగవంతుడు భక్తులను తన చుట్టును గూర్చుండబెట్టుకొని భుజించుటకు సంసిద్ధుడయ్యెను. నక్షత్రముల మధ్య చంద్రుడు శోభించునట్లు భక్తుల మధ్యమున భగవంతుడు శోభించుచుండెను. భగవంతుడు కనక పాత్రలలోని పక్వాన్నములను

తీసి భక్తులెల్లరికిని దినిపించుచు నుచ్ఛిష్టమును దన పీతాంబరములో వేసికొనెను. భోజనానంతరము భక్తులెల్లరికి తాంబూలముల నిచ్చెను. భగవంతుని యాజ్ఞ దీసికొని భక్తులు తమతమ యాశ్రమములకేగిరి. భగవంతుడు శయనమందిరములో బ్రవేశించి పరుండ బ్రహ్మవీణ దీసికొని గానముజేయుచు నారదు లేతెంచిరి. నిర్మలుడును, మంగళనాముడును నగు పాండురంగనికి నారదమహర్షి నమస్కరించెను.

తత్క్షణమే భగవంతుడు నారదు నాలింగనముజేసికొని "ఓ నారదా! నీగాన మనుపమానముగ నున్న" దని చెప్పగా నారదుడు నేత్రములనుండి యానందాశ్రుధారలు విడచుచు "జయ పుండలీకవరదా అనాథనాథా! భీమాతీరవాసా! రుక్మిణీమనోహరా! కరుణాసాగరా! స్వానందభరితా! జయ కమలలోచనా! శ్రీరంగా! భక్తసఖా! అక్షయా! అభంగా! పతితోద్ధారకా! పాండురంగా! అసంగసంగా! నిర్వికారా! జయ క్షీరసాగరవిలాసా! విధిజనకా! వైకుంఠరాయా! జయ కరుణాసాగరా! జగజ్జెట్టీ! కృపాదృష్టితో జూడుము" అని గానముజేసి భగవంతునికి మంగళహారతిజేసి సాష్టాంగనమస్కారము జేసెను. పిదప నారదులు రాధా రుక్మిణీ సత్యభామలకు దర్శించి వారితో "ఈరోజున భగవంతుడు ప్రాయశ్చిత్తము జేసికొనుటకు కారణమేమి? నాకు మిగుల సందేహముగనున్నది. కర్మాకర్మాస్వతంత్రమూర్తియగు నాతనిని దోషము లెట్లు బాధించును?" అనెను.

అంత రుక్మిణీదేవి నారదునితో "ఓ మునిశ్రేష్ఠా! నామదేవుల యందు తనకుగల వాత్సల్యమును బ్రకటించుటకై తన యౌత్కృష్ట్యమును త్యజించి నిర్లజ్జతో కర్మకాండకు సహజముగ నంగీకరించెను. శుభాశుభములను మరచి భక్తికి వశుడై యెన్ని విచిత్రములైనను నాతడు జేయుచుండును. తనబిడ్డ డంధుడైనను, నవివేకియైనను, జెవిటివాడైనను, మూగయైనను, నెంత వికృతాకారుడైనను, నాతని తల్లి ప్రేమించునట్టుల భగవంతుడు నామదేవుని బ్రేమించెను. నామదేవుడు గతానేక జన్మలయందు చేసిన సేవాభక్తులకు భగవంతుడు ఋణస్థుడై

యుత్సాహానందముతో నాతనికి సేవ జేయుచున్నాడ"ని చెప్పెను. రుక్మిణీ దేవి వచనములకు రాధా సత్యభామలకును సమాధాన మయ్యెను. నారదముని సత్యభామ యంతర్మందిరములో బ్రవేశించెను.

సత్యభామ యాతని నుచితాసనాసీనుని జేసి సన్మానించి "ఓ నారదా! నాకు చాల నాశ్చర్యము గలుగుచున్నది తన దేవత్వమును దృజించి వైకుంఠాధిపతి భక్తుల సంకీర్తనలో బాల్గొని యానందముగ నృత్యము జేయుచున్నాడు. ఏ జన్మలో నామదేవుడు ఋణస్థునిగ జేసి కొనెనో గాని యాతని నానావిధములగు కోర్కెలను దీర్చుచున్నాడు. పుండలీకుడు భగవంతుని సింహాసనముపై నధిష్టింప జేసిన తరువాత వెనుకముందు జూచుటకు వీలులేక కదలక మెదలక నుండుమని కోరుటచే విశ్వోద్ధారకుడు కష్టముతో నక్కడ నిలువబడి యున్నాడు. జగన్నాథుడు పాండవుల ప్రేమకు వశవర్తియై నానావిధముల వారికి సేవజేసి రక్షించెను. నిజభక్తు లెందరో యీ భూమండలమున జన్మించి యుందురు. వారల పేరేమని వర్ణింతును. నా స్వామి నెందరుభక్తులు కష్ట పెట్టెదరోయని నాకు చాల జింతగ నున్నద"ని చెప్పెను.

సత్యభామ వచనములు విని నారదుడు "ఓ తల్లీ! నేను చెప్ప బోవు విషయమును యథార్థముగ భావింపుము. నీ భర్తయగు జగజ్జీవనుడు నిరాకారుడై యుండి నానావిధ ప్రయత్నములతో భక్తుల రక్షించుటకై సగుణావతారము దాల్చెను. ఆతని కనాథనాథుడు, భక్త వత్సలుడు, కృపాసముద్రుడు, దీన దయాళుడను బిరుదులు స్థిర పరచు కొనుటకై నానావిధముల ప్రేమభక్తులకు సేవజేయు చుండును. అనాది కాలమునుండియు నాతని కార్యక్రమ మిదియే నీవెరుగవా? అంబరీషునికై యవతారము ధరించుటయు, బలి చక్రవర్తికి ద్వారపాలకు డగుటయు పాండవులయొద్ద లజ్జయు, మానావమానములను విడచి సేవ జేయుటయు నీకు దెలియదా? నంద నందనుడై గోపులను, గోపాలురను రక్షించినాడు. నిజప్రేమతో గోపాలుర యుచ్ఛిష్టమును భుజించినాడు. వారికి వచ్చిన నానా విధ విఘ్నములను స్వయముగ నివృత్తి జేసెను.

మేమందర మాతని యంశతో గూడిన భక్తులమే కాని యాతడు సాక్షాత్సగుణ రూపమున నామదేవులకై చేసిన విచిత్రముల నిదివర కెన్నడును జేసియుండలేదు. ఆతని కొఱకే యీ క్షేత్రమున నాతి డవతరించె నని మున్ముందటికి దెలిసి కొమ్ము” అని చెప్పి నారద మహర్షి యచట నుండి వెడలిపోయెను.

రుక్మిణీదేవి శ్రీ పంఢరీనాథుని చరణములకు సాష్టాంగ నమస్కారములజేసి “అన్నిటికంటె యెక్కువగ నీకు దేనిపై ప్రేమ యున్నదో తెలుపుము. భక్తవత్సలా! వైకుంఠనాయకా! యోగు లష్టాంగ యోగములను సాధింతురు. నీవు వారిని ప్రేమింపవు. వైకుంఠ భువనమునందు నీకు ప్రేమలేదు. భోగవిలాసము నీ చిత్తమునకు రుచింపదు. నీచిత్తము దాసీనముగ నుండుటకు కారణమేమి? పుత్రుడగు చతురాననుడు చాతుర్యముతో నిన్ను స్తవము జేసెను. చతుర్వేదములును, షట్శాస్త్రములును, నష్టాదశ పురాణములును, నీ సద్గుణములను వర్ణించు చున్నవి. కాని నీ మహత్తర శక్తిని తెలిసికొనలేక నీ యాంతర్యమును దెలిసికొనుటకు సాధ్యముకాదని యవి యన్నియు నేతినేతి వాక్యములను బల్కినవి. మఱి నీప్రేమ దేనియం దున్నది? తెలుపుము” అనెను.

రుక్మిణీదేవి వచనములను విని శ్రీ పంఢరీనాథుడు “నా యాంతర్యము నీకు దెలిసియుండియు నడుగుచున్నావు. త్రికరణశుద్ధితో నీకు జెప్పుచున్నాను. నాకు నామదేవులయందు నిశ్చయముగ నత్యంతప్రేమ యున్నది. ఆతడే నా జీవము. ఆతడుదప్ప నాకెవరును ప్రియులు కారు. నేను భక్తులకు సర్వకాలములయం దధీనుడనై యుందును. భక్తులవలననే నాకు యశఃకీర్తులు లభించుచున్నవి. భక్తులవలననే నాకు సుఖశాంతులు గలుగుచున్నవి. వారివలననే నా మనోభీష్టము దీరుచున్నది. నేనును నా భక్తులును వేరుగనుండుట కల్పాంతమునందైనను జరుగదు. నా భజనలోని నిజసుఖమును నా భక్తులుమాత్రమె మెఱుగుదురు. నేను భక్తుల నామమును జపింతును. భక్తుల రూపమును సేవింతును. భక్తులు

నిష్కామబుద్ధితో నా చరణములను భజించుచు, నా గుణములను కీర్తించుచు, నన్ను సేవించుచున్నారు. వారు ధర్మార్థ కామమోక్షముల నంగీకరించి సంసారభారమును నాపై వేతురు. భక్తుల యాంతర్యమును, బంధువుడను నేనేయై యున్నాను. భక్తులు నాకంటె సత్యోదారులు. అందుచే నేనార్తజీవుడనై సర్వకాలములందు నామదేవుల ననుసరించియే యున్నాను. ఇదితప్ప నా కింకేమియు కోరికలు లేవు" అని చెప్పెను. (శ్రీ) పంఢరీనాథుడు రుక్మిణీదేవితో నీవిధముగా ప్రసంగించుచుండ సూర్యోదయ సమయమాయెను.

చతుర్దశాధ్యాయము సమాప్తము.

ఆశ్రిత కల్పద్రుమాయ నమః

# భగవంతుడు తన రూపమును విప్రులకు జూపుట.

## —♦ పంచదశాధ్యాయము ♦—

శ్రోతలారా! సావధానచిత్తులై వినుడు. నేను రుక్మిణీరమణుడు ప్రసన్నుడగుటవలన భక్తుల సచ్చరిత్రలు సవిస్తరముగ భూమండలమున వెలువడినవి. చాతకములకొఱకు మేఘములు క్రమ్మినట్లును, చకోర పక్షులకై చంద్రు డుదయించినట్లును, సజ్జనుల యంగములపై శోభించుటకై చందన ముద్భవించినట్లును, సర్వజీవులకు సుఖమునిచ్చుటకై భాస్కరు డుదయించినట్లును, విష్ణుపూజకొఱకు తులసీవనము లపారముగ బయలువెడలినట్లును, ఉమారమణుని సంతృప్తిపరచుటకు బిల్వవృక్షములు పెరిగినట్లును, నాసిక తృప్తిపడుటకు వసంతమున పుష్పములు పూయునట్లును, విశ్వజనుల సుఖమునకై వర్షములు పడునట్లును, గౌతముని దురితమును హరించుటకు గోదావరి యవతరించినట్లును, దేవతల దృప్తినొందించుటకై సాగరమునందుండి యమృతము బయలువెడలినట్లును, నాప్తులగు మీకొఱకై భక్తవిజయ గ్రంథము వెలువడినది.

సూర్యోదయ సమయమున భక్తులెల్లరును తంబుర తాళ మృదంగాది వాద్యములతో హరినామ సంకీర్తనలు చేయుచు దేవాలయమున ప్రవేశించిరి. కమలపుష్పముపై భ్రమరము ఝుంకారము జేయుచు వ్రాలునట్లును, తల్లియొద్దకు బిడ్డ డానందముతో ప్రాకుచు వచ్చునట్లును, లేడిని చూడగనే లేగ యానందముతో బరుగిడునట్లును, కృపణునకు ధనము దొరకిన సంతసించునట్లును, శ్యామలవర్ణమగు శ్రీ పంఢరీనాథుని స్వరూపమును సేవించి భక్తజను లానందముతో బరవశులై యశ్రుధారలు విడచుచు నాలింగనవందనాదులు చేసిరి. ఆ యనుభవసుఖమును వర్ణింప నలవికాదు. ఉపమానములు శోధించినను నగుపడుట లేదు. చక్కెరయొక్క మాధుర్యమును సేవింపనిది చెప్పుటకు వీలుకానట్లు విష్ణుపదసుఖమును భక్తు లనుభవమున దెలిసికొందురు.

శ్రీ రుక్మిణీ కాంతుడు కృపాదృష్టితో భక్తులను వీక్షించి, పిదప రుక్మిణీ దేవిని జూచి "నేడు భక్తులానందోత్సాహములతో నానావిధ సంకీర్తనలు చేయుచు వచ్చిరి. ప్రేమతో భూదేవులను బిలువవలెనని కోరిక యున్నది. నిప్పటిదినమున చంద్రభాగా నదీతీరమున ప్రాయశ్చిత్తము జేయించుకొన్నప్పుడు విప్రులకు మరల సమారాధన జేయవలెనని సంకల్పము గలిగినది. క్షేత్రవాసులగు ధరామరులను, స్వధర్మశీలురను, ప్రార్థించి యాలయమునకు దీసికొని వచ్చెను. వారి దర్శనము వలన పాప తాపములు తొలగి కోరికలన్నియు దీరును. ఆత్మానందము వర్షించును. షడ్రస యుక్తమగు భోజన మర్పించి వారికిగల సందేహములను నేను తొలగించి నా నిజస్వరూపమును జూపి యాశ్చర్య చకితులనుగా జేయవలెను. సత్సాంగత్యములో నున్న మహామహిమ జగత్తులో వ్యాపించి భక్తుల కీర్తి యభివృద్ధి నొందు"నని చెప్పెను. అవశ్యమని జగన్మాత "ఓ స్వామీ! సర్వసిద్ధులు సిద్ధముగ నున్నవి. చింతింప వలసిన పనిలేదు విప్రోత్తముల కక్షతల నిచ్చి నిమంత్రణ జేయు"డని చెప్పెను.

శ్రీ పంఢరీనాథుడు హసితవదనుడై నామదేవుల యొద్దకు వచ్చి "నేడొక కౌతుకమును నీకొఱకై చూపదలచితి"నని చెప్పెను. అంత నామదేవుడు "ఓ స్వామీ! మీ యాంతర్యము నేనెఱుగుదు" నని చెప్పెను. పిదప భగవంతుడు "నామదేవా! నాజీవము తబ్బిబ్బగుచున్నది. నిన్నొక్క క్షణము విడచి యుండజాలను ప్రేమతో నా కౌలింగన మిమ్ము. నీ ప్రేమను జూచి సనాథమగు నామనస్సు తృప్తి నొందును. తనివిదీర నీరూపమును జూచిన నేత్రములకు పారణయగును. బహు జన్మల ఋణానుబంధమువలన నీపై నాకు పూర్ణప్రేమ గలిగియున్నది. నీవేమి పుణ్యము జేసితివో తెలియదు. ఏవ్రత తపోనుష్ఠానములను సాధించితివో తెలియదు. ఏ తీర్థాటనల నొనర్చితివో తెలియదు. సకలమాయలను త్యజించి చిత్త మర్పించి నన్ను వశ్యునిగా జేసికొని హృదయమందు నిల్పుకొంటివి. నీకేమి యర్పింపవలెను? నీకు ప్రత్యక్ష ప్రకృతియే మొన

ర్పవలెను? ఎంత యోచించినను నాకేమియు దోచుటలేదు. నీవు నిశ్చ యముగ నాకు ప్రాణ యుక్తమగు శరీరమును బలిదానము జేసితివి. నీ కర్పించుటకు సరియగు పదార్థమేదియు నాకు దోచనందున త్రికరణ శుద్ధితో నీకు దాస్యము జేయుటయే సర్వశ్రేష్ఠమని నేను నిశ్చయించు కొంటినని చెప్పెను. భక్తవత్సలుడగు భగవంతుడు నామదేవ్రులను భక్త జనులను వెంటబెట్టుకొని యక్షతలు గుచ్చుకొని విప్రులకు నిమంత్రణ జెప్పుటకై బయలుదేరెను. యోగుల నిజధ్యానమును సకలదేవతలచే నర్చనీయుడును నగు శ్రీ పంఢరీనాథుడు విప్రుల నిమంత్రణ జేయుటకై చంద్రభాగా తీరమునకు జేరెను. అచ్చటగల విప్రులెల్లరును గుంపుగ జేరి మా యజమానులు రాలేదు. నిన్న ప్రాయశ్చిత్తము జేసితిమి. సమారాధన కామంత్రణ బిలువ లేదని చెప్పుకొను చుండిరి. ఇంతలో శ్రీపంఢరీనాథుడు భక్తులతో గూడి సాష్టాంగ నమస్కారముజేసి "ధరా మరులారా! నిస్సందేహ చిత్తులై భోజనమునకు దయచేయుడు. మీరి చ్చిన యభయ వచనము ప్రమాణము చేయవలెను. శీఘ్రముగనే స్నానసం ధ్యలు చేసికొని దయచేయుడు" అని చెప్పెను.

శ్రీ పంఢరీనాథుని మధురోక్తుల నాకర్ణించి ద్విజవరులు సంతు ష్టచిత్తులై "యదార్థముగ మేము మిమ్మాశ్రయించిన వారము. ఈ క్షేత్రమునందు వసించుచు మిమ్ముల నాశీర్వదించుచుంటిమి. మీరు గోబ్రాహ్మణుల బరిపాలించుచు సర్వకాలములయందు సుఖించుచుండుడు. మీరు మహారాజ సమానులు కృపా దృష్టితో నిరంతరము భోజన దక్షిణలచే నాదరించుచుండవలె"నని చెప్పిరి. పిదప భగవంతుడు విప్రో త్తముల యొద్ద ననుజ్ఞ గొని దేవాలయమును బ్రవేశించి రుక్మిణీదేవితో సర్వవృత్తాంతమును జెప్పెను.

అంత రుక్మిణీదేవి "ఓ స్వామీ! ఓ ప్రాణేశ్వరా! నేడు ధన్య మైన సుదినము. నిజభక్తులకై తాము జూపు కౌతుకములు వర్ణనాతీత ము"లని చెప్పెను. అంత శ్రీ పంఢరీనాథుడు "విప్రులందరును స్నాన సంధ్యాదులు పూర్తిచేసుకొని భోజనమునకు వత్తురు. నమ్రత, గౌరవము

లతో గౌతుకాభినయమును నేను చూపెద"నని హసిత వదనుడయ్యెను. శ్రీ రుక్మిణీదేవి "ఓ హృషీకేశా! వారిపుణ్యము ఫలించినది. అందుచే వారి కనాయాసముగ దర్శనమిచ్చితి" వని చెప్పెను.

ద్విజు లెల్లరును దేవాలయమున బ్రవేశించి యాసనములపై నుపవిష్టులైరి. భగవంతుడు విప్రోత్తముల చరణక్షాళన జేసి తీర్థము శిరముపై జల్లుకొని గంధాక్షతలతో బూజించి తులసీ మిశ్రిత పుష్పహారములను వేసి ధూప దీపాదు లర్పించెను. మధురములగు నానావిధ పక్వాన్నములను పళ్లెములతో బెట్టి ప్రతి గ్రాసమునకును గోవిందనామ స్మరణ జేయుడని చెప్పెను. ద్విజు లానంద భరితులై తృప్తిగ భుజించి తాంబూలము స్వీకరించిరి. భగవంతుడు చేతులుజోడించి విప్రోత్తములతో "ధరామరులారా! నేటి ప్రసంగము నిరంతరము కావలెనన్న లభించునదికాదు. తా మొక్క క్షణము సేపు స్వస్థముగ గూర్చుండుడు. అంతఃకరణమున వికల్పములను విడువుడు. భక్తుల పంక్తిలో నే నిప్పుడే భుజించి వచ్చెదను. కూర్చుండు"డని చెప్పి తన పంక్తిలో భక్తులను గూర్చుండ బెట్టుకొనెను. బ్రాహ్మణు లెల్లరును గౌతుకమును జూచు చుండిరి. బ్రహ్మాదిదేవతలు విమానారూఢులై యాకసమున సంచరించు చుండిరి. యోగీశ్వరులు చిత్తమునందు తబ్బిబ్బగుచు "భక్తిసుఖము మనకు లేదు. శ్రీ రుక్మిణీకాంతుడు ప్రేమతో నామదేవుల పంక్తిని భుజించుచున్నా" డని చెప్పుకొనుచుండిరి. భగవంతుడు తన పంక్తిలో నివృత్తిదేవ, జ్ఞానేశ్వర, సోపానదేవులను, సావతాభక్తుని, జగన్మిత్ర నాగనాథుని, సుదామభక్తుని, విసోబాఖేచరుని, నరహరిని, చోఖామేళ, బంకాజనక మొదలగువారిని, నిజభక్తుడగు గోరాకుంభారుని స్వహస్తములతో బూజించుచుండెను. అంత నామదేవు లాశ్చర్యచకితులై "నేడు విపరీతకాలముగ నున్నది. సముద్రము సరస్సును బూజించినట్లును, చంద్రుడు నక్షత్రములకు ప్రదక్షిణ జేసినట్లును, వైనతేయుడు పక్షులను బూజించినట్లును, కైలాసపతి నందిని ప్రార్థించినట్లును రాజు ప్రజల బూజించినట్లును, శచీరమణుడు దేవతల బ్రార్థించినట్లును, నిజదాసులకు నీవు సేవజేయుట విపరీతముగ నున్న"దనెను.

అంత పంఢరీనాథుడు హసితవదనుడై "మీరెల్లరు నాకు దేవత్వ మిచ్చిరి. సరస్సు లేనిది సముద్రము వృద్ధికానట్లును, నక్షత్రములు లేనిచో చంద్రుడు శోభించనట్లును, పక్షులు లేనిచో గరుత్మంతుడు శ్రేష్ఠుడు కానట్లును, నంది లేనిచో శంకరుని మోయువారు లేనట్లును, ముప్పదిమూడుకోట్ల దేవతలు లేనిచో నింద్రునకు సన్మానము జరుగ నట్లును, ప్రజలు లేనిచో రాజు నాదరించువారు లేనట్లును మీరు లేనిది నేను శోభింపను. మీవలననే నాకు దేవత్వమేర్పడిన" దని చెప్పెను.

భక్తులెల్లరును భగవంతుని వాక్యములు విని విస్మయమునొం దిరి. రాధా రుక్మిణీ సత్యభామలు నానావిధ పక్వాన్నములను వడ్డించిరి. సప్తసాగరములలో క్షీరసాగరమును, నక్షత్రములలో చంద్రుడును, నలంకారములలో గౌస్తుభమణియు, ధాతువులలో గాంచనమును, మణు లలో రత్నమును, శోభించునట్లు భక్తులలో భగవంతుడు షడ్గుణైశ్వర్య ములతో శోభించుచుండెను. భక్తులెల్లరికిని భగవంతుడు పక్వాన్నము లను దినిపించుచు వారి యుచ్ఛిష్టమును తన పీతాంబరములో దాచు కొనుచుండెను. ఆ సమయమున నది చూచి బ్రహ్మదేవు డాశ్చర్య ముతో "నామదేవు డెంతధన్యుడు! భగవంతుని వశవర్తిగా జేసినాడు" నని దేవతలతో జెప్పెను. సురలు లానందముతో జయజయధ్వనులు చేయుచు నపారముగ పుష్పవృష్టి కురిపించిరి. గగనమునుండి వచ్చు చున్న యీ సువాసనను జూచి విప్రులాశ్చర్యపడి మన ప్రాణహాని సంప్రాప్తించునట్లు కనబడుచున్నదని చెప్పుకొనుచుండిరి భగవంతుడు భక్తులతో నానావిధముల క్రీడించుచు బ్రహ్మరసమును సేవించుచుం డెను. అద్భుతమగు నా ప్రేమదృశ్యమును వర్ణించుటకు జ్ఞానుల కలవి కాదు. తామసవైరాగ్యపరులు దానిని గ్రహింపలేరు. అది సత్వగుణ ప్రధానులగు నిజభక్తులకుమాత్రము గ్రాహ్యమగును.

విప్రబృందములోని దొక విప్రోత్తముడు "యదార్థముగ నీ వేష ధారి శ్రీ పాండురంగదేవుడని తోచుచున్నది అఘటితములగు నీలీలలు మానవుల కసాధ్యము. క్రియాకర్మల కకర్తయగు వీనికి ప్రాయశ్చిత్తము




బ్రాహ్మణులకు భగవంతుడు దర్శన మిచ్చుట

జేయుట యవివేకము. అంత్యజుడును, బ్రాహ్మణుడును గంగలో స్నానము జేయుదురు, అందుచే గంగ యపవిత్రమైనదని చెప్పరాదు. పృథ్వియందు నానాజాతులవారును తమతమ యిష్టానుసారముగ వ్యవహారములను జేసికొనుచుందురు; పృథ్వికి చిన్న పెద్దయను భేదము లేదు. సూర్యుడు తన ప్రకాశమును సర్వులకు సమముగ ననుగ్రహించుచున్నాడు. జగజ్జీవనుడటులనే సర్వభూతములందును సమానముగ వ్యాపించియున్నాడు; వర్షమునకు భూమియు, పర్వతమును సమానమగునట్లు యదునాయకుడు సర్వభూతములందును సమానముగ నున్నాడు. ఆతనికి స్వపరభేదమును, కుల గోత్ర విచారణలు నుండవు. ఆతడు దీనులకు బంధువై యుండును. సర్వకాలములందును వాని నాశ్రయించినవారిని మాయా మోహములును, సంసారమును, బాధింపజాలవు. చూడుడు. మనము చూచుచుండగనే యీ నామదేవుల తల్లి నానావిధములగు వాదనలజేసి భగవంతునిని బహు కష్టపెట్టెను. లీలానాటక సూత్రధారియగు నీ హృషీకేశుడు విఠువక నాతనిని మొదటినుండియు సర్వవిధముల గాపాడుచున్నాడు. సుందరమగు నీతని దేహమును చూచినమాత్రమున దేహభ్రాంతి తొలగుచున్నది. ఈతని చరణముల ధ్యానించినచో నపారశాంతి లభించుచున్నది. అనన్యభావమున శరణుబొందినచో జననమరణ నివారణమగును" అని చెప్పెను.

అంత ద్విజుని వాక్యములనువిని భగవంతుడు హసిత వదనుడై బ్రాహ్మణ గృహస్థుని వేషమునుమార్చి సగుణస్వరూపమున సాక్షాత్కరించి నామదేవుని కౌగలించుకొనెను. పిదప భగవంతుడు బ్రాహ్మణులెల్లరికి తన నిజరూపమును జూపెను. ఆ రూపమును వర్ణించుటకు విధాతకును, శారాదా దేవికిని సాధ్యముకాదు. మస్తకమునందు రత్నఖచితమైన సువర్ణ కిరీటమును, లలాటమున కస్తూరి తిలకమును ధరించి శ్యామలవర్ణమగు నతిసుకుమార దేహముతో ధరామరుల కభయమిచ్చెను. నెమలిపింఛమును, మకర కుండలములను, నమూల్యపీతాంబరములను, గంఠమున గౌస్తుభమణియు, గళమున దులసీహారమును

ధరించి బ్రాహ్మణుల కభయమిచ్చెను. ఆతని దర్శన సుఖము ననుభవించుటకు ప్రేమ భక్తులకు మాత్రమే సాధ్యమగును. విప్రోత్తము లెల్లరును భక్తులును, దేదీప్యమానమగు భగవంతుని దివ్య స్వరూపమును జూచి యాశ్చర్య చకితులైరి. ఆ సమయమున భూసురులకు బక్షులును కీటకములును, పశువులును, మానవులును, పాషాణమును, వృక్షములును, దృష్టి గోచరములగు సర్వవస్తువులును విఠలరూపముగ గనబడుచుండెను పృథ్వ్యప్తేజో వాయు రాకాశములు బ్రాహ్మణుల దృష్టిలో విఠల స్వరూపముగ నగపడుచుండెను. నానావిధ పశుజాలమును, సూర్య చంద్ర తారాదులును దేవతలును, సభామంటపమున జయ విజయ ద్వార పాలకులును, గరుడ స్తంభమును, మహాద్వారమును, తాళమృదంగాది నామ ఘోషములును పతాకములును, మంటపమునందలి స్తంభములును, సోపానములును, విఠల స్వరూపముగ గనబడుచుండెను. సత్వ రజ స్తమో గుణములును, జీవచ్చైతన్య మనస్సులును, ధరామరులకు విఠల స్వరూపముగ గనబడుచుండెను, వటబీజ మనంతరూపముల విస్తరించునట్లును, సర్వ రసములందును ద్రవము వ్యాపించి యుండునట్లును, బ్రహ్మాండ మంతయు పవనము వ్యాపించి యుండునట్లును, సర్వ దేహములందును జఠరాగ్ని వ్యాపించి యుండునట్లును, ననంత నేత్రములందొకే దృష్టి యున్నట్లును, నొకే లయలో ననేక స్వరములున్నట్లును చరాచరాత్మకమైన సర్వ ప్రపంచమును ద్విజోత్తములకు విఠల స్వరూపముగ గనబడుచుండ వారు నిశ్చేష్టులై చూచుచుండిరి.

భగవంతుడు ధరామరులకు జూపిన విశ్వరూపము నుపమానముగ వర్ణించుటకు గృష్ణావతారమున మనమోహనుడు గోపికలు తనను బంధించి యశోదయొద్దకు దీసికొనిపోవ ననంత కృష్ణులుగ గనబడిన విధ ముచితము. శ్రీ పంఢరీనాథుడు సర్వవ్యాపకుడై బ్రాహ్మణులకు దర్శన మిచ్చుటచే ధరామరులు సహజముగ దేహ భ్రాంతిని విడచిరి. త్రిలోకములందును, నంతర్బాహ్యము లందును యోగుల సుఖవిశ్రాంతి యగు శ్రీ విఠలునుజూచి భక్తులెల్లరును నమితానందమును బొంది

జయ జయధ్వనులు జేయుచు పరస్పరాలింగనము జేసికొనిరి. ఆ యపార సుఖవిశ్రాంతిని భక్తులెల్లరు తన్మయులై సేవించిరి. ద్విజులెల్లరు దేహ భ్రాంతి విరహితులై యుండ భగవంతుడు వారిని సావధాన పరచి నామ దేవుల నెత్తి వారి పాదములపై బడవేసెను. భక్తవత్సలుడగు భగవంతుడు సర్వులను కృపాదృష్టితో గటాక్షించి విప్రోత్తములతో "అంతరంగిక విషయమొక్కటి చెప్పదలచితిని. సావధానముగ వినుడు భక్తులు ప్రపంచాభి మానమును విడచి నన్ను శరణుబొంది సేవించుటచే నేను సంపూర్ణముగ వారిసేవా ఋణములకు బద్ధుడనైతిని. నేను భక్తుల కధీనుడనై యున్నాను. స్వతంత్రుడను కానని" చెప్పి "చూడుడీ నివృత్తిదేవ, జ్ఞానేశ్వర, సోపానదేవులు సర్వభూతములును నన్నుగా భావించి భజన జేయుచున్నారు. నేను వీరికి పూర్ణముగ స్వాధీనుడనైతిని. ఈజగన్మిత్రుడు సంసారమును త్యజించి నాకు పరమబంధువై, నన్ను హృదయమున బంధించి దేహభ్రాంతి విరహితుడై యున్నాడు. ఈ సావంతమాలి నాదాసుడు. విశ్వాసముతో సర్వభూతములు నన్నుగా భావించి భజించు చున్నాడు. ఈ విశోబా ఖేచరుడును నరహరి భక్తుడును, నా నిజ దాసులై నిరంతరము నన్ను భజించు చున్నారు. ఈ గోరాకుంభార భక్తు డిల్లువాకిలి భార్యబిడ్డలు నన్నయు త్యజించి నన్ను శరణుబొంది యున్నాడు. ఈ చోఖామేళ భక్తుని నేను జనకునిగ భావింతును. ఈతనికి నేనుతప్ప సఖులీ పృథివియందెవ్వరును లేరు" అని చెప్పెను.

ఈ ప్రకారముగ ప్రతిభక్తుని వర్ణించుచు వీరందరిని నేనెంతవరకు వర్ణింపగలనని శ్రీ పంఢరీనాథు డాహ్లాదముతో విప్రోత్తములతో జెప్పి భక్తుల పాదధూళియగు నీ నామదేవుడు భక్తరాజై యున్నాడనెను. ద్విజోత్తము లాశ్చర్యముతో నానందాశ్రువులు విడచుచు చేతులు జోడించి నమస్కారములు చేయుచు "ఓ పంఢరీనాథా! మాకు ప్రపంచ మాయను దూరము జేయుడు. నీచరణ వియోగ మెన్నటికిని గలుగకుండు నట్లనుగ్రహింపుడు. ఇహలోక భోగములును, ముక్తియు, ధనసంపదలును మాకు వలదు. జన్మ జన్మాంతరములకును సత్సాంగత్యము

ననుగ్రహింపుడు. వేదశాస్త్రములు బఠించుటవలన మనస్సు బహిర్ముఖమైనది. బుద్ధి చలనమై యభిమానముతో గూడియున్నది. మేము బ్రాహ్మణులము. గొప్ప జాతివారమను నహంకారముతో బంధనములలో దగుల్కొంటిమి. మీ యొక్కయు మీ భక్తుల యొక్కయు మహిమ విశేషములు తెలిసికొనలేక నపశబ్దము లనంతముగ బల్కితిమి. ఓ దేవాదిదేవా! పంఢరీనాధా! నేమొనర్చిన యనంతాపరాధములను క్షమించి పతితులమగు మమ్ము కృప సర్వవిధముల రక్షింపుము పతితులగు మాకు దర్శనమిచ్చి దీననాథుడను మీ బిరుదమును సార్థకము జేసికొంటిరి. మేమ నంతజన్మలలో నేసుకృతము జేసికొంటిమో యిప్పుడు నీదర్శనభాగ్యము గలిగినది. మాపూర్వపుణ్యమను బీజముపై సత్సంగమను నుదకముపడుట వలన నీ కృపయను ఫలము లభించినది. దుస్తరమగు మాయాపాశమున దగుల్కొని స్వస్వరూప జ్ఞానహీనులమగు నే మపారములగు మీ మహిమవిశేషముల నేమివర్ణింపగలము మీ మహిమను వర్ణించుటకు మీ తనయుడగు విరించికిని, నాదిశేషునకును, కైలాసపతికిని మీభార్య యగు రమాదేవికిని, ముప్పదిమూడుకోట్ల దేవతలకును, యక్ష కిన్నర గంధర్వాదులకును, చతుర్వేదములకును, షట్ఛాస్త్రములకును, నష్టాదశ పురాణములకును, నసాధ్యము. ఓ కృపాసాగరా! జగజ్జెట్టీ! నే మొకటిమాత్రము మిమ్ము కోరుచున్నాము. నిరంతరము మమ్ము కృపా దృష్టితో జూచుచు మీభక్తుల సాంగత్యము ననుగ్రహించి యఖండ ప్రేమతో సదా మీ నామభజన జేయుచు జీవితమంతయు మీ సేవ కర్పించి యంత్యమున మీ సాయుజ్యము బొందున ట్లనుగ్రహింపుడు. మీరనంత బ్రహ్మాండనాయకులు. సృష్టిస్థితి లయకారకులు. మా యవగుణముల నెంచక మమ్ము మీ భక్తులలో జేర్చుకొండు. వారి చరణ ధూళిచే మమ్ము పవిత్రులనుగా జేయుడు. మీ చరణసేవయే మాకు వ్రత తపము” లని చెప్పిరి.

ద్విజోత్తములు పలికిన పలుకులు విని హర్షచిత్తుడై దేవాది దేవుడు కృపతో ధరామరుల నాలింగనము జేసికొని జ్ఞానదేవులు చెప్పు

విషయమును మీరు పరమప్రమాణముగ స్వీకరింపుడు. సర్వజ్ఞశిరోమణియు, నా యాత్మయు నగు జ్ఞానదేవుడు తెలుపు ననుభవమును సద్భావముతో నాచరింపుడు ఆతడు తెల్పు మూలతత్త్వము నాచరణ యందుంచిన తీర్థాటన వేదశాస్త్రాభ్యాసములతో బనియుండదు. కాయ క్లేశకరమగు తపస్సెవరికి కావలెను? విశ్వాసముతో సత్సాంగత్యము జేసిన సర్వదోషములు క్షణకాలములో హరించును. ఉగ్రతపమును, మంత్రజపములును శ్రమతో జేయ నవసరములేదు. సత్సాంగత్యము వలన త్రివిధ తాపములును హరించును. వజ్రాసనాది యోగములును, పర్వతగుహావాసములును నిష్ప్రయోజనములు. భస్మోద్ధూళనమును, జటాభారమును, లోకాచారములగు దాంభికములును ననవసరములు. సర్వభూతములయందు కరుణతో జిహ్వతో నా నామామృతమును సేవించినచో క్షణమాత్రములో మనోనివృత్తి యగును. ప్రేమ లేని కర్మలు చేసినను నధ్యాత్మజ్ఞాన మలభ్యమగును. సర్వసాధనలలో నతి సులభమగు మార్గము హరినామసంకీర్తన. తీర్థవ్రత తపజపములు హరి నామసంకీర్తనయెదుట లజ్జపడును. ప్రసిద్ధమును, సర్వశ్రేష్ఠమును నగు రాజయోగమునందుండి యఖండముగ సత్సాంగత్యము జేయుచు వాక్కుతో నా నామ ముచ్చరింపుడు. సంకల్ప వికల్పములను త్యజించి మనోభావపూర్వకముగ శరణుబొందు" డని జగజ్జీవనుడు విప్రోత్తము లకు చెప్పెను.

ధరామరులు భగవంతుని చరణములకు వందనములుజేసిరి. అంత రుక్మిణీకాంతుడు జ్ఞానేశ్వరులను జూచి "ఈ ధరామరులను నీకు స్వాధీన పరచితిని. నీ వరదాభయహస్తమును వీరి మస్తకములపై నుంచి యను గ్రహింపు" మని చెప్పగా జ్ఞానేశ్వరు లవశ్యమని చెప్పి "వేదములయొక్క గుహ్యజ్ఞానమును, వైరాగ్యమునకు మూలమును, చిదాకాశస్థానమగు పరమగుహ్యమును, మోక్షమునకు బీజమును, సకల మంత్రరాజమును, మంగళనిధి స్థానమును నగు నీ నామదేవుల ప్రేమ యత్యద్భుతమై హృదయములో గుప్తమైయున్నది. ఇది భూమండలమున విఖ్యాతమై



శ్రీ విఠ్ఠలనాథుడు తన నిజరూపమున విప్రుల కభయమిచ్చుట.

కథారూపమున ప్రకటితమై యున్నది. ఇది శ్రవణమునకు నిజశ్రవణమును, మననమునకు నిజ మననమును, ప్రేమయొక్క నిధిధ్యాసయు, నామదేవుని యనుసంధానము (లక్ష్యము)ను నై యున్నది. ఇదివిచారణయొక్క సారమును, బుద్ధియొక్కనిర్ధారణయు, స్వరూప సాక్షాత్కారమై భూలోకమున వెలువడినది ఇది భక్తిరసప్రవాహము నిజభావవైభవము. సన్మానముయొక్క నిజగౌరవమై భూలోకమున వెలువడినది. ఇదియశము యొక్క ప్రకాశమును, పరతత్వముయొక్క తత్వమును, కీర్తియొక్క విస్తారమునై లోకమున వ్యాపించినది. ఇది సకలధర్మములకు జీవనమును, పవిత్రమును, పావనముజేయునదియు, నానందమున కధిష్ఠానమైయున్నది. ఇది యోగసిద్ధుల కమృతమును, భక్తుల కాయువును, సిపాక్కమమునై యున్నది" అని చెప్పిరి.

భక్తులయొక్కయు, భగవంతునియొక్కయు, నిజ వైభవమును ప్రేమతో సేవించువా రక్షయపదము ననాయాసముగ బొందెదరు. ఈ తీర్థావళి యధ్యాయమును శ్రవణముజేయువారు జనన మరణ ప్రవాహమునుండి తొలగెదరు.దీనిని ప్రాకృతమని భావింపరాదు. •ఇది కవిత్వచాతుర్యమని భావింపకుడు. ఇది కేవల ముపనిషదర్థమగు బ్రహ్మరసము. ఇది సాత్వికులకు నిజసాధనము.

పంచదశాధ్యాయము సమాప్తము.

అఖిలాభీష్ట ఫలప్రదాయనమః



# కూర్మదాస చరిత్ర

—♦ షోడశాధ్యాయము ♦—

నేడు మంగళప్రదమగు సుదినము. భక్తుల సచ్చరిత్రలను వర్ణించుటవలన దీర్ఘము నై సమమగు పర్వకాల మనాయాసముగ దటస్థించి నది. మూడునందల యరువదిప్రవేశములను విధ్యుక్తముగ నాచరించుట వలనను, శతాశ్వమేధ యాగముల జేయుటవలనను, న్యగముగ దప మొనర్చుటవలనను సన్యాసాశ్రమము స్వీకరించుటవలనను, దృష్టాంతమున కుదకదానము జేయుటవలనను, మాతాపితరుల సేవా శుశ్రూషల జేయుటవలనను, నే ఫలము సంప్రాప్తించునో యా ఫలమును శ్రోతృజను లనాయాసముగ బొందుచున్నారు. హృషీకేశుడగు భగవంతుడు జనుల కక్షయపదమిచ్చి సర్వవిధముల రక్షించును. కాన నో శ్రోతలారా! నిశ్చలచిత్తముతో నాగస్వరము నాకర్ణించి సర్పము పడగవిప్పి యాడునట్లును, నాదమునందు లీనమై లేడి దేహభ్రాంతిని బరిత్యజించు నట్లును, భక్తచరిత్రల నాకర్ణించిన జగజ్జీవనుడు సంతసించును

ప్రతిష్ఠానపురము (ఇప్పటి పైఠనపురము) నందు కూర్మదాసను నామముగల పరమభావుకుడగు విప్రు డొకడుండెను. ఆతడు కరచరణ విహీనుడై జన్మించెను. సూర్యుని రథసారథియగు నరుణుడు హరిభజన జేయుటకై బ్రాహ్మణవంశమునందు జన్మించెను. ఈ కూర్మదాసు దిన దిన ప్రవర్ధముగ బెరిగి పెద్దవాడై గ్రామమునందు జరుగు హరినామ సంకీర్తనకై ప్రాకుచు బోయి తంబుర తాళమృదంగాది వాద్యములతో జరుగు హరినామసంకీర్తనము నాకర్ణించుచుండెను. ఒకదినమందా గ్రామమున హరిదాసుడొకడు వచ్చి పంఢరీమాహాత్మ్యము జెప్పట కూర్మదా సాకర్ణించి యత్యుల్లాసముతో హరిదాసునకు వందనము జేసి "అయ్యా! నేను పంఢరీక్షేత్రమునకు బోయినచో శ్రీ రుక్మిణీవరుడు నాకు గనబడునా?" అని యడిగెను. జనులెల్లరు కూర్మదాసు వచనము విని నవ్వుచు "కరచరణములు లేని నీ వెట్లు పంఢరీపురమునకు

బోగలవు? రెక్కలు లేనిచో బక్షి యాకసమున కెగురజాల నట్లును, నేత్రములు లేనిచో మానవుడు పర్వతముల నెక్కజాలనట్లును, చెవిటి వాడు హరిదాసుడు చెప్పు కథల నాకర్ణించి యానందింపలేనట్లును, గాత్రము పోయినచో గానము జేయలేనట్లును, ధనములేనిచో యాచకు లను దృప్తిపరుపజాలనట్లును, విద్య లేనిచో సభాసన్మానము నొందజాల నట్లును, మనస్సు స్వాధీనము కానిచో యోగసాధన సాఫల్యపడనట్లును, గురుకృప లేనిచో నాత్మజ్ఞానము కలుగనట్లును, కరచరణవిహీనుడవగు నీవు పంఢరీపుర యాత్ర యెట్లుసాగును. మాకు సకలైశ్వర్యములుండియు శరీరమున బూర్ణారోగ్యమును గలిగియు వృద్ధాప్యమున దీర్ఘయాత్ర సంప్రాప్తింపలేదు. నీవు యాత్రకు బోవలెనని సంకల్పించుట ఫలప్రద మగునని మాకు దోచుటలేదు. కరచరణములు లేని నీ వంతదూరము పోవుట స్వప్నమునందైనను జరుగ"దనిరి. అంత కూర్మదాసు వార లతో "అనాయాసముగ నరదేహము లభించియు పంఢరీ క్షేత్రము నిప్పుడు సేవింపనిచో దిరిగి యెనుబది నాలుగులక్షల జీవరాసులలో జనన మరణముల నొందుట తప్పదని" చెప్పి పశ్చాత్తాపముతో దత్ క్షణమే యచ్చటనుండి పంఢరీపురమునకు బయలుదేరెను.

ఆదినము సాయంకాలము వరకుగు బ్రాహ్మణ గ్రామమునకు క్రోసు దూరమునగల నాంజనేయ దేవాలయమును జేరి యాకలిదప్పులు బాధించుటచే జింతాక్రాంతుడై "ఓ పంఢరీనాథా! రుక్మిణీకాంతా! అనాథుడనగు నన్ను రక్షింపుము. నీవుతప్ప నాకు జననీ జనకులును, బంధు మిత్రులును లేరు. నీవే నాజీవము. నాయాకలి దప్పులెవరు తీర్తు రని" భగవంతుని బ్రార్థింపగా శ్రీ పంఢరీనాథుడు తత్ క్షణమే యొక వర్తకుని రూపమును ధరించి కూర్మదాసు నెదుట సాక్షాత్కరించి "అయ్యా! కరచరణములులేని నీ వెచటి కేగుచున్నావు? నీ నామధేయ మేమి? తెలుపు"మని యడిగెను. అంత కూర్మదాసు "అయ్యా! నన్ను కూర్మదా సందురు. పంఢరీపురమునకు బోవలయునను కోరికతో బయలు దేరితిని" అని చెప్పెను. శ్రీ పంఢరీనాథుడు సంతసించి "అయ్యా

నేనును బంఢరీపుర మేగుచున్నాను. నాకయాచితముగ సత్సాంగత్యము లభించిన"దని చెప్పెను. అంత కూర్మదాసు "నేను కరచరణ రహితుడను. నాతో మీకు ప్రయాణమెట్లు కుదురును! తమ నివాస మెక్కడ? తమ నామధేయ మేమి?" అని విచారింప వేషధారియగు భగవంతుడు "నన్ను విఠోబా సేటని పిలచెదరు; పంఢరీ పురములో మాదు కాణ మున్నది. నేనొక కార్యార్థమై వచ్చి పనిముగించుకొని తిరిగి స్వస్థానమును జేరు చున్నా"నని చెప్పెను. భగవంతుని వచనముల నాకర్ణించి కూర్మదాసు "మీరు త్వరితముగ నడచి పోవుదురు. నేను మీతో నెట్లురాగల"నని చెప్పగా భగవంతుడు "నేను సరాసరి పోవువాడనుకాను ప్రత్యర్ధక్రోశ దూరమునకును మకాము లున్నవి. నాకిచ్చి పుచ్చుకొను వ్యవహారము లుండును. నీతోగలిసి పయనింపవలెనని నాకు మిగుల గుతూహలముగ నున్నది విఘ్న మేమియు జెప్ప వల"దనెను. భగవంతుని వాక్యములు విని కూర్మదా సమితానంద భరితుడయ్యెను.

వర్తకుని వేషముతో భగవంతుడు వంటదయారుచేసి కూర్మదాసునకు వడ్డించి తానును భుజించి కూర్మదాసునకు దన యొద్దనున్న వస్త్రములనిచ్చి కట్టుకొమ్మనెను. ఆ రాత్రి భగవంతుడు కూర్మదాసుతో దను ప్రయాణ మార్గవిషయమై కష్టము గలుగకుండ సుఖరూపముగ జరుగు నుపాయము జెప్పి "నీవు ధైర్య మవలంభించుము. నీకు నాతో పాటుగనే భోజనము 'దయారు చేయు'ంచి ప్రతి 'మకాము' నందును నీరాక కొఱకై నిరీక్షించుచుండెదను. అనాథ దీన యాత్రికులకు మార్గ మధ్యమును గలుగు శ్రమను నివృత్తిజేసి యన్న పానీయాదు లేర్పరచు చుందును. అని చెప్పెను. ఈ ప్రకారముగ నారాత్రి యంతయు గూర్మదాసును, భగవంతుడును, హితవచనముల జెప్పుకొనిరి. తెల్లవారిన పిదప కూర్మదాసునకు భగవంతుడు "నేను పోవుచున్నాను. మకాములో నీకు భోజనమేర్పాటుచేసి నీ రాకకొరకు నిరీక్షించెదను. ఇదిగో! ఈ మార్గము వెంట ర" మ్మని మార్గము జూపి యంతర్ధానుడయ్యెను.

కూర్మదాసా మార్గమువెంట ప్రాకుచు సూర్యాస్తమయ సమయమున నొక గ్రామముజేరి వర్తకుని కొరకు పరీక్షించుచుండెను. తత్క్షణమే వర్తకుని వేషములోనున్న భగవంతు డేతెంచి కూర్మదాసున కన్న పానీయాదుల నేర్పరచెను. ఈ విధముగా ప్రతినిత్యము కూర్మదాసునకు భోజన వసతుల నేర్పరచుచు గ్రామములు లేనిచోటుల గ్రామముల నిర్మించుచు భగవంతుడు భక్తునకు శ్రమ కలుగకుండ గాపాడుచుండెను. కూర్మదాసు నాలుగు మాసములుగ ప్రాకుచు కార్తీక శుద్ధ దశమికి 'లహాళ' గ్రామమును జేరెను. ఆ గ్రామమునుండి పంఢరీపురమున జరుగు కార్తీక శుద్ధైకాదశీ బ్రహ్మోత్సవమును సేవించుటకై యపారజనులు పోవుచుండిరి. కూర్మదాసు చింతాక్రాంతుడై "రే పేకాదశీ బ్రహ్మోత్సవ దినము. కరచరణములులేని నే నెట్లంతదూరము జేరగలను? నాకును గరచరణము లుండిన నేనును నీ భక్తజనులతో నడచిపోయి బ్రహ్మోత్సవము సేవించి యుందునుగదా! వేగముగా నడచువానితో గుంటివాడు నడువలేనట్లును, నుదారునితో సమముగ గృపణుడు దానము జేయలేనట్లును, క్షుధార్తునితో సమముగ వ్యాధిగ్రస్తుడు భుజింప లేనట్లును; భాస్కరుని తేజములో జంద్ర తేజము సమముగా నుండనట్లును, సువర్ణములో సమముగ నితర ధాతువులకు మూల్యము రానట్లును, బక్వాన్నములతో సమముగ నన్నమును భుజించుట కిచ్ఛ యుండనట్లును, గామధేనువుతో సమముగ నైశ్వర్య మితర పశువుల కుండనట్లును, గల్పవృక్షమునకు సమముగ యోగ్యత యితర వృక్షముల కుండనట్లును, యాత్రాజనులతో సమముగ నేనెట్లు నడువగల" నని చింతించుచు, భగవంతునకు వర్తమానమును బంపదలచి యాత్రాజనులకు నమస్కారముజేసి "అయ్యా! నేను పరదేశిని. అనాథుడను. దీనుడను. కరచరణ రహితుడను. ఏకాదశికి దర్శనముజేయ నిశ్చయించుకొని పైఠనపురమునుండి నాలుగుమాసములుగ ప్రాకుచు 'లహాళ' గ్రామమును జేరితిని. పంఢరీపుర మిచ్చటికి కేడు క్రోసుల దూరమున నున్నది. నేను చేరుట కింకను నేడుదినములు పట్టును. కాన తా మీ విషయ

మును సవిస్తరముగ శ్రీ రుక్మిణీకాంతునికి దెలిపి "శ్రీ పేకాదశీ పర్వ కాలము. నీ దర్శనము లేనిది శాంతియుండదు చాతకపక్షులు మేఘములకొఱ కెదురు చూచునట్లును. చకోరపక్షులు చంద్రోదయమున కెదురు చూచునట్లును దూడ యావుకొఱకై నిరీక్షించునట్లును, గండజము పక్షిరాకకై వేచియుండునట్లును, కూర్మదాసు నీ దర్శనమునకై యెదురు చూచుచున్నాడు. నీవుతప్ప నాతనికి ధనసంపదలును, బంధుమిత్రులును నెవ్వరును లేరు. అనాథనాథా! కృపాసాగరా! దీనుడగు నాతని నుద్ధరింపు డని నా ప్రార్థనగా భగవంతునికి దెలియజేయు" డని చెప్పెను.

అవశ్యమనిచెప్పి యాత్రాజనులు తంబుర తాళ మృదంగాది వాద్యములతో శ్రీ విఠ్ఠలనామ సంకీర్తన జేయుచు వెళ్ళిరి. పంఢరీపురములో మహాద్వారమున నామదేవులు భక్తజనులతో గూడి హరినామ సంకీర్తన జేయుచుండిరి. హృదయమందు విఠ్ఠలమూర్తిని నిలుపుకొని ప్రేమతో నృత్యముజేయుచు నభిమానమును విడచి "కృష్ణా, విష్ణూ, మేఘశ్యామా, ముకుందా, మురారీ, పురుషోత్తమా అచ్చుతా, నరహరీ, ఘనశ్యామా, విజయా, శ్రీరామా, రఘుపతీ, జయజయ గోవర్ధనోద్ధారా, జయజయ గోపీమనోహరా, జయజయ భక్త కరుణాపారీణా, దీనోద్ధారకా, పాండురంగా, జయజయ సకల మంగళాధీశా, పాతకభంజనా, హృషీకేశా, అమరపాలనా, సర్వేశా, అక్షయవేషా, అభంగా, పరమానందా, శ్రీపతీ! నీ వాదిమధ్యాంతరహితుడవై యున్నావు. సజ్జనులకు సుఖ విశ్రాంతివై యున్నావు. ప్రేమసుఖ మనుగ్రహించు దాతవు నీవు. అనాథుడనగు నన్ను రక్షింపుము. భవపాశమునుండి నన్ను తత్క్షణమే తొలగింపు" మని ప్రార్థించుచుండిరి.

శ్రీ రుక్మిణీరమణుడు సాక్షాత్కరించి నామదేవుల నాలింగనము జేసికొనెను. పిదప భగవంతుడు భక్తులను జూచి "యీతనికి నామదేవుడని పేరుబెట్టితిని. నా నామమును పూర్ణముగా భజించియున్నాడు. ఆతని నామము జగద్విఖ్యాతమైనది. ఎందరో వైష్ణవజనులున్నను నీ

నామదేవులకు సములు కారు. ఈతని ప్రేమ దినదిన ప్రవర్ధమానముగ వృద్ధిబొందుచున్నది. ఈ జ్ఞానదేవుడు నా జీవమైయున్నాడు. ఈతడు జ్ఞానవిజ్ఞానములకు భూషణుడు. నా నిజదాసుడగు నివృత్తినాధుడు మేరు పర్వతమువలె వైరాగ్యయుక్తుడై యున్నాడు. సాగరమువలె నపారతత్వ జ్ఞానముగల నీ సోపానదేవుడు సర్వులలో శ్రేష్ఠుడు. రోహిదాసును, విశోబాఖేచరుడును, గోరాకుంభారును, జోగా పరమానందుడును నా నిజభక్తులు. జగన్మిత్రుడు, వినట రాముడు, వటేశ్వరుడు, చాంగ దేవుడు నాకు ప్రియులు. సుదాముడును, కేశవదాసుడును, నరహరి యును, నాకత్యంతప్రియులు. భీష్ముడును, రుక్మాంగదుడును, నుద్ధవా క్రూరులును, నర్జునుడును, ప్రహ్లాదుడును, ధ్రువుడును, నారద తుంబు రులును, నా యాంతర్యమును బాగుగ నెరుగుదురు. వీరెల్లరును సర్వ కాలములయందును, విరక్తులై సహజముగ జీవన్ముక్తులెరి కాని నామ దేవుల మహిమ మిగుల నద్భుతమైనది. ఆతనికి సము లెవ్వరును లేరు. నాకు మీయందరికంటె నామదేవులయం దత్యంతప్రేమ యున్న"దనెను. భగవంతు డీప్రకారముగ భక్తులతో సంభాషించుచుండ బతాకహస్తులై భజనలు చేయుచు యాత్రాజను లేతెంచిరి. సభామంటపము మొదలు భీమాతీరమువరకు భక్తజనులు నానావిధ వాద్యములతో జేయు హరి నామసంకీర్తనము నాదబ్రహ్మమైయుండెను. చంద్రకిరణామృతమును చకోరపక్షులుమాత్ర మనుభవించునట్లును, తల్లి స్తనపానమును బాలకు డొక్కడుమాత్రము జేయునట్లును, క్షీరసముద్రముయొక్క మహిమ నుపమన్యుడొక్కడే తెలిసికొనినట్లును, జలము కలిసిన క్షీరమును రాజ హంసలుమాత్రము వేరుపరచునట్లును, ప్రేమభక్తుల కీర్తనలను సజ్జా నులుమాత్ర మనుభవింతురు. కమలపుష్పములోని మకరందమును భ్రమ రములు మాత్రమే సేవించునట్లు పంఢరీక్షేత్రములోని పరమానందమును పుండలీకభక్తుడుమాత్ర మనుభవించుచుండెను.

యాత్రాజనులు ప్రేమతో మహాద్వారమున సాష్టాంగ నమ స్కారములుజేసి పరస్పరాలింగనముల జేసికొనుచు గర్భాలయమున ప్రవేశించి సింహాసనముపై విరాజిల్లుచు సమచరణ యుక్తుడును, కటి

హాస్యుడును, పీతాంబర ధారియునగు సచ్చిదానంద పరబ్రహ్మమూర్తిని జూచి యానంద పరవశులై ప్రేమతో నాలింగన వందనాదులు జేసు కొనిరి. శ్వశుర గృహము నందున్న పుత్రిక తల్లిని జూచి యానందించు నట్లు (శ్రీ) పంఢరీనాథుని జూచి వారానందించి షోడశోపచార విధుల భగవంతునికి గంధపుష్పధూప దీపాదులచే బూజలుజేయించి సుమమాల్య వస్త్రాభరణము లర్పించిరి. పిదప యాత్రాజనులకు కూర్మదాసు భగవం తునకు దెలుపుడనిన విషయము స్మరణకు వచ్చి "ఓ దేవాదిదేవా! రుక్మిణీకాంతా! కరచరణ రహితుడగు కూర్మదాసను పేరుగల భావి కుడు పైఠనపురమునుండి నాలుగు మాసములుగ ప్రాకుచు 'లహుళ' గ్రామము జేరెను. ఆత డేకాదశీ పర్వకాలమున మిమ్ము సేవింపవలెనని మిగుల నార్తుడై విలపించుచున్నాడు. ఆతనికి దర్శన మిప్పింపుడని ప్రార్థిం పవలసినదిగా మమ్ము కోరెనని" చెప్పిరి.

పంఢరీనాథుడు యాత్రాజనులు చెప్పిన వచనములు విని నిజ భక్తుడగు కూర్మదాసునకు దర్శనమిచ్చు విషయమున నార్తుడై తన దర్శ నమునకై యపారముగవచ్చిన యాత్రాజనులను త్యజించి నామదేవు లను, జ్ఞానేశ్వరులను బిలచి "ఓ భక్తులారా! కూర్మదాసార్తుడై నాదర్శ నమునకై విలపించుచున్నాడు, ఆతనికి దర్శనమిచ్చుటకు నేను పోవు చున్నాను. నావెంట మీరును రండని" చెప్పెను. భగవంతుడు చెప్పిన ప్రకారముగ నామదేవులును, జ్ఞానేశ్వరులును, బయలుదేరిరి భగవం తుడు నామదేవ జ్ఞానేశ్వరులను తన కిరువైపుల నుంచుకొని నడచుచు గూర్మదాసునకు దర్శన మిచ్చుటకై 'లహుళ' గ్రామమునకు బయలు దేరెను. క్షీరసాగర శేషశాయియు, శ్రుతి స్మృతి పురాణములచే వర్ణ నీయుడును, లక్ష్మీకాంతుడును, వజ్రాసనములందు గూర్చుండి యుండు యోగులకు ధ్యానమందు త్వరితముగ గోచరింపని వాడును, నగు భగ వంతుడు నడచుచుండెను. ఎవని చరణధూళికై బ్రహ్మాది దేవతలును, మునులు నపేక్షించుచుందురో యా రుక్మిణీకాంతుడు భక్తుల యందుగల వాత్సల్యమును బ్రకటించుటకై కూర్మదాసునకు దర్శన మీయదలచి

హర్ష చిత్తుడై నడచుచుండెను. జ్ఞానేశ్వరులును, నామదేవులును, భగవంతునితో గలిసి పోవుచుండగా మార్గము నందొక వనము కనబడెను. ఆ వనమందు సావతామాలియను పేరుగల భక్తుడుండెను. భగవంతుడు నామదేవుల కొక కౌతుకమును జూపవలెనని తలచి "ఓ నామదేవా! నాకు మిగుల దృష్ణగా నున్నది. నేనీ వనములోనికిబోయి దప్పిక దీర్చుకొని యిప్పుడే వచ్చెదను మీరిచ్చటనే యుండు"డని చెప్పి యాభక్తుల నిరువుర నచటవిడచి వనములో బ్రవేశించెను. అంత నేత్రములు మూసుకొని సమాధిసుఖ మనుభవించుచు విదేహస్థితియందున్న సావతామాలి భక్తులకు శ్రీపంఢరీ నాథుడు దర్శన మిచ్చెను.

తత్క్షణమే సావతామాలి భగవంతు నాలింగనము జేసుకొని, చరణములకు సాష్టాంగ నమస్కారములు జేసి నేత్రములనుండి ప్రేమాశ్రుధారలను విడచుచు "నేడు ధన్యమైన సుదినము. బ్రహ్మాదులకు దుర్లభమగు మీదర్శన మప్రయత్నముగ నాకు లభించినది. ఓ పంఢరీనాథా మీరు చాల శ్రమపడి వచ్చినారు. దీనుడనగు నన్ను సర్వవిధముల రక్షింపుడు. మీరు స్వస్థముగ నొకక్షణము గూర్చుండుడు. పూజించెదనని" చెప్పెను.

రుక్మిణీవరుడు సావతామాలి వాక్యముల నాకర్ణించి నన్ను వెంటనంటి యిరువురు తస్కరులు వచ్చిరి, వారికి గనబడకుండ దాగి యుండుటకై నేనీ వనమున బ్రవేశించితిని. నాకు రహస్య స్థలము కావలెను. త్వరితముగా జూపుము. ఈ సమయమున నన్ను బూజించుట కాశించి యుండుట చిత్రముగ నున్నది. సూర్యునికి గ్రహణకాలమున నర్ఘ్యదానము నందిచ్చ లేకుండునట్లును, శత్రుసైన్యము నగరములో బ్రవేశింప సింహాసనముపై గూర్చుండుటకు రాజున కిచ్ఛయుండనట్లును, దుఃఖితుడగు మానవున కుపచారములందు వైముఖ్యము కలుగునట్లును, నగస్త్యునిజూచిన సముద్రము బొంగనట్లును, నీవు నన్ను బూజించెదనని చెప్పుచుండ నామనస్సు స్వస్థముగ లేకున్నది! ముందుగ యుక్తమగు రహస్య ప్రదేశమును జూపు మని" యడిగెను.

అంత సావతాభక్తుడు "త్రిభువనములందు శోధించినను, మీకు యుక్తమగు స్థలము కనబడదు పంజరములో వాయువును, బిందెలో నాకాశమును జీకటిలో సూర్యుని, తాపసులలో శంకరుని, పక్షులలో వైనతేయుని, దేవతలలో శచీరమణుని, మృత్తికలో గస్తూరిని, వృక్షములలో జందన వృక్షమును, శ్వాపదములలో గజమును, నశ్వములలో నుచ్చైశ్శ్రవమును, నినుపపెట్టెలో స్పర్శవేదియు, దాగియుండు టెట్లు సాధ్యమగును. నీవు సర్వ శ్రేష్ఠుడవు. నీ యుదరమున ననంత బ్రహ్మాండము లణగియున్నవి. నీవు దాగి యుండుటకు తగిన స్థలము భూమండలమం దెచ్చటను లేదని" చెప్పెను. జగజ్జీవనుడు "ఓ సావతా! ఈ బ్రహ్మజ్ఞాన ప్రసంగములు నాకు జెప్పెదవేల? నేను దాగి యుండుటకు సత్వరమే స్థలము జూపు"మనెను.

భగవంతుడు చెప్పిన మాటలు విని సావతాభక్తుడు పరిపరివిధముల నాలోచించి తన హృదయముకంటె యుచితమగు రహస్యప్రదేశము వేఱు లేదని భావించి కత్తిని బుచ్చుకొని హృదయము జీల్చి "ఓ వైకుంఠవాసా! నీకిక దొంగలవలన భయములేదు. నా హృదయములో బ్రవేశింపుము. పైన వస్త్రము గప్పెదను. ఈ రహస్యమెవ్వరును గుర్తింపజాల"రని చెప్పెను. శ్రీ పంఢరీనాథుడు సావతాభక్తుని హృదయములో బ్రవేశించి "నాయనా! సావతా! దొంగలబాధనుండి తప్పించితివి. బహుదూరమునుండి పరుగిడుచు, భయముతో నీ వనమున బ్రవేశించిన నా కతిగుహ్యమగు స్థలమిచ్చి నిర్భయునిగా జేసితివి. నీయుపకారమునకు బ్రత్యుపకారముగ నే పదార్థమిచ్చుటకును సృష్టియందగపడుట లే" దని చెప్పెను.

శ్రోతలారా! సావతాభక్తుని హృదయమున భగవంతు డెట్లు దాగియుండెనని సంశయింపకుడు. లీలానాటక సూత్రధారియగు చక్రపాణి కసాధ్యమేదియు లేదు కృష్ణావతారమునందు యశోదాదేవి కవ్వమును ద్రిప్పుచుండ పాత్రలోని నవనీతమును కృష్ణుడు భుజించుచుండెను. అట్లే సావతాభక్తుని ప్రేమకు వశవర్తియై యాతని హృదయమున దాగి యుండె ననుట నిస్సందేహము.

జగన్నాథుఁ డీ ప్రకారముగ సావతాభక్తుని హృదయములోఁ బ్రవేశించి నీ యుపకారమునకు బదులుగ నిచ్చుటకే పదార్థమును గన బడుటలేదు. నీవు నా స్వరూపుఁడవు కావలెను. లేనిచో నీ సర్వస్వము నపహరింపవలెను. ఇదితప్ప నీకిచ్చుట కేమియులే' దని చెప్పెను. అంత సావతాభక్తుఁడు "ఓ స్వామీ! కృపానంతా! నీవు చెప్పినట్లే చేయుము. నీకును, నాకును గల్పాంతమునందైనను వియోగముండరా" దని చెప్పి తన్మయుఁడై భగవంతునిలోఁ లీనుఁడయ్యెను. భాగీరథీ యమునలు కలిసి యేకమైనట్లును, పాలలోఁ నీరు కలిసి యేకరూపమైనట్లును, శరీరములోఁ బ్రాణము వ్యాపించి యేకముగ నుండునట్లును, భక్తుని హృదయమునందు రాజీవనేత్రుఁడు చేరి దేవభక్తులిరువురును నేకమైయుండిరి. చంద్రబింబమునం దమృత ముండునట్లును, బుష్పములోఁ మకరంద ముండునట్లును, రుక్మిణీకాంతుఁడు హృదయములోఁ బ్రవేశించియుండ సావతాభక్తుఁ డద్వైత స్థితి బొందెను.

నామదేవులును జ్ఞానదేవులును, వనము వెలువల బహుకాలము నిరీక్షించి భగవంతుఁడు తిరిగి రానందున చింతాక్రాంతులైరి. నామదేవుఁడు విలపించుచు "భగవంతుఁడు, నాస్వామి నన్ను విడచి యెచటకు బోయెనో! పాండురంగఁడే నా జీవనము. నా సర్వసుఖములు నాతఁడే. ఆతని నెవరు చూపెద" రని జ్ఞానేశ్వరులతోఁ జెప్పుచు గద్గదస్వరముతోఁ నశ్రుధారలు విడచుచు భగవంతుని యడుగుజాడలను జూచి నడచుచు దృష్టాక్రాంతుఁడు వనములోఁ నుదకమునకై శోధించునట్లును, క్షుదాతురుఁడగు బాలుఁడు తల్లి రాక కెదురుచూచునట్లును, ద్రవ్యము పోయిన కృపణుఁడు తబ్బిబ్బగునట్లును, నేలపైబడి దొరలుచు, గుండెలు బాదుకొనుచు "ఓ విఠోబా! నాప్రాణము వ్యాకులముగ నున్నది. నన్ను విడచి పోవు టుచితముకాదు. నీవిట్లు పోవుదువని నాకు దెలిసినచో నీ పీతాంబరమును బట్టుకొని నీవెంటనే వచ్చియుందునుగదా! నీ యుద్దేశము నాకు దెలియలే" దని విలపించుచుండ నెదురుగ సమాధి నిష్ఠలోఁ

నున్న సావతాభక్తుడు కనబడెను. నామదేవు డచటికి బోయి యాతని చరణములకు నమస్కారము జేసెను.

సావతాభక్తుడు దేహభ్రాంతిని విడచి యఖండ సమాధి నిష్ఠ నుండుట నామదేవుడెరిగి వీనియొద్దనే నిశ్చయముగవిఠోబా దేవుడుండునని తలచెను. జారుడు జారుని, చోరుడుచోరుని చిహ్నములనుబట్టిగ్రహించి నట్లును, వక్త యాంతర్యమును జ్ఞానులు గ్రహించినట్లును, యోగుల స్థితిని యోగులు గ్రహించినట్లును, సావతా భక్తునియొద్ద భగవంతు డున్నట్లు నామదేవుడు గ్రహించి "ఓ భక్తరాజా! నాజీవమును, సర్వ సుఖ విశ్రాంతి స్థానమును, నీవు స్వాధీన పరచుకొంటివి. నేను దుర్బ లుడనై విలపించుచుచుండ కంచిన్మాత్రమైనను గనికరము లేక మౌన ముగ నున్నావు. శరీరమునుండి ప్రాణము లెగిరిపోవుటకు సిద్ధముగ నున్నవి. ఓ దయావంతా! నాపై బూర్ణ కృపా దృష్టియుంచి దయా వంతుడగు భగవంతు నొక పర్యాయము చూపు"మని కోరెను. నామ దేవుని కరుణా వచనములు విని సావంతుని హృదయములో నుండి జగ జ్జీవనుడు తన మనమునం దిట్లాలోచించుచుండెను.

"నేను సావతా భక్తునిహృదయములో దగుల్కొంటిని. త్వరితముగ బయటకు బోవుటకు సాధ్యముకాదు. పట్టుపురుగు తాను వసించుటకు గూడుకట్టుకొని తానే మార్గమునుగూడ మూసి బయటకు బోవుటకు సాధ్యముకాక తబ్బిబ్బగునట్లును, బంజరమున బంధింపబడిన శుకము బయటకు బోవుటకు సాధ్యముకానట్లును, కమలపుష్పములో బ్రవేశిం చిన భ్రమరము సూర్యాస్తమయమైనపిదప పుష్పము ముకుళింప బయ టకు బోవుటకు సాధ్యముకాక తబ్బిబ్బగునట్లును, నేనీ సావతాభక్తుని హృదయములో దగుల్కొని కుందుచుంటిని. జలవియోగముచే మత్స్యము తబ్బిబ్బగునట్లు బయట నామదేవుడు తబ్బిబ్బగుచున్నాడు."

పిదప శ్రీపంఢరీనాథుడు సావతాభక్తునితో "ఓ భక్తశ్రేష్ఠా! నామ దేవుడు నాకు బ్రాణసముడు నన్నొకపర్యాయమాతనికి జూపుము. నా

వియోగము నాతడు సహింపలే” డనెను. అంత సావతాభక్తుడు నామ దేవులను జూచి “ఓ విష్ణుభక్తా! సావధానుడవు కమ్ము. నీపై పంఢరీ నాథునకు గృపకలిగినది. ఆతని దర్శనమిప్పుడే యగును. నీవే పుణ్య మొనర్చితివో! నీ భక్తి బలమునకు పంఢరీనాథుడు ఋణస్థుడయ్యెను. అద్భుతమగు నీ మహిమను వర్ణించుటకు పంఢరీనాథునకు దప్ప నన్యులకు సాధ్యముకా దని చెప్పి నామదేవులకు సాష్టాంగనమస్కారము జేసెను. అంత నామదేవుడు “నీవేనాప్తుడవు. నీవు చెప్పిన విషయమును విలంబన జేయక సార్థకపరచుము, నావిఠ్ఠలుని నాకుజూపు” మని చెప్పగా దత్‌ క్షణమే సావతాభక్తుడు తన హృదయమును జీల్చెను. నామదేవులును, జ్ఞానేశ్వరులును, నత్యాశ్చర్యముతో జూచుచుండ నాతన హృదయము నుండి పాండురంగదేవుడు వెలుపలికి వచ్చి నామదేవుల కాలింగనమిచ్చి హాసితవదనుడై “ఖిన్నుడవై యుండుటకు గారణ మే”మని యడుగ నామ దేవుడు మంజుల స్వరముతో మీరు నాకు జననీజనకులై సర్వవిధముల నఖండముగ రక్షించుచున్నా”రని చెప్పెను.

పిదప జగజ్జీవనుడు జ్ఞానేశ్వరులను జూచి మృదుమధుర వాక్కు లతో “ఓ జ్ఞానేశ్వరా! కూర్మదాసు దర్శనమునకై చింతించుచుండును. విలంబనజేయక త్వరితముగ బోవుద”మని చెప్పి శ్రీ పంఢరీనాథుడు నామదేవ జ్ఞానదేవ సావతాభక్తులతో నానందముగ నడచుచు వెళ్లు చుండెను. వర్షముపడుటకుముం దుత్తర దిశనుండి శీతలవాయువును, బ్రాగ్దిశనుండి మెరపులును బయల్వెడలునట్లు కూర్మదాసునకు భగవంతుని దర్శనమునకు ముందుగా నుత్తమ శకునములు గలిగెను. తత్‌క్షణమే దూడయొద్ద కావంబాయని యరచుచు వచ్చునట్లు శ్రీ పంఢరీనాథుడు కూర్మదాసుయొద్దకువచ్చి దర్శనమిచ్చెను. కూర్మదాసు దేవాదిదేవునకు సద్భావముతో నమస్కారముజేయగా శ్రీరుక్మిణీరమణుడు కృపా దృష్టితో ననుగ్రహించి “ఓ ప్రేమభక్తా! వలయు వరము గోరుకొమ్మి



శ్రీ విఠ్ఠలనాథుడు కూర్మదాసునకు దర్శన మిచ్చుట

చ్చెద"నని చెప్పెను. అంత కూర్మదాసు "ఓ దేవాధిదేవా! నిన్ను గోర దగిన దేదియు లేదు; నీవు కోరుకొమ్మని చెప్పియుంటివి; నీ విచ్చటనే యుండవలయును. ఇదితప్ప నింకేమియు గోరిక లే'దని చెప్పెను. అవశ్యమని శ్రీ పంఢరీనాథుఁడు కూర్మదాసున కభయవరదానము ననుగ్రహించి, యప్పటినుండియు నచ్చటనేయుండెను. పంఢరీక్షేత్రమువలె 'లహుళ' గ్రామమును కూర్మదాసువలన మహాక్షేత్రమాయెను.

ఆషాఢ కార్తీకమాసములందు పంఢరీపురమునకు యాత్రగా పోవు భక్తజనులు లహుళక్షేత్రమును సేవించి, కూర్మదాసును, నాతని ననుగ్రహించిన శ్రీవిఠ్ఠలనాథుని సేవించుచుందురు.

షోడశాధ్యాయము సమాప్తము.

శ్రీ ద్వారకాపతియే నమః

# రాకా కుంభార్ చరిత్ర

## —♦ సప్తదశాధ్యాయము ♦—

నేడు భక్తవిజయమను వసంతము సంప్రాప్తించినది. కాబట్టి యర్థ మను ప్రభయు, బోధయను శీతలవాయువును వ్యాపించి, తత్త్వవిచారణ యను నంకురము బయలువెడలెను. జిజ్ఞాసయను పల్లవశాఖలనుండి జ్ఞాన పుష్పములు వికసించి దుర్లభమగు ననుభవస్థితి వలన నవినాశరూపము లగు ఫలములు లభించినవి. శృంగారయుక్తమగు నీ సజ్జనరూపవన మతి శోభాయమానమై యుండును. త్రివిధతాపములచే సంతప్తులగు జనులీ తరుచ్ఛాయల గూర్చుండియుండిరి. జీవన్ముక్తులను రాజహంస లీస్థలమున క్రీడించుచుండిరి రసవంతములగు భక్తచరితములను రాజసులు ప్రేమతో సేవించుచుండిరి. అజ్ఞానజను లీ వనమును దూరమునుండియే విలోకించు చుండిరి. పుష్పఫలయుక్తమై శోభాయమానమైన యీ వనమును జూచుటచే సంపూర్ణముగ మనశ్శాంతి యగును.

వైరాగ్యమున శిరోభూషణుడును, వైష్ణవుడును, మహాజ్ఞానియు భగవంతుని కత్యంత రంగభక్తుడును, పరమోదారుడును నగు రాకా కుంభా రను భక్తు డుండెను. ఆతడు గుజరాతీదేశమునుండి పంఢరీక్షేత్ర మును సేవించుటకై వచ్చి యచ్చటనే నివసించుచు, దన కులవృత్తియగు కుండలను చేయుటను కొనసాగించుచు, తన్మూలమున వచ్చు ద్రవ్య ముతో నతిథ్యభ్యాగతుల నాదరించుచుండెను. ఆతని భార్యయగు 'బాంకాబాయి' పరమ భావుకురాలును, పతివ్రతాశిరోమణియు, భర్తృ సేవాపరాయణియునై యుండెను. ఈ దంపతు లిరువురకును, లావణ్య ఖనియు, గుణవతియునగు 'వంకాబాయి' యను పుత్రిక కలిగెను. రాకా కుంభారును, నతని భార్యా పుత్రికలును నిత్యము ప్రాతఃకాలముననే లేచి చంద్రభాగానదిలో స్నానముజేసి శ్రీ పంఢరీనాథుని దేవాలయము నకు బోయి యాలింగన వందనాదులతో సేవించుచు పిదప దమ పని పాటలు చూచుకొని రాత్రివేళలయందు భక్తులతో గలిసి సభామంటప

మున తంబుర తాళ మృదంగాది వాద్యములతో నఖండముగ హరినామ సంకీర్తనల జేయుచుండిరి.

ఇట్లు కొంత కాలము జరిగిన పిదప రాకాకుంభారు తానుచేసి నిలువయుంచిన కుండలను గాల్చుట కావము వేసెను. ఆతని యింటి యందున్న యొకపిల్లి యాకుండలలో దనకూనలనుబెట్టి యాహారమునకై బయటకు బోయెను. రాకాకుంభారున కది తెలియక నాయావమునకు నిప్పంటించెను, అగ్ని నలుదిశలను వ్యాపించెను. పిల్లికూనలుకల కుండయు నాయావమునందే యుండెను. అంత పిల్లి యిల్లంతయు వెదకి తన కూనలును, కుండలును గనబడనందున త్వరితముగ వెలుపలికి వచ్చి యఱచుచు నావముచుట్టును దిరుగుచుండుటను జూచి "ఈయావములోని కుండలలో దీని కూన లుండవచ్చును. అందుచే నీపిల్లి యరచుచు దిరుగు చున్న"దని తలంచి నేలపైబడి దొరలుచు లలాటమును, గుండె బాదుకొని యేడ్చుచుండెను. తత్క్షణమే బాంకాబాయి వచ్చి విచారింపగా "మనవలన గొప్ప యన్యాయము జరిగినది, పిల్లి యాకుండలలో దనకూనలను బెట్టినది. అది నాకు తెలియక నావములో వేసితిని. స్తన్యపాన మిచ్చుటకై కూనల గానక నీపిల్లి యరచుచు దిరుగుచున్నదని" చెప్పగా నామెయు నేలపైబడి దొరలు చుండెను.

పిదప దంపతు లిరువురును, శ్రీ పంఢరీనాథుని కరుణాకర శబ్దములతో నీవిధముగా ప్రార్థించుచుండిరి. "ఓ దేవాదిదేవా! రుక్మిణీకాంతా! సత్వరమే మమ్ము గాపాడుము. లాక్షాగృహదహన సమయమున పాండవుల రక్షించితివి. ప్రహ్లాదు నగ్నినుండి రక్షించి యాతని తండ్రిపెట్టిన బాధలనుండి కాపాడితివి. ఈపిల్లి తమోగుణ యుక్తమగు పశుజాతిలోనిది. నిన్ను జింతించుట దానికి దెలియదు. నీవు కృపాసాగరుడవు. దీని కూనలను దత్క్షణమే గాపాడుము". బాంకాబాయి భర్తను జూచి "ప్రాణేశ్వరా! శ్రీ పంఢరీనాథునకు ముదుపేమైన గట్టినచో త్వరితముగ నాతడు రక్షించు"నని చెప్పెను. అంత రాకాకుంభారు "ఓ దేవాదిదేవా! పతితపావనా! కృపాసాగరా! ఈ యావమునుండి

పిల్లికూనలను రక్షించినచో నేను సంసారమును త్యజింతును ఇది యే ముదుపుగా నేర్పాటు చేసితి"నని చెప్పెను.

దంపతు లిరువురును భూమిపైబడి పొరలుచు నశ్రు ధారలువిడచు చుండిరి. ఆవమునుండి కాలిన బూడిదయంతయు గాలి కెగిరి యా యిరువురపై బడుచుండెను. వేడిగా నగ్ని జ్వాలలు వచ్చుచుండెను. ఆదంపతు లిరువురును కదలక నిశ్చేష్టులై యటులనే పడియుండిరి. రెండహోరాత్రములు లటులనే కాలి యాయావము చల్లారెను. బాంకాబాయి రోదనము జేయుచు "శ్రీహరీ! విఠలా! సత్వరమే మమ్ము రక్షింపు"మని ప్రార్థించు చుండెను మూడవదినమున నగ్ని చల్లారెను. పిల్లి యావముచుట్టు నరచుచు నటులనే దిరుగుచుండెను. శ్రీ పంఢరీనాథుని కృపావిశేషముచే నాయావములోని పిల్లికూనలు తల్లి యరపువిని కూయుచుండెను. రాకాకుంభారుడు, నతని భార్యయును, నావములోని కుండల నొక్కొక్కటియు, దీయుచు బరీక్షించి చూడగా నొకకుండ మాత్రము కాలక నందు మూడు సజీవములగు పిల్లికూన లుండెను. అది చూచి యాదంపతు లిరువురును, నమితానంద భరితులై కృపావంతుడగు శ్రీ రుక్మిణీ రమణుడు రక్షించె నని భగవంతుని బరిపరివిధముల గొనియాడుచుండిరి. మూడు దినముల పర్యంత మన్నహారములులేని, యశక్తత తొలగి వారిరువురు నుల్లాసముతో శోభించుచుండిరి. దీపమునకు తైలము బోసిన బూర్ణ ప్రకాశము గలిగి యుండునట్లును, బృధ్విపై వర్షము కురిసిన తృణము వృద్ధియగునట్లును, కృపణునకు ధనము దొరకిన నానందించు నట్లును, సూర్యోదయముచే సరోవరములోని కమలములు వికసించు నట్లును, రాకాకుంభారుని యొక్క మన స్సమితోత్సాహముతో నుండెను. పంఢరీపురమునగల జనులెల్లరును రాకాకుంభారుని భక్తి ధన్యమైనది. శ్రీ రుక్మిణీకాంతు డావమునుండి పిల్లికూనలను రక్షించెనని పరిపరివిధముల గొనియాడుచుండిరి.

పిదప రాకాకుంభారు భార్యనుజూచి "మన యావమునుండి పిల్లి కూనల రక్షించినచో సంసారమును త్యజించెదమని శ్రీ పంఢరీనాథు

నకు ముడుపు గట్టితిమి. దేవాధిదేవుఁడు పిల్లి కూనలను రక్షించెను. కాన మనమిప్పుడే సంసారమును త్యజింపవలె"నని చెప్పి పశ్చాత్తాప చిత్తుఁడై గ్రామమునగల బ్రాహ్మణులను యాచకజనులను బిలచి తానొక కౌపీనమును ధరించి భార్యకొక కౌపీనమిచ్చి గృహమునగల సర్వస్వము ధర్మము జేసి శుద్ధభావముతో నుదర పోషణకై యడవిలో గాష్ఠముల నేరుకొనుచు నవి విక్రయించి తన్మూలముగ వచ్చు ద్రవ్యముతో నతిథుల నాదరించుచు శేషించిన దానితో దానును భార్యయు, కుమార్తెయు. భుక్తి జరుపుకొనుచు నహోరాత్రము లందును ప్రేమతో శ్రీ పాండురంగ దేవుని భజించుచుండిరి. మార్గమున బోవుచుండ దారిలో బడియుండు గుడ్డపేలికల నేరుకొని వస్త్రముగా గుట్టి మానసంరక్షణ జేసికొనుచుండిరి. ఇదితప్ప నితరు లెవ్వరేని మంచివస్త్రముల నీయవచ్చినచో నంగీకరింపరైరి. ఒకరోజున రాకాకుంభారు నామదేవుల వంశీయులగు దర్జీకులస్థుల యిండ్ల వెలుపల బారవేసిన గుడ్డలతునకల నేరుకొనుచుండగా నొక దుర్జనుడుచూచి "వైరాగ్య శీలురీ తునకలను దీయరాదు. ఇవి దివిటీల కుపయోగించు"నని చెప్పగా రాకాకుంభా రవి యిచ్చుటనే బారవేసి తన భార్యతో "మన మనుచితకార్యము జేయుచుంటిమి. మనము ధరించు నీతునకలు దివిటీల కుపయోగ పడును. కాన నవి తత్క్షణమే తొలగించి మానసంరక్షణకు గళితపత్రముల నుపయోగించు కొంద"మని చెప్పెను. నాటి నుండియు వారు బ్రాహ్మణులు భోజనానంతరము పారవేసిన యెంగిలి యాకులతో దమ మానమును గాపాడుకొనుచుండిరి.

ఎందరో విరాగులు జగత్తులో జన్మించిరి. కాని రాకాకుంభారునకు సము లెవ్వరును లేరు. ఆతని వైరాగ్యవృత్తి కుపమానముగ వర్ణించుటకు పదములు కరవైనవి. పృథ్వియొక్క బరువును, విస్తీర్ణమును వర్ణించుట సాధ్యముకాన ట్లీతని వైరాగ్యవృత్తిని వర్ణింప నలవికాదు. భాస్కరుని బట్టుకొనుటయు, గాలిని బంధించుటయు సాధ్యము కానట్లు భగవద్భక్తుల మహిమవిశేషములను వర్ణించుటకు సాధ్యముకాదు. ఆత

డితరజీవములను రక్షించుటకై సంసారమును త్యజించెను. జగమున నెందరో కామ్యభక్తులు దేవతల నారాధించి సంతాన ధన మానము లను గోరి యవి పడసిన తరువాత ముడుపులును, మొక్కులును దేవుని సమక్షమున నారికేళఫలయుక్తముగ నర్పింతురు. రాకాకుంభారట్లుకాక పిల్లికూనలను రక్షించిన సంసారమును త్యజింతునని వైకుంఠనాయకునికి ముడుపుగట్టి తన సర్వస్వమును త్యజించెను. కాన నితనికి సామ్యముగా వర్ణించుటకే భక్తుడును జాలడు.

ఒకానొకదినమందు రాకాకుంభారు కుమార్తెయగు 'వంకాబాయి' స్నానమునకై చంద్రభాగానదికి బోయెను. ఆ సమయముననే నామదేవుల కుమార్తెయగు 'లింబాబాయి' చంద్రభాగా తీరమున వస్త్రము లుదుకుచుండెను. పిదప 'వంకాబాయి' స్నానముజేసి ఘట్టముపై కూర్చుండి మానసికపూజ జేయుచుండ నామదేవుల కుమార్తె బట్ట లుదుకుచున్న నీ రామెపై బడుచుండెను. అంత 'వంకాబాయి' "అమ్మా! నేను స్నానముజేసి మానసికపూజ జేయుచున్నాను. బట్ట లుదికిన నీరు నాపై బడుచున్నది. కాన కొంచెము మెలగా నుదుకు" మని చెప్పెను. అంత నామదేవుల కుమార్తె క్రోధముతో "ఓ కుమ్మరి పిల్లా! ఏమి నీకు మడి యాచారము లెక్కువైనవి. మీరు సుఖమగు సంసారమును త్యజించి యింటింటికి దిరుగుచున్నారు. నీ తండ్రి కామ్య భక్తుడు. శ్రీ పంఢరీనాథునికి ముడుపుగట్టి సంసారమును త్యజించి వానిని గష్టపెట్టుచున్నా" డనెను. అంత 'వంకాబాయి' "నిజము పలికితివి. తల్లి నీ తండ్రికీర్తి యంతయు జగత్తునకు దెలియును. బౌద్ధరూపమున నున్న శ్రీ పంఢరీనాథుని "భుజించెదవా? లేక తల బగులగొట్టుకొమ్మనెదవా?" అని నిర్బంధముగా భుజింపించెను. నీతండ్రి భగవంతుని గష్టపెట్టుచుండెను. కాని నాతండ్రి యెన్నడును గష్టపెట్టలే" దని చెప్పెను. నామదేవుల కుమార్తె క్రోధముతో నిల్లుజేరి, దేవాలయమునుండి యప్పుడే వచ్చిన తండ్రితో చంద్రభాగానదీతీరమున జరిగిన సర్వవృత్తాంతమును విపులముగా జెప్పి "ఆ కుమ్మరిపిల్ల కలియుగమున బౌద్ధరూపమున నున్న

భగవంతుని మీాకు కష్టపెట్టుచున్నారని బహువిధముల నిందించినది. దాని తండ్రి నిరపేక్షుడనియు, నతివిరక్తుడనియు, నడవిలోని కాష్ఠముల నేరుకొని బజారులో విక్రయించి తనూర్మాలముగ వచ్చు ద్రవ్యముతో నుదరపోషణ జరుపుకొనుచుండె ననియు జెప్పిన"దని చెప్పెను.

పుత్రిక చెప్పిన వాక్యములు విని నామదేవులు విస్మయపడి, దేవాలయమున బ్రవేశించి, శ్రీ పంఢరీనాథునకు సాష్టాంగ నమస్కారము జేసి "ఓ దేవాధిదేవా! రుక్మిణీకాంతా! ఈ క్షేత్రమున గల రాకా కుంభారు డను భక్తుడు నిరపేక్షుడా? లేక కామయుక్తుడా? చెప్పు" మని యడిగెను. శ్రీ పంఢరీనాథుడు హాసితవదనుడై "ఓ నామదేవా! రాకా కుంభారునితో సమమగు వైరాగ్యశీలుడగు భక్తు డీ పృథ్వియందు గన బడ" డని చెప్పగా నామదేవుడు "ఓ వైకుంఠపతీ! ఆతని విరక్తిస్థితిని నాకు జూపు" మని కోరెను. శ్రీ పంఢరీనాథు డవశ్యమని చెప్పి రుక్మిణీ దేవిని బిలచి నామదేవుని చేయి బుచ్చుకొని, సావతాభక్తుని వెంటబెట్టుకొని రాకాకుంభారు వసించుచున్న యరణ్యములో బ్రవేశించెను. ఆ సమయమున భాస్కరుడు ద్వాదశకళలతో ప్రకాశించుచుండెను.

అరణ్యమున రాకాకుంభారు నోటితో భగవన్నామము నుచ్చరించుచు గాష్ఠముల నేరికొనుచుండెను. బాంకాయియును, వంకాయియును నరణ్యమునందే కాష్ఠముల నేరుచుండిరి. రాకాకుంభారు రెండుకాష్ఠములు లొకేప్రదేశమున నున్నచో నిది యెవ్వరో యుంచుకొనిరని త్యజించి యేకముగ నగపడు కాష్ఠనుమాత్రము దీయుచుండెను. భూమిపై నడచునపుడు పాదములక్రింద సూక్ష్మజంతువులు పడకుండ బహు జాగ్రత్తతో జూచుచు నడచుచుండెను. ఈ కౌతుకమును జూచి శ్రీ పంఢరీ నాథుడు విస్మితుడై నామదేవ సావతాభక్తులకును, శ్రీ రుక్మిణీదేవికిని, "అదుగో! పరమ విరక్తుడగు రాకాకుంభారు, తన పాదముక్రింద సూక్ష్మ జీవములు పడకుండ నతి జాగ్రత్తతో జూచుచున్నాడు. అతడు సకామ భక్తుడో, నిష్కామభక్తుడో యోచింపు" డనెను.

అంత నామదేవులు "ఓ రుక్మిణీమాతా! నీవు రాకాకుంభార భక్తుని బరీక్షింపు" మని చెప్పగా నామె యమూల్యమగు రత్నకంకణమును నామదేవులచేతి కిచ్చెను. నామదేవులా కంకణము నా వనము నందు రాకాకుంభారునకు సమీపమున బడునట్లు విసరెను. రుక్మిణీదేవి యా కంకణముపై గాహ్యామునకు గనబడకుండ నొక కాష్ఠమును పైచెను.

శ్రీ పంఢరీనాథుడును, రుక్మిణీదేవియు, నామదేవ సావతా భక్తులతో జాటువనుండి విలోకించుచుండిరి రాకాకుంభారును నాతని భార్యయు గాష్ఠములేరుచు నొక కాష్ఠమునుదీయ సువర్ణరత్న కంకణ మగుపించెను. అమూల్యమగు నాకంకణమును విరక్తుడగు రాకాకుంభారును, నాతని భార్యయుజూచి తామేరిన కాష్టముల నచ్చటనే బారవైచి "ఏకాంతముగ నీ యరణ్యమున నీశ్వర భజనతో గాలము గడపుచున్న మనకు విఘ్నము సంప్రాప్తించినది, ప్రపంచ వ్యామోహములను త్యజించి, పంఢరీనాథుడే గతియని దృఢముగా దలచి యిచ్చట వసించుచుండ నీ హేమ కంకణము మన కనర్థము కలుగ జేసినది. మన మిచ్చట వసించుట కధికారము లేద"ని యాయడవినుండి భార్యాపుత్రికలతో రాకా కుంభారు పారిపోవుచుండెను. శ్వానము స్పృశించిన యన్నమును ద్విజులు త్యజించినట్లును, భూజలమును జాతకములు వర్జించినట్లును, శరీరమునకు తైలము బూసిన మక్షికములు స్పృశింపనట్లును, నిది మన కనర్థమని కంకణమును త్యజించి రాకాకుంభారును, నతని భార్యా పుత్రికలును బరుగిడు చుండిరి.

అంత నామదేవులు పంఢరీనాథుని సంబోధించి "విశ్వవ్యాపకా! భక్త భూషణా! ప్రేమతో త్రికరణశుద్ధితో నిన్ను భజించుచున్న రాకా కుంభారునకు సగుణ స్వరూపముతో దర్శన మీయవలెనని" కోరగా శ్రీ రుక్మిణీవరుడు హసితవదనుడై "ఓ నామదేవా! నీకింకను సంశయ మున్నదా?" అని యడుగ నామదేవులు సాష్టాంగ నమస్కారము జేసి "ఓ దేవాధిదేవా! రాకాకుంభారుతో సముడగు విరక్తుడీ పృథ్వియందు



రాకాకుంభార్ దంపతులకు శ్రీ పండరీనాథుడు దర్శనమిచ్చుట.

న్నట్లు కని విని యెరుంగమని" చెప్పెను. కృపా సాగరుడగు శ్రీ పంఢరీ నాథుడు రుక్మిణీ సమేతముగ, బాలిపోవుచున్న రాకాకుంభారునకు సమ చరణ యుక్తుడై కటిహస్తుడై యమూల్య పీతాంబర ధారియై రత్న ఖచిత కిరీట ధారియై, మకరకుండల శోభితుడై శ్యామల వర్ణముతో సాక్షాత్కార దర్శన మొసంగెను. రాకాకుంభారును, నాతని భార్యాపుత్రికలును, శ్రీ రుక్మిణీ పాండురంగ దేవుల నాలింగన వందనాదులు జేసుకొనిరి. పిదప భగవంతుడు రాకాకుంభారును, నతని భార్యాపుత్రికలను గృపాదృష్టితో ననుగ్రహించి "భక్తులారా! మీరిహలోకమున గొంత కాలముండి యఖండముగా నా నామసంకీర్తన జేయుచు జడమూఢుల దరింపజేసి యవసానమున నా సన్నిధిని జేరుడని చెప్పి యంతర్థానుడయ్యెను. రాకాకుంభారు తన భార్యా పుత్రికలతో భగవదాజ్ఞ ప్రకారము భూలోకమున నఖండ హరినామ సంకీర్తనతో జీవితమును గడపి యంత్యమున నీశ్వర సాయుజ్య మంగీకరించెను.

సప్త దశాధ్యాయము సమాప్తము

స ర్వే శ్వ రా య న మః

# గోరా కుంభార్ చరిత్ర

## —♦ అష్టాదశాధ్యాయము ♦—

జయజయ భక్తవత్సలా, రుక్మిణీకాంతా, దీనబంధూ, అనాథనాథా, నిజభక్త సౌఖ్యదాతా, జయజయ అనంతావతారా, కృపాసాగరా, కరుణాలయా, గుణసముద్రా, యాదవరాయా, జయజయ విశ్వపతీ, విశ్వేశ్వరా, కైవల్యదాయకా, అత్యుదారా, భక్తభూషణా, జగదుద్ధారా, నిజభక్త హృదయనివాసీ, జయ కమలాపతే, కమలలోచనా, అక్షయరూపా, చైతన్యఘనా, విశ్వకర్తా, రాజీవనేత్రా, దీనోద్ధారా, పాండురంగా! నిజభక్తుల ప్రమాదములను దత్క్షణమే నీవు నివారణజేసి భక్తకార్యములను నిర్లజ్జతో జేయుచుందువు. నీ భక్తుల సచ్చరిత్రలను నీవే చెప్పించుచున్నావు. నా బుద్ధి యస్వతంత్రము. నేను నిమిత్తమాత్రుడను. నా వాక్కునుండి భక్తుల సచ్చరిత్రలను బూర్తిగా జెప్పింపుము.

నిజాం సంస్థానములో 'తేరఢోకి' యను పేరుగల గ్రామముండెను. ఆ గ్రామమందు కుమ్మరికులమందు జన్మించిన గోరాకుంభా రను భక్తుడు నివసించుచుండెను. అతడు గృహస్థధర్మములో భార్యతోడను, నేకవర్ష ప్రాయుడగు కుమారునితోడను గలిసి ప్రపంచ వ్యవహారములను జూచుచు శ్రీ పాండురంగదేవుని భజించుచుండెను. భుజించునప్పుడును, నీరు ద్రావునప్పుడును, గమనమందును, కూర్చుండి యున్నప్పుడును, విశ్రాంతి దీసికొనుసమయమునను, ప్రపంచ వ్యవహారముల జూచుకొనునప్పుడును, సంతతమును నఖండముగా శ్రీ పంఢరీనాథుని నామమును శ్వాస నిశ్వాసలందు సహితము భజించుచుండెను. మంచి చెడ్డలను, సుఖ దుఃఖములను, మానావమానములను, రాజును సేవకుని, శ్రీమంతుని దరిద్రుని, సమముగ జూచుచుండెను. అతడు నియమముతో నేకాదశీవ్రతము ననుష్ఠించుచు, నాషాఢ కార్తీక శుద్ధైకాదశులందు నియమముతో బంఢరీపురమునకు బోయి యానందముగ బ్రహ్మోత్సవమును సేవించుచుండెను.

ఇట్లు కొంతకాలము జరిగిన పిదప నొక దినమున గోరాకుంభారు కుండలను జేయుటకై మట్టి త్రొక్కుచుండెను. ఆతని భార్యయగు కమలాబాయి బిందెను దీసికొని జలమును దెచ్చుటకు బోవుచు "ప్రాణేశ్వరా! ఇంటిలో జలములేదు నేనొకక్షణములో జలము దీసికొని వచ్చెదను. పిల్లవాని నాడించుమని యొప్పగించుట కిరుగు పొరుగు పిల్లలెవ్వరును గనబడుటలేదు. వాకిట పిల్లవా డొంటరిగ నున్నాడు. మీ దృష్టి వానిపై నుంచు' డని చెప్పి వెళ్లెను. గోరాకుంభారు దేహభ్రాంతి విరహితుడై నేత్రములు మూసికొని హృదయములో శ్రీ విఠలమూర్తిని నిలిపి నేత్రములనుండి యానందాశ్రుధారలను విడుచుచు నద్వైత రూపుడై యుండెను వాకిటనున్న బిడ్డడు తల్లి కనబడనందున నేడ్చుకొని వారెవ్వరును లేకపోవుటచే బరికించుచుండ దనతండ్రి మట్టి త్రొక్కుచుండెను. ఆ బాలుడు దుల్లాసములో ప్రాకుచు తండ్రి త్రొక్కుచున్న మట్టి గోతియొద్దకువచ్చి చేతులెత్తి సంజ్ఞ జేయుచుండెను. పరవశుడైయున్న గోరా కుంభారు తనబిడ్డడు ప్రాకుచువచ్చుటను గోతిప్రక్కన జేతులెత్తి సంజ్ఞ జేయుటయు నెఱుంగక యథాప్రకారము మట్టిద్రొక్కుచుండెను. ఆకస్మికముగా నా బాలుడు గోతిలోబడి జనకుని పాదముల బట్టుకొన జేయిజారి యాతని పాదములక్రిందబడిన యాబిడ్డ నా మట్టిలోనే కలియద్రొక్కబడుచుండెను

కమలాబాయి జలమును దీసికొనివచ్చి జలభాండము నింటబెట్టి స్తన్యపానమిచ్చుటకు వాకిలిలోనికి వచ్చిచూడగా బిడ్డడు కనబడనందున తన మిత్రులగు నిరుగుపొరుగుస్త్రీ లెవరైనను దీసికొనిపోయిరేమోయని తలచి విచారించి, యెచటను గుమారుని జాడ తెలియక భర్తనుబిలచి "ప్రాణేశ్వరా! నేనిప్పుడే బిడ్డను మీ కప్పగించిపోయితినిగదా! ఎవరు తీసికొనిపోయిరి? తెలుపుము". అని యడిగెను. పాండురంగ ధ్యానమునందు నిమగ్నుడైయున్న గోరాకుంభారు భార్యకు ప్రత్యుత్తరము బలుకనందున నామె "ఓ ప్రాణనాథా! పలుకరేమి? బిడ్డడెచ్చటను నగుపడుట లే" దని చెప్పి భర్తదగ్గరకు బోయి క్రిందికి జూడగా నా



గోరాకుంభార్ తన బిడ్డను
మట్టిలో కలయద్రొక్కుట.

యదుసుగోతిని, రక్తము కనబడుటచే బరీక్షించిచూడ నస్థిపంజరము, మాంసము, ఎముకలు, రక్తము, సర్వావయవములు తునాతున కలై మట్టిలో గలియద్రొక్కబడియుండుటను, జూచి గుండె బాదుకొని విలపించుచు "నీ భక్తి పాడుకాను. వ్యర్థముగా నా గర్భరత్నమును మట్టిపాల్జేసితివి. చాలు నీక నీ సంసారము. నే నిప్పుడే ప్రాణత్యాగము జేసికొనెద" నని యొడలు తెలియక "భగవద్భక్తి యని విపరీతముగ బిడ్డను జంపితివి. నీవును నీ దేవుడును నాశనము కం" డని కఠోరముగ బలుకుచుండ నద్వైతస్థితియందున్న గోరాకుంభారు సావధానుడై "ఛీ దుష్టురాలా! నా ధ్యానమును భంగముజేసితివి. నీకు కొంచెమైనను జ్ఞానములేదు. నా హృదయకమలమునందు రుక్మిణీకాంతుడు వసించి యుండ కఠోరవాక్యములు బలుకుచు నా ధ్యానమును భంగముజేసితి" వని పలికి సక్రోధుడై యచ్చటనున్న చక్రదండమును దీసికొని భార్యను గొట్టబోయెను. అంత నామె భీతితో క్రోధముతోనున్న భర్త తన్ను గొట్టునని భయముజెంది "ఆగుడు. నన్ను దాకినచో శ్రీ విఠోబా చరణములకు మీరు తప్పినట్లు" అని యాన (ఒట్టు) నెట్టెను.

గోరాకుంభారు తన భార్య పెట్టిన యాన నాకర్ణించి క్షమాశాంతియుక్తచిత్తుడై యేకాంతముగ నింటిలో నొకచోట గూర్చుండి హరినామస్మరణ జేయుచుండెను. ఆ గ్రామమున గల స్త్రీ పురుషులును, గోరాకుంభారుని బంధుమిత్రులును జేరి యాతనితో "ఎంత విపరీతమును జేసితివి. లేక లేక కలిగిన ముద్దుబిడ్డను మట్టియందు గలిపితి" వని యొక్కొక్క రొక్కొక్క విధమున ద్రివిధజనులను నపశబ్దములతో హేళనజేయుచుండిరి. పట్టపుటేనుగు, రాజమార్గమున బోవుచుండ శ్వానములెన్ని యరచినను నిర్లక్ష్యముతో సాగిపోవునట్లును, రాజసభయందు శాస్త్రార్థమును జెప్పుచుండ మూర్ఖుడు ప్రశ్నించినచో పండితుడు నిర్లక్ష్యముతో జూచునట్లును, నగస్త్యుని జూచిన సముద్ర మట్టహాసముతో గర్జన చేయుచుండ నాతడు లక్ష్యము చేయక ననుష్ఠానము నందున్నట్లును, వైనతేయుని యెదుట భయంకర సర్పము పడగ

విప్పి క్రోధముతో బుసకొట్టుచుండ నాత డణుమాత్రమును భయపడ నట్లును, వచ్చిన స్త్రీ పురుషు లెల్లరు నిందించుచుండ గోరాకుంభారు చిత్తమున గొంచమైనను శంకింపక తనకుగల యొకే బిడ్డను మట్టిలో గలయద్రొక్కితినను స్మరణయు లేక సంసార సుఖమునం దిచ్ఛలేక శ్రీ విఠ్ఠలనాథుని భజించుచుండెను.

గోరాకుంభారును, నాతనిభార్యయు నొకరితో నొకరు మాట్లాడు కొనకనే కొన్నిదినములు గడపిరి. పిదప నొకదినమున నాతని భార్య యాలోచించి తనతో భర్తయు, భర్తతో దానును మాటలులేక నన్న పానాదులు సహితము ద్యజించి యెన్ని దినములు గడుపుదుము. ఇట్లుం డినచో గృహస్థ ధర్మమెట్లు జరుగునని తలచి పాత్రతో జలముదీసికొని భర్త పాదముల గడుగుటకై పోయెను. "రా జన్యాయము జేసిన ప్రజ లేమి చేయవలయును? అట్లే భర్తను శిక్షించుటకు నాకధికార మేమున్న దని" చింతించి చరణ క్షాళన జేయుటకై భర్త పాదములను స్పృశింప బోయెను. తత్క్షణమే గోరాకుంభారు దిగ్గున లేచి "ఆగుము. నిన్ను స్పృశించినచో విఠోబాదేవుని పాదములు తప్పినట్లని యాన వెట్టితివి. నీకును, నాకను నాక్షణమందే దాంపత్య ఋణము తీరివది. దేవుని చర ణములపై బెట్టిన యానను నేనెన్నటికి నతిక్రమింప జాల"నని చెప్పెను.

భర్త చెప్పిన వాక్యములనువిని కమలాబాయి చేతులు జోడించి "ప్రాణేశ్వరా! నే నజ్ఞానముచే బల్కిన పల్కులు మనమునం దుంచు కొనక నన్నంగీకరింపుడు. మీరిట్లు పట్టుదలతో నున్నచో ప్రపంచవ్యవ హారమెట్లు జరుగును. గృహకృత్యములం దెన్నియో యపశబ్దములు బలుకుట తటస్థించు చుండును. మీరు మనమునందుగల సందేహమును దొలగించు కొం"డని చెప్పెను.అంత గోరాకుంభారు తన భార్యనుజూచి "సూర్యుడు పశ్చిమమున నుదయించినను, బంజరములో వాయువును బంధించుట సాధ్యమైనను, ఘటములో నాకసమునుంచుట తటస్థించి నను, మేఘములకు భయపడి పవనుడు పలాయన మొనను భూతము

నకు భయపడి యముడు పారిపోయినను, కల్పాంతమైనను నే నాయాన నతిక్రమింప" నని చెప్పెను. వైష్ణవభక్తుడు పలికిన పలుకులువిని యాతని భార్య చింతాక్రాంతురాలై యిట్లైనచో వంశ మంతరించునని తలంచి భర్తకు దిరిగి వివాహము చేయ నెంచి మాతృగృహమున కేగి జరిగిన వృత్తాంతమంతయు జననీ జనకులకు దెలిపి వంశ మింతటితో నంతరింప కుండుటకు దగిన యుపాయ మాలోచింపుడని చెప్పెను. కమలా రె వచనముల నాకర్ణించి యామె జననీ జనకులును, సోదరియు దుఃఖసాగరమున నిమగ్నులైరి. పిదప కమలాబాయిజననీ జనకులను జూచి "బంధువులలో మిగుల నవమానముగానున్నది. భర్త నన్ను ద్యజించెను. మరల వివాహముజేయనిచో వంశక్షయమగును. కాన నా ప్రార్థన నంగీకరించి నా చెల్లెలగు విమలనిచ్చి వివాహముజేయుట యుక్త"మని చెప్పి వారల సమాధాన పరచి తగునేర్పాట్లన్నియు జేసెను. పిదప కమలాబాయి భర్తయొద్దకువచ్చి దూరమునుండి నమస్కరించి "ప్రాణేశ్వరా! నా ప్రార్థన నంగీకరింపుడు. నేను మీకపచారముజేసితిని. తత్ఫలిత మనుభవించుచున్నాను. వంశాభివృద్ధికై నా చెల్లెలగు విమలను మీకిచ్చి వివాహముజేయుటకు దగు నేర్పాట్లుచేసితిని. దయచేసి నా వెంటరండ"ని ప్రార్థించి గ్రామమునగల బంధుమిత్రాదులకు జెప్పి వారిని వెంటబెట్టుకొని భర్తతో మాతృగృహమున కేగుచుండెను.

గోరాకుంభారు వెంట బోవుచున్న బంధుమిత్రాదు లెల్లరును "వీడు భగవద్భక్తుడైయుండి భార్యను ద్యజించెను. ఇది మిగుల విపరీతమగు కార్యము. గృహస్థులెవ్వరును దీని నంగీకరింప"రని పరిపరి విధముల జెప్పుకొనుచుండిరి. మ్లేచ్ఛునకు గాయత్రిపూజ యంగీకారముకానట్లును, ఖరమునకు చందన మయోగ్యమై యుండునట్లును, నిందకుడు భక్తుని ప్రేమింపనట్లును, భ్రిష్టు డాచారవిముఖుడుగ నుండునట్లును, నంత్యజునకు శాస్త్రవిచారణమం దాసక్తియుండనట్లును, దస్కరుడు చంద్రకాంతిని సహింపలేనట్లును, గృపణుడు ద్రివ్యదానవిముఖుడగునట్లును, జెవిటివానికి గానము రుచింపనట్లును, మాంసాహారున కహింసాతత్త్వము తెలి

యనట్లును, హింసకునకు భూతదయయుండనట్లును, దరిద్రునకు గల్ప వృక్షము కనబడనట్లును, నిజభక్తుల నిష్ఠ యభక్తులకు రుచింపనట్లును, బంధువర్గమునకు గోరాకుంభారు నడవడి రుచింపకుండెను.

గోరాకుంభారు భార్యతోను, బంధుమిత్రాదులతోను శ్వశుర గృహమును జేరెను. పరిసరగ్రామములనుండి బంధుమిత్రులు విశేషముగా జేరిరి. దేవబ్రాహ్మణ పురోహితులతోను నానావిధములగు మంగళవాద్యములతోను కమలాబాయి యాజమాన్యమున గోరాకుంభారునకును, విమలకును, నతివైభవముగ వివాహము జరిగెను. ద్విజోత్తములు మంగళాష్టకములు పలికి సావధాన, స్వస్తివచనములతో వధూవరుల నాశీర్వదించిరి. నాలుగుదినముల వివాహవైభవము పూర్తికాగానే గోరాకుంభారు తన యత్తమామలకు నమస్కరించి స్వస్థానమునకు బోవ ననుజ్ఞనిమ్మని కోరెను. అంత వారిరువురును నవివేకముతో నాతడిరువురు భార్యలను సమముగాజూడనిచో బంధువులు దాముసహింపజాలరని యాలోచించి జామాతతో నిట్లుపలికిరి. "నాయనా! నీవన్ని ధర్మములు బాగుగ నెఱిగినవాడవు. మాపుత్రికల నిరువురను నీకే యిచ్చితిమి. కాన నీవాయిరువురను సమానముగా జూచుచుండవలయును. హెచ్చుతగ్గులుగ చూచినచో (శ్రీ) విఠోబాదేవుని చరణముల దప్పిన ట్లానబెట్టుచున్నా"మని పలికిరి. అంత గోరాకుంభా రానందముతో బరవశుడై "ఓ భక్తవత్సలా! కృపాసాగరా! బంధములెల్లను వీగిపోయెను. భక్తులు విషయాచరణలో నుండుటను నీవు సహింపవు. నన్ను సర్వవిధముల నాదినుండియు గాపాడుచుంటి"వని భగవంతు ననేకవిధముల ప్రార్థించి స్వస్థానమునకుజేరెను.

పిదప గోరాకుంభారు సంతోషచిత్తుడై యిరువురు భార్యలను సమముగ జూచుచు వారలకు వస్త్రభూషణాదుల సమముగ దెచ్చి యిచ్చుచు బెద్దభార్యను 'పెద్దమ్మ', చిన్నభార్యను 'చిన్నమ్మ' యని పిలుచుచుండెను. ఇట్లు కొంతకాలము జరిగిన పిదప నొకదినమున

కమలాబాయి భర్తను జూచి "ప్రాణేశ్వరా! నేను మీ కపరాధము జేసి దూరమైతిని. నిరపరాధియగు నా చెల్లెలిని దూరముచేయుట కేమి కారణమో తెలుపు" డని కోరగా, గోరాకుంభా రిట్లు ప్రత్యుత్తరము జెప్పెను. "వివాహానంతరము నీ జననీ జనకులు మీ యిరువురను సమముగ జూడుమని నా కాజ్ఞాపించిరి. నే నట్లు ప్రవర్తింపనిచో విఠోబా దేవుని చరణముల దప్పినట్లని యాన వెట్టిరి. మీ జననీ జనకులు పెట్టిన యానకు బద్ధుడనై నిష్పక్షపాతముగ బ్రవర్తించుచున్నా" నని చెప్పెను. గోరాకుంభారు చెప్పిన మాటలు విని కనిష్ఠభార్యయగు విమల మిగుల రోదనము జేయుచు దన యక్కను జూచి "స్వార్థముగ నా జీవితమును నాశనము చేసితివి. నాగతియే" మని విలపించుచున్న చెల్లెలిని కమలాబాయి సమాధానపరచెను.

ఒకనాటి రాత్రి గోరాకుంభారు హరినామ సంకీర్తనజేసి పిదప నేకాంతముగ నిద్రించుచుండ నాతనికాంత లిరువురును కృత్రిమ స్వభావముతో నాతని నియమభంగము గావింపదలచి గాఢముగ నిద్రించుచున్న భర్తయొద్దకు బోయి యిరువైపుల బరుండిరి. పిదప నా యిరువురును భర్త్రు కరములను దీసి తమ హృదయములపై వేసికొనిరి. ఉషస్సమయమున గోరాకుంభారు నిద్రమేల్కొని మేల్కొని తన కిరువైపుల నిరువురు భార్యలును నిద్రించియుండుటయు, దన కరములు వారి హృదయములపై వేసికొనుటయు జూచి చింతాక్రాంతుడై "ఈ హస్తద్వయము మిగుల పాపమున కొడిగట్టుకొనెను. వీటికి తగినశిక్ష విధింపవలె" నని యాలోచించి ఖడ్గమును దీసికొని వచ్చి స్తంభమునకు గట్టి, కరద్వయమును ఖండించుకొని దృఢచిత్తుడై గృహములో నేకాంతముగ గూర్చుండి హరినామసంకీర్తన జేయుచుండెను. కాంత లిరువు రీ దృశ్యమును జూచి గుండెలు బాదుకొని విలపించుచు, "ఎట్టి విపరీతకార్యము జరిగినది. ఇక కుటుంబపోషణ జరుగు నుపాయములేదు జీవితమంతయు బ్రజలలో నవమానము తప్ప" దని పరిపరివిధముల విలపించుచుండిరి.

అంత గోరాకుంభారు విలపించుచున్న కాంత లిరువురను జూచి "వ్యర్థముగా నేల విలపించెదరు? కుటుంబపోషణ విషయమై మీకు చింత యేల? దేవాధిదేవుడగు శ్రీ రుక్మిణీకాంతుడు మనపాలిటనుండ భయ పడెదరేల? కల్పవృక్షము నాశ్రయించినవాని కన్నవస్త్రాదులకు గొదువ యుండనట్లును, స్పర్శవేది లభించినచో నైశ్వర్యమున కంతుండనట్లును, నమృతపానము జేసినచో వ్యాధి యుండనట్లును, నోటితో 'రామకృష్ణ హరి' మంత్రములు జపించిన భవరోగము బాధింపజాలదు. కాన మీరుఖం డముగ దేవాధిదేవుడగు శ్రీ పంఢరీనాథు నహర్నిశములందును ధ్యానించుచుండు" డని చెప్పెను.

భక్తాభిమానియగు శ్రీ పంఢరీనాథుడు "గోరాకుంభారు భార్యల వలన హస్తములు ఛేదించుకొనెను. ఇక కుటుంబపోషణ జరుగు నుపా యము లేదు. తత్క్షణమే పోయి వానిని రక్షింపవలె" నని యెంచి విషయమంతయు శ్రీ రుక్మిణీదేవి కెఱింగించి గరుత్మంతుని బిలచి తాను కుమ్మరిగను, జగజ్జననియగు శ్రీ రుక్మిణీదేవిని కుమ్మరిస్త్రీగను, వైన తేయుని గాడిదగను జేసి పంఢరీపురమునుండి 'తేరఢోకీ' మార్గమున బోవుచుండెను. మార్గమధ్యమున గల జనులు విపరీతముగ చూచి "మీ గ్రామమేమి? ఎచటికి బోవుచుంటి" రని విచారింప శ్రీ పంఢరీ నాథుడు "తేరఢోకి గ్రామమున నున్న గోరాకుంభారు నింటికి బోవు చున్నా" మని చెప్పి గాడిదరూపముననున్న గరుత్మంతునిపై గూర్చుండి పోవుచుండ జనులెల్లరు బరిహాసించుటచే దాను దిగి రుక్మిణీదేవిని గూర్చుండబెట్టెను. ఇట్లు కొంతదూరమేగిన పిదప భర్త నడచుచుండ భార్య వాహనమెక్కినదని జనులు పరిపరివిధముల బరిహాసించుచుండ జన నింద లేకుండుటకై యిరువురును గార్దభముపై నధిష్ఠించిరి. వైనతేయుడు వారి నిరువురను మోయవలసివచ్చినదన్ని చింతించి తత్కాలమునం దదృ శ్యుడై గోరాకుంభారునింటియొద్ద దింపెను.

శ్రీ పంఢనాథుడు రుక్మిణీసమేతముగ కుమ్మరివేషముతో గోరా కుంభారుభక్తునికి సాష్టాంగనమస్కారము జేసి "ఓ భక్తరాజా! మేము

పంఢరీపురమున వసించు కుమ్మరులము. అచ్చట వృత్తి నశించి యుదర పోషణమార్గము లేక నీవు పనివారలకొఱకు ప్రయత్నించుచుంటివని తెలిసికొని యిచ్చటికి వచ్చితిమి. మేమిరువురము దంపతులము. మా యావజ్జీవితము మీసేవ జేసెదము. నే నన్నివృత్తుల నెరిగినవాడను.మాకు వేతనమీయ బనిలేదు. అన్న వస్త్రములిచ్చిన జాలు" ననెను. అంత గోరాకుంభా రాశ్చర్యముతో "నాయనా! పరమపవిత్రమగు పంఢరీ పురమునుండి వచ్చిన నీవు మాపాలిటి పాండురంగ దేవునివలె నున్నావు. మనమందర మేకకుటుంబీకులవలె దేవుని సేవించుచు గాలము గడుపుద" మని చెప్పగా శ్రీ పంఢరీనాథుడును, రుక్మిణీదేవియు నానందపరవశు లైరి.

పిదప నాటినుండియు భగవంతుడు గాడిదపై మట్టిని దీసికొనివచ్చి వేయుచుండెను. జగజ్జనని మట్టినినానబెట్టి యింటిలో వంటలుచేసి గోరా కుంభారునకును, నతనిభార్యలకును బెట్టి, మిగిలిన ప్రసాదమును భగ వంతుడును, దానును భుజించుచుండెను. శ్రీ పంఢరీనాథుడును, రుక్మిణీ దేవియు గోరాకుంభారునిచేతను, నాతనిభార్యలచేతను సేవనియు జేయ నీయక తామే పనులన్నియు చూచుకొనుచుండిరి. భగవంతుడు మట్టిని మెత్తగా మర్దనచేసి కుండలు చేయుటకై తనచేతనున్న సుదర్శనచక్ర మును కుమ్మరిసానగను, గదను కుండలుతట్టు దండముగను జేసి క్షణకాల ములో సంకల్పమాత్రమున ననేక భాండములను సృష్టించి యావములో నవియన్నియు వేసి కాల్చి యా భాండములను బంఢరీక్షేత్రమునకు గొని పోయి దేవాలయమున కెదురుగనున్న బజారులో యాత్రాజనులకు విక్రయించుచుండెను. భగవంతుని హస్తస్పర్శచే దయారుకాబడిన యా భాండములపై శంఖ చక్ర గదా పద్మాది విష్ణుచిహ్నములు చిత్రింపబడి యుండుటనుజూచి జనులెల్ల రత్యాశ్చర్యముతో క్షణకాలములో నా భాండములను గ్రయమునకు గొనిరి. పిదప భగవంతుడు ద్రవ్యమును దీసి కొని గోరాకుంభారు గృహమును జేరెను.

నామదేవులును, జ్ఞానదేవులును, శ్రీ పంఢరీనాథుని యాలయమునకు బోవుచు యాత్రాజనులయొద్దనున్న భాండములపై శంఖచక్రగదాపద్మాది విష్ణుచిహ్నము లుండుటజూచి దివ్యజ్ఞానముచే నివి సాక్షాద్భగవంతుని హస్తములచే సిద్ధముచేయబడిన భాండములని నిశ్చయించి గోరాకుంభారు గృహముననొక కార్మికుడు తయారుచేసి తెచ్చినవని యాత్రాజనులవలన దెలిసికొని తత్‌క్షణమే 'తేరఢోకి' గ్రామమును జేరి గోరాకుంభారునకు సాష్టాంగవందనములర్పించి నీ యింటనున్న కార్మికుని జూపుమని యడిగిరి. అంతర్గృహమున నున్న శ్రీ పంఢరీనాథుడును, రుక్మిణిదేవియు, జ్ఞానేశ్వర నామదేవులు వచ్చుటను జూచి గరుత్మంతునితో సహా యంతర్ధానులైరి. జ్ఞానేశ్వరులు గోరాకుంభారుని జూచి "ఓ భక్తశ్రేష్ఠా! నీ మహాత్మ్యమును వర్ణించుటకు బ్రహ్మాదులకుకూడ సాధ్యముకాదు. త్రిభువనపతియగు శ్రీ పంఢరీనాథుడు కార్మికరూపమున నీయింటసేవజేసెను. జగజ్జనని యగు రుక్మిణీదేవి సుమంగళిరూపముగను, వైనతేయుడు గార్దభరూపముగను, నుండి సేవజేయుచు మేమిచట బ్రవేశింపగనే యంతర్ధానులై" రని చెప్పెను. తత్‌క్షణమే గోరాకుంభారు జ్ఞానేశ్వరులకును, నామదేవులకును, సాష్టాంగప్రణామములాచరించి "నేను మహాపాపిని. నేను భగవంతుని బహుకష్టపెట్టితి"నని విలపించుచు నాషాఢైకాదశీ బ్రహ్మోత్సవమును సేవించుటకై తన భార్యలిరువురను వెంటబెట్టుకొని జ్ఞానేశ్వరులతోను, నామదేవులతోను, నఖండముగ హరినామసంకీర్తన జేయుచు పంఢరీపురములో బ్రవేశించి చంద్రభాగలో గ్రుంకులిడి పుండలీకభక్తునికి సాష్టాంగ నమస్కారముజేసి మహాద్వారములో బ్రవేశించి యచట సాష్టాంగప్రణామము జేసి సభామంటపములో బ్రవేశించెను.

నివృత్తిదేవ జ్ఞానేశ్వర సోపానదేవులును, సావతాభక్తుడును, జగన్మిత్రుడును, జనాబాయియు, ముక్తాబాయియు, నామదేవులును, భక్తకబీరును, నసంఖ్యాకులగు వైష్ణవజనులును, ప్రేమతో హరినామసంకీర్తనజేయుచుండిరి. దేవాలయమంతయును నాదబ్రహ్మమై ప్రణవ

మగు నోంకారధ్వని వచ్చుచుండెను. అంత నామదేవులు తంబురయు, చిరుతలును దీసికొని నృత్యముజేయుచు సంకీర్తనముజేయుచుండ దత్క్ష ణమే శ్రీ పాండురంగదేవుడు సింహాసనమునుండి దిగి కీర్తనజేయుచున్న నామదేవులకెదురుగ నిలువబడి నృత్యముజేయుచుండెను. భక్తులెల్ల రానందపరవశులై యద్వైత స్థితియందుండిరి. అంత నామదేవులు సర్వ జనుల నూర్ధ్వహస్తములతో గరతాళములు వేయుడని యాజ్ఞాపింప నాహ్లాదముతో భక్తులెల్లరును గరములు పైకెత్తి తాళధ్వనులు చేయుచు హరినామగర్జన జేయుచుండిరి.

ఆ సమయమున గోరాకుంభారానందాశ్రువులు విడచుచు గద్గద స్వరముతో "దేవాధిదేవా! రుక్మిణీకాంతా! నన్నేల యవకృపతో జూచు చున్నావు. కమలలోచనా! కమలాపతీ! నా జననీ జనకులును, బంధు మిత్రులును, ధన సంపదలును, కుల గోత్రములును, నీవై యున్నావు. ఈ భక్తుల సభలో నానందదాయకమగు గరతాళధ్వని జేయుటకు హస్త ములు లేకుండ జేసితి" వని విలపించుచుండ నామదేవులు గోరాకుంభా రుని జూచి"ఓయీ! గోరాకుంభారా! భక్తుడవైయుండియు గరతాళధ్వని జేయవేల?'' అని యడిగిరి. తత్క్షణమే గోరాకుంభారు లజ్జావమానము లను త్యజించి మొండిచేతులు పైకెత్తి కరతాళధ్వనిని జేయుచుండ శ్రీ రుక్మిణీకాంతుడు కృపాదృష్టితో జూచెను. తత్క్షణమే యాతనికి బూర్వమువలె కరము లుద్భవించెను. భక్తజనులెల్లరు నీ కౌతుకమును జూచి యానందముతో జయజయధ్వనుల జేయుచుండిరి.

అంత గోరాకుంభారునియొక్క జ్యేష్ఠకాంత నిలువబడి చేతులు జోడించి "ఓ మహాత్మా! నామదేవా! మీ సంకీర్తనలో నా భర్తకు జేతులు వచ్చెను, శ్రీ పంఢరీనాథుని మీరు ప్రార్థించి మృతు డైన మాబిడ్డ ననుగ్రహించి నా భర్తకు నేనును, నా తండ్రియు బెట్టిన యానలను ద్రుంచి కృపాదృష్టితో గాపాడుమని చెప్పుడనగా, "నామ దేవుడు తనయెదుట నృత్యముజేయుచున్న శ్రీ పంఢరీనాథుని జూచి

"వీరి పుత్రుడు మీ సంకీర్తనలో మరణించెను. ఇదిమీకు శాశ్వతముగ నపకీర్తికరము. వారిబిడ్డను వారి కనుగ్రహించి భక్తుల మాహాత్మ్యమును ప్రకటించి శాశ్వతకీర్తిని సంపాదించుకొం"డని చెప్పగా తత్క్షణమే భగవంతుని కృపావిశేషమున జగజ్జననియగు శ్రీ రుక్మిణీదేవి సాక్షాత్కరించి గోరాకుంభారుకుమారు నాతని భార్యచేతికిచ్చి గోరాకుంభారునిఁ జూచి "భక్తాగ్రగణ్యా! నీపెద్దభార్యయు,నత్తమామలును భగవంతునిపై బెట్టిన యానను మేము గైకొని నీబిడ్డను నీ కనుగ్రహించితిమి. మాయాజ్ఞానుసారముగ నేటినుండియు నిరువురుభార్యలతో గలిసి గృహస్థధర్మమును నిర్వర్తించుచు నఖండముగ మమ్ము సేవించుచు నంత్యమున మా సాన్నిధ్య మలంకరింపు" మని చెప్పి యంతర్ధానమయ్యెను. అప్పటినుండియు గోరాకుంభారుభక్తు డిరువురు భార్యలతో గలిసి గృహస్థధర్మమునందుండి యఖండముగ హరినామ సంకీర్తనము జేయుచు నవసానమున నీశ్వరసాయుజ్యము నలంకరించెను.

అష్టదశాధ్యాయము సమాప్తము.

శ్రీ మధురాయ నమః

# నామదేవులు సద్గురువు నాశ్రయించుట.

—♦ ఏ కో న వి ం శ త్య ధ్యా య ము ♦—

నేడు భక్తవిజయమను సూర్యుడుదయించుటచే సజ్ఞానమను సంధకారము తొలగి ద్వైత భేదములను నక్షత్రము లాకాశమున మరుగు పడినవి. ఆ జ్ఞానప్రకాశమువలన నవవిధ భక్తి మార్గములు గోచరించుటచే సాధక జనులు విచారించి శ్రవణ మార్గ మవలంబించిరి. కీర్తన మార్గమునందు నిశ్చయముగా ప్రేమభక్తుల సాంగత్యమువలనడి జడ మూఢులు సహిత మంతరించి శ్రీపతిని స్వాధీన పరచుకొందురు. కొందరు మనన మార్గమున లక్ష్యముతో పర్వత ప్రదేశముల జేరిరి. కొందరు ప్రేమతో పాదసేవన యనుగమనము జేయుచుండిరి. మరికొందర రర్చనయను నగరమును జేరిరి. కొందరు వందన మార్గమున ప్రీతితో గమనము జేయుచుండిరి. మరికొందరు నిజ ప్రేమతో నాత్మనివేద మార్గమున బయనించుచు గమ్యస్థానమును జేరిరి. ఈ నవవిధ మార్గములను సాధకులు నిర్మలములు జేసి తమవెంట నపార ప్రేమ భక్తులను దీసికొని పోవుచుండిరి.

గోరాకుంభారు భక్తు లెల్లరిని దన యాశ్రమమునకు విచ్చేసి తన్ను దనకుటుంబమును బవిత్రులనుగా జేయుడని కోరెను. వైష్ణవు లెల్లరును గోరాకుంభారు కోరిక ననుసరించి యాతని గృహమున కేగిరి. గోరాకుంభారును, నాతని భార్యలును, భక్తి శ్రద్ధలతో వారికి సాష్టాంగ నమస్కారమును, చరణప్రక్షాళనయు జేసి యుచితాసనములపై నధిష్ఠింపజేసి వారి చరణతీర్థమును స్వీకరించి షోడశోపచారవిధుల బూజించి షడ్రస యుక్తములగు పక్వాన్నములను, తాంబూలములను నర్పించిరి.

నివృత్తి జ్ఞానేశ్వర సోపానదేవులును, ముక్తాబాయియు, నామదేవులును, సావతాభక్తుడును, గూర్చుండి యుండిరి అంత జ్ఞానదేవులు గోరాకుంభారుని జూచి 'ఇచట నున్న ఘటములలో బక్వా పక్వము లను బరీక్షించి తెలుపు"మని యడిగెను. గోరాకుంభారు కుండలుతట్టు

దండమునుదీసి యచట గూర్చుండియున్న భక్తుల శిరములపై నొక్కొక్క దెబ్బ గొట్టుచుండ భక్తులెల్లరు మౌనముగా నుండిరి. నామదేవుల శిరముపై గొట్టబోగా "వ్యర్థముగా నన్నేల కొట్టెద"వని యాతడనెను. అంత గోరాకుంభారిది యపక్వఘటమని చెప్పగా ముక్తాబాయి గోరా కుంభారునుజూచి "నీవు గొప్ప పరీక్షకునివలె గనబడుచున్నావు. నీవెట్లు గుర్తించితివి" అని యడిగెను. అంత గోరాకుంభారు "రత్న మాణిక్య ములను సువర్ణమును షరాబులు పరీక్షించునట్లు నేను కుమ్మరినగుటచే ఘటముల బరీక్షించి పక్వాపక్వముల గుర్తింపగలను. రోగికిగల వ్యాధిని వైద్యుడు వీక్షణమాత్రముననే దెలిసికొన్నట్లపక్వఘటమును జూడగనే దెలిసికొంటి"నని చెప్పగా నచటగల భక్తులెల్లరిది యపక్వఘటమని పక పకనవ్వుచు నామదేవుల నవమానపరచిరి.

నామదేవులు చింతాక్రాంతమానసుడై యచటనుండి తత్క్షణమే లేచి వేగముగా పంఢరీపురముపోయి శ్రీ రుక్మిణీకాంతునితో జరిగిన వృత్తాంతమంతయు జెప్పి "ఓ దేవా! నన్నపక్వఘటమని యవమానపరచి" రనెను. అంత శ్రీ పంఢరీనాథుడు నామదేవుల నాలింగనము జేసికొని "నీ యాంతర్యమును నేను బాగుగ నెరుగుదును. నీతో సమానులగు సజ్జనులెవ్వరును నీ జగమందు లే" రనెను. అంత నామదేవుడు "ఓ దేవా! నీ భక్తుడగు గోరాకుంభారు నన్ను శిరముపై గొట్టబోవుచుండ నేను భయముచే వ్యర్థముగా నన్నేలకొట్టెద" వంటిని. పిదప నట జేరిన భక్తులెల్లరు నన్ను బరిహసించిరి. జ్ఞానేశ్వరులు ముక్తాబాయికి జేష్టలు చూపుచుండ గోరాబా ఘటమపక్వమని చెప్పెను. పిదప నే నట నుండి లేచి మీకీ విషయ మెరింగించుటకై యతి వేగముగ వచ్చితి" నని చెప్పెను.

అంత శ్రీ పంఢరీనాథుడు హాసితవదనుడై "ఓ నామదేవా! వారు యదార్థమే పల్కిరి. సద్గురు నను(గహముకు బాత్రులుకానివారి నపక్వ ఘటము లందు" రనగా నామదేవులు చింతాక్రాంతుడై వ్యాకుల హృదయముతో "ఓ దేవా! నాకు గలిగిన యవమానమును నీవు తొలగింతువని

యాశతో వచ్చితిని. నీవును నపకృపతో నీ భక్తులతో బాటుగనే యవమానపరచుచుంటివి. రా జవినితితో బ్రవర్తించిన బ్రజలకు సుఖము కలుగనట్లును, భూమి తనపై వృక్షము లుండరాదని శాసించిన వృక్షములకు తావు దొరకనట్లును, తల్లి బిడ్డను త్యజించిన రక్షించనివా రుండనట్లును, చక్రపాణివగు నీ వపకృపతో నుండిన త్రిభువనములందును నన్ను సమాధానపరచువా రుండ" రని చెప్పెను. ఆ పలుకులను శ్రీ పంఢరీనాథు డాకర్ణించి "నీదియు నాదియు నేకచిత్తనే. సుమమందు మకరందము వసించుచు నభిన్నమైయుండునట్లు నీవు నా జీవమైయుండియు నుదాసీనవచనముల బలుకుచున్నావు. త్వరితగతిని సద్గురుని శరణుబొంది ద్వైతభావమును దొలగించుకొ" మ్మని చెప్పెను. అంత నామదేవుడు "ఓ దేవాధిదేవా! నాకు సద్గురునితో బనియేమి? నీవు నా సన్నిధినుండ జీవునకు బంధనమెట్లుండును. వ్రత తపో యజ్ఞ దానాదులును నను్ష్ఠానమును, సద్గురుసేవయు, నీప్రాప్తికొరకై కదా చేయుట! ఆకస్మికముగ జక్కెరలభించిన నంగడి కేగుటేల? అమృతధార నోటబడిన పర్వతముల దిరుగాడు పనియేమి? దినుటకు పక్వాన్నములుండిన వంటజేయు నవసరం బేమి? ద్రవ్య మపరిమితమునార్జించిన బాదములపై జరింప బనియేమి? జగద్గురువగు నీవు సన్నిధినుండ సద్గురునితో బనియే" మని ప్రశ్నింపగా శ్రీ పంఢరీనాథుడిట్లు ప్రత్యుత్తరమిచ్చెను. "ఓయీ! నామదేవా! నేను చెప్పునది వినుము. నేను రామావతారమున వశిష్ఠుని, కృష్ణావతారమున సాందీపుని శరణొంది యాధ్యాత్మిక జ్ఞానమును బొందితిని. కనుక నావచనము లాకర్ణించినచో భక్తులెల్లరిలో నగ్రగణ్యుడ వగుదువు" అనెను.

నామదేవుడు శ్రీ పంఢరీనాథునకు సాష్టాంగ నమస్కారము లాచరించి "ఓ దేవా! నే నేగురుని శరణొందుటో తెల్పు"మనగా హృషీకేశుడు "విశోబా ఖేచరునితో సముడగు మహాజ్ఞాని యీ త్రిభువనములందును లేడు. ఆతడు శివాలయములో నిద్రించుచుండును. నీవటకు జని యాతని శరణొందు"మన నామదేవు డానందాశ్రుధారలు విడచుచు

"నిన్ను విడచి నేనొక క్షణమేనియు నుండజాల"నని విలపించెను. అంత శ్రీ పంఢరీనాథుడు "లోకాచార రక్షణకై నీవు సద్గురుని శరణొంద వలయును. అజ్ఞానులు సద్గురు నాశ్రయింపక వ్యర్థులగుదురు. కాన నజ్ఞానులకు దరుణోపాయమార్గమును జూపుటకై నీ వవశ్యముగ సద్గురు నాశ్రయింపవలె" నని చెప్పెను.

ద్వాపరయుగమున శ్రీకృష్ణు డుద్ధవున కేకాదశస్కంధమున జ్ఞానబోధజేసి బదరికాశ్రమమునకు బంపగా నాతడు మనమున ఖేద మొందినట్లు, కలియుగమున శ్రీ పంఢరీనాథు డుద్ధవావతారుడగు నామదేవులను సద్గురు నాశ్రయించుటకు బొమ్మనగా నాతడు మానసమున దుఃఖమునొందెను. వ్రతములలో నేకాదశిని, దేవతలలో హృషీకేశుని, తీర్థములలో జంద్రభాగను, భక్తులలో నామదేవుని వర్ణించుట కుపమానము లలభ్యములు. ఉద్దండముగా తీర్థములను సేవించుటవలన నభిమానము వృద్ధియగును. చంద్రభాగను దర్శించిన నభిమానము నశించును. దానిమహిమ నేమని వర్ణింతుము! పంఢరిని సేవించు భక్తులకే యది గ్రాహ్యమగును. కానచంద్రభాగయందలి విశేష మితర తీర్థములయందు లేదు. చంద్రభాగతో సమమగు తీర్థమును, పంఢరితో సమమగు క్షేత్రమును, నామదేవునితో సముడగు భక్తుడు త్రిభువనము లందును గన్పింపరు.

నామదేవుడు సద్గురుదర్శనార్థమై త్వరితగతిని బ్రయాణమొనర్చి, మల్లికార్జునాలయమునందు బ్రవేశించి చూడగా విశోబాఖేచరుడు నిద్రించుచుండెను. ఆతడు తన చరణములను శివలింగముపై నిడుకొని యుండుటను జూచి నామదేవులు విస్మయముతో "శివలింగముపై జరణము లుంచుకొని నిద్రించునట్టి యున్మత్తుడైన యీతడు మహాజ్ఞాని యని రుక్మిణీరమణుడు నన్నంపెను. భోజనము జేయుచుండ ప్రథమ గ్రాసములనే మక్షిక మగుపడినట్లును, దేశాంతరమేగుచుండ జలశూన్య భాండములు కనబడినట్లును, పుస్తకరచనారంభమునందు మొదటి వాక్య

మునందే పొరబడినట్లును, రవిదర్శనార్థమై యేగుచుండ గ్రహణ మాసన్నమైనట్లును, శుద్ధ విదియదినమున చంద్రదర్శన మపేక్షింప నంబరమును మేఘము లావరించినట్లును, నేను దూరమునందుండగనే సద్గురునిలోని యవగుణము లగుపడె" నని మనమున దలచి దగ్గరకు బోయి ధైర్యముతో విశోబాను బిలచి "మీరు మహాభక్తులై యుండి ప్రత్యక్ష శివలింగముపై బాదములుంచి యున్నాత్తునివలె నుంటిరి. ఇదియేనా మీ బ్రహ్మజ్ఞాన" మని పృచ్ఛించెను.

అంత విశోబా నామదేవులజూచి "నేను వ్యాధిగ్రస్థుడను. స్థూలకాయుడను. లేచుటకు శక్తి లేనివాడను నా సఖుడవును, విష్ణుదాసుడవును నగు నీవు దయయుంచి శివలింగములేని ప్రదేశమున నా చరణముల నుంచు'మని చెప్పగా నామదేవు లాతని చరణ యుగ్మము నెత్తి దూరముగ బెట్టబోవుచుండ నట నొక శివలింగముండెను. చరణములను వేరొక ప్రక్కకు ద్రిప్ప నటగూడ నొక శివలింగ ముండెను. ఈ విధముగా నామదేవులు విశోబా పాదముల నెచట నుంచబోయిన నచట నొకలింగము కనబడుచుండెను. అంత నామదేవు డచ్చెరువొంది విలోకింపగా శివలింగము లేని స్థల మణుమాత్రమును లేక ఘంటయు, మృదంగమును, దేవాలయమున గల పూజాసామగ్రియు, మంటపమున గల స్తంభములును, విశోబాయును, సర్వమును శివమయముగ గనబడుచుండెను. తత్క్షణమే నామదేవులకు జ్ఞానోదయమయ్యెను. అతడు సద్గురు చరణములకు వందనముల జేసెను. పిదప విశోబా నామదేవులతో "ఓ విష్ణుభక్తా! నా చరణములకు బాధగానున్నది. శివలింగము లేని తావున దవ్వరగా బెట్టు"మన నామదేవుడు మీరు పరిపూర్ణజ్ఞానులు. మీ చరణస్పర్శచే జరచరాత్మకమగు సర్వజగత్తును శివమయముగానగుపడుచున్నది. శివలింగములేని స్థల మణుమాత్రము నాదృష్టిగోచరమగుటలే" దని సాష్టాంగనమస్కారము జేసెను.

విశోబాఖేచరుడు నామదేవులతో "శివుని నిజ ధ్యానమును విను"మని చెప్పి నందభాషతో నాతని సంశయ నివృత్తి




శోభాఖేచరుడు నామదేవులకు దేవాలయమంతయు శివలింగములుగ జూపుట.

యొనర్చెను. పంచముఖములును, త్రినేత్రములును, దశభుజములును గలిగి శోభించుచు, సప్తపాతాళములందు చరణములు కల కైవల్య రూపుని మహిమ విశేష వర్ణన మొనర్పలేక షట్శాస్త్రములును లజ్జ నొందినవి. అర్థజ్ఞానమును జెప్పలేక చతుర్వేదములును తబ్బిబ్బైనవి. అది యష్టాదశ పురాణములకుగూడ నసాధ్యమయ్యెను సహస్రముఖుడు దానిని వర్ణించుట కారంభించి విఫలుడయ్యెను అట్టి శివలింగముయొక్క మాహాత్మ్యమును జ్ఞానేశ్వరుల కింకరుడనగు నేనేమి తెల్పుదు' నని యంజలి ఘటించెను. శ్రీకృష్ణభగవాను డర్జునునకు విశ్వరూపమును జూపగనే యాతనిచిత్తమునం దఖండజ్ఞానమేర్పడినట్లు, సద్గురు వచన శ్రవణములచే నామదేవుని నఖండ జ్ఞానోదయమయ్యెను. సద్గురుచరణములకు నమస్కరించి నామదేవుడు "ఓ సద్గురునాథా! నీ చరణస్పర్శచే నాకు విశ్వమంతయు భగవద్రూపముగ గనబడుచున్న" దని చెప్పగా విశోబా తత్క్షణమే లేచి నామదేవుని మస్తకముపై నభయప్రదాన హస్తముంచగా విఠలుడు నామదేవునికి హృదయస్థుడై కనబడెను. సద్గురు ననుజ్ఞ నొంది నామదేవుడు గృహమును జేరెను.

ఒకదినమున శ్రీ విఠలుడు నామదేవుని గృహమున కేతెంచి "ఓ నామదేవా! సద్గురుసేవ కేగిన పిదప నీవు దేవాలయమునకు వచ్చుటలే దేమి? నాపై గోపము కలిగెనా?" అని పృచ్ఛించెను. అంత నామదేవుడు "నీవే సద్గురురూపుడవై యున్నావు. నీవులేని స్థలమే లేదు. విశోబాకృపచే హృదయస్థుడవగు నిన్ను గుర్తించి యద్వైతస్థితి నొందితి" ననగా శ్రీ రుక్మిణీకాంతుడు సంతసించి నామదేవుల కఖండజ్ఞానోదయమైనదని జ్ఞానేశ్వరాది భక్తుల కెరింగించెను.

ఏకోన వింశత్యధ్యాయము సమాప్తము

విచిత్ర చరిత్రాయ నమః

# స్పర్శ భాగవత చరిత్ర

— ♦ ఇరువదియవ యధ్యాయము ♦ —

శ్రోతృజనులారా! సావధాన చిత్తులై వినుడు. నేడు శ్రద్ధయను పూర్ణిమ తటస్థించినది. భక్తవిజయమను చంద్రుడుదయించి హృదయమను నాకసమున నవిద్యయను నంధకారము తొలగి సజ్జానులను చాతకుల హృదయమున సౌఖ్యముగలిగి ప్రేమయను లక్ష్యముతో జూచుటచే నమృతము వర్షించెను. రసికులగు నితర జనులు కథారూపమగు ప్రసాదము లభించుటచే సంతసముతో సేవించి సాయుజ్య సుఖమొందిరి. ఈ చంద్రుని జూచుటచే వికల్పములను తస్కరులు తొలగుదురు. పాప పర్వతములు కూలిపోవును. కేవల జ్ఞానమను వృక్షమునకీ చంద్రకిరణములు సోకుటచే ద్వరితముగ చైత్రము తటస్థించి ఫలపుష్పములతో ప్రఫుల్లిత మగును. కాబట్టి స్వస్థచిత్తముతో శ్రవణముజేసి శ్రోతలు తత్ఫలము నొందుడు.

శ్రీ పంఢరీ క్షేత్రమునందు పరిసా భాగవతుడను పేరుగల గృహస్థుడుండెను. ఆతడు ప్రతిదినము సూర్యోదయాత్పూర్వమే నిద్రనుండి లేచి చంద్రభాగలో స్నానమాచరించి నియమముతో శ్రీ రుక్మిణీదేవి నారాధించుచుండెను. అతనికి పరమభావుకురాలును, పతివ్రతా శిరోమణియు, భర్త్రాజ్ఞా పాలకురాలును నగు కమలజ యను సత్కళత్రముండెను. ఈ దంపతు లిరువురును భక్తిశ్రద్ధలతో బహుకాలము రుక్మిణీదేవి నుపాసన చేయుగా నాదిమాయ సాక్షాత్కరించి కృపాదృష్టితో స్పర్శ భాగవతుని వీక్షించి "బాలకా! వలయు వరము వేడు" మన నాతడు "నీ భజన యందే విఘ్నమును గలుగక నిర్విచారముతో నిన్ను సేవించుచుండునట్లును, నాకు మనస్సునందెట్టి యుద్వేగమును గలుగకుండునట్లును నన్నుగ్రహింపుమని" కోరెను. రుక్మిణీదేవి యొక స్పర్శవేది నాతనికిచ్చి "దీనిని నీ ప్రాణములతో సమముగ జూచుకొనుము. దీనిని లోహమున కంటించిన నది బంగారమగు"నని చెప్పి యంతర్ధానమాయెను.



స్పర్శభాగవతుడు లక్ష్మీదేవి నారాధించుట

నూరుక్రతువులును ప్రయాసతో జేయగా నమర పదము లభించి నట్లును, దశగ్రీవుడనుష్ఠానము జేయుగా నయాచితముగా సువర్ణ నగర మగు లంకాపట్టణము లభించినట్లును రుక్మిణీదేవి యిచ్చిన స్వర్ణవేదికా భాగవతు డమితముగ సంతసించి గృహమునకేగి భార్యకా స్వర్ణవేది నిచ్చి యీరహస్య మెరికి దెలుపకుమని చెప్పి లోహమునుదెచ్చి స్వర్ణ వేదితో స్పృశించెను. అమితముగ సువర్ణమగుటజూచి పరిసా భాగ వతుడును, కమలజయును, "జగన్మాతయగు (శ్రీ) రుక్మిణీదేవి మన కఖండైశ్వర్యము ననుగ్రహించినది. బహు కాలమునుండి దారిద్ర్యముచే బీడింప బడుచు నేడు కృతార్థుల మైతిమని" యమితానంద భరితులైరి. దంపతులిరువురు నేకచిత్తులై సువర్ణమును విక్రయించి తన్మూలముగ వచ్చిన ద్రవ్యముతో బ్రతిదినము మధుర పక్వాన్నములను భుజించుచు బాహ్యమున కెవరికిని విషయమును దెలియనీయక నతి విరక్తులవోలె నటించుచుండిరి.

మలాంమా జేయబడిన యాభరణ మితర లోహము దైయుండియు బాహ్యమునకు సువర్ణముగ గనబడునట్లును, జారుడు గొప్ప యాచార వంతునివోలె నటించునట్లు, నాంతర్యమున భక్తిలేనివాడు దేవాలయ మున గంతులువేసి బాహ్యమునకు భక్తిని బ్రకటించునట్లును, దృష్టి హీనములగు నేత్రములు నెమలికోడలినిండ యున్నట్లును, పరిసాభాగ వతు డతి విరక్తునివోలె గనుపించుచు బహువిధ సంపదలతో గృహమున నానంద విలాసముల దేలియాడుచుండెను. భుజించినదియు లేనిదియు ముఖమును జూడగనే దెలియునట్లును, నిష్కపటియు దామసియు సంభా షణచే గ్రహింప బడునట్లును, దీపములో దైలమున్నదియు లేనిదియు బ్రకాశమును బట్టి గుర్తించునట్లును, జతుకుడో మూర్ఖుడో దృష్టినుండి గ్రహించునట్లును, శ్రోతలు స్పష్టముగా శ్రవణము జేయునదియు, లేని దియు వక్త గ్రహించునట్లును, పరిసాభాగవతుని విరక్తి సర్వజ్ఞులకు చతురులకు దెలిసెను.

ఒకనాడు కమలజ చంద్రభాగా తీర్థమునుండి జలమును దీసికొని వచ్చుచుండ నామదేవుల భార్యయగు రాజాబాయి మార్గమం దెదురయ్యెను. "నే నిప్పుడే జలమును దీసికొని వత్తును. ఇచ్చటనే యుండుమని" రాజాబాయి కమలజతో జెప్పి శీఘ్రముగ జలముదీసికొని వచ్చి యామెను గలిసికొనెను. ఇరువురును గలిసి మార్గమున దమ తమ గృహావిషయములు చెప్పుకొనుచుండిరి. రాజాబాయి "ఓసఖి! కమలజా! నాగృహపరిస్థితు లేమని చెప్పుదును. అన్నవస్త్రములు లేక నేనును, బిడ్డలును, నానావిధ కష్టములకు లోనై యుండ నాభర్త లౌకిక మానావమానములను, సంసార చింతను, దారపుత్రాదులందు మోహమును విడచి యఖండముగ శ్రీరుక్మిణీకాంతుని భజించుచుండె"నని యశ్రుధారలు విడచెను.

అంత కమలజ "నీ భర్త బహుకాలమునుండి శ్రీపంఢరీనాథుని సేవజేయుచుండ నాతడేమియు ననుగ్రహింపలేదా? ఫలపుష్పములీయని వృక్షమును, నీరుపోసి పెంచుట వ్యర్థమగునట్లు మీ కుటుంబపోషణకైన సంపదనీయని దేవుని భజించి సార్థకమేమి? గుణమీయని యౌషధమును సేవించిన వ్యర్థమగునట్లును, బావిని ద్రవ్విన జలముద్భవింపనిచో వ్యర్థమగునట్లును, ఫలింపని పొలములో సేద్యముజేయుట వ్యర్థమగునట్లును, శ్రీవిఠ్ఠలుడు ప్రసన్నుడు కానిది మీరుచేయుసేవ వ్యర్థము. నా భర్త రుక్మిణీదేవి నారాధించి ప్రసన్నురాలినిగా జేసికొని యామెవలన స్పర్శవేదిని సంపాదించెను. మేమా స్పర్శవేది నినుమున కంటించి యట్లు తయారైన బంగారమును విక్రయించి యమిత ద్రవ్యముతో నఖండసుఖముల ననుభవించుచున్నా" మని చెప్పెను. అంత రాజాబాయి "సఖి! స్పర్శవేది యెట్లుండును. అది యినుమునెట్లు బంగారముజేయు" నని యడుగ కమలజ "నా యింటికిరమ్ము, నీకు జూపెద" నని చెప్పెను. ఆ యిరువురు నీ విధముగ మార్గమధ్యమున బహు విధ సంభాషణలు చేసికొనుచు దమతమ గృహములకేగిరి.

ఒకనాడు రాజాబాయి కమలజ గృహమునకేగెను. తన సఖి నచ్చటగాంచి కమలజ స్పర్శవేదిని రాజాబాయికి జూపి "అమ్మా! నీవొక క్షణము దీనిని గృహమునకు దీసికొనిపోయి యినుమున కంటింపుము. ఎంత యినుమైనను క్షణకాలములో స్పర్శమాత్రమున బంగారమగును. నీవాసువర్ణముతో కుటుంబయాత్ర గడుపుకొనుచుండుము. ఈ రహస్యమెవరికినీ దెలియనీయకుము. విలంబనజేయక నీ స్పర్శవేదిని మరుక్షణములో నాకుదెచ్చియిమ్ము, నా భర్తకు దెలిసిన నన్ను దండించును. సఖురాలవగు నీవు బహుదారిద్ర్యము ననుభవించుచుంటివని దయ కలిగి దీని నిచ్చుచున్నాను. త్వరితముగా గృహమునకుబోయి కార్యమును ముగించుకొని రమ్మని" చెప్పెను.

రాజాబాయి యమితోత్సాహముతో నా స్పర్శవేదిని దీసికొనిపోయి గృహములో నినుమున కంటించి బంగారముచేసి యాసువర్ణమును బజారున విక్రయించి వస్త్రభూషణములను బాకి పాత్రలను నన్నసామగ్రులను గైకొని గృహమునకేగి హర్షచిత్తయై వంటజేసెను. మధ్యాహ్నసమయమున నామదేవులు దేవాలయమునుండి గృహమునకువచ్చి సామగ్రిని జూచి యాశ్చర్యముతో భార్యనుజూచి "ఇవి యెచటనుండి దెచ్చితివి. చెప్పు"మని యడిగెను. ఆమె "మీరు భోజనముజేయుడు. అడుగుటవలన ప్రయోజనమేమి? మీరీ దినమునుండి సంసార విషయమున జింతింపబనిలే"దని చెప్పగా నామదేవులు "విషయనేమి? యదార్థము జెప్పనిచో నేను భోజనముజేయ"నని చెప్పెను. రాజాబాయి "పరిసా భాగవతుడు రుక్మిణీదేవి నారాధించి యామెవలన స్పర్శవేదివి బొందెను. మీరుజేయు భక్తివలన నింటిలో నేనును బిడ్డలును నన్న వస్త్రాదులులేక మలమల మాడుచున్నాము. నా సఖురాలగు కమలజ యా స్పర్శవేది నొకక్షణకాలము నాకిచ్చెను. నేను దానిని లోహమున కంటించి సువర్ణముజేసి బజారున విక్రయించి యాద్రవ్యముతో సామగ్రుల దెచ్చి వంటజేసితిని. కమలజకును నాకును ప్రాణస్నేహమగుటచే మనము దరిద్ర స్థితియందున్నామని కనికరించి స్పర్శ

వేది నిచ్చినది. నేనొక క్షణములో స్పర్శవేదిని దీసికొనిబోయి యామె కిచ్చెదనని'' చెప్పెను.

నామదేవులు "స్పర్శవేది యెట్లుండునో నాకుజూపు''మని యడుగగా రాజాబాయి స్పర్శవేది నిచ్చెను. నామదేవు లది దీసికొని చంద్రభాగకుబోయి నదీమధ్యంబున విసరివైచెను. రాజాబాయి చింతించుచు "ఎంత యకార్యము జేసితిరి, మిత్రద్రోహము జరిగినది. నేను స్పర్శవేదిని వారి కిచ్చుటెట్లని'' విలపించుచుండెను. నామదేవు డుపాధిరహితుడై గృహమున గూర్చుండి విఠ్ఠలనామ స్మరణ జేయుచుండెను.

పరిసా భాగవతుడు భార్యనుబిలచి స్పర్శవేది నడుగగా నామె రాజాబాయి బహు దరిద్ర స్థితియందున్నది ఆమె కొకక్షణకాల మిచ్చితినని చెప్పెను. అంత పరిసాభాగవతుడు భార్యనుజూచి "నీవలన నీ రహస్య మెటులైన బయటపడునని నేను బహుకాలము నుండియు భయపడుచుంటిని. దుర్లభమగు స్పర్శవేదిని సఖురాలి కిచ్చితివి. త్వరితముగా బోయి తీసికొని రమ్మని" చెప్పగా కమలజ రాజాబాయి గృహమునకేగి తన స్పర్శవేది నిమ్మని యడిగెను. ఆమె కమలజను జూచి యేడ్చుచు "అమ్మా! నావలన గొప్ప యపరాధము జరిగినదని" చెప్పి నామదేవులతో "సఖురాలు స్పర్శవేది నడుగుచున్నది ఏమి చేయవలె"నని యడిగెను. అంత నా విష్ణుభక్తుడు నదిలో పారవైచితినని జెప్పగా నాయిరువురును దీర్ఘముగ రోదనము జేయుచుండిరి.

పరిసాభాగవతుడు తనభార్య చాలసేపటి వరకు తిరిగి రానందున నామదేవుని యొద్దకుబోయి విషయమంతయు దెలిసికొని స్పర్శవేదిని నామదేవు డపహరించి యిట్లు నటించు చున్నాడని భావించి యచట గల జనులతో నీ విషయమంతయు జెప్పెను. జనులు పరిపరి విధముల నిర్భరను నిందించుచుండిరి. భావుక జనులు నామదేవునకు మట్టియు బంగారమును సమానము. ఆతనికి స్పర్శవేది యభిలాష యుండదని చెప్పుకొనుచుండిరి.

పరిసా భాగవతు డేడ్చుచు వ్యర్థముగా నాకు ద్రోహము జేసి విరక్తునివలె నటించుచున్నావని పలికెను. అంత నామదేవులు "నీకుస్వర్ణ వేదితో బనియేమి? బాహ్యమున కతి విరక్తునివలె నటించుచున్నావు. గృహమున నానావిధములగు విలాసభోగముల ననుభవించుచు భక్తుని వేషముతో నున్నావు, నావెంట రమ్ము. నీ స్వర్ణవేదిని చంద్రభాగా నదిలోనుండి తీసియిచ్చెదనని" జెప్పి నాతనిని చంద్రభాగకు దీసికొని పోయి నదిలోనికి దిగెను, జనులెల్లరును నవ్వుచు నదిలోని రాళ్ళను దెచ్చి యిచ్చునని బరిహసించుచుండిరి.

నామదేవులు నదిలో దోసెడు గులకరాళ్ళనుదీసి పరిసా భాగవతునిజూచి "ఇందు నీ స్వర్ణవేది యెద్దియో గుర్తించి తీసుకొనుమని" జెప్పెను. నామదేవుని హస్తస్పర్శచే నారాళ్లెల్ల స్వర్ణవేదులాయెను. అచ్చట గల జనులెల్లరు నానందోత్సాహములతో గరతాళములను వేయుచు జయ జయ ధ్వనుల జేసిరి. నిందకులగు కుటిలు రధోముఖులైరి. పరిసా భాగవతు డాశ్చర్యచితుడై "నామదేవులతో సమమగు భక్తులీ త్రిభువనము లందును లేరు. నేను బహుకాలము శ్రీ రుక్మిణీ దేవి నారాధించి యొక్క స్వర్ణవేది నొందితిని. నామదేవుని హస్త స్పరచే రాళ్ళన్నియు స్వర్ణవేదు లగుచుండెను. కాన నిట్టి మహాత్ముని శరణుబొంది తత్త్వోపదేశము నొందవలెనని యెంచి నామదేవుల చరణములపైబడి యపరాధ క్షమార్పణ గోరుకొనెను. నామదేవుడు తన హస్తమందున్న స్వర్ణవేదు లన్నిటినీ చంద్రభాగలో బారవైచెను. నామదేవుడు పరిసాభాగవతు ననుగ్రహించి శిష్యునిగా జేసికొనెను. పరిసా భాగవతుడు నామదేవుల కృపచే దివ్యజ్ఞానము గలవాడై యఖండముగా గురువుల సేవించుచు నవసానమున భగవత్సాయుజ్య మందెను

ఇరువదియవ యధ్యాయము సమాప్తము

గజేంద్ర వరదాయనమః



# జగమిత్ర నాగా చరిత్ర

—♦ ఇరువది యొకటవ యధ్యాయము ♦—

శ్రోతలారా! నేడు కార్తీకైకాదశీ పర్వకాలము పంఢరీ క్షేత్రములో భక్తజనులు జేరి భగవంతునితో గలిసి భక్తవిజయ రూపమున వెలువడిరి. శాంతి క్షమయును చంద్రభాగయు, దయయను గోపాలపురమును, నుల్లాసమను భగవంతుడు క్రీడించిన స్థలమును, సాధ్వవమను పుండలీకుడు నగాధ లీలలలో ప్రసిద్ధులైరి రసవంతమగు భక్తలీలామృతమను పాండురంగ దేవాలయమునందు రమణీయమగు స్థలమునుజూచి భగవంతు డధిష్ఠించెను. సాత్విక గుణమను బృందావనము శోభాయమానమై కీర్తియను ధ్వజముతో విరాజిల్లుచుండెను. కళాచాతుర్యోత్తమ గుణములవలనను, రుక్మిణీమాత ప్రసాదము వలనను, మనస్సునందు ప్రేమయను నుల్లాసము బయల్వెడలినది. అతి పావనమగు నీ పుణ్యక్షేత్రమును సేవించుట కరుదెంచిన భావుకజనులు మానాభిమానముల విడచి జీవన్ముక్తులై వర్తించుచుండిరి

పరలీ వైజనాథమున జగమిత్ర నాగాయను ద్విజుడుండెను. ఆతడు గృహస్థ ధర్మమునందుండి పరమ భావుకుడును వైష్ణవుడునునై గ్రామమందు భిక్షాటన జేయుచు దన్మూలముగ లభించు ధనముతో కుటుంబ పోషణ జేసికొనుచుండెను. ఆత డాశాపాశముల ద్యజించి రాత్రి వేళలందు కథా కీర్తనలను జేయుచుండ నసంఖ్యాకులగు జనులరుదెంచి యానందముగ శ్రవణము జేయుచుండిరి. వైరాగ్య భరితుడగు నాతనిని సమస్త జనులును పాండురంగావతారమని పరిపరి విధముల గొనియాడుచుండిరి. దినదిన ప్రవర్థమానముగా నాతని కీర్తి పరిసర ప్రాంతముల వ్యాపించి యసంఖ్యాకులగు జనులీతనిని గౌరవించుచుండ నెందరు లీతని నవమాన పరచుటకు గృత్రిమోపాయములను యోచించుచుండిరి. తులసీవృక్షమును బూజించుచుండ మ్లేచ్ఛునకు సంతాపము గలుగునట్లును, గల్పవృక్షపు ప్రతాపమువలన 'సింధీ' వృక్షమునకు

కసూయ గలుగునట్లును, జగన్మిత్రుని కీర్తినివిని నిందకులు సంతాప చిత్తులై యాతని కపకీర్తి దేవలెనని కుతర్కములు జేయుచు నానావిధములగు నపశబ్దములను బలుకుచుండిరి. జగన్మిత్రుడు శాంతచిత్తుడై యెవ్వరికినీ కఠినముగ ప్రత్యుత్తర మొసంగక సదా హరినామ సంకీర్తన జేయుచు కాలము గడపుచుండెను.

ఒకనాటిరాత్రి జగన్మిత్రుడు కథా కీర్తనలు ముగిసిన పిదప గృహమున నిద్రించుచుండ దుర్జనులకస్మాత్తుగా నాగృహమునకు నిప్పంటించిరి. జగన్మిత్రుడు భార్యాపుత్రులతో నా గృహమున గాఢనిద్రలో నుండెను. అగ్ని జ్వాలలు వ్యాపించుచుండ నుష్ణవాయువు స్పర్శచే జగన్మిత్రుడు తత్ క్షణమే నిద్రనుండి మేల్కాంచి ప్రమాదమును జూచి భార్యా పుత్రులను లేపి యెల్లరును శ్రీ పంఢరీనాథుని "హే రుక్మిణీకాంతా, దీనబంధో, అనాథనాథా! సత్వరమే మమ్ము గాపాడుము." అని ప్రార్థించిరి. జగన్మిత్రుని కరుణా వచనములను విని శ్రీ పంఢరీనాథుడు సుదర్శన చక్రమునుధరించి వారిని రక్షించెను.

జగన్మిత్రుని గృహము దహింపబడుటజూచి యాగ్రామవాసులు "దుష్టులెవరో యీ భక్తుని గృహమునకు నిప్పంటించిరి. శ్రీ పంఢరీనాథుడు వీనిని రక్షించలేదు. భక్తుని కుటుంబ మగ్ని కాహుతి యగునని" దుఃఖించుచుండిరి. కొంతసేపటికి గృహమంతయు దహింపబడి ప్రాతఃకాలమున నగ్ని చల్లారెను. జగన్మిత్రుడు భార్యాపుత్రులతో నగ్నిలో దహింపబడెనని గ్రామవాసులు పరిపరి విధముల జెప్పుకొనుచు జూచుటకై వచ్చిరి. ఆ గృహము కప్పంతయు దహింపబడి బూడిద సహితము లోపలబడక జగన్మిత్రుడు కుటుంబ సహితముగా హరినామ సంకీర్తన జేయుచుండుట జనులుజూచి యత్యాశ్చర్యము నొందిరి. పాండవులను లాక్షాగృహమున రక్షించినట్లును, ప్రహ్లాదుని నగ్నినుండి రక్షించినట్లును, శ్రీ పంఢరీనాథుడు జగన్మిత్రుని కుటుంబమును రక్షించెను.




జగమిత్రనాగాకు భగవంతుడు వ్యాఘ్ర రూపమున దర్శన మిచ్చుట

గ్రామవాసు లెల్లరును జగమిత్రు డీశ్వరావతారుడని శ్రద్ధాభక్తులతో గౌరవించుచు నాతని కినాములతో సత్కరించిన భిక్షాటన చేయు బనిలేక సుఖంచునని విచారించి జగమిత్రుని గొద్దకుబోయి దమకోరికను దెలియజేసిరి. అంత జగమిత్రుడు గ్రామవాసులనుజూచి నమస్కారముజేసి "అయ్యలారా! నగరములో జేయు భిక్షాటనచే నాకుటుంబ పోషణ జరుగుచున్నది. చాతకములకు తృష్ణగలిగిన మేఘములు దీర్చుచున్నవి పక్షులకు క్షుధకలిగిన నాహారము లభించుచున్నది. 'విశ్వకుటుంబీకు'డగు శ్రీ పంఢరీనాథుని నే నాశ్రయించి యుండ నాకు కొదువయేమి? సూర్య ప్రకాశమును విడచి దీపమున కాశించునట్లును, గృహమున కామధేనువుండ గూలిపని జేయునట్లును, గంగానది సన్నిధి నుండ కూపమును వెదకినట్లును బవిత్రమగు భిక్షాన్నమును ద్యజించి మీరిచ్చు భూముల నంగీకరించుట వ్యర్థమని" జెప్పెను

గ్రామవాసులు "మీ పేరుతో మేము వ్రాయుటకు నిశ్చయించితిమి. మీరంగీకరింపక తప్పదు. ఆ భూమిలో ఫలించు ధాన్యములో మీ కుటుంబ పోషణ జరిపించుకొనుచు, మిగిలినది ధర్మమున కుపయోగించుడని" ప్రార్థించిరి. గ్రామజనులు నిర్బంధముగ జగమిత్రుని పేరుతో పరళీ వైజనాథ గ్రామమును దఖలువ్రాసిరి. ఆ గ్రామమునగల రైతులు శరీర కష్టమునుజేసి యాభూమిలో ఫలించిన ధాన్యమును జగమిత్రుని కొప్పగించు చుండిరి. జగమిత్రుడు గ్రామస్థుల యిచ్ఛాప్రకారము ధర్మకార్యముల జేయుచుండెను కొందరు దుష్టులా యీ నామభూమిని జప్తు చేయించిరి. భావుక జనులిది చూచి "మేము స్వేచ్ఛతో జగమిత్రుని కర్పించు కొంటిమని" యాగ్రామాధికారికి దెలియ జేసిరి.

గ్రామాధికారి జగమిత్రుని రప్పించి "అయ్యా! మీరు జగత్తునకు మిత్రులని ప్రజలు పలుకుదురు. నా గృహమున దేవపూజకై నొక వ్యాఘ్రము కావలయును. మీరు సంధ్యాసమయము లోపల దీసికొని వచ్చినచో యదార్థముగ మీరు జగత్తునకు మిత్రులని నిశ్చయించెదను

అట్లు తీసుకొని రానియెడల మీ యీనామును మీ స్వాధీనమునందుండి తప్పించెద"నని జెప్పెను.

జగమిత్రు డవశ్యమని జెప్పిబయలుదేరి హృదయములో శ్రీ విఠ్ఠల మూర్తిని నిలిపి "జయజయ అనాథబంధో, కరుణాకరా, భక్తవత్సలా కృపాసాగరా, పతితపావనా, విశ్వంభరా, దీనోద్ధారా, రామకృష్ణా, పంఢరీశా, రుక్మిణీపతీ, విశ్వపాలకా, చైతన్య మూర్తీ! తత్క్షణమే దర్శనమిమ్ము. గ్రామాధికారి నామిత్రుడు అతని కుమార్తె వివాహము జరుగ నున్నది. వ్యాఘ్ర పూజజేయవలెనని కుతూహలుడై వ్యాఘ్రమును గోరుచున్నాడు. గాన ఓ దేవాధిదేవా! తత్క్షణమే వ్యాఘ్ర రూపముతో దర్శన మిమ్మని" ప్రార్థించెను. జగమిత్రుని దీనాలాపములను విని శ్రీ పంఢరీనాథుడు మహా వ్యాఘ్రరూపమున సాక్షాత్కరించి "ఓ భక్తశ్రేష్ఠా నిన్నెవ రవమాన పరచుచుంటిరో, బాధించు చుంటిరో వారిని నాకుజూపుము, తత్క్షణమే వారిని నిశ్చయముగా భక్షించుతునని" పలికెను.

జగమిత్రుడు "ఓ దేవాధిదేవా! గ్రామాధికారి నాకు పరమ మిత్రుడు. అతడు పూజకై వ్యాఘ్రమును గోరుచున్నాడు. ఓ కేశవా! శాంతమును వహించి నావెంటరమ్ము. నీవుతప్ప నన్ను రక్షించువారెవ్వరని" పలికెను. శ్రీ విఠ్ఠలనాథుడు జగమిత్రుని జూచి "ఓ భక్తశ్రేష్ఠా! నీవునన్ను వెంటనిడుకొని గ్రామమున బ్రవేశింపుము. నేనొక కౌతుకమునుజూపెద"ననగా నాతడు వ్యాఘ్రరూపుడైయున్న భగవంతుని కంఠమును వస్త్రముతో గట్టి యా వస్త్రముయొక్క రెండవకొనను జేతబుచ్చుకొని గ్రామమున బ్రవేశించెను. మార్గమునగల గోవులును, నితరజంతువులును, జనులును భయపడి పలాయనమగుచుండిరి. మహావ్యాఘ్రమును జగమిత్రుడు తీసికొని వచ్చుచున్నాడను వార్త గ్రామమున నెల్లెడల భయభ్రాంతులై గ్రామద్వారమును బిగించిరి, స్త్రీ పురుషు లెల్లరును తమతమ గృహములందు కవాటములు బిగించి గృహములలో దాగి

యుండిరి. మరికొందరు మేడలపై కెక్కి యాశ్చర్యముతో వ్యాఘ్రమును జూచుచు జగమిత్రుడు నిర్భయముగ నున్నాడని పలుకుచుండిరి. మరి కొందరు జ్ఞానులు భగవంతుడే వ్యాఘ్రరూపముతో భక్తుని రక్షించు టకై వచ్చెనని చెప్పుకొనుచుండిరి. మరికొందరిది సత్యముగా వ్యాఘ్రమే. గ్రామాధికారి నిది భక్షించు ననుచుండిరి. మరికొంద రిది క్రూర మృగము. గ్రామప్రజలెల్లరికి హాని సంప్రాప్తించునని భయపడుచుండిరి. కొందరు జ్ఞానులు గ్రామాధికారియొద్దకు జని "అయ్యా! మహాభక్తుడగు జగమిత్రుని మీరవమానపరుప దలచుటచే ప్రళయకాలమాసన్నమైనది. రావణుడు సీతాహరణము చేయ రాక్షసులకు మరణము సంప్రాప్తించి నట్లు, దుర్యోధనుడు ద్రౌపది నవమానపరుప మహావీరులు నశించినట్లు మీరుజగమిత్రు నవమాన పరుప దలచుటచే గ్రామమునకు మహావిపత్తు సంప్రాప్తించిన" దని పలికిరి. గ్రామాధికారి భీతినొంది భార్యా పుత్రు లతో గలిసి తన సదనమున దాగియుండెను.

జగమిత్రుడు గ్రామ ద్వారము మూసియుండుట గని "ఓ వ్యాఘ్రమా! నగరములో బ్రవేశించు నుపాయమెట్లు?" అని యడుగగా వ్యాగ్రరూపుడైన భగవంతుడు గర్జించెను. ఆ గర్జనధ్వనికి ద్వారములు పగిలి క్రిందబడిపోయెను. పిదప జగమిత్రుడును, వ్యాఘ్రమును నగర ములో బ్రవేశించగా స్త్రీ పురుషులెల్లరు నార్తస్వరములతో రోదన చేయుచుండిరి. ప్రజలెల్లరును భయభ్రాంతులై యుండ జగమిత్రుడు వారిని గాంచి "మీరు స్వస్థముగా నుండుడు. మీ కేమియు బ్రమా దము జరుగ" దని చెప్పగా జనులెల్లరు నానంద కందళిత మానసులైరి. జగమిత్రుడు వ్యాఘ్రమును గ్రామాధికారి గృహమునకు దీసికొని పోయెను. గ్రామాధికారి యాలుబిడ్డ లెల్లరును భయకంపితగాత్రులైరి. జగమిత్రుడు గ్రామాధికారి గృహమున కెదురుగ నిలువబడి "అయ్యా! తలుపుల బంధించితి రేల? మీ దైవమును దెచ్చితిని. త్వరితముగా వెలు పలికి వచ్చి పూజింపుడు. నానావిధ వ్రతతపములును, కఠినమగు తీర్థ యాత్రలను జేసినను, దుర్లభుడగు భగవంతుడు మీ గృహమున కరు

దెంచెను. యోగీశ్వరుల ధ్యానమునకు గోచరింపని భగవంతుడు మీా గృహమునకు విచ్చేసెను. మీారు తలుపులు తెరచి త్వరితముగా వెలుపలికి వచ్చి నిర్భయముగ బూజింపు" డని చెప్పెను.

వ్యాఘ్రరూపుడగు భగవంతుడు విశేషముగ గర్జించుచు తోకను నేలకుగొట్టి బహువిధ క్రూరస్వభావముల జూపుచుండ, జగమిత్రుడు గట్టిగా వ్యాఘ్రముమెడకు గట్టిన వస్త్రము లాగి పట్టుకొనుచుండెను. భగవంతు డా ప్రకారముగా భక్తాధీనుడై తన దేవత్వమును త్యజించి యపరిమిత లీలలను జూపుచుండెను. గృహమున నున్న గ్రామాధికారియు నాతని భార్యా పుత్రులును దమ్ము రక్షింపుమని దీనాలాపములతో జగమిత్రుని బ్రార్థించుచుండిరి. జనులెల్లరును నత్యాశ్చర్యాన్వితమానసులై కరతాళధ్వనుల జేయుచు బరిహసించుచుండిరి. గ్రామాధికారి ధైర్యమవలంబించి తలుపులు తెరచి చేతులు జోడించి "నే నజ్ఞానముతో దమకొనర్చిన యపచారమునకు దగిన యపకీర్తిని బొందితిని. నాకు బ్రాణదానమొసంగుడు. నిజముగా మీారు జగత్తునకు మిత్రు" లని పరిపరివిధముల దీనాలాపములతో స్తుతించుచుండెను.

జగమిత్రు డా వ్యాఘ్రమును దిరిగి యరణ్యమునకు దీసికొని పోయెను. భగవంతుడు తన నిజరూపమును జగమిత్రునకు జూపి యాలింగనము జేసికొని యంతర్ధానుడయ్యెను. నాటినుండియు గ్రామాధికారియు, బ్రజలును జగమిత్రుని యందమిత వాత్సల్యముతో నాతనిని సేవించుచుండిరి. జగమిత్రు డఖండముగా హరినామసంకీర్తన జేయుచు జీవితమంతయు గడపి పతితులను భక్తిమార్గాసక్తులనుగా జేసి యవసానమున శ్రీ పంఢరీనాథుని సన్నిధి జేరెను.

ఇరువదియొకటవ యధ్యాయము సమాప్తము.

శరణాగత వత్సలాయ నమః

---

# జోగా పరమానంద చరిత్ర

## —♦ ఇరువదిరెండవ యధ్యాయము ♦—

శ్రోతలారా! నిజభక్తుల సచ్చరిత్రలు శ్రవణముజేసినచో సర్వసుఖములు ననాయాసముగ సంప్రాప్తించును. జగజ్జీవనుడు సంతసించి శ్రోతృజనులకు సాయుజ్యపద మనుగ్రహించును. మరియు వారల హృదయమున శాంతియు, క్షమయు నఖండముగ వసించును. వారి దేహమునుండి కామ క్రోధాదులు పలాయనమగును. శుద్ధ సత్వగుణ మలవడి సకల దురితములును దగ్ధమగును. బుద్ధిసిద్ధులును, నింద్రపదమును, ప్రారబ్ధమును వారు గణించరు. వారి కనాయాసముగా సాత్విక వైరాగ్య మలవడును. పురుషోత్తముడు సాక్షాత్కరించి తన భజనయందు ప్రేమ నను గ్రహించి భవభయములను హరించును. భక్తుల సచ్చరిత్రలయందు విశేషమహిమ గలదని పార్వతీదేవికి శంకరుడు జెప్పెను. కాన చతురులగు మీరు సావధానముగ శ్రవణము జేయుడు.

బారసీ గ్రామమం దఖండవిరక్తుడును, నుదారుడును వైరాగ్యభరితుడును నగు 'జోగా పరమానందు' డను పేరుగల భక్తుడొకడుండెను. ఆతడు సంతుష్టచిత్తుడై మానాపమానములను, నాశాపాశబంధములను ద్యజించి శ్రీ సంఘరీనాథుని భజించుచుండెను. ఆతడు ప్రతి నిత్యమును ప్రాతఃకాలమున నిద్రనుండి లేచి, దేహబాధలను దీర్చుకొని, స్నానము జేసి, షోడశోపచారవిధుల భగవంతుని బూజించి, సప్తశతములు సాష్టాంగనమస్కారములను జేయుచుండెను. నియమముతో నొక భగవద్గీతాశ్లోకము జెప్పుచు నొక్క సాష్టాంగనమస్కారముచొప్పున బ్రతి నిత్యము సంపూర్ణ భగవద్గీతాపారాయణ జేసి పిదప భుజించుచుండెను. నిత్యనియమ మేమియు లేక భుజించు మానవుడు సూకరముతో సమానుడని శాస్త్రమందు జెప్పబడియున్నది. పశు పక్షులకును, క్రిమి కీటకములకును, మృగములకును శాస్త్రమందు పాప పుణ్యములు జెప్పియుండలేదు. అయాచితముగా లభించిన నర దేహము సార్ధకపరచుకొనుటకు

సత్సమాగమవశ్యము. సత్సంగతి లేనిది జ్ఞానోదయముగాదు. సంసార వ్యామోహమందు దగుల్కొన్న వారికి విశ్రాంతియును లభింపదు; తీర్థ వ్రతతప దానానష్ఠానములకంటె శ్రేష్ఠమైన సాధనము హరినామ సంకీర్తనము. ఈ కలియుగమున మానవులు కడతేరుటకు నామస్మరణ తప్ప విశేషమైన సాధనము లేదు; సంసార వ్యామోహములోనుండి తమతమ పరిపాటలు జూచుకొనుచు మనమున హరిచింతనము జేసిన భగవంతు డాతనియొద్ద వసించును. నామమహిమ మిగుల శ్రేష్ఠమైనదని సర్వజ్ఞులు దెలిసికొందురు.

జోగా పరమానందుడు స్వానంద భరితుడై హృదయమున గోవిందుని నిల్పుకొని యఖండముగా హరిభజన జేయుచుండెను. ఒకానాడొక వర్తకుడు మహాద్వారములో బ్రవేశించెను ఆదినమునం దపారముగా వర్షించుటచే నాస్థలమంతయు బురదగా నుండెను. జోగాపరమానందు డనుష్టానము జేసికొనుచుండగా వర్తకుడు జూచి యానంద భరితుడై "యీ భక్తుడు ధన్యుడు, పూర్ణవైరాగ్య పరుడవ"యెంచి యమూల్యమగు నొక పీతాంబరమును దీసికొనివచ్చి ఆతనికిచ్చి నమస్కారము జేసి "ఓస్వామీ! కృపానిధీ తామీ వస్త్రమును ధరింపుడు మందబుద్ధినగు నేను తమను శరణుబొందితి"నని ప్రార్థించెను.

జోగా పరమానందు డావర్తకుని ప్రార్థన నాలకించి "అయ్యా' నాకీ యమూల్య,పీతాంబరంబేల? నాకు వస్త్రము నీయవలెనని నీకుకోరిక యున్నచో జీర్ణ వస్త్రమర్పింపుము. ఈ పీతాంబరమును శ్రీ విఠలనాధుని కర్పించిన మీపై భగవంతునకపార కృపకలుగును. జీర్ణవస్త్ర పరిధానము జేసి భిక్షాన్నముచే నిర్విఘ్నముగా దేహయాత్రను గడుపుచున్న నాకీ యమూల్య పీతాంబరం బిచ్చినందులకు సార్థకముండదు. ఎవరికేది యోగ్యమో యాదానము జేయుచుండవలయును. పక్షులకు ధాన్యమును, పశువులకు తృణమును, సత్పాత్రనుజూచి ద్రవ్య దానమును, వృక్షమునకు జలమును, యాచకున కన్నవస్త్రములును, యర్పించు

టుచితమని జెప్పెను.) వ ర్తకునకీ ధర్మములు దెలియక బలాత్కారముగ పీతాంబరమును జోగాపరమానందుని నడుమునకు జుట్టి వెడలిపోయెను.

జోగా పరమానందునకు పీతాంబరము బురదలో తడియునని లోభము మనమున నుద్భవించుటచే సాష్టాంగనమస్కారము జేయుట మాని నిలువబడి చేతులు జోడించి నమస్కారము జేయుచుండెను. ఆ దినము మధ్యాహ్నము రెండుఝాముల వేళవరకు ఆతని నియమము ప్రకారము సహస్ర సాష్టాంగనమస్కారములు పూర్తికాలేదు. ఎండ తాప మధికముగా నుండి యాకలిదప్పులు బాధించుచు. వ్యాకులచిత్తుడై "నేను నమస్కారములు బూర్తిగాకపూర్వమే యాకలిదప్పులు బాధించు టకును, చిత్తము వ్యాకులమగుటకును కారణమేమో దెలియకున్న" దని దీర్ఘముగా నాలోచించి 'పీతాంబరమును శత్రువు జేసుటచే భగవత్సేవకు విఘ్నము దటస్థించినది! పూర్ణిమదినమున సంపూర్ణ చంద్రప్రకాశము నకు రాహువు కళంక మేర్పరచినట్లును, పాత్రలందు వడ్డింపబడిన పక్వా న్నములను శ్వానము స్పృశించినట్లును, సన్యాసి యనుష్ఠానమున గూర్చుండ వానికి రాజాన్న మకస్మాత్తుగా వచ్చినట్లు, నీ పీతాంబరము నా సుకృతమునకు విఘ్నము దెచ్చినది! ఈ యన్యాయమునకు దేహ దండన యొనర్పవలెనా? లేక యరణ్యమునకు బోయి పంచాగ్ని సాధన జేయవలెనా? లేక యష్టాంగసాధన జేయవలెనా? లేక పర్వతగుహాలలో వసింపవలెనా? లేక త్రివేణీస్నాన మాచరింపవలెనా? లేక హిమాల యము జేరి జీవిత మచట గడుపవలెనా? లేక యన్న పానీయాదులను త్యజించి యాసనము వేసికొని యుండవలెనా? లేక యగ్ని కాహుతిగా దేహాంతప్రాయశ్చిత్తము జేసికొనవలెనా? మరి యేమిజేసిన శ్రీ రుక్మిణీ కాంతుడు సంతసించి దర్శనమిచ్చు" నని పశ్చాత్తప్తచిత్తుడై పరిపరివిధ ముల యోచించుచుండెను.

అ సమయమున నొకరైతు రెండెద్దులకు నాగలిని గట్టి పొలము దున్నుటకు బోవుచుండుటనుజూచి జోగా పరమానందుడు నేత్రముల నుండి యశ్రుధారలు విడచుచు, నా రైతును బిలచి యొక క్షణకాలము

నీ యెడ్లను నాకిమ్ము. నీకీ పీతాంబర మిచ్చెదనని చెప్పగా నా రైతంగీ కరించి పీతాంబరమును గైకొని యెడ్ల నొప్పగించెను. జోగా పరమానందుడు నాగలికి తన పాదములనుగట్టి నేలపై పరుండి యారైతును నెడ్లను దోలుమని జెప్పగా నవివేకియగు నారైతెడ్లను దోలుచుండెను. ఎడ్లుబెదిరి వేగముగ పరుగిడుచుండ రాళ్లును ముండ్లును దగిలి జోగా పరమానందుని శరీరమంతయు గాయములై రక్తము ప్రవహించుచుండెను. ఈ దృశ్యము నెద్దులుజూచి మహావేగముగ బోవుచుండెను. జోగా పరమానందుడు తానుజేసిన యపరాధమునకు దగిన ఫలము లభించినదని సంతసించుచు భగవంతుని "శ్రీరామకృష్ణా, నారాయణా, పతితపావనా, కరుణాకరా, రుక్మిణీమానస రంజనా, పయోధ్ధివాసా, శేషశయనా, భక్తరక్షకా, గుణనిధానా, జగజ్జీవనా. పాండురంగా" యని స్తోత్రము జేయుచుండ యెద్దు లరణ్య ప్రదేశమును జేరెను.

జోగా పరమానందుని శరీరమున మాంసమంతయు బోయి, యస్థి పంజరము మాత్రము మిగిలి ముఖమంతయు గాయములై నాలుకదెగి యొక క్షణములో ప్రాణము బోవుటకు సిద్ధముగ నుండెను. మకరిచే గజేంద్రుడు బాధింప బడుచుండ రక్షించినట్లును, దుశ్శాసనుడు ద్రౌపతి వస్త్రముల నపహరించుచుండ నక్షయ వస్త్రముల నిచ్చినట్లును, శ్రీపంఢరీనాధుడు తత్క్షణమే సాక్షాత్కరించి నాగలినుండి వృషభములను విప్పి జోగా పరమానందునెత్తి నాలింగనము జేసికొని కృపాదృష్టితో జూడగా నాతడు దివ్యశరీరు డయ్యెను. సూర్యోదయమున నంధకారము పటాపంచలగునట్లు, శ్రీ పంఢరీనాధుడు కృపాదృష్టితో జూచినంతనే దివ్య దేహము గలిగెను. అంత శ్రీరుక్మిణీ కాంతుడు "భక్తశ్రేష్ఠా! ఇంత సాహస కార్యమేల జేసితివి. ఏ యన్యాయమెరుగని యీ దేహమున కింత దండన విధించుట తగదు. నీవుజేయు నన్నపానాదులు నాకు జెందుచున్నవి. సహజముగ నీవుచేయు గమనము నా ప్రదక్షిణమై యున్నది. నీ పలుకులు నా స్తవములై యున్నవి. నీ శయనము నాకు సాష్టాంగ నమస్కార మగుచున్నది. ఇట్లుండియు నింత ఘోర కార్యమేల జేసితి"వని జెప్పి కృపాదృష్టితో జూచి యంతర్థాను డయ్యెను.

ఒకనాడు పంఢరీ పురములో భక్తులెల్లరు భగవంతుని సమక్ష ముననుండ (శ్రీ) విఠ్ఠలనాథుడు జోగా పరమానందుని వృత్తాంతమంతయు భక్తులకు దెలియజేసెను. భక్తులెల్లరును నాశ్చర్యము నొందిరి. జ్ఞానేశ్వరులు (శ్రీ) పంఢరీనాధునితో "హృషీకేశా! నీ లీలల కంతుండదు. భక్తుల నొకనికంటె మరియొకనిని శ్రేష్ఠులనుగా సృష్టించితివి. వారి మహిమ విశేషము నీకే దెలియును గాని యన్యులకు దెలియ"దని చెప్పెను.

జోగా పరమానందుడు ప్రత్యాషాఢ కార్తీక శుద్ధైకాదశికి పంఢరీక్షేత్రమున కేగి బ్రహోత్సవమును దర్శించి, నియమముతో నేకాదశీ వ్రత మనుష్ఠించి జీవితమంతయు నఖండ హరినామస్మరణతో గడపి, యంత్యమున భగవత్సన్నిధి నలంకరించెను.

ఇరువది రెండవ యధ్యాయము సమాప్తము

భక్తజన పరతంత్రాయ నమః

# నరహరి భక్త చరిత్ర

## —♦ ఇరువదిమూడవ యధ్యాయము ♦—

జయజయ వాసుదేవా, జగన్నాథా, కమలలోచనా, రుక్మిణీ కాంతా, భక్తసుఖ దాతా, పద్మనాభా, విశ్వమూర్తీ, విధిజనకా, వైకుంఠపతీ, విరాట్స్వరూపా, వామనమూర్తీ, విశ్వబాహూ, విశ్వ దేవతా, విశ్వపతీ, గమనకర్తా, సగుణస్వరూపా, హృషీకేశా, నీ మహిమవిశేషము దెలిసికొనుటకు వేదశాస్త్రముల కగమ్యము. భక్తుల చిత్తములం దే యే కోరికలున్నవో వానిని నీవు పరమప్రీతితో దీర్చు చుందువు బాలకుని జేయి బుచ్చుకొని తల్లి యానందముతో నడచుచు నాతడు పలుకు జిలిబిలి పలుకుల కానందించుచు, నెత్తుకొని ముద్దిడు నట్లు, భక్తుల కధ్యాత్మజ్ఞానము దెలియకపోయినను, నపశబ్దములతో నిన్ను స్తుతించినను నీవు మిగుల ప్రేమతో నాదరించి వారిని గాపాడు చున్నావు.

పరమపవిత్రమగు పంఢరీపురక్షేత్రమున విశ్వకర్మ కులోద్భవు డును, స్వర్ణకారుడును నగు నరహరి యను పేరుగల గృహస్థొకడుం డెను. అతడు ప్రాతఃకాలమున నిద్రనుండిలేచి దేహబాధ దీర్చుకొని చంద్రభాగానదిలో స్నానము జేసి భక్తిశ్రద్ధలతో మల్లికార్జునునిబూజించి పిదప తనపనులు జూచుకొనుచుండెను. అతడు పంఢరీపురమున జన్మిం చినవాడైనను, శ్రీ విఠ్ఠలనాథుని దేవాలయమున కెన్నడును బోయి దర్శించి యెరుగడు. గృహమందొక స్థలమున గూర్చుండి తన మనంబున శంకరుని నిల్పి యఖండముగా శివనామము నుల్లాసముతో భజించు చుండెను. చాతకపక్షులు మేఘజలమును దప్ప భూజలమును స్వీకరింప నట్లును, పుణ్యాంగన లెందరు గనబడినను బాలునిమనస్సు తల్లి గనబడు వరకు సమాధానము గానట్లును, నక్షత్రములెన్ని ప్రకాశించినను కమ లము వికసింపనట్లును, త్రికరణశుద్ధితో తా నారాధించు శంకరుని దప్ప నరహరి యన్యదేవతా స్మరణయందు విముఖుడుగ నుండెను. గణేశ

చతుర్థిదినమున స్త్రీ పురుషులెవ్వరును చంద్రుని జూడనటుల నరహరి భక్తుడు శివునిదప్ప యన్యదేవతలను దర్శింపక శ్రీ విఠ్ఠలనాథుని దేవాలయమునహితము కన్నెత్తియైన జూచి యెఱుగడు.

ఇట్లు కొంతకాలము జరిగిన పిదప నొక షాహుకారు తనకొక సుపుత్రు నను్గ్రహించిన నవరత్నములతో సువర్ణ కటిసూత్రమును దయారుచేయించి సమర్పించెదనని శ్రీ పంఢరీనాథుని ప్రార్థింప, కొంత కాలమున కాతనికి శ్రీ విఠ్ఠలనాథుని కృపచే సుపుత్రుడు గలిగెను. వర్తకు డానందభరితుడై తన ప్రార్థన జెల్లించుకొనవలెనని దలచి, సువర్ణమును రత్నములను దీసికొని చతురుడగు కార్మికు డెవరని దేవాలయార్చకులను విచారించెను. అంత నర్చకులు వర్తకుని జూచి "అయ్యా! యీ క్షేత్రమున నరహరియను స్వర్ణకారుడొకడు గలడు. ఆతడు సత్యవాదియు విద్యానిపుణుడును, నీశ్వరభక్తుడై యున్నాడు. మీ రాతనికి సువర్ణమును రత్నముల నిచ్చిన మిగుల శోభాయమానముగ కటిసూత్రమును దయారుచేయగల" డని జెప్పిరి.

తత్క్షణమే వర్తకుడు మార్గమున విచారించుచు నరహరి గృహమున కేగి రత్నములను సువర్ణమును నాతనికిచ్చి "శ్రీ పంఢరీనాథునకు కటిసూత్రము ఘనితనముగ జేయుము; నీవు కోరిన మజూరి యొసంగెద" నని చెప్పగా నరహరిభక్తుడు శివశివాయని కర్ణములు మూసికొని వర్తకునితో "మీరు కోరినట్లే కటిసూత్రము సౌందర్యయుక్తముగ జేసి యిచ్చెదను; కొలతమాత్రము నాకు దెచ్చి యీయుడు. మీ రిచ్చు కొలతకు సరిగా హెచ్చుతగ్గులు జేయక, నా విద్యానైపుణ్యమంతను జూపి వారముదినములకు దయారుజేసి యిచ్చెద" నని చెప్పెను; అంత వర్తకుడు మిగుల నాశ్చర్యముతో నీతడు దేవాలయమునకు బోవనివానివలె గనపడుచున్నాడు; తర్కవాక్యములతో సంభాషించిన కార్యము జెడు;; నని యోచించి దేవాలయమునకు బోయి యర్చకులవలన కొలత దీసికొని నరహరిభక్తున కిచ్చెను.

నరహరిభక్తుడు కటిసూత్రములో చాతుర్యయుక్తముగ రత్నముల నమర్చి నిర్ణీతదినమున వర్తకునికిచ్చెను. వర్తకు డానందముతో దేవాలయమునకు బోయి, శ్రీ పంఢరీనాథునకు పంచామృతాభిషేకము జేయించి నూతనవస్త్రము లర్పించి షోడశోపచారవిధుల బూజించి కటిసూత్ర మర్పించెను. అర్చకు లా కటిసూత్రమును భగవంతుని నడుమునకు దగిలించిజూడగా మిగుల వదులుగా నుండెను. పిదప వర్తకుడు సరియగు కొలతను దీసికొనిపోయి కటిసూత్రమును సరిజేయుమని నరహరిభక్తుని కిచ్చెను. నరహరి కటిసూత్రమును కొలత ప్రకారము సరిజేసి వర్తకుని కివ్వగా నాతడు దేవాలయమునకు దీసికొనిపోయి భగవంతుని నడుమునకు దగిలించిజూడ నది కురుచయైయుండెను. ఈప్రకారము వర్తకుడు కటిసూత్రమును హెచ్చుతగ్గులు నరహరిభక్తునితో సరిజేయించుచు భగవంతుని నడుమునకు సరిపోనందున చింతాక్రాంతుడై నరహరిభక్తునియొద్దకు వచ్చి చేతులు జోడించి "అయ్యా! నాకు శుద్ధభావము లేదు, అందుచే భగవంతు డీ కటిసూత్రము నంగీకరింపలేదు. నీవు స్వయముగా దేవాలయమునకు వచ్చి శ్రీ విఠ్ఠలనాథునకు నీ హస్తముతో కటిసూత్రమును దగిలించి నన్ను దృప్తిపరచు" మని యాతని చరణములపై బడి సాష్టాంగనమస్కారముజేసి ప్రార్థించెను.

నరహరి వర్తకుని మాటలువిని "అయ్యా! నేను వ్రతస్థుడను శంకరుని దప్ప నన్యదైవములను జూచువాడను కాను. నీ ప్రార్థనకు లోబడి నేత్రములకు వస్త్రమును జుట్టుకొని వచ్చెద"నని చెప్పి యొక వస్త్రముతో కండ్లు గనబడకుండ గట్టుకొని వర్తకుని జేయిబుచ్చుకొని దేవాలయమున బ్రవేశించెను. జనులెల్లరు నాశ్చర్యముతో జూచుచు స్వగృహమున బూడ్చబడియున్న ధనము దరిద్రునకు గనబడనట్లును, నింట చింతామణియుండగా ధనమునకై యవివేకి దేశములు దిరుగునట్లును, రోగికి బక్వాన్నములు రుచింపనట్లును, శ్రీ విఠ్ఠలనాథుని దర్శన మీతనికి రుచింపలేదని జెప్పుకొనుచుండిరి. నరహరిభక్తుడు వర్తకుని జేయిబుచ్చుకొని సభామంటమున బ్రవేశించి పిదప గరుడ మంటపమున

కేగెను. ఆలయముగల జనులెల్లరును బరిపరివిధముల బరిహసించుచు నీతడు సాష్టాంగ నమస్కారమే జేయుటలేదు, దేవుని నాలింగన వంద నాదు లెట్లుజేసికొనును, గృహమునకు విచ్చేసిన బంధువునకు గూర్చుం డుట కాసన మీయనివాడును, మృష్టాన్న భోజనము బెట్టనట్లును, స్నాన సమయమున సంకల్పమున కంగీకరింపనివాడు బ్రాహ్మణునకు దక్షిణ లీయనట్లును, దులసికి నీరుపోయనివాడు ప్రదక్షిణ జేయనట్లును, సజ్జనులనుజూచి వందనములను జేయనివాడు వారిని తనగృహమున కాహ్వానింపనట్లును, బాటసారులకు దారిజూపనివాడు దనయింట వారికి స్థానమీయనట్లును, దేవుని నిందించువాడు హరికీర్తనకు బోనట్లును, గంగామాహాత్మ్యమును వినుట కిచ్చలేనివాడు సచేల స్నానము జేయ నట్లును, భగవద్దర్శన విముఖుడగు నరహరి నమస్కారమెట్లు జేయునని దేవాలయమున గల స్త్రీ పురుషులెల్లరును జెప్పుకొనుచుండిరి.

నరహరి గర్భాలయమున బ్రవేశించి శ్రీ విఠ్ఠలనాధుని కెదురుగ నిలువబడి దన జేతులతో భగవంతుని తడిమి జూచుచుండెను. పంచ ముఖములును, దశభుజములును, గళమున పన్నగ భూషణములును. శిరమున శోభాయమానమగు జటాభారమును, సర్వాంగములకు విభూతిలేపనయును, గజచర్మ వ్యాఘ్రాంబరములతో సింహాసనముపై విరాజిల్లుచు గనబడుచున్న శ్రీ విఠ్ఠలనాధునిజూచి "ఈతడు నేనారాధించు శివుడే. వ్యర్థముగా నేను నేత్రములను గనబడకుండ వస్త్రముతో గట్టుకొంటి"నని నరహరి పశ్చాత్తప్తచిత్తుడై నేత్రములకు గట్టుకొనిన వస్త్రములను విప్పిజూడగా సింహాసనముపై రెండు పాదములును, సమముగ నుంచుకొని రత్నఖచితమగు సువర్ణకిరీటము, శిరమునను, కర్ణములకు మకర కుండలములను, గంఠమున కౌస్తుభమణియు, గళమున దులసీ మిశ్రిత పుష్పహారములు నమూల్య పీతాంబరములను ధరింప కటిన్యస్త హస్తుడైయున్న శ్రీ పంఢరీనాధునిజూచి నావ్రతము వ్యర్థముగా భంగమైనదని తిరిగి నేత్రములకు వస్త్రము జుట్టుకొని జేతులతో దడిమి జూడగా నొకే శివలింగముగా శ్రీ పంఢరీనాధుడు దర్శన మిచ్చెను.



నరహరిభక్తునకు శ్రీవిఠలరాయఁడు హరిహరరూపమునఁ దర్శనమిచ్చుట.

నరహరికి వెంటనే భేదభావన దొలగి నేత్రములకు జుట్టుకొనిన వస్త్రమును దీసివేసి పశ్చాత్తాపముతో, శ్రీ పంఢరీనాథు నాలింగన వందనాదులు జేసికొని "జయ జయ దేవాదిదేవా, విశ్వవ్యాపకా, జయ జయ సదాశివా, కేశవా, కైలాసవాసా, వైకుంఠధీశా, భక్తపరేశా, యద్వైతవేషా, క్షీరసాగర విలాసా, స్మశానవాసా, నీలకంఠా, భక్త వత్సలా, పంఢరీనాథా! నీ మహిమ విశేషమును దెలిసికొనలేక భేద బుద్ధితో నుంటిని ఓ మేఘశ్యామా! నీ దర్శనమాత్రమున శివకేశవు లను భేదభావము నా హృదయమునుండి దొలగినది. నన్ను నీభక్త కోటిలో జేర్చుకొ"మ్మని దీనాలాపనలతో ప్రార్థించెను. అంత శ్రీపం ఢరీనాథుడు సాక్షాత్కరించి "నీవు నాకు ప్రియమైన నిజభక్తుడవు. నిన్ను దేవాలయమునకు రప్పించుటకై కటిసూత్రమును హెచ్చుతగ్గులు జేసి తిని. నీచేతులతో కటిసూత్రమును నాకు దగిలింపు"మని చెప్పగా నర హరిభక్తుడు శ్రీ పంఢరీనాథునకు కటిసూత్రమును దగిలించెను. వర్త కుడును నచటగల జనులెల్లరును వమితానంద పరవశులైరి.

శ్రీ పంఢరీనాథుడు నరహరి భక్తునకు దర్శనమిచ్చిన శివరూప చిహ్నముగా శిరమున శివలింగమును ధరించియున్నాడు. అప్పటి నుం డియు నరహరిభక్తుడు ప్రతినిత్యమును శ్రీ పంఢరీనాథుని దేవాలయము నకుబోయి సేవించుచుండెను.

ఇరువదిమూడవ యధ్యాయము సమాప్తము

ఆప ద్రక్షకాయ నమః

# నామదేవులను

# శ్రీ విఠ్ఠలనాథుడు బరీక్షించుట

—♦ ఇరువది నాలుగవ యధ్యాయము ♦—

శ్రోతలారా! సావధానముగా నాకర్ణింపుడు. నేను కల్పవృక్షము ఫలించినది. రసవంతమైన భక్తుల సచ్చరిత్రలు వెలువడినవి. అగాధమగు భక్తుల మహిమను వర్ణించుటకు విరించికిని వేదశాస్త్రములకును సాధ్యము గాదు. సత్కర్మము బ్రధానముగ నాచరించు వారు బ్రహ్మపదము జేరుదురు. యజ్ఞయాగాదులు జేయువారు స్వర్గము నధిష్ఠించెదరు. భావపూర్వకముగ పితృసేవ జేయువారు పితృస్థానమున వసించెదరు. దేవతల నుపాసించువా రాయా దేవతాపదముల నధిష్ఠింతురు. పిశాచముల నుపాసించు తామస జనులు మరణమొంది తద్రూపులగుదురు. భక్తుల సచ్చరిత్రలను శ్రవణము జేయువారు వైకుంఠభువనము జేరుదురు. ఆ భక్తుల సంకటములను భగవంతుడు దొలగించి చతుర్భుజ రూపములతో సాయుజ్యసదనమున నధిష్ఠింప జేయును. పంఢరీనాథు డీవరదాన మిచ్చియున్నాడు. కాన ప్రేమతో భక్తుల చరిత్రలను శ్రవణము జేయుడు.

ఒకానొక దినమున శ్రీ పంఢరీనాథు డేకాంతముగ నామదేవులను బిలచి "నేను సర్వభూతములయందును వసించియుంటినని నీకు దెలియునుగదా" యని యడుగగా, నామదేవుడు భగవంతునికి సాష్టాంగ నమస్కారము జేసి "ఓ దేవాధిదేవా! నీకృపవలన సర్వభూతములందు దయగలిగి యుంటి" నని చెప్పెను. ఒక ద్వాదశీ దినమున నామదేవుల బరీక్షించుటకై శ్రీ పంఢరీనాథుడు శ్వానరూపమున యాత్రీకుల గుంపులో జేరెను. కొందరాసమయమున భుజించుచుండగా శ్వానరూపి యగు శ్రీవిఠ్ఠలుడు వారిదగ్గరకు బోయినను నొక గ్రాసమైనను నెవరును వేయరైరి. కొందరి యొద్దకుబోయి నోరుదెరచి సంజ్ఞ జేసెను. కొందరు ఫలహారములజేయుచుండ దగ్గరకు బోయెను. పిదప బ్రాహ్మణులు భుజిం




శ్రీ విఠ్ఠలనాథుడు శ్వానరూపమున నామదేవుని గృహమునుండి
రొట్టెను నోటకరచుకొని పోవుట

చుచున్న స్థలమునకు బోయెను. కొందరు మడిలోనుండగా నిశ్శబ్దముగా వారియొద్దకు బోయెను. ఎవ్వరును పిడికెడు మెతుకులైనను వేయరైరి. కొందరపవిత్రముగా గుక్క చేరినదనిరి. నల్లకుక్కగాన దోషములేదని కొందరు బలికిరి. కర్షకులొకచోట భుజించుచుండ నాశ్వాన మాకస్మికముగబోయి భక్ష్యములను నోటబెట్టుకొనెను. శ్రీ రుక్మిణీకాంతుడు యాత్రకువచ్చిన భక్తులెల్లరిని బరీక్షించుచు దిరుగుచుండెను. భూతదయ గలవారొక్కరైనను గనబడరైరి.

పిదప నాశ్వానము నామదేవుల గృహములోనికి నిశ్శబ్దముగ బ్రవేశించి రొట్టెలను నోటగరచుకొని బోవుచుండెను. తత్క్షణమే నామదేవులదిచూచి "స్వామీ! ఆరొట్టెతినుటకు కఠినముగా నుండును. ఇదిగో నెయ్యి దెచ్చుచున్నాను నిలువు"డని పాత్రలో నేతిని దీసికొనిపోయి రొట్టెను నేతిలోముంచి శ్వానరూపుడగు భగవంతునకు దినిపించుచుండెను. జనులెల్లరు నిదిచూచి "నామదేవులకు బిచ్చిపట్టినది. కుక్కకు రొట్టెను నేతిలోముంచి తినిపించుచున్నా"డని పరిపరి విధముల బరిహసించుచుండిరి. వృక్షమునకు బెద్దచిన్నయను భేదముండనట్లు, నుదకమునకు గోవ్యాఘ్రములను భేదముండనట్లును, చంద్రునకు సజ్జనదుర్జన భేదము లేనట్లును, నాకాశమునకు రాజహంస కాకియను భేదము లేనట్లును, సూర్యునకు రాజు దరిద్రుడను భేదము లేనట్లును, నామదేవులు భేదభావనలేక సర్వభూతములను శ్రీ పండరీనాథుడని భావించుచుండెను.

శ్వానరూపియగు భగవంతుడు హసితవదనుడై "నన్నెట్లు గుర్తించితి"వని యడుగగా "సద్గురుడగు విశోబాఖేచరుని కృపవలన నీ రహస్యమంతయును గ్రహించితి"నని చెప్ప శ్రీ రుక్మిణీకాంతుడదృశ్యుడాయెను. సర్వజనులును నీ కౌతుకమునుజూచి నామదేవుల భక్తి ధన్యమైనదని కొనియాడుచుండిరి. కొంతకాలము జరిగిన పిదప కార్తీక శుద్ధ ద్వాదశినాడు శ్రీ విఠలనాథుడు నామదేవులను బిలచి నేడిచ్చట భుజింప

వలెనని చెప్పగా నామదేవులు "దేవా! నేడేకాదశి అన్నము భుజింప రాదు. దేవతలలో శ్రేష్ఠుడు హృషీకేశుడును, వృక్షములలో శ్రేష్ఠమైనది తులసియు, వ్రతములలో శ్రేష్ఠమైనది యేకాదశియు నైయున్నవి. కాన నేను భుజించినచో జన్మజన్మాంతరములకైన నీ ప్రాప్తి లభింపదని చెప్పెను.

శ్రీ పంఢరీనాథుడు "నామదేవా! నే జెప్పినది వినుము. రుక్మాంగదాంబరీషాదులు నిష్ఠతో నేకాదశి వ్రతము నాచరించిరి. దాంభికముగ నేకాదశి జేయుచున్నామని యెందరో బలుకుదురు. అంతఃకరణమునందు భావములేక జేసిన వ్రతము వ్యర్థమగును. ఆకలిలేని భోజనమును, నింద్రియ నిగ్రహములేని యోగసాధనయు, నౌదార్యములేని దానమును, శూరత్వములేనివాడు యుద్ధమునకు బోవుటయు, వ్యర్థములగునట్లు వైరాగ్యములేని వ్రతము నిష్ప్రయోజన"మని చెప్పెను. నామదేవులు చేతులు జోడించి "ఓ దేవాదిదేవా! మీ కృపవలన నేను భావపూర్వకముగ నియమముతో నేకాదశీ వ్రతము నాచరించుచుంటి" నని చెప్పెను. భగవంతుడు నామదేవుల బలుకుల కానందించి "నీవు గుణవంతుడవు నీ కసాధ్య మెద్దియులే"దని బలికెను. కొంతకాలము జరిగినపిదప శ్రీ పంఢరీనాథు డొక యేకాదశీ దినమున వృద్ధబ్రాహ్మణరూపియై, జీర్ణవస్త్రములను ధరించి, చేత కర్రను బుచ్చుకొని, వణకుచు, క్షుద్బాధా పీడితుడుగ నగపడుచు, నామదేవుల గృహమునకు బోయి, "నీవు విష్ణు భక్తుడవు. అత్యుదారుడవు. మూడుదినములుగ నన్నము లేక క్షుద్బాధచే పీడింపబడుచున్నాను. నాకు కొంచె మన్నముబెట్టి పుణ్యముగట్టు"కొ మ్మనెను.

నామదేవులు వేషధారియగు భగవంతునికి వందనములను జేసి 'స్వామీ! తా మెచ్చటనుండి దయచేసితిరి. కూర్చుండుడు. నే డేకాదశీపర్వకాలము. నే డన్నము భుజింపరాదు. ఖర్జూరాది ఫలములను, నంగీకారమైనచో కందమూలాదులను దెచ్చి యిచ్చెద" నని జెప్పగా

ద్విజరూపుడగు భగవంతుడు "అన్నముదప్ప నాకేమియు నవసరము లేదు. నేను నీయింట భుజింపవచ్చితిని. నీ వన్నము పెట్టనిచో నా ప్రాణములు పోవును. నీకు బ్రహ్మహత్యాపాపము దగులు"నని జెప్పెను. వృద్ధబ్రాహ్మణుని వచనము లాకర్ణించి నామదేవు లాతనితో "అయ్యా! నేను విష్ణుభక్తుడను. పుణ్యపాప విరహితుడనై పాండురంగని చరణముల సేవించుచు జీవన్ముక్తుడనైతిని. పుణ్యము నపేక్షింపనివారికి దురితములు బాధించు నను చింత యుండనట్లును, ప్రేమ లేనివానికి వియోగదుఃఖ ముండనట్లును, ద్రవ్యలోభము లేనివానికి తస్కరులభయ ముండనట్లును, సన్మాన మపేక్షింపనివాని కవమానముండనట్లును, నాత్మస్తుతిని గోరని వానికి నిందాభయముండనట్లును, లాభము గోరనివానికి నష్టమనువిచార ముండనట్లును నో ద్విజవరా! పాపపుణ్య విరహితుడనగు నన్ను బ్రహ్మ హత్యా పాతకము బాధింపదు" అనెను.

అంత వృద్ధబ్రాహ్మణ వేషధారి "హృదయమున భూతదయ లేనిదే యెన్నో జ్ఞానోక్తులను బలుకుచుంటివి. నే నన్నములేక క్షుద్బా ధచే పీడింపబడుచున్నాను. ఓ విష్ణుభక్తా! నీ వన్నము బెట్టనిచో యదా ర్థముగా నా ప్రాణము క్షణకాలములో బోవు' నని జెప్పగా నామదే వులు "నీ ప్రాణము బోయినచో నాగతియు నట్లే యగు" ననిజెప్పెను. అంత వేషధారియగు భగవంతుడు గ్రుడ్లు గిరగిర ద్రిప్పుచు మూర్ఛ నొందగా నామదేవులు జూచి దగ్గరకు బోయి బరీక్షింపగా నుచ్ఛ్వాస నిచ్ఛ్వాసము లాగిపోయెను. ఇరుగు పొరుగు స్త్రీలెల్లరును నీ వృత్తాంత మును విని యచ్చటికి వచ్చి "వ్యర్థముగా వృద్ధబ్రాహ్మణుని జంపి బ్రహ్మహత్యాపాతకమున కొడిగట్టుకొంటి"వని నామదేవులను నిందించు చుండిరి. నామదేవుని చిత్తమునందు జనులు నిందించుచున్నారను విక ల్పము లేక నా బ్రాహ్మణుని ప్రేతమును భుజముపై వేసికొని చంద్ర భాగా తీరమునకు గొనిపోయెను. పిడకలను కట్టెలను దెచ్చి నదీతీరమున జితి పేర్చి ప్రేతమును దానిపై బరుండబెట్టి తానును దానిపై బరుండి నిప్పంటించెను. జనులెల్ల రాశ్చర్యముగ జూచుచు నామదేవునితో సమ

మగు వైష్ణవవీరు లీ పృథ్విలో లేరని గొనియాడుచుండిరి. తత్క్షణమే యా యగ్నినుండి శ్రీ రుక్మిణీకాంతుడు సాక్షాత్కరించి నామదేవు నెత్తి యాలింగనము జేసికొన్ని "నామదేవా! నీతో సములగు దృఢభక్తు లీ త్రిభువనములందు లేరు. పూర్వము రుక్మాంగ దాంబరీషాదు లేకా దశీవ్రతమును జేసిరి. కాని నీ నిష్ఠకు సరిపో" రని చెప్పి తత్క్షణమే యంతరానుడయ్యెను. ప్రజలెల్లరును నత్యాశ్చర్యముతో నామదేవుల గొనియాడుచు సాష్టాంగనమస్కారములు చేసిరి.

ఇరువదినాలుగవ యధ్యాయము సమాప్తము.

భక్త సులభాయ నమః

---

# జనాబాయి చరిత్ర

## —♦ ఇరువదియైదవ యధ్యాయము ♦—

జయ క్షీరాబ్ధివాసా, శేషశయనా, రుక్మిణీరమణా, సగుణస్వరూపా, భక్తభూషణా, గుణనిధాన, శ్రీ విఠ్ఠలా, అనంతావతారా, చైతన్యరూపా, కరుణాకరా, అమరపాలకా, పంఢరీరాయా, సర్వవ్యాపకా, సర్వాతీతా, గజేంద్రరక్షకా, వైకుంఠనాథా, చిత్తచాలకా, చైతన్యఘనా, భక్తరక్షకా, అసురమర్దనా, పుండలీకవరదా, రుక్మిణీరమణా, పాండురంగా, నీవు విధాతకు జనకుడవై యున్నావు సర్వము జేయుచు నకర్తవై ఉన్నావు. నీవు లేని తావే లేదు. నాయందు కృపయుంచి నీ భక్తుల సచ్చరిత్రలను వర్ణించుటకు నావాక్కున ప్రవేశించి భక్తవిజయము పూర్ణము జేయించుము.

ఒకానొక సంవత్సరమున శ్రీ పంఢరీపుర క్షేత్రమునందు జరుగు కార్తీక శుద్ధైకాదశీ బ్రహ్మోత్సవమును సేవించుటకై గంగాఖేడను గ్రామమునుండి జనాబాయియను సప్తవర్షముల ప్రాయము గల బాలిక జననీ జనకులతో బోయి, చంద్రభాగానదియందు స్నానముజేసి, మహాద్వారములో సాష్టాంగవందనంబు లాచరించి దేవాలయమునకు బోయి సింహాసనముపై భక్తుల రాకకై నిరీక్షించుచున్న శ్రీ పాండురంగదేవుని సేవించి యమితానందమును బొందెను. పూర్ణిమదినమున గోపాలకాల మహోత్సవమును దర్శించి స్వస్థానమునకు బోవుటకు సంసిద్ధులై యున్న జననీ జనకులను జూచి "నే నిచటనే యుండెదను. మీరు స్వస్థానమునకు బొం" డని చెప్పి, వారు పరిపరివిధముల బ్రతిమాలినను నిరాకరించి జననీ జనకుల ద్యజించి మహాద్వారమందుండెను. ఆమె జననీ జనకు లెన్నోవిధముల నామెను దీసికొనిపోవుటకు ప్రయత్నించి విఫలులై స్వస్థానముల కేగిరి.

నామదేవులు దేవాలయమునుండి గృహమునకు బోవుచు మహాద్వారముననున్న యాబాలికను జూచి కరుణతో నీబాలిక యొంటరిగ

నుండ గతంబేమని యోచించి యాత్రలో దప్పిపోయి యుండునని దలచి దగ్గరకుబోయి "మీ తండ్రిగారి దేగ్రామము? నీ పేరేమి? నీ జననీ జనకుల కేమి శ్రమగలిగి నిన్నిచట విడచిరి? చెప్పు"మని యడిగెను. అంత నామె 'నాపేరు జనాబాయి, జననీ జనకులును, సోదర సోదరీ మణులును. శ్రీ పంఢరీనాథుడు దప్ప నాకన్యు లెవరును లే"రని బలికెను. నామదేవు లామెవచనము లాకర్ణించి యమితానందముతో నామె జేయి బుచ్చుకొని తన గృహమునకు దీసికొనిబోయి గోణాబాయిని బిలచి "అమ్మా! ఈ బాలిక యాత్రలో జననీ జనకులనుండి దప్పిపోయి దీనురాలై యున్నది. బహుజాగ్రత్తతో నీమెను సంరక్షణ జేయుడు. ఈమె సామాన్యురాలుగాదు. గతజన్మమున నీమె కుబ్జయను పేరుతో కంసునకు దాసిగనుండెను. ఈ జన్మమున పంఢరీయాత్రకు వచ్చి భగవత్సన్నిధిని వసించుచున్న"దని చెప్పెను. జనాబాయి నామదేవుల గృహమున నుండి దాస్యముజేయుచు, నఖండముగ హరినామ సంకీర్తనతో కాలము గడుపుచుండెను. దినదిన ప్రవర్ధమానముగ జనాబాయి పెద్దదగుచుండ స్త్రీ పురుషులెల్లరును "ఈమె యెవ్వరు?" అని విచారించుచుండిరి. జనాబాయి తనను ప్రశ్నించువారికి "నేను నామదేవుల దాసిని. వారు దప్ప నాకు జననీ జనకులును, బంధుమిత్రాదు లెవ్వరును లేరు. నేను వారింటిలో బనులుచేయుచు, వారితో నఖండముగా హరినామ సంకీర్తన జేయుచుందు"నని చెప్పుచుండెను.

ఒకనాటిరాత్రి నామదేవులును, నాతని దారపుత్రాదులును గాఢ నిద్రలోనుండగా, నాకస్మికముగ గాలివానవచ్చి యా కుటీరమెగిరి పోవుస్థితిలో నుండెను. తత్ క్షణమే శ్రీ పంఢరీనాథుడు తన సుదర్శన చక్రమును జూచి "నే నిప్పుడే వచ్చెదను. నీవుపోయి నామదేవుని గృహముపైవసించి యాకుటీరమునకు ప్రమాదము గలుగకుండ గాపాడుమని చెప్పెను. కుటుంబ సహితముగా విష్ణుభక్తుడు గాఢనిద్రలోనుండ సుదర్శన చక్రమువచ్చి నామ దేవుని కుటీరముపై నుండి యొక్క వర్షబిందువైనను లోపల బడనీయక గాపాడుచుండెను.

శ్రీ రుక్మిణీకాంతుఁడును నచటనే జేరి నామదేవుల కుటీరపు గోడలు వర్షమునకు గరిగిపోకుండ నడుసును మొత్తి బాగుచేయు చుండెను. శ్రోతలారా! భగవంతుఁడు తానుస్వయముగా వచ్చి యీ కుటీరమున కడుసుమొత్తి బాగుజేయవలసిన యావశ్యకమేమి? దివ్య భవనమే యాతని కనుగ్రహింపరాదా? అని సందేహింపకుఁడు. భగవంతుఁడు తన దాసుల కఖండ సంపద నిచ్చినచో నుదాసీనవృత్తి యలవడదని వారిని సంసార మోహములో బడనీయక గాపాడుచుండును. పాండవులను దుర్యోధను డఖండముగ గష్టపెట్టుచుండ జగజ్జీవనుఁడు నివారించెను. అట్లే భగవంతుఁడు నామదేవుల కఖండ ధనసంపదలను దివ్య భవనమును ననుగ్రహించిన తన్ను మరచిపోవునని యాతనిని మోహమున బడనీయక గాపాడుచుండెను. తల్లి తనబిడ్డకు భోజన మొకేసారి బెట్టినచో నజీర్ణ వ్యాధి సంభవించునని యాకలి గలిగినప్పుడు కొలది కొలదిగ బెట్టు నట్లును, వృక్షమున కధికముగా జలముబోసిన కుళ్ళిపోవునని తోటమాలి తగినంతగా నీరుబోయునట్లును, తన నిజభక్తులకు పూర్ణయిశ్వర్యమిచ్చిన తనభక్తి మరచిపోదురని భగవంతు డవసరము ననుసరించి స్వల్పసంపద లిచ్చుచుండును. శ్రీ పంఢరీనాథుడు నామదేవుని కుటీరపు గోడలన్నియు శుభ్రపరచి యింటి పైకప్పెక్కి గడ్డిని సర్ది బాగుచేయు చుండెను.

ప్రాతఃకాలసమయమున నామదేవులు వెలుపలికి వచ్చి విలోకింపగా ప్రకాశము కనబడి దివ్యపీతాంబరధారియగు శ్రీ పంఢరీనాథుడు కుటీరమును బాగుచేయుచుండుట జూచి సాష్టాంగనమస్కారము జేసి "దేవాధిదేవా! రాత్రివేళ నేమి కష్టపడుచుంటివని యడుగగా శ్రీ విఠలనాథుడు "ఓ నామదేవా! రాత్రి గాలి వర్ష మధికముగ వచ్చి నీ కుటీర మెగిరిపోవుస్థితిలో నుండగా నేను వచ్చి కాపాడి యప్పటినుండియు బాగుచేయుచుంటిని. నీవు సంసారమును త్యజించి నాభజన జేయుచుండుటచే నీ యోగక్షేమములను జూచు భారము నాపై నున్నది. రాత్రి వచ్చి నేను నీ కుటీరమును బాగుచేయనిచో నీ భార్య బిడ్డలు

కష్టములపాలగుదుము. నీతల్లి కోపముతో నిన్నును నన్నును దిట్టు" నని చెప్పెను.

జనాబాయి తత్క్షణమే నిద్రనుండి మేల్కొని వెలుపలికి వచ్చి భగవంతునకు సాష్టాంగనమస్కారము జేసి "ఓ కరుణాకరా! జగజ్జీవనా! మనోమోహనా! మమ్ముల రక్షించుటకై యర్ధరాత్రివేళ మిగుల కష్ట పడితి" వని చెప్పెను. భగవంతుడు నామదేవులతో నాకు మిగుల నాకలి యగుచున్నది భోజనము పెట్టు" మని చెప్పి యంతర్గృహములోన ప్రవేశించెను. గోణాబాయి షడ్రసయుక్తములగు పదార్థములను పళ్లెము లలో వడ్డించెను. నామదేవుని కుమారులగు నారాయణుడు, విఠోబా, గోవిందుడు, మహాదేవు డనువారలను, గోణాబాయి, రాజాబాయి, నామదేవులను తన పంక్తిలో గూర్చుండబెట్టుకొని శ్రీ విఠ్ఠలనాథుడు భుజించుచుండెను. జనాబాయి యీ దృశ్యమును జూచి "ఓ దీన దయాళూ! చక్రపాణీ! నీ వెల్లరిని పంక్తిని గూర్చుండబెట్టుకొని భుజిం చుచు నీచురాలనగు నన్ను దూరముచేసితివా? వంట జేయునప్పుడు బియ్యములోని రాళ్ళనుదీసి పారవేయునట్లును, జెరకునకు జుట్టునుండు గడ్డిని రైతు తీసి దూరముగా బారవేయునట్లును, నన్నవకృపతో దూరముజేసితివి. ఓ జగజేఠీ! నీకు కరుణ రాదా" యని జనాబాయి ప్రార్థించుచుండ, శ్రీ పంఢరీనాథుడు నామదేవులను జూచి "పదార్థ ములు నాకు రుచికరముగ లేవు. కారణమేమియో తెలియలే" దని చెప్పగా నామదేవుడు "ఓ చక్రపాణీ! జనాబాయి వ్యాకులచిత్తురాలై యుండుటచే నీకు పదార్థములు రుచించుటలేదు. దూడ యరచుచుండ నావునకు మేత రుచింపనట్లు, నూయలలో బాలు డేడ్చుచుండ తల్లికి భోజనము రుచింపనట్లును, వనములో బక్షులు ధాన్యపుగింజ లేరుకొను చున్నను నండజముపై లక్ష్యముంచునట్లును, లేగ కనబడనిచో లేడి కాహారము రుచింపనట్లును, లోభికి ధనము దూరముగనుండిన బక్వా న్నములు రుచింపనట్లును, జనాబాయిని సమాధానపరుపనిది మీకు భోజనము రుచింప" దని చెప్పెను. భగవంతు డభోజనముగ లేచి కర

శుద్ధి జేసికొనెను. (గోణాబాయియు రాజాబాయియు నాశ్చర్యచకితులై భగవంతుని యుచ్ఛిష్టాన్నమును జనాబాయి కిచ్చిరి( బ్రహ్మాదులకు నలభ్యమగు భగవంతుని యుచ్ఛిష్టప్రసాదము నామదేవుల సాంగత్యముచే జనాబాయికి లభించెను )

జనాబాయి భగవత్ప్రసాదమును భద్రముగ దాచి భగవంతుని ప్రార్థించుచుండెను. శ్రీ పంఢరీనాథుడును, నామదేవులును నొకే శయ్యపై నిద్రించిరి. కొంతసేపటికి నామదేవులు గాఢముగ నిద్రించుచుండగా జగజ్జీవనుడు నిశ్శబ్దముగ లేచి జనాబాయియొద్దకు బోయి "నాకు మిగుల నాకలిగా నున్నది. నేను నామదేవులతో భుజించునప్పుడు నిన్ను పంక్తికి బిలువలేదు. అందుచే నా కన్నము రుచింపనందున త్వరితముగ లేచి కరశుద్ధి జేసికొంటిని. నీవద నేమైన నున్నయెడల వడ్డింపు" మని జెప్పెను. అంత జనాబాయి "ఓ కృపాసాగరా! రుక్మిణీవరా! నీ కర్పించుట కొఱకు శుద్ధభావన తప్ప నాయొద్ద నేమియు లేదు. గోణాబాయి తమ యుచ్ఛిష్టప్రసాదము నాకిచ్చెను.) నేనది భద్రముగా దాచుకొంటిని. తిరిగి దానినెట్లు నీకర్పింతు" ననగా శ్రీ రుక్మిణీకాంతుడు జనాబాయితో సందేహింపక నా ప్రసాదమును దీసికొని రమ్మని చెప్పెను.

శ్రీ పంఢరీనాథుడు జనాబాయి తెచ్చిన యుచ్ఛిష్ట ప్రసాదమును దీసికొని యామెను పంక్తిలో గూర్చుండబెట్టుకొని యిరువు రా ప్రసాదమును భుజించుచుండ శ్రీ రుక్మిణీదేవి యమి తాశ్చర్యము నొందెను. క్షీరసాగరవిలాసియు, గరుడధ్వజుడును, వైకుంఠాధిపతియగు శ్రీ విఠ్ఠలనాథుడు జనాబాయి మనస్సులో గల సందేహమును దొలగించుటకై యుచ్ఛిష్టము నారగించుచుండెను. (శ్రుతిశాస్త్రము లఖండముగ గానము జేసినను, నానావిధ యజ్ఞములొనర్చి యాహుతి నిచ్చినను, దుర్లభుడగు భగవంతుడు జనాబాయితో నుచ్ఛిష్టమును భుజించుచుండెను. భగవంతుడు కరశుద్ధి జేసికొని జనాబాయి కుటీరములోనే



జనాబాయితో శ్రీ విఠలనాథుడు పిండివిసరుట.

నిద్రించెను. గోణాబాయి విషయమంతయు జూచి నామదేవులతో జెప్పగా "ఓ జననీ! భక్తవత్సలుడగు చక్రపాణి శుద్ధభావనకుమాత్రమే వశవర్తియగును. ఆతడు కులగోత్రములను విచారింపడు. శబరి యిచ్చిన యెంగిలిఫలములను ప్రేమతో భుజించినట్లు జనాబాయియందు గల వాత్సల్యముచే నుచ్ఛిష్టప్రసాదము నారగించె" నని చెప్పెను.

ఈవిధముగా నామదేవులును, గోణాబాయియును, జేయు సంవాదమునువిని శ్రీ విఠ్ఠలనాథుడు తత్క్షణమే లేచి నామదేవుల యొద్దకు బోయి యాతని ప్రక్కనే పరుండెను. కొంతసేపటికి భగవంతుడు లేచి చూచి యింకను ఘూమురాత్రి యుండుటవలన జనాబాయి యొద్దకు వచ్చి యామెను నిద్రనుండి లేపి "త్వరితముగ పిండివిసరుదము లెమ్ము. నీవు నిమిత్త మాత్రముగ నా ప్రక్కనుండి యభంగములను బాడుచుండుము. క్షణకాలములో నేను పిండినంతయు విసరెద"నని చెప్పెను. ఇరువురును తిరుగలిలో జొన్నలు వేసికొని పిండి విసరుచుండ జనాబాయి యభంగములను గానము చేయుచుండెను.

నివృత్తి జ్ఞానేశ్వర సోపానదవులు నాయాత్మ బంధువులు, నామదేవుడు నాజనకుడు. రాజాబాయి నాజనని. గోరాకుంభారును, కబీరును సావతాభక్తుడును నాబంధువులు. వారి ప్రసాదముచే నేను భగవంతుని కృపకు పాత్రురాలనైతిని. వారిమహిమ యఘటితమైనది. వారెల్లరును భగవంతుని స్వాధీనునిగా జేసికొని యాత్మానంద రూపులై తృప్తిగనుండిరి. పైఠనపురమున ద్విజులు జ్ఞానేశ్వరుల నవమాన పరుపగా నాతడు మహిమముచే వేదములను బలికించెను. గోరాకుంభార్ భక్తుడు దేహభ్రాంతి విరహితుడై బాలుని మట్టిలో గలియద్రొక్కెను. పిదప భార్యలు కృత్రిమము జేయుటచే నాన నతిక్రమించితినని కరముల ఖండించుకొనెను. నామదేవులతో గూడి హరినామ సంకీర్తన జేయుచుండ నాతనికి కరము లుద్భవించెను. శ్రీ రుక్మిణీదేవి యాతని బిడ్డను దెచ్చియిచ్చెను. భూమండలమున సావంతుడు నిజభక్తుడు. భగవంతుడాతనికి దర్శన

మిచ్చి వసించుటకు మరుగుప్రదేశము కావలెనని కోరగా దనహృదయ మును జీల్చి భగవంతునకు స్థానమిచ్చెను. అనంత బ్రహ్మాండములు దన యుదరమున గల భగవంతుడు సావంతుని హృదయమున దాగెను. నామదేవులు సంకీర్తనజేసి యాతని హృదయస్థుడగు భగవంతుని బహి రంగపరచిరి. కాశీ క్షేత్రములో కబీరు పరవశుడై యుండ నాతనికై శ్రీరాముడు వస్త్రములను నేసెను. శివరాత్రి దినమందు నామదేవులు నాగనాథ క్షేత్రమున హరినామ సంకీర్తన జేయుచుండ నవలక్ష పతా కములలో స్వర్గమునుండి యమరు లకస్మాత్తుగా వచ్చిరి. కైలాస పతి సాక్షాత్కరించి తూర్పుదిశనున్న తన యాలయమును పశ్చిమదిశకు ద్రిప్పెను. వారి మహిమ విశేషము లనంతములై యున్నవని జనాబాయి యభంగములను గానము జేయుచుండ శ్రీ పంఢరీనాథు డానంద పర వశుడై యూగుచుండెను. గోణాబాయి జనాబాయి చేయుచున్న గానము నాకర్ణించి "ఓ జనాబాయి! నీతో మాట్లాడు చున్నవారెవరు? నీవే దాసివై యుండ నీకు నౌకరులు కావలసి వచ్చిరా" యని క్రోధముతో గఱ్ఱను విసరెను. ఆకఱ్ఱ భగవంతుని శిరమునకు దగులుగా భగవంతుడు "ఓ గుణాబాయీ! శాంతింపుము. నాపేరు విరాబాయి. నేనే పిండి విసరుచున్నానని" జెప్పెను.

నామదేవుడు భగవంతుని వాక్యములను విని గోణాబాయిని జూచి "సాక్షాత్ శ్రీ రుక్మిణీకాంతుడు జనాబాయితో పిండి విసరు చుండ నవివేకముతో గఱ్ఱను విసరితివా" యని పలుకగా గోణాబాయి లజ్జపడి "హృషీకేశుని నేనుకొట్టితిని. జనాబాయి భావ మద్భుతమైనది. శ్రీ రుక్మిణీ కాంతుడామెకు స్వాధీన మయ్యె"నని చింతించెను. భగ వంతుడు జనాబాయితో పిండివిసరి పిదప నచటనే పరుండెను. ప్రభాత సమయమున జనాబాయి భగవంతుని జేతితో దట్టి "స్వామీ! ప్రభాత సేవా సమయమైనది. అర్చకులు కాగడా హారతి జేయుటకై దేవాలయ ములో బ్రవేశింతురు. నీవచట లేనిచో క్షేత్రమంతయు వెదకుదు" రని చెప్పగా దత్క్షణమే శ్రీ పంఢరీనాథుడు నిద్రనుండిలేచి దేవాలయము

నకు బోవు తొందరలో నాభరణములను మఱచి పీతాంబరమునకు బదులుగ జనాబాయి చింకి బొంతను గప్పుకొని శీఘ్రముగా వెడలి పోయెను. అర్చకులు దేవాలయపు తలుపులు తెరచిరి. భక్తులెల్లరును పూజా సామగ్రులను దీసికొని వచ్చిరి. అర్చకులు కాగడాను వెలిగించి హారతిని జేయుచుండిరి.

శ్రీ రుక్మిణీకాంతుడు చింకిబొంతను గప్పుకొని యుండుటను జూచి యెల్లరు నాశ్చర్య చకితులైరి. కొందరీతడు భక్తాభిమాని. సిద్ధాంత మగు కర్మమార్గను నాశనము జేయుటకై యిట్టి లీలలను జేయుచున్నా డని పలికిరి. కొందరు "ఓ జగజ్జీవనా! భక్తభూషణా! రుక్మిణీ రమణా! క్షీరాబ్ధివాసా! శేషశయనా! నీకీ చింకిబొంత కావలసి వచ్చెనా యని పలికిరి. మరికొందరు జనాబాయి భక్తికి వశుడై యామెయింట వసిం చుచు నామె బొంతను గప్పుకొనెనని బలికిరి. ఈ విధముగా త్రివిధ జనులు నానా ప్రకారముల బలుకుచుండ నర్చకులు భగవంతుడు కప్పు కొనియున్న యా చిరుగులబొంతను దీసిరి. అమూల్యమగు భగవంతుని యాభరణములు లేకుండుటనుజూచి భగవంతుడే వస్తువుల నెవరికైన నిచ్చెనో, లేక జనాబాయి గృహమునకు బోయినప్పుడామె పీతాంబర మును నాభరణములను నపహరించి చిరుగుల బొంత గప్పిన దేమో యని పరిపరివిధముల నాలోచించుచుండిరి. మజ్జిగను నైవేద్యము జూపి ప్రసాదమని వెన్నదీసుకొని పోయినట్లును, నుదకమునిచ్చి యమృత మును దీసికొన్నట్లును, గాజురాయినిచ్చి రత్నమును దీసికొన్నట్లును, చిరుగుల బొంతనిచ్చి పీతాంబరమును నాభరణములను దీసికొనెనని యర్చకులు పరిపరి విధముల నాలోచించుచు నెవరిని నిందించుటకును లేక దోషమెవరిపై మోపుటకును నాధారములేదు.

దేవాలయపు తలుపులన్నియు బంధించి తాళములు వేసియుండ భగవంతు డెట్లు జనాబాయి కుటీరమునకు బోయి వచ్చుచుండెనో దెలి యుటలేదు. నామదేవుని గృహమునకు బోయి జనాబాయిని బిలచి

విచారించిన యదార్థవిషయము దెలియునని నిశ్చయించి యచటికి బోయి జనాబాయిని బిలచి "శ్రీ రుక్మిణీకాంతుడు నీయొద్దకు వచ్చి నీ గానమునకు మోహితుడై యుండుటచే పూజార్చనలయందు విముఖుడై మా సత్కార్యములను నీటముంచుచున్నాడు. రాత్రి భగవంతుడు నీ కుటీరమునకు వచ్చియుండ నీ వాతని పీతాంబరమును యాభరణములను నపహరించి నీ చిరుగులబొంతను గప్పితివి. కాన నీ వవి త్వరితముగా దెచ్చి యిమ్ము లేనిచో శిక్షించెద" మని బెదరించుచుండిరి.

జనాబాయి వ్యాకులచిత్తురాలై నే నే పాపము నెరుగను. నేను భగవంతుని యాభరణము లపహరించిన నో నా రెండునేత్రములును బోవుగాక! యని పలికెను. అర్చకులు జనాబాయి కుటీరములో ప్రవేశించి శోధింపగా భగవంతుని పీతాంబరమును నాభరణములును నచట దొరకెను. న్యాయాధిపతులకు వెంటనే యీ వృత్తాంతమును దెలిపి జనాబాయిని న్యాయస్థానమునకు దీసికొనిపోయిరి. న్యాయాధిపతి విచారించి భక్తురాలివేషముతోనుండి భగవంతునిసొ త్తపహరించినది కాన నీమెను శూలారోపణ జేయవలెనని శిక్ష విధించెను. చంద్రభాగానదీ తీరమున శూలమును నాటి జనాబాయిని బంధించి యచటకు దీసికొని పోయిరి. జనాబాయి నేత్రములనుండి యశ్రుధారలను విడచుచు గద్గద స్వరముతో "ఓ పతితపావనా, అనాథనాథా, రుక్మిణీవరా, భక్తవత్సలా, కృపాసాగరా, దీనోద్ధారా, జగదీశ్వరా! నేను పరదేశిని. అనాథను, దీనురాలను, నీవుతప్ప నన్ను రక్షించువా రెవ్వరు? నా జననియు, జనకుడును, బంధుమిత్రాదులును, నిష్టమిత్రులును, నాప్తులును, కులగోత్రములును, నా జీవమును నీవైయున్నావు. ఓ పండరీనాథా! నాశవంతమగు నీ శరీరమున కే శిక్ష విధింపబడినను నానందముతో భోగింతును. నేనెన్ని జన్మములెత్తినను నీదాస్యము జేయుచుండునట్లు కృపతో ననుగ్రహింపు" మని ప్రార్థించెను. భటులు శూలమున దిగ వేయుటకై జనాబాయిని బట్టుకొని పైకెత్తిరి. కౌతుకమును జూచుటకు క్షేత్రవాసులగు స్త్రీ పురుషు లెల్లరును గుంపులు గుంపులుగా గూడిరి.

జ్ఞానులగు భావుకు లనాథయగు జనాబాయి కిట్టి విపత్తు సంప్రాప్తించె నని చింతించుచుండిరి. కుటిలులెల్లరును నొకచోట గూడి పరిపరివిధముల బరిహాసించుచుండిరి. తత్క్షణమే త్రిభువనపతియగు శ్రీ విఠ్ఠలనాథుడు కృపాదృష్టితో జూడ నా లోహపుశూలము జనులెల్లరును జూచుచుండ గాలి భస్మమయ్యెను. పూజారులెల్లరును విస్మయమునుజెంది జనాబాయి భక్తి ధన్యమైనదని కొనియాడుచుండిరి. భక్తజనులెల్లరును గౌతుక మును జూచి యానందపరవశులై కరతాళములను వేయుచు జయజయ ధ్వనులను జేయుచుండిరి. కుటిలులెల్లరును నీ గౌతుకమును జూచి చెంపలు వాయించుకొనుచుండిరి. న్యాయాధిపతి యీ విషయము నెరిగి జనాబాయి పాదములపై బడి యపరాధము క్షమింపుమని ప్రార్థించెను. క్షేత్రవాసులగు స్త్రీ పురుషు లెల్లరును హర్షచిత్తులై భగవన్నామసంకీర్తన జేయుచు గౌరవపూర్వకముగ జనాబాయిని దీసికొనిపోయిరి. అప్పటినుండియు దేవాలయార్చకులును గ్రామప్రజలును జనాబాయి యందమిత భక్తిశ్రద్ధలతో నామెను గౌరవించుచుండిరి.

ఇట్లు కొంతకాలము జరిగిన పిదప జనాబాయి యొకనాడు తన కుటీరమున గూర్చుండి యభంగములను బాడుచుండెను. శ్రీ పంఢరీనాథుడు తాళపత్రమును గంటమును దీసికొని జనాబాయినోటినుండివచ్చు నభంగములను వ్రాయుచుండెను. విశ్వవ్యాపకుడును, జగజ్జీవనుడును సంతస్సాక్షియు, చైతన్యఘనుడును, గజేంద్రరక్షకుడును, ద్వారకావాసుడగు భగవంతుడు జనాబాయికవిత్వమును వ్రాయుచుండెను. ఆ సమయమున జ్ఞానేశ్వరు లకస్మాత్తుగా నచ్చటికి వచ్చి భగవంతునికి సాష్టాంగ నమస్కారము జేయ సచ్చిదానంద పరబ్రహ్మమూర్తియగు శ్రీ విఠ్ఠలనాథుడు తాను వ్రాయుచున్న తాళపత్రమును గంటమును జ్ఞానేశ్వరులు జూడకుండ వెనుక దాచెను. అంత జ్ఞానేశ్వరులు "ఓ దేవాధిదేవా! ఏకాంతముగ గూర్చుండి గుప్తముగా నేమి వ్రాయుచున్నా" రని యడుగగా శ్రీ పాండురంగదేవుడు హాసితవదనుడై "జ్ఞానేశ్వరా! జనాబాయి కవిత్వము జెప్పుచున్నది. ఆమె నోటినుండి వెలువడు నభం

గములను వ్రాయుచున్నా" నని చెప్పెను. జ్ఞానేశ్వరు లానందముతో "ఓ రుక్మిణీవరా! జనాబాయి పలుకు నభంగములను మీరు వ్రాయు చుండుట నా కాశ్చర్యముగ నున్నది! తీర్థ వ్రత తపోదానాది పుణ్య కార్యములను జేసినవారును, జ్ఞానులును, తమ కీర్తిని దాము బ్రకటించు కొనరు. ఓ వనమాలీ! నీ మహిమ విశేషములను వర్ణించు భక్తు లీ భూమండలమునం దపారముగ నుండ మీ కీర్తిని మీరు వ్రాసికొనుట యాశ్చర్యకరము. ఓ రుక్మిణీపతీ! సరస్వతియు, శ్రుతి శాస్త్రములును, బురాణములును మీకీర్తిని వర్ణించుచున్నవి. వ్యాస వాల్మీక్యాది మహా కవులెల్లరును మిమ్ము స్తుతించిరి. మీరు స్వయముగ జనాబాయి కవిత్వ మును వ్రాయుచుంౘట నా కాశ్చర్యముగ నున్న" దని చెప్పెను.

శ్రీ పంఢరీనాథుడు హాసితవదనుడై "ఓ జ్ఞానేశ్వరా! ప్రేమతో జనాబాయి పలుకు నభంగములలోని ప్రతి యక్షరమును నమృత తుల్య మైయున్నది. ఆమె కవిత్వము వ్యర్థముగాక స్థిరరూపమున నుండుటకై సమయమునకు దగిన విలేఖరులులేక నేనే వ్రాయుచుంటి"నని చెప్పగా జ్ఞానేశ్వరులు ఓ జగజ్జీవనా! నీ యాంతర్యమును భక్తులమగు నేమెరు గుదుము. పతి మనోగతమును పతివ్రతయే దెలిసి కొనినట్లును, తల్లి ప్రేమను బిడ్డడు గ్రహించినట్లును, కవీశ్వరుని పలుకులలో రసమును విచ క్షణులు గ్రహించినట్లును, మీ యాంతర్యము నఖండముగ నే నెరుగు దు"నని పలుక నధోక్షజుడు నవ్వుచుండెను. అంత జ్ఞానేశ్వరులు "జగ దీశ్వరా! ఇక లెమ్ము. నామదేవుల దర్శింతము. నీకు జనాబాయిపై నమిత వాత్సల్య మున్నదని యాతనికి జెప్పెద"నని జెప్పగా శ్రీ రుక్మిణీకాంతు డవశ్యమని జ్ఞానేశ్వరులను వెంటబెట్టుకొని నామదేవుల యొద్దకు బోయి యాతని కాలింగన మిచ్చి సుఖాసనముపై నధిష్ఠించెను. ఆసమయమున నామదేవులయొద్ద భక్తజనులు గూర్చుండి యుండిరి. సభాస్థానమున రాజధిష్ఠించియుండగా సైన్యమాతని జుట్టు నుండునట్లును, శచీరమణుని బరివేష్ఠించి సురవరు లుండునట్లును, శంకరు నాశ్రయించి తాపసు లుండు నట్లును, లక్ష్మి యెచటయుండునో యష్టసిద్ధులు నచ్చట వాసముజేయు

నట్లును, కథాకీర్తనలలో ప్రేమ భక్తులు జేరియుండునట్లును, నమూల్య రత్నముయొద్ద బరీక్షకులు జేరునట్లును, కమల పుష్పము యొద్దకు భ్రమరములు జేరునట్లును, దాత నపారముగా యాచకులాశ్రయించు నట్లును చీమలు చక్కెర నాశ్రయించి యుండునట్లును భగవంతుడు నామదేవుల యింట నుండుటజూచి భక్తులెల్లరు వారి జుట్టును జేరిరి.

భగవంతుడు భక్తులెల్లరికిని నాలింగనమిచ్చి "నామదేవా! భక్తులెల్లరిని దర్శించుటకు జనాబాయిని బిలువు"మని చెప్పగా గోణాబాయియును, రాజాబాయియును, పెరటిలో బిడకలు కొట్టుచున్న జనాబాయినిజూచి శ్రీ పంఢరీనాథుడు నిన్ను బిలచుచున్నాడని చెప్పగా తత్క్షణమే జనాబాయి చేతులు కడుగుకొని శ్రీ పంఢరీనాథుని సమక్షమునకుబోయి సాష్టాంగ నమస్కారము జేసెను. ఆ సమయమున జ్ఞానేశ్వరులు నామదేవులతో "నేడొక యద్భుతమగు విచిత్రమును జూచితిని. జనాబాయి యభంగములను బాడుచుండగా శ్రీ వైకుంఠ వాసుడు గంటమును తాళపత్రమును బుచ్చుకొని వ్రాయుచుండె"నని చెప్పెను. అంత శ్రీ విఠ్ఠలనాథుడు భక్తులనుజూచి "జనాబాయి కవిత్వమును నేను వ్రాయుటవలన నాకేమియు జిన్నతనము రాదు. నేను మీ చరణసాక్షిగ బలుకుచున్నాను వినుడు. ప్రాకృత భాషయందున్న జనాబాయి కవిత్వ మాత్మానందమా? లేక బ్రహ్మజ్ఞానము యొక్క యానందమా యనిపించుచున్నది. నేను మిగుల ప్రేమతో నామె యభంగములను వ్రాయుచుంటిని. ఎవరు జనాబాయి యభంగములను బఠించుచుండెదరో నేను వారిని సర్వవిధముల గాపాడెద"నని చెప్పగా జ్ఞానేశ్వరులు కరతాళములను వేయుచు జయజయ ధ్వనుల జేసెను. కాశీ క్షేత్రమునుండివచ్చిన భక్త కబీరును, భక్త శ్రేష్ఠుండగు చోఖామేళుడును, వైష్ణవుడగు రోహిదాసును, నిజభక్తుడగు సజ్జన పఠానుడును, విరక్తుడగు బయాకసాబును, మహాభక్తుడగు కమాల్ ఫులారీయును, ముకుందరాజును, జయజయ ధ్వనుల జేయుచు భగవంతుని గుణవైభవములను గానము జేయుచుండిరి. పర్వతములలో మేరువును, సైన్యమధ్య

మునరాజును, నక్షత్రములలో చంద్రుడును, తాపసులలో శంకరుడును, సిద్ధులలో దత్తాత్రేయుడును, వృక్షములలో నశ్వత్థమును, గోవులలో కామధేనువును, దేవతలలో హృషీకేశుడును, వ్రతములలో నేకాదశియు శోభించునట్లు భక్తులమధ్య భగవంతుడు శోభించుచుండెను. జ్ఞానేశ్వరులు జనాబాయిని బిలచి "నామదేవులు నాలుగవతారములు ధరించిరి. కృతయుగమున బ్రహ్లాదుడుగను, త్రేతాయుగమున నంగదుడుగను, ద్వాపరమున నుద్ధవుడుగను నుండి భగవంతుని స్వాధీనము జేసికొనెను. నీవేయే జన్మలెత్తి భగవంతు నారాధించితివి. సందేహింపక దెలుపు" మని యడిగెను. అంత జనాబాయి జ్ఞానేశ్వరులకు వందనములు జేసి "మహాత్మా భగవంతుడు హయగ్రీవుడైనప్పుడు నేను చరణసేవ జేసితిని. మత్స్య, కూర్మ, వరాహ, నారసింహ, వామన, పరశురామ, రామ, కృష్ణ, బౌద్ధావతార సమయములందు నేనును జన్మించి దాస్యము జేసితి"నని చెప్పగా జ్ఞానదేవు లత్యాశ్చర్యమునొంది "ఓ జనాబాయీ! నీవు ధన్యురాలవు. నీ వపార పుణ్యముజేసి హృషీకేశుని స్వాధీనునిగా జేసికొంటివి. బ్రహ్మాదులకు దుర్లభుడగు శ్రీ విఠలుడు నీకు వశుడయ్యె" నని చెప్పెను.

శ్రీ పంఢరీనాథు డానంద పరవశుడై తన భక్తుల వాక్కునుండి వెలువడు శబ్దములు వ్యర్థములు గాకుండుటకై యచట జేరిన భక్తులను జూచి "నాయాజ్ఞానుసారముగా మీ రెల్లరును నభంగములను వ్రాయుచుండుడు; మీ వాక్కులనుండి వెలువడు శబ్దరత్నములను వ్యర్థముగా బోనీయక జ్ఞానేశ్వరుల కవిత్వమును సచ్చిదానంద బాబాయును, నివృత్తి దేవుల బలుకులను సోపానదేవులును, ముక్తాబాయి యభంగములను జ్ఞానేశ్వరులును, జోగా పరమానందుని వాక్కులను విశోబా ఖేచరుడును, సావతాభక్తుని కవిత్వమును గాశిబాయియును, చోఖామేళుని యభంగములను ననంతభట్టుడును వ్రాయుచుండుడు. నేను జనాబాయి కవిత్వమును వ్రాయుచుందును. మీ రెల్లరును సందేహింపక జనాబాయి యభంగముల శ్రవణము జేయు" డని పలుకగా భక్తులెల్లరు నంగీకరించిరి.

జనాబాయికవిత్వములో శబ్దదోషముల నెంచువారీ పృథ్వియం దెవ్వరును లేరు. అంధునకు భాస్కరుడు దర్శనమిచ్చినచో నాతనికి గనబడని వస్తువుండనట్లును, మూగవానికి సరస్వతి ప్రసన్నమైనచో నాతడు వేదశాస్త్రములు చదువునట్లును, శ్రీ పంఢరీనాథుడే స్వయముగా వ్రాయుచుండ జనాబాయి యభంగములలో శబ్దదోషములెట్లు వచ్చునని భక్తజనులెల్లరును బలుకుచుండిరి. నామదేవు లుదకమును దీసికొనివచ్చి భక్తజనుల చరణక్షాళన జేసెను. శ్రీ రుక్మిణీరమణుడు ప్రేమతో భావపూర్వకముగ భక్తులనందరికిని షోడశోపచారవిధుల బూజించి చందన తాంబూలాదుల నర్పించెను. శ్రీ విఠ్ఠలనాథుడు తన భక్తులను వెంటబెట్టుకొని దేవాలయమున ప్రవేశించి జరిగిన వృత్తాంతమంతయు శ్రీ రుక్మిణీదేవికి దెలియపరచెను.

ఇరువదియొకవ యధ్యాయము సమాప్తము.

భవభయహారాయ నమః

# మత్స్యేంద్రనాథ చరిత్ర

## — ఇరువదియారవ యధ్యాయము —

నేడు భాగ్యవంతులగు శ్రోతలు కల్పవృక్షచ్ఛాయను గూర్చుండిరి. శ్రోతల మనోరథములు తప్పక ఫలప్రదములగును. స్పర్శవేది స్పర్శచే లోహమునకు గల మలినరూపము తొలగునట్లు భక్తుల సచ్చరిత్రల శ్రవణముచే సందేహములు దొలగును. పయోబ్ధిస్నానముచే సర్వతీర్థస్నానఫలము లభించునట్లును, సూర్యప్రకాశముచే సర్వపదార్థములు గనబడునట్లును, నమృతము సేవించినచో సర్వరోగములు పటాపంచలగునట్లును, భక్తచరిత్రల నాకర్ణించుటచే భవదుఃఖములు తొలగును. చంద్రుడు ప్రసన్నుడైనచో దాపముండనట్లు భక్త చరితామృత శ్రవణముచే నంతఃకరణమున కామ క్రోధాదులు తొలగును.

ఒకానొక సమయమున క్షీరసాగరమున శంకరుడు గూర్చుండి తారకమంత్రమును జపించుచుండగా పార్వతీదేవి పరమేశ్వరునితో "ఓ మహాదేవా! మీ రే మంత్రము ననుష్ఠించుచున్నారు? మీకంటె శ్రేష్ఠు లెవరు? నాకు సందేహముగ నున్నది తెలుపు" డని ప్రార్థించెను. అంత సర్వేశ్వరుడు 'ఓ భవానీ! నాకంటె శ్రేష్ఠుడు సచ్చిదానందమూర్తి యగు నాత్మారాముడు; ఆతనినుండియే బ్రహ్మయును, విష్ణువును, నేనును గలిగితిమి. నే నాతని రూపము హృదయములో నిలిపి ఆతని నామమంత్రము నహర్నిశము జపించుచుంటి" నని చెప్పెను.

పార్వతి మనంబునం దాశ్చర్యమునొంది "ఓ విరూపాక్షా! నేను తమ కర్ధాంగినైయుండియు నీ రహస్య మెరుగనైతిని. కమలపుష్పమునకు సమీపమున మండూకము సర్వకాలములందుండియు నందలి మకరందము నెరుగనట్లును, మృగనాభియందు కస్తూరి యుండియు నది వ్యర్థముగా నడవులలో దిరుగునట్లును, సర్వకాలములందు మీ సమక్షమునందుండి నే నీ విషయము నెరుగనైతిని. దయచేసి తాము స్వస్థచిత్తముతో నా మంత్రప్రభావమును నాకు దెలుపు" డని ప్రార్థింపగా మహేశ్వరుడు తన

యభయప్రదానహస్తమును పార్వతీదేవి మస్తకముపైనుంచి తారక మంత్రము నుపదేశించి యానందాశ్రువులు విడచుచు పరవశుడై మంత్ర ప్రభావమును జెప్పుచుండెను. పార్వతీదేవి సావధానచిత్తముతో శ్రవణముజేయుచు, ఊఁకొట్టుచుండెను.

కొంతసేపటికి పార్వతి పరవశురాలై సమాధి స్థితిఁబొంద నాక్షీర సముద్రమునగల యొక మత్స్యము గుప్తముగ నుండి శ్రవణము జేయుచుండెను. ఆ మత్స్యగర్భమునందు గల శిశువు ఊకొట్టుచు వినుచుండెను. గర్భముననున్న ప్రహ్లాదుడు తనతల్లికి నారదు లుపదేశించిన మంత్రమును వినినట్లు మత్స్యగర్భమున నున్న శిశువు మంత్ర ప్రభావమును శ్రవణము జేయుచుండెను. సాక్షాత్ శంకరుని యంశచే మత్స్యగర్భమునుండి విశ్వోద్ధారణ జేయుటకు మత్స్యేంద్రనాథుడు జన్మించెను. ఆతడు శంకరుని యవతారమా? లేక వైరాగ్యమను మహా మేరుపర్వతమా? లేక నిజబోధయను సముద్రమా? అన నొప్పు జగద్గురువుగ నవతరించెను. ఆతడు బ్రహ్మజ్ఞాన దక్షుడుగను, సాయుజ్య దానమునకు కల్పవృక్షమువలెను, సర్వజీవుల కంఠసాక్షివలెను, నిర్గుణ తత్వము యొక్క నిజమందిరమువలెను, చైతన్యాకారముగలిగి చంద్రునివలె శోభించుచుండెను. ఆతడు మత్స్యగర్భమునుండి జన్మించు నప్పుడు 'సోహం' ధ్యానమును జేయుచుండెను. ఆత్మజ్ఞానముతో మత్స్యేంద్రనాథుడు తీర్థాటనకై బయల్వెడలెను.

మత్స్యేంద్రనాథుడు యాత్రా మార్గమున గ్రామములో భిక్షాటన జేయుచు, నేకాంతస్థానమున శయనించుచు, నుదాసీనవృత్తితో ద్వాదశ వర్షములు తీర్థాటన జేసి యొకదినమున భిక్షాటనకై యొక నగరములో బ్రవేశించి యొక శ్రీమంతుని గృహద్వారమున నిలచి 'అలఖ్' యని కేకవేసి, "తల్లీ! భిక్షయేమైన నున్నచో వేయు"మని పలికెను. మంజులమగు నాతని కంఠస్వర మాలకించి యా శ్రీమంతుని కాంత విస్మితచిత్తురాలై "ఈతడెవరో మహాత్ముడు. దేదీప్యమానమగు తేజముతో నపరశివునివలె నగుపడుచున్నాడు. ఈతని గనిన జననీజనకు లెంత

ధన్యులో” యని హర్షించి భిక్షదీసికొని ద్వారము వెలుపలికివచ్చి నక్ష త్రములవలె శోభించుచున్న కర్ణముద్రికలను, సువర్ణ ప్రకాశముగల శరీరమును, సర్వాంగములకు విభూతి లేపనయుక్త అర్ధ నయనములతో శోభించుచున్న యాతని దివ్యరూపముం గాంచి సాష్టాంగప్రణామ మాచరించి “తామెచటినుండి విచ్చేసితిరి? దెలుపు” డని యడిగెను.

అంత మత్స్యేంద్రనాథుడు “ఓ తల్లీ! మాది శూన్యమగు నిరంజన దేశము. మేము యోగసుఖాధికారులము” అని పలుకగా నాస్త్రీరమంతురాలు “అయ్యా నాకు పుత్రసంతతి లేదు. సర్వసంపదలుండియు నాభవనము శూన్యమై శోభావిహీనమైయున్నది. చంద్రుడు లేని రాత్రియు, వృక్షములేని గ్రామమును, జలములేని నదియు, మేఘములేని పర్జన్యకాలమును, శక్తిలేనిస్థూలశరీరమును, పరాక్రమములేని రాజును, తైలములేని దీపమును, సంతానములేని సంపదయు వ్యర్థములని పెద్దలు పలుకుదురు. నాకష్టయిశ్వర్యములుండియు సంతాన హీనురాలనైయుంటిని. దయచేసి నాకు సంతతి గలుగు నుపాయము దెలుపు” డని యడుగగా మత్స్యేంద్రనాథుడు సంతసించి విభూతిని మంత్రించి “అమ్మా! దీనిని స్వీకరించిన సాక్షాద్విష్ణ్వావతారుడగు సుపుత్రుడు జన్మించును. ఈ రహస్య మెవరికిని దెలుపకు”మని చెప్పి యామెకు విభూతి నిచ్చి మత్స్యేంద్రనాథు డచట నుండి వెడలెను.

అంత నాసాధ్వి తనయిరుగు పొరుగు మిత్రురాండ్రను బిలచి “ఒక గుప్తవిషయమును జెప్పెదను. ఇప్పుడొక యోగీంద్రుడు భిక్షకై వచ్చెను. అతడు దేదీప్య మానమగు ప్రకాశముగలిగి యతి విరక్తుడై యుండెను. అతని రూపమును జూడగనే యాతడొక యవతారమూర్తి యని హర్షించి సంతానము గలుగు నుపాయ మెరింగింపుమని యడిగితిని. ఆ మహాపురుషుడు కృపాదృష్టితో మంత్రవిభూతి నిచ్చి యిది సేవించిన నిశ్చయముగా నీకు పుత్రసంతతి గలుగునని చెప్పి యిప్పుడే వెళ్ళెను. ఈ విషయమును మీకు దెలుపవలెనని కుతూహలముతో మిమ్ము బిలచితి” ననగా నామె సఖురాండ్రు “యోగులు నానావిధ వేషములతో

మోసగింతురు. వారిచ్చిన విభూతి సేవించుట వలననే సంతతి గలిగినచో జగమున గృహస్థులందరు సంతానవంతులై యుందురు. ఈ యోగులు పగలంతయు గ్రామములలో దిరుగుచు సౌందర్యవంతులగు యువతులను జూచి వారిని మాయామంత్రములచే శ్వానములనుగా జేసి తమ వెంట ద్రిప్పుకొనుచు, రాత్రివేళల స్త్రీలనుగా జేసి వారలతో విషయ భోగముల భోగింతురని నానావిధములగు వికల్పములను జెప్పి ఆ విభూతి నుంచకుము. తత్క్షణమే పారవేయు మనిరి. అత్త కోడళ్ళలో కలహమును, నన్నదమ్ములలో వైరమును, తల్లి దండ్రులనుండి విడిపోవుటయు, గృహ కలహములన్నియును స్త్రీలకు సఖురాండ్ర బోధలచే సంప్రాప్తించును. పాదరసమంటిన బంగారము హీనమగునట్లును, కులవతికి పరబోధచే కులక్షణ మబ్బినట్లును, మత్స్యేంద్రనాథు డిచ్చిన విభూతిని సఖురాండ్ర దుర్బోధలచే నా శ్రీమంతురాలు పారవైచెను.

ఇట్లు కొంతకాలము జరిగిన పిదప మత్స్యేంద్రనాథుడు తీర్థయాత్ర బూర్తిజేసికొని ద్వాదశవర్షములకు దిరిగి యా శ్రీమంతుని గృహము జేరి భిక్షకై నిలువబడి "అలఖ్" యని కేకవైచి భిక్షవేయుడని యడిగెను. గృహస్వామిని తత్క్షణమే భిక్షదీసికొని మత్స్యేంద్రనాథుని యెదుటకు వచ్చి భిక్షవేసి పూర్వవృత్తాంతమును స్మరణకు దెచ్చికొనెను. అంత మత్స్యేంద్రనాథు డామెను జూచి "ఓ తల్లీ! నీకు మంత్రవిభూతి నిచ్చియుంటిని. నీపుత్రుని నాకు జూపు" మని యడుగగా నా యతివ భయముచే వణకుచు యదార్థము బలికిన శపించునని యేమియు బలుకక మౌనము వహింప మత్స్యేంద్రనాథు డామెతో "విభూతిని స్వీకరించితివా? లేక యెచటనైన బారవేసితివా? యదార్థము జెప్పు" మని యడిగెను. పిదప నా యువతి "ఓ స్వామీ! పరబుద్ధిచే వికల్పచిత్తురాలనై పొయ్యిలో బారవేసితిని. నా ప్రారబ్ధమిట్లున్న" దని పలుకగా, మత్స్యేంద్రనాథు డా పొయ్యిలోని బూడిద నెచ్చట పారవైచితివి. ఆ ప్రదేశమును నాకు జూపుమని యడిగెను. పిదప నా యువతి

తన పెరటిలోని పెంటపోగునుజూపి, "ఈ స్థలముననే బారవైచితి" నని చెప్పెను.

మత్స్యేంద్ర నాథు డా పెంటప్రోగుయొద్ద నిలువబడి "అల్లఖ్" యని కేకవేయుగా నా పెంటప్రోగులోనుండి "సద్గురూ! ఏమి యాజ్ఞ" యని ప్రతిధ్వని వచ్చెను; అచ్చటగల జను లాశ్చర్యచకితులై పెంట ప్రోగును దొలగించిజూడ ద్వాదశవర్ష ప్రాయుడైన తేజోవంతుడును, ముప్పదిరెండు సులక్షణములు గల సుకుమారుడును, సాక్షాత్ విష్ణ్వవ తారుడును, నాకర్ణనయనుడును, కర్ణముద్రికా శోభాయమానుడును, నాధారము లేకయే యాసనమువేసికొని యనుష్ఠానమునందు త్రిష్ఠుడై యున్న యయోనిసంభూతుడైన బాలకు డుండెను. ఆతని శరీరమున నేవిధమగు మాలిన్యము నంటక నిర్మల దేహుడుగ నుండుట గాంచి యెల్ల రత్యాశ్చర్య చకితులైరి. తత్క్షణమే మత్స్యేంద్రనాథు డతనిని సావధానపరచి మస్తకముపై నభయహస్తముంచి గోమయభస్మము లను పారవైచు పెంటప్రోగున నున్నవాడు గనక యాతనికి గోరఖ్ నాధుడని నామకరణముజేసి యాతని వెంటబెట్టుకొని సత్వరమే తీర్థాట నకై బయలుదేరెను. అంత నా శ్రీమంతుని భార్య పశ్చాత్తాపముతో నశ్రుధారలు విడచుచు మత్స్యేంద్రనాథునకు సాష్టాంగ నమస్కారము జేసి "ఓ యోగీంద్రా! అభాగ్యురాలనగు నాకు గృపతో బుత్రభిక్ష నను గ్రహింపు" డని ప్రార్థింప "నీకొక సుపుత్రుడు కలుగు"నని మత్స్యేం ద్రనాథు డాశీర్వదించి బయలువెడలెను.

మార్గమున గురుశిష్యు లిరువురు బోవుచుండ గోరఖ్‌నాథుడు నాకు మంత్రోపదేశము జేయుమని మత్స్యేంద్రనాథుని బ్రార్థింప "నీ విం తవరకు నాకు సేవజేయలేదు. శిష్యుని చిత్తమును బరీక్షింపక నుపదేశ మిచ్చుటయు, పరీక్షింపనిది నాణెములను దీసికొనుటయు, భూమి దున్న నిది విత్తులు వేయుటయు, యోగ్యములు" గావని చెప్పెను. గోరఖ్ నాథుడు సద్గురువచనములను విని యాతనికి సాష్టాంగ నమస్కారముజేసి

"తమ యాజ్ఞకు బద్ధుడ"నని చెప్పెను. గురుశిష్యు లిరువురును గలిసి యచటికి సమీపమున నున్న నగరము జేరిరి. మత్స్యేంద్రనాథుడు నగరము వెలుపల నుండి గోరఖ్‌నాథుని భిక్షకై నగరములోనికి బంపెను. గోరఖ్‌నాథుడు నగరములో ప్రవేశించి ప్రతి గృహమున కెదుట నిలువబడి "అలఖ్" యని కేకవేసి భిక్షాటన జేయుచు నొక బ్రాహ్మణ గృహమునకు బోయెను. ఆ గృహమున పితృశ్రాద్ధ మగుటచే భక్ష్య భోజ్యము లమితముగా జేయబడి యుండెను. ఆ గృహయజమానురాలు భక్ష్యములను దీసికొనివచ్చి గోరఖ్‌నాథుని జోలెలో వేసెను.

గోరఖ్‌నాథుడా భక్ష్యములను సద్గురు సమక్షమున బెట్టి నమస్కారము జేసెను. మత్స్యేంద్రనాథుడు భుజించి శేషమును గోరఖ్‌నాథునకిచ్చి నేడు దెచ్చిన భక్ష్యములు మిగుల రుచ్యములై యున్నవి. రేపటికినీ యిట్టే తేవలయునని జెప్పగా "తమ యాజ్ఞానుసారము దెత్తు"నని గోరఖ్ నాథుడు పలికెను. మరుదినము ప్రాతఃకాలమున గోరఖ్‌నాథుడు జోలెను గైకొని నగరమున బ్రవేశించి సద్గురునాథుడు గోరిన భక్ష్యము లెచటను లభింపవు. నిన్నటి దినమున బ్రాహ్మణ గృహమున భక్ష్యముల నిచ్చిరి. నేడును నచ్చటికేబోయి వారిని బ్రార్థించిన భక్ష్యముల నిచ్చెదరని తలచి యాబ్రాహ్మణ గృహమునకేగి గృహస్వామికి నమస్కారముజేసి "తల్లీ! నిన్నటిదినమున మీరు పెట్టిన భక్ష్యములు మాగురుదేవుల కర్పించితిని. వారా భక్ష్యములను స్వీకరించి బహురుచ్యములుగ నున్నవి. రేపును నిట్లే తెమ్మని నాకాజ్ఞ నిచ్చిరి. కాన ఓ తల్లీ! నాకోరిక దీర్పుము. నేను ద్రవ్యమును మట్టిగా భావింతును. అష్టసిద్ధులను రాజ్యసంపదలను, నింద్రపదమును, చతుర్విధ ముక్తులను నపేక్షించువాడను కాను. నా గురుదేవుల గోరిక దీర్చుటకై భక్ష్యముల మాత్రము మిమ్ము గోరుచుంటి నని చెప్పెను.

అంత నాసాధ్వి "నాయనా! నిన్నటి దినమున మాయింట బ్రాహ్మణ భోజనములు జరుగుటచే భక్ష్యములను జేసితిమి. నేడు నిన్న

టివలె భక్ష్యము లొల్లువచ్చును. కలకొలది పదార్థము లిచ్చెదనని చెప్పగా "ఓ తల్లీ! నాకితర పదార్థములు వలదు. భక్ష్యములుమాత్రము కావలెనని చెప్పెను. ఆ బ్రాహ్మణ స్త్రీ క్రోధముతో నీవు వేషధారివి. ధర్మము జేసిన కర్మ మెదురైనటుల శ్వానమునకు రొట్టెవైచిన నది పదేపదే గృహమునకు వచ్చునటుల, యాచకుల కొకపర్యాయము భిక్ష వైచిన మొండితనము నిచ్చిన దానికి దృప్తిపడక బీడించు మందు"రని చెప్పెను. అంత గోరఖ్నాథ్ ఓ తల్లీ "నేను శ్వానమునకంటె హీనుడను. మీరు భక్ష్యముల నీయనిది నేనిచ్చట నుండి కదలనని బలుకగా నాయువతి నీవొక నేత్రము నూడదీసి యిచ్చిన నీకు భక్ష్యముల జేసి యిచ్చెదనని చెప్పెను. గోరఖ్నాథుడు చేతులుజోడించి "ఓ తల్లీ నీ గోరిక ప్రకారము నా నేత్రము నొకదాని నూడదీసి యిచ్చెద నని చెప్పగా నా బ్రాహ్మణస్త్రీ "భిక్షకు లిటులనే నితరులకు జ్ఞానమును బోధించి తాముమాత్ర మవివేకముగా బ్రవర్తింతురు. నోటిమాటలతో బనిలేదు. నేత్రము నూడదీసి యిమ్మ"నగా తత్క్షణమే గోరఖ్నాథుడొక నేత్రము నూడబెరికి యామె చేతికివ్వబోయెను. ఆ గృహస్థురాలు భయపడుచు గ్రామాధికారులకు దెలిసిన దమను దండింతురని గోరఖ్నాథునకు నమస్కారముజేసి "నేను హేళనగా నవివేకముచే బలికితిని, క్షమింపు"మని ప్రార్థించెను. గోరఖ్నాథుని నేత్రమునుండి రక్తము ప్రవాహముగా గారుచుండెను. గోరఖ్నాథుడా స్త్రీనిజూచి "తల్లీ! భయపడకుము. నాకు భక్ష్యములనుమాత్రము సిద్ధముచేసి యిమ్మని" కోరెను.

గోరఖ్నాథునికి కోపము గలిగినచో నది శాపమువలె బ్రహ్మాండమును దగ్ధముజేయును. కాని శాంతి క్షమలతో మూర్తీభవించిన యా గోరఖ్నాథునికి సంతాపము గలుగలేదు. ఆతడు పాదమిడినచోట సకల సిద్ధులును వసించుచుండెను. కాని యాతడందు లిప్తుడుగాక భిక్షాటన జేయుచుండును. ఎందరో తాపసులును, ఋషులును నీ భువిని గలరు గాని కామక్రోధాదులను స్వాధీనమం దుంచుకున్నవారు లేరు. అణిమా

గరిమాది సిద్ధులకు లోబడి తాపసులెందరో మోహితులై పరమార్థము నుండి విముఖులైరి. కాబట్టి గోరఖ్‌నాథుడు కామక్రోధాదులను, బుద్ధి సిద్ధులను త్యజించి విరక్తుడై వర్తించుచుండెను. బ్రాహ్మణస్త్రీ భక్ష్య ములను 'దయారు' జేసి గోరఖ్‌నాథున కిచ్చెను.

గోరఖ్‌నాథుడు భక్ష్యములను దీసికొని యొక చేతితో కన్ను మూసికొని గురుదేవులయొద్దకు బోయి "భిక్ష దెచ్చితిని. త్వరిత ముగా భుజింపు" డని చెప్పెను. మత్స్యేంద్రనాథుడు గోరఖ్‌తో నర చేతి నేల నేత్రమున కడ్డముగా బెట్టితివి? దానిని దీయుమనగా గోరఖ్ నాథుడు సద్గురువునకు సాష్టాంగనమస్కారము జేసి జరిగిన వృత్తాంత మంతయు దెలిపెను. మత్స్యేంద్రనాథుడు "నీ ధైర్యము మిగుల ధన్య మైనది. భక్ష్యములకొరకొక నేత్రము నిచ్చితివి. నేను భక్ష్యములు భుజించుటకు రెండవనేత్రము" నిమ్మని చెప్పెను. గోరఖ్‌నాథు డవశ్య ముగా నిత్తునని చెప్పి రెండవనేత్రమును దీసి గురుదేవులయొద్ద నుంచెను. మత్స్యేంద్రుడు శిష్యుని గురుభక్తికి సంతసించి యాతని నేత్రములను దన హస్తములతో దడవి యథాప్రకారముగా దివ్యనేత్రము లను గ్రహించి మస్తకముపై నభయప్రదానహస్తముంచి మంత్రోపదేశము జేసెను. తత్క్షణమే గోరఖ్‌నాథునిలో నాత్మజ్ఞానము ప్రతిబింబించెను. మత్స్యేంద్రనాథుడు గోరఖ్‌నాథున కద్వితీయానందశాంభవి నుపదే శించి యోగమార్గమును దెలిపెను. పిదప గహినీనాథుడు నివృత్తిదేవు లకును, నివృత్తిదేవులు జ్ఞానేశ్వరులకును, జ్ఞానేశ్వరులు విశోబాఖేచరు నకును, విశోబా నామదేవునకును, నామదేవులు జనాబాయికిని మం త్రోపదేశము జేసిరి.

శ్రోతలారా! ఆదినాథుడగు శంకరునినుండి తారకమంత్రము గురుపరంపరగా శ్రీ విఠ్ఠలోపాసకులగు భక్తులద్వారమున పంఢరీపుర భాగవత (వైష్ణవ) సాంప్రదాయ మంతయును వ్యాపించెను.

ఇరువది ఆరవ యధ్యాయము సమాప్తము.

భక్తజన విధేయాయ నమః

# చాంగదేవ చరిత్ర

## —♦ ఇరువదిఏడవ అధ్యాయము ♦—

శ్రోతలకు నేడమృతసింధువును, దెరువబడిన భాండాగారమును, హృదయమున సూర్యుని దేజమును నాకస్మికముగ సంప్రాప్తించినవి. కర్ణములందు శుద్ధమగు జ్ఞానబోధ ప్రవేశించినది. చతుర్విధముక్తియను బీజ మంకురించినది. మంగళకరమగు భక్తలీలామృత గ్రంథము దైవ యోగమున వెలువడినది. వివేక వైరాగ్యములవలన భక్తకథాశ్రవణమునం దాసక్తి కలిగెను. శాంతియొక్క నిజసుఖమును వివేకవృక్షము యొక్క మూలమును, నాత్మానందమును, నిరపేక్షావైరాగ్యమును, సమత్వమగు భూతదయయు, ప్రేమయొక్క తత్త్వమును, సాయుజ్యస్థానమును, నిష్కామసాధనమును భక్తకథారసముతో యీ గ్రంథమున వెలువడినవి కాన సావధానముగా శ్రవణము జేయుడు.

పుణ్యవంతంబగు గంగానదీతీరమున మరుస్థిత బ్రాహ్మణవంశీయులగు విఠోబా రుక్మిణీబాయిఅను దంపతులుండిరి. వారికి పుత్రసంతతి లేదను చింతతో భగవంతుని బ్రార్థింప వృద్ధాప్యస్థితిలో వారికొక సుపుత్రుడు కలిగెను. ఆ బాలునకు పండ్రెండవ దినమున జాతకర్మ గావించి చాంగదేవు అని నామకరణముజేసిరి. ఈ బాలుడు దినదినప్రవర్ధమానుడగుచుండెను. ఈతని కైదవసంవత్సరమున నక్షరస్వీకారమును, నెనిమిదవ సంవత్సరమున నుపనయన సంస్కారమును, పిదప వివాహమును జేయబడెను. ఈత డిచ్ఛామాత్రముననే యాకసమున నెగురుచుండెను. ఈతని నోటినుండి వెలువడు నాశీర్వచనములు ఫలించుచుండెను ఈతడు పాదమిడినచోట సర్వసిద్ధులును దాండవమాడుచుండెను పదునాలుగు విద్యలయందును నరువదినాలుగు కళలయందును, నీత డుత్తీర్ణుడాయెను. ఇత డింద్రియములను స్వాధీనమందుంచుకొని నియమముతో బ్రాణాయామము జేయుచు శతవర్షప్రాయమున మృత్యుకాలము సమీపింప నాత్మను బ్రహ్మాండమందుంచి మృత్యువును జయించి తిరిగి ప్రాణమును దేహమందు బ్రవేశపెట్టుచుండెను.

ఈ విధమున చాంగదేవుడు ప్రతి శతవర్షములకును మృత్యు ఘాతమున కేపురుగాక పదునాలుగు వందల సంవత్సరములు సజీవుడై తరుణ వయస్కుడుగనే నగపడుచున్నందున నాతని కీర్తి జగత్తునంత యును వ్యాపించెను. నిత్యము నాతడు గగనమార్గమున పంఢరీక్షేత్రము నకుబోయి (శ్రీ) విఠ్ఠలనాథుని సన్నిధియందు నృత్యకీర్తనలు జేయుచుం డెను. ఆతడు తపతీనదీతీరమున నొక మఠమును నిర్మించుకొని యచ్చట నసించుచు, గగనమార్గమున ప్రతిదినము ప్రాతఃకాలమందు గోదావరీ నదికిబోయి స్నానముజేసి వచ్చుచుండెను. శిష్యసంఘ మతనికి బెరిగి క్రమక్రమముగా బదునాలుగువందలు శిష్యులేర్పడిరి. చాంగదేవుడు శిష్యులనెల్లరిని వెంటబెట్టుకొని యాకాశమున సంచరించుచుండెను. ఇంత సామర్థ్యముగల చాంగదేవుడు సద్గురుసేవజేయకయే, శిష్యులకు జ్ఞాన బోధజేసి వారివలన సేవజేయించుకొనుచుండెను. వైద్యుడు తానన్ని పదార్థములను దినుచు నితరులకు పథ్యము జెప్పునట్లును, విప్రుడు తాను స్నానముజేయకయే యితరులకు సంకల్పముజెప్పునట్లును, నష్టసిద్ధుల సామర్థ్యమును ప్రజలకు జూపి వారిని మోహితులనుగాజేసి చాంగ దేవుడు శిష్యసంఘమును వృద్ధిపరచెను.

చాంగదేవుడు భూలోకమంతయు శోధించినను తనకు యోగ్యు డగు సద్గురుడు తనకు గనబడలేదనియు, నభిమానముతో దనసామర్థ్య మునకు దగినవారీ త్రిభువనములందును లేరను నభిమానముతో గర్వించు చుండెను. ఈ చాంగదేవుని పూర్వవృత్తాంతమేమనగా బ్రహ్మదేవుని మొదటిజామున బదునలుగురింద్రులు విచిత్రకర్మవలన జెరసాలలో బంధింపబడిరి. ఒకదినమున బ్రహ్మపుత్రుడగు నారదు డకస్మాత్తుగా జెర సాలకుబోయెను పదునలుగురింద్రులును దేవర్షికి నమస్కారముజేసిరి. నారదుడు వారినిజూచి ప్రేమతో గానముజేయుచుండెను. ఆ చెరసాలలో బహుకాలముగా బంధింపబడిన చాంగాపురందరుడను నింద్రుడు నారదు లనుజూచి నాకు మోక్షసాధనమార్గము దెలుపుమని ప్రార్థించెను. అంత బ్రహ్మసుతుడు "ఈ లోకమున నిశ్చయముగా నీకు మోక్షప్రాప్తి లభిం

చదు. భూలోకమునకు త్వరితముగాబోయి యవతరింపుము. పృథ్వియందు వైకుంఠము పంఢరీక్షేత్రమను పేరుతో నున్నది ఆ పుణ్యక్షేత్రమునందు సచ్చిదానంద పరబ్రహ్మమూర్తియగు శ్రీ విఠలనాథుడు భక్తరక్షకుడుగ నున్నాడు. ఆ క్షేత్రమందు సత్సాంగత్యమును, హరినామసంకీర్తనయు జేసి స్త్రీ పురుషులు జీవన్ముక్తు లగుచున్నారు. నీవు కర్మభూమియందు దవతరించి తరింపుము. అమరపురీ సత్యలోకముల వసించు ప్రాణిగణములకు మోక్ష సాధన లేదు. వారు తిరిగి భూలోకమున జన్మించినగాని మోక్షము లభింప''దని చెప్పగా నాతడు సమస్కారము జేసి ''మునీంద్రా! నేను దేహమును త్యజించు నుపాయము ను చెప్పు'' మన నారదుడు కృపా దృష్టితో వీక్షించి యాతనికి ద్వాదశాక్షరీ మహామంత్రము నుపదేశించెను. తత్క్షణమే చాంగాపురందరుడు గంగాతీరమునందు, చాంగ దేవుడై జన్మించెను.

ఒకనాడు జ్ఞానేశ్వరులు శ్రీ పంఢరీనాథునకు సాష్టాంగ నమస్కారము జేసి తనస్వస్థానమున కేగుట కనుజ్ఞ దీసికొని యళందీక్షేత్రము జేరెను. చాంగదేవు డళందీక్షేత్రమునందు, లోకోద్ధారణకై శ్రీ మహావిష్ణువు జ్ఞానేశ్వరులను నామమున నవతరించిరని పరస్పరముగా ప్రజలవలన వినెను. పిదప చాంగదేవుడు జ్ఞానేశ్వరుల దర్శించుటకు నిశ్చయించి ప్రథమమున వారికొక జాబువ్రాసి ప్రత్యుత్తరము వచ్చిన పిమ్మట బోవు టుచితమని యాలోచించి తాళపత్రమును గంటమును బుచ్చుకొని ''చిరంజీవియని వ్రాసినచో వారియొద్ద నుపదేశము బొందిన యపచారమగును. తీర్థస్వరూపులని వ్రాయుటకు నాకంటె మిగుల జిన్నవా'' రని పరిపరివిధముల యోచించి యేమివ్రాయుటకును దోచక, తాళపత్రమును మాత్రము ముద్రవేసి యొకశిష్యునిబిలచి యేమియు వ్రాయని తాళపత్రమునాతనికిచ్చి నీవు దీని దీసికొనిపోయి యళందీక్షేత్రముననున్న జ్ఞానేశ్వరుల కిమ్మని చెప్పెను.

జ్ఞానేశ్వరు లా సమయమున సిద్ధేశ్వరుని యాలయమున గూర్చుండి ప్రేమతో భజన జేయుచుండిరి. ఆకస్మికముగ నా కసము



జ్ఞానేశ్వరులు మట్టిగోడను నడిపించుచు చాంగదేవుల కెదురుగబోవుట.

నుండి చాంగదేవుల శిష్యుడు దిగి జ్ఞానేశ్వరులకు సాష్టాంగ నమస్కారము జేసెను. జ్ఞానేశ్వరు లాతని జూచి నిన్ను చాంగదేవుడు పంపెనా? అని యడుగగా నాతడౌనని చెప్పి తాళపత్రము వారికిచ్చెను. జ్ఞానేశ్వరు లాతాళపత్రమును విప్పిచూచి "ఈ పత్రమె ట్లక్షరశూన్యముగ నున్నదో చాంగదేవుని జీవితమును శూన్యముగ నున్నది. ఆతడు పదునాలుగు వందల సంవత్సరములు జీవించినను, నపార శిష్యసముదాయముతో గూడియున్నను, నణిమాగరిమాదిసిద్ధుల నొంది యున్నను, నపార కీర్తి గడించినను, సార్థకముగా లేదు. ఫలపుష్ప రహితమగు వృక్షమును, జలము లేని తటాకమును, సంతాన రహితయగు గృహిణియును, సామర్థ్యములేని పురుషుడును, సౌభాగ్యములేని యలంకారమును, వైరాగ్యము లేని సన్న్యాసగ్రహణమును, గృహమునని యుత్తమస్థానమును, నౌదార్యము లేని ధనమును, కరుణ లేనివాని భూతదయయును, వర్షించని మేఘములును, వ్యర్థము లగునట్టుల సద్గురుని శరణు బొందని జీవితము వ్యర్థమగును. చాంగదేవుడు పదునాలుగు వందల సంవత్సరములు జీవించుట వలన నేమి సార్థక''మని జ్ఞానేశ్వరులు చెప్పి తాను ప్రత్యుత్తర మిట్లు వ్రాసెను. "చైతన్యము సర్వభూతములందు సమముగా వ్యాపించియున్నది, అది పెద్దదిగాదు, చిన్నదియునుగాదు, పరివారముతో గూడు కొనినదిగాదు, ఒంటరిగా నుండునదియుగాదు, పొడుగైనది కాదు, పొట్టిదియునుగాదు. గగనమునం దెన్ని మేఘములున్నను నాకస మొకే విధముగ స్థూల సూక్ష్మములు గాకయుండునట్లును, సచ్చిదానంద స్వరూప మటులనేయుండును. అజ్ఞానముచే నీకు భ్రాంతికలిగినది. వివేకవంతమగు చిత్తముతో యోచించుము. సకలవిశ్వమునకు నిజబీజము నీయొద్దనే గలదు, ఇది తెలిసి" కొనుమని జ్ఞానేశ్వరులు వ్రాసి యాతాళపత్రమును చాంగదేవుని శిష్యునకిచ్చెను. ఆతడది దీసుకొనిపోయి చాంగదేవుని కీయగా చదివినమాత్రముననే యనుభవమును దెలిసికొనినవాడై జ్ఞానసముద్రుడగు సద్గురుని సన్నిధికి బోవనెంచి తన సామర్థ్యమును గొంత జూపదలచి వ్యాఘ్రముపై నధిష్టించి పదునాలుగువందల శిష్యుల వెంటబెట్టుకొని చాంగదేవుడు బయలు వెడలెను.

జ్ఞానేశ్వరు లా సమయమున మట్టిగోడపై గూర్చుండి యుండిరి. జను లాశ్చర్యముతో యోగీశ్వరుడు వ్యాఘ్రము నెక్కి వచ్చుచున్నాడు. ఆతనిముందొక భయంకరసర్పము వచ్చుచున్నదని జ్ఞానేశ్వరులకు జెప్పిరి. జ్ఞానేశ్వరులు చాంగదేవుడు వచ్చుచున్నాడని నిశ్చయించి తా నధిష్ఠించి యున్న మట్టిగోడను జూచి "ఓ జీర్ణకుడ్యమా! సిద్ధుడగు చాంగదేవుడు వ్యాఘ్రారూఢుడై దర్శనమునకు వచ్చుచున్నాడు. సాధుజనులు వచ్చునప్పు డెదురుగా బోయి స్వాగతమిచ్చుట ధర్మముగాన నీవు త్వరితముగా నడువు" మని చెప్పెను తత్క్షణమే యా జీర్ణకుడ్య మతివేగముగ నడచుచుండెను. స్త్రీ పురుషు లెల్లరును నీ కౌతుకమును జూచి యత్యాశ్చర్య మొందిరి. జ్ఞానేశ్వరులు జీర్ణకుడ్యమును నడిపించుచు గ్రామము వెలుపలివరకు బోగా దూరమునుండి చాంగదేవుడు గుర్తించి సద్గురువుల మహిమ విశేషమైనది. నిర్జీవమగు జీర్ణకుడ్యమును నడిపించుచున్నాడు నేను సజీవమగు వ్యాఘ్రము నెక్కి వానియొద్ద కెట్లు పోవలెనని యోచించి వ్యాఘ్రమునుండి క్రిందికి దిగి సాష్టాంగనమస్కారము జేసెను.

చాంగదేవునకు మనస్సునందు గల యభిమానము తత్క్షణమే తొలగెను. అమృతమును జూచి యౌషధము లజ్జపడునట్లును, భరతుని పరాక్రమము జూచి హనుమంతు డాశ్చర్యమును బొందినట్లును, రుక్మిణి సీతరూపమును ధరింప సత్యభామ లజ్జపడినట్లును, విధాత గోగోపాలురను సత్యలోకమునకు గొనిపోవ శ్రీకృష్ణుడు మరల గోగోపాలుర నిర్మింపగా బ్రహ్మదేవుని గర్వము తొలగినట్లును, జ్ఞానేశ్వరులు మట్టిగోడను నడిపింపగా చాంగదేవుప యభిమానము దొలగెను. అంత చాంగదేవుడు సాష్టాంగనమస్కారము జేసి సాక్షాత్ పాండురంగమూర్తియే జ్ఞానేశ్వరుల రూపమున యవతరించెనని నిశ్చయించెను. పిదప జ్ఞానేశ్వరు లచటనున్న వటవృక్షచ్ఛాయను గూర్చుండి కృపాదృష్టితో చాంగదేవు ననుగ్రహించి యాతనికి మంత్రోపదేశ మొనర్చిరి. అప్పటినుండి

యా వృక్షమునకు విశ్రాంతివృక్షమని సార్థకనామము గలిగెను. ఒక క్షణకాల మచట గూర్చుండువారు సాయుజ్యసుఖ మొందెదరు.

పిదప జ్ఞానేశ్వరులు చాంగదేవుల హస్తమును బుచ్చుకొని యాశ్రమమునకు దీసికొనపోయిరి. చాంగదేవుడు ముక్తాబాయికి నమస్కారము జేసి "తల్లీ! నన్ను జ్ఞానేశ్వరుల సేవకునిగా జేయు" మని చెప్ప నామె యనుగ్రహించి సాక్షాత్పరబ్రహ్మమూర్తియగు జ్ఞానేశ్వరుల కృపాపాత్రునిగా జేసెను. తత్క్షణమే చాంగదేవు డతివిరక్తుడై దేహాభిమానమును మాయామమతలను ద్యజించి నిష్కళంకచిత్తుడై జ్ఞానేశ్వరుల సేవించుచు వారి కీర్తిని ప్రకటించుచుండెను. అళందీక్షేత్రము ధన్యమైనది. మృత్యులోకమున వైకుంఠముగా నేర్పడిన ద్వితీయ పంఢరీక్షేత్రమా? అని జనులెల్లరును పరిపరివిధముల గొనియాడుచుండిరి.

ఇరువది యేడవ అధ్యాయము సమాప్తము.

అఖిలార్థ ప్రదాయ నమః

---

# జ్ఞానేశ్వరుల జీవసమాధి

—♦ ఇరువది యెనిమిదవ అధ్యాయము ♦—

జయజయ విశ్వవ్యాపకా! రుక్మిణీపతీ! నీవే నా జననీజనకులును, బంధుమిత్రులున్నై యున్నావు. నా ధనసంపత్తియు నాధ్యాత్మిక జ్ఞానమును, శ్రవణమననములును గీర్వాణభాషయు, ప్రాకృతపుబలుకులును, చాతుర్యకళలును, బలికించుశక్తియు, దీనదయాళుడవగు నీవై యున్నావు. నాయక్షయసుఖమును, సద్గురువును, దారకుడవును, విశాల బుద్ధిననుగ్రహించువాడవును, నీవై యున్నావు. నీవు నాకుసమయస్ఫూర్తిగ వచనములను స్ఫురణజేయువాడవును, ప్రేమతో శ్రవణముజేయువాడవును, నై యున్నావు. ఓ అనంతా! నీకృపాకటాక్షము ప్రసరించినచో లోభమమతలు బాధింపవు. అజ్ఞానులు జ్ఞానులగుదురు. సూర్యోదయము వలన నంధకారమంతయు నశించునట్లును, లోహమునకు స్పర్శవేది సోకినచో మలినాకారము తొలగి సువర్ణమగునట్లును, నమంగళకరములగు మురికి కాలువలు గంగలోగలిసి పవిత్రములగునట్లును, నీవు కృపాదృష్టితో నెవని ననుగ్రహింతువో వానికీర్తి త్రిభువనములందును నిశ్చయముగ వ్యాపించును. అతి విరక్తులగు ప్రేమభక్తులు నిన్నొకక్షణకాలమైనను విడచియుండరు. ఆ భక్తుల యఘటితములగు చరిత్రలు నాహస్తముతో లిఖింపించుము.

శ్రోతలారా! జ్ఞానేశ్వరుల సచ్చరిత్ర గతాధ్యాయములలో మీరు వినియుంటిరి. జ్ఞానేశ్వరులు క్రీ శ 1275 సంవత్సరంలో జన్మించిరి. వీరష్టవర్షముల ప్రాయమునుండి తమయవతార కార్యక్రమము ప్రారంభించిరి. భాగవత (వైష్ణవ) ధర్మము ప్రచారముజేయుటయే ఆయన అవతారకార్యక్రమము. దక్షిణకాశీయనబడు పైఠనపుర బ్రహ్మపీఠమున ధర్మనిర్ణయాధికారుల సమక్షమున మహిషము నోటినుండి వేదములను బలికించి వారల మూర్ఖస్వభావములను మార్చి వారిని భాగవతధర్మమున ప్రవేశపెట్టి యాక్షేత్రముననే భగవాజెండా (కావిజెండా) ను

స్థాపించిరి. జ్ఞానేశ్వరులు సాక్షాత్ విష్ణ్వవతారులని ఆదేశగురువులును, పండితులును, ధర్మాధికారులును, ఆయన పంద్రెండవ సంవత్సరము వయస్సులో దెలిసికొనిరి. పిదప పదునైదు సంవత్సరముల వయస్సులో భగవద్గీతకు మహారాష్ట్ర భాషయందు 'జ్ఞానేశ్వరి' యను పేరుతో వ్యాఖ్యానము జేసిరి. పంఢరీపురమున మహాభక్తుడగు నామదేవులను మరికొందరు భక్తులను వెంటబెట్టుకొని తీర్థయాత్రయను మిషతో ప్రయాగ, కాశీ, గయ, అయోధ్య, గోకులము, బృందావనము, ద్వారక మొదలగు క్షేత్రములందును మార్వార్, పంజాబుదేశముల కును వెళ్లి ఐదు సంవత్సరముల కాలము ఆయా దేశీయభాషలలో పురాణకాలక్షేపములను, హరినామ సంకీర్తన, ధర్మోపదేశములను జేసి భాగవత ధర్మమును స్థాపించిరి. ఆతడు తీర్థయాత్రలనుండి తిరిగి వచ్చిన పిదప క్రీ. శ. 1296 వ సంవత్సరము ఆషాడశుద్ధైకాదశీ బ్రహ్మోత్సవము నకు పంఢరీక్షేత్రమునకు బోయెను. అచ్చట నేకాదశినాడు హరినామ సంకీర్తన చంద్రభాగానదీతీరమునందు చేసిరి. అసంఖ్యాకులగు భావుక జనులు జ్ఞానేశ్వరుల యుపదేశ వాక్యములనువిని యానందపరవశులైరి. (శ్రీ) పాండురంగదేవుడు జ్ఞానేశ్వరులు కీర్తనజేయు స్థలమునకువచ్చి కూర్చుండెను. ఆ సమయమున భావుకజనులతో జ్ఞానేశ్వరులు, "అయ్యలారా! మీరెల్లరును పంఢరీక్షేత్రమున చాతుర్మాస్య దీక్షను ముగించుకొని కార్తీక బహుళ ఏకాదశికి అళందీక్షేత్రమునకు దయచేయ వలెను. భక్తజనులసమక్షమున నేను సమాధికావలెనని సంకల్పించితి" నని చెప్పెను తమయాజ్ఞప్రకారము తప్పక విచ్చేయుదుమని భక్తజను లెల్లరును దెలిపిరి. జ్ఞానేశ్వరులు పూర్ణిమవరకు పంఢరీపురమునందు వసించి గోపాలకాలమహోత్సవమును సేవించి (శ్రీ) విఠ్ఠలనాథునియొద్దను, భక్తజనులయొద్ద ననుజ్ఞ నుదీసికొని అళందీక్షేత్రము జేరిరి.

జ్ఞానేశ్వరులు సమాధి కానున్నారను వార్త దేశమంతయును వ్యాపించెను. ఇంద్రాయణీ నదీతీరమందుగల సిద్ధేశ్వరస్వామి యాలయా

వరణములో నజాన వృక్ష చ్ఛాయను సమాధియగుటకు జ్ఞానేశ్వరులు నిశ్చయించి భూగర్భమున సమాధి నిర్మాణముజేయించిరి జ్ఞానేశ్వరులు జీవసమాధి యగుటను దర్శించవలెనని భావుకజనులెల్ల రమితానంద ముతో అళందీక్షేత్రమునకు బయలుదేరిరి. పంఢరీపురమున కార్తీక శుద్ధయేకాదశీ బ్రహ్మోత్సవము పూర్తియైనపిదప శ్రీ విఠలనాథుడును రుక్మిణీదేవియును భక్తజనులతో "అళందీక్షేత్రమున జ్ఞానేశ్వరులు జీవ సమాధియగుచున్నారు. కాన మనమెల్లర మచటికి బోవుదము రండ"ని చెప్పగా భక్తజనులు జయజయ ధ్వనులు జేసిరి.

నామదేవులును, రాజాబాయియు, నామదేవుని కుమారులగు నారాయణుడు, విఠోబా, మహాదేవుడు, గోవిందుడును శ్రీ విఠలనాధు డును రుక్మిణీదేవియు బయలుదేరిరి వారివెంట తంబుర తాళ మృదం గాది వాద్యములతో హరినామసంకీర్తన జేయుచు నసంఖ్యాకులగు భక్తజనులు బయలుదేరిరి. భక్తజనులెల్లరును కార్తీక శుద్ధ దశమినాటి కళందీక్షేత్రము జేరిరి.

జ్ఞానేశ్వరులేకాదశినాడు హరినామసంకీర్తన జేసిరి ద్వాదశిని పింపళవృక్షముయొద్ద జ్ఞానేశ్వరులు భక్తజనులతో పారణజేసిరి. త్రయో దశిన జ్ఞానేశ్వరులు ప్రాతఃకాలమందు స్నానానుష్ఠానములు ముగించు కొనిరి. సమాధిస్థలమంతయు నామదేవుల పుత్రులు నలుగురును శుభ్ర పరచి యుదకప్రోక్షణజేసి ముగ్గులతో నలంకరించిరి. భక్తజనులెల్లరును హరినామసంకీర్తన ప్రారంభించిరి.

జ్ఞానేశ్వరులు భక్తజనుల మధ్య నిలువబడి హరికీర్తన ప్రారంభిం చిరి. అసంఖ్యాకులగు భావుకజనులు జ్ఞానేశ్వరుల ఉపదేశ వాక్యము లను వినుటకై కూర్చుండియుండిరి. జ్ఞానేశ్వరులు శ్రోతృజనుల కిట్లు తమ అంత్య సందేశమును దెలిపిరి. "మీరు ప్రాణాయామాది సాధనలజేసి వాయు నిరోధము చేయుటకు ప్రయాస పడవలదు. అరణ్య ప్రదేశము

లకు బోవలదు. భోజనాదికముల త్యాగము అథవా పంచాగ్ని సాధన ములవలన శరీరమును వ్యర్థముగా శుష్కింప జేసికొనకుడు. ఆనంద యుక్తముగ ముక్తసంగజనులతో గలసి హరినామ సంకీర్తన జేసిన యీ భవసాగరమునుండి అనాయాసముగ తరింతురు. భగవత్ప్రాప్తికి భక్తియే ముఖ్యసాధనము. భగవంతుడు ధనము, ఉత్తమకులము, సౌందర్యము, తపము, వేదశాస్త్రాభ్యాసము, పరాక్రమము, ఉద్యోగము, బుద్ధి యోగాభ్యాసములకు వశ్యుడుగాడు. భగవద్భక్తిలో నింద్రియాదు లెంతమాత్రమును బాధింపజాలవు. హరిభక్తి యోగము వలన సహజముగ విషయాసక్తి దూరమగును, హరిభజనయందు విశేష సామర్థ్య మున్నది. నిష్కామబుద్ధితో స్త్రీ సుత గృహ ధన ప్రాణము లను భగవంతుని కర్పించవలెను. ఇదియే భాగవతధర్మము. దీనినేముఖ్య భజన యనెదరు. త్రికరణ శుద్ధితో భాగవతధర్మము ననుష్ఠించినచో దప్పక భగవత్ప్రాప్తి ననాయాసముగా బొందెదరు".

శ్రీ విఠ్ఠలనాథుడు నిలువబడి జ్ఞానేశ్వరుల గళమున కోమల తులసీమిశ్రిత పుష్పహారమును వేసి కేశరీ తిలకమును లలాటమున నలంకరించెను. భావికజనులు జయజయధ్వనుల జేసిరి. జ్ఞానేశ్వరులు చేతులు జోడించి నూటయెనిమిది ఓవీలతో (శ్లోకములతో) శ్రీ పాండురంగ దేవుని స్తోత్రము చేసిరి. (క్రీ. శ.) 25-10-1296 వ సంవత్సరమునకు సరియగు కార్తీక బహుళ త్రయోదశి గురువారమున అపరాహ్ణసమయమున శ్రీ విఠ్ఠలనాథుడు జ్ఞానేశ్వరుల చేయి పుచ్చుకొనెను. మరియొక చేయి నివృత్తినాథుడు పుచ్చుకొనెను, జ్ఞానేశ్వరులు సదురుడగు నివృత్తినాథునకును, శ్రీ పంఢరీనాథునకును సాష్టాంగ నమస్కారము జేసి, నా మస్తకముపై తమ పాదపద్మములను నిరంతర ముంచవలెనని కోరెను. శ్రీ పంఢరీనాథుడును నివృత్తిదేవుడును జ్ఞానేశ్వరులను బట్టుకొని సమాధిలో నుత్తరాభిముఖముగ గూర్చుండబెట్టిరి. జ్ఞానేశ్వరులు పద్మాసనము వేసికొని అద్వైతస్థితి బొందెను. శ్రీ పంఢరీ నాథుడు జ్ఞానదేవులను జూచి "ఓ జ్ఞానేశ్వరా! ఆకాశమున సూర్య

చంద్ర నక్షత్రాదు లుండువరకు నీ సమాధి స్థిరముగ పూజింపబడు" నని పలికెను. నివృత్తినాథుడు సమాధి పైభాగమున శిలను మూతగా వేసెను. భక్తజనులు జయజయధ్వనులు జేసిరి దేవత లాకాశమునుండి పుష్పవృష్టిని గురిపించిరి.

జ్ఞానేశ్వరుల సద్గురువగు నివృత్తినాథుడు అశ్రుధారలు విడచుచు విలపించుచుండెను. శ్రీ పంఢరీనాథుడు నివృత్తినాథుని సమాధాన పరచెను. నామదేవులును, సోపానదేవులును, ముక్తాబాయియు, గోరా కుంభార్‌ను, చోఖామేళాది భక్తులును, జ్ఞానేశ్వరులను మరల నేత్రము లతో దర్శించు భాగ్యము లభించదని విలపించుచుండిరి. అంత శ్రీ పంఢరీనాథుడు భక్తులెల్లరిని సమాధాన పరచి 'ఆహాహా! జ్ఞానేశ్వరులెంత ధన్యులు. ఇరువది రెండు సంవత్సరములలోపల నత్యద్భుతములగు అగణిత లీలలను చూపెను. తీర్థయాత్రయను పేరుతో దేశాటనజేసి భాగవతధర్మ మును సర్వత్ర స్థాపించెను. జ్ఞానేశ్వరుల నామమును జపించువారు జ్ఞానవంతు లగుదురు. భగవద్గీతయను సువర్ణ పతకమునకు జ్ఞానేశ్వరులు వ్యాఖ్యానమను రత్నము లమర్చిరి. భగవద్గీత కిదివరకెవరు నిట్టి వ్యాఖ్యానము జేసియుండలేదు ముందును జేయువారుండ"రని శ్రీవిఠ్ఠలనాథుడు జ్ఞానేశ్వరుల విశేషములను బలికి తత్క్షణమే అంతర్ధాను డయ్యెను.

పిదప నొక సంవత్సరము లోపలనె నివృత్తినాథుడు త్ర్యంబక క్షేత్రమునందును,, సోపానదేవులు సాసవడయందును, జీవసమాధి నొందిరి. ముక్తాబాయి తపతీనదీతీరమందు సమాధిస్థిత యయ్యెను.

ఇరువది యెనిమిదవ అధ్యాయము సమాప్తము.

స్తుతి ప్రియాయ నమః

---



శ్రీ పంఢరీనాథుడు జ్ఞానేశ్వరులను సమాధిలో కూర్చుండబెట్టుట.

# చోఖామేళ చరిత్ర

—♦ ఇరువదితొమ్మిదవ అధ్యాయము ♦—

నేడు శ్రోతలకు దైవదశయును భక్తవిజయము లభించెను. భక్తుల సచ్చరిత్రలు శ్రవణము జేయు చతురుల కనుభవజ్ఞానము కలుగును. చక్కెరను దినినకొలది మాధుర్య మధికాధికమగునటుల భక్తుల సచ్చరిత్రలు శ్రవణము జేసిన వివేకము వృద్ధినొందుచుండును. సుధారసమును సేవించిన వ్యాధి త్వరితముగా దొలగునటుల భక్తుల సచ్చరిత్రలయందు ప్రేమ గలిగినచో నవిద్య బాధింపజాలదు. ఎన్నియో సచ్చరిత్రలు గలవుకాని యివి శాంతివృక్షముయొక్క యమృతఫలములు. వికల్పములను ద్యజించి భక్తచరితామృతమును సేవింపుడు. భక్తచరితములను శ్రవణము జేయవలయునని సంకల్పించినవారు కలికాలునకు వశ్యులుకారు. కాన శ్రోతలు సావధానచిత్తులై వినుడు.

పరమపవిత్రమగు పంఢరీపుర క్షేత్రమున నంత్యజకులమున చోఖామేళ అను వైష్ణవుడుండెను. ఆతడు ప్రతిదినమును చంద్రభాగానదిలో స్నానముజేసి క్షేత్రప్రదక్షిణ జేసి మహాద్వారమున సాష్టాంగనమస్కారము జేయుచుండెను. అస్పృశ్యుడగుటచే దేవాలయములోనికి బోవ నధికారము లేనందున నాత డచటనుండియే నమస్కారము జేయుచుండెను. ఒకనాడు చోఖామేళుడు మహాద్వారమున గూర్చుండి యుండగా దురాచారులు చూచి "శ్రీ విఠోబా దేవునికి నీపై కృపయుండిన నిన్ను దేవాలయములోనికి రప్పించును. రుక్మిణీపతిని దర్శించనిది చేయు భక్తి వ్యర్థము. శ్వానము స్పృశించిన పదార్థమును విప్రులు భుజించక త్యజించునటు లస్పృశ్యకులమున జన్మించిన నీకు పాండురంగభక్తి జేయు నధికారము లేదు. రాజాంతఃపురమున ప్రవేశించుటకు దరిద్రునికి సాధ్యము కానట్లును, నదృష్టహీను డైశ్వర్యములు దొరికినను కల్పవృక్షము గనబడనట్లును, నాయుష్యహీను డమృతకుండమును జూచినను వ్యర్థమగు

నట్లును నస్పృశ్యజాతిని జన్మించిన నీవు భగవద్దర్శనములేక వ్యర్థుడవైతి” వని చెప్పరి.

చోఖామేళుడు వారికి సాష్టాంగనమస్కారముజేసి 'నన్నేల దూషించెదరు? భాస్కరుఁ డపారదూరమునసుండియు కమలమును రక్షించినట్లును, మిగుల దూరమందున్న నిశాపతి చకోరములందు ప్రేమతో నుండునట్లును, ననాథనాథుడును కృపామూర్తియు నగు భగవంతుడు దేవాలయమునందుండియు నన్ను రక్షించుచున్నాఁడు. అఖండముగా సన్నిధియందు వసించియు ప్రేమభక్తి లేనిచో వ్యర్థముగు” నని చెప్పి సత్వరమే తన గృహమునకేగెను. ఆరాత్రి చోఖామేళుడు హృదయమున శ్రీ విఠలుని నిల్పికొని భజన జేయుచుండ శ్రీ పంఢరీనాథుడు సాక్షాత్కరించి, “ఓ చోఖామేళా! నేను నిన్ను దేవాలయమునకు దీసికొనిపోయెద” నని చెప్పి యాతని చేతిని బట్టుకొని దన యాలయమునకు దీసికొనిపోయెను.

శ్రీ పంఢరీనాథుడు చోఖామేళుని గర్భాలయములోనికి దీసికొనిపోయి తన దివ్యమంగళ విగ్రహమునుజూపి “నిన్నొక క్షణకాలము గూడ విడిచి యుండలేను. నామదేవులతో భుజించునప్పుడును, ప్రేమతో నమృతపానము జేయునప్పుడును, నీవు నాకు స్మరణకు వచ్చుచున్నావని చెప్పగా చోఖామేళుడు “స్వామీ! నిన్ననాథ నాథుడని యందురు. నేడది నావిషయమున యదార్థమాయె”నని పలికెను.

భగవంతుడును చోఖామేళుడును మాటలాడుకొనిన సంవాదము నర్చకులు విని యాశ్చర్యముతో నిద్రనుండి మేల్కాంచి మరి కొందరిని బిలచి “చోఖామేళుడును భగవంతుడును గర్భాలయమున మాటలాడుచున్నారు. సాక్షాత్ పరబ్రహ్మమూర్తియగు శ్రీ విఠలనాథుని తలుపులు బంధించియుండగా నంత్యజు డెట్లేగి దర్శించుచుండెనో తెలియుట లేదు. భగవంతుని కలంకరింపబడిన వస్త్ర భూషణముల నంత్యజుడు తాకినచో బ్రాహ్మణాచారమంతయు నేట గలియును. ప్రకాశవంతమగు




చోఖామేళుడు శ్రీ విఠ్ఠలనాథుని సన్నిధికి బోవుట.

పూర్ణిమా చంద్రుని రాహువు కళంకపరచి నట్లు, నమావాస్య దిన మున భాస్కరుని కేతువు వచ్చి కళంకపరచి నట్లును, శ్రుతి శాస్త్రాదులచే వర్ణనీయుడును, షడ్గుణైశ్వర్యపరుడగు శ్రీ రుక్మిణీపతి నస్పృశ్యుడు వచ్చి దర్శించెను. ఈ మహావిఘ్నమును నివారణ జేయు నుపాయ మే"మని యర్చకులు పరిపరి విధముల నాలోచించుచుండిరి కొందరు తాళములు దెరచి చోఖామేళుని బయటకుబిలచి విషయమంతయు నడిగి తెలిసి కొందమని చెప్పిరి.

అర్చకులు తాళములు తెరచి చోఖామేళుని జూచి "ఓరీ! నీవు దేవాలయమున నెట్లు ప్రవేశించితివి? తెల్పు"మన చోఖామేళుడు "అయ్యా! నాకరము బుచ్చుకొని శ్రీ పంఢరీనాథుడు దేవాలయము లోనికి తీసికొనివచ్చెను. నాయందు కృపాదృష్టియుంచి నా యపరాధ మును క్షమింపుడని తత్ క్షణమే గర్భాలయమునుండి బయటకువచ్చెను. పిదప నర్చకులు చోఖామేళునిజూచి "ఓరీ! నీవీ క్షేత్రములో వసింప వీలుపడదు. ఇచ్చటనుండినచో శ్రీపంఢరీనాథుడు నిన్నిచటకు దెచ్చును కాన నీవు చంద్రభాగానది కావలవైపున కుటీర మేర్పరచుకొని వసింప వలయును. అట్లు జేయనిచో నిన్ను శిక్షింతుము. నీవు గొప్ప యన్యాయము జేసితివి. గర్భాలయమున బ్రవేశించి భగవంతు నపవిత్రునిగా జేయుటచే నా దోషమువలన నీవు రౌరవనరకము భోగింప వలసివచ్చునని ద్విజులు పలుకగా చోఖామేళుడు చేతులు జోడించి "ధరామరులారా! నేను శ్రీరుక్మిణీ రమణు నపవిత్రునిగా జేసితి ననుట మిథ్య. అస్పృశ్యుడును బ్రాహ్మణుడును గంగలో స్నానము జేయుదురు. అందుచే గంగకు దోషము సంప్రాప్తించనట్లును, పవిత్రమగు భూమిపై సర్వ జాతుల వారు నడచుటచే భూమి పావిత్ర్యమునకు భంగము కలుగ నట్లును, దుర్జనుల స్పర్శచే వాయువున కపవిత్రత గలుగ నట్లును, దేవాదిదేవుడగు శ్రీ రుక్మిణీపతి కపవిత్ర మనునది లేదు. ఆతని కన్ని జాతుల వారును సమానులే. అనంతబ్రహ్మాండములందును, శ్రీ రుక్మిణీ

పతి వ్యాపించి యలిప్తుడై యున్నాడు. ఆతనికి పవిత్రతాపవిత్రత లెట్లుండు" నని చెప్పెను.

అర్చకులు కోపోద్దీపితమానసులై "సకలజాతులలో నీచుడవగు నీవు మాకు జ్ఞానమును బోధించెదవా? వెట్టిగొల్ల బృహస్పతికి జ్ఞానము బోధించినట్లును, శేషుని యెదుట నితర నాగమొకటి మణిభూషణమును జూపునట్లును, నైరావతము నెదుట నేనుగు తన శిరగమనమును జూపు నట్లును, నగ్రజాతియం దుద్భవించి సర్వశాస్త్ర నిపుణులమైన మాకస్పృశ్యుడవైన నీవు జ్ఞానమును బోధించెదవా? త్వరితముగా చంద్రభాగానది కావలనైపునకుబోయి యచట వసింపుము. రేపటి దినమున మా కంట బడితివేని నిన్ను దప్పక శిక్షింతు" మని చెప్పిరి.

ద్విజుల వాక్యములను విని చోఖామేళుడు "అయ్యా! నేను మీ సేవకుడను, మీ చరణముల నాశ్రయించి బహుకాలముగ జీవించుచుం టిని. నాయపరాధముల క్షమించి నన్ను రక్షింపుడు. నన్ను భగవంతుడు పిలిచినను నేను దేవాలయమునకు రా"నని పలికి యశ్రుధారలు విడ చుచు "ఓ కృపావంతా! శ్రీ విఠలా! నేటినుండి నాకు మిగులదూరుడ నైతివి. నా దురదృష్టము మిగుల బలముగనున్నదని పలికి తన కుటీరము నకు బోయి భగవంతుని రూపమును దన హృదయమున నిల్పికొని ప్రేమతో హరినామసంకీర్తన జేయుచు, జరిగిన వృత్తాంతమంతయు భార్యకుజెప్పి "శ్రీ పంఢరీనాథుడు మనపై గోపించి నది కావలి వైపున వసించుమని యాజ్ఞాపించెను. కాన మనమిచటినుండి పోవుద" మనిచెప్పి కుటీరము నూడదీసి నది కావలివైపున నిర్మించుకొని భార్యతోగలిసి చోఖామేళు డచట్ల వసించుచుభగవంతుని జింతించు చుండెను. ఇప్పటికిని పంఢరీపురముపోయిన యాత్రాజను లాస్థలమును సేవింతురు. భక్తశిరో మణియగు చోఖామేళు డచట వసించుచు శ్రీ పంఢరీనాథుని హృదయ మున నిలిపికొని యఖండముగా హరినామసంకీర్తన జేయుచుండెను.

ఒకనాడు చోఖామేళుడు భోజనమునకు గూర్చుండ నకస్మా త్తుగా శ్రీ పంఢరీనాథు డేతెంచి కుటీరమునకు బ్రక్కగనున్న వేపచెట్టు

నీడలో చోఖామేళుని పంక్తిలో గూర్చుండి భుజించుచుండెను. ఆ సమయమున దేవాలయములో భగవంతుని బూజించు నర్చకుడు కార్యార్థముగా బోయి దిరిగివచ్చుచు నొకక్షణమచట నిలువబడి దూరముగా నుండి కౌతుకమును జూచుచుండెను. చోఖామేళుని భార్య పాత్రతో పెరుగు వడ్డించుచుండ చేయిజారి, పెరుగు పాత్ర క్రిందపడెను. చోఖామేళుడు భార్యనుజూచి "ఓసీ! అనుచితకార్యము జేసితివి. నా పంక్తిని శ్రీరుక్మిణీకాంతుడు భుజించుచుండ నజాగ్రత్తతో పెరుగు పాత్రను బడవైచితివి. అమూల్యమగు భగవంతుని పీతాంబరము పెరుగుతో దడిసిన" దని చెప్పెను.

అర్చకుడు కోపోద్దీపిత మానసుడై చోఖామేళుని యొద్దకుబోయి "ఏమిరా చోఖామేళా! అసంభవములగు మిథ్యావచనములను బలుకుచున్నావు". అనిపలికి చోఖామేళుని చెంపపై గట్టిగా గొట్టెను. ఆ దెబ్బ భగవంతుని చెంపపై దగిలెను అర్చకుడు చంద్రభాగానదిలో స్నానమాడి దేవాలయమున ప్రవేశించి చూడగా సింహాసనముపై శోభించుచున్న శ్రీ విఠలనాథుని పీతాంబరము పెరుగుచే దడిసియుండుట, భగవంతుని చెంపవాచియుండుట గాంచి విస్మయచిత్తుడై "నేను చోఖామేళుని చెంపపై గొట్టగా నాదెబ్బ భగవంతునికి దగిలినది. బాలకుని దుర్జనుడు హింసించినచో నాతని తల్లి క్షోభించునటుల, భక్తుల కపచారమొనర్చిన భగవంతుడు క్షోభించు" నని వివేకవంతమగు చిత్తముతో నాలోచించి యా యర్చకుడు చోఖామేళుని యొద్దకుబోయి యాతని జూచి "నీ మహిమ విశేషమును దెలిసికొనలేక వ్యర్థముగా నీ చెంపపై గొట్టితిని. నేను దేవాలయమునకుబోయి చూడగా భగవంతుని చెంపవాచి యున్నది నేడాతని రూపమును జూచుటకు మిగుల భయము గలుగుచున్నది. కాన నో భక్తశ్రేష్ఠా! సత్వరమే నా వెంట దేవాలయమునకు వచ్చి శ్రీ పంఢరీనాథుని చెంపవాపు లేకుండ నీవతనిని ప్రార్థింపుమని చెప్పి యాతని చేతిని బట్టుకొని దేవాలయమున ప్రవేశించి యర్చకుడు శ్రీ రుక్మిణీకాంతునిజూడగా, భగవంతుని చెంపవాపును, పీతాంబరము

పెరుగుతో తడసియుండుటయు గనబడక (శ్రీ) పంఢరీనాధుడు హాసవదను డుగ దర్శనమిచ్చెను.। (శ్రీ) పంఢరీనాధుని యాజ్ఞానుసారము నాటి నుండియు చోఖా ళుడు దేవాలయమునకు వచ్చుట కనుజ్ఞయీయబడెను. భక్తులెల్ల రానందపరవశులై భగవంతునికి భక్తులయందుగల వాత్సల్య మును బహువిధముల గొనియాడుచుండిరి.

ఒకనాడు (శ్రీ) పంఢరీనాధుడు రుక్మిణీదేవినిజూచి నేడు నాకు మిగుల శ్రమగ నున్నదని పలుకగా జగజ్జనని చిరునవ్వు నవ్వుచు, "ఓ దేవాధిదేవా! ఏమి కార్యము జేసితిరి? సావతాభక్తునిదోటలో బని జేసితిరా? లేక కబీరు వెనుక గూరుచుండి వస్త్రమునేసితిరా? లేక నామ దేవుని గృహమును బాగుచేయుచుంటిరా? లేక లహులౌగ్రామమునకు బోయి కూర్మదాసునకు దర్శనమిచ్చితిరా? లేక జ్ఞానేశ్వరులు గూర్చుండి యున్న జీర్ణకుడ్యమును నడిపితిరా" యని యడుగగా జగజ్జీవనుడు "నేను ప్రాతఃకాలమంతయు జనాబాయితో పిండి విసరుచుంటిని. నామ దేవుల యింటికి భక్తజనులువచ్చిరి. కనుక వారి యింటి కార్యములను సాధించితిని. జనాబాయికి మిగుల శ్రమగలుగుటచే నేను ధాన్యము నంతను విసరి పిదప జలభాండమును దీసికొని జలమును దెచ్చి, ధాన్య మును దంపి గృహావరణమంతయు శుభ్రపరచి చెత్తనెత్తి దూరముగా బారవైచితి" నని చెప్పగా (శ్రీ) రుక్మిణీదేవి యాశ్చర్యచకితురాలై భగ వంతుడు శయనించుటకు పుష్పశయ్య నేర్పరచి యాతని పరుండబెట్టి పాదసేవ జేయుచుండెను.

నామదేవులు సభామంటమున కథా కాలక్షేపము జేయుచుం డెను. వెనుక పాటపాడు వారెవ్వరు లేనందున తత్‌క్షణమే (శ్రీ) పంఢరీ నాధుడు నామదేవులకు వెనుకభాగమున వచ్చి నిలువబడి తాళములను వాయించుచుండెను. భక్తజను లెల్లరీ కౌతుకమునుజూచి యత్యాశ్చర్య మొంది జయజయ ధ్వనులు చేయుచుండిరి. కథాస్థలమున భగవంతుడు పరవశుడై నృత్యము జేయుచుండెను. ఇంద్రాది సురవరులెల్లరును బుష్ప

వృష్టి గురిపించుచుండిరి. భగవంతుడు నృత్యము జేయుచుండగా పీతాంబరము జారి క్రిందపడెను. జగజ్జీవనుడు కొంతసేపటికి సావధానుడగుట జూచి వైష్ణవజనులెల్లరును తటస్థముగా జూచుచుండిరి. అంత జ్ఞానేశ్వరులు శ్రీ పంఢరీనాథుని కరము బుచ్చుకొని హాసవదనుడై "ఓ దేవా! నీవు సర్వజ్ఞుడవని చతురులు పలికెదరు. కీర్తన సమయమున పీతాంబరము జారిపడినది. సావధానుడవై త్వరితముగ పీతాంబరమును ధరింపుమని పలుక జగజ్జీవనుడు ఓ జ్ఞానదేవా! నేను మానాభిమానములను లజ్జను, దేవత్వమును, త్యజించితిని. నామదేవుని ప్రేమకు వశ్యుడనై యాతడెట్లాడిన నట్లాడుచు, నాతని వెంటనే యుంటిని. దర్పణమున జూపరులెట్లు చూతురో యట్లే వారిబింబములు ప్రతిబింబించునట్లును నాకాశ మాయా ఋతుధర్మముల ననుసరించి కనబడునట్లును, వైకుంఠ నాయకుడనగు నేనట్లే భక్తుల ననుసరించి యుందునని జెప్పెను.

ఈ ప్రకారముగా జ్ఞానేశ్వరులకును శ్రీ విఠలనాథునకును సంవాదము జరుగుచుండ నాకస్మికముగా బరమవైష్ణవుడగు భక్తకబీరు రాగా శ్రీ పంఢరీనాథు డాతని కౌగలింగనమిచ్చెను. కాశీక్షేత్రమునందు భక్తకబీరును, పంఢరీపురమున నామదేవుడును శుద్ధభావముగల వారగుటచే భగవంతునికి పరమప్రియులై యుండిరి. నామదేవులు జేయు హరినామ సంకీర్తనచే స్త్రీ పురుషాదులెల్లరును పంఢరీక్షేత్రమున జీవన్ముక్తులగుచుండిరి. అంతె పంచప్రాణములను 'హారతిజ్యోతి'గా గైకొని శ్రీరుక్మిణీదేవి రాగా నామదేవులు భగవంతునికి మంగళహారతిజేసి సాష్టాంగ నమస్కారముజేసిరి. నేడు సంకీర్తన యానందదాయకముగ జరిగినదని భగవంతుడు పలుకగా జ్ఞానేశ్వరులు ఓ దేవా! ప్రేమాంతరంగుడగు నామదేవులు కీర్తన జేయుచుండగా మీరు వెనుకనిలువబడి తాళములను వాయించుటచే మిగుల నానందము గలిగినది. భాస్కరుడు దీపమును బుచ్చుకొన్నచో ప్రకాశమునకు గొదువ యుండనట్లును, హిమకరుడు విసరినచో నుష్ణ ముండనట్లును, లక్ష్మీదేవి వంటజేసినచో సర్వ రుచు లందు బూర్ణముగా నుండునట్లును, మీరే స్వయముగ నృత్యము

జేయుచు కథాస్థలము సంసుండగా నానందమునకు గొదువయేమి యుండునని చెప్పెను.

శ్రీ పంఢరీనాథుడు హాసవదనుడై భక్తుల కాలింగన మిచ్చి గర్భాలయములో ప్రవేశించెను భక్త కబీరు భగవంతునియొద్ద సెలవు దీసికొని యచటనుండి రామేశ్వరమునకు బయలుదేరి మార్గమున హరి నామ సంకీర్తనము జేయుచు నొక నగరమున పరమ భాగవతుడగు నొక వైష్ణవుని కోరికపై వసించి యారాత్రి హరికథా కాలక్షేపము జేసెను. అసంఖ్యాకులగు జనులు శ్రవణము జేసి యానంద పరవశులైరి. జీవ, తత్త్వ యను పిరున్రు బ్రాహ్మణులు జ్ఞానులైయుండి వైష్ణవుడగు కబీరు ధన్యుడనియు, సిద్ధాంతజ్ఞానమున విశేష చతురుడనియు, గ్రహించి సాష్టాంగ నమస్కారము జేసి కబీరుయొద్ద నుపదేశమును బొందిరి. కబీరచటనుండి బయలుదేరి రామేశ్వరాది దక్షిణ క్షేత్రములను సేవించి కాశీక్షేత్రములో ప్రవేశించెను.

జీవ, తత్త్వయను పిరువురు సోదరులును కబీరునొద్ద నుపదేశము బొందుటచే బంధువు లెల్లరును మహమ్మదీయునియొద్ద మంత్రోపదేశము బొందిరని బహిష్కరించిరి. జీవునకు యుక్తవయస్సుగల కుమారుడును, తత్త్వునకు యుక్తవయస్సునందున్న కుమార్తెయు నుండిరి. బంధువులు జాతినుండి బహిష్కరించుటచే సంబంధములు రానందున జీవుని కుమారునకు తత్త్వుని కుమార్తెకును వివాహములు కాలేదు. ఒకనాడాసోదరులిరువురును కాశీక్షేత్రముజేరి భక్త కబీరునుసేవించి తమ స్థితియంతయు నాతని కెరుక పరచిరి. అంతసాక్షియగు కబీరు విషయమంతయు గ్రహించి "నాయొద్ద మీరుపదేశమును బొందుటచే బంధువులు మిమ్ము బహిష్కరించిరి. మీరిరువురును కర్మభయమును త్యజించి శరీర సంబంధము జేయవలెను. జీవుని కుమారుని తత్త్వుని కుమార్తెకిచ్చి వివాహము జరుప

వలయును. నా వచనములందు మీకు విశ్వాసమున్నచో సర్వారిష్ట ములు తొలగి సాయుజ్య సుఖమొందెద"రని చెప్పి యాశీర్వదించెను. సద్గురు చరణములకు నమస్కరించి యా యిరువురును స్వస్థానము జేరి లగ్న ముహూర్తముల నేర్పాటుచేసి తానే పౌరోహిత్యము జేయుచు వివాహము చేయుట కుద్యుక్తులైరి. ఈ విషయమును బంధువులు తెలిసి కొని తత్క్షణమే వారి యొద్దకువచ్చి జీవుని కుమారుని కొక కన్యకను, తత్త్వుని కుమార్తెకొక వరుని బంధువర్గములో నేర్పాటు జేయించి మహా వైభవముగ వివాహము గావించిరి. పిదప జీవుడును తత్త్వుడును కాశీ క్షేత్రమునకుబోయి జరిగిన వృత్తాంతమంతయు గురువున కెరింగింప కబీ రమితానంద భరితుడాయెను.

ఇరువది తొమ్మిదవ అధ్యాయము సమాప్తము.

జ్ఞాన గమ్యాయ నమః.

# పద్మనాభ చరిత్ర

## —♦ ముప్పదియవ అధ్యాయము ♦—

జయ జయ భీమాతీరవాసీ, రుక్మిణీరమణా, భక్తజనపాలకా, నారాయణా, జడమూఢతారకా, పతితపావనా, జగజ్జీవనా, ఆదిపురుషా, నీవు కటిప్రదేశమున కరములనుంచుకొని నాసాగ్రదృష్టిధారణ పరుడవై భక్తుల రాకకొరకెదురు చూచుచుంటివి. అంబరీషుని కొఱకై దశావతారములను ధరించి నానావిధములగు నపారచరిత్రలను జూపితివి. సింహాసనముపై నిలువబడి జడజీవుల నుద్ధరింపజేయుచుంటివి. నీవు భక్తుల కుల గోత్రములను విచారించక వారి మహిమ విశేషములను ప్రకటన జేయుచుంటివి నీ భక్తుల సచ్చరిత్రలను నావాక్కునుండి నీవే పలికించు చుంటివి.

భక్తశ్రేష్ఠుండగు కబీరు సర్వకాలములందును విరక్తుడై శాంత చిత్తముతో రామభజన జేయుచుండెను. ఆతని చిత్తమున నాశాపాశములులేక సువర్ణమును మట్టిని, రత్నములను రాళ్ళను, బ్రహ్మామును బిపీలకమును, మేరువును నీగను, బృహస్పతిని మూర్ఖుని, సమానముగా జూచుచు, జాగ్రత్స్వప్నసుషుప్తులయందు సహితమఖండముగా శ్రీరామ భజన జేయుచుండెను.

కాశీక్షేత్రమునందు పరమభావుకుడును నత్యుదారుడును. నగు నొక శ్రీమంతు డుండెను. ఆతని కైదుగురు పుత్రులును, సర్వైశ్వర్యములును ప్రజలలో మానమర్యాదలును, గలిగి కుష్ఠురోగముతో బాధపడు చుండెను. ఆతనికి పూర్వకర్మ వశమున సర్వాంగములందును క్రిములు వ్యాపించెను. గృహమున సంపదయు, శరీరమున నారోగ్యమును, నుత్తములగు దారపుత్రులును, సర్వభూతములయందు దయగలిగియుండు వాడును, సర్వశాస్త్రనిపుణుడును, నిరభిమానముగల నుత్తమ పురుషుడును, దోషగుణ మెంచని వాడును, రాజును సేవకుని సమానముగా జూచువాడును, పరస్త్రీని దల్లివలె జూచువాడును, నఖండముగా బరోప

కారము జేయువాడును, సర్వకాలములందు హరిభజన జేయువాడును దుష్కాలముల ందన్నదానము జేయువాడును, భువిలో దుర్లభులై యుందురు. శ్రీమంతుని శరీరమున దుర్గంధము వ్యాపించెను. ఎవరును నాతనియొద్దకు బోరైరి. లాలించి పెంచిన వారుగూడ నాతని త్యజించిరి. ఆత డెన్నడును భగవన్నామస్మరణ జేసి యెరుగడు.

శ్రీమంతునిజూచి వైద్యు లిది భయంకరవ్యాధియని బలుకుచు నానావిధౌషముల నిచ్చుచుండిరి. భగవంతుని కృపలేనందున నాతనికి వ్యాధి దినదినప్రవర్ధమానముగ వృద్ధినెందెను. జ్యోతిష్కు లిది గ్రహ దోషము. నవగ్రహములకు జపహోమములు జేసి దానమిచ్చిన నారోగ్యమగునని చెప్పుచుండిరి. ఒక బ్రాహ్మణు డాసమయమున వచ్చి దేవీపూజ జేసినచో వ్యాధినివృత్తియగునని చెప్పెను. కొందరు సప్తశత మంత్రములను జపము జేయించిన వ్యాధి నివృత్తియగునని చెప్పుచుండిరి. మరికొందరు సూర్యనారాయణున కర్ఘ్యదానమిచ్చినచో వ్యాధి నివృత్తి యగు ననిరి కొందరు గాయత్రీమంత్ర పునశ్చరణయు, మరికొందరు మహారుద్రాభిషేకమును, మరికొందరు సంకటచతుర్థీవ్రతమును, మఱి కొందరు పంచాక్షరీ మంత్రజపమును, కొందరు కాలభైరవపూజయు, మరికొందరు గజదానమును, మరికొందరు ద్రవ్యతులాభారమును జేసి నచో వ్యాధి నివృత్తియగునని చెప్పుచుండిరి. ఈ ప్రకారముగా నెవరేది చెప్పినను నాతనికుమారులు ద్రవ్యము నపారముగా వెచ్చించి యాయా పనుల జేసినను నాతని వ్యాధి నివృత్తికాక నానాటికి దుర్గంధమధికమై శరీర మంతయు గ్రిములు వ్యాపించి బాధ భరించలేక మిగుల జింతా క్రాంతుడై భార్యను బిడ్డలను బంధువులను బిలచి "నే నీబాధను భరింప లేను. నన్ను గంగానదిలో బారవేయుడు. మీరు నాయందు ప్రేమతో నెన్నివిధముల ద్రవ్యమును వెచ్చించి శ్రమపడుచున్నను నాకర్మ విపరీత ముగ నుండుటచే వ్యాధి తగ్గుటలేదు. ఇక నేనారోగ్యవంతుడ నగుట యసంభవము. దేహాంతప్రాయశ్చిత్తము వలన నేను సుఖించుటయే గాక మీరును సుఖింతు" రని చెప్పెను. ఆ సాహుకారు చెప్పిన విషయములు

విని యాతని భార్యబిడ్డ లెల్లరును దుఃఖించి గత్యంతరములేక యాతనిని గంగానదీతీరమునకు దీసికొని పోయిరి.

కాశీక్షేత్రమునందీ కౌతుకమును జూచుటకై యసంఖ్యాకులగు స్త్రీ పురుషు లెల్లరును గంగానదీతీరమును జేరిరి. కొంద రాత్మహత్య కూడదు. మహాపాపమని చెప్పుచుండిరి. మరికొందరు వ్యాధిబాధ భరించలేక నాతడు కోరినను నిర్బంధముగ గంగలో బడవేయుటకు దారపుత్రాదులు సంసిద్ధులగుట మహాదోషమని చెప్పుచుండిరి. జనులీ ప్రకారముగా నానావిధముల జెప్పుకొనుచుండ నాతని బంధువులు నాలుగు కుంభములను దెచ్చి యా షాహుకారుకాళ్ళకును, జేతులకును గట్టిరి. ఆసమయమున పద్మనాభుడను బ్రాహ్మణోత్తముడు రామకృష్ణ గోవిందయని భగవన్నామము నుచ్చరించుచు స్నానమునకై యచటజేరెను. ఆతడు భక్తకబీరు శిష్యుడు. అసంఖ్యాకులగు స్త్రీ పురుషులు గుంపులు గుంపులుగ నుండుటను జూచి పద్మనాభభక్తు డేమి యాశ్చర్యమో జూడవలెనని యాగుంపునుండి త్రోసికొనిపోయి షాహుకారునుజూచి "అయ్యా! మీరాత్మహత్య జేసికొనుట తగదు. ఎనుబదినాలుగు లక్షల జీవరాసులందు బుట్టుచుండ నయాచితముగ నమూల్యమగు మానవదేహము లభించినది. ఇప్పుడు వ్యర్థముగా నాత్మహత్య జేసికొనిన కల్పాంతమునకైనను సద్గతి లభించదు. ఈ కర్మభూమియందు జన్మించిన మనుష్యులఖండముగ భగవన్నామస్మరణ జేసిన జనన మరణప్రవాహమునుండి త్రోలగెదరని చెప్పెను, అంత నా శ్రీమంతుడు పద్మనాభునిజూచి "నా కర్మబలవత్తరముగ నున్నది. నేనెన్నియో యౌషధములను సేవించితిని. ప్రజలుచెప్పిన నానావిధ సాధనములును, దానధర్మములు జేసితిని గాని యారోగ్యము గలుగు నుపాయము గనబడుటలేదు. శరీరము దుర్గంధమయమై సర్వాంగములందును క్రిములు వ్యాపించి యిరుగు పొరుగిండ్ల వరకు దుర్గంధము వ్యాపించియుండ బహు ప్రేమతో నా దారపుత్రాదులు సహించి యెన్నివిధముల వ్యయప్రయాసల బొందుచున్నను నా

వ్యాధి నివృత్తియగు మార్గము గనబడనందున నేనును వారును సుఖించుటకై యీ యాలోచన జేసితి"నని చెప్పెను.

పద్మనాభుడు శ్రీమంతుని వాక్యములువిని "అయ్యా! మీరన్ని సాధనల జేసితిరిగాని యొక సాధనమాత్రము విడచితిరి. మూడు సార్లంతఃకరణ పూర్వకముగ 'రామ రామ' యని స్మరించినచో వ్యాధి సంపూర్ణముగా దొలగును. వేదశాస్త్ర పురాణ శ్రవణములను, జప తపోనుష్ఠానములను జేసినను భగవన్నామమును వాగ్రూపమున భజించనిచో నవి యన్నియును వ్యర్థమగును. నానావిధ దేవతల నుపాసించినను, యజ్ఞ యాగాదుల జేసినను భగవన్నామము భజింపనిచో వ్యర్థమగును. శ్రమతో దీర్థములకు బోయినను, బుష్కలముగ ధనము వెచ్చించినను, సర్వ వ్రతములను, నానావిధములగు ధర్మకార్యములను, జేసినను, భగవన్నామము భజించనిచో వ్యర్థము లగును. ప్రాణాయామ వజ్రాసనములును, గోభూరత్నాన్న దానములు జేసినను భగవన్నామము భజింపనిచో వ్యర్థము లగును. కర్మకాండయందు సహితము ప్రథమమున కేశవ నామము లుచ్చరింపబడి యంత్యమున విష్ణు స్మరణము జేయనిది కర్మ సంపూర్ణము కాజాలదు. మీరు రామనామము నుచ్చరించి చూడుడు. తత్క్షణమే మీ వ్యాధి తొలగు'నని కబీరు శిష్యుడగు పద్మనాభుడు చెప్పెను. జను లసంఖ్యాకములుగ జేరి పద్మనాభుడు జెప్పిన విషయములను విని యాశ్చర్యపడుచుండ నెల్లరును భావపూర్వకముగ రామ నామము నుచ్చరింపుడని పద్మనాభుడు కోరెను.

కుష్ఠవ్యాధిగ్రస్తుడగు నా శ్రీమంతుడును, నచట జేరిన సర్వజనులును రామనామమును భావపూర్వకముగ కరతాళములను వేయుచు భజించుచుండిరి. నాదబ్రహ్మముగ జరిగిన రామనామ స్మరణ వినినంతనే యా శ్రీమంతుని శరీరమున వ్యాధి తత్క్షణమే పటాపంచ లయ్యెను. ఈ కౌతుకమునుజూచి యసంఖ్యాకులగు స్త్రీ పురుషు లెల్లరును జయ జయ ధ్వనుల జేయుచు పద్మనాభుని మహిమ విశేషములను బరిపరివిధముల గొనియాడుచుండిరి. కౌతుకమును జూడవచ్చిన జనులును భావ

పూర్వకముగ రామనామమును భజించుటచే దుఃఖములు తొలగెను. కొందరు శీతలజ్వరముతో బాధపడు చుండిరి. మఱికొందరు క్షయ వ్యాధితో బీడింప బడుచుండిరి, కొందరికి కర్ణ వ్యాధి, కొందరి కుబ్బసము, కొందరి కజీర్ణ వ్యాధి, మరికొందరికి కడుపునొప్పి, కొందరికి చర్మవ్యాధి, కొందరికి పక్షవాతము, మరికొందరికి తలపోటు, కొందరికి నడుమునొప్పి, కొందరికి చెముడు, మరికొందరికి నేత్రబాధ, మరికొందరికి భూతప్రయోగములు, కొందరికి జాతబడివ్యాధి నీ ప్రకారముగ నష్టోత్తర శతవ్యాధుల చే దారుణముగ బీడింపబడుచున్న వ్యాధిగ్రస్థులు కౌతుకమును జూడ బోయి రామనామము నంతఃకరణ పూర్వకముగ భజించి యారోగ్య వంతులైరి.

శ్రీమంతు డారోగ్యవంతుడై లేచి నిలువబడి పద్మనాభునికి వందనములు జేసి "మీరు ధన్యులు, వైష్ణవులు, విశ్వోద్ధారణకై జన్మించి నన్ను పునర్జీవితునిగా జేసితిరని పరిపరి విధముల గొనియాడుచుండెను. కాశీ క్షేత్రమునగల సర్వజనులును పద్మనాభుని చరణములకు నమస్కారము జేసియాతని యుపదేశానుసారము నహర్నిశము రామభజనచేయు చుండిరి. పరస్పరముగా నీవర్తమానము కబీరుదాసునకు దెలిసెను. పిదప కబీరు పద్మనాభుని బిలిపించి నీకు రామనామము యొక్క మహిమ తెలియదు. వ్యర్థముగా స్వల్పకార్యమునకై మూడు పర్యాయములు రామనామమును స్మరణ జేయించితివి. రామనామ మహిమ చెప్పెదను వినుము. మహాపాపియగు 'వాల్హా' యను కిరాతకుడు నారదోపదేశమువలన రామ నామమును జపించి వాల్మీకి ఋషియై భూలోకమున రాము డవతరించక మున్నే భవిష్య ద్రామాయణమును సిద్ధము చేసెను. అవి శతకోటి శ్లోకములుగ నున్నవి. పార్వతీ రమణుడా రామాయణమును స్వర్గ మర్త్య పాతాళ లోకవాసుల కోరికపై విభాగములుచేసి స్వర్గలోకమునకు ముప్పదిమూడు కోట్ల రామాయణ శ్లోకములను, మర్త్య లోకమునకు ముప్పది మూడుకోట్ల రామాయణ శ్లోకములను, పాతాళ లోకమునకు ముప్పదిమూడుకోట్ల రామా




పద్మనాభుడు కబీరును దర్శించుట

యణ శ్లోకములను, విభజించి యీయగా నొక కోటిశ్లోకములు మిగిలెను. తిరిగి ముప్పది మూడు లక్షలుచొప్పున త్రిలోకములకు బంచియివ్వగా నొక లక్షశ్లోకములు మిగిలెను. మిగిలిన లక్ష శ్లోకములను ముప్పది మూడు వేలచొప్పున బంచియివ్వగా వెయ్యిశ్లోకములు మిగిలెను. తిరిగి యొక్కొక్క లోకమునకు మున్నూటముప్పది మూడు శ్లోకములు వంతున బంచి యివ్వగా నొక్కశ్లోకము మిగిలెను. ఆ శ్లోకాక్షరములను ముప్పదిరెండక్షరములవంతున బంచియివ్వగా రెండక్షరములు మిగిలెను. ఆ రెండక్షరములను శంకరుడు స్వీకరించెను. భగవంతుడు కూర్మావతారము ధరించి సముద్రమథనము జేసినప్పు డతిదారుణమగు విషము బయలుదేరెను. శంకరు డావిషమును భక్షింపగా నాతనికి విపరీతమగు తాపము బయలుదేరెను. శిరమున గంగను, చంద్రుని, ధరించినను దాపము చల్లారనందున సర్వాంగములకు భస్మలేపన జేసికొని నానావిధ సాధనలచే దాపము శాంతించనందున శంకరుడు శతకోటి రామాయణశ్లోకములను త్రిలోకములకు బంచగా మిగిలిన రెండక్షరములు స్మరణకు దెచ్చుకొని 'రామ' యని జపింపగా నాతని తాపము తొలగెను. పద్మనాభా! నీవు వ్యర్థముగా స్వల్పవిషయమునకు మూడు నామములు ఖర్చుబెట్టుట నా కసంతృప్తిని గలిగించిన" దని కబీరుదాసు చెప్పగా పద్మనాభుడు సాష్టాంగనమస్కారము జేసి "ఓ సద్గురుమూర్తీ! వర్తకుని వ్యాధి తొలగుట కొకపర్యాయమును, కౌతుకమును జూచుటకు వచ్చిన యపారజనులకు గల వ్యాధులు తొలగుట కొక పర్యాయమును, సర్వులకనాదిగ వచ్చుచున్న భవవ్యాధి దొలగుట కొక పర్యాయమును రామనామము మువ్మారు ఖర్చుబెట్టితి" నని చెప్పగా కబీరుదాసానందభరితుడై పద్మనాభుని పరిపరివిధముల గొనియాడెను.

ముప్పదియవ యధ్యాయము సమాప్తము.

విషహరాయ నమః

# కబీరు తన భార్యను వర్తకున కర్పించుట

—♦ ముప్పదియొకటవ అధ్యాయము ♦—

కబీరు గృహస్థాశ్రమమున కాంతాపుత్రులతో గలిసి విరక్తుడై సూర్యుడు ఘటమున బ్రతిబింబించినను నలిప్తుడై యుండునట్లును, దామరాకు జలమునంటక యుండునట్లును, విలాసవంతుడు ముఖము నద్దములో జూచుకొనగా నద్దమునకే విలాసముండనట్లును, కబీరు ప్రపంచ వ్యవహారములందు దగుల్కొనక సాత్వికుడై యహర్నిశములు రామ భజనతో గాలము గడపుచుండెను. ఒకనాడూర్ధ్వత్రిపుండ్ర తులసీ మాలాధారులగు పదివేల సాధుజనులు భజనసమాజముతో నానంద వనము జేరిరి. భాగీరథితో స్నానము జేసి శ్రీ విశ్వనాథస్వామిని సేవించి యా క్షేత్రమున శ్రీరామభక్తులును, సాధులను నతిథులను నన్నపానీ యాదులచే దృప్తిపరచువా రెవ్వరని విచారింపగా దుర్జనులు సాధువు లతో "అయ్యలారా! ఈ క్షేత్రమున కబీరను ధనవంతుడున్నాడు. ఆత డే సమయములో నెందరు సాధువులు వచ్చినను వారలకు భోజనము గల్పించుచుండు" నని చెప్పి కబీరుగృహమును జూపిరి. గృహమునందు ధనధాన్యములుండగా క్షుద్బాధాపీడితునకు భోజనమిడక నన్యగృహ మును జూపువాడు దరిద్రుడు. మేడలు మిద్దెలు గట్టుకొనియుండి మార్గ స్థునికి క్షణకాలము పంచలో స్థలమునైన నిరాకరించినవాని గృహమును గృహమనరాదు. అది శ్మశానముతో సమానము. కవియైయుండి భగ వద్గుణములు వర్ణింపనిచో నాతని కవిత్వము పాషండ మతమునకు జెందిన దై యుండును. శరీరమందు పటుత్వముండి యన్యుల కుపకారము జేయ నివాడు గ్రామసూకరముతో సమానము. ఈ ప్రకారముగా కటిలు రగు ధనికులు తాముసాధువులను సత్కరింపక కబీరు గృహమునుజూపిరి.

సాధువులెల్లరును కబీరు గృహముజేరి 'సీతారామ్' అని కేక వేసిరి. కబీరుదాసా శబ్దమునువిని ద్వారము వెలుపలికివచ్చి చూచి హర్షచిత్తుడై సాష్టాంగ నమస్కారము జేసెను. సాధువులు కబీరును జూచి హర్షచిత్తులై అయ్యా మేము తీర్థవాసులము. మా మండలిలో

బదివేల జనులున్నారు. ఈ క్షేత్రమున జనులెల్లరు మీరన్నపానీ యాదులిచ్చి తృప్తిపరతురని పలుకుటచే వచ్చితి”మని చెప్పగా సాధువుల మనోగతమును దెలిసికొని కబీరవశ్యమని చెప్పి తాను బజారునకు బోయి తులసీదాసను ధనికుని గృహముజేరి కబీరాతనికి సద్భావముతో నమస్కారముజేసి తీర్థవాసులగు సాధుజనులువచ్చి యున్నారు. వారి సమాజమున పదివేల జనులున్నారు. కాన దయచేసి భోజన సామగ్రుల నిచ్చి యన్నదాన ఫలితమును బొందుమని చెప్పగా నున్మత్తుడగు నావర్తకుడు “కబీరూ! నీభార్యనొకరాత్రి భోగించుటకు నాకిచ్చినవో సామగ్రుల నిచ్చెద”నని చెప్పెను.

తత్క్షణమే కబీరవశ్యముగా దన భార్యనిచ్చెదనని వర్తకునకు వాగ్దానము జేసెను. కామాతురుడగు తులసీదాసు బియ్యము, పప్పులు గోధుమపిండి, చక్కెర, బెల్లము, నెయ్యి, కూరలు, మొదలగు సామగ్రుల నిచ్చెను. కబీరా సామగ్రులను సాధువుల కర్పించగా వారు హర్షచిత్తులై సామగ్రులను స్వీకరించి వంటజేసికొని భుజించి కబీరునొద్ద యాజ్ఞ దీసికొని వెడలిపోయిరి. ఆరాత్రి కబీరు భార్య నేకాంతముగ బిలచి “నిన్నొక రాత్రికి విక్రయించితిని. బజారులో నత్యుదారుడగు తులసీదాసను వర్తకుడు పదివేల సాధుజనులకు భోజన సామగ్రుల నిచ్చెను. నీవాతని కోరిక సంకోచింపక బూర్తి చేయు”మని చెప్పగా నా పతివ్రత “అవశ్యముగ నమయాజ్ఞను బాలింతు”నని చెప్పెను.

కబీరు తనభార్య చేయిబుచ్చుకొని వర్తకుని గృహము జేరువరకు, తులసీదాసు కామాతురుడై కబీరు భార్యకొరకెదురు చూచుచుండెను. చందన పుష్పహారములును, దివ్య వస్త్రాలంకారములను శ్రీమంతుడు మంచము నొద్దనుంచెను. కబీరు తనభార్యను తులసీదాసు నెదుటవిడిచి యీ రాత్రి యంతయు నిచటనే యుండుమని చెప్పి భార్యను వర్తకున కప్పగించి తాను గృహమున కేగెను. కామాతురుడగు నావర్తకుడు కబీరు భార్యనుజూచి యమితానంద భరితుడయ్యెను. కబీరుకాంత తులసీదాసునుజూచి “మీ యుపకారమును వర్ణించుటకు సాధ్యము




శ్రీరాముడు కొత్వాలు రూపమున తులసీదాసు సెట్టిని బెదిరించుట.

కాదు. పదివేల సాధుజనులకు భోజనమిడి దత్ఫలమును బొందితిరి. మీకు గల కామేచ్ఛను బూర్తిచేయుమని నా భర్త యాజ్ఞనిచ్చెను. కాన మీ మనోభీష్టమును దీర్చుకొనుడ"ని చెప్పి శ్రీరామనామమును జపించుచుండెను.

తులసీదాసు హర్షచిత్తుడై నేడు ధన్యదినమని చెప్పి యామె నాలింగనము జేసికొనబోయెను. దీపముయొక్క తేజమునుజూచి శలభములు మీదపడునట్లు మహాపాపియగు నా వర్తకు డతిశయ కామముతో నాలింగనము జేసికొనుట కుద్యుక్తు డయ్యెను. తత్క్షణమే శ్రీరామచంద్రుడు కొత్వాలు వేషము ధరించి యచటజేరి ధనుర్బాణములను దీసికొని తులసీదాసు గృహములో బ్రవేశించి క్రోధముతో నారక్త నయన యుగళుడై "ఓరీ! దుర్జనా! నాబాణముతో నిన్నిప్పుడే సంహరింతునని చెప్పగా వర్తకుడు గజగజ వణకుచు "నావలన గొప్ప యపరాధము జరిగినది, నీవు కోరినంత ధనమిచ్చెదను. నన్ను జంపవలదని" దీనుడై ప్రార్థించెను. దక్షిణ వాయువువలన మేఘములు తొలగి పోవునట్లును, దస్కరుని యపహృత వస్తువులతో బట్టుకొనినచో లజ్జితు డగునట్లును, తులసీదాసు తత్కాలమందయోధ్యాధీశుని జూడగనే కామ భ్రాంతి విరహితుడై కబీరు కాంత పాదములపైబడి "నీవు నా జననివి. నా యపరాధమును క్షమించు"మని ప్రార్థించెను. అంత కొత్వాల్ రూపియగు శ్రీరాము డీమె నాసోదరియనిపలుకగా వర్తకు డపరాధము క్షమింపుమని కొత్వాల్ పాదములపై బడెను. కొత్వాల్ రూపియగు భగవంతుడు ధనమదముతో నిట్టి యకార్యములను జేయదలచినచో నిన్ను శిక్షింతునని భయపెట్టెను. కోదండపాణి కబీరుకాంతను వెంట బెట్టుకొని యామెను గృహములోనికి బంపి తానంతర్థానుడయ్యెను.

కబీరు భార్యనుజూచి "నీవింత త్వరితముగ వచ్చితివేల? వర్తకుని కిచ్చినమాట యసత్యమగుచున్నది కదా!" అని పలుక నాపతివ్రత "కొత్వాలువచ్చి కోపముతో దులసీదాసుని శిక్షించెదనని చెప్పి నన్నిచటికి దీసికొనివచ్చి విడచి యిప్పుడే వెడలిపోయె"నని చెప్పగా కబీరు

క్రోధముతో గొత్వాలు గృహమున కేగి యాతనిని బిలచెను. తత్క్షణమే కొత్వాలు గృహమునుండి వెలుపలికివచ్చి కబీరునకు నమస్కారము చేసెను. కబీరు క్రోధముతో "పదివేలమంది సాధువులకు భోజన సామగ్రులిచ్చిన మహోపకారియగు వర్తకునికి నేనొకరాత్రి నాభార్య నర్పించితిని. భూదానమున కధికారి రాజును, కన్యాదానమున కధికారి తండ్రియునై యున్నట్లు నాభార్యయందు సర్వాధికారములు గల నేను వర్తకున కర్పించియుండ దుస్స్వభావముగల నీవేల బోయితివి? నీకిందేమి సంబంధ మున్న"దని యడుగగా గొత్వాలు భయముతో గజగజ వణకుచు "నాకేమియును దెలియదు. నేను తమభార్యను జూడలేదు తులసీదాసు గృహమునకు బోలేదు. నేనీ విషయమున నసత్యము బలికినచో రౌరవ నరకమును గల్పాంతమువరకును భోగింతును గాక!" అని ప్రమాణ వచనములు పలుక కబీరు విస్మయ మనస్కుడై జానకీరమణుడు కొత్వాల్ రూపము ధరించెనని నిశ్చయించి యచటనుండి తులసీదాసు గృహమునకు బోయి యాతనినిజూచి "నీవు మహా ధన్యుడవు. కొత్వాల్ రూపమున భగవంతు డనాయాసముగా నీకు దర్శనమిచ్చెను. నీతో సమమగు భాగ్యవంతు లెవరిని జూచి యుండలేదని బలికెను

అంత తులసీదాసు కబీరు చరణములపైబడి నేను మోహాక్రాంత నజ్ఞానముతో స్పృశింపబోగా శ్రీరాముని దర్శనము సంప్రాప్తించె" నని చెప్పి కబీరునకు మరల సాష్టాంగ నమస్కారము జేసెను. "పాషాణమును బట్టుకొని సముద్రములోబడి యీదుకొని పోయినట్లును, విషమును భక్షించి మరణించనట్లును, నేను పాపకార్యమున కుద్యుక్తుడనై శ్రీరామ దర్శనమును బొందితి"నని వర్తకుడు పశ్చాత్తాపముతో శ్రీరామభజన చేయుచుండెను. కబీరు గృహమునకు బోయి జరిగిన వృత్తాంతమంతయు భార్యకు దెలిపి దారపుత్రులతో నఖండముగా రామభజన చేయుచుండెను.

ముప్పదియొకటవ అధ్యాయము సమాప్తము.

ప్రణతార్తి హరాయ నమః

# రోహిదాస చరిత్ర

## —♦ ముప్పదిరెండవ అధ్యాయము ♦—

శ్రోతలారా! సావధానచిత్తులై వినుడు. పరమ వైష్ణవుడగు రోహిదాసు ప్రేమభావముతో దివారాత్రములు హరిభజన జేయుచుండెను. అతడు దురాశను త్యజించి నిత్య నియమముతో స్నానముజేసి విష్ణుపూజ జేయుచుండెను. సంసారమందుండి శక్త్యనుసారము పరోపకారముజేయు టుచితమని తలచి తాను కులవృత్తిననుసరించి తయారు చేయుచున్న చెప్పులజోళ్ళను వైష్ణవులకు శక్తనుసారముగ దానము జేయుచుండెను. "ఎంతో నీచజాతులయందు జన్మించినను తమతమ కుల వృత్తుల జేసికొనుచు పరోపకారము జేయుచుండినచో జగన్నివాసుని కృపకు పాత్రులగుదురు. పరోపకారులైయుండు భక్తులు భగవంతుని కత్యంతప్రియులు. వారి గృహమున భగవంతుడు దివారాత్రములు వసించి సర్వవిధముల గాపాడుచుండును. జనుల కుపదేశవాక్యముల జెప్పుచు వారలచే సేవజేయించుకొనుచు కించి దుదకమైనను నితరుల కీయనివా రజ్ఞాను" లని రోహిదాసు భావించి సంసారమును మిథ్య యని తలచి భావపూర్వకముగ వైష్ణవులను సేవించుచుండెను. ఆతడు ప్రతి దినమును ప్రాతఃకాలమున నిద్రనుండి లేచి దేహబాధలను దీర్చుకొని ప్రథమమున భోజనముజేసి పిదప స్నానముజేసి విష్ణుపూజ జేయుచుండెను. ఈవిషయము శ్రోతలకు విపరీతముగ దోచును. అభోజనముగ బూజలో గూర్చుండినచో మనస్సు స్థిమితముగ నుండదు. కలియుగ మన్నగత ప్రాణమని సర్వజ్ఞులు పలుకుదురు. పూజ సమాప్తమగువరకు క్షుద్బాధవలన మనస్సంతయు నన్నముపై నుండునని రోహిదాసు తెలిసి కొని ప్రథమమున భుజించుచుండెను. రోహిదాసు ప్రథమున ప్రాణాహుతి నిచ్చి పిదప స్నానముజేసి యేకాంతమున దేవపూజ జేయుచుండెను.

ఒకనాడు రోహిదాసు దేవపూజకు గూర్చుండి యేకాంతమున బూజ జేయుచుండగా మనస్సు చంచలమగుచుండెను. చర్మపుపాత్ర

తోను, చర్మాసనముతోను, చర్మోపకరణములతోను, రోహిదాసు పూజ జేయుచుండగా బంచాంగము జెప్పుటకై బ్రాహ్మణుడు వచ్చి పవిత్రమగు తులసిబృందావనముప్రక్క నిలుచుండెను. ఆతడు రోహిదాసును జూచి "నీవు చేయు దేవపూజ విపరీతముగ నున్నది. విష్ణువును మేము సాలగ్రామముతో బూజజేయుచున్నాము వైకుంఠవాసుడును, జగజ్జీవనుడును, యోగీశ్వరులచే నారాధింపబడువాడును నగు భగవంతుని జర్మప్రతిమగా నెట్లారాధించుచుంటివి? క్షీరసాగరవాసుడును, శేషశయనుడును, శాస్త్రములు శోధించినను లభించనివాడును నగు భగవంతుని జర్మప్రతిమగా బూజించుచుంటివి తీర్థ వ్రత తపోయాగములు జేసినను లభింపని వైకుంఠవాసుని జర్మప్రతిమగా జేసితి" వని చెప్పగా రోహిదాసు "ఓ ద్విజోత్తమా! చర్మము లేని పదార్థమును మీరు చూచితిరా? డోలు మృదంగము మొదలగు వాద్యపరికరములు హరికీర్తన కుపయోగపడుచున్నవి అవి చర్మముతో జేయబడినవే కదా! చర్మ రూపమైయున్న కపిలగోవు క్షీర మతి శ్రేష్ఠమైనది. అది భగవంతునికి పంచామృతాభిషేకమున కుపయోగించుచున్నారు. అండజములు ఉద్భిజములు జరాయుజములు చర్మమయములై యున్నవి. ఆత్మారాముడు సర్వభూతములందును సమముగ వ్యాపించియున్నాడు. శూద్ర వైశ్య క్షత్రియ బ్రాహ్మణాదుల దేహములు చర్మమయములై యున్నవి. చర్మముచే జేయబడిన నగారాను చర్మహస్తముతో వాయింతురు. అందుండి బయలుదేరిన మధురధ్వనిని చర్మ కర్ణమే శ్రవణము చేయుచున్నది! చర్మహస్తముతో నన్నపానాదులు చేయుదురు. చర్మమందిరమందాత్మారాముడుండి మధురధ్వని జేయుచుండునని చెప్పెను.

రోహిదాసు వచనములువిని విప్రు డుగ్రుడై "ఓరీ! నీవు బ్రహ్మజ్ఞానమును బలుకుచుంటివి. శరీరమందు ప్రాణముండగా నపవిత్రముండ" దని చెప్పెను అంత రోహిదాసు "జగజ్జీవనుడు విశ్వవ్యాపకుడు. ఆతడు సర్వమందును వ్యాపించియుండగా నమంగళ మెచటనుండివచ్చును. స్త్రీ పురుషుల శుక్ల శోణితములచే మీ శరీర మేర్పడినదికదా! మీరు



రోహిదాసువద్దకు సాధువులు వచ్చుట.

జన్మించినప్పుడును, మరణించినప్పుడును, నశుచియని చెప్పెదరు. అందు మీదృష్టి కేది యుత్తమముగ గన్పట్టుచున్నది పరమమంగళమైనచో నందుత్తముడును, నాత్మారాముడును, నిష్కళంకుడును నగు ఘన శ్యాముడు సర్వఘటములందును సమానముగ వ్యాపించియున్నా" డని చెప్పెను. అంత ద్విజోత్తముడు "మాదిగవాండ్లిట్లు పూజించుట దోష" మని చెప్పగా రోహిదాసు "సాలగ్రామమును బూజించు విధమెట్లు? తెలుపు" మనెను. పిదప నా విప్రుడు రోహిదాసుతో "ఓరీ శతమూర్ఖా దేవతలలో హృషీకేశుడు శ్రేష్ఠుడగునట్లు, మేము చాతుర్వర్ణ్యములో శ్రేష్ఠులము. యజ్ఞోపవీతధారణమున కధికారులమగు మేము విష్ణుపూజ కర్హులు" మని చెప్పగా రోహిదాసు "నాకును యజ్ఞోపవీత మున్నది. మీకు జూపెదను జూడు" డని బలికి తన హృదయమును జీల్చి యజ్ఞోప వీతమును జూపెను.

అంత విప్రోత్తముడు "నీవు యదార్థముగా విష్ణుభక్తుడవు. నిన్ను వ్యర్థముగా బాధించితిని. అగ్నిలో సువర్ణమును దప్తము జేసినచో శుద్ధమై యధికమూల్యము గలిగియుండునట్లు, నిన్ను పరీక్ష చేయుటచే నీ మహిమ దెలిసికొనగలిగితిని. నాణెములను బ్రయోగించి పరీక్షించునట్లును, లోహమునకు స్పర్శవేది స్పర్శ దగిలినగాని యది సువర్ణము గానట్లును, నిన్ను పరీక్ష జేయుటవలన నీ మహిమ దెలిసినది. నీవు యదార్థమైన వైష్ణవుడవు భగవంతుని పూజకు నీవే యర్హుడవు. నా యపరాధ మును క్షమింపు" మని ప్రార్థించెను. విప్రోత్తముడు సాష్టాంగ నమస్కా రము జేసి తన గృహమునకు బోయెను. రోహిదాసు తన కులవృత్తి జేసికొనుచు, పరోపకారముగ వైష్ణవులకు జెప్పుల నిచ్చుచు, నతి థ్యభ్యాగతులను ప్రేమతో నారాధించుచు నఖండముగ హరినామ సంకీ ర్తన జేసి యవసానమున నీశ్వరసాయుజ్య మలంకరించెను.

ముప్పదిరెండవ అధ్యాయము సమాప్తము.

శ్రీ రాధాపతయే నమః

# పిపాజీరాజచరిత్ర

## —♦ ముప్పది మూడవ అధ్యాయము ♦—

శ్రోతలారా! రసవంతమగు నీచరిత్రను సావధానముగ వినుడు. శ్రవణ మాత్రముచే సకల దోషములు హరించును.

గడే మంగళయను ప్రదేశమున బిపాజీరాజను పవిత్రుడగు భావుకుడుండెను ఆతనియింట ధర్మములన్నియు మూర్తీభవించి యుండెను. తన యింటికి విచ్చేయు సాధుజనుల కెదురుగాబోయి గౌరవ పూర్వకముగ దీసికొనివచ్చి తన మందిరమందుంచి యిచ్ఛా భోజనము లేర్పాటు జేయుచుండెను.

పిపాజీరాజు శౌర్య తేజములందలి ప్రబలుడును, నుదారుడును మహాజ్ఞానియు, ధర్మశీలుడును, ధృతిదక్షుడును, శాక్తేయుడునై యుండెను. ఆతడు భార్యాపుత్రాదులతో ప్రాతఃకాలమున స్నానముజేసి షోడశోపచార విధుల నంబిక నర్చించి యామెకు దివ్య వస్త్రాలంకారములును, పరిమళయుక్త పుష్పములును, ధూప దీపాదులను నైవేద్య తాంబూలములను నర్పించుచుండెను. ఆతని శుద్ధభావమునకు జగదంబ వశవర్తినియై యాతడర్పించు నైవేద్యమును స్వీకరించుచుండెను.

ఒకనాడు తీర్థవాసులగు వైష్ణవజను లానగరమున ప్రవేశించిరి. ఆమండలిలో నిష్కామియు, నిరాశాపరుడును, వీతరాగియు, నవిప్రుడును నైవర్తించు బైరాగి యొకడుండెను. అనంత జన్మములందు దీర్థాటన జేసి యజ్ఞయాగాది పుణ్యకార్యము లొనర్చిన వారి గృహములకే మహాత్ములు విచ్చేయుచుందురు. నియమముగా నేకాదశీ వ్రతము జేసిన వారును, పితృసేవ జేసినవారును, వాపీ కూపారామములను నిర్మించిన వారును, గో, భూహిరణ్యాన్న దానాదుల కృష్ణార్పణముగా జేసిన వారును, బహు జన్మములలో దపస్సు జేసిన వారునగు పుణ్యాత్ముల యిండ్లకే మహాపురుషులు విచ్చేయుచుందురు. పిపాజీరాజు యొద్దకు సేవకులు వచ్చి "ఓరాజా! మన నగరమునకు మహాత్ములు విచ్చేసి"రని చెప్పగా రాజు వారలకు సన్మానము జేసి భోజన సామగ్రులను బంపెను.

పిపాజీరాజు స్నానముజేసి మడిగట్టుకొని యంబికా దేవాలయమున ప్రవేశించి యథార్థముగ బూజార్చనలజేసి నైవేద్యము సమర్పించెను. నిత్యము దర్శనమిచ్చి నైవేద్యమును భుజించుచున్న యంబికయాదినమున పిపాజీరాజునుజూచి "నీ నగరమునకు మహాత్ములు విచ్చేసిరి. ఆ మహాత్ములు భుజించనిది నేను భుజించుటకు వీలుకాదు అనంత శక్తులచే దాస్యము జేయించుకొను భగవంతునికి వారు ప్రియభక్తులు.) నీ పుణ్యావిశేషమున నీ నగరమునకు వారు విచ్చేసి'' రని చెప్పెను.. అంత రాజు చేతులు జోడించి "ఓ భద్రకాళీ! నీకంటె శ్రేష్ఠమగు దైవమెవరు? తెలుపు''మని యడుగగా భవాని రాజునుజూచి "ఓ రాజా! బ్రహ్మేంద్ర హరులకంటె నతిశ్రేష్ఠుడు క్షీరసాగర విలాసుడు. ఆతడు రవి చంద్రులకు ప్రకాశమిచ్చువాడు. పురాణ పురుషుడు సర్వులలో శ్రేష్ఠుడు. ఆతడు మత్స్యావతారము ధరించి శంఖాసురుని మర్దించెను. కూర్మ, వరాహ, నారసింహ, వామన, పరశురామ, రామావతారముల దాల్చి గోబ్రాహ్మణులకు శాంతి సుఖముల ననుగ్రహించెను. దశగ్రీవు డింద్రాది దేవతలను జెరసాలలో బంధింపగా రామావతారము ధరించి దేవతలను జెరసాలనుండి విముక్తులజేసె" నని చెప్పెను. పిపాజీరాజు "ఓ జననీ! దేవతలలో శ్రేష్ఠుడగు నా రుక్మిణీరమణుని దర్శనము నాకు గావలె నని జగదంబ పాదములపై బడి సాష్టాంగనమస్కారము జేసెను. ఆదిమాయ పిపాజీరాజు వాక్యములు విని "ఓ రాజా! భక్తులను శరణుబొంది యనన్యభావముతో వారిం భజించిన నీకు భగవంతుని దర్శనమగును. బుద్ధిసిద్ధులను, ధనమును రాజ్యమును నీవేదికోరినను నే నివ్వగలను. భగవంతుని దర్శన మిప్పించుటకుమాత్రము నాకు సాధ్యముకాదు యశస్సు, సిరి, యౌదార్యము, జ్ఞానము, సంపూర్ణవైరాగ్యము భగవంతునియొక్క షడ్గుణైశ్వర్య లక్షణములు. ఆ దేవాదిదేవుడు సనాతనుడైయుండియు భక్తులకధీనుడు. అట్టి భక్తులే నీ నగరమునకు విచ్చేసి" రని చెప్పెను.

పిపాజీరాజు తత్క్షణమే బయలుదేరి వైష్ణవులయొద్దకు బోయి వారికి సాష్టాంగనమస్కారము జేసి సర్వసామగ్రులనిచ్చి భోజనానంతరము తాంబూలముల నిచ్చి పుష్పమాలాలంకృతులుగా జేసి సద్భావముతో జేతులు జోడించి నాకు భగవంతుని దర్శనమిప్పింపుడని ప్రార్థింపగా వారు "శ్రీ రామానందస్వామిని మీరు శరణుబొందుడు. ఆతని కృపచే మీరు సార్థకజన్ము లగుదురు. క్షుద్రదేవతలను సేవించినచో నాత్మజ్ఞానము కలుగదు. కాబట్టి ఓ రాజా! సావధానుడవై భగవంతుని భజించుచుండుము. ప్రేమ లేని హరికీర్తనయు, జ్ఞానహీనుడగు గురువును, కృపణశిష్యుడును, దురాచారియగు భర్తసాంగత్యమును, నాశాబద్ధుడగు వక్తయు, సభక్తుడగు శ్రోతయు, ననుభవశూన్యని బ్రహ్మజ్ఞానమును, వైరాగ్యము లేని సన్యాసగ్రహణమును, సౌఖ్యము నీయజాలవు. కాన నో రాజా! నీవు సావధానుడవై సద్గురువు నాశ్రయింపు" మని చెప్పిరి.

పిపాజీరాజు భగవద్భక్తుల వచనములను విని పశ్చాత్తప్తచిత్తుడై ప్రధానిని బిలచి రాజ్యభార మాతనికప్పగించి నగరమునగల విప్రులను రప్పించి భాండారములోని ద్రవ్యమును వస్త్రాభరణాదులను, నశ్వములను, రథములను, గోవులను, గజములను కృష్ణార్పణముగా ధర్మము జేసి రామానందస్వామి నాశ్రయించుటకై కాశీక్షేత్రము జేరెను. పిపాజీ రాజుయొక్క భార్య మహాపతివ్రత. ఆమె మాయామమతల ద్యజించి యమూల్యములగు తన వస్త్రాభరణాదులను విప్రస్త్రీలకు ధర్మముజేసి తానును భర్తతో గలిసి సద్గురువు నాశ్రయించుటకు బయల్వెడలెను. రాజదంపతులు రామానందస్వామి మఠముజేరి భావ పూర్వకముగ సాష్టాంగనమస్కారముజేసి తను మన ధనములను గురునాథుల కర్పించి వారి ముఖమునుండి 'రామకృష్ణహరి'నామ మంత్రమును శ్రవణమనన ములుజేసి యనుభవ పూర్వకముగ నిధిధ్యాస నలవరచుకొనిరి. జ్ఞానవంతుడగు గురువును, ననుతప్తచిత్తుడగు శిష్యుడును, గూడినచో జ్ఞానము ప్రకాశించును. అట్లుగాకుండినచో మిథ్యా దాంభికములగును.

ఉత్తమమగు స్పర్శవేదిని పెంకుగ కంటించిన ప్రయోజనములేనట్లు భక్తుడును, మలినుడునునగు శిష్యుని సద్గురు డేమిచేయును. మహాత్ములు దయావంతులు. వారలకు రాజును దరిద్రుడును సమానులే, కాని యెవ రెవరే దేభావములతో బోయెదరో యాయాభావముల ననుసరించి ఫలములను బొందెదరు. రామానందస్వామి దర్శనముచే బిపాజీరాజునకు సంపూర్ణజ్ఞానముకలిగి హరికీర్తన శ్రవణమును, దివారాత్రములందు నామస్మరణయు నఖండముగ జేయుచుండెను.

ఒకనాడు పిపాజీరాజు సద్గురునాధుని ద్వారకాదియాత్రలు సేవించి వచ్చుటకై యాజ్ఞనిమ్మనికోరెను రామానందస్వామి పిపాజీరాజును కృపాదృష్టితో జూచి సత్వరమే పోయి తీర్థయాత్రల సేవింపుమని యాశీర్వదించెను. రాజదంపతులు సద్గురుచరణములకు వందనములుజేసి యచట నుండి బయలుదేరి గోమతిలో స్నానముజేసి శ్రీకృష్ణదేవుని దర్శనమునకు బోయి మహాద్వారములో సాష్టాంగనమస్కారముజేసి "జయజయ ముకుంద, మురారీ పురాణపురుషా, శ్రీహరీ, దీనులమగు మమ్ము గృపాదృష్టితో జూచి సర్వవిధముల రక్షింపుము. నీవు దేవాధిదేవుడవు సనాతనుడవు. అజ్ఞానులమగు మేము నీ మహిమ విశేషములను దెలిసికొనలేక శక్తిపూజ జేసితిమి. అమృతమును త్యజించి మద్యమును గ్రహించినట్లును, స్పర్శవేదిని త్యజించి పాషాణమును దీసికొన్నట్లును, నశ్వత్థవృక్షమును త్యజించి సిందీవృక్షమునకు నీరుపోసినట్లును, వేదాంత శాస్త్రమును విడచి లోకశాస్త్రమును వినినట్లును, కల్పవృక్షమును విడచి యీతచెట్టు నాశ్రయించినట్లును మేము నిన్నువిడచి భవానిని బూజించితిమి. నే మనంతజన్మలయం దొనర్చిన సుకృతవిశేషముచే మహాత్ములు మా నగరమునకు విచ్చేసిరి. వారల యుపదేశవాక్యముల వలన నీ మహిమవిశేషములను దెలిసికొని నన్నారాధింపగలిగితి" మని మరల సాష్టాంగనమస్కార మొనర్చిరి.

పిపాజీరాజు కరుణా వచనములను విని భగవంతుడు దేదీప్యమానమగు రత్న కిరీటమును, నమూల్య పీతాంబరములును, గళమున




శివాజీరాజు వ్యాఘ్రమునకు ధర్మోపదేశము జేయుట

వైజయంతీ వనమాలికలును, గర్ణములందు మకర కుండలములను ధరించి శ్యామల వర్ణమునఁ జతుర్భుజ యుక్తుఁడై దర్శనమిచ్చి పిపాజీరాజును కృపాదృష్టితో ననుగ్రహించెను పిపాజీరాజు చాతుర్మాస్యము ద్వారకా క్షేత్రమున వసించి ప్రతినిత్యము సభామంటపమున హరినామ సంకీర్తన జేయుచు, వైకుంఠనాథుని యాజ్ఞ దీసికొని యచటనుండి పత్నీసమేతముగా తీర్థాటనమునకై బయలుదేరెను. పిపాజీ రాజు నాతని భార్యయు గలిసి పోవుచుండఁగా మార్గమధ్యమున భయంకరమగు నరణ్యము తగిలెను. కొంతి దూరము పోయినపిదప భయంకరమగు నొక వ్యాఘ్రము గర్జించుచు వచ్చుచుండెను. రాజకాంతి యా వ్యాఘ్రమును జూచి భయముచే గజగజ వణకుచుండెను. పరమ సుకుమారియు లావణ్య ఖనియు నగు నారాణి వణకుచుండ పిపాజి రాజామెను సమాధానపరచి "భయపడకుము. నీకు శార్దూలముగ గనబడుచున్నది. కాని భగవంతుడు లేని సల మణుమాత్రమైనను లేదు. సర్వఘటములందును సూర్యబింబము గనబడువల్లను, సర్వసరసములందును నుదకముండునట్లును, విశ్వంభరుడు విశ్వమంతయు వ్యాపించి యున్నాడు. అనంత బ్రహ్మాండములందును వ్యాపించిన జగజ్జీవను డీ వ్యాఘ్రమునందు మాత్రము లేడా? ఇది యాతని రూపముకాదా? జలస్థల పాషాణాదులయందు చక్రపాణి వ్యాపించి యున్నప్పుడు వ్యాఘ్రమందు వ్యాపించి యుండడా?" అని పలికెను. రాజకాంతి తటస్థముగ జూచుచుండ నా వ్యాఘ్రము దగ్గరకు రాగా బిపాజీరాజు దానినిజూచి "నీవు క్రూరస్వభావముచు విడచి యఖండముగా భగవన్నామమును స్మరించుచుండు"మని చెప్పగా నా వ్యాఘ్రమున కజ్ఞానము తొలగి దివ్యజ్ఞానము కలిగెను. పిపాజీరాజు వ్యాఘ్ర గళమున దులసి మాలవేసి 'రామ కృష్ణ హరి' మంత్రమును జెప్పి "రామ కృష్ణ హరికి మించిన నామ మంత్రము లేదు. పశుజాతి యందు జనించిన గజేంద్రుడు సహితము నామ మంత్రమును జపించి ధన్యుడయ్యెను. వాల్మీ యను బోయవాడు రామనామమును జపించి మహర్షి యయ్యెను. అజామేళు డను బ్రాహ్మణుడు మహాపాతకి

యయ్యెను. నవసానకాలమున నారాయణ నామ ముచ్చరించి ముక్తు డయ్యెను. కామక్రోధ మదమత్సరములును, దంభమోహాహంకారము లును నీనామము జపించినచో పటాపంచ లగు"నని చెప్పెను. షివాజీ రాజు కృపాదృష్టితో నా వ్యాఘ్రమున కుప దేశ వాక్యములజెప్పి యచట నుండి తీర్థయాత్రకు బోయెను.

తత్క్షణమే యా వ్యాఘ్రమునకు పశ్చాత్తాపము గలిగి హింసా పూరితమగు మాంసాహారమును త్యజించి గలిత పత్రములను భుజించు చుండెను. సప్తదినముల పర్యంత మరణ్యమున వసించి హరినామము జపించుచు నష్టమ దినమం దావ్యాఘ్రము దేహమును త్యజించెను. వ్యాఘ్ర, వృశ్చిక, సింహ, శ్వాన, సర్ప, గజాది జంతుజాతులు తామసగుణ యుక్తములైనవి. సత్సాంగత్యముచే నాపులికి దివ్యజ్ఞానము కలిగి హరిభజన జేయుచు ప్రాణము విడచెను. సంసారమునందుండి ఎవ్వ రంత్యకాలమున భగవంతుని స్మరింతురో వారు నిస్సంశయముగ ముక్తిని బొందుదురు. హరినామస్మరణ యోగముచే నా వ్యాఘ్రము దేహత్యాగముజేసి జునియాగడ (జునాఘుడ్) నగరమున బ్రాహ్మణ కుల మున నరసీ మెహతా యను పేరుతో జన్మించెను.

ముప్పది మూడవ యధ్యాయము సమాప్తము

సంకట హరణాయ నమః

# నరసీ మెహతా చరిత

## — ♦ ముప్పది నాలుగవ అధ్యాయము ♦ —

ఓయి దీనదయాళో, రుక్మిణీపతే, నీవు త్రిభువనము లందు వ్యాపించి యున్నావు. శ్రుతిశాస్త్రములు నిన్ను వర్ణించుచున్నవి. కాని నీమహిమ విశేషమును దెలిసికొన లేక పోయినవి. పదునెనిమిది పురాణములు, షట్శాస్త్రములును, నీ మహాత్మ్యమును గ్రహించ లేకపోయెను నీ గుణచరిత్ర లపారమైనవి. ఆదిశేషుడు నీగుణములను వర్ణించ లేక నాతని నాలుకలు చీలిపోవుటచే లజ్జతో నీకు శయ్యయై సహస్ర శిరములతో నీ శిరముపై పడగను విప్ప ఛాయ నిచ్చుచుండెను. నీ మహిమ విశేషములను శారదాదేవి లిఖించుటకు పూనుకొని విఫలయై నిన్ను శరణు బొందెను. సుందరమగు నీ సుగుణములను వర్ణించలేక నెల్లరును మౌనధారులైరి నీ వనంతబ్రహ్మాండ నాయకుడవు. నీవు సర్వమందును వ్యాపించి సర్వాధికారివై యున్నావు. ఓ జగన్నాథా! నీవు భక్తాభిమానివి. నీ భక్తుల సచ్చరిత్రలయందు నాకమిత ప్రేమయున్నది. నామతిని ప్రకాశింపజేసి భక్తుల సచ్చరిత్రలను నావాక్కునుండి చెప్పింపుము.

పిపాజీ రాజుయొక్క యుపదేశమువలన వ్యాఘ్రము భగవన్నామస్మరణ జేయుచు దేహమును త్యజించి జున్యాగడ (జునాజడ) నగరమునం దొక బ్రాహ్మణునికి పుత్రుడై జన్మించెను. ఆ బాలకునకు 'నరసీ మెహతా' యని నామకరణ మొనర్చిరి. ఆతడు దినదిన ప్రవర్ధమానుడగుచుండ జననీజనకు లాతని కుపనయన మొనర్చిరి. ఆతనికి సప్తవర్ష ప్రాయమునందే జననీజనకు లిరువురును పరమపదము నలంకరించిరి. ఆతని నన్నయు, వదినయు నాతనిని బోషించుచుండిరి.

నరసీమెహతా తన సమవయస్కులగు గ్రామ బాలురతో నానా విధములగు నాటలాడుచు గాలము గడుపుచుండెను. ఒకదినమున నరసీ మెహతా గ్రామములో నానా విధములగు లాటలాడి గృహమున బ్రవేశించి "నాకు దప్పిక యగుచున్నది. జలమి"మ్మని వదిన నడుగ

నామె కోపముతో "చాల గష్టపడి వచ్చితి"వని కసరుకొని "నీవు దివా రాత్రములు యథేచ్ఛగా దిరుగుచు నాటలాడుచు వేళకువచ్చి తినిపోవు చుందువు. విద్యను బూర్తిగా నభ్యసింప వైతివి. నీకు వివాహము జేసి నచో నీభార్య నీకై యేడ్చు"నని చెప్పెను. నరసీ మెహతా తన వదిన పలికిన దుర్వచనములను విని పశ్చాత్తప్త చిత్తుడై యేడ్చుచు యచట నుండిపోయి నగరమునకు దూరమున నున్న యరణ్యమున ప్రవేశించెను. బాల్యమున మాతాపితరుల వియోగమును, తరుణావస్థలో గళత్ర వియోగమును, వృద్ధాప్యమున బుత్ర వియోగమును క్షోభనీయములు.

నరసీ మెహతా తన జననీ జనకుల వియోగమువలన వదినచే దుర్భాషలు వినవలసి వచ్చినదని చింతించుచు. నా మహారణ్యమును విలోకించి చూడ నకస్మాత్తుగా నొక శివాలయము కనబడెను. నరసీ మెహతా యా యాలయమున బ్రవేశించి శివలింగమును జూచెను. ఆ దేవాలయము నిర్మానుష్యమై, శిథిలమై యుండెను. బ్రాహ్మణకుమారుడగు నుపమన్యుడు తన తల్లి క్షీరము నీయనందున దుఃఖించుచు భగవంతుని బ్రార్థించిన ను, నుత్తానపాదుని పుత్రుడగు ధ్రువబాలుడు దుఃఖించుచు వైకుంఠు నారాధించుటకు బోయినట్లును, నరసీ మెహతా యా శివలింగము నాలింగన మొనర్చుకొని "ఓ విశ్వంభరా, పినాకపాణీ, పార్వతీరమణా! అనాథుడ నగు నన్ను రక్షించు మని ప్రార్థించుచు నన్నపానీయాదులు లేక సప్తదినముల పర్యంత మటులనేయుండి శివ లింగము నాలింగనము జేసికొని నిద్రించుచుండెను.

కైలాసనాథుడు విస్మిత మనస్కుడై "ఈ బాలుడు దృఢభావనతో నన్నారాధించుచున్నాడు, ఇతడు సర్వశరీరము నా కర్పించెను. లోకమున గంధాక్షత చందన పుష్పాదులను, నానా విధములగు దివ్య రత్నములను, ముక్తాహారములను, సువర్ణా భరణాదులను, ద్రవ్యమును జను లర్పింతురు. మరికొందరు పుష్కలముగ ధనమును వెచ్చించి నా కాలయమును నిర్మించెదరు. కొందరు గంగోదకము నర్పింతురు. మరికొం

దరు లక్షబిల్వ పూజల జేయుదురు. కాని సర్వశరీరమును నా కెవ్వరు నర్పించలేదు, శరీరలోభముచే నానావిధములైన చేయు సాధనములును, వారి జ్ఞానమును వ్యర్థమైనవి. వారెలు భగవంతుని కృపకెన్నడును పాత్రులుగారు. ఈ బాలకుడట్లుగాక దృఢభావములో నున్నా"డని శంకరు డానందించి తత్‌క్షణమే పంచముఖములును, దశభుజములును, గళమున పన్నగ భూషణములును, మస్తకమున జటాభారమును. సర్వాంగములకు విభూతి లేపనయు, త్రిశూలమును ధరించి శంకరుడు సాక్షాత్కరించి శివలింగము నాలింగనము జేసికొని నిద్రించుచున్న నరసీ మెహతానెత్తి యభయప్రధాన హస్తము నాతని శిరముపై నుంచ "ఓ నిజభక్తా! బాలకా! నేను నీకు ప్రసన్నుడనైతిని వలయు వరంబు వేడు" మన నరసీ మెహతా కైలాసపతికి నమస్కారము జేసి "నేనజ్ఞాన బాలుడను. నిన్నేమి గోరవలయునో నాకుదెలియదు. నీ ప్రాణమునకన్న నధికప్రియమైన వస్తువును నాకిమ్ము"ని పలికెను.

అజ్ఞానబాలున కుత్తమకాలము తెలియకపోయినను సర్వకాలము లందు నాభరణములను బెట్టుమని కోరుచుండునట్లు నరసీ మెహతా "ఓ విశ్వనాథా! నీకు ప్రియమగు వస్తువును నాకిమ్ము"ని చెప్పగా పినుకపాణి హాసవదనుడై "నీతో సమునగు చతురుడగు భక్తుని జూడలేదు. సకల దేవతలచే నర్చనీయుడగు శ్రీకృష్ణపరబ్రహ్మము నా ప్రాణమునకంటె నా కత్యంతప్రియుడు. ఆతనిని గావలెనన్న జూపెదను. యాచకుడు రాజును రాజ్యమిమ్మని కోరినట్లును, గృపణుని ధనమిమ్మని కోరి నట్లును, గాముకుని స్త్రీ నిమ్మని కోరినట్లును, నీవు నా ప్రాణమునకంటె నాకు ప్రియమైన వస్తువును గోరుమంటి"వనెను. "బలిచక్రవర్తి యౌదా ర్యమును బరీక్షించుటకై వామనుడు రాజ్యదానమును గోరగా నాతడాత్మనివేదనము జేసెను. పూర్ణసాత్వికుడగు హరిశ్చంద్రుని విశ్వామిత్రుడు దానముడుగ రాజ్యమును, కాంతాపుత్రుల నర్పించెను. ఉదారుడగు కైలాసపతి ప్రసన్నుడైయుండి తన ప్రాణమునకంటె యధికప్రియమగు వస్తువు నిచ్చుటకు సాధ్యముకాదు- చూపెదననుచున్నాడు. కాన

నరసీమెహతాకు శంకరుడు రాసక్రీడను జూపుట.



ఆ వస్తువును జూపుమనుటయే యుచిత” మని నరసీ మెహతా యాలో చించి “ఓ మహాదేవా! నీకు ప్రియమగు వస్తువును నాకు జూపు” మని యడుగ, త్రిపురాంతకుడు అమూల్యములగు శ్రీకృష్ణ లీలా వైభవములు నా కత్యంతప్రియములై యున్నవి. గోకులమునందు జగన్నివాసుడు శ్రీ కృష్ణ పరబ్రహ్మము గోపికలతో జేసిన రాసక్రీడ నా ప్రాణమునకంటె నా కధికప్రియమైయున్నది. రాసమండలిలో శ్రీకృష్ణభగవానుడు వైభవముగ నృత్యమాడుచుండ నేను మృదంగమును వాయించితిని. నీ కా వైభవమును జూపెద” నని చెప్పి యాతనిని గోపికగా జేసి శంకరు డాతనిని వెంటబెట్టుకొని రాసక్రీడాస్థలమునకు దీసికొనిపోయెను.

శ్రోతలారా! శ్రీకృష్ణుడు ద్వాపరయుగమున నవతరించినవాడు. నరసీ మెహతా కలియుగమున బుట్టినవాడు. శంకరు డాతనిని రాసక్రీడ కెట్లు తీసికొనిపోయెననియు, నిది కవిత్వ చాతుర్యమనియు భావింపకుడు. మధుర, గోకుల, బృందావనములందు శ్రీకృష్ణభగవానుడిప్పటికిని క్రీడించుచుండును. భావుకులకు దర్శనమగునని భవిష్యోత్తర పురాణము లందు శ్రీ వ్యాసముని వర్ణించియున్నాడు. కలియుగమున భక్తశిరోమణు లీ విషయమును దిరిగి దమతమ గ్రంథములందు వర్ణించిరి. సముద్ర జలము హద్దు నుల్లంఘించనటుల భక్తులు జరుగని విషయములను వర్ణించరు. ఆయువు పూర్తికానిది కాలుడు జీవుని దండించనటులను, ఘడియలు పూర్తికానిది సూర్యనారాయణుడు డస్తమించనటులను, పతియాజ్ఞ లేనిదే పతివ్రత యేకార్యమును జేయనటులను, భక్తులవాక్యమును భగవంతు డెన్నటికి నసత్యము జేయడు. నరసీమెహతా పార్వతీ రమణునితో గలిసి కాళిందీతటమును జేరి, శోభాయమానమైన యుపవనంబును బ్రవేశించెను.

శ్రీకృష్ణభగవానుడు శంకరుని మనోభీష్టము దీర్పదలచి రాసక్రీడ నేర్పరచెను. వైకుంఠాధిపతియగు శ్రీకృష్ణమూర్తి సుకుమారమగు దేహముతో గోపికలతో వేణుగానము జేయుచు గ్రీడించుచుండెను.

నరసీ మెహతాయును, శంకరుడును శ్రీకృష్ణునకు వందనములను జేసిరి. భగవంతుని వేణునాదమునకు గోపికలెల్లను దేహభ్రాంతిని త్యజించిరి. శ్రీకృష్ణుడు మధ్యను, గోపికలు చుట్టును నృత్యము జేయుచుండిరి. మనో మోహనుడు నానావిధములగు గీతములను మురళిగానముతో నాలాపించుచుండెను. తత్క్షణమే శంకరుడు పోయి మృదంగమును వాయించెను. అంత గోపికలు శ్రీకృష్ణుని జూచి "నీవు సర్వవ్యాపకుడవై యున్నావు. మేము కామయుక్తులమై వచ్చితిమి మేము వ్రజాంగనలము. నీవొక కృష్ణుడవు, నీ రూపమును జూచిన నిన్ను ముద్దుబెట్టుకొనవలెననియు, నాలింగనము జేసికొనవలెననియు, గోరిక కలుగుచున్న" దని చెప్పిరి. శ్రీకృష్ణుడు వారల మనోగతంబెరిగి యొక్కొక్క గోపిక కొక్కొక్క కృష్ణుడై వారివారి ప్రేమ ననుసరించి నానావిధముల క్రీడించుచుండెను నక్షత్రములలో ధ్రువనక్షత్రము వేరుగా గనబడునట్లును, సిద్ధసాధకులలో వసుదేవతనయుడు వేరుగా గనబడునట్లును, నవగ్రహములలో సూర్యుడు వేరుగా గనబడునట్లును, నరసీ మెహతా శ్రీకృష్ణునకు వేరుగా గనబడుచుండెను. అంత వ్రజభూషణుడు శంకరుని జూచి "ఈ నూతనగోపిక యెవరు? నాయందు నీకధిక ప్రేమ యున్నది. అందుచే నీకొరకై యీ రాసక్రీడ నేర్పరచితి" నని చెప్పగా చంద్రమౌళి హాసవదనుడై నరసీ మెహతాను శ్రీకృష్ణునకు వందనముల జేయుమని నేత్రములతో సంజ్ఞ జేసెను. నరసీ మెహతా శ్రీకృష్ణభగవానుని చరణములకు సాష్టాంగనమస్కారము జేసెను. శంకరుడు "ఓ శ్రీకృష్ణనాథా! ఈ నరసీ మెహతా నీదాసుడు. ఆతని పూర్వగాథ నీకు సవిస్తరముగ జెప్పెదను. పూర్వజన్మమున నీతడు మహావ్యాఘ్రమై యుండ పిపాజీరాజను భక్తు డనుగ్రహించి నామమంత్రము నుపదేశించెను. ఆ మంత్రపఠన ప్రభావముచే దురితములెల్ల నశించి జునాగడ నగరమున బ్రాహ్మణకులమందు జన్మించెను— బాల్యమందే యీతనికి మాతాపితరుల వియోగము తటస్థించెను. ఈతడు సప్తదినము లన్నపానాదుల విసర్జించి తన శరీరమును నాకర్పించుటచే నేను సంతుష్టుడనై పసన్నుడనైతిని. ఆతడు మత్ప్రాణమునకంటె నాకు ప్రియమగువస్తువు

నిమ్మని కోరెను. నాకు ప్రియుడవు నీవుకనుక నిన్ను జూపుటకై వీనిని దెచ్చితిని. కాన నీతని మస్తకముపై నీ హస్తమునుంచి వరదానము నను గ్రహింపుము" అని కోరగా కమలాపతి నరసీ మెహతా నాలింగనము జేసికొని "నీవుచూచిన యీ రాసక్రీడావర్ణనను ప్రబంధ రూపమున రచియింపుము. నాగుణచరిత్రలీలలు నీ నేత్రములలో గనబడుచుండును" అని వర మనుగ్రహించి పిదప శంకరునిజూచి "ఈతని నికదీసికొనిపొం" డని చెప్పెను.శంకరుడు శ్రీ కృష్ణునకు సాష్టాంగ నమస్కారమును జేసి యాతని యాజ్ఞను గైకొని తిరిగి యిచ్ఛామాత్రమున నరణ్యములోని యాలయములో యథాప్రకారముగ బ్రవేశించెను.

నరసీ మెహతా శివాలయమున వసించుచు దివారాత్రము లఖండ ముగా నామస్మరణజేయుచుండెను. శ్రీకృష్ణుని యాజ్ఞప్రకారముగా శ్రీ కృష్ణలీలాకథామృతమును గుజరాతీభాషలో ప్రేమతో గానము జేయుచు నృత్యసంకీర్తనలను జేయుచుండెను. నరసీ మెహతా వర్ణించిన రాసక్రీడావైభవము నాదేశమునం దెల్లరును గానము జేయుచుండిరి.

నరసీ మెహతా యింటిని విడచిపోయిన పిదప నాతని సోదరుడు పలుస్థలములం దాతనికొరకై వెదకి తుదకాత డరణ్యములోని శివాలయ మున హరినామసంకీర్తన జేయుచున్నటుల విని యానందించి యరణ్య మునకేగి శివాలయమున నున్న నరసీ మెహతాను సమాధాన పరచి గృహమునకు దీసికొనివచ్చెను. అధ్యాత్మశాస్త్రమునందు నిపుణుడగు భావుకు డొకడు నరసీ మెహతా చిహ్నములను జూచి యీత డీశ్వరకృపా పాత్రుడాయెనని యెంచి తనకుమార్తె నాతనికిచ్చి వివాహమును జేసెను. లోహమునకు స్పర్శవేది తగిలినచో నది తత్క్షణమే బంగారమగునటుల భగవంతుని కృపగలిగిన దేసికిని గొరతయుండదు. నరసీ మెహతా గృహ స్థాశ్రమమునందు దీనుని- శ్రీమంతుని సమముగ జూచుచు కాలము గడుపుచుండెను. పిదప నాతనికొక పుత్రికయును, నొక పుత్రుడునుగలిగిరి.

ముప్పదినాలుగవ అధ్యాయము సమాప్తము.

శ్రీజగద్గురవే నమః

# నరసీమెహతా కుమారునకు భగవంతుడు వివాహము జేయుట

—♦ ముప్పది యైదవ అధ్యాయము ♦—

పుండలీకవరదా, పాండురంగా, మదనమోహనా, రుక్మిణీరంగా, వ్రజనారీ రాసరంగా, శ్రీరంగా, నీచిత్తమునందు కామమేర్పడిన భక్తులు సదా నిష్కాములగుదురు. నీవు సకలజీవులకు విశ్రాముడవు, ఆత్మారాముడవు, చిత్తచాలకుడవు, చైతన్యఘనుడవు, నిర్గుణవు, గుణాతీతుడవు, శత్రువులకు సహితము సాయుజ్యమిచ్చువాడవు, సనాతనుడవు, దేవదేవుడవు. అంబరీషు డేకాదశీవ్రతమును చేయుచుండ తపోనిధియగు దుర్వాసుడతని శపింపబోగా నంబరీషుడు నిన్ను ప్రార్థించెను. తత్క్షణమే సుదర్శన చక్రమును బంపి దుర్వాసుని నానావిధముల గష్టపెట్టి యంబరీషుని గృపాదృష్టితో ననుగ్రహించితివి. భక్తులకొరకై నీవు నానావిధముల శ్రమించి వారల మహిమ విశేషములను బ్రకటించుచున్నావు.

జున్యాగడనగర సమీపమున శ్యామపుర మను గ్రామముండెను. అచ్చట త్రిపురాంతకు డను శ్రీమంతు డుండెను. ఆతని కుమార్తె యుక్తవయస్కురాలు కాగా నా శ్రీమంతుడు వరాన్వేషణకై కృష్ణభట్టను బురోహితుని బంపెను. కృష్ణభట్టు సద్బ్రాహ్మణుడును, పరమభావుకుడును, భగవద్భక్తుడునై యుండెను. కృష్ణభట్టు నరసీ మెహతా గృహము జేరి "మా యజమానులు తమ పుత్రికను, మీ పుత్రునకు కన్యాదానము జేయవలయునని సంకల్పించిరి; కాన మీ రంగీకరింపవలయు" నని చెప్పి నరసీ మెహతాను సమాధానపరచి రాశి నక్షత్రములను జూడగా ముప్పదియారు సుగుణములతో గుదిరినందున కృష్ణభట్టు లగ్ననిశ్చయము జేసికొని వెడలెను. ఆ దేశమున బురోహితుడు నిశ్చయించిన సంబంధము నందరు నంగీకరించు నాచారము కలదు. ఉభయపక్షములలో యజమాను లెవరైనను నంగీకరింపనిచో దండనార్హత యున్నది. కృష్ణభట్టు త్రిపురాంతకుని గృహము జేరి "జున్యాగడ నగరమున

బ్రాహ్మణోత్తముడును, పరమ భాగవతుడును, వైష్ణవుడును నగు నరసీ మెహతా పుత్రునకు దమ కుమార్తె నిచ్చుటకు నిశ్చయించి వచ్చితి" నని జెప్పగా బురోహితుని వచనములను విని సర్వజనులు నవ్వుచు "మీ పుత్రి ప్రారబ్ధము విపరీతముగ నున్నది. నరసీ మెహతా యుదాసీనుడు. అహర్నిశములు హరికీర్తనలతో నృత్యము జేయుచుండును. వారికి మీ కన్యక నర్పించిన దుస్థితినొందెదరు. ఆతనియింట హరికీర్తన శ్రవణమునకై యపారముగా సాధుజనులును, విరక్తులును వచ్చుచుందురు. ఆతనికి తనది, పరులది యని సమవిషమభావనలు లేవు, సర్వభూతములందు సమానముగా దయగలవాడు. క్రోధరహిత సదాచారి, సర్వభూతమిత్రుడు, భక్తుడైయుండి యన్న వస్త్రాదులు లేక దుస్థితియందున్నాడు. వారలకు మీ పుత్రిక నెట్లిచ్చెద" రని యచట నున్న జనులందరు పరిహాసము జేయుచుండిరి.

అంత కృష్ణభట్టు అయ్యా! నేను నిశ్చయము జేసికొని వచ్చితిని. మీరు హాస్యాస్పదముగా మాటాడుచున్నా" రని జెప్పెను. త్రిపురాంతకుడు "రేపటిరోజుననే సుముహూర్తముగలదు. సర్వసాహిత్యములను దీసికొని మాకు తగిన గౌరవమర్యాదలతో వరునివెంట నైదువందల మంది బంధుమిత్రులును, నేనుగులును, గుఱ్ఱములు, రథములును నానా విధములగు వాద్యములను వెంటబెట్టుకొని రేపు సూర్యోదయమున కిచ్చటికి బ్రవేశింపవలయును. ఈ విషయమును నరసీమెహతాకు దెలిపి సమయమునకు రానిచో మీతో సంబంధముజేయుట నిలిపివేయుదురని తెలుపు" డని చెప్పెను. త్రిపురాంతకుని యాంతర్యమును బురోహితుడు దెలిసికొని యాతనితో 'భీష్మకరాజు పుత్రికను కృష్ణుని కర్పింప రుక్మి హేళన జేసినట్లు, పార్వతిని శంకరునకిచ్చుటకు నిశ్చయింప హిమాలయునికాంత పరిహాసముజేసినట్లును మీరు పరిహాసము జేయుచున్నారు. మీరు కోరినవన్నియు వెంటబెట్టుకొని నరసీమెహతా సూర్యోదయ సమయమునకు వచ్చుట కభ్యంతరమేమియు నుండదని పలికి కృష్ణభట్ట చటనుండి వెడలెను. కృష్ణభట్టు పరమచతురుడును, భగవద్భక్తుడును,

నరసీమెహతా యందు మిగుల ప్రేమ గలవాడై యుండుటచే నెట్లయినను నరసీ మెహతా పుత్రునకు త్రిపురాంతకుని పుత్రిక నిచ్చి వివాహము జేయించవలయునని పట్టుదలతో నుండి గార్యము జెడకుండ సాధింపదలచి నరసీ మెహతా యొద్దకు వచ్చి నమస్కారము జేసి "అయ్యా! ఉత్తమ మగు సుముహూర్తము రేపటిరోజున నున్నదనియు మీరు గౌరవ మర్యాదలతో వేంచేయ వలయుననియు, మాయజమాను లాజ్ఞాపించి యున్నారు. కాన మీరు శ్రీ కృష్ణుని సహాయ మపేక్షింపు" డని చెప్పెను.

నరసీ మెహతా విరక్తుడగుటవలన నేవిధమగు నాశలును లేనివా డగుటచే కృష్ణభట్టు కోరిక ననుసరించి మీరు చెప్పినటులే వచ్చెదనని చెప్పెను. లగ్నమునందు చాడీలును, యుదమునందు భీతియు, గీర్త నలో గల్లంతును, బురాణమం దతి వాచాలుడును, ప్రవాసమునందు క్షుద్బాధయు, భజనలో నలసటయు, నిరుగు పొరుగున బంధువు లుండు టయు, వర్ష కాలమున దక్షిణగాలియు, గురుమంత్రమునందు వికల్పనయు, విరక్తునికి ద్రవ్యాశయు, సూక్ష్మమార్గమున ముళ్లును, జ్ఞానులను నిందిం చుటయు, నాశపోతునకు సత్పాత్రయు, కుగ్రామమున నగ్నిహోత్ర మును, బథ్యము జేయునివాని కౌషధమును, బంధువుల కప్పిచ్చుటయు, సాధకులు రాజన్నమును సేవించుటయు నెంతమాత్రమును గూడవు. కాన పురోహితుడు నరసీ మెహతాను హితవచనములతో సమాధాన పరచి వారి యాజ్ఞను గైకొని యచటనుండి స్వస్థానము జేరి త్రిపురాం తకుని జూచి "మీరు కోరినప్రకారముగా సర్వసాహిత్యములతో నరసీ మెహతా నిశ్చయముగ వచ్చు" నని జెప్ప త్రిపురాంతకుడు పరిహాసము జేయుచు "ఆతడు సర్వసాహిత్యములను వెంటబెట్టుకొని రేపటి కెట్లు వచ్చును. ఆ సంబంధమునందు నాకు విముఖత గలుగుటచే రేపే ముహూర్తమని జెప్పితి" నని చెప్పెను.

అంత బురోహితుడు "నీ వవిశ్వాసివి, వివేకశూన్యుడవు, నీ చిత్త మునం దహంకారము బూర్ణముగనున్నది. తప్పక నీవవమానము బొం

దెదవు. ద్రౌపదీదేవి నవమానపరుప దలచి సుయోధను డవమాన మొందినటుల నీవును నవమానమొందెదవ"ని చెప్పెను. మరునాడు నరసీ మెహతా సూర్యోదయాత్పూర్వమే నిద్రనుండిలేచి, దేహబాధల దీర్చుకొని, స్నానముజేసి తులసీమాలలను ధరించి ద్వాదశతిలకములను దిద్దుకొని భక్తజనులవెంటబెట్టుకొని భార్యాబిడ్డలతో గలసి తంబుర తాళ మృదంగాది వాద్యములతో హరినామసంకీర్తన జేయుచు వివాహమునకు బయలుదేరెను. "జయజయ ముకుందమురారీ, అనాధనాధా, భక్త కైవారీ, పురాణపురుషా, మధుకైటభారీ, ద్వారకావాసా, జగన్నా యకా, విధిజనకా, మధురావాసీ, రుక్మిణీకాంతా, కంసాంతకా, దేవాధి దేవా, సనాతనా, భక్తరక్షకా, మధుసూధనా, విశ్వవ్యాపకా, జగజ్జీ వనా, మనోమోహనా, గోవిందా, పురాణపురుషా, అనంతనామా, సగుణరూపా, మేఘశ్యామా. భక్తకామ, కల్పద్రుమా, మనోభిరామా యని ప్రేమతో భగవన్నామము వర్ణించుచు, నృత్యముజేయుచు, స్వానందభరితుడై నరసీ మెహతా వివాహమునకు బోవుచుండెను.

ఆ సమయమున శ్రీకృష్ణభగవానుడు ద్వారకలో సింహాసనము పై గూర్చుండియుండి రుక్మిణీదేవి నేకాంతముగా బిలచి నరసీమెహతా నాయంతరంగభక్తుడు. ఆతడు సద్భావముతో నన్నాశ్రయించి నిర్లజ్జతో నా గుణములను గానముచేయుచు బుత్రుని వివాహమున కేగుచున్నాడు. కాన మనమేగి యాకార్యమును నెరవేర్చవలయునని చెప్పి ఉద్ధవాక్రూర, నారద, తుంబురు, శుక. వాల్మీకి, ప్రహ్లాద, భీష్మ, విభీషణ, విదుర, హనుమంతులను, గోపాలురను అణిమాద్యష్టసిద్ధులను, జాంబవతీ, సత్యభామ, కాళిందీసతులను, లక్ష్మీదేవిని. వెంటబెట్టుకొని నానావిధము లగు మంగళ వాద్యములతో శ్యామపురము జేరి త్రిపురాంతకునికి వర్త మానమంపగా నాతడు విస్మయచిత్తుడాయెను. వివాహమునకై వరుని వెంట నసంఖ్యాముగ జనులువచ్చుచున్నారనియు, వారలు విడిదిజేయుట నగరము చాలదనియు గ్రామవాసులు త్రిపురాంతకునకు దెలియజేసిరి.

త్రిపురాంతకుడు మేడపైకెక్కి విలోకించగా, నానావిధములగు మంగళవాద్యములు వినవచ్చుచుండెను త్రిపురాంతకుడు గ్రామవాసులను వెంటబెట్టుకొని వాద్యములతో నెదురుగా బోయెను. సూర్యోదయము కాగానే చంద్రుని కళ హీనమగునట్లును, సముద్రమును జూచి కాలువ లజ్జపడునట్లును, గరుత్మంతునితో శలభ మెగురలేనట్లును, రత్న ప్రకాశము ముందు గాజురాయి కాంతిహీనముగ గనబడునట్లును, జ్ఞానుల యెదుట మూర్ఖుడు లజ్జనొందునట్లును, వరుని వెంట నున్న బంధువర్గమును జూచి త్రిపురాంతకుడును శ్యామపురవాసులును, లజ్జతో నుండిరి. అంత పురోహితుడు శ్రీకృష్ణభగవానుడు దన్ను రక్షించెనని పరిపరివిధముల భగవంతుని గొనియాడుచుండెను. భగవంతుని సంకల్పమాత్రమున విశ్వకర్మ వచ్చి విస్తీర్ణమగు దివ్యమంటపములను, సర్వసాహిత్యములను నిర్మించెను. రంభ, తిలోత్తమ, ఊర్వశి మొదలగు దేవాంగనలెల్లరువచ్చి నృత్యముచేయుచుండిరి. దేవతలెల్ల రీకౌతుకము నాశ్చర్యముతో జూచుచుండిరి. కేశర, కస్తూరి, సుగంధ, చందనాది సువాసన ద్రవ్యములతో శ్రీకృష్ణభగవానుడు కూర్చుండియుండెను. ఆతని చుట్టును భక్తులెల్లరును గూర్చుండియుండిరి. పుణ్యాంగనలలో జగన్మాతయగు శ్రీ రుక్మిణియును, నరసీమెహాతా భార్యయును గూర్చుండియుండిరి. భగవంతుడు తన భక్తులతో గలిసి మృదుమధురవచనములతో త్రిపురాంతకుని బరామర్శించి "ఆయుష్యహీనునకు సుధారసము లభించినచో మృత్యువు దొలగునటుల మహాభక్తుడగు నరసీ మెహాతాకును మీకును సంబంధము గుదురుటచే కామక్రోధాది యహంభావముచు, భవరోగ పీడయు, దొలగును. లోహమునకు స్పర్శవేది స్పర్శ దగిలిన యది కనకమై శ్రీమంతుల యాభరణముల కుపయోగపడునటుల నరసీ మెహాతా వలన మీ దర్శనము నాకు సంప్రాప్తించె"నని భగవంతుడు జెప్పెను. పిదప త్రిపురాంతకుడు "అయ్యా! తమ నామధేయ మేమి? తమ నెప్పుడును నేము దర్శింపలేదు. తామెచటనుండి విచ్చేసితిరి?"అని విచారింప దేవాధిదేవుడు త్రిపురాంతకునితో "నన్ను




నరసీ మెహతా కుమారుని వివాహము భగవంతుడు చేయించుట

"సావళసా" యని పిలతురు. నేను నరసీ మెహతాయొక్క సర్వకార్య ములు జేయుచుందును. నేను ద్వారకా పట్టణమునందు వసించుచు యజమానుల దుకాణములో నిచ్చి పుచ్చుకొను వ్యవహారముల జూచు గుమాస్తాను. నరసీమెహతాయొక్క యాంతరంగిక విషయము లన్నిటినీ నేనొక్కడనే యెరుగుదు"నని చెప్పగా నెవ్వరును యదార్థ విషయమును గ్రహింపరైరి.

సీమంత పూజనమునకై వరునకు దెచ్చిన వస్త్రములు హీన ముగ నున్నవని యర్పించుటకు లజ్జపడుచుండిరి. అంత భగవంతుడు త్రిపురాంతకుని జూచి "వివాహమునకై యసంఖ్యాకులగు జనులువచ్చి రని మనమున సంకోచపడకుడు. రుచికరములగు బక్ష్యాన్నములను సిద్ధము చేసి యందు లవణ మధికముగా వేయరాదు. తమకుమించిన వారితో సంబంధ మెప్పుడును జేయరాదు. రాజుపై వ్యాజ్యము వేయరాదు. తనకు మించినవారికి గన్యాదాన మీయరా"దని జెప్పెను. నరసీమెహతా గొక్క యైశ్వర్యమునుజూచి త్రిపురాంతకుడును, బంధువులును, లజ్జ నొందుచుండిరి. పిదప భగవంతుడు త్రిపురాంతకునితో "అయ్యా! మీకు సిద్ధముగ నున్న సామగ్రితో గార్యము బూర్తిచేయుడని" చెప్పగా త్రిపురాంతకు డవశ్యమని చెప్పి నగరములో బ్రవేశించి వధూ సమేత ముగా సాహిత్యములను వెంటబెట్టుకొని వచ్చెను. భీష్మకరాజు నన్య భక్తితో శ్రీ రుక్మిణీదేవిని కృష్ణున కర్పించుటకు మూలమాధవ క్షేత్ర మునకు బోయినటుల త్రిపురాంతకుడు విరోధభావమును త్యజించి వధూ సమేతముగా బయలు దేరెను. గంగానదిలో మురికి కాలువలు కలిసిన నపవిత్రమని యెవ్వరు భావింపనటులు జగజ్జీవను డంగీకరించినచో భావు కులకు గొదువయేమియు నుండదు. నానా విధములుగా మంగళ వాద్య ములు వాయింపబడెను. ద్విజోత్తములకు నారాయణుడు దక్షిణ దాన ముల నర్పించుచుండెను. దేవ బ్రాహ్మణులెల్లరు మంగళాష్టకములను బలుకుచుండిరి. త్రిపురాంతకుడు తన కుమార్తెను నరసీ మెహతాకుమా రునకిచ్చి భగవంతుని సమక్షమున కన్యాదాన మొనర్చెను. భగవంతు

డతి ప్రేమతో నరసీ మెహతాకు వస్త్ర భూషణముల సన్మానము జేసెను. అంతలో సూర్యుడ స్తమించుటచే ద్విజో త్తము లాశీర్వచనములు బలికిరి. గ్రామవాసులగు సకల జనులు దివ్యాలంకారములను వస్త్ర భూషణాదులను వధూవరుల కిచ్చిరి. ఆనగర వాసులెల్లరును ధన్యులు, అనాయాసముగ భగవద్దర్శనమునకు పాత్రులైరి. జగజ్జీవను డిరుపక్షముల వారికిని యజమానుడుగనుండి సంపూర్ణముగ కార్యక్రమమును జరిపించెను. నానావిధములగు వైభవములతో జగజ్జననియగు శ్రీరుక్మిణీ మాత వధూవరులకు మర్యాదలు జేయుచుండ నరసీ మెహతాయొక్క భార్య విస్మయమునొందెను. చతుర్విధ ముక్తులును, నష్టనాయకులును సూర్యచంద్రాదులును, భగవదాజ్ఞ ప్రకారము నచట సేవజేయుచుండిరి. ఐదుదినములు వివాహవైభవములు బూర్తిగా జరిగిపిమ్మట జగజ్జీవనుడు బంధువులెల్లరికి వస్త్రాభరణాదులర్పించెను. త్రిపురాంతకునితో భగవంతుడు "నీకు భగద్భక్తులతో సంబంధము గుదిరినది పరమార్థమును ప్రపంచమును సాధించు" మని చెప్పెను. నరసీమెహతాయును భగవంతుడును, వధూవరుల సమేతముగా భక్తజనులతో గలిసి జూన్యాగడీ నగరములో ప్రవేశించిరి. నరసీ మెహతా ప్రేమతో నఖండముగ హరి నామసంకీర్తన జేయుచుండ భగవంతుడాతని చెవిలో "నీకేకష్టము వచ్చినను నన్ను ప్రార్థించుచుండు"మని చెప్పి భక్తజనులతో గూడ నంతర్థానుడై ద్వారకజేరెను.

ముప్పది యైదవ అధ్యాయము సమాప్తము

భక్తార్తి భంజనాయ నమః

---

*

# నరసీ మెహతా హుండీ వ్రాసి యిచ్చుట

## —♦ ముప్పది యారవ అధ్యాయము ♦—

జయ మంగళవదనా, మంగళాధీశా, త్రిగుణాతీతా, హృషీకేశా, విశ్వవ్యాపకా, సర్వేశా, పంఢరీశా, శ్రీవిఠ్ఠలా, పురాణపురుషా, అనంతనామా, భక్తకామ కల్పద్రుమా, సగుణస్వరూపా, మేఘశ్యామా, ద్రౌపదీలజ్జ నివారణా, గజేంద్రమోచకా, శేషశయనా పయోధివాసా, కమలలోచనా, భక్తభూషణా, పాండురంగా, నీవు సర్వదేవతలలో శ్రేష్ఠుడవు. శంకరుడు నీనామమును సదా జపించుచుండును. ఇంద్రాది సకల దేవతలును నిన్ను స్తుతించుచుందురు. నీవనంతసాక్షివి, చైతన్యఘనుడవు, యోగీశ్వరధ్యాన గమ్యుడవు, సాయుజ్యసదనుడవు, ఆనందఘనుడవు, దయాళుడవు బ్రహ్మదేవుని జనకుడవు, సర్వముజేయుచు నకర్తవై యున్నావు నీమహిమ నెరుగుటకు వేదశాస్త్రాదుల కసాధ్యము పదు నాలుగు విద్యలును నరువది నాలుగు కళలును, నీవు భక్తవత్సలుడవని వర్ణించుచున్నవి. గోపాలుర ప్రేమకు వశుడవై వైకుంఠభువనమును, క్షీరసాగరమును, శేషశయ్యయును, సమృతి పావనమును త్యజించితివి. ద్వారకాపురిని త్యజించి పుండలీక భక్తునియాశ్రమముజేరి కటిప్రదేశమున హస్తములనుంచుకొని నిలచియుంటివి. భక్తులయందు నీకపార ప్రేమకలదు కాన పదేపదే నీకు వందనములర్పించి ప్రార్థించుచున్నాను. నీ భక్తుల సచ్చరిత్రలను నావాక్కునుండి చెప్పింపుము.

నరసీ మెహతా జ్ఞానాభిమానమును, నాశాపాశబంధనయు, లౌకిక మానమును, విషయసేవయు, మమతను, వికల్పబుద్ధిని, సమవిషమభావనయు త్యజించి, రాజునందును సేవకునియందును, ననంత బ్రహ్మాండములందలి జీవులను, బ్రహ్మాది దేవతలను, వ్యాఘ్ర వృశ్చిక సింహ శ్వానములను, అజపాలకుని, బ్రాహ్మణుని, నపశబ్దములను సుశబ్దములను, ద్రవ్యమును మట్టిని, రత్నములను పాషాణములను, సమదృష్టితో జూచుచుండెను.

ఒకనాడు ద్వారకాక్షేత్రమునకు బోవు యాత్రాజనులు జునాగడ నగరమున నొకదినము మకాము జేసిరి. కేశవభట్టను పేరుగల బ్రాహ్మణోత్తముడు నగరములో బ్రజలను "అయ్యా! మేము బ్రాహ్మణులము, ద్వారకకు బోవుచున్నాము. ఈ నగరమున హుండీ వ్రాసియిచ్చు షాహుకారు లెవరైన యున్నారా? తెలుపు" డని యడుగుచుండెను. అచ్చటనున్న కుటిలు రాతని మాటలు విని నవ్వుచు నీనగరమున నరసీ మెహతా యను భక్తుడు గలడు, ఆతడు సర్వవైభవయుక్తుడుగనున్నాడు. గొప్ప ధనవంతుడైయుండియు, నతి విరక్తుడుగ బ్రవర్తించుచున్నాడు. మీరు త్వరితముగ నచటకు బోయిన నిశ్చయముగ మీ కార్యము బూర్తియగును. తులసీ బృందావనమును, కావిజండాను గలిగిన భవనమే నరసీ మెహతా నివాసస్థాన" మని చెప్పిరి.

యాత్రాజనులు దుర్జన వాక్యములను విశ్వసించి నరసీ మెహతా గృహమునకు బోయిరి. భగవంతుడు భక్తులను, నభక్తులను స్వయముగ సృష్టించి యభక్తులవలన భక్తులకు సన్మానమును, శాశ్వతకీర్తిని నేర్పరచుచుండును మకరి గజేంద్రుని బాధింపనిచో భగవంతుని బ్రార్థించు నవసరము లేనట్లును, దుశ్శాసనుడు ద్రౌపది నవమానపరుపనిచో భగవంతునకు వస్త్రములిచ్చు పని యుండనట్లును, హిరణ్యకశిపుడు ప్రహ్లాదుని బాధింపనిచో స్తంభమునుండి నరసింహమూర్తి యవతరించు బని లేనట్లును, లోహమే లేనిచో స్పర్శవేది నెవ్వరు నెరుగనట్లు, నభక్తులే లేనిచో భక్తులకు సన్మాన మెటులవచ్చును? యాచకునకు గోరిక లేనిచో కల్పవృక్షము నెవరు విచారింతురు? అంధకారము లేనిచో దీపము నెవ్వరడుగుదురు? అసత్యభాషణము లేనిచో సత్యము నెవ్వరు గుర్తింతురు? ప్రజలే లేనిచో భూపతి నెవరు సన్మానింతురు? నక్షత్రములు సూక్ష్మములు కానిచో జంద్రుని శ్రేష్ఠుడని యెవ్వరు పలుకుదురు? యమపురి లేనిచో స్వర్గమున కెవ రాసింతురు? ఎనుబదినాలుగు లక్షల జీవజాతులందు బుట్టుటే లేనిచో మోక్షము నెవ్వరు కోరెదరు? భగవంతు డభ

క్తులను సృష్టించి భక్తులను కృపాదృష్టితో జూచుచు వారికి కష్టము కలిగినచో స్వయముగా నివారణ చేయుచుండును.

యాత్రాజనులు నరసీ మెహతా గృహము జేరి తులసీ బృందా వనమునొద్ద ధ్యానమందున్న నరసీ మెహతాను జూచిరి. ఆతడా సమయమున దేహభ్రాంతిని ద్యజించి సమాధినిష్ఠయం దుండెను. యాత్రాజను లాతనికి సాష్టాంగనమస్కారము జేయగా సావధానుడై వారి నుచితాసనములపై నధిష్ఠింప జేసి మృదుమధుర వాక్యములతో "తా మెచట నుండి విచ్చేసితిరి? ఎచటికి కేగుచున్నా" రని విచారింప యాత్రాజనులు "మేము ద్వారకానగరమునకు బోవుచున్నాము. మార్గమధ్యమున జోరులభయ మధికము. మాయొద్ద నేమవంతల నరహాలున్నవి. తా మది కైకొని హుండీ వ్రాసి యుంచుు. నే మీా నగరమున హుండీ వ్రాసి యిచ్చు షావుకారు లెవ్వరని విచారింప నగరవాసులు తమ పేరు జెప్పి" రనిరి.

నరసీమెహతా ఆశ్చర్యచితుడై "దుర్జను లవమానపరచుటకై యిట్లుచేసి" రని భావించి "భగవంతుడు భక్తకార్యములను జేయుట కవతరించి నానావిధ లీలలను జూపుచుండును" అని నిశ్చయించి యాత్రాజనులను జూచి "ద్రవ్యమును దెచ్చి యిచట బెట్టు" డని చెప్పెను. అంత యాత్రాజనులు "ద్వారకాక్షేత్రమున మీా దుకాణమున నుండు గుమస్తా పేరేమి? తెలుపు" డన, నరసీ మెహతా "ఆతని పేరు 'సాంవళిసా'. ఇంద్రాది దేవతలెల్లరు ఆతనికి వందనములు చేయుదురు. చతుర్వేదము లాతనిని గీర్తించుచుండును కైలాసపతి యాతని నామమును జపించుచుండును. ముఖ్యదుకాణము క్షీరసాగరమందును, రెండవదుకాణము వైకుంఠపురమునందును, మిగిలిన దుకాణములు గోకుల బృందావనము, మధురానగరములందును నున్నవి. భీమానదీతీరమందు పంఢరీపుర క్షేత్రములో పుండలీకుడను పేరుగల యొక సేటు గలడు. ఆత డచట నివసించుచుండును. ద్వారకాక్షేత్రమునందు నివసించు "సాంవళిసా" వ్యాస

వాల్మీకులు, నామదేవ కబీరులద్వారా వ్యాపారము జరిపించుచుండు" నని చెప్పెను.

నరసీ మెహతా జెప్పిన వాక్యములువిని యాత్రాజనులు యదార్థమని భావించి సమాధానచిత్తులై యేడునందల వరహాల నచట బెట్టిరి. నరసీ మెహతా తత్క్షణమే వారి కీవిధముగ హుండీ వ్రాసెను.

జునాగడీనగరము

ద్వారకావాసీ, సాంవళిసా!

నేను పంపిన యీహుండీని జూచుకొని ద్వారకకు యాత్రకై వచ్చిన కేశవభట్టు వెంటనున్న సాధుమండలికి యేడునందల వరహాలు తత్క్షణమే చెల్లింపుము.

ఇట్లు
నరసీ మెహతా.

అని వ్రాసి యిచ్చెను. యాత్రాజనులు హుండీపత్రమును దీసికొని యచటనుండి బయలుదేరిరి. నరసీ మెహతా నగరమునగల సాధువులను, వైష్ణవులను, దీన యాచకజనులను బిలిపించి యా ధనమును తత్క్షణమే ధర్మముజేసి యుపాధిరహితుడై యఖండముగ నామస్మరణ జేయుచుండెను.

యాత్రాజనులు మార్గమున బోవుచు పరస్పరముగ జనులచే నరసీ మెహతా దరిద్రుడని యెఱిగి "వ్యర్థముగా భ్రాంతివలన నాతనికి ద్రవ్య మిచ్చితిమి. జలములో లవణము వేసిన దిరిగి రానటుల మన ద్రవ్యము కృష్ణార్పణ మైనదని పరస్పరవిధముల జింతించుచు, కేక వేసిన ప్రతిధ్వని యాకసమునుండి రానట్లును, నగ్నిలో వేసిన నమృతము తిరిగి రానట్లును, నరసీ మెహతా కిచ్చిన ద్రవ్యము తిరిగిరాదని దుఃఖించుచు కొన్ని దినములకు ద్వారకా క్షేత్రముజేరి గోమతిలో స్నానము జేసి శ్రీకృష్ణభగవానుని చరణములకు సాష్టాంగనమస్కారము జేసి యనన్యభావముతో "జయ జయ రుక్మిణీకాంతా! దీనబంధో! అనాథ

నాథా! కృపావంతా! మాచింతను దొలగింపు"మని ప్రార్థించిరి. పిదప యాత్రికు లర్చకులనుజూచి "ఈక్షేత్రమున "సావళసా" సాహుకా రె చట నుండును. అతని పేరుతో మేము హుండీ దెచ్చితి" మని జెప్పగా వారు "సావళసా యనుపేరుగల సాహుకా రెవరు నీక్షేత్రములోలేరు. మీరు ద్వారకా క్షేత్రమంతయు శోధించినను సావళసా యను వ్యక్తి లభింపదు. మీరు ద్రవ్యమిచ్చినప్పుడు పూర్తిగా విచారించ నట్టుల గన బడుచున్నారు. పాత్రనుజూచిధర్మముజేయుటయు, సద్గురుని జూచి శరణు బొందుటయు, వైష్ణవునిజూచి నమస్కారము జేయుటయు నుత్తమములు. భక్తుల కన్నవస్త్రాదు లీయవచ్చును. కాని ద్రవ్యమిచ్చి పుచ్చుకొను వ్యవహారము లెంత మాత్రము జేయరాదు, మీ రవిచారముతో వైష్ణవునిచే హుండీ వ్రాయించుకొంటిరి. మీకు ఏ సావళసా సాహుకారు వచ్చి ద్రవ్యము చెల్లించునని పరిహాసించు చుండిరి.

యాత్రాజనులు చింతాక్రాంతులై యచటనుండి బయలుదేరి "మనమిచ్చిన ద్రవ్య మప్పుడే నరసీ మెహతా ఖర్చుపెట్టి యుండును. ఇక నా ద్రవ్యాశను త్యజించు కొనవలయు నని శ్రీ రుక్మిణీకాంతు డాసమయమున నుద్ధవాక్రూరులను వెంటనిడుకొని తానొక శ్రీమంతుని వేషమును ధరించి రథమునందాసీనుడై యానగరవీధుల సంచరించుచు గనబడు జనులతో "జునయాగడీ నగరమునుండి మా యజమానులగు నరసీ మెహతా యేడువందల వరహాలను దీసికొని యాత్రీకుల కొక హుండీని వ్రాసియిచ్చిరి. ఆ యాత్రీకు లెచట నుండిరో కనబడలే"దని యడుగుచు రథముతో ద్వారకా క్షేత్రమంతయు దిరుగుచుండెను.

అంత నుద్ధవుడు భగవంతునిజూచి "ఓ జగజ్జీవనా! నీమహిమ విశేషమును వేదములు తెలిసికొనలేక నేతినేతి వాక్యములను బలికినవి. భక్త కార్యముల జేయుటకై నీవనంత రూపములు ధరింతు"వని చెప్పెను. పిదప నక్రూరుడు "ఓ స్వామీ! నీవు జగన్నాటక సూత్రధారివి. ప్రథమ మున భక్తులకు విఘ్నములను దెత్తువు. వారు నిన్నార్తులై ప్రార్థింతురు. బాలకుని తల్లి "భూతమున్న"దని చెప్పును. పిదప నాబాలుడు భయపడి యేడ్చుచుండ నాతని బుజ్జగించి భయము దీర్చును" అని చెప్పెను.

ఈవిధముగ నుదవాక్రూరులును భగవంతుడును సంవాద మొన ర్చుకొనుచు ద్వారకా నగరమంతయును దిరుగుచుండిరి. దివ్యా లంకార ములును, వస్త్రభూషణములను ధరించి భగవంతు డా రథములోనుండి రాజవీధిని బ్రవేశింప, మార్గమున చింతాక్రాంతులై కూరుచుండియున్న యాత్రాజనులు కనబడిరి. శ్రీకృష్ణభగవానుడు రథము నాపి "జున్నా గడీ నగరమున నరసీ మెహతా యను మా యజమానులు గలరు. వా రేడువందల వరహాలను దీసికొని యాత్రాజనులకు హుండీ నిచ్చిరి. నేను నరసీ మెహతాయొక్క గుమస్తాను. హుండీ ద్రవ్యమును చెల్లించు టకు యాత్రాజనులకై మూడుదినములుగ శోధించుచున్నాను. ఆ యా త్రాజనులను మీ రెరుగుదురా? శ్రీ కేశవభట్టు మీకు దెలియునా? అని యడుగగా ప్రేమభక్తులు హరికీర్తనను విని సమాధాన చిత్తులగు నటులను, ననుతాపముతో దీర్థములను సేవించిన సంతోషము కలుగు నటులను, భాగవత శ్రవణముచే భక్తులు స్వానంద భరితు లగునటులను, దృష్ణాక్రాంతు డుదకపానమును జేసి సంతసించునటులను, సాధకునకు సత్సాంగత్యము లభించిన నాతడానందించు నటులను, యాత్రాజనులు భగవంతుడు చెప్పిన వాక్యలనువిని యమితానంద భరితులై నరసీ మెహతా వ్రాసియిచ్చిన హుండీని భగవంతున కిచ్చిరి.

భగవంతు డా హుండీని దీసికొని శిరమునం దుంచుకొనెను. శ్రీ రుక్మిణీకాంతుడు నవ్వుచు నా హుండీని జదివెను. పిదప నుద్ధవుని జూచి "నరసీ మెహతా ప్రేమభక్తుడు. సంసారమందుండి యతివిరక్తుడై యీ హుండీని వ్రాసి పంపె" నని చెప్పి ద్రవ్యమును యాత్రాజనుల చేతి కిచ్చెను. వారు సమాధానచిత్తులై వేషధారియగు భగవంతుని జూచి "గుమస్తాయగు మీరు గొప్ప శ్రీమంతులవలె గనబడుచున్నారు. నరసీ మెహతా మర్బలుడు, ననాథుడుగ గనబడుచున్నాడు. శ్రీమంత సేవకుడును, ననాథయజమానుడు చాల వింతగ గనబడుచున్నది. సూర్యునికంటె నరుణుడు తేజోవంతుడై యుండుటయు, గంగకంటె కాలువ గొప్పదైయుండుటయు, రాజుకంటె ప్రధాని గొప్ప యైశ్వర్య వంతుడైయుండుటయు, శ్రీరామునికంటె వానరుల ప్రతాపము గొప్ప

నరసీ మెహతా వ్రాసిన హుండీకి భగవంతుడు
యాత్రాజనులకు ద్రవ్యము చెల్లించుట



దనుటయు, లక్ష్మీదేవికంటె నష్టసిద్ధులు గొప్పవనుటయు, చంద్రుని కంటె తారలు తేజోవంతమైన వనుటయు జగమునం దసంభవ" మనిరి.

అంత శ్రీ రుక్మిణీకాంతుడు "సముద్రమున కహర్నిశము వర్షము కావలెనని కోరిక యుండనట్లును, గృహమున దీపము వెలిగించవలయునని భాస్కరున కిచ్ఛ యుండనట్లును, సుధారసపానము జేయువా డౌషధము నిచ్ఛగింపనట్లును, విష్ణుభక్తులు ద్రవ్యమును దుచ్ఛముగా భావింతురు. నరసీ మెహతా యఖండ హరిదాసుడు. ఆతడు సంసారములోనుండి మాయాతీతుడై యాశారహితుడుగ వర్తించుచున్నాడు. వారి స్వభావమునకు మే మేమిచేయగలము? తల్లి తన బిడ్డకలంకారము జేయవలెనని యాశించుచుండునటుల నరసీ మెహతా పూయం దపారమైన కృపతో నుండునని చెప్పగా యాత్రాజనులు "నరసీ మెహతా ప్రేమభక్తు" డని పరిపరివిధముల గొనియాడుచుండిరి. భగవంతుడు తత్క్షణమే యంతర్ధానుడయ్యెను. యాత్రాజనులు ధనమును లెక్కించిచూడ, నగణితమైయున్నందున "ద్వారకానాథుడే తమకు దర్శనమొసంగి ద్రవ్యమునిచ్చె" నని సమాధానచిత్తులై యా ద్రవ్యమును శాస్త్రజ్ఞులకును, పండితులకును, దీన యాచకజనులకును ధర్మము జేసి ద్వారకానాథుని సేవించి యచటనుండి జున్నాగడ నగరము జేరి నరసీమెహతాను దర్శించి జరిగిన సర్వవృత్తాంతము నాతని కెరింగించి "నీవు ప్రేమభక్తుడవు. ద్వారకానాథుని ఋణస్థునిగా జేసికొంటివి. సాంవళసా వచ్చి తమ హుండీపత్రమును నేత్రముల కద్దుకొని శిరమున ధరించి ద్రవ్యమును మాకుజెల్లించి మేము జూచుచుండగనే యంతర్ధానుడాయె" నని చెప్పగా నరసీ మెహతా యశ్రుధారలను విడచుచు "హేద్వారకావాసీ, రుక్మిణీరమణా, అనాధనాథా, మధుసూదనా, విశ్వంభరా, కరుణాఘనా, దీనబంధో, కృపాసాగరా, జగదుద్ధారా, భక్తవత్సలా! నాకై మిగుల శ్రమనొందితి" వని చింతించి, కొంతసేపటికి మనస్సును స్థిరముజేసికొని హరినామసంకీర్తన నఖండముగా జేసెను.

ముప్పదియారవ అధ్యాయము సమాప్తము.

# నరసీ మెహతా కుమార్తెకు భగవంతుడు సారెలనిచ్చుట

## —♦ ముప్పది యేడవ అధ్యాయము ♦—

శ్రోతలారా! సావధానచిత్తులై వినుడు. వైష్ణవుడగు నరసీ మెహతా జున్నాగడ నగరమున వసించుచు, ప్రేమతో హరినామ సంకీర్తన జేయుచుండెను. క్షమయును, శాంతియును మూర్తివంతములుగా నాతని హృదయమున వసించుటచే నల్పసంతుష్టుడై యయాచిత వృత్తి నవలంబించియుండెను భక్తి జ్ఞాన వైరాగ్యపూర్ణుడగు నీతడు దారపుత్రాదులతో గృహస్థధర్మమునందుండి యలిప్తుడై వర్తించుచుండెను. సరోవరమునందు కమలము లుదకముపై నుండియు, జలను నంటక యుండునట్లును, ఘటమునందు సూర్యబింబము ప్రతిబింబించియు నలిప్తమై యుండునట్లును, వాయువు సర్వమందును వ్యాపించి, పట్టుకొనుటకు దొరకనట్లును, నరసీ మెహతా అవగుణరహితుడై ప్రపంచమునందుండి యలిప్తుడైయుండెను. హరిభక్తులకు సంసారమున్నదని యజ్ఞానులు పలుకుదురు. అందువలననే భూభారము పెరుగుచుండును వారు సదా సర్వకాలములందును విష్ణుభక్తులయందు దోషారోపణ జేయుచుందురు.

నరసీ మెహతా విరక్తుడైయుండ నాతని కుమార్తె రజస్వల యాయెను. శోభనకార్యము జరుపుటకై వియ్యంకుని గృహము నుండి యామంత్రణ బంపిరి. నరసీ మెహతా కాంత భర్తను జూచి "నాథా! గృహమున నన్నవస్త్రాదులు లేవు కుమార్తెకు సారెలిచ్చుటకేమి యాలోచించితి" రని యడుగగా నాతడు "నాయొద్ద హరినామమున్నది. దానినే సారెగా దీసికొనిపోయి యిచ్చెద" మని చెప్పి యచట నుండి సత్వరమే బయలుదేరి వియ్యంకుని గృహము జేరెను. నరసీ మెహతా తంబురను, చిరుతలను దీసికొని రిక్తహస్తములతో వచ్చియుండుటను జూచి యచట గల బంధువులెల్లరును బరిపరివిధముల బరిహాసించుచు "సమాజముగ లోకాచారమునకై మీ కామంత్రణ బంపి

యున్నాము. మీ రీ దుస్థితిని తులసీమాలలు ధరించి తంబుర తాళము లతో వచ్చుట హేయముగా నున్నది. సారె లిచ్చు శక్తి లేనిది వ్యర్థముగా నేలవచ్చితిరి? ఇచ్చటికి వచ్చు బంధువులలో మా కవమానముగా నుండు" నని చెప్పుచుండిరి. పిదప కుమార్తె నరసీ మెహతా నేకాంతముగా బిలచి "నాయనా! ఈవిధముగ బంధువులు పరిహాసించుట నాకును మిగుల లజ్జాకరముగా నున్న"దని చెప్పగా నరసీ మెహతా బంధువులును, కుమార్తెయు బలికిన పలుకులు విని "మీ కెవరెవరి కేమేమి వస్తువులును, సారెలు గావలయునో జాబితాను వ్రాయు" డని చెప్పి విలేఖరి నొకనిని బిలచి జాబితా వ్రాయు" మని చెప్పగా నెల్లరును బరిహాసించుచు నొక్కొక్కరు దమకు కావలసిన వస్తువు లపారముగ జెప్పుచుండిరి. నరసీ మెహతా విలేఖరిని జూచి "నాయనా! నీ కేమి కావలయునో వ్రాసికొ" మ్మని చెప్పెను. అత డవిశ్వాసముతో నాకొక గుండురాయి కావలెనని వ్రాసి నవ్వుచుండెను. అచట గల బంధుమిత్రాదులు "ఈ వ్రాసినవన్నియు వచ్చునని నీకు విశ్వాసము గలదా?" అని హేళనగా మాటాడుచుండిరి.

భక్తుల వాక్యములందు విశ్వాసము లేనివాడును, జనకుని ద్వేషించువాడును, విద్యావంతుడైయుండి బ్రహ్మ ద్వేషముతో నుండువాడును, దీర్థ క్షేత్రముల నిందించు వాడును, మాతృ ద్రోహియు, కర్తవ్యాకర్తవ్యములను గుర్తించనివాడును, బరదార లుబ్ధుడును, భవచక్రమునంబడి కల్పాంతమువరకు భగవత్ప్రాప్తి బొంద నేరడు.

విలేఖరియగు నాదుర్జనుడు నాకు గుండురాయి కావలెనని హేళనగా వ్రాసెను. నరసీ మెహతాయా జాబితాను దీసికొని "హే దీనదయాళో భక్తవత్సలా!, కమలనేత్రా, వైకుంఠవిహారా, రుక్మిణీమానస చకోరచంద్రా, యనాథనాథా!"అని ప్రార్థించగా లక్ష్మీకాంతుడు సంతుష్టచిత్తుడై యా జాబితాయందు వ్రాసిన ప్రకారముగా సామగ్రుల బండితో దాను బ్రాహ్మణవేషధారియై యచటజేరి నరసీ మెహతాకు నమస్కారము జేసి "జాబితాప్రకారము సారెలను దెచ్చితి"నని చెప్పెను. బంధువు లెల్లరును నాతనిజూచి "మీరెవ్వరు? ఎచటనుండి వచ్చితి"రని

విచారింపగా జగజ్జీవనుడు "ద్వారకా క్షేత్రములో నరసీ మెహతా యొక్క మకాణమందు నేను గుమస్తాగా నుంటిని. ఆతడు నారెల దీసి కొని యింటికిరమ్మని నాకు వర్తమానము బంపెను. అతని యాజ్ఞాను సారముగా నన్నియు దెచ్చితి"నని పలుక నెల్లరును నాశ్చర్యముతో నాతని గుర్తింపరైరి. పిదప భగవంతు డలంకారముల పెట్టెనుతీసికొని నరసీ మెహతానుబిలచి యెవరెవరి కేయే వస్తువుల నీయవలయునో యోచించి యుండని చెప్పెను శ్రీ రుక్మిణీకాంతుడు నరసీ మెహతా యొద్దనున్న కాగితమును బుచ్చుకొని యందు వ్రాయబడిన ప్రకారముగా నమూల్యములగు పీతాంబరములను, నాభరణములను, నరసీ మెహతా కుమార్తెకును జామాతకును నిచ్చెను. బంధువులకు జాబితాలో వ్రాయ బడిన ప్రకారముగా పలురంగుల జరీచీరెలను, రవికెలు, ధోవతులు, నంగరకాలు, తలపాగాలు, రుమాళ్ళు, నుత్తరీయములు నిచ్చి స్త్రీపురు షుల నెల్లరిని సంతుష్టి పరచెను పిదప సంత్యాగున వ్రాయబడిన ప్రకా రము లేఖకుని బిలచి జగజ్జీవను డాతనికి గుండురాయి నిచ్చెను. సకల జనులును నీ యద్భుత లీలలనుజూచి హర్షచిత్తులైరి భగవంతుడు విలే ఖరిం జూచి "నీ ప్రారబ్ధ మిటులున్నది కల్పవృక్షచ్ఛాయను గూర్చుండి భిక్షాన్నము నపేక్షించితివి. శంకరుని భస్మాసురుడు విపరీతవరము గోరి నట్లు, నీవు పాషాణమును గోరితివి" అని పలుకగా మురాచారియగు నావిలేఖరి లజ్జితుడాయెను బంధుమిత్రాదు లెల్లరును నరసీ మెహతాకు సాష్టాంగనమస్కారము జేసి "మీరు భగవద్భక్తులు. మీకు కొదువ యేమియు నుండదు శ్రీ లక్ష్మీకాంతుడు మీకు స్వాధీనుడైయున్నాడు" అని పరిపరి విధముల స్తుతించుచుండిరి. అచ్చట శుభకార్యము పూర్తి యైనపిదప నరసీ మెహతాయు, నతని భార్యయును స్వగృహమున కేగిరి. భగవంతుడు "నే నెల్లరిని వస్త్రాభరణాదులచే సన్మానించితిని కాని, నరసీ మెహతాను గౌరవించలేదు" అని యాలోచించి తులసీమిశ్రిత కంఠహార మును తన గళమునుండి తీసి నరసీ మెహతా కంఠమున వేసెను. పిదప నరసీ మెహతా నిత్యము హరినామ సంకీర్తన జేయుచుండెను.



నరసీ మెహతా కుమార్తెకు భగవంతుడు సారెదెచ్చుట

దేవాదిదేవుఁడు ప్రతిదినము నరసీ మెహతా కథాకాలక్షేపము జేయు సమయమున నాతని కంఠమున బుష్పహారమును వేయుచుండెను. ఈ విషయ మా దేశమందంతటను వ్యాపించి యచ్చటగల మండుకరాజు నకు దెలిసెను. ఆతడాశ్చర్య చిత్తుడై "ఈతడు పూజా సమయమున దేవుని కర్పించు పుష్పహారమును భజన సమయమున దానే ధరించుచు భగవంతుడు వేయుచున్నాడని దుష్ప్రచారమును జేయుచుండెను" అని తలంచి తాను స్వయముగ పరీక్షింప నెంచి కృత్రిమస్వభావముతో బూజామందిరమున భగవంతుని ప్రతిమకు వేసిన పుష్పహారమును దారము తో రాకుండ గట్టిగ వస్త్రమునకు గట్టి తాను స్వయముగ కథా కాలక్షేపము జరుగు ప్రదేశమున గూర్చుండి "భగవంతుడు పుష్పహార మును నేను చూచుచుండగ వేయనిచో శిక్షింతును" అని పలికెను.

నరసీ మెహతా తంబుర తాళములను దీసికొని ప్రేమతో హరి నామ సంకీర్తన జేయుచు, భగవంతుని కళ్యాణ గుణములను వర్ణించు చుండెను. కాని యాతని కంఠమున బుష్పహారము నాదినమున భగవం తుడు వేయనందున మండుకరాజు నరసీ మెహతా కంఠమున ప్రతిదినము భగవంతుడు పుష్పహారమును వేయునను వార్త యసత్యమని భావించుచు గోపోద్దీపిత మానసుడై యుండ నరసీ మెహతా చేతులు జోడించి భగవం తునిజూచి "ఓ శ్రీహరీ! నీవు మానవరూపుడవై శంఖాసురుని క్షణ కాలములో సంహరించితివి. కూర్మరూపధారివై పదునాలుగు రత్నములను యుక్తితో దీసితివి వరాహ రూపమును ధరించి హిరణ్యాక్షుని సంహరించి తివి. ప్రహ్లాదుని రక్షించుటకై సభాస్తంభమునందు నృసింహరూపమును దాల్చితివి. వామనరూపమున త్రిభువనములను పాదముక్రింద నుంచి తివి. పరశురామరూపమును ధరించి క్షత్రియులను పాదాక్రాంతులుగ చేసితివి. శ్రీరామరూపమును ధరించి రావణ కుంభకర్ణాదులను సంహ రించితివి. శ్రీకృష్ణావతారమును ధరించి నానావిధములగు ననంతరూప ములను జూపితివి. ద్రౌపదీదేవి వస్త్రాపహరణ సమయమున బ్రార్థిం పగా సత్వరమే యామె కక్షయములగు వలువ లొసంగితివి. నాకంఠము

నొక పుష్పహారమును వేయుట కింత యాలస్యము జేసెదవేల?" యని పరిపరివిధముల భగవంతుని ప్రార్థించుచుండెను.

నరసీ మెహంతా దీనాలాపములకు భగవంతుడు సంతుష్టచిత్తుడై యాతని నోటినుండి నిందావాక్యములు వచ్చువరకు పుష్పహారమును వేయరాదని యాలోచించి జాగుజేయుచుండెను. మండుకరాజు నరసీ మెహంతాను జూచి "నీ కృత్రిమస్వభావమును నేను బాగుగ గ్రహించితిని. నీవు బహుకాలమునుండి ప్రజలను మోసము చేయుచున్నావు. నిన్నిక విడువక నిశ్చయముగ శిక్షింతునని క్రోధముతో బలుకగా నరసీ మెహంతా సంకటసమయ మాసన్నమైనదని గ్రహించి "ఓ జగజ్జీవనా! ఒక పుష్పహారము ను నా కంఠమున వేసినచో నీ శాబుసా మ్మైన పోవునా?" అని నిష్ఠురముగ పలుక ద్వారకానాథుడు సంతుష్టచిత్తుడయ్యెను. నరసీ మెహంతా యపారముగ దీనాలాపములతో ప్రార్థించినంతవరకు భగవంతు డాతనికి పుష్పహారమును వేయనందున తుద కాతడు కఠోరముగ నపశబ్దములను బలుక భగవంతుడు హర్షచిత్తుడై యాతని కంఠమున దులసీమిశ్రిత పుష్పహారమును వేసెను. మండుకరాజది చూచి యత్యాశ్చర్యమునొంది "ఈతడు శివుని పూర్ణావతారమని లోకోక్తి యున్నది. అయ్యది యదార్థము' అని భావించి జయజయ ధ్వనులను జేయుచు నరసీ మెహంతా చరణములపై బడి సద్భావముతో "నీవు భగవంతుని నిజభక్తుడవు. నీ మహిమావిశేషములను దెలిసికొనలేక నే నవహాహపడితిని. దుర్యోధనుడు పాండవులను జలింపజేసి తా నవమానము నొందినట్లు నీవిషయమున నే నవమానము నొందితిని" అని పరిపరివిధముల ప్రార్థించి యప్పటినుండియు నరసీ మెహంతాయం దధిక భక్తివిశ్వాసములతో నుండెను. పిదప నరసీ మెహంతా సర్వకాలము లందును హరినామసంకీర్తన జేయుచు నవసానమున నీశ్వరసాయుజ్య మలంకరించెను.

**ముప్పదియేడవ అధ్యాయము సమాప్తము.**

భక్త సులభాయ నమః.

# డాకురా రామదాస చరిత్ర

## —♦ ముప్పదియెనిమిదవ అధ్యాయము ♦—

జయ ద్వారకావాసా, రుక్మిణీరమణీరమణా, చిత్తచాలకా, చైతన్య ఘనా, విధిజనకా, భక్తభూషణా, దానవమర్దనా, శ్రీకృష్ణా, విశ్వ వ్యాపకా, సర్వేశ్వరా, సాయుజ్య పదదాయీ, ఉదారా, పతితపావనా, రాధికావరా, గోవిందా, సగుణస్వరూపా, మేఘశ్యామా, గుణాతీతా, పురుషోత్తమా బ్రహ్మాండవాసీ, ఆత్మారామా, భక్తహృదయ కమల మిళిందా, సచ్చిదానందా, స్వానందకందా! నీ భక్తుల సచ్చరిత్ర లద్భు తమై యున్నవి. శ్రోతలకు తృప్తి కలుగునటుల నావాక్కునుండి రసవంత మగు నీ భక్తుల సచ్చరిత్రలను జెప్పింపుము.

భావుకులగు శ్రోతజనులారా! సావధానచిత్తులై వినుడు. రస వంతమగు నీ సచ్చరిత్ర శ్రవణ మాత్రమున దురితములన్నియు సంపూర్ణ ముగ దొలగును. పరమపవిత్రమగు శ్రీ ద్వారకాక్షేత్రమునకు మూడు వందల మైళ్ళ దూరమున 'డాకురా' యను గ్రామము కలదు. అచ్చట పరమ భావుకుడును, జ్ఞానియు, భిక్షాటనముచే కుటుంబపోషణ మొనర్చు వాడును నగు రామదాసను పేరుగల వైష్ణవభక్తు డుండెను. అతడు సర్వకాలములయందును నిరాశతో సంతుష్టుడై యహోరాత్రములందును భగవన్నామ సంకీర్తన జేయుచు కాలము గడుపుచుండెను. నియమ ముతో నేకాదశీవ్రతము జేయుచు, ఆషాఢ కార్తికైకాదశులందు ద్వార కకు బోయి బ్రహ్మోత్సవములను సేవించుచుండెను. అత్తవారింటియం దున్న యువతి మాతృగృహము జేరి యానందముతో నుండునటుల, రామదాసు ద్వారకాక్షేత్రముజేరి, హర్షచిత్తుడై, గోమతిలో స్నానము జేసి, మానసపూజ జేసికొని, యచటనుండి యాలయములో ప్రవేశించి, మహాద్వారమున సాష్టాంగనమస్కారము జేసి దేహాభిమానమును విడచి "పతితపావనా, గరుడధ్వజా, అనాధనాధా అధోక్షజా, ద్వారకా ధీశా, శ్రీకృష్ణా! నిన్ననన్యభావమున శరణుబొందితిని. నా జనన మర ణములను దొలగింపు" మని పరిపరవిధముల బ్రార్థించెను.

రామదాసు నియమముతో నిరువదియైదు సంవత్సరములు ద్వారకాయాత్రకు బోయి దేవుని యుత్సవములను సేవించెను. పిదప వృద్ధాప్యము వచ్చుటచే శరీరపటుత్వము తగ్గి క్రమముతో ద్వారకాక్షేత్రమునకు నడచిపోయి భగవంతుని సముఖమున నిలచి యానందాశ్రువులను విడచుచు గద్గదస్వరముతో "ఓ దేవాధిదేవా! ఇది యంతిమ దర్శనము. వృద్ధావస్థితి వచ్చుటవలన నశక్తుడనై నీ దర్శనమున కిక రాజాలను. నాయందు కృపయుంచు" మని ప్రార్థించెను. రామదాసు కరుణావచనములకు ద్వారకానాథు డానందించి చతుర్భుజములతో నాతనికి దర్శనమిచ్చి యాలింగనముజేసికొని "నీవు చాల శ్రమపడితివి. నీ సేవాఋణ మపారముగ నున్నది. నీవశక్తుడవై నా దర్శనమునకు రాజాలనని చెప్పుచున్నావు. కాన నీవెంట నన్ను దీసికొని పొమ్మ"ని చెప్పగా రామదాసు సిన్నెట్లు తీసికొని పోవలయునని యడిగెను. అంత భగవంతుడు నా రథములో నన్ను గూర్చుండబెట్టుము. ఒకరాత్రిలో నేను రథమును నడిపించుకొని వచ్చెదని పలికెను.

రామదాసు రథమునుదీసికొని వచ్చి భగవంతు నధిష్ఠింప జేసి 'డాకురా' నగరము జేరెను. రామదాసు భగవంతునిజూచి "నిన్ను నేనెచ్చట దాచవలయును. నేను మిమ్ములను దీసికొని వచ్చినట్లు తెలిసినచో దేవాలయ యజమానులు నన్ను శిక్షింతు"రని చెప్పెను. ప్రాతః కాలమునందు ద్వారకలో నర్చకులు ప్రభాత సేవజేయుటకై దేవాలయపు దలుపుల దెంచిరి. ఆలయములోపల భగవంతుడు కనబడనందున నర్చకులు క్షేత్రప్రజలును మిగుల జింతించి రామదాసను భక్తుడువచ్చియుండెను. ఆతడు బహుశః భగవంతుని రథములో నధిష్ఠింపజేసి దీసికొనిపోయియుండునని యాలోచించి రథపు జాడలను కనబడు చున్నందున 'డాకురా'జేరి రామదాసును విచారింపగా నేను భగవంతుని దీసికొని రాలేదు. కావలసినచో నాగృహమును శోధించుకొనుడని చెప్పెను. నగరమునందంతయు శోధించిరి. నగరము వెలుపల సరోవరములో రామదాసు ద్వారకానాథుని దాచియుంచెను. ద్వారకనుండివచ్చిన జనులును



డాకురా రామదాసు భార్య ముక్కు–నత్తునకు

శ్రీ కృష్ణుడు సరితూగుట

నర్చకులును, డాకురాలో నెచ్చటను ద్వారకానాథుని దివ్యమంగళ విగ్రహము గనబడనందున తుదకు గ్రామము వెలుపలనున్న సరోవరమును జేరి కఱ్ఱలతో బొడచి చూచుచుండగా నొక కఱ్ఱ భగవంతుని వక్షస్థలమునకు దగిలి రక్తము నచ్చుచుండెను. భగవంతుని దివ్యమంగళ విగ్రహమీ సరోవరములో నున్నదని వారెల్లరును నిశ్చయించిరి. ఈతగాండ్రు లోపలికి దుమికి ద్వారకానాథుని విగ్రహమును దీసి రథమునందధిష్ఠింప జేసిరి.

రామదాసు చింతాక్రాంతుడై "ఓ రుక్మిణీకాంతా! భక్తవత్సలా, దీననాథా! నన్నువిడచి వెళ్లెదవా! నీకొరకు నేనసత్యము బలికితి"నని చెప్పగా భగవంతుడు హృదయ సాక్షాత్కార దర్శనమిచ్చి "నీవు స్వస్థచిత్తుడవై నా భజన జేయుము. నేను పుండలీకుని ద్వారమందు కట్టబడి దేశమున హస్తములుంచుకొని యుండినట్లు నీకొరకు సదా యిచ్చట నే యుండెదను. చింతింపకు"మని చెప్పగా రామదాసు"స్వామీ! అర్చకులు నిన్ను రథమున గూర్చుండబెట్టి తీసికొని పోవుచున్నారుగదా!" అని పలుకగా భగవంతుడు "రామదాసా! నీవర్చకుల యొద్దకుబోయి నాతూకముగల సువర్ణమిచ్చెదనని చెప్పినచో వారంగీకరింతురు. నీ భార్య ముక్కుననున్న నత్తునకు నేను తూగెదను. చింతింపకు''మని చెప్పెను. రామదాసు హర్షచిత్తుడై పూజారుల యొద్దకుబోయి అయ్యా! ద్వారకనుండి వచ్చిన మూర్తిని తిరిగి కొనిపోవుట యుక్తముకాదు. భగవంతుని తూకముగల బంగారము నిచ్చెద"నని పలుకగా వారంగీకరించిరి. గ్రామవాసులెల్లరును గూర్చుండియుండగా రామదాసు చెప్పిన విషయముల నర్చకులు చెప్పి తమకు సువర్ణమిప్పించిన దిరిగి పోవుదుమని చెప్పిరి. గ్రామవాసులు రామదాసును బిలచి "నీవు దుర్బలుడవు, దీనుడవు. తినుట కన్నమైనను లేక దుస్థితి యందున్నావు. భగవంతుని బరువు సువర్ణ మెచటనుండి దెచ్చి యీయగలవు. మాకాశ్చర్యముగనున్న"దని చెప్పిరి.

రామదాసు వారినిజూచి "అయ్యా! శ్రీహరి సర్వసమర్థుడు. ఆతడు నాగృహమునకు విచ్చేసెను. నేను దుర్బలుడనని జెప్పుటకు మీకు కొంచెమైనను లజ్జలేకున్నది. దరిద్రుని గృహమునకు లక్ష్మి యాకస్మికముగ వచ్చినపిదప నాతని దరిద్రుడనుట మూర్ఖత్వము. ఇనుప పెట్టెలో స్పర్శవేది వేసినపిదప దానిని దిరిగి యినుపపెట్టె యనినచో వ్యర్థ వచనములగును. గ్రామమునందున్న మురికి కాలువ గంగానదిలో గలిసిన పిదప నపవిత్రమని చెప్పినచో దోషము సంప్రాప్తించును. మూగవానికి సరస్వతి ప్రసన్నమై యాతని కధ్యయనము చేయించిన పిదప నాతనిని మూగవాడనుట యవివేకము. లక్ష్మీపతియగు వైకుంఠ నాథుడు సంతుష్టుడై నాగృహమునకు విచ్చేయ నన్ను దరిద్రుడనుటకు మీకు సందేహము కలుగకుండు టాశ్చర్యముగ నున్న"దని చెప్పెను. అంత గ్రామవాసులు కౌతుకమును జూడదలచి "మేము సాక్ష్యముగ నుంటి"మని యర్చకులతో జెప్పి యొకత్రాసును దెప్పించి యొక తట్టలో ద్వారకానాథుని విగ్రహముంచిరి. అర్చకులు సువర్ణమును దీసికొని రమ్మని రామదాసుతో జెప్పగా నాతడు గృహమున కేగి భార్యముక్కున నున్న నత్తుడిగిపుచ్చుకొని దానిని త్రాసు రెండవ తట్టలో వేసెను. జనులెల్లరును బరిహాసము జేయుచు నీవు వేసిన నత్తే చాల బరువుగ నుండు నని చెప్పుచుండిరి.

రామదాసు చేతులుజోడించి భగవంతుని "ఓ అనాథనాథా! రుక్మిణీవరా! దీనోద్ధారా, శ్రీకృష్ణా! నిన్ను సత్యభామ నారదునికి దానమిచ్చినప్పుడు శ్రీ రుక్మిణీదేవి సమర్పించిన తులసీదళమునకు సరి దూగితివి. నేనతిదీనుడను, నాయందభిమానముంచు"మని ప్రార్థింప ననంతబ్రహ్మాండనాయకుడు తానున్న త్రాసుతట్ట పైకిబోవునట్లు సంకల్పించెను. రామదాసు వేసిన నత్తు భగవంతుని విగ్రహముకంటె బరువుగ నుండునట్లు త్రాసువలన దెలియుచుండెను. భక్తజనులెల్లరును జయజయధ్వానములు జేసిరి. సురవరులాకాశమునుండి పుష్పవృష్టి గురిపించిరి. సర్వజనులు రామదాసు ధన్యుడు, శ్రీ ద్వారకాధీశుని స్వాధీనము జేసి

కొనెనని యాతని కీర్తిని వేనోళ్ళగొనియాడుచుండిరి. అర్చకులు రామదాసునకు సాష్టాంగ నమస్కారము జేసి "భగవంతుడు నీకు స్వాధీనుడైయున్నా"డని చెప్పి యాతనియొద్ద ననుజ్ఞ దీసికొని తిరిగిద్వారకా క్షేత్రముజేరి యాలయమున నింకొక విగ్రహమును బ్రతిష్ఠించిరి. ద్వారకా క్షేత్రమునకుబోవు యాత్రాజను లిప్పటికిని ప్రథమమున 'డాకురా క్షేత్రమునకు బోయి శ్రీ కృష్ణు దర్శించి పిదప ద్వారకాక్షేత్రమును సేవించుచుందురు. రామదా సహర్నిశమును శ్రీ కృష్ణ భగవానుని సేవించుచు నఖండముగా హరినామమును జపించుచు నవసానమున భగవత్సన్నిధిని జేరెను.

ముప్పది యెనిమిదవ అధ్యాయము సమాప్తము.

శ్రీ కృష్ణ పరబ్రహ్మణే నమః

---

# నిరాధార బ్రహ్మచారి చరిత్ర

## —♦ ముప్పది యొమ్మిదవ అధ్యాయము ♦—

మధురా క్షేత్రమునందుగల పురాతనమూర్తి హరిద్వారమున స్థాపింపబడిన యీచరిత్ర యతి పావనమైనది. శ్రోతలారా! సావధాన చిత్తులై వినుడు.

ఒకానొక సమయమున పరమ పవిత్రమగు రామేశ్వర క్షేత్రమునకు శివరాత్రి మహోత్సవమును దర్శించుటకై యిరువురు బ్రాహ్మణోత్తములు పోయిరి. ఆ యిరువురును విరక్తులు పవిత్రులునై యుండి దివారాత్రములు ప్రేమతో భగవద్భజన జేయుచుండిరి వారిరువురును నొకసమయమున నొకరి విషయము నొకరు చెప్పుకొనుచుండిరి. అందొక బ్రాహ్మణోత్తముడు "నాకుటుంబము హరిద్వారము నందున్న"దని చెప్పెను. మఱియొకడు "నా జన్మస్థానము గౌడదేశము, జననీ జనకులును బంధువులు సఖులు నాకు భగవంతుడుతప్ప మరి యెవరును లేరు. నే నయోధ్య మాయా మధుర కాశీ యవంతికా ద్వారకాయును నీసప్త క్షేత్రములను సేవించి యచటికి వచ్చితిని. నన్ను నిరాధార బ్రహ్మచారి యందు"రని చెప్పగా బ్రాహ్మణోత్తముడగు కళ్యాణుడు సంతోషించి యొకరినొకరు స్నేహముతో తీర్థములు సేవించుచు దివారాత్రములును భగవన్నామ సంకీర్తనల నాత్మానాత్మ చర్చ జేసికొనుచు గొంత కాలమునకు మధురా క్షేత్రమునకు జేరిరి

కళ్యాణుడును, బ్రహ్మచారియు, యమునానదిలో స్నానము జేసి మాధవుని బూజించి త్రిరాత్రము లచ్చట వసించిరి. పిదప కళ్యాణున కచట శరీరమునందనారోగ్య మేర్పడుటచే మధురా క్షేత్రముననే యిరువురును వసించుచుండ బరోపకార స్వభావుడగు బ్రహ్మచారి కళ్యాణునకు సేవ జేయుచుండెను. చిత్తమందు భూతదయ లేనివానిని భక్తుడనినను, నాతనికి కల్పాంతము నందైనను భగవత్ప్రాప్తి లభింప నేరదు. బ్రహ్మచారి యట్లుకాక సత్యవాదియు, బరోపకారియు, భూతదయా పరుడై,

కళ్యాణుని కౌషధమును, సేవా పరిచర్యలను, నన్న పానీయములను, సకాలమున కేర్పాటు చేయుచు గారుమాసముల పర్యంత మాతని వెంట నుండి దివారాత్రము సర్వవిధముల నుపచర్యల జేయుగా నీశ్వర కృపచే కళ్యాణు డారోగ్యవంతుడాయెను. "నిరాధారుడవగు నీవు నాకాధారు డవై యుండి నన్నారోగ్య వంతునిగా జేసితివి. నీ యుపకారమునకు బ్రత్యుపకార మెన్ని జన్మలకైనను జేయలేను. కాంతా పుత్రులును స్వజనులను గృహము నందుండిరి. పరదేశమందు విష్ణుభక్తులగు మీరు నన్ను గాపాడితిరి. నా కష్టవర్ష ప్రాయముగల కన్యక యున్నది. దయ చేసి నా వెంట గృహమునకు విచ్చేసిన గన్యాదానము జేతు"నని కళ్యాణుడు జెప్పెను.

బ్రహ్మచారి "అయ్యా! నేను గృహస్థాశ్రమ మెప్పుడును నంగీక రింపను. సంసారము దుఃఖరూపమైనది. నన్నా దుఃఖమునం దేల బడ వేసెద" రని చెప్పగా గళ్యాణుడు "సంసారబాధ మీ కేముండును. భారమంతయు హృషీకేశునిపై వేయుడు. పుణ్యవంతమగు మధురాక్షేత్ర ములో మీ రంగీకరించినచో భగవంతుని సముక్షమున కన్యాదానము జేసెద" నని చెప్పగా "మీరు వృద్ధులు, తీర్థయాత్రాపరులు. ఇంటికి పోయిన పిదప మీభార్య మీమాట వినునా? నేను వివాహము జేసి కొనుట కంగీకరించి మీకు వాగ్దానము జేసినచో బిదప వివాహము కానియెడల జన్మ వృధాయగును. బ్రహ్మచర్యమునుగాక, గృహస్థాశ్ర మమునుగాక మధ్యస్థుడనగుదు" నని చెప్పగా గల్యాణుడు "శ్రీకృష్ణుని సాక్షిగా నీకు కన్యాదానము జేసెద" నని చెప్పెను. ఇరువురును మహా ద్వారమున బ్రవేశించి శ్రీకృష్ణభగవానునికి వందనములను జేసిరి. బ్రహ్మచారిని గూర్చుండబెట్టి కళ్యాణుడు "నా కన్యకను బ్రహ్మచారి కర్పించితి" నని భగవంతుని సముక్షమునం దుదకధార విడచి బ్రహ్మ చారిని జూచి 'భగవంతుని సాక్షిగా నా కన్యకను నీకు ధారాదత్తము జేసితిని. గృహమున కేగిన పిదప వివాహము జేసెద" నని చెప్పెను.

బ్రహ్మచారియు, కల్యాణుడును శ్రీకృష్ణునియొద్ద నాజ్ఞ దీసికొని యచటనుండి బయలుదేరి మూడు దినములకు గృహమున ప్రవేశించిరి. వృద్ధుడగు కల్యాణుని దారపుత్రులు పరామర్శింపక మౌన మవలంబించిరి. సర్వసుఖము లున్నప్పుడు బంధువులును, భార్యయు, మిత్రులును గౌరవింతురు. వృద్ధాప్యమున నశక్తతయు, ద్రవ్యహీనతయు దటస్థించినచో నందరును దూరమగుదురు. పిదప కల్యాణుడు భార్యను బిలచి "తీర్థక్షేత్రముల సేవించుచు మధురాక్షేత్రము జేరువర కాకస్మికముగ మధురాక్షేత్రమునందు వ్యాధి సంప్రాప్తించినది.) ఆరుమాసము లా క్షేత్రమున వ్యాధిచే బీడింపబడితిని. దైవయోగమువలన నీ బ్రహ్మచారి సాంగత్యము లభించినది. ఈ మహాత్ముడు నా కన్నివిధముల నుపచారములను జేసి యారోగ్యవంతునిగా జేసెను. పరదేశమునందు సకాలమున కౌషధమును, బథ్యమును మిగుల శ్రద్ధతో సీత డీయనిచో నన్నచ్చట రక్షించువా రెవరు? ఈ మహాత్ముని యుపకారమునకు బ్రత్యుపకార మేమిచేసినను దీర" దని చెప్పగా "అచ్చట మరణించిన సుకృతమైనను నుండును, ఇచటికి మమ్ముల నుద్ధరించుటకై వచ్చితివా?" యని యాతని భార్య యడిగెను. అంత కల్యాణుడు "ఆయువు తీరనిదే మరణింపదలచినను మృత్యు వాసన్నముకా" దని పలికెను. ద్వారము వెలుపల బరుండి బ్రహ్మచారి దంపతుల సంవాదమును వినుచుండెను.

కల్యాణుడు భార్యను బిలచి "పుణ్యవంతమగు మధురాక్షేత్రమందు భగవంతుని సమక్షమున బ్రహ్మచారికి మన కన్యకను ధారాదత్తము జేసితి" నని చెప్పగా నా యువతి "మీరు ద్వితీయవివాహము జేసికొని పుత్రికను బడసి యాతనికిచ్చి పెండ్లిచేయు" డని చెప్పగా కల్యాణుడు "హరిభక్తులకు కన్యాదానము జేసిన నమితపుణ్యముండును. నా వచన మంగీకరించు" మని చెప్పెను. ఆ యువతి భర్త వచనములను విని కన్యను భావిలో బడవేసి చంపెదను. లేనిచో నవివాహితగా నుంచెదను. కాని నా జీవితములో హరిభక్తుల యింటికిమాత్రము నా

కన్యక నీయు" నని చెప్పగా కల్యాణుడు కుమారుని విచారింప నాత డును, తండ్రిమాటలను నిరాకరించెను.

మరునాడు కల్యాణుడు బ్రహ్మచారిని వెంటబెట్టుకొని రాజసభకు బోయి రాజునకు విషయమంతయును దెలిపి "ఓ రాజా! నా సంకల్పము వృధాయైనది. నేను నరకమునకు బోవలసివచ్చును. నే నీ బ్రహ్మచారికి కన్యకను మధురాక్షేత్రములో భగవంతుని సమక్షమున ధారాదత్తము జేసితిని. నా భార్యయు, గుమారుడును, నంగీకరించుటలేదు. కాన మీరు వారిని రప్పించి విషయమును దెలిసికొని యెట్లయినను బ్రహ్మచారికి నాచే కన్యాదానము జేయింపు" డని కోరెను.

రాజు బ్రహ్మచారిని విచారించి విషయమును దెలిసికొని "నీవచ నములందు నాకు విశ్వాసము కలుగుటలేదు. నీకు కళ్యాణుడు ధారా దత్తము జేసినప్పుడు సాక్షు లెవరున్నా"రని యడుగగా నిరాశ్రయుడగు బ్రహ్మచారి రాజునుజూచి "ఓరాజా! వైకుంఠాధిపతియు, ననంతకోటి బ్రహ్మాండ నాయకుడును, బురాణ పురుషుడును, మధురావాసియు, శ్రీ రుక్మిణీరమణుడగు కృష్ణుడున్నా"డని చెప్పెను. పిదప నారాజు బ్రహ్మచారినిజూచి "అయ్యా! మధురా నివాసియగు శ్రీ కృష్ణు నిచటికి దీసికొని వచ్చి నా యెదుట సాక్ష్యము చెప్పించినచో గన్యాదానమున కేర్పాటు నేనే జేయించెద"నని చెప్పగా బ్రహ్మచారి యందుల కంగీ కరించి సాక్ష్యము జెప్పుటకై మధురానాథు నిచటికి దీసికొని వచ్చెద" నని చెప్పెను.

బ్రహ్మచారి తత్క్షణమే యచటనుండి బయలుదేరి మూడు దిన ములునడచి మధురాక్షేత్రమును జేరి శ్యామసుందరుడగు మధురా నాథుని జూచి "ఓ అనంతా! దేవాదిదేవా! సాక్ష్యము జెప్పుటకు నావెంట రాజసభకు రమ్ము. లేనిచో నా బ్రహ్మచర్యవ్రతము వృధా యగు"నని చెప్పెను. పిదప శ్రీ కృష్ణభగవానుడు బ్రహ్మచారిని జూచి "అర్చావతారమునందున్న నేనచటికెట్లు రావలయు"నని యడుగగా



నిరాధార బ్రహ్మచారికొరకు సాక్ష్యము చెప్పుటకు
శ్రీ కృష్ణుడు మధురనుండి వచ్చుట.

బ్రహ్మచారి "ఓ కృపావంతా, జగధీశ్వరా! నాకెవ్వరు నాశ్రయము లేరు. నీవే నా కాశ్రయము. త్వరితముగ నడువుము. నీవెట్లు మాటాడు చుంటివో అట్లే రమ్మ"ని చెప్పెను. భగవంతుడు బ్రహ్మచారి వచనములువిని హర్షచిత్తుడై బ్రహ్మచారి వెంట సాక్ష్యము జెప్పుటకై బయలు దేరెను.

మధురానాధుడు నిరాధార బ్రహ్మచారితో "నీవు మాత్రము వెనుకకుదిరిగి చూడరాదు. నేను నీవెనుకనే నడచుచుండెదను. నీవు వెనుకకు దిరిగి చూచిన నాస్థలమందే నేను నిలిచి పోయెద"నని చెప్పి భగవంతుడు బ్రహ్మచారి వెనుక నడచుచుండెను. దేదీప్య మాన తేజోవంతుడును, దివ్యాలంకారుడును నగు జగజ్జీవనుడు నడచుచుండ నాతని పాదములకుగల నూపురములు ఘల్లు ఘల్లు మని ప్రతి ధ్వనించుచు నా రాత్రియంతయు నడచి జగన్నివాసు డొక మైలుదూరమున నగర ముండగా బ్రహ్మచారి వెనుకయయ్యెను. బ్రహ్మచారి భగవంతుని శోభా ప్రకాశము కనబడనందునను, నూపురముల శబ్దము వినబడనందునను జింతించి వెనుకకు దిరిగి జూడగా మధురానాధు డచటనే దేదీప్యమాన మగు ప్రకాశముతో నిలువబడి "నేను నీతో బ్రధమమున వెనుకకు దిరిగి చూడకుమని చెప్పియుంటిని. నే నిచటినుండి వచ్చుటకు వీలులేదు, కాన రాజు నిచ్చటికే దీసికొనిరమ్మ"ని చెప్పెను.

నిరాధార బ్రహ్మచారి రాజసభలో బ్రవేశించి "ఓ రాజా! అంబరీషుని దుర్వాసు డవమాన పరుపగా నాతనిని రక్షించిన భగవంతుని, రావణ కుంభకర్ణాది రాక్షసుల సంహరించిన వానిని, గోకులమున బ్రతి గృహమందు జౌర్యము చేయుచుండ యశోదాదేవి బంధించిన వానిని, కంస చాణూరాదులను మర్దించి యుగ్రసేనునకు రాజ్యాభిషేకము జేయించినవానిని దుశ్శాసనుడు ద్రౌపది నవమాన పరుపబోవ నామె కనంతముగ వస్త్రము లనుగ్రహించిన శ్రీ రుక్మిణీపతిని సాక్ష్యము

జెప్పుటకు దీసికొనివచ్చితి” నని చెప్పగా రాజసభయందు సర్వజనులును నాశ్చర్య చకితులైరి. పిదప రాజు, కాంతను, బరివారమును వెంటబెట్టు కొని మంగళ వాద్యములతో వైష్ణవులు హరినామ సంకీర్తన జేయు చుండ కళ్యాణుడును, గ్రామప్రజలును కౌతుకమును జూచుటకై వెంబ డింప బ్రహ్మచారివెంట నగరము వెలుపల వరకుబోయి చతుర్భుజుడును శ్యామల వర్ణుడును, రత్నఖచిత కనక కిరీటధారియు, మకరకుండల విరాజ మానుడును, పీతాంబర ధారియునగు భగవంతుని జూచి రాజును సర్వజనులును, నానందాబ్ధి నోలలాడిరి. రాజచ్చటగల సాధువులను జూచి “మీరు మధురా క్షేత్రము బోతిరిగదా ఆ క్షేత్రమునగల దివ్య మంగళ విగ్రహ మిదేనా?” అని విచారించ. సాధుజను లిదియేయని పలి కిరి. నిరాధార బ్రహ్మచారి మధురానాధునికి సాష్టాంగ నమస్కారము జేసి “ఓ రుక్మిణీకాంతా! కళ్యాణుడు నీ సమక్షమున నాకు కన్యకనిచ్చి వివాహము జేయుటకు ధారాదత్తము జేయలేదా?” అని యడుగగా శ్రీకృష్ణ భగవానుడు రాజును, సర్వజనులును జూచుచుండ “నాయె దుట కల్యాణుడు కన్యకను బ్రహ్మచారి కర్పించె”నని చెప్పెను.

రాజు నగరవాసులను బిలచి, కల్యాణుని కుమార్తెకు కన్యా దానము జరిపించుటకు దగునేర్పాటు చేయుడని యాజ్ఞాపించెను. పిదప నిరాధార బ్రహ్మచారి వైపున రాజుండి, వైభవోపేతముగ వివాహ మం టపము నేర్పరచి, నానావిధములగు వాద్యములతోను దేవబ్రాహ్మణుల తోను నతివైభవముగ భగవంతుని సమక్షమున బ్రహ్మచారికి కల్యాణు నిచే గన్యాదానమును జేయించెను. దేవత లెల్లరును పుష్పవృష్టి గురి పించు చుండిరి. పురోహితులు మంగళాష్టకములను బలికి “సావధాన” వచనములు జెప్పుచు “మధురా నివాసియగు శ్రీకృష్ణుడు వధూవరుల రక్షించుగాక!” అని యాశీర్వదించిరి. మహా వైభవముగ వివాహ

మహోత్సవము పూర్తియయ్యెను. భగవంతుడు భక్తులయందు గల వాత్సల్యమును ప్రకటించుటకై నానావిధములగు విచిత్రములను జేయు చుండునని సర్వజనులును బలుకుచుండిరి. నిరాధార బ్రహ్మచారి వెంట సాక్ష్యము జెప్పుటకై విచ్చేసిన మధురానాథు డచ్చటనే వసించి యున్నాడు. పిదప మధురాక్షేత్రమునందు నూతనముగ మూర్తి స్థాపింప బడెను. పశ్చిమ దేశమునందు ద్వారకా క్షేత్రమునను నుత్తరమున హరిద్వారమునందును, దక్షిణదేశమున పంఢరీ క్షేత్రమునను, తూర్పున జగన్నాథమందును, భగవంతుడు విరాజమానుడై భక్తులకొరకు నానా విధములగు లీలలను జూపుచున్నాడు.

ముప్పది తొమ్మిదవ అధ్యాయము సమాప్తము

భక్తవరదాయ నమః

---

# సురదాస చరిత్ర

—• నలుబదియవ అధ్యాయము •—

శ్రోతలారా! కలియుగమునందు మహాభక్తుడగు సురదాసు చరిత్ర యతి విశిష్టమైనది. సావధానముగా శ్రవణము జేయుడు.

పరమ పవిత్రమగు శ్రీ ద్వారకా క్షేత్రమునందు సత్యభామ మందిరమున శ్రీకృష్ణభగవానుడు లేనిసమయమున నాకస్మికముగ భక్తుడగు నక్రూరు డచ్చటి కరుదెంచెను. సత్యభామ యాతనిని గౌరవించి యుచితాసనమున నధిష్టింపజేసి నిర్లజ్జతో "శ్రీకృష్ణుడు నా మందిరమున కిప్పుడు వచ్చుట చాలా యరుదైనది. కాన నీవు వారికి దెలిపి విశేషముగా నాయొద్దకు వచ్చునేర్పాటు జేయుము. నేను భగవంతుని వియోగమును సహింపజాలను. నీకు శ్రీకృష్ణుడు స్వాధీనుడై యున్నాడు. నీ వలన నీ కార్యము నెరవేరవలయును, ఈ విషయము నితరులకు దెలుపకుము. త్వరితముగ బోయి నీ కార్యము బూర్తిచేయుము. పదహారువేల గోపికల యంతఃపురములలో వసించుచు రుక్మిణీ మందిరమున సర్వకాలములయందు వసించుచున్న శ్రీకృష్ణభగవానుని ద్వరితముగా నాయొద్దకు బంపు"మనిచెప్పగా నక్రూరుడు విచారించి "భగవంతుడు రానిచో సత్యభామ యపశబ్దములతో నిందించు"నని తలచి యక్రూరుడు శ్రీ కృష్ణుని రూపము దాల్చెను. ఇంతలో సాక్షాత్ శ్రీ కృష్ణభగవాను డచటకు వచ్చి నిలుచుండి "ఏమి యాలోచించుచుంటివి. నేను లేని సమయమున గపటముగ నారూపము ధరించితివి". కావున నో యక్రూరా! కలియుగమున నీవంధుడవై జన్మింతువుగాక!' యనిశపించి, సత్యభామను జూచి "నీవు కలియుగమున దాసివై జన్మింతువుగాక!" అని యిరువురను శపించెను.

భగవంతుని పలుకులువిని యక్రూరుడు "నీవు సాక్షాదాత్మారాముడవు. నాయాంతర్యము నీకు దెలియును, నీవుత్వరితముగ రానిచో సత్యభామ విలపించును. ఆమె నూరడించుటకై యో జగజ్జీవనా! నీ

రూపమును ధరించితి”నని చెప్పగా భగవంతు డక్రూరుని జూచి “విషయ మంతయు నాకు దెలియును. నీవు కలియుగమున పామరజనుల నుద్ధరింప వలెను. బాహ్యముగ నిన్ను శపించితిని. నా యాంతర్యమున నీపై నాకే మియు గోపము లే”దని చెప్పగా, నక్రూరుడు “నీయాజ్ఞప్రకారము నేను జన్మింతును. కాని నాకు నీవా సమయమున దర్శన మీయవలయు”నని కోరెను.

మధురాక్షేత్రమున నక్రూరుడు భక్తశ్రేష్ఠుడై సురదాసను నామముతో అంధుడై జన్మించి దివారాత్రము నాసన, భోజన, శయన ములందును, భగవంతుని జింతించుచు యోగభ్రష్టుడగుటచే పూర్వ స్మరణగలవాడై యుండెను. అతడు నిత్యనియమముతో గీతములు ప్రబంధ రూపమున గవిత్వము జెప్పుచు, పురుషోత్తముని బ్రార్థించుచుండెను.

ఒకనాడు సురదాసు మధురానాధుని సేవించుటకై యాలయము నకుబోయి మహాద్వారములో సాష్టాంగ నమస్కారముజేసి చేతులు జోడించి, భగవంతుని సమక్షమున నిలువబడి ప్రేమతో “ఓ పతిత పావనా, శ్రీకృష్ణా, మనోమోహనా, జగజ్జీవనా, గోవిందా, నన్నేల శపించితివి? కృష్ణావతారమున నేనక్రూరుడనై యుండి నీ కొక యప చారము జేసినటుల నా మనస్సు సాక్ష్యము జెప్పుచున్నది. నిన్ను దీసి కొని వచ్చుటకై కంసుడు గోకులమునకు నన్ను బంపగా యశోదాదేవికి బహుకష్టము కలిగెను. నిన్ను నావెంట దీసికొనిపోవుచుండగా నామె విలపించెను. గోకులమున గల సర్వజనులును నా సమయమున జింతా క్రాంతులైరి. గోపికలు దీర్ఘస్వరముతో విలపించుచు శ్రీకృష్ణుని మాకు దానముగా నీయుమని కోరిరి. వారెల్లరును రథమున కడ్డముగా వచ్చి విలపించుచు నన్ను నానావిధముల బ్రార్థించుచుండ నేను వారి ప్రార్థన నిరాకరించితిని. అందుచే నీవు నన్ను శపించితివి. నేను సత్యభామ గృహ మున ని రూపమును ధరించుట మాత్రము దోషముకాదు. నీవేసాక్షివి. నిజానిజములను మాత్రము తెలిసికొనుము. గోకులమునందు మాత్రము

యదార్థముగ నపరాధము జేసితి"నని సురదాసు డశ్రుధారలను విడచెను.

సురదాసు దీనాలాపములను విని శ్రీకృష్ణభగవానుడు సాక్షాత్కరించి సురదాసునకు నేత్రముల ననుగ్రహించెను. చతుర్భుజయుక్తుడై, శంఖచక్రగదా పద్మద్యాయుధములను ధరించి, కనక కిరీటమును మకరకుండలములును, వైజయంతీవనమాలయు, కౌస్తుభమణియును, దివ్యపీతాంబరములును ధరించి కోటిసూర్యప్రకాశమానమగు శోభతో దనయెదుట నిలువబడియున్న భగవంతుని సురదాసుజూచి యమితానంద భరితుడై సాష్టాంగ నమస్కారముజేసి యాలింగనముజేసికొనెను. భగవంతుడు సురదాసును కృపాదృష్టితో జూచి వలయు వరము వేడుమనగా సురదాసు చేతులుజోడించి, "ఓ లక్ష్మీకాంతా! నేను పూర్వము వలె నంధుడనై యుండవలయును. నా హృదయమున నీ రూపము నిలుపుకొంటిని. నేనాజన్మము నేవిషయపదార్థమును జూచియుండలేదు. ఈ నేత్రములతో నీ రూపమును మాత్రమే జూచితి. నీరూపమును జూచిన ఈ నేత్రములతో దిరిగి ప్రపంచమును జూచుట కెంతమాత్రము నిచ్ఛలే" దని చెప్పగా భగవంతుడు హసితవదనుడయ్యెను. పిదప సురదాసు శ్రీహరిరూపమును మనమున నిలుపుకొని యహర్నిశము హరి నామ సంకీర్తన జేయుచుండెను.

అవంతీ నగరమున బుణ్యపురుషుడగు నొకరాజుండెను, ఆతని యొద్ద నైదువందలమంది గాయకులుండిరి. వారలలో సంగీత విద్యయం దతి ప్రవీణుడు 'తాన్‌సేన్' అను నత డుండెను. ఒకనాడు రాజు తాన్‌సేన్‌నుజూచి నీతో సముడగు గాయకు డెచ్చటను గన్పడలేదని చెప్పగా తాన్‌సేన్ "రాజా! తామట్లు పలుకకుడు, భగవంతు డొకరిని మించిన వారిగా మరియొకరిని సృష్టించెను. బ్రహ్మదేవుడు నేనే సృష్టికర్తనని గర్వముతో నుండగా భగవతుడు విశ్వామిత్రుని సృష్టించెను. సముద్రుడు నేను చాలా గొప్పవాడనని యభిమానముతో నుండగా నగస్త్యునిచే

సముద్ర నాచమనము జేయించెను. నాకంటె గొప్పవిరులు లేరని హను మంతు డభిమానముతోనుండ భరతుడు వాని గర్వ మణచెను. కాబట్టి ఓ రాజా! నన్ను గొప్పగా మీరు పొగడుట యు క్తముగాదు. భగవం తుడు నన్ను మించిన గాయకుల నెందరినో సృష్టించె"నని బలుకగా రాజు సంతోషించెను.

ఒకనాడు రాజు తాన్‌సేన్‌నుజూచి "ప్రస్తుత మీ సృష్టియందు నీకంటె గొప్పగాయకు లెవరైనా నున్నారా? చెప్పు"మని యడుగగా తాన్‌సేన్ "ఓ రాజా! లేకేమి! గాయకులలో నతి ప్రవీణుడును, నక్రూ రావతారుడును నగు సురదాసను మహాభక్తుడు మధురా నగరమున గల"డని చెప్పెను. రాజాతనిని జూచి సురదాసెన్ని రాగముల నాలా పించునని యడుగగా తాన్‌సేన్ రాజుతో, ఓరాజా! గంగాతీరమునం దిసుక రేణులను లెక్కించుట కెట్లు సాధ్యము గాదో, యటులనే సుర దాసాలాపన జేయు రాగములను లెక్కించుటకు సాధ్యము" కాదని చెప్పెను. రాజమితానందముతో భటులను బిలచి మీరు పల్లకిని దీసి కొనిపోయి సురదాసును దీసికొని రండని యాజ్ఞాపించెను. రాజాజ్ఞ ప్రకారముగా భటులు సురదాసును పల్లకీలో గూర్చుండ బెట్టుకొని దీసికొని వచ్చిరి.

రాజు సన్మాన పూర్వకముగా సురదాసునకు సాష్టాంగ నమ స్కారము జేసెను. సభామంటపమున గనకాసనము నేర్పాటు జేసి. దానిపై సురదాసు నధిష్ఠింపజేసి తనయొద్దనున్న యైదువందల గాయకు లను రప్పించి గాన సభనేర్పాటు జేసెను, తాన్‌సేన్ సురదాసునకు వందనములుజేసి "అయ్యా! మీ వాక్కునుండి భగవంతుని లీలావైభవ కీర్తనలను వినవలయునని రాజుగారును, గాయకులును, సర్వజనులును గోరుచున్నారు. కాన వారి కోరికను నెరవేర్పు"డని ప్రార్థించెను. సుర దాసు తాన్‌సేన్ ప్రార్థనకు లోబడి "అయ్యా! నేను వైకుంఠమునుండి భూలోకమున భగవంతుని గుణకీర్తనలను వర్ణించుటకై జన్మించితిని.



సూరదాసు చేయుచున్న గానమును శ్రీకృష్ణుడు శ్రవణము జేయుట.

మీరును నదేకోరియున్నారు. మీ కోరిక ననుసరించి కొలది కాలము మాత్రము యథాశక్తిని భగవద్గుణములను వర్ణించెన"నని తంబురను మీటుచు స్వరయుక్తముగ గానము జేయుచుండెను. విఘ్నేశ్వరు డా సమయమున సురదాసున కెదురుగ గూర్చుండి తాళము వేయుచుండెను. సరస్వతీదేవి వీణను వాయించుచు మంజులనాదము జేయుచుండెను. గంధర్వులును, రంభ, ఊర్వసి, మేనకలును దటస్థముగ గూర్చుండి శ్రవణము జేయుచుండిరి. రమానాయకుడు నానంద నృత్యము జేయుచుండెను. భగవద్భక్తికై యోగీశ్వరులు వజ్రాసనమున గూర్చుండియుండ మునీశ్వరులు తపమొనర్చుచుండ భగవంతుడు వారలను త్యజించి మహా భక్తుడగు సురదాసు కీర్తనలో నృత్యము జేయుచుండెను. ఇంద్రుడును, చంద్రుడును, బ్రహ్మయును, నే భగవంతుని మహిమ విశేషములను దెలిసికొన జాలరో యాతడు సురదాసున కెదురుగ నృత్యము జేయుచుండెను.

సురదాసు సంగీతమునకు రాజును, గాయకులును, నచట ప్రజలును మోహితులై యాతని విడువకుండిరి. అవంతీ నగరమున సురదాసొక్క నెలదినములుండి యా పురవాసులందరిని హరినామ సంకీర్తనాసక్తులనుగా జేసెను. ఒకనాడు రాజు తనమందిరమున నుండగా నాతని యంతఃపురస్త్రీలు మహాభక్తుడగు సురదాసు వర్ణించు భగవత్కీర్తన వినవలెనని మాకు కోరిక యున్నదని చెప్పగా రాజంతఃపుర కాంతలైదు వందల మందితో "సురదాసంధుడు. ఆతనిని దీసికొని వచ్చుట కేవిధమగు సందియము లేదని" చెప్పి అంతఃపుర స్త్రీలను నాటకశాలయందు గూర్చుండ నియమించి సురదాసు గొయొద్దకువచ్చి యనన్య భావముతో నమ్రుడై "మహాత్మా! అంతఃపుర కాంతలు తమగానమును వినవలెనని కుతూహలులై యున్నారు. వారి కోరికను దీర్పు"డని ప్రార్థించెను.

రాజు కోరిన ప్రకారము సురదాసు గానము జేయుచుండెను. అంతఃపుర కాంతలెల్లరును దటస్థముగా దేహభ్రాంతిని మరచి యాగా

నములో లీనమైరి. సత్యభామయు యా రాజభవనములో దాసియై యుండెను. ఆమెయు నంతఃపుర కాంతలతో సహా సురదాసు గానము నాకర్ణించుచు దేహభ్రాంతి విరహితురాలెయ్యెను. సుందర నాదమును విని లేళ్ళు యరణ్యమున దేహభ్రాంతిని విడచి యానాదములో లీనమై యాకర్షింప బడునట్లు సర్వస్త్రీలును సురదాసు గానములో లీనులైరి దాసీరూపముగనున్న సత్యభామ పాదముదీసి మరల నడుగు వేయుటకు జలస్థలము లను భావమును గ్రహింపక యద్వైత స్థితి బొందియుండెను. సురదాసున కా సమయమున భగవంతుని కృపచే నేత్రములు వచ్చెను. ఆతడు దాసీరూపముగనున్న సత్యభామనుజూచి జాగ్రత్తగా నడువుమని చెప్పగా సర్వస్త్రీలును లజ్జితులై 'పర్దా' వేసికొని యీతనికి నేత్రము లున్నవని యొకరి కొకరు చెప్పుకొనుచుండిరి. తత్ క్షణమే శ్రీ కృష్ణ భగవానుడు సాక్షాత్కరించి సురదాసు రూపముననున్న యక్రూరుని, దాసీ రూపములోనున్న సత్యభామను దనలో లీనము జేసికొనెను.

నలుబదియవ అధ్యాయము సమాప్తము.

అపరాధక్షమాపణ నమః.

# సేనాన్హావి చరిత్ర

—♦ నలుబదియొకటవ అధ్యాయము ♦—

మహాభక్తుడగు సేనాన్హావి సచ్చరిత్ర కర్ణములకు ప్రియకరమై యుండును. భావుకజనులారా! సావధానముగా శ్రవణము జేయుడు.

అవంతీనగరమున నాపితకులమునందు సేనాన్హావి యను భక్తుడు జన్మించెను. ఆతడు గృహస్థాశ్రమమున నుండి సూర్యోదయాత్పూర్వమే నిద్రనుండి లేచి స్నానమాచరించి విష్ణుపూజ జేసికొని పిదప ఆతని కుల వృత్తియగు క్షురకర్మ జేయుచు తన్మూలముగ వచ్చు ద్రవ్యముతో నతిథ్యభ్యాగతుల నాదరించుచు సంసారము నాశవంతమైనదని గ్రహించి యుదాసీనవృత్తితో బ్రవర్తించుచుండెను

ఒకనాడు సేనాన్హావి ప్రాతఃకాల సమయమున భగవంతుని బూజ చేయుచుడంగా రాజదూతలు వచ్చి రాజునకు క్షౌరము జేయుటకై పిలచుచున్నారని యాతని భార్యతో జెప్పిరి. ఆ యువతి భర్తకీ వృత్తాంతమును దెలుప నాతడు గృహామున లేడని చెప్పుమని భార్య కాజ్ఞాపించెను. ఆ యతివ రాజభటులతో దననాధు డింట లేడని చెప్పెను. ఇరుగు పొరుగుల నున్న దుర్జనులు రాజమందిరమునకు బోయి "ఓ రాజా! సేనాన్హావి యింటిలోనుండియు లేడని భార్యతో బలికించెను. ఆతడు గృహామునందే పూజ జేయుచున్నా" డని పలికిరి. రాజభటులప్పుడే వచ్చి రాజుతో "ప్రభూ! సేనాన్హావి గృహామునకు నాలుగు పర్యాయములు పోయి విచారించిన నాతని భార్య యింట లేడని చెప్పె" నని యెఱింగించిరి.

దుర్జనుడగు నా తురకరాజు క్రోధముతో మర్కటము సురాపానము జేసినపిదప దేలుకుట్టిన దాని స్థితి యెట్లుండునో, యట్లు దన భృత్యులను బిలచి సేనాన్హావిని మూటగా గట్టి నదిలో బారవేయుడని యాజ్ఞాపించెను. తత్క్షణమే భక్తాభిమానియగు భగవంతుడు సేనాన్హావిరూపమును ధరించి రాజసభలో బ్రవేశించెను.

ఆదిపురుషుడును, నారాయణుడును, క్షీరసాగర నివాసుడును, శేషశయనుడును, బ్రహ్మాదిదేవతలచే స్తవనీయుడును, ఋషులచే నారాధనీయుడును నగు యోగీశ్వర హృదయరమమానుడు సేనాన్హావి రూపమును ధరించి మంగలిపొదిని చేతబుచ్చుకొనెను దశేంద్రియము లకును, బుద్ధికినీ, మనస్సునకును, ప్రేరణకర్తయగు విశ్వవ్యాపకుడు కిరీట కుండలములను, కౌస్తుభమణీ మూల్య పీతాంబరములను త్యజించెను. వేదశాస్త్రముల కగోచరుడును, వైకుంఠవాసియు నగు భగవంతుడు మంగలివేషమును ధరించి పొదిని చేతబట్టెను.

సేనాన్హావిరూపమున నున్న భగవంతుని జూచిన మాత్రముననే యవింధరాజునకు గల క్రోధమంతయు నగ్నిలో జలము వేసిన జల్లారు నట్లు తొలగి శాంతచిత్తముతో సేనాన్హావిని దగ్గరకు బిలచి గూర్చుండ బెట్టుకొని క్షౌరము జేయించుకొనుచుండెను. జగజ్జీవనుడు పరమ చాతు ర్యముతో క్షురకర్మ జేయుచు. శిరమునకు తైలము మర్దన జేయుచుండ రాజు హర్షచిత్తుడై "సేనాన్హావీ! నాపితజాతిలో నీవు మిగుల చతురు డవుగ గనబడుచున్నావు. నిన్ను సర్వకాలములందును నా సమక్షమునం దుంచుకొనవలెనని కోరిక యున్న" దనగా శ్రీ రుక్మిణీకాంతుడు "నేను బ్రహ్మాండమంతయును వ్యాపించియున్నాను. నేను లేని స్థల మణుమాత్ర మైనను లేదు. వచ్చుటయు, బోవుటయు, జేయుటయు, నుండుటయు నాలో లేవు. ప్రతి కార్యము జేయుచుండియు, నకర్తనై సర్వవ్యాపకు డనై యున్నాను. నిజభక్తులకార్యార్థమై నేనొకక్షణము సగుణరూపము ధరించితి" నని చెప్పగా రాజు సంతోషించి యభ్యంగన స్నానమున కేర్పాటుచేయించి తానొక కుర్చీలో గూర్చుండి సుగంధ తైలపాత్రను క్రింద నుంచెను.

భగవంతుడు రాజునకు వెనుకభాగమున నిలువబడి యాతని శిర మునకు తైలము మర్దనము జేయుచుండెను. అవింధరాజు విలోకించగా నా తైలపాత్రలో దనకు తైలము మర్దనము జేయుచున్న సేనాన్హావి




సేనాన్హావి పూజయందుండగా భగవంతుడు సేనాన్హావి రూపముతోఁబోయి

నవాబునకు క్షౌరముజేయుట

రూపుడగు భగవంతుడు విరాజమానమగు కిరీటమును, మకరకుండలము లను, సమాల్య పీతాంబరములను ధరించి ఘనశ్యామవర్ణుడై దర్శన మిచ్చెను. రాజాశ్చర్యచకితుడై శిరమును పైకెత్తి చూడగా సేనాస్వామి తైలమును మర్దనము జేయుచుండెను. తిరిగి తైలపాత్రను జూడ నందు శ్రీకృష్ణరూపమున గనబడుచుండెను. తత్క్షణమే యా రాజు దేహ భ్రాంతిని విడచి భగవంతుని రూపములో లీనుడై విడువక తైలాభ్యంగ మును జేసికొనుచుండ సభాజనులు నవ్వుచుండిరి. సేవకజనులు రాజును జూచి "అయ్యా! వేళ యతిక్రమించినది త్వరితముగా స్నానమునకు లెం"డని చెప్పగా రాజు దేహభ్రాంతికి వచ్చి సేనాస్వామిరూపమున నున్న భగవంతునితో "ఒక క్షణముసేపు గూర్చుండుడు. మీ రిచట నుండి పోయినచో నేను ప్రాణములను విడతు" నని చెప్పెను. భగవం తుడు రాజును జూచి "ఓ రాజా! నే నిప్పుడే తిరిగివచ్చెదను. నా రూప మును హృదయమున నిల్పుకొ"మ్మని చెప్పగా రాజు సువర్ణమును, ద్రవ్యమును దోసిలితో దీసికొనివచ్చి సేనాస్వామియొడిలో వేసెను. తత్ క్షణమే భగవంతుడు రా జిచ్చిన ద్రవ్యమును బొదిలో వేసి పొదిని సేనాస్వామి గృహములో బెట్టి యంతర్ధానుడయ్యెను.

అవింధరాజు స్నానముజేసి సేవకులను బిలచి "సేనాస్వామిని దత్ క్షణమే బిలచుకొనిరండు. ఉపచారము లందును, వస్త్రభూషణము లం దును నాకిచ్చలేదు, మృష్టాన్నములును, నానావిధములగు సుగంధ పరి మళ ద్రవ్యములును, నా కవుసరము లేదు. విలంబన జేయక త్వరితముగ సేనాస్వామిని దీసికొనివచ్చి దర్శన మిప్పింపు"డని చెప్పెను. రాజు వచన ములను విని భటులు గాబరాపడుచు సేనాస్వామి గృహమున బ్రవేశించి యాతనిని జూచి "తమ దర్శనమునకై రాజుగారు నిరీక్షించుచు వెంట దీసికొని రమ్మని మమ్ము బంపి"రని చెప్పగా రాజభటులనుజూచి సేనా స్వామి రాజు నాపైకోపముగ నున్నాడా యని విచారించుచు త్వరితముగ రాజసభకు జేరెను.

సేనాన్హావిని జూడగనే రాజు నిలువబడి చేతులుజోడించి సాష్టాం గనమస్కారము జేయగా సభలోని జనులెల్లరును బకబకి నవ్వుచు చిత్ర ప్రతిమలవలె జూచుచుండిరి. పిదపరాజు "ఓ సేనాన్హావీ! ప్రాతః కాలమున నీవు నాశిరమునకు తైలము మర్దనజేయుచు, తైల పాత్రలో జూపిన చతుర్భుజ రూపమును జూపుమని యాతని రెండు చరణము లను బట్టుకొనెను. సేనాన్హావి విస్మిత మనస్కుడై నేనుదయము దేవ పూజలో నుంటిని. రాజుదయము నేను తైలపాత్రలో జూపిన చతుర్భుజ రూపమని చెప్పుచున్నాడని పరి పరి విధముల నాలోచించి, తైలపాత్రను దెచ్చి, రాజునొద్దనుంచి, తాను వెనుకభాగమున నిలుచుండి రాజుశిరము పై మర్దన జేయుచుండెను. అవింధరాజు శిరమువంచి తైలపాత్రమును జూచుచుండ నందు సేనాన్హావి రూపము గనబడుచుండెను. కాని చతు ర్భుజ రూపము కనబడుటలేదు. రాజు సేనాన్హావినిజూచి నీ చతుర్భుజ రూపమును నాకు జూపుమని యడుగగా సేనాన్హావి పరవశుడై యశ్రు ధారలు విడుచుచు, భగవంతుడే తన రూపమున వచ్చి రాజునకు క్షౌరం ముజేసెనని భావించి "ఓ దీనబంధూ, పతితపావనా, వైకుంఠవాసా, నారాయణా, అనాథనాథా. రుక్మిణీవరా, మదనపితా, శ్యామసుందరా మనోమోహనా, జగద్గురూ, నీమహిమ విశేషములను దెలిసికొనుటకు శ్రుతిశాస్త్రములకు సాధ్యము కాలేదు. బ్రహ్మేంద్రాది దేవతలకును, శంకరునకును, నీ మహిమను వర్ణించుట సాధ్యము కాదు. నేడు నాకొ రకై నారూపమును ధరించి నీచకర్మ జేసితి"వని వగవంతుని పరిపరి విధముల ప్రార్థించుచు విలపించుచుండ దత్క్షణమే యవింధరాజు వచ్చి సేనాన్హావి చరణములను బుచ్చుకొని "నీవలన నాకు శ్రీకృష్ణుని దర్శ నము లభించినది. భక్తుల మహిమావిశేషములు వర్ణించుట కసాధ్యము. నారదుని కృపవలన వాల్మీకి రామాయణమును రచియించెను. వ్యాసుల కృపవలన సంజయునకు గీతాశ్రవణము లభించెను. మీవలన నాకు భగవద్దర్శనము లభించిన"దని యాతనిని బరిపరి విధముల గొని యాడెను.

సేనాస్వామి తన గృహముజేరి యనుతాప చిత్తుడై పొదిలో గల ద్రవ్యమంతయును గ్రామములోగల దీనజనులకు ధర్మము జేసెను. అవింధరా జనుపచిత్తుడై సేనాస్వామిని గురువుగ భావించుకొని యాతని యొద్ద నుపదేశమును బొంది యఖండ హరినామ సంకీర్తన జేయుచుం డెను. పిదప సేనాస్వామి తన హితోపదేశ వాక్యములవలన నజ్ఞానజనులను భక్తిమార్గా సక్తులనుగాజేసి భూలోకమున గొంతకాలము వసించి యవసానమున నీశ్వర సాన్నిధ్య మలంకరించెను.

నలుబది యొకటవ అధ్యాయము సమాప్తము.

పరాత్పరాయ నమః.

---

# సాత్వికరాజ చరిత్ర

## —♦ నలుబదిరెండవ అధ్యాయము ♦—

శ్రోతలారా! ఆశ్చర్యకరమగు నీ సచ్చరిత్రను సావధానముగ శ్రవణము జేయుడు. భక్తుల సచ్చరిత్రల శ్రవణము జేసినచో భవరోగము తొలగి పరమామృతము లభించును.

పరమ పవిత్రమగు శ్రీ జగన్నాథక్షేత్రమునందు సాత్వికరాజను పేరుగల రాజుండెను. ఆతడు భగవత్సంబంధములగు విషయములు తప్ప నన్యవిషయములను వినుటకు విముఖుడై యుండెను. భూలోకమునందు సాక్షాద్వైకుంఠమని ప్రఖ్యాతి గాంచినది జగన్నాథక్షేత్రము. అచ్చట భగవంతుడు బౌద్ధావతారముగ నుండి సంపూర్ణముగ లీలలను జూపుచుండెను. పూర్వసముద్రతీరమున గల జగన్నాథక్షేత్రమున వసించు సాత్వికరాజు త్రికాలములయందును జరుగు పూజకు దేవాలయమునకు బోయి భగవంతుని పూజ నేత్రోత్సవముగ సేవించి తులసీ ప్రసాదమును స్వీకరించుచుండెను. ఆతడు భగవంతునకు వస్త్రాలంకారములును, నానావిధములగు భూషణములును, పక్వాన్న నైవేద్యములు నర్పించుచుండెను. ఆతడు నిత్యము వచ్చు నతిథులను, నభ్యాగతులను సత్యాదరముతో జూచుచు వారిని సంతుష్టిపరచుచుండెను. ఆతడు నందాద్వీపమున నన్నసత్రముల నేర్పరచెను.

ఒకనాడు సాత్వికరాజు మహాద్వారమున భగవద్దర్శనార్థమై ప్రవేశించి కాలక్షేపమునకై జూదమాడుచుండెను. ఆ సమయమున నర్చకులు భగవత్ప్రసాదమును దీసికొని వచ్చి రాజున కిచ్చుచుండగా గుడిచేతితో బాచికలుపుచ్చుకొని యాడుచున్న యా రాజు వామహస్తమును జాపగా నర్చకు లీ విపరీతమును జూచి యాతనికి ప్రసాదమీయక యితరుల కిచ్చుచు "అయ్యా! మీరు ప్రసాదమునకు వామహస్తమును జాపియున్నారు. అందుచే భగవత్ప్రసాదమును మే మీయలే" దని



సాత్త్వికరాజు జూదమునందుండి భగవత్ప్రసాదమును తృణీకరించుట

చెప్పగా రాజు మానసములో గూర్చినవాడై పరిపరివిధముల జింతించుచు భగవద్దర్శనమునకై బయలుదేరిన నన్ను జూదము విడువలేదు. నా కర్మ విపరీతముగ నున్నది. అమృతమును విడచి మద్యపానము జేసినట్లును, కల్పవృక్షమును విడచి సింధీవృక్షమునకు నీరుపోసినట్లును, రాజహంసను విడచి కాకిని పెంచినట్లును, చందనవృక్షమును విడచి యరణ్యవృక్షము నాశ్రయించినట్లును, విప్రుని విడచి యంత్యజుని బూజించినట్లును, నేను భగవద్దర్శనమును విడచి జూద మాడుచుంటి నని చింతించి "నేను సేవా చోరుడనైతి" నని గర్భాలయములో బ్రవేశింపక సింహద్వారమున గూర్చుండి "గొప్ప యన్యాయము జరిగినది. దీనికి తగిన శిక్షను విధింప వలయు" నని యాలోచించి త్వరితముగా బ్రధానిని బిలిపించి యాతనితో "నేను ప్రతిదినమును రాత్రి గృహమున నిద్రించుచుండగా నొక పిశాచము వచ్చి గవాక్షద్వారములో జేయి బెట్టుచున్నది. అందుచే నాకు మిగుల భయము కలుగుచున్నది. కాన నీవు నామంచము ప్రక్కనే పరుండి యచటనుండియే గవాక్షమునం దున్న హస్తమును ఛేదింపు" మని చెప్పగా తమ యాజ్ఞప్రకారము జేసెదనని ప్రధాని చెప్పి పిశాచము వచ్చిన హస్తమును ఛేదింపవలయునని పదునైన శస్త్రమును సిద్ధముచేసికొని రాజు పరుండు మంచముప్రక్కనే ప్రధాని పరుండెను. రాజు శయనించు మందిరమున దీపప్రకాశము తగ్గింపబడియుండెను.

రాజు గవాక్షద్వారమునందు తన హస్తమునుంచగా ప్రధాని తన శస్త్రమును దీసికొని భూతము హస్తముబెట్టినదని భావించి తత్క్షణమే హస్తమును ఛేదించెను. హస్తము తెగి క్రింద పడగానే ప్రధాని రాజుహస్తమును ఛేదించితినని గుర్తించి నేలపైబడి విలపించుచుండెను. తత్క్షణము రాజు సావధానుడై "నా శత్రుహస్తమును నరికించితిని. నీవు సావధానచిత్తుడవై యుండు" మని మంత్రితో చెప్పి యా హస్తమును బల్లకీలో నుంచి "దుర్బుద్ధిగల నేను జూదమునందు లీనుడనై నీ ప్రసాదమును స్వీకరింపక యపరాధము చేసితిని. కర్మేంద్రియములతో హస్తమే యపరాధము జేసినటుల దోచుటచే శిక్షించి నీ సమక్షమునకు

చంపితిని. మదోన్మత్తుడనై జూదమునాడుచు నీ సేవను మరచి నేను దురాచారినైతిని. ఓ పురుషోత్తమా! ఇది యంతయు నీకు బాగుగ దెలియును. నిన్ను బూజింపనిదియు, నీ భక్తులకు సేవ చేయనిదియు, జూద మాడినదియునగు నీ హస్తమును నీ సముఖమునకు బంపితి" నని భగవంతునికి దెలియజేయుడని భటులతో చెప్పెను.

రాజాజ్ఞప్రకారముగ భటులు పల్లకీలో హస్తమునుంచి మహాద్వారములో బ్రవేశించి రాజు చెప్పిన విషయములు శ్రీ జగన్నాథునికి మనవిచేసిరి. వైష్ణవులెల్లరు జయజయధ్వనుల జేయుచు "రాజు మిగుల ధన్యుడు, ప్రపంచమునుండి యతి విరక్తుడైయున్నాడు. భగవంతుని సేవ కుపయోగింపని యీ హస్తమునకు శిక్ష విధింపవలెనని తన హస్తమును ఛేదించుకొనెను. అసంఖ్యాకులగు స్త్రీ పురుషులు శరీరము నాశవంతమైనదని యెరిగియుండియు భగవంతుని జిత్తమున నిల్పుకొని జన్మను సార్థకముగా జేసికొనరైరి. శిశ్నోదర పోషణమునకై బహుదేశములు తిరిగి యాయువును వెచ్చించెదరు. కాని యీశ్వరభజనకు క్షణకాలమైనను వినియోగింపరు. విషజ్వరము వచ్చినచో వ్యాధిగ్రస్తుడు పదునాలుగు లంకణములైనను జేయును, కాని యొక్క యేకాదశి దినమున నుపవసించి సుకృతమును బొందుటకు విముఖుడగును. తస్కరులు ప్రవేశించి తన సంపత్తి నపహరించుకొని పోవుచుండ కదలక మెదలక మౌనముగ నుండును గాని సత్పాత్రకు ధర్మముజేసి జన్మసార్థకము జేసికొనుటకు విముఖుడుగ నుండును. ఇది కలియుగ మగుటచే ధర్మము క్షీణించి మాయాలోభములు విస్తరించి యున్నవి. సాత్త్విక రాజు మహానిష్ఠావంతుడని యిప్పుడు తెలిసికొంటి" మని యొకరికొకరు చెప్పుకొనుచు సాత్త్విక రాజు వైరాగ్యమును పరిపరి విధముల గొనియాడుచుండిరి.

అర్చకులు శ్రీ జగన్నాథుని సన్నిధిని రాజు పంపిన హస్తము నుంచిరి. తత్ క్షణమే యా హస్తము దవనమాయెను. పిదప నర్చకులు

శ్రీ జగన్నాథుని ప్రసాదమును రాజునకు దీసికొని వచ్చి యిచ్చిరి. శ్రీ జగన్నాథుని కృపచే సాత్త్వికరాజునకు హస్తము యథాప్రకారముగా వచ్చెను. సాత్త్వికరాజు భగవత్ప్రసాదమును రెండుచేతులంతో బుచ్చుకొని నేత్రముల కద్దుకొని మహాప్రసాదమని కుటుంబ సమేతముగా స్వీకరించెను. ప్రజలెల్లరును సాత్త్వికరాజుపై భగవంతునికి గల కృపకు హర్షించి భగవంతుని పరిపరివిధముల ప్రార్థించిరి. సాత్త్వికరాజు త్రికాలములయందును శ్రీ జగన్నాథుని సేవించుచు నవసానమున నీశ్వర సాన్నిధ్యము నలంకరించెను.

నలుబది రెండవ అధ్యాయము సమాప్తము.

ఆత్మా రామాయ నమః

# కర్మాబాయి చరిత్ర

—♦ నలుబది మూడవ అధ్యాయము ♦—

పరమ పవిత్రమగు శ్రీ జగన్నాథ క్షేత్రమున కర్మాబాయి యను బ్రాహ్మణస్త్రీ యుండెను ఆమె భగవంతుని చిత్తమున నిలిపి కొని యఖండముగా నామస్మరణ చేయుచుండెను. కర్మాబాయి గర్భవతి యైయుండ నాకస్మికముగా భర్త మరణించెను. కర్మాబాయి చింతా క్రాంతురాలై నానావిధములగు శ్రమలు బొందుచును కాలము గడపు చుండెను. నవమాసములు పూర్తియైనపిదప నామె ప్రసూతియై పుత్రుని బడసెను.

కర్మాబాయి భగవంతుని మనమున నిలుపుకొని "ఓ జగన్నాథా ఈ బిడ్డను నీభక్తునిగా జేసికొని సర్వవిధముల రక్షించుమని ప్రార్థించెను. ఆబాలకుడు దినదిన ప్రవర్ధమానముగా బెరిగి పెద్దవాడయ్యెను. ఆతనికి సుగుణవతియగు కన్యకనుజూచి వివాహము చేసిరి. కొంత కాలమైన పిదప కర్మాబాయి కోడలు గర్భవతియయ్యెను. నవమాసములు నిండిన పిదప నాయతివ ప్రసూతి యయ్యెను. పిదప కొలది దినములకామె భర్త మరణించెను. కర్మాబాయియును, నామె కోడలును దివారాత్రము లందును దుఃఖించుచుండిరి. కర్మాబాయి విశేషశ్రమతో కోడలిని, మనుమని బోషించుచు, తనకుమారుడు సజీవుడై యుండినచో తనకిట్టి విపత్తు సంభవించి యుండెడిది కాదనియు, బలవత్తరమగు కర్మను దప్పించుట కెవరికిని సాధ్యము కాదనియు దలచి జగన్నాథునిపై భారమువేసి దుఃఖ రూపమగు సంసారమునుండి నన్ను దొలగించి రక్షించుమని యహర్నిశము బ్రార్థించుచుండెను.

ఒకనాడు శ్రీ జగన్నాథుని దర్శనముకొరకై వచ్చిన యాత్రీకులు కర్మాబాయి గృహమున విడిది చేసిరి. యాత్రీకులు కర్మాబాయి విచారముతో నుండుటకు కారణము నామెనడిగి విషయమంతయు దెలిసికొనిరి. యాత్రాజనులు కర్మాబాయితో "ఓ తల్లీ! సంసారము దుఃఖ

రూపమైనది. ప్రాణుల కణమాత్రమైన నిందు సౌఖ్యముండదు. దప్పి కతో నున్నవా డెండమావులను జూచి జలమని భ్రమించునట్లు సంసార మున స్వప్నమందైనను సౌఖ్యము లేనప్పుడున్ను మాయచే జీవుల మూల్య ములగు నాయువును వ్యర్థముగ విషయాదులకొరకు వినియోగించు చున్నారు. కాన నీవు జాగరూకురాలవై యుండు"మని చెప్పిరి. పిదప కర్మాబాయి యాత్రాజనులగు భక్తులకు వందనములు జేసి "అయ్యా నేనీ దుఃఖరూపమగు సంసారమునుండి తొలగుట కుపాయము జెప్పు" డనియడుగగా యాత్రాజను లామెను "శ్రీ జగన్నాథుని దివారాత్రము భజించుచుండు"మని చెప్పిరి.

అధికారమునకు తగిన యుపదేశ వాక్యములు బోధించి పతితుల నుద్ధారణ చేయుటకై భూలోకమున భక్తు లవతరింతురు. భగవంతుని లీలా వైభవములను జనులకు వినిపించి ప్రేమసుఖముల ననుగ్రహించు టకై భూలోకమున మహాత్ము లవతరింతురు. జడ మూఢులగు నజ్ఞాన జనులకు దివ్యజ్ఞానమును బోధించి దుర్జనులను సమూలముగా నిర్మూల నము జేయుటకై భక్తులవతరింతురు. భక్తిమార్గము మలినమై యుండ విషయ సాగరమున జనులుబడుచుండ వారినుద్ధరించి భక్తిమార్గము నభి వృద్ధి పరచుటకై కలియుగమున మహాత్ము లవతరింతురు.

కర్మాబాయి యాత్రాజనులకు సాష్టాంగ నమస్కారము జేసి, చేతులు జోడించి, నిలువబడి యుండగా, జనులామెకు గోపాలమూర్తి విగ్రహమిచ్చి, నీకు పుత్రునియందెట్టి ప్రేమయుండెనో యట్టి ప్రేమతో భగవంతుని సేవించుచుండుమని చెప్పి యాత్రా జనులు వెడలిపోయిరి. కర్మాబాయి శాంత చిత్తురాలై యాత్రాజనులిచ్చిన గోపాలమూర్తిని పుత్ర ప్రేమతో నుష్ణతీర్థ స్నానమును జేయించుచు వస్త్రాభరణముల నలంకరించి యూయెలలో గోపాలమూర్తిని నిద్రింపించుచు పసిబాలునికి జేయు నుపచర్యలవలె జేయుచు పళ్లెములో బెరుగును నన్నమును వడ్డించి గోపాలమూర్తియెదుట నుండ "ఓ గోపాలా! నీకు మిగుల నాక

లిగా నుండును. వేళ యతిక్రమించినది. త్వరితముగ భుజింపు" మని చెప్పి పళ్ళెములోని పెరుగును నన్నమును కలిపి గ్రాసమును దీసి గోపాలుని నోటియొద్ద నుంచెను. కర్మాబాయి భక్తిభావనజూచి భగవంతు డానందముతో భుజించెను. ఆ సమయమున నగ్నిహోత్రుడను బ్రాహ్మణుడామెయింట విడిదిచేసెను. ఆతడు ప్రాతఃకాలమునుండియు కర్మాబాయి గోపాలమూర్తికి జేయు నుపచర్యలను జూచి "ఓ కర్మాబాయీ! నేను చెప్పు విషయములను సావధానముతో వినుము. నీవు ప్రథమమున స్నానము జేసి ధౌతవస్త్రములను ధరించి శుచిమంతురాలవై శ్రీకృష్ణుని బూజింపుము. మంగళ హారతియును, నైవేద్యమును విధియుక్తముగా జేయుము. అట్లు జేయనిపూజ భగవదంగీకారము కాదని చెప్పగా నట్లే జేసెదనని కర్మాబాయి చెప్పెను.

మరునాడు కర్మాబాయి ప్రాతఃకాలమున నిద్రనుండి లేచి దేహబాధల దీర్చుకొని గృహప్రదేశమంతయు శుభ్రపరచి స్నానమాచరించి ధౌతవస్త్రములను ధరించి వంటజేయుచుండెను. కర్మాబాయి కర్మమార్గప్రకారముగా విప్రోత్తముడు చెప్పినటుల జేయుచుండుటచే వేళ యతిక్రమించెను. భగవంతుడు కర్మాబాయి నైవేద్యమింకను సమర్పింపలేదని యెదురుచూచుచు, దేవాలయమున నర్చకులకు శ్రీ జగన్నాథుడు సాక్షాత్కరించి "విప్రులారా! కర్మాబాయి గృహమునందొక విప్రుడు విడిదిగా బ్రవేశించి యామె మనస్సును వికలపరచెను. అందుచే నామె కర్మమార్గప్రకారము స్నానము జేసి మడిగట్టుకొని శుచియై వంటలు జేయుచుండుటచే గాలాతీతమై నాకు క్షుద్బాధ యధికముగా నున్నది. కాన మీరు త్వరితముగా బోయి కర్మాబాయిని సమాధానపరచి "పరమాత్మ శుద్ధ చైతన్యుడు. మాయాతీతుడు, నాత్మారాముడునై యున్నాడు. ఆతనిని కర్మబంధ మెన్నడును బాధింపజాలదు. ఆత డన్నియు జేయుచు, నకర్తయై సాక్షీభూతుడుగ నున్నాడు. ఆతడు భక్తులకొరకే యవతరించును. కర్మాభిమాన మెన్నడును నాతి



కర్మాబాయికి గోపాలమూర్తి దర్శనమిచ్చుట.

నిని గాధింపజాలదు. (శ్రీ) జగన్నాథుడు విశ్వవ్యాపకుడని సిద్ధాంతజ్ఞానులు తెలుపుచున్నారని మీ రామెకు జెప్పు" డని చెప్పెను.

అర్చకులు (శ్రీ) జగన్నాథుని యాజ్ఞప్రకారము కర్మాబాయి గృహమున కేగి భగవంతుడు తెలిపిన విషయమంతయు నామెతో జెప్పిరి. తత్క్షణమే కర్మాబాయి భగవంతునికి నైవేద్యము సమర్పించెను. గోపాలమూర్తి యెల్లరు జూచుచుండగా నామెచేతితో బెట్టిన ప్రసాదమును భుజించుచుండెను. అర్చకులును, గౌతుకమును జూచుటకై జేరిన తేదితర ప్రజలును, గరతాళములను వేయుచు, జయజయ ధ్వనుల చేసిరి. భక్తజను లానందించిరి. కర్మమార్గమందున్న విప్రు లాశ్చర్య పడుచుండిరి. కర్మాబాయి తనచేతి ''' భగవంతునకు ప్రసాదమును దిని పించుటనుజూచి యచ్చటనున్న జనులెల్లరును యజ్ఞయాగాదుల జేయు టవలన భగవత్ప్రాప్తి లభించదనియు, కేవలము భక్తివలననే భగవం తుడు వశుడగుననియు, దెలిసికొనిరి. బ్రహ్మాది దేవతలును, శంకరుడును నఖండముగానే భగవంతుని ధ్యానము జేయుదురో యా గోపాల మూర్తి కర్మాబాయి చేతితో బెట్టిన ప్రసాదమును ప్రేమతో నార గించెను.

జగన్నాథక్షేత్రమున జనులెల్లరు కర్మాబాయి చరణములపై బడి నమస్కరించి భక్తుల మాహాత్మ్యము బ్రహ్మాదిదేవతలు సహితము తెలిసికొనజాలరని పరిపరివిధముల స్తుతించుచుండిరి. కర్మాబాయి సర్వ కాలములందును (శ్రీ) గోపాలమూర్తిని పుత్రప్రేమతో నారాధించుచు, నవసానమున భగవత్సాన్నిధ్య మలంకరించెను.

జగన్నాథక్షేత్రమునం దిప్పటికిని స్మారకముగా కర్మాబాయి యొక్క ఖిచడీ భగవంతున కర్పించి పిదప నైవేద్యము నర్పింతురు.

నలుబదిమూడవ అధ్యాయము సమాప్తము.

సర్వాభీష్ట ప్రదాయకాయ నమః.

# జనజసవంత చరిత్ర

## —♦ నలుబది నాలుగవ అధ్యాయము ♦—

నేడు జ్ఞానులగు శ్రోతలు భక్తుల సచ్చరిత్రలు శ్రవణము జేసి, సర్వకామ్యములు ఫలప్రదము జేసికొనుటచే సుదినముగా బరిణమించి నది.

భూలోక కైలాసమగు శ్రీ వారణాసిక్షేత్రమున నఖండైశ్వర్య ములతో దులతూగుచున్న జనజసవంత అను పరమభాగవతు డుండెను. ఆతడు ప్రతిదినము ప్రాతఃకాలమున స్నానముజేసి శుచిమంతుడై షోడ శోపచారవిధుల భగవంతుని బూజించి పిదప భుజించుచుండెను. ఆతడు సత్కళత్రముతోను, నైదుగురు కుమారులతోను, గృహస్థాశ్రమ ధర్మ మును నిర్వర్తించుచుండెను. తన గృహమునకు విచ్చేయు నతిథులకును, సాధుజనులకును, భక్తులకును, నిచ్ఛాభోజనముల నేర్పరచి తృప్తిజేసి పంపుచుండెను.

జనజసవంతుని కుమారులు దినదిన ప్రవర్ధమానముగ బెఱిగి దురాచారులై ధర్మమునకు విముఖులై తండ్రిని నిందించుచుండిరి పులస్త్య వంశమునందు విష్ణుద్రోహియగు రావణుడు జన్మించినటుల, సోమవంశ మున దుర్యోధనుడు జన్మించినటుల, జనజసవంతుని వంశమున నభక్తు లగు పాపులు పుత్రులుగ జన్మించిరి, జనజసవంతుడు ధర్మవాసనతో గూడియుండి, యపారముగ విచ్చేయు సాధుజనులను సంతృప్తిపరచు చుండుట, కుమారులు జూచి సహింపలేక దీని నరికట్టు నుపాయ మేమని పరిపరివిధముల నాలోచించుచుండిరి. జనజసవంతుడు వృద్ధస్థితికి వచ్చు సరి కాతని భార్యయు, నైదుగురు కుమారులును శత్రువులుగ మారిరి. జగమున జనులు తమతమ సుఖలాభము లెంతవరకుండునో యంతవరకే యజమాని నాశ్రయించియుందురు. ఆత డశక్తుడైనను, లేక వ్యాధిగ్రస్తు డైనను, లేక నిర్ధనుడైనను భార్యా పుత్రాదులును, బంధు మిత్రులును నాతనిని ద్యజింతురు. కాన జను లీ విషయమున మిగుల సావధానులై

ప్రవర్తించుటుచితము. జిహ్వతో భగవంతుని గుణములను వర్ణించుటయు, హస్తములతో నిష్ఠాపూర్వకముగ విష్ణుని బూజించుటయు, భగవత్సంకీర్తనలో వాదములతో నృత్యము జేయుటయు, గర్ణములతో భగవంతునియొక్కయు, భక్తులయొక్కయు లీలావైభవములను శ్రవణము జేయుటయు, శరీరమున శక్తియున్నచో తీర్థక్షేత్రములను సేవించుటయు నేత్రములతో భగవంతుని, యాతని భక్తులను దర్శించుటయు నావశ్యకము.

జనజనవంతుడు సావధానుడై యతి ప్రేమతో ధర్మము జేయుచుండ నాతని భార్యయు కుమారులును గలిసి యీతడు మాకు శత్రువుగ నున్నాడు; ద్రవ్యమంతయు నాశనము జేయుచున్నాడని యాలోచించి యాతనికి దెలియకుండ గొంత ద్రవ్యమపహరించి గుప్తముగా దాచిరి.

దుర్జనులకు సజ్జనులయందు ద్వేషముండునట్లును, చోరులు చంద్రుని ద్వేషింపనట్లును, పతివ్రత కీర్తి వ్యభిచారిణికి గంటకముగ నుండునట్లును, సూర్యోదయము గుడ్లగూబలకు మరణమువలె దోచునట్లును, పండితునిజూచి మూర్ఖుడు నిందించునట్లును, సాధుజనులనుజూచి దుర్జనులు పరిహసించునట్లును, బ్రాహ్మణుని కర్మనిష్ఠ భ్రష్టులకు విముఖముగ నుండునట్లును, జనజనవంతుడు జేయు ధర్మము దారాపుత్రాదులకు గంటకముగ నుండెను.

జనజనవంతుని కుమారు లైదుగురును తండ్రిని జంపుటగాని లేక రాజునకీ వృత్తాంతమును దెలిపి శిక్షింపించుట గాని చేయవలయునని యాలోచించి రాజసభకుబోయి యాతనితో సర్వవృత్తాంతమును విశదముగా జెప్పి మాతండ్రి మూర్ఖస్వభావముతో ద్రవ్యము నిష్టానుసారము దుర్వినియోగము జేయుచున్నాడు. అపారమగు ద్రవ్యము నంతయు సాధుజనులకును, భక్తులకును, యాచకులకును, నిత్యము నిచ్చుచు మమ్ములను శత్రువులనుగా భావించి మేము చెప్పునది వినక తన ఇచ్ఛానుసారముగ బ్రవర్తించుచున్నాడు. ఓ నృపనాథా! గృహస్థాశ్రమమున

నానావిధములగు కార్యములును, శరీర రుగ్నతయు దటస్థించు నప్పుడు సుఖముగ జీవించుటకై మా పూర్వులు శ్రమతో నార్జించిన యాస్తి యంతయు క్రమక్రమముగ క్షీణించుచున్నది. మాతండ్రి చేయు దుర్వ్యయ ములను జూచి యుపేక్షించినచో కొలది దినములలోనే యన్నవస్త్ర ములకుగూడ దుస్థితి నొందవలసి వచ్చును కావున తా మాతనిని బిలిపించి యాస్తినంతయు స్వాధీనపరచుకొని తగుశిక్ష విధించి మాకు సుఖమును జేకూర్చుడని పరిపరివిధముల ప్రార్థించిరి.

వివేక శూన్యుడగు నారాజు వారలు చెప్పిన విషయమును యదార్థమని భావించి యుక్తాయుక్త విచారణ జేయకయే జనజసవం తుని బిలిపించి క్రోధముతో "నీ వున్మత్తుడవై దారపుత్రాదులు చెప్పినను వినక ద్రవ్యము నేల బాడుచేయుచుంటి"వని యడుగగా జనజసవంతుడు "శ్రీరామభజన చేయుచు, సాధువులను భక్తులను బూజించు నున్మత్త స్వభావము నాకు సహజముగ నలవడినది. జీవితకాలమంతయు ఇట్లే జరిగి పోవు"నని చెప్పగా రాజు క్రోధోద్విగ్న మానసుడై జనజసవం తుని పుత్రులను జూచి "మీ తండ్రికి మీరు చెప్పినట్లే మరణ దండన విధింతు" నని చెప్పి భటులను రప్పించి యాతనిని బంధించి యొక రాతిబండతో గలియగట్టి గంగానదిలో బడవేయుడని యాజ్ఞాపించెను. రాజాజ్ఞ ప్రకారముగా భటులాతని రాతిబండతో జేర్చికట్టి గంగా ప్రవా ములో బడవేసిరి. తత్క్షణమే భగవంతుడు భక్తుని రక్షించుటకై కూర్మ రూపమును ధరించి తనవీపుపై జనజసవంతుని ధరించి యాతడా ప్రవాహ మున మునుగకుండ రక్షించుచుండెను. పిదప రాజభటు లీయద్భుత మును జూచి రాజునకు దెలియజేయగా దత్క్షణమే రాజచ్చటికి వచ్చి నిశ్చేష్టుడై చూచుచుండెను. జలముపై దేలుచుండిన జనజసవంతుడు రాజునుజూచి "హృషీకేశుడు తనవీపుపై నుంచుకొని ప్రవాహమున మునుగకుండ నన్ను రక్షించుచున్నాడు, రవిచంద్రుల కాతడే ప్రకాశము ననుగ్రహించెను. రామావతారమున సముద్రముపై పాషాణములను దేల్చెను. ఆ విశ్వవ్యాపకుడగు జగత్పతి ప్రవాహమున కూర్మరూప



జనజసవంతుడు ధ్యానమునందుండ శ్రీరాముడు దర్శనమిచ్చుట.

ముగనుండి తనమూపున నన్నుంచుకొనుట ప్రత్యక్షముగ జూచుచుంటివి కదా!" అని యడిగెను.

రాజు పశ్చాత్తప్త చిత్తుడై ప్రవాహములోని కీతగాంగ్రడను బంపి జనజసవంతు నొడ్డునకు రప్పించి బంధించిన కట్లన్నియు విప్పి యాతని చరణములపై బడి సాష్టాంగ నమస్కారము జేసి నావలన గొప్ప యపరాధము జరిగినది క్షమింపుడని ప్రార్థించెను. జనజసవంతుడు రాజును జూచి "ఓరాజా! నీవు యుక్తాయుక్తముల విచారించుచు ప్రజలను బిడ్డల వలె జూచుచు నఖండముగ భగవంతుని సేవించుచుండు"మని చెప్పగా నట్లే చేసెదనని రాజు చెప్పి జనజసవంతుని యైదుగురు పుత్రులను భార్యను బిలచి "మీ దుర్బోధలవలన నేను యుక్తాయుక్తము లెరుగక యీభక్త శ్రేష్ఠుని విషయమున నపచారము జేసితిని. మీరు దుర్గుణములను విడచి యాతనిని శరణుబొంది యాతని యిష్టప్రకారము ప్రవర్తింపవలెను. లేనిచో మిమ్ము శిక్షింతునని రాజు చెప్పి వారి నాతని చరణములపై బడవేసెను. జనజసవంతుని భార్యయు, గుమారులును, నాతని చరణములపై బడి యపరాధ క్షమార్పణ గోరుకొని యాతనిని గృహమునకు గొనిపోయి యాతనితో గలిసి యఖండముగ శ్రీరామ భజన జేయుచు పరమ భావుకులై యాతనిని సేవించుచు నవసానమున భగవత్సాన్నిధ్యమలంకరంచిరి.

నలుబది నాలుగవ అధ్యాయము సమాప్తము.

నిర్హేతుక కటాక్షాయ నమః.

*

# సురదాస మనమోహన చరిత్ర

## —♦ నలుబదియైదవ అధ్యాయము ♦—

హస్తినాపురమును నక్బరను చక్రవర్తి పరిపాలించుచుండెను. సురదాస మనమోహను డను పరమభాగవతుడు అక్బరుచక్రవర్తి యాస్థానమున నుద్యోగము జేయుచు దన్మూలముగ లభించు ద్రవ్యముతో నతిథుల నారాధించుచు భగవన్నామ సంకీర్తన జేయుచు గాలము గడుపుచుండెను. అక్బరుచక్రవర్తి యాతనిని ప్రేమించుచు మధురాదేశమున నొక మండలమున కధికారిగ నియమించి యధికారముల నాతని కొప్పగించి యచటికి బంపెను.

మధురా, గోకుల, బృందావనములు పురాతన పుణ్యక్షేత్రములు. శ్రీకృష్ణభగవాను డచట నవతరించి తన లీలలను సంపూర్ణముగ జూపెను. వైష్ణవులును, విరక్తులును, పుణ్యవంతులును నా స్థలమునం దఖండముగ వసించుచు భగవంతుని సేవించుచుందురు. బాలకుని దృష్టి పరచినచో నాతని తల్లి సంతసించునట్లు, భక్తుల కన్న వస్త్రము లర్పించినచో జగన్నివాసుడు సంతసించును. పుత్రుని విజయమును విని తండ్రి యానందించునట్లు భక్తుని బూజించినచో జక్రపాణి యానందించును. వృక్షమూలమున జలముబోసినచో శాకలును, బత్రములును శోభించునట్లు నిజభక్తులను గౌరవించినచో వైకుంఠపతి హర్షించును. మనమోహను డీ విషయమును గ్రహించి మధురామండలమున నుద్యోగము జేయుచు వైష్ణవులను, భక్తులను బూజించుచు నన్నపానీయాదులచే సంతృప్తిపరచుచుండెను.

మనమోహనుడు సత్కార్యములకై తనయొద్ద నున్న ద్రవ్యమంతయును వెచ్చించి చింతతోగూడినవాడై కుటుంబపోషణయును, సాధువుల నారాధించుటయును నెట్లని పరిపరివిధముల నాలోచించి ప్రతినిత్యము తాను చేయుచున్న ధర్మకార్యముల నాపినచో నియమమునకు హాని కలుగునని తలచి రాజద్రవ్యమును వెచ్చించి సాధులను, నతిథు

లను నన్నపానీయాదులచే దృప్తిపరచుట జన్మ సార్థకత యని నిశ్చ యించి, రాజున కీ విషయము దెలిసి, కోపించి మరణదండన విధించిన నీశ్వరసాయుజ్యము తప్పక లభింపుననియు, భక్తుల సేవకై ప్రాణ మర్పించిన నతి దారుణమగు భవరోగము తొలగుననియు నాలోచించి రాజ ధన్యభాండారములోని ద్రవ్యమును సత్పాత్రులకు వినియోగించుచుండెను. మనమోహనుఁడు ప్రతి నిత్యము భక్తులకును, బైరాగులకును, దీనజనులకు నన్నవస్త్రము లర్పించుచు, మధుర, గోకుల, బృందావన క్షేత్రములందు ధర్మశాలలను నిర్మించి యాయా క్షేత్రములగల దేవతా మూర్తులకు వస్త్ర భూషణము లర్పించి పదిలక్షల రాజద్రవ్యమును వ్యయపరచెను. అతని దివాణదారుఁడు దురాచారుఁడై యుండుటచే గన్త్రిమస్వభావముతో హస్తినాపురమునకు బోయి యక్బరుచక్రవర్తిని దర్శించి ఓ మహారాజా! తాము మధురామండలమున కధికారిగ నియమించిన మనమోహనుఁడు తమ ద్రవ్యభాండారములోని ద్రవ్యము ననుచితముగ వ్యయపరచుచున్నాఁడు. మధురా, గోకుల, బృందావన క్షేత్రములందు ధర్మశాలలను నిర్మించి యఖండముగ నన్న వస్త్ర దానముల జేయుచుండుటచే లక్షల ద్రవ్యము హరించిన” దని చెప్పగా నక్బరుచక్రవర్తి క్రోధయుక్తుఁడాయెను. యజ్ఞకుండములో వేయు ఘృతము నజ్ఞానులు వ్యర్థమని చెప్పునట్లును, దులసికి పోయు జలమును మూర్ఖులు వ్యర్థముగా భావించునట్లును, యాచకులకు జేయు నన్నదానమును గృపణుఁడు నిందించునట్లును, దాపసి తీర్థాటనము జేయుచుండ దుర్మతులు విలాసముగా దిరుగుచున్నా డనునట్లును, వేదపారాయణము తురుష్కులకు రుచింపనట్లును, నిజభక్తులు భజన జేయుచుండ నిందకుల కల్లరిగా దోచునట్లును, సత్కార్యములకై వినియోగింపబడిన ద్రవ్యము వ్యర్థముగా వ్యయపరుపబడినదని తలచి దివాణదారుడు రాజునకు చెప్పెను.

అక్బరు చక్రవర్తి కోపోద్దీపిత మానసుఁడై భటులను బిలచి “మీరు త్వరితముగ మధురకుబోయి మనమోహనునితో ద్రవ్యమంతయు దీసికొని రండని నేనాజ్ఞాపించితినని తెలిపి మీరాతనిని వెంట బెట్టుకొని

రండని” చెప్పెను. రాజాజ్ఞప్రకారముగా నా దూతలు మధురానగరమున బ్రవేశించి మనమోహనుని గృహముఁజేరి యాతనిని జూచి క్రోధచిత్తులై “రెండు సంవత్సరములనుండి రాజద్రవ్యమును మీరు పంపుట లేదు. అందుచే నక్బరుచక్రవర్తి క్రోధముతో ద్రవ్యసహితముగ మిమ్ములను వెంటబెట్టుకొని రండని యాజ్ఞాపించి మమ్ములను పంపిరి. మీ యాధీనమున గల మధురామండలములో వసూలు కాబడిన ద్రవ్యమంతయు లెక్కలతో సహితముగ దీసికొని త్వరితముగ బయలుదేరు”డని తొందర పెట్టుచుండిరి. అంత సురదాస మనమోహనుడు “రాజు వ్యర్థముగా గోపించుచున్నాడు. నే నమూల్యములైన రత్నములను మాణిక్యములను నాభరణములను రాజునకై గొని యుంచితిని, ఆతడు చూచినచో సంతుష్టచిత్తు డగును. పరీక్షకుల కవి చూపిన ద్విగుణీకృత మూల్యము నిచ్చెద” రని చెప్పి యంతర్గృహములో బ్రవేశించి రెండు పెట్టెలనిండుగ రాళ్ళనువేసి రాజునకు “తమ ద్రవ్యము పదిలక్షలు నాధుసజ్జనులకై వెచ్చించితి”నని శ్రీ ముఖమును వ్రాసి, పెట్టెలోవేసి, తాళము వైచి, వెలుపలకు వచ్చి, రాజభటులను బిలచి, వారికా పెట్టెలను జూపి “నేను త్వరితముగా రాజదర్శనమునకు రావలయునని తలచుచుంటిని. ఇంతలో మీరు వచ్చితి”రని చెప్పగా రాజభటులు సంతోషచిత్తులై “మీరు జ్ఞానులు. స్వామికార్యమునం దతి తత్పరులై యుండగా వ్యర్థముగా దివాణదారుడు చెప్పుటచే రాజు కోపించె”నని చెప్పిరి. మన మోహనుడు రాజభటులకు పక్వాన్న భోజనముల నేర్పరుపగా వారు తృప్తితో భుజించి సంతుష్టచిత్తులైరి.

ఆరాత్రి భటులు నిద్రించుచుండగా మనమోహను డెవరికినీ జెప్పక యరణ్యమునకు బలాయనమై యేకాంతముగ భగవద్భజన జేయుచుండెను. మరునాడుదయమున రాజభటుల నిద్రనుండి లేచి మనమోహనుడు గృహమున లేకుండుట జూచి నగరమంతయు శోధించి రాజభయముచే బలాయనమై యుండవచ్చునని తలచి యీ వృత్తాంతము రాజునకు దెలిపినచో దముపై కోపించునని తలచి పరిపరివిధముల నాలోచించి

రత్నములును, మాణిక్యములును, నాభరణములునుగల యీ రెండు పెట్టెలను రాజున కప్పగించుట యుచితమని తలచి యీ పెట్టెలను వెంట బెట్టుకొని హస్తినాపురమునకుబోయి యక్బరు చక్రవర్తి సమక్షమున నాపెట్టెలనుంచి జరిగిన వృత్తాంతమంతయు సవిస్తరముగ దెలియజేసి "ఓ ధరాధీశా! మావచనము వినుడు. మనమోహాను డతిచతురుడు. అమూల్య రత్నమాణిక్యములను సేకరించి పెట్టెలలో నుంచెను. త్వరలో తమదర్శనము జేయవలెనను నుద్దేశముతో నుండగా మేము బోతిమి. అచట గల కొందరాతనికి సంశయములను గల్పించి రెండుసంవత్సరములుగ ద్రవ్యము పంపకుండుటచే మీరుకోపించి శిక్షించెదరని చెప్పగా నాతడుభయముతో నర్ధరాత్రివేళ యెవరికినీ జెప్పక పలాయనుడయ్యె"నని చెప్పగా దూతల వచనములనువిని యగ్బరుచక్రవర్తి విస్మితవదనుడై పని వారలను రప్పించి యీపెట్టెల తాళములను దీయించుచుండగా దూతలు "ఈపెట్టెలు చాల బరువుగనున్నవి. ఇందేమి రాళ్ళున్నవో" అని భయముచే గజగజ వణకుచుండిరి. అందు (శ్రీ) ముఖపత్రము కనబడెను. దానిని విప్పిచూడగా మనమోహానుని హస్తాక్షరములతో శ్రీముఖము వ్రాసియుండెను. మంత్రి దానిని చదువుచుండగా రాజు ఇతరజనులును వినుచుండిరి.

(శ్రీ) హస్తినాపురమును పాలించు నక్బరుచక్రవర్తి వారిసముఖమునకు:—

ఓ మ హా రా జా!

నేను తమయాజ్ఞ ప్రకారము మధురా మండలమున కధికారిగ నుండి ప్రజలవలన వసూలుకాబడిన ద్రవ్యము పదిలక్షల వరహాలు, నాకుటుంబ పోషణ కుపయోగించుకొనక. సజ్జనులగు మహాత్ములకును, సాధువులకును, నన్నార్తులగు నతిథ్యభ్యాగతులకు, నన్నవస్త్రములకై వెచ్చించితిని. మధుర, గోకుల, బృందావనములందు

యాత్రీకులకు వసతిగ ధర్మశాలల నేర్పరచితిని. కాని దుర్వినియోగము చేయలేదు. మీ ద్రవ్యముచే జేయబడిన సత్కార్యముల ఫలితము మీదే కాని, నాది కాదు.

ఇహలోకమున గీర్తియు, బరలోకమున నక్షయ పదమును, నిశ్చయముగ మీకు లభించును. మీ రీవిషయమును బాగుగ నాలోచించుకొని నాపై దివాణదారుడు చెప్పిన కొండెములను మనము నందుంచుకొనక యథాప్రేమతో నుండెదరని యాశించుచున్నాను.

ఇట్లు,
మీ సేవకుడు,
సురదాసమనమోహన్.

ఇట్లు వ్రాయబడియున్న శ్రీముఖమును విని యక్బరు చక్రవర్తి యత్యాశ్చర్యమునొంది దివాణదారుని రప్పించి "నీవు వ్యర్థముగా మనమోహనునిపై నసత్యపు కొండెములను బలికితివి. ఆతడు సత్పాత్రనుజూచి ధనమును వెచ్చించియుండగా వ్యర్థముగా ధనము నంతయు దుర్వినియోగము జేసెనని నాతో గొండెములను బలికితివి. నిన్నిప్పుడు శిక్షింపక తప్పదని రాజు క్రోధముతో బలికి మంత్రిని బిలచి దివాణదారుని జెఱసాలలో వేయుడని యాజ్ఞాపించెను. రాజాజ్ఞప్రకారము మంత్రి చెఱసాలలో బెట్టి పెట్టెలరెండును బరీక్షించి చూడగా రాళ్లుండెను. అక్బరుచక్రవర్తి నేత్రములనుండి యశ్రుధారలు విడచుచు ప్రధానినిజూచి "సురదాసు మనమోహనునితో సమానుడగు సేవకుడు త్రిభువనములందు శోధించినను లభింపడు. నేను మదాంధుడనై యున్మత్త స్వభావముతో బ్రవర్తించితిని. ఆతడు నాద్రవ్యమును పరమార్థసాధన కుపయోగించి శాశ్వత పుణ్యమును నాకొఱకార్జించెను. మహోపకారి యగు నాతడెచ్చట నున్నాడో శోధించుటకై దేశదేశములకు భటులను బంపి ధైర్యముతో నాతని కభయవచనములను బలికి యిచ్చటికి రప్పించు"




సురదాస మదనమోహనుడు నవాబును దర్శించుట.

మని యాజ్ఞాపించెను. రాజు సభయందుగల జనులెల్లరును నమితా నందము నొందిరి. రాజాజ్ఞప్రకారము మంత్రి దేశ దేశములగల తమ యుద్యోగులకు సురదాస మనమోహనుడు కనబడిన తత్క్షణమే యిచ్చటికి బంపుడు. ఆతడు తాపముతో దీర్ఘాటనకు బోయియుండును. మీ మీ ప్రాంతములలో శోధకుల నేర్పరచి యాతని జాడల దెలిసికొని ధైర్యము జెప్పి యాతని నిచటకు బంపు" డని శ్రీముఖ పత్రికలను వ్రాసి పంపెను. దేశదేశములం దీ వార్త వ్యాపించి ప్రజలెల్లరును నాశ్చర్యచకితులై యీశ్వరవిలాసము నెరుంగుటకు సాధ్యము కాదు. రాజద్రవ్యమును ధర్మమునకు వినియోగించినను కోపింపక రాజాతనిపై బరమ కృపతో నున్నాడని నానావిధముల జెప్పుకొనుచుండిరి. ఉత్తర దేశమున గల శోధకులు సురదాస మనమోహనుని గురించి హస్తినాపురమున రాజసమక్షమునకు దమవెంట రావలసినదనియు, రాజు తమపై బరమ కృపతో తమరాకకై నిరీక్షించుచుండెననియు దెలిపిరి.

సురదాస మనమోహనుడు శోధకజనులవలన వృత్తాంత మంతయు దెలిసికొని విశ్వవ్యాపకుడగు శ్రీహరి సర్వభూతములందును వసించియున్నాడు. ఆతడు రాజుమనస్సులో బ్రవేశించి తనపై గ్రోధము కలుగకుండ వాత్సల్యమును బ్రకటించెనని సంతోషించి హస్తినాపుర మున కేగి రాజసభకు బోయెను. అక్బరుచక్రవర్తి సురదాస మనమోహనుని జూడగనే సింహాసనమునుండి దిగివచ్చి యాలింగనము జేసికొని "నీతో సములగు సఖులు నాకు త్రిభువనములందును లభింపరు. నీవు సత్పాత్రకై ద్రవ్యమును వెచ్చించినటుల నాకు దెలియక దుర్జనుడగు దివాణదారుని వాక్యములను నమ్మి నిన్ను పీడించితిని. నీవు మనస్సునందు సందేహమును విడచి నిర్భయముతో త్వరితముగా బోయి మధురామండలమున నధికారివిగ యథాప్రకారముగ నుండు" మని చెప్పెను. అంత సురదాస మనమోహనుడు "ఓ రాజా! నేను ప్రపంచపు టాశలను త్యజించితిని. నన్ను దిరిగి భవపాశమునందు వ్యర్థముగా బడవేసెద రేల?" అని చెప్పగా నక్బరుచక్రవర్తి "నీ వతి విరక్తుడవు

నిశ్శేషముగా మాయాభ్రాంతినుండి దొలగితివి. విషయమంతయు బాగుగానే నాలోచించితిని. సాధు సజ్జనుల సేవకై నీ వేర్పరచిన ధర్మశాలలలో మధుర, గోకుల, బృందావన క్షేత్రములం దఖండముగా 'సదావర్తు'ల నేర్పరచి మధురామండలమున వసూలగు ద్రవ్యముసు ధర్మమునకు వెచ్చించుచుండుము, నీవు పశ్చాత్తప్తచిత్తుడవై యుద్యోగమును విరమించినచో నే జెప్పిన కార్యముల జేయు సమరులెవ్వరును లేరు. కాన నాయం దమితవాత్సల్యము నుంచి మధురాక్షేత్రమునకు బోయి యధాప్రకారముగ రాజ్యము నేలుచుండు" మని చెప్పెను.

మనమోహనుడు రాజు పలికిన నమ్రవచనములను విని "ప్రపంచ పరమార్థములు రెండును గలిసి తటస్థించినప్పుడు త్యజించుట యుక్తము కా"దని యాలోచించి రాజును జూచి "తమ యాజ్ఞను ప్రమాణముగా గైకొని మహాత్ములకు శుశ్రూష జేసెద" ననగా నక్బరుచక్రవర్తి హృష్టచిత్తుడై యాతనిని తత్కాలోచితముగ గౌరవించి మధురామండలమంతయును సురదాస మనమోహనునకు శాశ్వత దఖలుపత్రమును వ్రాసి తన ముద్రవేసి ఇచ్చెను. పిదప మనమోహనుడు మధురాక్షేత్రములో బ్రవేశించి సాధువులను, వైష్ణవులను ననాథులను యాత్రాపరులను, నన్నపానీయాదులతో దృప్తిపరచుచు, నఖండముగ భగవన్నామ స్మరణ జేయుచు కాలము గడపుచుండెను.

ఒకనాడు మనమోహనుడు హరినామసంకీర్తన జేయుచు, భక్తుల స్తవమను గీతములను పాడుచుండెను. ఆ గీతములందు భక్తుల పాదుకలను రక్షించువాడని చివర తన యంకితము జెప్పియుండుటను విని యందరును నమితాశ్చర్యము నొందిరి. కొంద రసత్యపు పలుకులని చెప్పుచుండిరి. మరికొందరు గ్రంథములో వ్రాసిన పాదుకలను రక్షించునా యని సంశయముగ బలుకుచుండిరి. మరికొంద రాచరణ లేని వ్రాతలే కదా! యని పరిహాసించుచుండిరి. "వర్షము పడనిదే మేఘము లాకాశమున గర్జించునట్లును, శరీరమున బ్రాణము లేనిది లింగాయతులు ప్రేతము న కలంకారము జేయునట్లును, సువాసన లేనిదానిని బజారులో గస్తూరియని విక్రయించినట్లును, భక్తుని వేషమును ధరించి, రాజును

మోహితునిగా జేసి, నానావిధముల కవిత్వము జెప్పిన మాత్రమున నాచరణ సాధ్యమగునా? సూర్యుని రూపమును కాగితముపై జిత్రించిన నది ప్రకాశమిచ్చునా?" అని నానావిధములగు జనులు పరిపరివిధముల జెప్పుకొనుచుండిరి.

వైష్ణవవీరుడగు మనమోహను డతి ప్రేమతో మహాత్ములకు సేవ జేయుచుండ నాతని కవిత్వమును దుర్జనులు నిందించుచుండిరి. ఒక నాడు మనమోహనుడు దేవాలయమునకు దర్శనమునకు బోవుచుండగా మార్గమందొక బైరాగి కలిసి యతనిని పరీక్షింపవలయునని తలచి "నేను భగవద్దర్శనమునకు బోవుచున్నాను. క్షణకాలములో దిరిగి వచ్చెదను. మీ రీ పాదరక్షలను భద్రముగా గాపాడుచుండు" డని మనమోహనున కప్పగించి దేవాలయమునకు బోవుచుండగా మనమోహను డానందముతో "స్వామీ! బహుదినములనుండి నా కీ కోరిక యున్నది. నేడు నా జన్మ సాఫల్యమైన" దని చెప్పెను. మనమోహనుడు బైరాగి పాదుకలను రక్షణజేయుచు నాతనిరాక కెంతసె పెదురుచూచినను, నాతని జాడలు తెలియలేదు. ఆతడుదయము మొదలు రాత్రి తొమ్మిది గంటల వేళవరకు నచటనే యుండెను. పిదప బైరాగి దేవాలయము వెలుపలకు వచ్చి చూడగా మనమోహనుడు చేతితో పాదుకలను బట్టుకొనియుండెను. అంత నా బైరాగి మనమోహనుడు కవిత్వమునందు జెప్పిన విషయము సార్థకముగా నున్నదని తలచి యాతని మస్తకముపై హస్తమునుంచి "నీవు నిస్సారవంతుడవు. వైష్ణవవీరుడవు. నీ చిత్తమును బరీక్షించుటకై నేను దేవాలయమున మిగుల నాలస్యము చేసితిని. నీవు భక్తులకు సేవ జేయుదువను విషయము యదార్థమైన" దని చెప్పెను. సురదాస మనమోహను డహర్నిశములు హరినామ సంకీర్తన జేయుచు, భక్తులను సేవించుచు నాయుర్దాయ మంతయును మధురాక్షేత్రమున గడపి యవసానమున భగవత్సాన్నిధ్య మలంకరించెను.

నలుబదియైదవ అధ్యాయము సమాప్తము.

సర్వలోక రక్షకాయ నమః.

# రసికకుమారచరిత్ర

## —♦ నలుబదిమూఁడవ అధ్యాయము ♦—

భీమాతీరవాసా, రుక్మిణీకాంతా ! నా బుద్ధిని ప్రకాశింపజేసి భక్తుల సచ్చరిత్రలను వర్ణించు సామర్థ్యము నొసంగుటకు నీకు దప్ప నితరులకు సాధ్యముకాదు. జలాధారముచే నాహారధాన్యములు ఫలించు నట్లతి రసవంతమగు భక్తుల సచ్చరిత్రలు నీకృపా కటాక్షమువలననే వర్ణించుటకు సాధ్యమగును. అతి జడమతినగు నా బుద్ధిని ప్రకాశింపజేయు కృపానిధివి నీవై యున్నావు. సూత్రధారి తెరవెనుకనుండి సూత్రమును బట్టుకొని బొమ్మల నాడించునట్లు, నా హృదయమందిరమున నీవు వసించి నిజభక్తుల వైభవములను జెప్పించుచున్నావు. నీ లీలావైభవములను, నీ భక్తుల మహిమవిశేషములను వర్ణింపని కవి చాతుర్యము వ్యర్థముగా శ్రమపాలగును. కాబట్టి ఓ శ్రీపతీ! పదేపదే ప్రేమచిత్తముతో భక్త లీలామృత గ్రంథమును వర్ణించుమని ప్రార్థించుచున్నాను.

యమునా తీరమునందు 'సాయ' నగరమున రసికకుమారుడను భక్తుడుండెను. ఆతడు ప్రతిదినమును ప్రాతఃకాలమున యమునానదిలో స్నానముజేసి షోడశోపచారవిధుల బుష్పములతోను, దులసితోను, శ్రీకృష్ణభగవానుని బూజించి పిదప వైష్ణవుల చరణప్రక్షాళనజేసి తీర్థమును స్వీకరించి ప్రేమతో సజ్జనుల బూజించి నానావిధ పక్వాన్నములతో వారికి భోజనమిడి భక్తులు భగవత్స్వరూపులని భావించుచుండెను. ఆతనికి శిష్యసాంప్రదాయము నానాటికి నభివృద్ధియై సర్వకార్యములు శిష్యులేచేయుచుండుటవలన నేకాంతముగ గూర్చుండి యాతడు భగవద్భజన జేసికొనుచుండెను.

ఒకనాడు రసికకుమారుని మందిరమునకు వైష్ణవులేతెంచిరి. తృణాసనములపై వారి నధిష్ఠింపజేసి శిష్యులనుబిలచి "త్వరితముగ మహాత్ములను బూజింపు"డని చెప్పగా గుర్వాజ్ఞప్రకారము వారు తీర్థమును గొనికొని వచ్చి భక్తజనుల చరణ ప్రక్షాళనము జేయుచుండిరి. అందొక

కుష్ఠుపీడితబ్రాహ్మణుని పాదమంతయు మలినమై క్రిములతోనుండి దుర్గంధముగనుండెను. వస్త్రమతి జీర్ణమై యమంగళముగ నుండెను. ఆతని చరణతీర్థము నెవ్వరైనను బుచ్చుకొనినచో వమనమగును. రసికకుమారుని శిష్యులు కుష్ఠువ్యాధి గ్రస్తుడగు బ్రాహ్మణుని చరణముల క్షాళనము జేయుటమాని మిగిలినవారి చరణములను క్షాళనముజేసి పాదోదకమును స్వీకరించిరి.

రసికకుమారుడు తన సాంప్రదాయిక శిష్యులను బిలచి "ఈరోజున భక్తుల చరణతీర్థము రుచికరముగ లేదు. మీలో నెవ్వరైనను సంశయచిత్తముతో నున్నారా?" యని యడిగెను. పిదప శిష్యులు "స్వామీ! యదార్థవచనము వినుడు. భక్తుల బూజించుచుండగా నందొక బ్రాహ్మణుడు కుష్ఠురోగియై బహు హేయముగ నుండుటచే నాతనిని విడచి మిగిలినవారి చరణక్షాళనము జేసి పూజించితి" మని చెప్పిరి. తత్క్షణమే రసికకుమారుడు కుష్ఠువ్యాధిగ్రస్తుడగు బ్రాహ్మణునకు నమస్కారము జేసి యాచరణతీర్థమును ప్రేమతో గ్రాశనముజేసి యీ తీర్థము మిగుల రుచికరముగ నున్నదని చెప్పగా వైష్ణవులెల్లరు నమితాశ్చర్యమునొందిరి. రసికకుమారుని భావము శిష్యులెవ్వరికిని దెలియదు.

చంద్రామృతమును చకోరపక్షులుమాత్రము పూర్ణముగా ననుభవించునట్లును, బతి మనోగతమును బతివ్రత యెరుగునట్లును, భక్తుల సచ్చరిత్రలనుభవనీయులు విని యానందించునట్లును, కమలపుష్పమునందలి మకరందమును భ్రమరము లనుభవించునట్లును, నగాధమగు గాయత్రీమహిమను విశ్వామిత్రు డొక్కడుమాత్రము తెలిసికొన్నట్లును శ్రీరామ నామమాహాత్మ్యమును కైలాసనాథు డెఱిగినట్లును, భాగవతధర్మములోని మహిమ విష్ణుభక్తు లెఱుగునట్లును, భక్తుల చరణతీర్థమాధుర్యమును రసికకుమారుడుమాత్రము తెలిసికొనెను.

వైష్ణవు లెల్లరు నాతనిని "నీకు శ్రీకృష్ణభగవానుని సహాయము లభించుగాక!" యని యాశీర్వదించి వెడలిపోయిరి. రసికకుమారుని గురు

డగు దయార్ణవుడు బ్రహ్మజ్ఞానియు, నతి నిపుణుడునునై యుండెను. రసికకుమారుడు గురునాథుని యథావిధి ప్రేమతో బూజించుచు, వస్త్ర భూషణముల నర్పించుచుండెను. దయార్ణవుడు నిత్యము సాలగ్రామమును నియమముతో షోడశోపచారముల బూజించి వస్త్రభూషణాలంకార ముల జేయుచుండెను ఒకనాడు దయార్ణవుడు పూజ జేయుచుండగా రాజచ్చటికి వచ్చి యాతడు చేయు పూజను జూచి సంతుష్టమన స్కుడై యాతనికి నాలుగు గ్రామములు దఖలు వ్రాసి యిచ్చెను. తత్ క్షణమే దయార్ణవుడు రాజునుజూచి "ఓ రాజా! నీవు నాలుగు గ్రామ ములు పూజార్థము దఖలువ్రాసి యిచ్చితి. ఆ ద్రవ్యముతో నీవే సాధు వుల నారాధించుచు వారలకు సన్మానముల జేయుచుండు" మని చెప్పగా రా జతనిని జూచి "నేను నీ కర్పించితిని. నీ యిష్టానుసారము జేయు" మని చెప్పి యచటినుండి తిరిగివెళ్లెను. దయార్ణవుడు భక్తుల బూజించు టకై శ్రీకృష్ణనాథుడు వసతి నేర్పరచెనని సంతోషించి నియమముతో భక్తులను బూజించుచుండెను.

ఇట్లు బహుకాలము నియమముతో దయార్ణవుడు భక్తుల బూజించుచుండ నకస్మాత్తుగా నున్మత్తుడగు నొకదుష్టు డా గ్రామమున ప్రవేశించి దయార్ణవుని యీనామమును జప్తుచేయించెను. కృపణునికి ధనమునందు విముఖత్వము కలుగునట్లును, నభక్తునకు హరికథయందు ప్రేమ యుండనట్లును, జారిణి భర్తను ప్రేమతో జూడనట్లును, వైరాగ్య పరులకు నీనాము లేల యని యా దుర్జను డెవరుచెప్పినను వినక యా గ్రామములను జప్తుచేయించెను. ఆ యభక్తుని చర్యలను దయార్ణవుడు విని రసికకుమారునకు దత్ క్షణమే వర్తమానము బంపెను. రసిక కుమారు డా సమయమున భోజనమునకు గూర్చుండి యుండగా సద్గు రునియొద్దనుండి గురుబంధువు వచ్చియుండుటను, జూచి పరమానంద మును బొందెను. అత్తవారింటియొద్ద నున్న యతివకు మాతృగృహము నుండి స్వజనులు వచ్చినచో నమితానందము కలుగునట్లు రసికకుమా రుడు హర్షచిత్తుడై సద్గురునాథుని వర్తమానము తెలియునని యానందిం

చెను. రసికకుమారుడు గురుబంధువువలన వర్తమానమంతయు దెలిసికొని తత్క్షణమే యచటనుండి బయలుదేరి సద్గురుమందిరమున ప్రవేశించి సాష్టాంగనమస్కారము చేసెను.

సద్గురునాథుడు రసికకుమారుని జూచి "ఎంగిలిచేతితో వచ్చితివేల?" యని యడుగగా రసికకుమారుడు "అయ్యా! నేను భుజించుచుండ గురుబంధువు వచ్చి తత్క్షణమే తాము రమ్మని వర్తమానము దెలుపుటచే దమ యాజ్ఞప్రకారముగ వచ్చితి" నని చెప్పగా దయార్ణవు డాశ్చర్యమునొంది "సద్గురుమహిమ నీ కొక్కనికే తెలియు" నని చెప్పి వృత్తాంతమంతయు సవిస్తరముగ దెలిపెను. పిదప రసికకుమారుడు సద్గురునాథునకు వందనములు చేయగా దయార్ణవుడు "నీవు త్వరితముగ బోయి యా దుర్మతికి ధర్మనీతిని జెప్పి యాతడు విననిచో శ్రీకృష్ణుని నామము స్మరణజేయుచు కార్యము నేవిధముగనైన సాధింపు" మని చెప్పెను. రసికకుమారుడు సద్గురుచరణములకు నమస్కరించి యచటి నుండి బయలుదేర యా గ్రామములోని సజ్జనుల కీ విషయమును దెలిపి "ఈనామము దుర్జనుడు జప్తుచేయించుటచే సద్గురునాథుడు నన్ను బంపెను. నేను గుర్వాజ్ఞప్రకారము కార్యసాధన కుద్యుక్తుడనైతి" నని చెప్పగా ప్రజ లాతసని జూచి "విష్ణుద్రోహియు, జండాల స్వభావుడును నగు నా దుర్జను డెవరుచెప్పినను వినుటలేదు. దుష్టుని సమక్షమునకు బోయి యాతనితో వాదోపవాదములు జేయు టుచితముకా" దని నగరమునం దెవ్వరును సంసిద్ధులుకాలేదు. మీరు సాత్వికభక్తులు. మీ యుపదేశవాక్యముల కాతడు లొంగడు. స్పర్శవేదిని పెంకున కంటించిన సార్థకత యుండనట్లు, నితరబాలుడు క్షుధతో విలపించుచుండ వంధ్యస్త్రీ స్తనములనుండి క్షీర ముద్భవింపనట్లును, సద్భక్తుల వాక్యములను దుర్జను లంగీకరింపరు. కాన మీ రాతనియొద్దకు బోవు టుచితముకాదు. యుక్తితో కార్యము సాధింపవలె" నని పలికిరి. నగరవాసులను జూచి రసికకుమారుడు "నాకు గుర్వాజ్ఞ పరమప్రమాణము. కార్యము నెట్ల

యినను సాధింపుమని గురుదేవు లాజ్ఞనిచ్చిరి. నేను వెళ్ళక తప్ప" దని జెప్పి బోవుచుండెను.

రసికకుమారుడు వచ్చుచున్నాడని యా దుర్జనులకు దెలిసి యేమి చేయవలయునని యాలోచించి మదోన్మత్తమగు నేనుగును రప్పించి, ఫైల్వాను నొకనిని బిలపించి యాతనితో నేకాంతముగా "రసికకుమారుడు నాయొద్దకు వచ్చుసమయమున నేనుగును వానిపైకిబంపి తొండముతో జుట్టి నేలపైగొట్టి యాతనిని జంపు నుపాయము చేయుము. నీకు గొంత ధనమిచ్చి సత్కరించెద' నని చెప్పగా ఫైల్వాను డవశ్యమని చెప్పి మదోన్మత్తమగు నా యేనుగును రాజవీధిలో నిలుచుండ బెట్టెను.

**ఆసమయమున** రసికకుమారుడు భగవన్నామ సంకీర్తనలు జేయుచు వచ్చుచుండెను. అతనివెంట శిష్యసాంప్రదాయ జనులుండిరి. తంబుర తాళమృదంగాది వాద్యములతో హరినామ సంకీర్తన జరుగుచుండెను. రసికకుమారుడు ప్రేమతో "జయ జయ రుక్మిణీకాంతా, విశ్వవ్యాపకా, విధిజనకా, కంసాంతకా, వైకుంఠవాసా, నిజభక్తులకు నీవు తప్ప సఖులెవరు? నీవులేని ప్రదేశమే లేదు. ఆకాశమువలె నీవు సర్వమందును వ్యాపించియున్నావు. సుగంధ దుర్గంధములందును, సజ్జన దుర్జనులందును వ్యాపించియున్నా"వని భగవంతుని స్వానంద భరితుడై ప్రార్థించుచుండ గౌతుకమును జూచుటకై గ్రామవాసు లపారముగ జేరిరి.

మదించిన గజమును ఫైల్వానుడు తీసికొని వచ్చుచుండ గ్రామవాసులు భయభ్రాంతులైరి. తత్క్షణమే యొక భావుకుడుబోయి రసికకుమారుని చెవిలో "దుర్జనుడు మిమ్ముల హింసించుటకై మత్తగజమును బంపెను. సావధానముగ నుండు"డని చెప్పెను. రసికకుమారుడు ధైర్యముతో "శరీరము నాశవంతమైనది. సద్గురువాజ్ఞను శిరసావహించి కార్యమును జేయుచున్నాను. విఘ్నములు పటాపంచలగు"నని మన మునదలచి ముందునకు బోవుచుండగా శిష్యులు గజమునుజూచి రసికకుమారునితో "మత్తగజము వచ్చుచున్నది. ప్రమాదము సంభవించును

కొన నుపాయముతో దప్పించుకొనవలయు" నని బలికిరి. రసికకుమారుడు శిష్యులనుజూచి "మీరు నిజనిష్ఠతో సద్గురు నాజ్ఞను బాలించుచుండిరా? దేహమునకు లోభించి గజమువచ్చుచున్నది జాగ్రత్తయని జెప్పుచు దప్పుకొనుట కాలోచించువారు గళమున దులసీమాలలు ధరించి సారక మేమి? గుర్వాజ్ఞను బాలించుట కిష్టములేనిచో. లేక మనమున ధైర్యము లేనిచో, దులసీ మాలలను దీసివేయు" డని చెప్పెను. ఎల్లరును తత్క్షణమే తులసీమాలలను దీసివేసి పరారైరి. రసికకుమారు డొక్కడు మాత్రముండెను.

వేసవికాలములో మేఘము లుండనట్లును, శీతాకాలమున నదుల లోని జలము తగ్గనట్లును, శత్రుసైన్యము నగరములో బ్రవేశించిన దేహ లోభముచే సైనికులు పరారగునట్లును, కఠినకాల మాసన్నమైన దాంభికు డాచారము త్యజించునట్లును, వార్ధక్యమువచ్చిన నింద్రియ ములు విషయధ్యానమునుండి తొలగునట్లును, దరిద్రస్థితి సంప్రాప్తించిన బంధువులు దూరమగునట్లును, శిష్యులును, నగరవాసులును బలాయన మైరి.

రసిక కుమారుడు భగవన్నామస్మరణ జేయుచుండ ఫైల్వాను డాతనిపై కేనుగును విడచెను. రసికకుమారునికి సర్వభూతములయం దును భగవంతుడు వ్యాపించి యున్నాడని దృఢభావన యుండుటచే నాతని కేవిధమగు నపాయమును జేయక యాగజ మాతని పాదములపై బడి సాష్టాంగ నమస్కారము జేసెను. ఈ కౌతుకమును దూరమునుండి జనులుచూచి యాశ్చర్యముతో నున్మత్తమగు నీగజ మెందరినో చంపి నది. రసికకుమారునకు సాష్టాంగ నమస్కారము జేయుట విపరీతముగా నున్నదని పరిపరివిధముల గొనియాడుచుండిరి. రసికకుమారుడు తత్ క్షణమే శిష్యులు పడవేసిన తులసి మాలలన్నియును దీసి యాగజము నకు గళమునగట్టి దానికి 'రామకృష్ణహరి' మంత్రము నుపదేశించి 'ఉన్మత్త స్వభావమును త్యజించి భక్తులకు సేవజేయుచుండుము. గుర్వాజ్ఞ



రసికకుమారుని ఏనుగు శరణు బొందుట.

నెప్పుడును నుల్లంఘింపరాదు. గురుసేవలో ప్రాణమును విడచుట యత్యంత శ్రేష్ఠ"మని చెప్పగా నాగజము సాత్వికస్వభావముతో నుండెను. అచ్చటగల జనులెల్లరును వరహాత్యలు చేసినగజము రసికకుమారునికి సాష్టాంగ నమస్కారము చేసినది. భక్తుల మహాత్మ్యమును దెలిసికొనుట యసాధ్యమని యాశ్చర్యముగ జెప్పుకొనుచుండిరి. ఈ విషయము గ్రామమున నెలరికి దెలిసెను.

తత్క్షణమే దుర్జను డచటికి వచ్చి రసికకుమారునికి నమస్కారము జేసి "స్వామీ! మీచిత్తమునం దేమికోరికయున్నదో తెలుపు" మని యడుగగా "గురువచనములను శిరసానహించుట తప్ప నాకేమియు గోరిక లేదు. జప్తుచేయించిన గ్రామములను దిరిగి స్వాధీనము చేయించి నే నుపదేశించిన గజమును నా కర్పింపు" మని రసికకుమారుడు చెప్పగా నా దుర్జనుడు మరల నమస్కరించి గజము నాతనికిప్పించి యీనామమును దిరిగి స్వాధీనముజేయించెను. రసికకుమారుడు గజమును వెంటబెట్టుకొని యచటినుండి బయలుదేరి సద్గురుసమక్షమునకు బోయి జరిగిన వృత్తాంతమంతయు సవిస్తరముగ దెలియజేసెను. పశుజాతియందు జన్మించిన యీ యున్మత్తగజము తన యున్మత్తస్వభావమును త్యజించి జ్ఞానముతో గూడియుండుట జూచి యెల్లరును నాశ్చర్యపడుచుండిరి. పిదప నా గజమునకు దినదినప్రవర్ధమానముగా బూర్ణజ్ఞానము కలిగి రాత్రి వేళలయందు హరినామసంకీర్తన శ్రద్ధతో వినుచు బగటివేళలయం దరణ్యమునకు బోయి వంటచెఱకును, సాధుజనులు భోజనము జేయు విస్తరులనిమిత్త మాకులను దెచ్చి యచట బెట్టుచుండెను. సాధుజనులెల్లరు భోజనములు జేసిన పిదప వారు బయట పారవేయు నుచ్ఛిష్టమును బరమ ప్రీతితో దినుచు నన్యపదార్థములను విసర్జించి టాకురద్వారమందు జరుగు భాగవత పురాణ కాలక్షేపమును శ్రద్ధతో శ్రవణము జేయుచు నా గజము క్షణక్షణము వైరాగ్యవృద్ధిని బొందుచుండెను.

పశుజాతియందు జన్మించిన యత్యున్మత్తమగు నా గజమునకు సద్గురునాథుని కృపాకటాక్షముచే సత్సాంగత్య మలవడెను. పూర్వ

జన్మమునం దొనర్చిన యే సుకృతమో నేడు ఫలించి సద్గురునాథుని కృప లభించెనని యా గజ మమితానందము నొందుచుండెను. ఇట్లు బహుకాలము గడచిన పిదప రసికకుమారుడు తీర్థయాత్రలకు బయలు దేరగా భక్తులెల్లరు నానందభరితులై యాతనివెంట బయలుదేరిరి. రసిక కుమారు డా గజమును వెంటబెట్టుకొని భక్తులతో గూడి తంబుర తాళ మృదంగాది వాద్యములతో హరినామసంకీర్తన జేయుచు బోవుచుండిరి. ఆ గజముపై వంటపాత్రలను, భోజనసామగ్రులను నితరవస్తువులను గట్టిరి. మార్గమం దెవరైనను భక్తుల నవమానించిన క్రోధముతో నా గజము తొండముతో వారిని జుట్టి విసరికొట్టుచుండెను. సదా నోటితో భగవన్నామముల నుచ్చరించుచు, తులసీ మాలాధారులై యుండు భక్తుల దప్ప నన్యులను దగ్గరకు రానీయకుండ గాపాడుచుండెను.

ఈ ప్రకారముగా రసికకుమారుడు ప్రయాణము జేయుచు కురు క్షేత్రమునకు బోవుచుండ మార్గమందుగల యరుణావతీస్థానమున నా గజము నిలచియుండుటచే రసికకుమారుడును, భక్తులును, త్రిరాత్రము లచ్చట వసింపవలెనని నిశ్చయించుకొనగా నచ్చటగల యవింధరాజునకీ వృత్తాంతము తెలిసి దూతలనుబిలచి "మననగరమున సాధువులు ప్రవే శించిరి. ఉన్మత్తమగు నొకగజము వారివెంట నున్నది. ఆగజమును బలాత్కారముగానైన మనము తీసికొనవలెనని చెప్పగా దూతలు రాజునుజూచి "ఓరాజా! వారు గజమును మన కిచ్చెదరా? యని యడుగగా దుర్జనుడగు నారాజు "త్వరితముగా మీరుపోయి యడుగుడు. వారీయనిచో శిక్షించెద"నని చెప్పగా రాజభటులు రసికకుమారుడున్న స్థలమునకు వచ్చి చూడగా భక్తజనులకు నాగజము స్వస్థిచిత్తము గల దిగ దోచెను. రాజభటులు "ఈగజమును మాకీయవలయును లేనిచో బలత్కారముగ దీసికొని పోయెద"మని చెప్పగా భక్తులెల్లరును జింతించు చుండిరి. నగరవాసులు కొందరచటజేరి "తురుష్కరా జున్మత్తుడు. ఎవరు చెప్పినను వినువాడుకాడు. ధర్మనీతులుజెప్పిన నెన్నడును విన"డని చెప్పు కొనుచుండిరి. కాకిని పంజరములోనుంచి నానావిధముల మధురపదా

ర్థముల బెట్టుచు దానికి మాటలు నేర్పవలెననిన సాధ్యము కానట్లును, కృపణుని ద్రవ్యమడిగిన మాటదక్కనట్లును, నభక్తులకు ధర్మనీతి జెప్పిన నెన్నటికిని రుచింపనట్లును, నవింధరాజునకు సత్పురుషుల వాక్యములు రుచింపవు.

రసికకుమారుడు రాజదూతలనుజూచి "ఈ గజము విష్ణుభక్తుల సాంగత్యము గలదిగనున్నది. భక్తులు దప్ప నన్యులను దగ్గరకు చేర నీయదు. మీరుపోయి దానిని స్పృశించినచో క్షణకాలములో మిమ్ము బట్టిచంపు"నని చెప్పగా దూతలు రాజసముఖమునకు బోయి వృత్తాంత మంతయు సవిస్తరముగ దెలిపిరి. రాజు దూతలుచెప్పిన వాక్యములను విని తనభటునొకనిని బిలచి "నీవు భక్తునివేషము ధరించి యాగజము నొద్దకు బోయిచూడుము. వారు జెప్పిన విషయములలో సత్యమెంతవర కున్నదో చూడు"మని చెప్పెను. తత్‌క్షణమే యాభటు డవశ్యమనిచెప్పి కంఠమున దులసిమాలయు, గోపీచందన తిలకమును ధరించి శ్రీకృష్ణ నామము నుచ్చరించుచుండెను.

యాత్రికులయొద్ద దొంగిలించుటకై మార్గమున జోరుడు తాపసివలె నుండునట్లు, నరణ్యములో మృగము పాశములో బడుటకై బోయవాడు సంగీతము బాడునట్లును, నుదరపోషణకై యెందరో సన్యాసివేషములను ధరించునట్లును, మత్స్యమునకై బక మనుష్ఠానము జేయునట్లును, విష్ణు భక్తుని వేషమును ధరించి యా కపటి కృష్ణనామమును బలుకుచుండెను.

ఆ గజము వాని యాంతర్యమును గ్రహించి 'వీడు కపటవేష ధారి" యని పరీక్షించి చూచుచుండెను. కపటి కృష్ణనామ ముచ్చరిం చుచుండుటవలన శాంతము వహించి యా గజము మౌనముగ నుండెను. ఆ వేషధారి కృష్ణనామము నుచ్చరించుచు యా గజమును రాజద్వారం

మునకు దీసికొనిపోయి బంధించెను. పిదప నాగజము ద్విగ్నమగు మన స్సుతో నేటినుండి భక్తుల సేవ యంతరించుచున్న" దని చింతించి యచ్చటనుండి తప్పించుకొని పోవు మార్గము లేక యాహారమును త్యజించి సప్తదినము లఖండముగా హరినామసంకీర్తన జేయుచు నష్టమ దినమందు ప్రాణము విడచి వైకుంఠము జేరెను. సజ్జనుల సాంగత్యముచే నా గజము భగవత్సన్నిధి నలంకరించెను. పశువులు భగవద్భక్తులను సేవించి మోక్షమును బొందినప్పుడు మనుష్యులా పదమును బొందుట కభ్యంతర మేమియు నుండదు. దుర్జనులైనను, నీచజాతివారైనను భక్తుల సాంగత్య మలవడిన దరించెదరు.

నలుబదియారవ అధ్యాయము సమాప్తము.

సర్వలోక శరణ్యాయ నమః.

# మీరాబాయి చరిత్ర

## —♦ నలుబదియేడవ అధ్యాయము ♦—

శ్రోతలారా! సావధానచిత్తులై వినుడు. శ్రద్ధయను పూర్ణిమ తిథి యందు భక్తవిజయమను చంద్రుడాకస్మికముగ హృదయాకాశమున నుదయించుటచే నజ్ఞానాంధకారము తొలగి జ్ఞానులను చాతకపక్షులకు సౌఖ్యము లభించును. ప్రేమ విశ్వాసములతో భక్తచరితములను శ్రవణము జేసినవారి కమృతము లభించును. రసికులగు నితరజనులకు కథారూపమగు ప్రసాదము లభించి, సంతోషముతో సాయుజ్య సుఖమును బొందుదురు. ఈ భక్తవిజయచంద్రు డుదయించగనే వికల్పము లను తస్కరులకు పాపప్రవర్తన జేయుటకు వీలుగాక పారిపోవుదురు. కేవల మజ్ఞాన మను వృక్షము భక్తవిజయమను చంద్ర ప్రకాశమువలన ఫలపుష్పములతో శోభించును. కాన శ్రోతలు శ్రద్ధతో సావధానముగా శ్రవణముజేసి తత్ఫలమును బొందవలెను

హిందుస్థానమునం దుదయపుర మను పుణ్యనగరము గలదు. అచ్చట........రాణా యను రాజు విష్ణుభక్తుడై యతిథుల నన్న వస్త్రాదులచే సంతృప్తిపరచుచుండెను. భగవద్భక్తు లెవరైన నాకస్మికముగ వచ్చినవారిని బూజించుచుండెను. రాజు తన భవనమునందు గోపాలమూర్తిని నియమముతో షోడశోపచారవిధుల బూజించుచు వస్త్ర భూషణము లర్పించి, మంగళహారతి చేసి, భగవత్ప్రసాదమును స్వీకరించి పిదప భుజించుచుండెను. ఆతనికి క్రీ. శ. 1517 వ సంవత్సరములో మహాభక్తురాలగు నొక కన్యక జన్మించెను. ఆ బాలికకు పండ్రెండవ దినమున మీరాబాయి యని నామకరణము జేసిరి. దినదిన ప్రవర్ధమానముగా నా బాలిక యెదుగుచు గోపాలమూర్తియం దమిత భక్తి శ్రద్ధలను గలిగి నియమముతో బూజించుచుండెను. రాజు తన కుమార్తెను వెంటబెట్టుకొని ఠాకురద్వారమునకు బోయి సద్భావముతో భగవంతుని షోడశోపచారవిధుల బూజించి యమూల్య ముక్తాహారములను, వస్త్రాలంకారములను సమర్పించెను.

మీరాబాయి ప్రతినిత్యము భగవంతుని పూజకు తండ్రితో బోయి శ్రీకృష్ణభగవానుని శోభాయమానమగు దివ్యరూపమును తన మనస్సున నిలిపికొని యాతనినే వివాహము చేసికొనవలెనని నిశ్చయ భావముతో నుండెను ఒకనాడు రాణా రాణీయొద్దకు వచ్చి "మన కుమార్తెయగు మీరాబాయి యుక్తవయస్సునకు వచ్చినది. తగినవరుని జూచి వివాహము జేయు టుచిత" మని చెప్పగా మీరాబాయి తల్లిదండ్రులను జూచి "జననీ జనకులారా! నేను తగినవరుని వెదకికొనియుంటిని. నేను వెదకికొనిన వరుడు జగన్మోహనాకారుడు. అతడు రత్నఖచిత కనకకిరీటమును, మకరకుండలములును, తులసీ మిశ్రిత కోమల పుష్ప హారములను, ముక్తాహారములు, నమూల్య పీతాంబరములను ధరించెను. ఆతనిని మీరును, నేనును నిత్యము పూజించుచుంటిమి. మీ రీ విషయమును యోచించి గోపాలదేవునికి నన్నర్పింపు" డని చెప్పెను.

అంత రాణా "కుమార్తెనుజూచి నీవు చిన్నతనమువలన నిట్లు చెప్పుచున్నావు. శిలావిగ్రహము నిర్జీవమైనది. కలియుగమున భగవంతుడు బౌద్ధరూపమును ధరించి మౌనముగా నున్నాడు. ఆతని నిజ రూపము మనుష్యులు చూచుటకు సాధ్యముకాదు. బాలమతి వలన గోపాలుని వరించితినను, సంకల్పమును విడచి నీయిష్టము వచ్చిన రాజకుమారుని వరింపు" మని చెప్పెను. మీరాబాయి తండ్రిచెప్పిన వచనములను విని "దేవాదిదేవుడగు శ్రీ రుక్మిణీకాంతునికంటె శ్రేష్ఠులెవరును త్రిభువనములందు శోధించినను లభింపరు. ఆతడు విధిజనకుడు. సర్వముజేయుచు నకర్తగానున్నాడు. ఆతని నామములను శంకరు డఖండముగా జపించి శాంతి సౌఖ్యములను బొందుచున్నాడు. ఆతనికి దేవ యక్ష కిన్నర గంధర్వాదులెవరును సములుకారు. తాము గోపాలదేవుని నిర్జీవమగు శిలావిగ్రహమని బలుకకుడు. ప్రహ్లాదుని వాక్యప్రకారమాతడు స్తంభమునం దావిర్భవించెను. ఇది పురాతన చరిత్రయని మీరు సంశయింపకుడు. కలియుగమున భగవంతుడు ద్వారకనుండి డాకురాకు నడచివచ్చెను, మధురలో నున్న పురాతనమూర్తి నిరాధార

బ్రహ్మచారి వెంటనడచి యొకరాత్రిలో హరిద్వారమునకు వెళ్ళెను. నామదేవుడు ప్రేమతో బెట్టిన పక్వాన్నములను భగవంతుడు భుజించెను. నిజభక్తుల శుద్ధభావమును భగవంతుడు తెలిసికొనును. ప్రేమతో సంకీర్తన జేయుచోట నాతడు వసించును. కమల పుష్పమునొద్దకు భ్రమరములు ఝుంకారము జేయుచు వచ్చునట్లు సంకీర్తన జరుగుస్థలమునకాతడు తత్క్షణమే వచ్చును. కలియుగమునందు భగవంతుడు భక్తుల యొద్ద మౌనముగానుండి నిజభక్తులతో మాటాడుచుండును. కాన వికల్పములను త్యజించి నావచనము లాలకించి నన్ను గోపాలమూర్తి కర్పింపు"డని చెప్పెను.

రాజా కుమార్తె వచనములువిని యాశ్చర్యమానసుడై "ఈమెకు పూర్వజన్మ సుకృత విశేషమువలన బాల్యమునందే యద్భుతజ్ఞాన మలవడినది. ఈమె యెచ్చటను బురాణ శ్రవణము జేయకయే దృఢభక్తి కలిగిన"దని యానందించి మీరాబాయిని జూచి "అమ్మా! నీ యిష్టప్రకారము గోపాలమూర్తిని నీ మందిరము నందుంచుకొని ప్రేమతో పూజించుచుండు"మని చెప్పెను. తండ్రి యాజ్ఞ ప్రకారము మీరాబాయి గోపాలమూర్తిని వనమందిరమునకు గొనిపోయి యచట స్థాపించి షోడశోపచారవిధుల బూజించుచుండగా రాజా తన కుమార్తె జ్ఞానురాలని ఆనందముతో సర్వసాహిత్యముల నేర్పరచెను.

మీరాబాయి ప్రాతఃకాలమున స్నానముజేసి గోపాలదేవుని బూజించి పిదప వీణదీసికొని ప్రేమతో గానము చేయుచుండెను. ప్రతినిత్యము గోపాలదేవునికి కాకడా హారతిజేసి పిదప సుగంధ తైలమును బూసి యుష్ణోదకముతో స్నానమును, పిదప బంచామృతాభిషేకమును జేసి శుద్ధోదక స్నానముజేయించి, వస్త్రముతో శుభ్రముగా తుడిచి యమూల్య పీతాంబరములను గట్టి కిరిటమును మకరకుండలములను. కస్తూరితిలకమును, దులసీమిశ్రిత పుష్పహారములను, కౌస్తుభ మణిహారమును, వీరకంకణములను, నూపురములను నలంకరించి దశాంగ ధూపము, 'నేకహారతి'ని, పక్వాన్న నైవేద్యములను, నర్పించి మంగళ

హారతిచేసి, సాష్టాంగ వందనము లాచరించి "పతితపావనా, గరుడ ధ్వజా, భక్తభూషణా, అధోక్షజా, రాజాధిరాజా, శ్రీకృష్ణా' యని ప్రార్థించి, భగవత్ప్రసాదమును భుజించి మూడవజామున పురాణ శ్రవణము జేయుచుండెను. భగవంతుని లీలావైభవ సచ్చరిత్రలను శ్రవణము జేయుటకై విశేషముగ భగవద్భక్తులు వచ్చుచుండిరి. శ్రీమంతులును, దరిద్రులును, వైరాగ్యశీలురును, పామరజనులును, పురాణశ్రవణము జేసి నిశాసమయములందు హరినామ సంకీర్తనలో గాల్గొనుచుండిరి.

మీరాబాయి ప్రేమతో నానావిధములగు ప్రబంధ కవిత్వము లను రచియించుచు శ్రీకృష్ణుని గుణములను వర్ణించుచుండెను నగరమునగల దుర్జనులు దివారాత్రములు "రాజు కీరికి కన్యవలన కళంక మేర్పడినది. రాజగృహమున కుమార్తె భక్తులతోను, బైరాగులతోను, నిర్లజ్జతో నాట్యమాడుచున్నను నామె దుష్ప్రవర్తనను జూచియు రాజు మదాంధునివలె ప్రవర్తించుచున్నా"డని నిందించుచుండిరి ప్రజలు బర స్పరముగ జెప్పుకొను విషయములు రాజునకు దెలిసి క్రోధదిగ్ధ మానసుండై పత్ని నేకాంతముగ బిలచి "నీకు విషయమింకను దెలియలేదు. మీరాబాయిచేయు హరినామ సంకీర్తనమునకును, పురాణ కాలక్షేపమునకును నసంఖ్యాకముగ జనులు జేరుటవలన దుర్జనులు నిర్లజ్జతో పురుషులతో కలిసి నృత్యకీర్తనలు జేయుచున్న"దని నానా విధముల కల్పిత వాక్కులతో దుష్ప్రచారము చేయుచున్నారు. మనవంశమున కిది మిగుల గళంకము కాన నీవేగ మీరాబాయిని సమాధాన పరచి బాల్యచేష్టలనుండి తొలగి దగినవరుని జూచి వివాహము జేసికొమ్మ'ని చెప్పుమనగా రాణి తత్క్షణమే మీరాబాయి కీవిషయ మెరింగించుట కేగెను. మీరాబాయి యా సమయమున భజనలో నుండ దల్లి యేకాంతముగ బిలచి "నీప్రవర్తన విపరీతముగ నున్నది. లోకనింద మీజనకుడు సహించలేకున్నారు. నీవు పురుషులతో నిర్లజ్జగా నృత్యము జేయుచుండుట వంశమున కపకీర్తికరము. మీతండ్రి నీకుదగిన వరునిజూచి వివాహము జేసెదరు. వారి యాజ్ఞప్రకారముగ నంగీకరించు" మనెను.

మీరాబాయి తల్లివచనములనువిని 'అమ్మా! నేను శ్రీకృష్ణునిదప్ప యన్యులను వివాహ మాడజాలను. ఈ విషయము తండ్రిగారికి దెలుపు. నామనోనిశ్చయమునకు పదేపదే మీరిటుల పలుకరాదు. జననిందవలన నాకేమియు భయములేదు. వీణా తాళమృదంగాదులను గైకొని వైష్ణవులతో నృత్యకీర్తనల జేయుట గ్రామవాసులాలకించి నిందింతురు. జ్ఞానులగు భావుకజనులు మీరాబాయి కులోద్ధారణ జేయుచున్నదని హర్షింతురు. దుర్జనులు నిందించి నరకమునకు బోవుదురు. కొందరు భజనయందు ప్రేమచే నున్మత్తురాలుగ నున్నదని బలుకుదురు. కాని నాబుద్ధి నిర్మలమైనదని యజ్ఞానులు గ్రహించలేరు. నేను భగవన్నామములో లీనమైతినని తండ్రికి దెలియజెప్పు''మని చెప్పెను.

రాణీ భర్త నేకాంతముగ బిలచి "ఎన్నివిధముల బోధించినను మీరాబాయి వినుటలే'' దని జెప్పగా రాణా క్రోధముతో విషమును దెచ్చి రాణిచేతికిచ్చి "నీవు పోయి యీ విషమును మీరాబాయికిచ్చి 'నీ జనకుడు పంపె' నని చెప్పి యామెతో విషపానము జేయింపించు" మని చెప్పెను. రాణీ యశ్రుధారలను విడచుచు మీరాబాయి యొద్దకు జని "నీ జనకు డతిదారుణమగు విషమును పానము జేయుటకై నీకు బంపెను. సుందర సుకుమారివగు నీకు మృత్యుకాల మాసన్నమగుచున్న" దని విలపించుచుండెను.

మీరాబాయి తల్లిని జూచి "ఓ మాతా! ఏల దుఃఖించెదవు. మానవదేహము క్షణభంగురమైనది. నిశ్చయముగ నొకదినమున నశించును. శ్రీకృష్ణభగవానుని సాన్నిధ్యమున దేహత్యాగము జేయుటచే వైకుంఠపదము లభించును. ఈవిషయమున చింతించుట యవివేకము. నేను మీ గర్భవాసమున జన్మించి భగవంతుని జరణారవిందములలో మనస్సును లీనముజేసి దేహమును వానికర్పించితిని. క్షణికమగు ప్రపంచమాయను ద్యజించి శోకమునువిడచి శ్రీకృష్ణ భగవానుని ధ్యానము చేయుచుండు''మని చెప్పి గోపాలదేవునకు సాష్టాంగ నమస్కారముజేసి చేతులుజోడించి ''నాజనకుడు విషమంపెను. నీకృపవలన

నేను వైకుంఠము జేరెదను. ఇకముందు నీపూజార్చన లెవ్వరు చేయు దురని దారుణముగ జింతకలుగుచున్నది. "మీరాబాయి భక్తిజేసినది. తండ్రి విషమిచ్చి చంపె"నని నిందకులు పలికెదరు. నిన్నికమీదట నాజ నసీజనకులు పూజింపరు. వస్త్ర భూషణాలంకారములను, నానావిధము లగు తులసీమిశ్రిత పుష్పహారములను నీకెవ్వ రర్పింతురని నాకు జింత యపారముగ నున్నది. రాజు నాపైదోషమారోపించి క్రుద్ధుడగుటచే నేను నాప్రాణములను నీ సమక్షమున విడచుచున్నాను ఓ రుక్మిణీ కాంతా! నీవు భూతభవిష్యద్వర్తమానములకు కర్తవై యున్నావు లక్షాగృహమందు పాండవులను రక్షించితివి. విషపానమువలన ప్రమా దము కలుగకుండ ప్రహ్లాదుని గాపాడితివి. హాలాహలమును భక్షించిన శంకరుడు తాపముచే బాధనొందుచుండ గాపాడితివి! నీవు దీనదయాళు డవు. నీమహిమ విశేషములను వర్ణించుటకు శ్రుతిశాస్త్రముల కగోచర మనిపలికి విషపాత్రను దీసికొని గోపాలదేవునకు నైవేద్యముగ జూపి ప్రాశనము చేసెను

తత్క్షణమే సువర్ణరూపుడైన గోపాలమూర్తి విషపానమువలన కృష్ణవర్ణముగలవాడాయెను భగవంతుడు విషపాత్రలోని విషమును పానము చేయుటవలన మీరాబాయి కది యమృతమై ప్రాణాపాయము జేయలేదు. రాజా సమయమున నచటికి వచ్చి వృత్తాంతమంతయును రాణీవలన దెలిసికొని యశ్రుధారలు విడచుచు గద్గదస్వరముతో "నేను పతితుడను. దుర్జనుడను. భగవంతునిచే విషపానము జేయించితి" నని యనుతాపతప్తచిత్తముతో మీరాబాయి చరణములపై బడెను. మీరా బాయి తండ్రిని లేవదీసి యాతనికి సాష్టాంగనమస్కారము జేసి "నీవలన నాకు కృష్ణదర్శనమాయె" నని చెప్పెను. రాజు మీరాబాయిని జూచి "నే నిచ్చిన విషముచే భగవంతుని శరీరము నల్లబడినదని నాకు మిగుల జింతగానున్నది. కాన నీవు భగవంతుని ప్రార్థించి గోపాలమూర్తి పూర్వమువలె సువర్ణచ్ఛాయతో నుండునటుల కోరు" మని చెప్పెను.



మిరాబాయి విషము శ్రీకృష్ణున కర్పించుట.

మీరాబాయి గోపాలదేవునికి సాష్టాంగ నమస్కారముజేసి "ఓ లక్ష్మీకాంతా! కొంచెము విషమును పానముజేయుట వలన నీశరీర ఛాయ మారినది. కృష్ణావతారమున కాళీయమర్దనము జేసినప్పుడు ఛాయమారని నీశరీరము స్వల్ప విషపానముచే మారినది. నీ నామ మును భక్తులు జపింతురు. వారికి విష మమృతతుల్యమగునని పురాణ ములు వర్ణించుచున్నవి. నీనామము జపించు శంకరునకు తాపము చల్లా రెను. అహర్నిశములు నీ నామమును జపించువారికి దురితములు బాధిం చినచో నిశ్చయముగ విషము నిన్ను బాధించును. సుధారసము సేవిం చినవానిని రోగము బాధించినచో నీకు విషము బాధించును. నీవు భక్తులయందుగల వాత్సల్యమును ప్రకటించుటకై నానావిధములగు లీల లను జూపుచుందువు. నీవు నాకోరిక దీర్చుటకై పూర్వమువలె సువర్ణ ఛాయతో నుండు"మని ప్రార్థించెను.

మీరాబాయి కోరిక ప్రకారముగ శ్రీ రుక్మిణీరమణుడు పూర్వ మువలెనే సువర్ణచ్ఛాయతో దర్శన మిచ్చెను. కాని జగమున దృష్టాం తముగ నుండుటకై గోపాలదేవుడు కంఠమును మాత్రము నలుపుగ నుంచుకొనెను. రాజు తత్క్షణమే లేచి భగవంతునకు వందనములర్పించి మీరాబాయినిజూచి "తల్లీ! నీవలన వంశోద్ధరణ మాయె"నని చెప్పగా రాజు వాక్యములనువిని దుర్జనులు మస్తకములను వంచుకొని మీరా బాయిని మన మవమానపరచుటచే నపకీర్తిబాలైతి"మని యను తప్త చిత్తులైరి. భక్తులెల్లరును నానందముతో గరతాళధ్వనులు జేసిరి. "మీరాబాయికి భగవద్దర్శన మాయె"నని సర్వజను లానందించు చుండిరి. అప్పటినుండి మీరాబాయి సంతుష్ట చిత్తముతో గోపాల మూర్తి నారాధించుచు నవసానమున నీశ్వర సాయుజ్య మలంకరించెను. గోపాలమూర్తి యిప్పటికినీ మీరాబాయి కొరకు విషపానము జేసిన గుర్తుగా కంఠమున కృష్ణవర్ణముతో నున్నాడు.

నలుబదియేడవ అధ్యాయము సమాప్తము.

సచ్చిదానంద స్వరూపాయ నమః.

# కాన్హోపాత్ర చరిత్ర

—♦ నలుబది యెనిమిదవ అధ్యాయము ♦—

శ్రోతలారా! సావధానముగ శ్రవణము జేయుఁడు. పరమపవిత్ర మగు పంఢరీపుర క్షేత్రమునకు దక్షిణదిశయం దేడుక్రోసుల దూరములో "మంగళవేడ్యా" యనుగ్రామము కలదు. అచ్చట 'కళావంతిని శ్యామ' యను పేరుగల వేశ్యయుండెను. ఆమె గర్భమున కాన్హోపాత్ర యను కన్యకా రత్నము జన్మించెను. ఆమె సౌందర్యమును జూచి దేవాంగ నలుగూడ లజ్జనొందుచుండిరి. భూలోకమున నామెకు సములగు సౌంద ర్యవంతులను బ్రహ్మదేవుఁడు సృష్టించ లేదు

కాన్హోపాత్ర బాల్యమునందు గానమును నృత్యము నభ్యసించి, రంభోర్వశీ తిలోత్తమా మేనకాది దేవాంగనలను మరపించుచు విద్యా నైపుణ్యమును గలిగియుండెను. శ్యామ కాన్హోపాత్రనుజూచి "నీరూప లావణ్యములను జూచి రాజులంకార భూషణముల నర్పించును. నావెంట రాజసభకు" రమ్మని చెప్పెను. అంత కాన్హోపాత్ర "ఓ జననీ! నాకు యోగ్యుఁడగు సుందరపురుషుఁడు త్రిభువనములందు శోధించినను దొర కడు. నాకంటె కోటిగుణముల సౌందర్యవంతుని నేను నిశ్చయముగ వరింతును. భూలోకములోని సమస్త పురుషులను నాకు సూర్యునెదుట మిణుగురు పురుగులవలె గన్పించుచున్నా"రని చెప్పెను.

ఒకనాఁడు పంఢపురయాత్ర కేగు భక్తజనులు తంబుర తాళ మృదంగాది వాద్యములతో హరినామ సంకీర్తనజేయుచు పతాకహస్తులై బోవుచుండిరి. కాన్హోపాత్ర వారినిజూచి సాష్టాంగ నమస్కారముజేసి "తామెచట కేగుచుంటిరి? దయచేసి తెలుపు"డని యడుగగా "మేము పంఢరీపురయాత్ర కేగుచున్నాము. అచ్చట వైకుంఠాధిపతియగు భగ వంతుఁడు పుండలీక భక్తునకు దర్శనమిచ్చి యచటనే వసించి యున్నా" డని పలికిరి. కాన్హోపాత్ర వారినిజూచి "అయ్యా! ఆతని మహిమ విశేష ములను దెలుపు"డని యడుగగా "ఆ భగవంతుని మహిమ వర్ణించుటకు

బ్రహ్మాది దేవతలకు సాధ్యముకాదు. ఆతడుదారుడు; ధీరుడు; లక్ష్మీదేవి కంటె కోటిగుణముల బూర్ణ సౌందర్యవంతుడు. చంద్ర, సూర్య, తారా గణాదుల కాతడే ప్రకాశము నిచ్చు"నని చెప్పగా కాన్హోపాత్ర వారిని జూచి అట్టైన హీనకులమున జన్మించిన నేనాతని శరణొందినచో నాతడు నన్నంగీకరించునా?" అని యడిగెను.

అంత భక్తజను లామెను జూచి "మధురానగరమున కంసదాసి యను కుబ్జ కురూపియు, హీనురాలై యుండియు, భగవంతుని శరణొం దగా నామె నుద్ధరించెను. అజామేళు డను బ్రాహ్మణుడు మిగుల నీచ కార్యముల జేయుచు నీచస్త్రీలతో సాంగత్యము జేసి బహు సంతాన మును బడసెను. అంత్యకాలమున బ్రాణములను విడచుచు బుత్ర మోహముచే కుమారుని 'నారాయణా' యని పిలచెను. తత్క్షణమే భగవంతుడు వానిని విమానములో గూర్చుండబెట్టుకొని వైకుంఠమునకు దీసికొని పోయెను. చోఖామేళను నశ్పృశ్యుడు భగవంతుని శరణు బొంది యాతని కృపకు బాత్రుడాయెను. ఆతనికి 'పతితపావనుడు; దీన దయాళుడు' అను సార్థకనామములు కల" వని చెప్పెను.

కాన్హోపాత్ర తత్క్షణమే గృహమున కేగి తల్లికి నమస్కరించి "నేను పంఢరీమునకు బోవుచున్నా" నని చెప్పి తంబురయు, చిడుతలు గైకొని ప్రేమతో భగవంతుని గుణములను వర్ణించుచు, పంఢరీక్షేత్రము జేరి చంద్రభాగానదిలో స్నానముజేసి పుండలీకభక్తుని సేవించి, మహా ద్వారములో సాష్టాంగనమస్కారముజేసి, యచటనుండి గర్భాలయ మున బ్రవేశించి, సింహాసనముపై విరాజమానుడుగ నున్న శ్రీ విఠ్ఠల నాథుని జూచి, యాలింగన వందనాదులు జేసికొని "ఓ దేవాదిదేవా! నీ వుదారుడవు; బూర్ణ సుందరుడవు; షడ్గుణైశ్వర్య లక్షణములు (ఐశ్వ ర్యము, ధర్మము, యశస్సు, లక్ష్మి, జ్ఞాన, విజ్ఞానములు) నీలోనున్నవి. అజామేళుడు, గణిక మొదలగు పతితులను నీ వుద్ధారణజేసితివని భక్తులు జెప్పగా నీకీర్తి విని నిన్ను శరణుబొందుటకు వచ్చితిని. లౌకిక దేహాభి




కాన్హోపాత్ర భజనజేయుచు పంఢరీపురమునకు బోవుట.

మానమును, కామమును ద్యజించి నిన్నాశ్రయించితిని. నన్నంగీకరింపు" మని ప్రార్థించి భగవంతుని చరణములపై శిరమునుంచి నమస్కారము జేసెను. భగవంతుని రూపము చిత్తమున నిల్పికొని కాన్హోపాత్ర సభా మంటపమున హరినామసంకీర్తన జేయుచుండెను.

ఒకనాడు కొందరు దుర్జనులు బీదర్ నగరమున కేగి యవింధ నృపతిని దర్శించి "ఓ రాజా! పంఢరీపురమున మహాద్వారమం దొక వేశ్య యున్నది. ఆమెతో సమమగు సౌందర్యవతి భూలోకమున జన్మించి యుండలే" దని చెప్పిరి. సజ్జన దుర్జనుల కఖండవైర మనాదికాలము నుండి నడచుచున్నది. నిరపరాధులగు శ్వాపదములను వేటగాండ్రు బంధించి వధించునట్లును, వ్యాఘ్రము మానవుని జూచినచో క్రోధ ముతో జంపునట్లును, దుర్జనుల వాక్యములను విని రాజు కాన్హోపాత్రను దీసికొని రమ్మని భటులను బంపెను.

కాన్హోపాత్ర మహాద్వారమునందు ప్రేమతో హరినామసంకీర్తన జేయుచుండ రాజకింకరులు వచ్చి యామెతో నవాబుగారు నిన్ను బీదర్ నగరమునకు దీసికొని రమ్మని యాజ్ఞాపించిరి. కాన త్వరితముగ బయలు దేరుము. విలంబన జేసిన నిన్నిప్పుడే నిర్బంధముగ దీసికొనిపోయెద" మని చెప్పిరి. కాన్హోపాత్ర వారిని జూచి "అయ్యా! నే నిప్పుడే శ్రీ విఠ్ఠల నాథుని దర్శించి వచ్చెద" నని చెప్పి దేవాలయములో ప్రవేశించెను. రాజదూతలు సభా మంటపద్వారమున నిలువబడి యుండిరి. కాన్హోపాత్ర శ్రీ విఠ్ఠలనాథుని దర్శించి దీనత్వముతో "ఓ పుండలీకవరదా, పాండు రంగా! నేను నిన్ను శరణుజొందుటకై వచ్చితిని. నీ సన్నిధియం దున్న న న్నొక తురకరాజు నిర్బంధముగా దీసికొని పోయినచో నా యవమా నము నీకే సంప్రాప్తించును. గజేంద్రుని కరుణాశబ్దములను విని తత్ క్షణమే యాతనిని రక్షించితివి. దుర్వాసు డంబరీషు నవమానపరుప నీ వతనిని గాపాడితివి. అజామేళాది పాతకులను, చోఖామేళాది భక్తుల నుద్ధరించితివి. నా మనస్సు నీ రూపములో లీనమైయుండ నీ కర్పింప

బడిన యీ దేహమును దుర్జనుడగు నవిధప్రభువు స్పృశించినచో నిన్ను భక్తులెల్లరు నిందింతు" రని కరుణావచనములతో భగవంతుని ప్రార్థించెను.

శ్రీ పంఢరీనాథుడు కాన్హోపాత్రలోని చైతన్యమును దనలో గలుపుకొనెను. ఆ సమయమున గర్భాలయమున నున్న నర్చకులును, భక్తులును కాన్హోపాత్ర ప్రాణము భగవంతునిలో లీనమగుట జూచి యమితాశ్చర్యము నొంది యీమెభక్తి ధన్యమైనదని పరిపరివిధముల గొనియాడుచు నామె కళేబరమును దేవాలయ ప్రాకారమునందలి దక్షిణద్వారమునకు కుడిపార్శ్వమున సమాధి జేసిరి. శ్రీ విఠ్ఠలనాథుని కృపచే కాన్హోపాత్రి దేహము తత్క్షణమే "తరటీ" వృక్షముగ వెలువడెను.

సభామంటపమున నున్న రాజదూతలు బహుకాలము నిరీక్షించి కాన్హోపాత్ర తిరిగి రానందున నర్చకులను బిలచి విచారించిరి. అర్చకులు కాన్హోపాత్ర భగవత్సన్నిధిని ప్రాణములు విడచుటచే దక్షిణద్వారము ప్రక్క నామె కళేబరమును భూస్థాపన జేయగా "తరటీ" వృక్షమాయె నని చెప్పి యీ వృక్షమును వారికి జూపిరి. అంత రాజదూతలు మీరు కృత్రిమముగ బ్రవర్తించుచున్నారు. వేరొక ద్వారమునుండి కాన్హోపాత్రను బైటకు బంపి మరణించినదని యసత్యములను బలుకుచున్నారు. ఈ విషయము నవాబునకు దెలిపెద'' మని చెప్పి రాజదూతలు బీదర్ నగరమున కేగి వృత్తాంతమంతయు సవిస్తరముగ నవాబునకు దెలిపిరి.

నవాబు దుష్టుడగుటవలన నేమిప్రమాదము సంభవించునోయను భయముతో నర్చకులు నారికేళ ప్రసాదమును, పుష్పములను, దీసికొని పోయి నవాబునకిచ్చి కాన్హోపాత్ర శ్రీ విఠ్ఠలనాథుని సన్నిధిలో ప్రాణములు విడచినదని వృత్తాంతమంతయు దెలిపిరి. అర్చకు లిచ్చిన పుష్పములలో నొక కేశముండెను. తురకరాజు మిగుల క్రోధముతో బుష్పములలో కేశముండుటకు కారణ మేమని విచారించగా పూజారులు గజగజ వణ

కుచు నేమి చెప్పుటకును దోచక "అది సింహాసనముపై విరాజమాను డై యున్న శ్రీ విఠ్ఠలనాథుని కేశము. మీకు సంశయమున్నచో పంఢరీ పురమువచ్చి శ్రీ విఠ్ఠలనాథుని దర్శింపుడు. ఆతనికి కేశములు లేనిచో మమ్ముల శిక్షింపు"డని బలికిరి. నవాబర్చకులనుజూచి కాష్ఠపాత్ర భగ వంతునిలో నెట్లు కలిసినది చెప్పుమని యడుగగా సాగరములో లవణము పడి తద్రూపమైనట్లు భగవంతునిలో గలిసినదని చెప్పగా దృష్టాంతము జూడవలెనని నవాబు బయలుదేరి పంఢరీపురము జేరి దేవాలయ సభా మంటపమున ప్రవేశించి నిలువబడెను.

అర్చకులు భయముతో భగవంతుని "కృపావంతా, మాధవా! లాక్షాగృహమున పాండవులను రక్షించినట్లును, ద్రౌపదిని భోజన పంక్తిలో దుర్యోధనుడవమానపరుప నామెకు చతుర్భుజములనుగ్రహించి కాపాడినట్లును, దారుణముగ వర్షముగురియుచుండ చిటికెన వ్రేలితో గోవర్ధన పర్వతమునెత్తి గోపాలుర రక్షించినట్లును, మా ప్రాణములను రక్షించవలయును. నవాబునకు చతుర్భుజములతో. శ్యామల వర్ణుడవై దీర్ఘ కేశములతో దర్శనమిమ్ము. ఓ పుండలీకవరదా! ఈ సమయమున నీవుతప్ప రక్షించువా రెవ్వరును" లేరని పరిపరి విధముల ప్రార్థించిరి. అవింధరాజు శేజార మంటపములో ప్రవేశించి రత్నఖచిత కనకకిరీట మును, దివ్యమగు మకరకుండలములను, కంఠమున కౌస్తుభమణియు, గళమున వైజయంతీ హారమును, కటిప్రదేశమున హస్తములను, నడు మున పీతాంబరమును, ధరించి దీర్ఘములగు కేశములతో విరాజ మానుడై, సింహాసనముపైనున్న శ్రీ విఠ్ఠలనాథుని జూచెను. యోగీశ్వ రుల నిజధ్యానమును, సకల దేవతలకు నర్చనీయుడును, నగు భగవం తునిజూచి పశ్చాత్తప్తచిత్తుడై యర్చకులను బిలచి మీరుజెప్పిన ప్రకా రము నాకు భగవద్దర్శన మైనదని పలికి యనన్యభావముతో భగవంతు నకు సాష్టాంగ నమస్కారము జేసెను. అర్చకులు నవాబును దక్షిణ ద్వారము నొద్దకు దీసికొనిపోయి 'తరటీ' వృక్షరూపమును బొందియున్న కాష్ఠపాత్రను జూపిరి.

రాజమితానందములో "కాన్హోపాత్ర మహాభక్తురాలు. భగవంతుని స్వరూపములో లీనమైనది. నేనభాగ్యుడను, జ్ఞానహీనుడను, వ్యర్థముగా కాన్హోపాత్రను బాధించితి" నని పశ్చాత్తాపముతో తరంటే వృక్షమునకు సాష్టాంగనమస్కారము జేసెను. పిదప నర్చకులు నవాబుతో "ఓ రాజా! ప్రాచీనకాలమున సురల్లెల్లరు తరురూపములుగ పంఢరీక్షేత్రమున నుండిరని నాడుక కలదు. నేడు దేవాంశసంభూతురాలగు కాన్హోపాత్ర వృక్షరూపమున భగవత్సన్నిధిని శోభించుచున్న" దని చెప్పిరి. పంఢరీపురక్షేత్రములో (శ్రీ) విఠలనాథుని దేవాలయ ప్రాకారములో దక్షిణద్వారమునకు ప్రక్కగా తరంటీవృక్ష మిప్పటికిని యున్నది. యాత్రికులు దానిని దర్శించి కాన్హోపాత్రను స్మరించుచుందురు.

నలుబది యెనిమిదవ అధ్యాయము సమాప్తము

ప్రణతార్తి హారాయ నమః.

# దామాజీపంత్ చరిత్ర

## —♦ నలుబదితొమ్మిదవ అధ్యాయము ♦—

జయజయ భక్తవత్సలా, రుక్మిణీకాంతా, దీనబంధో, అనాథనాథా, అనంతావతారా, కృపాసాగరా, కరుణాలయా, గుణసముద్రా, యాదవరాయా, విశ్వపతే, విశ్వేశ్వరా, కైవల్యదాతా, అత్యుదారా, భక్తభూషణా, జగదుద్ధారా, కమలాపతే, కమలలోచనా, అక్షయరూపా, చైతన్యఘనా, విశ్వకరా, రాజీవనయనా, దీనోద్ధారా, జగద్గురో, పంఢరీశా, శ్రీ విఠ్ఠలా! నిజభక్తులకు కష్టము సంప్రాప్తించిన నీవు సత్వరమే గాపాడుదువు. భక్తుల కార్యముల జేయుటకు లజ్జ యనునది నీలోలేదు. నీ భక్తుల సచ్చరిత్రలను నీవే వర్ణింపించ వలయును. నేను నిమిత్తమాత్రుడనై యున్నాను. భక్తులకు సుఖ మనుగ్రహించు దాతవు నీవుతప్ప నింకెవరును లేరు.

పరమ పవిత్రమగు శ్రీ పంఢరీపుర క్షేత్రమునకు దక్షిణదిశలో రెండు యోజనముల దూరమున మంగళవేఢ్యా యను గ్రామముకలదు. అచ్చట నుదారుడును, మహాజ్ఞానియు, ధైర్యవంతుడును ప్రపంచమున వసించుచు విరక్తుడుగా నుండువాడును, భగవంతుని కంతరంగభక్తుడును నగు దామాజీ పంతను బ్రాహ్మణోత్తము డుండెను. ఆతనికి పరమ భావుకురాలును, పతివ్రతాశిరోమణియు నగు సద్గుణీబాయి అను కళత్ర ముండెను. దామాజీపంత్ ప్రతి దినమును సూర్యోదయాత్పూర్వమే నిద్రనుండి లేచి, దేహబాధలను దీర్చుకొని, స్నానముజేసి, శుచియై, శ్రీ పాండురంగదేవుని షోడశోపచారవిధుల బూజించి, పిదప నవింధ రాజు నియమించిన ఠాణేదారుడుగ నుద్యోగము జేయుచుండెను. ఆ కాలమున మహారాష్ట్రదేశమును తురుష్క ప్రభువులు పాలించుచుండిరి. రాజధానీనగరము నిజాం సంస్థానములోని బీదర్ నగరమై యుండెను. అవింధప్రభువు దామాజీయందు విశ్వాసము గలవాడై మంగళవేఢ్యా

ప్రాంతమునకు రాణేదారుగా నాతనిని నియమించి సర్వాధికారములను సంక్రమింప జేసెను.

దామాజీ రాజాజ్ఞప్రకార ముద్యోగమును జేయుచు, సంసారము మిథ్యయని భావించి యఖండముగా హరినామసంకీర్తన జేయుచు, ప్రత్యేకాదశికిని పంఢరీపురమునకు బోయి శ్రీ విఠ్ఠలనాథుని సేవించి వచ్చుచుండెను. ఇట్లు కొంతకాలము జరిగిన పిమ్మట నా దేశమునం దంతయు నాకస్మికముగ క్షామము సంప్రాప్తించెను. ప్రజలు తినుట కాహారము లేక మృత్యువున కభిముఖు లగుచుండిరి. దామాజీపం తొక దినమున భార్య నేకాంతముగ బిలచి "పూర్వజన్మమున మన మొనర్చిన సుకృతముచే భగవంతుడు ధన ధాన్యాదులను సమృద్ధిగ ననుగ్రహించెను. దేశమంతట క్షామదేవత క్రీడించుచున్నది. ప్రజ లాహారము లేక స్వస్థానములను విడచి నానావిధముల శ్రమనొందుచున్నారు. కాన మధ్యాహ్నకాలమున నన్నార్తులై వచ్చు జనుల కన్నపానీయాదులచే సంతృప్తిపరచి పంపుచుండుము" అని చెప్పెను. బాలకుని కోరిక దీర్చినచో నాతని తల్లి సంతసించునట్టుల, యాచకునితో నమ్రవచనములను బలికిన జగజ్జీవనుడు సంతసించును. పుత్రుని సమాధానపరచిన తండ్రి సంతసమందునటుల యాచకుని సంతృప్తిపరచినచో భగవంతుడు సంతసించును. గృహస్థునకు యాచకులను సత్కరించు శక్తి లేనిచో నాదరపూర్వకముగ నమ్రవచనములచే సమాధానపరుపవలయును. యాచకుడు భిక్షకై వచ్చి ద్వారము వెలుపల వేష్టించియుండ నాతనికి భిక్ష వేయక భుజించువాని వైఖరి శ్వానవైఖరిగ నుండును. ఐశ్వర్యవంతుడై యుండి యన్నార్తులగు అతిథులను దృప్తిపరుపనిచో నాతడు ఘోరమైన నరకయాతనల ననుభవించునని శాస్త్రమందు జెప్పబడియున్న ధర్మమును దామాజీ తెలిసికొని యా క్షామకాలమున విచ్చేయుచున్న యతిథుల నన్నాదులచే సత్కరించుచుండెను.

దామాజీ దుష్కాలములం దన్నదానము జేయుచున్నాడని కీర్తి నలుదిశలు వ్యాపించి ప్రతిదినమును నసంఖ్యాకులగు నతిథు లతని గృహ

మునకు వచ్చుచుండిరి. పంఢరీక్షేత్రమున క్షామముచే ప్రజలు స్వస్థాన మును విడచి పరిసర ప్రాంతముల దిరుగుచు, నన్న మెచ్చుటను లభింప నందున గలితపత్రములను భుజించుచుండిరి. వాయువు సర్వత్ర వ్యాపించు నేగుల నా క్షామకాలమున దామాజీ నిరతాన్నదానము జేసి యాచకు లను సంతుష్టిపరచుచుండె నను యశము వ్యాప్తించెను. పంఢరీపురము నుండి మఠాధిపతులును, బ్రాహ్మణులును, భక్తులు, నితర జనులును నపారముగ మంగళవేఢ్యా గ్రామమునకు బోయి దామాజీగృహమును జేరిరి.

దామాజీ వారినిజూచి సద్భావముతో నమస్కరించి "అయ్యా లారా! స్నానముజేసి త్వరితముగ దయచేయుడు. వంటలు తయారగు చున్నవి. మీకెల్లరికిని క్షణకాలములో భోజన మేర్పాటు జేసెద"నని చెప్పగా వారెల్ల రమితానంద భరితులైరి. పంఢరీక్షేత్రమునుండి వచ్చిన విప్రులు నితరజనులును స్నానము జేసికొని దామాజీ గృహమున ప్రవే శించి యాసనములపై గూర్చుండిరి. వంటబ్రాహ్మణులు వారలకు బహు పదార్థములు ఘృత సహితముగా వడ్డించిన పిదప పురోహితులు సంక ల్పముజెప్పుచు నాపోశనము పట్టుచుండ నాపంక్తిలోనున్న విప్రుడొక డశ్రుధారలు విడచుచు విలపించుచుండెను. అచ్చటగల జనులెల్లరును విస్మితమనస్కులై యాతని దుఃఖమునకు గతంబేమని పరిపరివిధముల యోచించుచుండిరి. తత్క్షణమే దామాజీ యా విప్రునిజూచి నమస్క రించి "అయ్యా! మీ దుఃఖమునకు కారణమేమి దెలుపుడు? నే దీర్చెద" నని పలికెను. అంత ద్విజోత్తముడు "నేటికి నాలుగుదినములుగ నాసర్వ కుటుంబము పసిపాపలతో తిండిలేక పస్తుండిరి. నేను వారినివిడచి యిచ్చ టకువచ్చి దివ్యమగు నీ మధుర పక్వాన్నములను భుజించుటకు సంసిద్ధుడ నైతిని. నేను నిర్దయుడను, కఠినాత్ముడను, గృహమున దారపుత్రా దులు సజీవులై యుండిరో లేక మృత్యుముఖమున నుండిరో తెలియదు. వారలు స్మరణకు వచ్చుటచే విలపించుచుంటి"నని చెప్పెను. విప్రోత్త ముని వచనములువిని దామాజీ "అయ్యా! దుఃఖింపకుము. స్వస్థచిత్తు

డనై భుజింపుము. నీ కుటుంబమునకొక సంవత్సరమునకు సరిపోవు ధాన్య మును నేనిచ్చెద"నని సమాధానపరుప నా విప్రుడు సంతుష్టచిత్తుడై తృప్తిగ భుజించెను. దామాజీ యసంఖ్యాకులగు యాచక జనులెల్లరికిని దృప్తిగ నన్నపానీయాదు లర్పించెను.

దామాజీ తన భృత్యులనుబిలచి రెండుపుట్లధాన్యమును బండ్లపై వేసి ద్విజోత్తమునితో బంపుడనగా నాజ్ఞను ప్రమాణమని యా భటులు రెండుబండ్లను దెచ్చి ధాన్యముతోనింపి యా విప్రుని వెంటబంపిరి. విప్రుడు ధాన్యముతో బంఢరీపురమున కేగుచుండ నన్నార్తులగు యాచక జనులు ధాన్యపు మూటలను జూచి దోచుకొనిరి. పంఢరీపురవాసియగు నా విప్రు డసంఖ్యాకులగు పీడిత జనులనుజూచి గగ్గోలు పెట్టుచు బరిపరి విధముల బ్రతిమాలినను వారువినక వారు దోచుకొనుటచే నేమియును జేయజాలక దుఃఖంచుచుండెను. రైతు నానావిధముల శ్రమపడి ధాన్యము బండించగా శలభములు గుంపులుగావచ్చి తినిపోవుచుండిన రైతు దుఃఖం చునటుల నా బ్రాహ్మణుడు రోదన మొనర్చుచు స్వస్థానమున కేగి క్షేత్ర వాసుల కందరికిని "మంగళవేఢ్యా గ్రామమున నుదారుడును, ధైర్యవం తుడును, మహాభక్తుడును నగు దామాజీపంతను సత్పురుషుడు గలడు. ఆతడు కృపతో రెండుబండ్ల ధాన్యమును నావెంట బంపెను. కాని నా దరిద్రదేవత పీడితజనుల రూపముగ వచ్చి దోచుకొని పోయె" నని చెప్పగా క్షేత్రవాసు లెల్లరును బయలుదేరి మంగళవేఢ్యా గ్రామము జేరిరి.

దామాజీ యఖండముగ నన్నదానము జేయుటచే ధన ధాన్యా దులు నానాటికి క్షీణించి కొలది దినములలో దరిగిపోయెను. ఒకనాడు దామాజీ భార్య నేకాంతముగ బిలచి "యాచకు లసంఖ్యాకులుగ వచ్చుచున్నారు. బహుదినములుగ మనము సమారాధన జేయుచుండు టచే ధనధాన్యాదులు హరించినవి. ఇక యాచకుల సంతుష్టిపరచుట కుపాయము లేదు. నా స్థితిబ్బము జెప్పిన చో సత్యమునకు హానికలుగును. ఏమిచేయుటకు దోచుటలే" దని చెప్పగా నా మహాపతివ్రత తన యాభ

రణములనెల్ల నిచ్చి వీనిని వెచ్చించి యతిథుల భోజనమునకై యుప యోగించుడని బలికెను. దామాజీ భార్యనుజూచి "ప్రియే! ఈ వస్తువు లచే నేమగును, ఈ యాభరణముల మూల్య మైదువందల రూప్యము లకు మించదు. ఒకదినము ఖర్చునకైనను బూర్తిగా చాల" దనెను. అంత నా మహాపతివ్రత దీర్ఘముగా నాలోచించి "ప్రాణేశ్వరా! ఒక యుపాయము గలదు. అల్లొనర్చిన గొంతకాలమువరకు నిరాటంకముగ నతిథుల నాదరించుట కభ్యంతరముండ" దని చెప్పగా "విషయమేమి? త్వరితముగ దెలుపు" మని దామాజీ యడిగెను. ఆ సాధ్వి పతిని జూచి "నవాబుగారి ధాన్యపు కొట్లన్నియు నిచ్చుట మీ స్వాధీనముననే యున్నవికదా? తత్క్షణమే తాళములను దెరచిన నిరాటంకముగ యాచకులను దృప్తిపరుపవచ్చు" ననగా దామాజీ భార్యను జూచి "కఠోరవాక్యములను బలికితివి. ఈ విషయము నవా బెరింగిన వెంటనే యురిశిక్ష విధించు" నని చెప్పెను. అంత నా సాధ్వి భర్తనుజూచి "మీ రెరుగని ధర్మములు లేవు. అయినను సహజముగ ప్రసంగము ననుస రించి పలుకుచున్నాను. శరీర మశాశ్వతము. ఎప్పటికైన మృత్యువు తప్పదు. నవాబుద్రవ్యమును మీరు ధర్మమున కుపయోగించిరని తెలిసి నచో నాతడు మిమ్ముల నొకరినే శిక్షించును. మిమ్ముల ననుసరించి నేనును బ్రాణముల విడతును. మన మిరువురమును నిప్పుడే ప్రాణము లను శ్రీ విఠ్ఠలనాథుని చరణకమలముల కర్పించినచో కొన్ని లక్షల జనులు మృత్యుముఖమునుండి తొలగుదురు. మీ రొక్కరు దేహలోభ మునతో నుండినచో నిన్ని ప్రాణులు మృత్యుముఖమున బడుదురు. ఏది శ్రేయస్కరమో మీ రాలోచించి మీ కుచితమని తోచిన ప్రకారము జేయు" డని చెప్పెను.

తత్క్షణమే దామాజీ భార్య పలికినప్రకార మాచరించుటకు సంసిద్ధుడై ద్వారము వెలుపలికి వచ్చి చూడగా యాచకజను లార్త నాదములను జేయుచు "మహాత్మా, దామాజీ! నీవు ధైర్యవంతుడవు. అత్యుదారుడవు. ఈ కష్టకాలమున పాత్రవిచారణ జేయకయే యన్న

దానమును జేయుచుంటివి. గగనమున సూర్యు డుదయించి సర్వులకు సమానప్రకాశము నిచ్చునటుల నీవు చిన్న పెద్ద లను భేదములేక యన్న దానము జేయుచుంటివి. నీ కీర్తిని విని మేము వచ్చితి" మని చెప్పగా దామాజీ చేతులు జోడించి వారలెల్లరకు నమస్కారముజేసి "అయ్యలారా! నేను ధాన్యపుకొట్ల తాళములను క్షణకాలములో దీసెదను. మీ మీ శక్తి ననుసరించి యెవరెవరి కెంత ధాన్యము కావలెనో దోచుకొనిపొం" డని చెప్పి శ్రీ విఠ్ఠలనాథుని మనమున నిలిపి భారమంతయు నాతనిపై వేసి తాళమును బుచ్చుకొని ధాన్యపు కొఠారు లన్నిటిని దెరచెను.

అసంఖ్యాకులగు యాచకజనులు దామాజీ పలికిన యుదార వచనములను విని "శ్రీ రుక్మిణీకాంతుడు మిమ్ముల సర్వవిధముల రక్షించుగాక!" యని దీవించిరి. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులును, నవాథులగు దీనులును, నాపితలును, కుమ్మరులును, మాల మాదిగలును దేవాలయార్చకులును, మఠాధిపతులును, భక్తులును, విరాగులును, మంగళవేఢ్య గ్రామము జేరి కొఠారులలోని ధాన్యమును మూటలతోను, సంచులతోను దివారాత్రము దోచుకొని పోవు చుండిరి. త్రివిధజనులును నానావిధముల బలుకుచుండిరి. కొందరు రాజధాన్యమును ధర్మముచేసెనని, కొంద రది యీతని కష్టార్జితమా యనుచుండిరి. మరికొంద రీ కష్టకాలములో నసంఖ్యాకులగు యాచకజనుల ప్రాణములను రక్షించె నని హర్షించుచుండిరి. ఎవ రేవిధముగ జెప్పుకొనుచున్నను దుష్కాలమం దిన్ని ప్రాణుల కన్నదానము జేసితినని తన మనమున నించుకైనను నభిమాన ముంచుకొనక శ్రీ విఠ్ఠలనాథుడే సర్వమునకు గర్తయని ధృడమనస్కుడై దామాజీ యుండెను.

ఒక మాసమువరకును దివారాత్రములందును కొఠారులలోని ధాన్యమును యాచకజనులు దోచుకొనుచుండ నాకస్మికముగ విఘ్నము సంప్రాప్తించెను. ఆ గ్రామమున మజుముదా రను నొక యుద్యోగి కర్ణాటక బ్రాహ్మణుడును, విష్ణుద్రోహియు, దుర్జనుడునై యుండెను.

ఆతడు దుర్బుద్ధిచే "రాజధాన్యమును దామాజీ ధర్మము జేసెనని నవాబున కెరింగించినచో దామాజీకి నవాబు మరణదండన విధించును. దామాజీ చేయుచున్న యుద్యోగము తనకు లభించు" నని కుటిలస్వభావముతో నవాబునకొక జాబిట్లు వ్రాసెను.

ఓ రాజాధిరాజా! భూపతీ!

సేవకుని ప్రార్థన యేమన మంగళవేఢ్యా ప్రాంత ఠాణేదారుడును, దమ సేవకుడు నగు దామాజీ తమ యాజ్ఞ లేకయే ధాన్యపు కొఠారులన్నియు దెరచి ధాన్యమును యాచకుల స్వాధీనపరచెను. నేనును తమ సేవకుడ నగుటచే నాతని కెన్నివిధముల బోధించినను నాలకింపక కొఠారు లన్నిటిని నెలదినములుగ దెరచి యుంచెను. తమకు విశదమగుటకై యీ శ్రీముఖమును వ్రాసితిని. ఇట్లు.

ముజుమదార్ (మంగళవేఢ్యా)

అని వ్రాసి నౌకరులను బిలచి వారికి శ్రీముఖము నిచ్చి "మీరు త్వరితముగ బీదర్ నగరమునకు బోయి నవాబునకు శ్రీముఖము నందజేయుడు" అని ఆజ్ఞాపించెను. తత్క్షణమే నౌకరులు బీదర్న కేగి నవాబునకు శ్రీముఖము నీయగా పత్రమును నవాబు మంత్రికిచ్చి చదువుమనెను. మంత్రి వృత్తాంతమంతయు సవిస్తరముగ చదివి వినిపింప నాయవింధరా జగ్నిలో ఘృతము వేసిన మంట పైకి లేచునటుల గోపోద్దీపిత మానసుడై "దామాజీ నా యాజ్ఞలేకయే ధాన్యపు కొఠారులన్నియు ధర్మమున కుపయోగించె" నని మంత్రిని బిలచి "తత్క్షణమే భటులను బంపి దామాజీని బంధించి యిచ్చటకు రప్పించి నా సమక్షమున శిరచ్ఛేదము చేయు" డని యాజ్ఞాపించెను. రాజాజ్ఞానుసారముగా మంత్రి లేఖను వ్రాసి యిర్వురు భటులకిచ్చి మీరు త్వరితముగ మంగళ

వేడ్యా గ్రామమునకు బోయి దామాజీని బంధించి తెండని చెప్పి భటులను బంపెను.

దామాజీ కచేరీకి బోవుచుండ రాజవీధిలో నొక గోవు నిరువురు మ్లేచ్ఛులు బంధించి వధించుటకై తీసికొనిపోవుటను గాంచెను. తత్క్షణమే యా దుశ్శకునమును గాంచి వెనుకకు మరలి గృహమున బ్రవేశించి యుద్విగ్నమానసుడై కూర్చుండియుండెను, సద్గుణీబాయి భర్త తిరిగి వచ్చుటకు గారణమేమని విచారింప దుశ్శకున వృత్తాంతమంతయు నామె కెరింగించి "నేను నవాబుగారి ధాన్యపు కొటారులను ధర్మమునకు వినియోగించితినని రాజునకు దెలిసినదో నా గో వే విధముగ మ్లేచ్ఛులచే బంధింపబడి హత్యకేగినదో నాగతియు నటులే యగునని మనమున వికల్పము గలుగుటచే గచేరీకి బోకయే తిరిగివచ్చితి" నని చెప్పెను.

ఇంతలో రాజభటులు మంగళవేడ్యా లోప్రవేశింపగా రాజభటుల జూచి గ్రామవాసులు దామాజీకి బంధనప్రాప్తియాయెనని తెలిసికొని చింతాక్రాంతమానసులై యశ్రుధారలు విడచుచు రోదనమొనర్చుచుండిరి. రాజభటులు దామాజీ గృహమున బ్రవేశించి రాజాజ్ఞాపత్రము నాతనికిచ్చి త్వరితముగ బయలుదేరుడని తొందరబెట్టుచుండిరి. సద్గుణీబాయి భర్తనుగాంచి "ప్రాణేశ్వరా! నా ప్రార్థన నాలకింపుడు. ప్రథమమున నా ప్రాణములను దీసి పిదప రాజదండన కేగుడు. మిమ్ములను విడచి యొక క్షణమైనను నిచట నుండలేను. నవాబు యవనుడు కాడు. ప్రత్యక్షకాలునితో సమానుడు" అని పలుక దామాజీ భార్యను సమాధానపరచి "స్వస్థముగానుండుము. ఏమియు భయములేదు. శ్రీ విఠ్ఠలనాథుని భజించుచుండు" మన నా పతివ్రత భర్తకు సాష్టాంగ నమస్కారముజేసి మృదుమధుర వచనములతో "నాథా! మీరు బీదర్ నగరమునకు బోవుచు మార్గమునగల పంఢరీక్షేత్రమున శ్రీ విఠ్ఠలనాథుని సేవించి ప్రార్థనా పూర్వకముగా విషయమంతయును నాతనికి దెలిపి పిదప వెళ్లుడు. మనమున భయము వీడు"డని చెప్పెను. రాజభటులు దామాజీని బంధించి తీసికొనిబోవుచుండిరి. ఆ పురమునగల జనులందరు

క్షామ కాలమున నఖండముగా నన్నదానము జేసిన యీ మహాత్ముని కిట్టి విపత్తు సంప్రాప్తించినదని ఘోరముగ విలపించుచుండిరి.

దామాజీ రాజభటులతో పంఢరీపురము జేరగనే "అయ్యా! ఒక పర్యాయము శ్రీ విఠ్ఠలనాథుని దర్శించుట కనుజ్ఞనీయుడు, ఈ జన్మమున కిదియే అంతిమ దర్శన"మనగా వారు కనికరించి సంకెళ్ళను దీసిరి. పిదప దామాజీ చంద్రభాగానదిలో స్నానముజేసి మహాద్వారమున సాష్టాంగ నమస్కారముజేసి గరుడ శయనమంటపముల దాటి గర్భాలయమున బ్రవేశించి సింహాసనముపై విరాజమానుడైయున్న యనాథనాథుడును, భక్తరక్షకుడును, విశ్వోద్ధారకుడును నగు శ్రీ రుక్మిణీకాంతుని జూచెను. ఆ దేవాధిదేవుడు కిరీటమును, తులసీమిశ్రిత పుష్పహారములను ధరించి కటిన్యస్తహస్తుడై సమచరణములతో నాసాగ్ర దృష్టిధారుడై యుండెను. దామాజీ శ్రీ విఠ్ఠలనాథుని జూచి హృదయమునుండి పొంగిపొరలివచ్చుచున్న యానందము నాపుకొనలేక యానందాశ్రుధారల విడచుచు గద్గదస్వరముతో నాలింగనము జేసికొని యాతనిచరణములపై మస్తకమునుంచి "ఈ జన్మమునకిదియే యంతిమ దర్శనము. నా సర్వాపరాధములను క్షమింపుము. నేను జగత్ప్రసిద్ధమైన గొప్ప యన్యాయమును జేసితిని. నవాబు నాపై క్రోధముతో శిరశ్ఛేద మొనరింప నిశ్చయించి భటులను పంపించి బంధించి నన్ను దీసికొని పోవుచున్నాడు. అతి కఠిన మగు నీక్షామకాలమున రాజ ధాన్యమును యాచక జనులకు నీపైభారమువేసి ధర్మముజేసితిని. విషయమంతయు నీకు దెలిసియే యున్నది. నీవు సదయుడవు. పతితపావనుడవును సార్థక నామము గలవాడవు. నీ బిరుదును సార్థక మొనర్చుకొనుము. నేను మరణదండన ననుభవించుటకై పోవుచు నంతిమ దర్శనముజేసితిని. నా జన్మము సార్థకమైనది. నేనెన్నిజన్మము లెత్తినను నీ చరణారవిందముల నఖండముగ సేవించుచు, నీకు దాసుడనై యుండునట్లనుగ్రహింపు"మని ప్రార్థించి, తననేత్రముల నుండి వచ్చుచున్న బాష్పధారలచే శ్రీ విఠ్ఠలనాథుని చరణకమలములను గడిగి, యచ్చటనుండి శ్రీ రాధా రుక్మిణీ

సత్యభామల దర్శించి, గరుడ హనుమంతులకు వందనములాచరించి దేవాలయమునుండి వెలుపలకు రాగా, రాజభటులతనిని బంధించి కొనిపోవుచుండిరి. పంఢరీక్షేత్రముననున్న స్త్రీ పురుషులెల్లరును "ఓ పంఢరీనాధా! దారుణమగు నీ సంకటసమయమున పాత్రాపాత్రల విచారింపక నఖండముగ నిరతాన్నదానము జేసిన యీ మహాదాతను సర్వవిధముల రక్షించు"మని పరిపరి విధముల ప్రార్థించుచుండిరి. భక్తాభిమానియగు శ్రీ పంఢరీనాధుడు రుక్మిణీదేవినిజూచి "ఓ రుక్మిణీ! నేను భక్తాభిమానినని వేదశాస్త్రపురాణములు ఘోషించుచున్నవి. నా భక్తుల కేసంకటము ప్రాప్తించినను నా జీవము తల్లడిల్లుచుండును. నీ కీవిషయము తెలుయునుగదా! మహాభక్తుడగు దామాజీ క్షామదేవతకు బలియగు నసంఖ్యాక జనుల కన్నదానముజేసి సర్వభారములు నాపైవేసెను. నవాబాతనికి మరణదండన విధించుటచే రాజభటులాతనిని బంధించి తీసికొని పోవుచున్నారు. ఇప్పుడు నేనుపేక్షించిన భక్తాభిమానియగు బిరుదునకు కళంకము కలుగును. ఈ యరిష్టమునుండి యాతనిని గాపాడుటకు బూర్ణముగా నీ కృపకావలె"నని చెప్పగా శ్రీ రుక్మిణీదేవి భక్తునికి గలిగిన ప్రమాదమును దొలగింపుమని కృపాదృష్టితో జూడగా జగజ్జీవనుడగు భగవంతు డంత్యజ వేషమును ధరించి కౌపీనధారియై, నల్లని గొంగళి నొకదానిని భుజముపై వేసికొని, నల్లనిదారముతో గ్రుచ్చిన హారమును మెడలో వేసికొని, శిరమున పాగానొకదానిని ధరించి నలని కాష్ఠమును జేపట్టి, పాదమున జోడావేసికొని, మహారాష్ట్రదేశమున నస్పృశ్యులు మాటలాడు నపశబ్దములతో గూడిన మరాటీభాష మాట్లాడుచు నెనిమిదడుగుల పొడవుగల ఆజానుబాహుడై రుక్మిణీదేవి యెదుట నిలువబడి సంచినొకదానిని జేతబట్టి రుక్మిణీ! ఈ సంచిలో దామాజీ ధర్మముజేసిన ధాన్యము మూల్యము వేయు మనగ జగజ్జనని కృపాదృష్టితో జూడగా నా సంచినిండ ధనముండెను. భగవంతు డాసంచిని భుజముపై బెట్టుకొని దామాజీ హస్తాక్షరములతో నవాబున కీవిధముగా నర్జీని తయారుచేసెను.

ఓ రాజా!

పంఢరీపురప్రాంతమున కంతయు దుష్కాలము సంప్రాప్తించుట మీకు దెలియునుగదా! ప్రజలెల్లరును క్షుద్బాధచే మృత్యువున కభిముఖు లగుచుండుటవలన నా స్వాధీనమందున్న తమ ధాన్యమును రూప్యమున కొక శేరువంతున విక్రయించి తనూఖ్యాలముగా వచ్చిన విక్రయధన మెనుబదినాలుగులక్షల రూప్యములను నా సేవకుడగు విఠ్ఠలనాయకునితో బంపితిని. దయచేసి స్వీకరించి రసీదు బంప గోరుచున్నాను.

ఇట్లు

తా ఖే వా ర్
మంగళవేడా

మీ సేవకుడు
దామాజీ పంత్

ఈవిధముగ వ్రాయబడిన యర్జీని బుచ్చుకొని భగవంతుడు రుక్మిణీదేవిని జూచి "రుక్మిణీ! వేషమెట్లున్న" దని యడిగెను. జగజ్జనని యగు శ్రీ రుక్మిణీదేవి "ఓ దేవాధిదేవా! భక్తుల రక్షించుటకై యెంత నీచపువేషము వేయుటకైనను వెనుకాడ" వనెను. తత్క్షణమే శ్రీ పంఢరినాథు డంతర్ధానుడై బీదర్ నగరములోని రాజాస్థానములో సింహాసనాసీనుడైన నవాబున కెదురుగ నిలువబడి చేతులుజోడించి నమస్కరించెను. అనంతబ్రహ్మాండములను దన కుక్షిలో నుంచుకొనిన భగవంతుడు భక్తులయందు దనకు గల వాత్సల్యమును జూపుటకై యొక్క యవింధునియెదుట నిలువబడి చేతులు జోడించి నమస్కరించెను.

నవాబు మంత్రిని బిలచి యాస్థానములో నిర్భయముగ బ్రవేశించిన యీ నీచుడెవడని యడిగెను. అంత భగవంతుడు "అయ్యా! మంగళవేడ్యా గ్రామములో ఠాణేదారగు దామాజీపంత్ గృహమున సేవ జేయు వెట్టివాడను. నన్ను విఠ్ఠలనాయకు డనెదరు. దామాజీ ధాన్యము విక్రయించిన ద్రవ్యమును, వినతిపత్రమును నాతో బంపెను.



బీదర్ నవాబునకు శ్రీపంఢరీనాథుడు విఠుమహార్ రూపముతో ద్రవ్యము చెల్లించుట.

త్వరితముగ స్వీకరించి పైకమును లెక్కించుకొని రసీ దిప్పింపు" డని చెప్పి యర్జీని నవాబునకొసంగి ద్రవ్యపుసంచిని దీసి క్రింద బోసెను. ఆ ద్రవ్యము జగజ్జననియగు శ్రీ రుక్మిణీదేవి కృపాదృష్టితో నక్షయముగ నిచ్చుటచే నపారముగ నుండెను. నవాబు వినతిపత్రమును జదువుకొని హర్షచిత్తుడై మంత్రిని బిలచి దామాజీ విశ్వాసముతో ధాన్యమును వెచ్చించి యపారమగు ద్రవ్యమును బంపెను. కుటిలుడగు ముజుముదా రాతడు ధాన్యమును ధర్మముచేసెనని యసత్యకల్పనగ మనకు దెలిపెను. కాన భటులను బంపి యా నీచుని బంధించి యిచ్చటకు రప్పించి శిర శ్ఛేదము జేయింపు" డని యాజ్ఞాపించెను. రాజాజ్ఞ ప్రకారముగ ముజుముదారును బంధించి తెచ్చుటకు మంత్రి భటులను బంపెను. మంత్రి సమక్షమున భటులు విఠ్ఠలనాయకుడు తెచ్చిన ద్రవ్యమును లెక్కించుచుండ నక్షయముగ నుండెను. మంత్రి యీ విషయమును రాజునకు దెలుపగా నాతడు ద్రవ్యమంతయు ముట్టినదని రసీదును వ్రాసి యిమ్మని చెప్పెను. నవాబు విఠ్ఠలనాయకుని జూచి "ఓరీ! నీ రూపమును జూచిన నాకు జాల నాశ్చర్యముగ నున్నది. నా కింత వయస్సు వచ్చి యున్నది. కాని నీతో సముడగు మానవుని జూచియుండలేదు. నాకు మనస్సులో సందేహము గలుగుచున్నది. త్రిభువనపతియగు భగవం తుడే నీ రూపమున వచ్చెనని తోచుచున్నది. దామాజీ యెంత భాగ్య వంతుడో సర్వకాలములయం దఖండముగా నీచే సేవింపబడుచున్నా" డని చెప్పెను. తత్క్షణమే విఠ్ఠలనాయకుడు మంత్రినొద్ద రసీదును దీసి కొని నవాబునకు నమస్కారముజేసి యంతర్ధానుడయ్యెను. భగవంతు డా రసీదును దామాజీ నిత్య పఠనజేయు జ్ఞానేశ్వరీ (భగవద్గీత) గ్రంథము లోనికి బోవునట్లు సంకల్పింపగా దామాజీ హస్తములో నున్న జ్ఞానే శ్వరీ గ్రంథములో నా రసీదు చేరియుండెను. నవాబు చిత్తము విఠ్ఠల నాయకునిలో లీనమైయుండుటచే సింహాసనము దిగి "విఠ్ఠలనాయకు డే మార్గమున బోయె" నని యచటగలవారి నెల్లరను విచారించెను. విఠల నాయకుడు మాకు గనబడలేదని యచటగల జనులెల్లరును నవాబునకు

దెలిపిరి. నవాబు "విఠ్ఠలనాయకుని దర్శనము నాకు గావలయును. ఆతని దర్శనము కానిది నా కీ యైశ్వర్యములతో నిమిత్తములే" దని చపల చిత్తముతో బోవుచుండ జతురుడగు మంత్రి "ఓ రాజా! ఆతడు దామాజీయొద్ద నుండు" నని చెప్పగా రా జట్లయిన దామాజీయొద్దకే పోయెదనని సపరివారుడై పోవుచుండెను.

రాజభటులు దామాజీని బంధించి తీసికొని వచ్చుచుండిరి నవాబు దామాజీ పాదములపై బడి "నా దర్బారునకు ద్రవ్యమును చెల్లించిన నీ సేవకుడగు విఠ్ఠలనాయకుని జూపుము. ఆతడే నా జీవము నకు జీవమైయున్నాడు. ఆతనిని విడచి నేను జీవింపజాల" నని పలుకగా దామాజీ యాశ్చర్యముతో బరిపరివిధముల నాలోచించి భగవంతుడే తనకొరకై సేవకరూపముతో బోయి ద్రవ్యమును జెల్లించి యుండునని నిశ్చయించి నవాబుతో "రాజా! ఆతడు పంఢరీపురమున నుండును. నా వెంట వచ్చినచో జూపెద నని చెప్పెను.

నవాబు దామాజీ వెంట పంఢరీక్షేత్రమును జేరి దేవాలయమున ప్రవేశించెను. సభామంటపమున నవాబు నిలుచుండియుండగా దామాజీ శ్రీ విఠ్ఠలనాథుని జూపి "ఆతడే మీ దర్బారులో ద్రవ్యమును జెల్లించె" నని జెప్పెను. ఆ సమయమున రాజభటులు ముజుముదారుని బంధించి యచటకు దీసికొని వచ్చిరి. నవాబు క్రోధముతో "ఈ ద్రోహికి దత్ క్షణమే శిరశ్ఛేదము జేయు" డని చెప్పగా నాతడు దామాజీ పాదములపై బడి ప్రాణభిక్ష ననుగ్రహింపుమని కోరుకొనెను. నవాబు దామాజీతో నీవు నాకు శిలావిగ్రహమును జూపుచుంటివి. నా దర్బారునకు వచ్చి, నాకు ద్రవ్యమును జెల్లించి, నాతో సంభాషించిన విఠ్ఠలనాయకుని జూపుము. లేనిచో నే నిచ్చటనే ప్రాణత్యాగము జేసికొనెద" నని చెప్పెను.

దామాజీ నవాబును జూచి "ఓ రాజా! ఈ ముజుముదారు నిర్ద్రోహి. ఈతనికి విధించిన శిక్షను రద్దుచేయు" డని కోరగా నవాబు

"నీవు నాకు విఠ్ఠలనాయకుని జూపినచో నీతనికి మరణశిక్షను దొల గింతు" నని చెప్పెను. దామాజీ సభామంటపమున చేతులు జోడించి నిలువబడి "ఓ పతితపావనా, రుక్మిణీకాంతా, దీనబంధో, పంఢరీనాథా! నీవు సనకాదులచే బూజనీయుడవు. కైలాసపతి సదా నిన్ను సేవించు చుండును. నీవు విఠలనాయకుడను పేరుతో నాకై నీచవేషమును ధరించి నవాబునకు ద్రవ్యమును జెల్లించితివి. ఆరూపముతో దిరిగి దర్శనమిచ్చి రాజును సంతృప్తిపరచుము. లేనిచో నే నిచ్చటనే ప్రాణత్యాగము జేసి కొనెద" నని పరిపరివిధముల భగవంతుని బ్రార్థింపగా శ్రీ పంఢరీ నాథుడు విఠలనాయకుని రూపముతో సాక్షాత్కరించెను.

తత్క్షణమే నవాబును, దామాజీయును, నాతని నాలింగనము జేసికొనగా భగవంతుడంతర్ధానుడయ్యెను. నవాబు దామాజీ చరణము లపైబడి 'నీ వలన నాకు భగవద్దర్శనము సంప్రాప్తించినది. కాన రాజ్యము నీ కర్పించెద"నని చెప్పగా, దామాజీ నవాబును జూచి "ఓ రాజా మీ రాజ్యమునకును, మీ యుద్యోగమునకును స్వస్తి జెప్పుచున్నాను. నేనిక భగవంతుని సేవించుచు జీవితమంతయు పంఢరీ పురమున గడపెద"నని చెప్పి, భార్యా సమేతుడై యప్పటినుండియు పంఢరీక్షేత్రములో వసించుచు త్రికాలము లందును శ్రీ విఠ్ఠలనాథుని సేవించుచు నఖండముగ హరినామ సంకీర్తన జేసి యవసానమున శ్రీ పంఢరీనాథుని చరణ కమలములలో లీనుడయ్యెను.

నలుబది తొమ్మిదవ అధ్యాయము సమాప్తము.

కృపాకరాయ నమః

---

# మృత్యుంజయ చరిత్ర

## —♦ ఏబదియవ అధ్యాయము ♦—

జయ పంఢరీశా, లీలానాటకసూత్రధారీ, జగన్నాధా, విశ్వరూపా, హృషీకేశా, పరేశా, పాండురంగా, కమలాపతీ, విశ్వాత్మా, అనంతావతారా, హరిహరేశ్వరా, పరమోదారా, నిజభక్తహృదయనివాసా జగదుద్ధారా! నీవు నావాక్కునందు ప్రవేశించి భక్తుల సచ్చరిత్రలు వర్ణింపించి శ్రోతలకు ప్రేమప్రవాహము వ్యాపింపచేయుము.

నిజాం సంస్థానములోని బీదర్ నగరమునొక నవాబు పాలించుచుండెను. ఆతడు వైరాగ్య జ్ఞానసంపన్నుడై బహుదినములు రాజ్యపరిపాలన చేసెను. ఆతడొకదినమున మేడపైకెక్కి తన భార్యతో నానావిధములగు సుగంధతైలములను శరీరమునకు లేపనజేసికొని దివ్యవస్త్రాలంకారములనుధరించుచుండ భృత్యులెల్లరును కావలియుండిరి. మధుర పదార్థములను భుజించి యెంగిలియాకులను క్రింద వారివేయుటకై రాణీ మేడపైనుండి క్రిందికిజూడగా అచట యాచకులు కనబడిరి. రాణీ రాజును బిలచి రక్షకభటులు కావలియుండగా నీ భిక్షుకులెట్లువచ్చిరని యడిగెను. నవాబు భిక్షుకులను జూచి మిగుల క్రోధముతో రక్షకభటులను బిలిపించి "నేనీ యంతర్మందిరము నొద్ద కెవ్వరిని రానీయవలదని చెప్పియుండగా భిక్షుకుల నెట్లు విడచితి"రని చెంపపైగొట్టెను. రాజభటులు క్రోధముతో భిక్షుకులను చావగొట్టిరి. భిక్షుకులు రాజభటులు చావగొట్టుచున్నను పకపక నవ్వుచుండిరి. రాజు కౌతుకమునుజూచి మిగుల నాశ్చర్యపడి భృత్యులతో వారిని కొట్టవలదని చెప్పి భిక్షుకులకు తగిలినదెబ్బలను జూచి రాజేడ్చుచు భిక్షుకులతో భటులు మిమ్ములను కొట్టుచున్నను నవ్వుటకు కారణమే"మని విచారించెను. భిక్షుకులు రాజును జూచి నమస్కారముచేసి "ఓ రాజా! విపరీతమగు కర్మను స్మరించుకొని నవ్వుచుంటిమి. ఎంగిలాకుల కాశించి యింతబాధ ననుభవింప వలసివచ్చినది. నిర్భయముతో విలాసభోగముల ననుభవించుచున్న మీకెన్నిబాధలు

ముందు తటస్థించునో! ఏయేదండన లనుభవింపవలసి వచ్చునో తెలి యుటలేదు. మాంసపుదునకె కాశించి మీనము మరణము నొందు చున్నది. మీనమును జంపి యుదర పోషణము జేసికొనువారి స్థితి యేమగునో తెలియదు. భవిష్యత్తులో మీ రెంత దుఃఖము ననుభవించె దరో!,, యని నవ్వుచున్నామని చెప్పగా నవాబు పశ్చాత్తాపముతో రాజ్యసంపదను త్యజించి, యెవరికిని జెప్పక మహారణ్యమునకు బోయి, యేకాంతస్థలమున నుద్విగ్నమానసుడై "సత్సాంగత్యము చేయని దీను డను. ఈశ్వరభజన యెట్లు చేయవలెను? యోగసాధన యెట్లు చేయ వలెను? గరుడధ్వజు నెట్లర్చింపవలెను? భగవంతుని కృపాదృష్టి నాపై యెట్లు కలుగును? జనులలో గలిసిమెలసి యెట్లు వర్తింపవలెను? నాకు భక్తుల దర్శన మెప్పుడు కలుగు" నని పరిపరివిధముల జింతించుచుండెను.

ఆషాఢ శుద్ధైకాదశికి పంఢరీపురములో జరుగు బ్రహ్మోత్సవ మును సేవించుటకై తంబుర తాళ మృదంగాది వాద్యములతో హరి నామ సంకీర్తనల జేయుచు, భక్తులు పతాకహస్తులై యానందముగ నృత్యము జేయుచు బోవుచుండిరి. రాజు వారిని జూచి హృష్టచిత్తుడై సాష్టాంగనమస్కారము జేసి నా పూర్వసుకృతవిశేషముచే మహాత్ముల దర్శనము లభించినది. నేడు ధన్యమైన సుదినము. నా సంకల్పము పూర్తి యైనదని యానందించుచు నా భక్తులతో హరినామసంకీర్తన జేయుచు, పంఢరీపురము జేరి చంద్రభాగానదిలో స్నానము జేసి పుండలీకుని దర్శించి యచ్చట గల భక్తులకు నమస్కారము జేసెను. పిదప క్షేత్రప్రదక్షిణ జేసి మహాద్వారములో బ్రవేశించి, యచట భక్తులు జేయుచున్న హరి నామసంకీర్తన శ్రవణముచేసి, సంతోషచిత్తుడై "అసంఖ్యాకములగు తీర్థ ములను సేవించి ఆ యా క్షేత్రములలో గల దేవతామూర్తులను దర్శిం చితిని. క్షేత్ర మాహాత్మ్యమును వినియుంటిని. కాని పంఢరీక్షేత్రముతో సమమగు మాహాత్మ్యము గల క్షేత్రము త్రిభువనములందును లేదు. ఉపమానముగ వర్ణించుట కుత్తమమగు స్థల మొక్కటియు కన్పించుట

లే॥ దని తలచెను. ఎంత నీచులైనను, మహా పాతకులైనను పంఢరీ క్షేత్రమును దర్శించినచో ప్రేమభక్తులగుదురు. ఇతర క్షేత్రముల దర్శనముచే నభిమానము వృద్ధియగును. కాని నిరభిమానము కలుగదు. చంద్రభాగా స్నానమువలన నిరభిమానమగును. ఇట్టి మహిమవిశేషము గల క్షేత్రమును జూచి రాజమిత్రానందమును బొంది సభామంటపమున హరినామసంకీర్తన జేయుచున్న భక్తులకు నమస్కారముజేసి యాలింగనము జేసికొని గరుడ హనుమంతులను సేవించి గరుడమంటపము, శేజారమంటపము దాటి గర్భాలయములో ప్రవేశించి సింహాసనముపై నధిష్ఠించియున్న పరబ్రహ్మమూర్తిని జూచి సద్భావముతో నాలింగనము జేసికొని "జయజయ పురాణపురుషా, సగుణస్వరూపా, హృషీకేశా, లీలానాటక సూత్రధారీ, సర్వేశా, పంఢరీశా, శ్రీ విఠలా!" అని ప్రార్థించి చేతులు జోడించి "ఓ దేవా! నీ కీర్తి విని నిన్ను శరణు బొందుటకు వచ్చితిని. నీ స్వరూపమును గుర్తించుటకు నాకు సద్గురువు లభించలేదు. నా మనోరథమును బూర్తిచేయు" మని చెప్పి శయనమంటపమున దీక్షలో గూర్చుండి యన్నాహారముల ద్యజించి నిష్ఠతో ధ్యానధారణుడై యుండెను.

రాజు మూడహోరాత్రములు దీక్షలో గడపిన పిదప శ్రీ రుక్మిణీకాంతు డదృశ్యరూపమున సాక్షాత్కరించి యాతనికి వివేకసింధు వను గ్రంథమునిచ్చి "కళ్యాణలో సహజానందస్వామి గలడు. నీ వతనియొద్ద నుపదేశమును బొందు" మనిచెప్పి యంతర్ధానుడయ్యెను. ఆ రాజు పుస్తకమునుజూచి భగవంతు డదృశ్యముగ జెప్పిన విషయముల కాశ్చర్యపడి "నేను ధన్యుడనైతి"నని యానందించి యా గ్రంథమును మననము జేయుచుండెను. రాజు భగవంతుని యాజ్ఞ బొంది కళ్యాణనగరమునకు బోగా నచ్చట సద్గురుడు లేనందున కార్తీకమాసమునకు పంఢరీ క్షేత్రము జేరెను. సహజానందస్వామి యాకస్మికముగ పంఢరీక్షేత్రమునకురాగా రా జాతనిని గలిసికొని తనకు భగవంతు డదృశ్యముగ జెప్పిన విషయమంతయు సవిస్తరముగ జెప్పెను.

సహజానందస్వామి యమితానందముబొంది రాజునకు మంత్రోపదేశము జేసి, మృత్యుంజయుడని నామకరణము జేసి, యీ క్షేత్రమునందే వసింపుమని యాజ్ఞాపించెను. మృత్యుంజయుడు సద్గురుముఖమునుండి శ్రవణమనన నిది ధ్యాస సాక్షాత్కారానుభవములను దెలిసికొని విజ్ఞాన స్థితిని బొందెను. భవరాయుడను జంగము మృత్యుంజయుని యొద్ద నుపదేశమును బొందెను. సముచ్చయ జంగముడు జంగములలో శ్రేష్ఠుడైయుండి భవరాయుని నిందించుచు యవనుడగు మృత్యుంజయుని యొద్ద నుపదేశమును బొందెనని సంఘమునుండి వెలివేసెను. శూద్రుని యొద్ద బ్రాహ్మణులు పక్వాన్నములను సేవింపనట్లును, మద్యము వేసిన పాత్రలో గంగోదకము బోసిన నెవ్వరును సేవింపనట్లును, నూతన పాదరక్షలైనను నెవరును శిరమున ధరింపనట్లును, బాదముల కలంకరించు పట్టా లెవ్వరును నాసికకలంకరించు కొననట్లును,నిత్తడి ప్రకాశవంతముగ గనబడినను కనకమునకు సరికానట్లును, యవనుని సద్గురువుగా భావించి యుపదేశమును బొందరాదని సముచ్చయ జంగము వికల్పచిత్తుడై భవరాయుని నానావిధముల నిందించుచుండ భవరాయుడు మృత్యుంజయుని నొద్దకువచ్చి యాతనికి నమస్కారము జేసి కులస్థులు తన్ను బహిష్కరించి నిందించుచున్నారని చెప్పెను. మృత్యుంజయుడు భవరాయుని జూచి "వికల్పనలను ద్యజింపుము. ఎవ్వరు ద్వేషించుచున్నను నిందావాక్యములను వినక స్థిరచిత్తుడవై సర్వకాలములందును నీశ్వరభజన జేయుచుండు"మని చెప్పెను.

అచ్చట కాశీపతియను భూపతి యుండెను. ఆతడు పరమోదారుడును జ్ఞానవంతుడును, శివభక్తుడునైయుండి ప్రతినిత్యము దనమందిరమున బదివేల జంగములకు బూజజేసి షోడశోపచార విధుల మృష్టాన్న భోజన మిడుచుండెను. ఒకదినమున గాశీపతి జంగములను బూజించి పంక్తిలో గూర్చుండబెట్టి పక్వాన్నములను మృతమును వడ్డించి శంకరునికి నైవేద్యము జేయుడని చెప్పెను. జంగము లుత్తరీయము నెత్తి చూచుకొనగా లింగములు లేనందున విపరీతముగ నున్నదని లజ్జపడు



మృత్యుంజయుని జంగములు శరణు బొందుట.

చుండిరి. షట్ఛాస్త్రములయందు నిపుణుడైన బ్రాహ్మణుడు తనయజ్ఞోప వీత మెచటనైనను జారిపోయినచో లజ్జించునటుల తమలింగములు పోయినందులకు జంగములందరును లజ్జపడుచుండిరి. పిదప నాజంగములు పరిపరివిధముల నాలోచించి "శివపూజ జేయ నిదెట్లు భుజింపవలెను. లింగములు బోవుట మననియమమునకు విరుద్ధము. శాస్త్రోక్తముగవిచా రించినచో మనము దేహాంత ప్రాయశ్చిత్త మొనర్చుకొనవలెను. ప్రథ మమున కులగురువు మనకు లింగములు గంఠమునగట్టినప్పుడు దేహాం తమువరకు లింగములను త్యజింపమని ప్రతిజ్ఞ జేయించెను. మన కంద రికి నొకేదుస్థితి వచ్చిన"దని పరిపరివిధముల నా పదివేల జంగములు జింతించుచుండిరి.

కాశీపతి జంగములను జూచి "మీలో నెవరైనను భక్తులను నిందించివచ్చిరా? విశ్వేశ్వరుడు క్షోభించినటుల నాకు దోచుచున్నది. దీనికి ముఖ్యముగ దగిన కారణముండు"నని యా భూపతి చెప్పగా సము చ్చయుడు "నేను భవరాయు నవింధుడగు మృత్యుంజయునొద్ద నుప దేశమును బొందితినని నిందించి యాతని బహిష్కరించితి"నని చెప్పగా కాశీపతి "మీరు మృత్యుంజయుని యొద్దకుబోయి సంకటనివారణ జేయు మని ప్రార్థింపు"డని చెప్పెను. రాజవచనములకు జంగములెల్లరు నానం దించి "అచటనుండి మృత్యుంజయుని మఠమునకు బోయి యాతనికి సాష్టాంగ నమస్కారముజేసి చేతులుజోడించి "అయ్యా మేమజ్ఞాన ముచే మిమ్ము నిందించితిమి. శ్రీశంకరుడు మా లింగముల నంతర్ధా నముజేసెను. తాము దయచేసి మా యపరాధమును క్షమించి యథా ప్రకారముగ మాలింగముల ననుగ్రహింపు"డని ప్రార్థించిరి.

మృత్యుంజయుడు గర్జించుచు "వేదాంతము, సిద్ధాంత మను రెండు కుక్కలు నాదగ్గర కలవు; ఆ కుక్కలు మీ లింగముల నపహ రించె" నని చెప్పి "ఓ వేదాంతా! ఓ సిద్ధాంతా! త్వరితముగరం" డని కేకవేయ రెండుకుక్క లచ్చటికి వచ్చి నిలువబడి యుండగా మృత్యుం జయు డా శ్వానములను జూచి "వ్యర్థముగా వారల లింగములను

దొంగిలించుటచే జంగములు మిగుల దుఃఖించుచున్నారు. కాన వారి లింగములను వారికి దత్‌క్షణమే యిచ్చివేయు" డని చెప్పెను. వేదాంత మను శ్వాన మైదువేల లింగములను గ్రక్కెను. సిద్ధాంత మను శ్వాన మైదువేల లింగములను గ్రక్కెను. ఈ కౌతుకమును జూచి సర్వులును నాశ్చర్యచకితులైరి. "భగవద్భక్తుల మహిమవిశేషము వర్ణించుటకు సాధ్యముకాదు. వారే జాతివారైరను నిందింపరా" దని చెప్పుకొనుచు భావపూర్వకముగ జంగములెల్లరును మృత్యుంజయునికి సాష్టాంగనమ స్కారము జేసి భవరాయుని దిరిగి కులములో జేర్చుకొనిరి. పిదప నా జంగములెల్లరు కాశీపతి గృహమునకేగి తమ లింగములకు నైవేద్యము జూపి భుజించిరి. జనులెల్లరును జయజయధ్వనులు జేసి మృత్యుంజయుని మహిమవిశేషమును బరిపరివిధముల గొనియాడుచుండిరి.

ఏబదియవ అధ్యాయము సమాప్తము.

శ్రీ సనాతనాయ నమః.

# భానుదాస చరిత్ర

## —♦ ఏబదియొకటవ అధ్యాయము ♦—

జయజయ వాసుదేవా, జగన్నాథా, కమలలోచనా, రుక్మిణీ కాంతా, నిజభక్త సుఖదాతా, పద్మనాభా, విశ్వమూర్తీ, విధిజనకా, వైకుంఠపతీ, విరాట్స్వరూపా, వామనమూర్తీ, విశ్వబాహూ, అపరిమితా, విశ్వపదీగమనకర్తా, విశ్వచక్షూ, నిగమకర్తా, హృషీకేశా, క్షీరాబ్ధివాసా! జనని తన బాలకుని చేయి పుచ్చుకుని నవ్వుచు నడచుచుండును. ఆబిడ్డ యే యపశబ్దములు బలుకుచున్నను విని యమితానందమును బొందుచు నాతనిని ముద్దుపెట్టుకొని యాతనితో నపశబ్దములతోనే మాడలాడునట్లు, భక్తులకు పూర్ణజ్ఞానము లేకపోయినను, వారే యపశబ్దములతో నిన్ను స్తుతించినను నీ వమితానందముతో వారల రక్షించుచున్నావు.

గోదావరీ నదీ తీరమున ప్రతిష్ఠానపుర మను (పైఠనపురము) క్షేత్రము గలదు. ఆ క్షేత్రమున సూర్యోపాసకుడు, జ్ఞాని, పవిత్రుడు, భగవద్భక్తుడగు నొక విప్రోత్తము డుండెను. ఆతడు బహుకాలము సూర్యభగవాను నారాధింపగా సూర్యనారాయణు డాతనికి పుత్రుడై జన్మించెను. పండ్రెండవదినమున నా బాలునికి జాతకర్మ గావించి భానుదాసని నామకరణము జేసిరి. ఆతడు దినదినప్రవర్ధమానుడుకాగా, నైదవ సంవత్సరమున నక్షరాభ్యాసమును, పిదప నెనిమిదవ సంవత్సరమున నుపనయనసంస్కారమును జేసి దశకంఠ బ్రాహ్మణునియొద్ద నధ్యయనమునకై భానుదాసు నప్పగించిరి. ఉపాధ్యాయు డెన్నివిధముల దండించినను భానుదాసునకు విద్య యలవడలేదు. తల్లిదండ్రులు నిత్యమూ దండించుచుండిరి.

ఇట్లు కొంతకాలము జరిగినపిదప భానుదాసు, జననీ జనికులవలనను, గురువుల వలనను దండన ననుభవింపలేక యొకరోజున ధైర్యము జేసి గృహమును త్యజించి పోవు టుచితమని తలచి యచటికి సమీప

మున బురాతనమై శిథిలమై భూగర్భముననున్న యొక దేవాలయమున బ్రవేశించి యాలయమంతయు బరికించిచూడగా సూర్యనారాయణుని విగ్రహము కనబడెను. భానుదాసు సూర్యనారాయణు నాలింగనము జేసికొని యాతని పాదములపైబడి నమస్కారముజేసి యచటనే యుండెను.

సూర్యభగవానుడు భానుదాసు నిశ్చయభావమునకు సంతసించి మనుష్యరూపముతో దర్శనమిచ్చి యొకపాత్రతో క్షీరము త్రాగుమని యాతనికిచ్చెను. భానుదాసాక్షీరము పానముజేసెను. ప్రతినిత్యము సూర్యనారాయణుడు బ్రాహ్మణరూపముతో నాతనికి క్షీర మొసంగుచుండెను. ఇట్లేడు దినములు జరిగిన పిదప సూర్యభగవానుడు నిజరూపముతో నాతనికి దర్శనమిచ్చి "నీవు నిర్భయముగ (శ్రీ) పాండురంగ దేవుని స్మరించుచుండుము. నీకేమైనను సంకటములు సంప్రాప్తించిన నన్ను స్మరింపు"మని చెప్పి యంతర్ధానుడయ్యెను.

భానుదాసు గృహత్యాగము జేసినపిదప జననీజనకులు గ్రామమంతయుశోధించి యెచ్చటను నాతనిజాడ తెలియక చింతాక్రాంతచిత్తులై పరిసర గ్రామములకు మనుష్యులనుబంపి శోధించుచుండిరి. ఒకనాడు భానుదాసు సూర్యనారాయణుని యాలయమునుండి వెలుపలకు రాగా నాకస్మికముగనొక బ్రాహ్మణుడు చూచి యాతని తండ్రితో జెప్పెను. పుత్రునిజాడ తెలియుటచే జననీజనకులు హర్షించి కొందరు మిత్రులను వెంటబెట్టుకొని భూగర్భముననున్న యాలయములో బ్రవేశించి దివిటీలను వెలిగించి చూడగా సూర్యభగవానుని విగ్రహమును బూజించుచు భానుదాసు కనబడెను తల్లిదండ్రులాతని నెత్తుకొని "ఏడు దినములుగ బ్రాణము నెట్లు కాపాడుకొంటివి? ఈ ప్రదేశమున నన్నపానీయాదు లెట్లు లభించె"నని విచారింపగా భానుదాసు జననీజనకులను గ్రామస్థులనుజూచి "తేజోవంతుడగు నొక బ్రాహ్మణోత్తముడు నాకు బ్రతి నిత్యము క్షీరమునొసంగుటచే ప్రాణమును రక్షించుకొంటి"నని చెప్పగా

నెల్లరు నాశ్చర్యపడి "సాక్షాత్సూర్యనారాయణుడే యీతనికి దర్శన మిచ్చియుండెను. ఈతనికి భానుదాసను నామము సార్థకమైన"దని యానందించి యాతని నచటనుండి తీసికొనిపోయిరి. జననీ జనకులు కుమారుని విద్యావిషయమై దండించినచో నాతడు తిరిగి పలాయను డగునని వానికి ప్రారబ్ధమున విద్యయలవడు యోగము లేదని తలచి యూరకుండిరి.

ఇట్లు కొన్ని దినములు జరిగినపిదప జననీజనకు లొకకన్యకను విచారించి భానుదాసునకు వివాహము జేసిరి. కొన్ని దినములైనపిదప వృద్ధులైన యాతని జననీ జనకులు దివంగతులైరి. భానుదాసు ప్రపంచ వ్యవహారములలో దగుల్కొనక వ్యాపారోద్యోగాదుల జేయక శ్రీ పాండురంగని భజింపుచు కాలము గడపుచుండెను. కొంతకాలమున కాతనికి సంతానప్రాప్తి కలిగెను. పూర్వార్జితమగు ద్రవ్యము నానాటికి క్షీణించి కుటుంబపోషణము జరుగు నుపాయము లేక యెన్ని యిక్కట్లు కలిగినను నేదైనను గృషిచేసి ద్రవ్యమార్జించి కుటుంబపోషణ జేయవలయు నను తలంపు భానుదాసునకు బొత్తిగ లేకుండెను. ఆతని భార్యయు బిడ్డలును పస్తులుండుట జూచి యాప్తులు వచ్చి భానుదాసును జూచి "నీ జననీ జనకులు సజీవులుగ నున్నంతవరకు వారి పోషణలో నుంటివి. నీకు విద్య యల్పము. కుటుంబము పెరిగినది. ద్రవ్యార్జనకొఱకు కృషి యేమియు చేయవు. ఎన్ని దినములు పస్తులతో గాలము గడచును. ఆప్తులమగు మేము చూచి సహింపలేక యెంతకాలము సహాయము చేయుదుము? ఒక యుపాయము జెప్పెదము. వినుము. నూరు వరహాలను నీ కప్పిచ్చెదము. దానితో వస్త్రములను గొని పరిసరగ్రామముల కేగి విక్రయింపుచు నా లాభముతో గుటుంబపోషణము జేసికొనుము. మా యప్పును నిదానముగ దీర్చుకొనుము" అని చెప్పి వారే నూరు వరహాల విలువగల వస్త్రముల గొని యిచ్చి పరిసర ప్రాంతములందు దిరుగు బట్టలవర్తకులతో నీతనికి స్నేహమును కలిపి "వర్తక మభ్యాస

మగువరకు మీ రీతనికి సహాయముగ నుండుము. కుటుంబీకుడు. మీకెం తైనను పుణ్యముండును" అని వర్తకులతో చెప్పిరి.

భానుదాసు వర్తకులతో గలిసి గుఱ్ఱముపై వస్త్రముల మూట నిడుకొని పరిసరప్రాంతములకు బోయెను. ఒకగ్రామమున వీరెల్లరును సంతలో వస్త్రములను జేర్చుకొని కూర్చుండియుండిరి. భానుదాసుకో వర్తకులు వ్యాపారమర్మము లనేకములను జెప్పగా నేను కల్పాంతమం దైనను నసత్యమును జెప్పను. వ్యాపారము జరుగకపోయినను నాకు సమ్మతమే" యని భానుదాసు చెప్పగా "భగవంతుడు దరిద్రదేవతను నీ శిరముపై నుంచెను" అని వారు నిందించిరి. గర్భాంధునకు జను లెల్లరు నేత్రహీనులేయని తోచునట్లును, రోగి పక్వాన్నము చేదుగా నున్నదని తలచునట్లును, నా వర్తకులు నవ్వుచు నసత్యము జెప్పనిచో వీడేమి వర్తకము జేయును? యదార్థము జెప్పినచో వ్యాపారము జరుగ దని పరిపరివిధముల బరిహసించుచుండిరి. భానుదాసు వస్త్రములన్నిటిని బేర్చుకొని భగవన్నామస్మరణ జేయుచు, కూర్చుండియుండ గ్రాహిక జనులు వచ్చి ధోవతుల ఖరీదెంత? అని విచారించిరి. అంత భానుదాసు "నేను నాలుగురూప్యములకు గొంటిని. ఒక్కరూప్యము లాభము. మీకు సమ్మతమైనచో దీసికొనుడు. నేను బేరమేమియు జెప్పువాడను గాను" అని పలికి భగవన్నామస్మరణను జేయుచుండెను. సంతకువచ్చిన జను లీతడు "మహాభక్తునివలె కనపడుచున్నాడు. అసత్యముల నీతడు పలుక" డని నిశ్చయించి వస్త్రములను గొనుచుండిరి. భానుదాసు సంతకు దీసికొనిపోయిన వస్త్రములు కొన్ని ఘడియలలోనే యమ్ముడు బోయెను. భానుదాసు తత్క్షణమే గుఱ్ఱముపై స్వారీజేయుచు పోయి మరల నా ద్రవ్యముతో వస్త్రములను దెచ్చి యా దినపు సంతలోనే యవియన్నియు పూర్తిగ విక్రయించెను. వర్తకులు కుటిలచిత్తులై "వీడు భగవన్నామము జేయుచు గూర్చుండి వచ్చినవారికి హితవచనములజెప్పి వస్త్రములను వారి కంటగట్టుచున్నాడు. వీనివలన మన

వ్యాపారము నాశనమగును. కాన వీనిని మన వెంట నుంచుకొనగూడదు" అని నిశ్చయించుకొనిరి.

ఈ ప్రకారముగా భానుదాసు వస్త్రముల వ్యాపారమును జేయుచుండ నీశ్వరానుగ్రహమున గొలది కాలములో నైశ్వర్యవంతుడై గొప్ప వ్యాపారము జేయుచుండెను. జనులెల్లరు పూర్వము దుస్థితియందున్న భానుదాసిప్పు డఖండైశ్వర్య వంతుడయ్యెనని మిగుల నాశ్చర్య పడుచుండిరి. దురాచారులగు వ్యాపారులు మాత్ర మీతడు వ్యాపారమున బ్రవేశించుటవలన మన వ్యాపారములు చల్లబడిన వనుకొనుచుండిరి. వారిలో గొందరు వీడు వశీకరణ విద్యనేదో నేర్చెను. అందుచే గ్రాహకులెల్లరును భానుదాసుయొద్దకే పోవుచుండిరని చెప్పుకొనుచుండిరి. కొందరతడు భజనచేయుచు గూర్చుండుటవలన జనులు విశ్వాసముతో నాతని యొద్దకుబోయి యసత్యమును బలుకడని నమ్మి వస్త్రములు కొనుచుండిరని చెప్పుచుండిరి. మరికొందరు ప్రథమమున మంచిపేరు వచ్చినచో మరణ పర్యంతమాతడు చెడుకార్యములు చేయుచున్నను లోకమాతడు చెడుపనులను జేసెననిన విశ్వసింపదని చెప్పుచుండిరి. "మన మసత్యము పలుకుటచే భగవత్సహాయము లభించుట లేదు. మనమాటలను ప్రజలును విశ్వసింపరని మరికొందరు చెప్పుచుండిరి. ఈ ప్రకారముగ గొన్నిదినములు గడచిన పిదప నొకనాడు భానుదాసేకాదశీ దినమున సంతకేగనా గ్రామమందొక హరిదాసువచ్చి యచ్చట నొక దేవాలయమున హరికథ జెప్పుచుండెను. భానుదాసు తోడివర్తకులతో "అయ్యా! నేడేకాదశి, దేవాలయమునకుబోయి హరికథను వినివచ్చెదను. మీరీ వస్త్రములమూటను గాపాడుచుండుడు" అని చెప్పగా నా కుటిలురు "అయ్యా నేము నిద్రనాపుకొనలేము. మామూటలను మేము కాపాడుటయే యసాధ్యము. మీమూట నెక్కడ కాపాడగలము" అని పలికిరి. భానుదాసు వారినిజూచి "నేను హరికథా శ్రవణమునకు బోవుచున్నాను. మీకు వీలున్నంతవరకు గాపాడుడు" అని చెప్పి వెడలిపోయెను.



భానుదాసు వస్త్రములమూటను విడచిపోవుట

భానుదాసు దేవాలయమును బ్రవేశించి హరిదాసునకు సాష్టాంగ నమస్కారము జేసి నేడు ధన్యదినము, ఏకాదశీ పర్వకాలమున హరి కథా శ్రవణజేయు భాగ్యము లభించినదని యానందించుచు నిశ్చల చిత్తుడై కథాశ్రవణము జేయుచుండెను. గుటిలులగు నా వర్తకులు భాను దాసునం దసూయచే నందరును గలిసి సమాలోచనలుజేసి యావస్త్రపు మూటలను గ్రామమువెలుపల బారవేసి గుఱ్ఱమును గట్లువిప్పి విడచి పెట్టిరి. భానుదాసు దేవాలయమున నఖండముగా కథాకాలక్షేప ములో లీనుడైయుండ దుర్జనులాతనికి జేసిన ద్రోహమునుజూచి శ్రీపం ఢరీనాథుడు తత్క్షణమే యొక బ్రాహ్మణుని వేషమును ధరించి భాను దాసు వస్త్రపు మూటలను దీసికొని పారిపోవుచున్న గుఱ్ఱమును తన యుత్తరీయము నా యశ్వకంఠమునకుగట్టి వస్త్రపుమూటల నాయశ్వ ముపైనుంచి దేవాలయమున కెదురుగా భానుదాసు రాకకెదురు చూచుచు నిలువబడి యుండెను. భగవంతుడు భానుదాసున కపకారము జేసిన వర్తకుల నవకృపతో జూచుటచే నాకస్మికముగ నొక బందిపోటు దొంగలముఠా యచటికివచ్చి యా వర్తకుల యశ్వములను వస్త్రముల మూటలను వారియొద్దనున్న ద్రవ్యమును, దోచుకొని వారిని బాగుగ జావగొట్టి పలాయితులయిరి. పిదప నావర్తకు లేడ్చుచు మహా భక్తు డగు భానుదాసున కపకారము జేయుటచే మనకిట్టి దుస్థితి కలిగినదని చింతించుచుండిరి.

భానుదాసు హరికథ పూర్తియైన పిదప తిరిగి మకామునకు బోవు చుండగా దనయశ్వము సకిలించుటను విని దగ్గరకు బోయి చూడగా నొక బ్రాహ్మణు డుత్తరీయముతో దాని కంఠమును గట్టిగ పట్టుకొని నిలువబడియుండి తత్క్షణమే యంతర్ధానుడయ్యెను. భానుదా సాశ్చ ర్యముతో దనగుఱ్ఱమును వెంటబెట్టుకొని తన మకామునకు జేరగా వర్తకులెల్లరును నాతని పాదములపై బడి దీర్ఘస్వరములతో రోదనము జేయుచు "మేము దుర్బుద్ధిచే మీ కపకారము జేయగా నర్ధరాత్రిసమ యమున దస్కరులగుంపు వచ్చి మా సర్వస్వమును దోచుకొని,మమ్ముల

చావగొట్టి పోయి" రని జరిగినదంతయు సవిస్తరముగ జెప్పిరి. భాను దాసశ్రుధారలను విడచుచు "నావలన మీకిట్టి దుస్థితి సంప్రాప్తించినది కాన నేనీవ్యాపారము నిక జేయ"నని చెప్పి తనయొద్దనున్న ద్రవ్యమును, వస్త్రములను, నశ్వమును, వారల కర్పించి, నమస్కారముజేసి యచట నుండి బయలుదేరి, మానావమానములను త్యజించి భగవన్నామ సంకీర్తనజేయుచు, నుదాసీనవృత్తితో గాలము గడుపుచుండెను. ప్రత్యాషాఢ కార్తీక శుద్ధయుకాదశికి తంబుర తాళమృదంగాది వాద్యములతో హరినామ సంకీర్తనజేయుచు భక్తులను వెంటబెట్టుకొని పంఢరీపురము నకుబోయి శ్రీ పంఢరీనాథుని సేవించుచుండెను. నానావిధములగు కవిత్వము భగవన్మహిమ నభంగరూపమున వర్ణించుచు కథాకీర్తనలను జేయుచుండ నాతనికెదురుగ శ్రీ రుక్మిణీకాంతుడు వచ్చి నృత్యము జేయుచుండెను. దుష్టులు, నజ్ఞానులును, బరమ నీచులుసహితము భాను దాసుని యుపదేశవాక్యములను విని భావుకులగుచుండిరి. పిదప భానుదా సమూచితవృత్తి నవలంబించి యఖండముగ భగవన్నామ సంకీర్తన జేయుచు సర్వభూతములయందు సమభావముతో వర్తించుచు కాలము గడపుచుండెను.

ఏబదియొకటవ అధ్యాయము సమాప్తము.

వసుదేవాత్మజాయ నమః.

---

# రామరాజ చరిత్ర

## —♦ ఏబదిరెండవ అధ్యాయము ♦—

శ్రోతలారా! సావధానచిత్తులై వినుడు. నేడు కల్పవృక్షము ఫలించినది. అతి రసవంతములగు భక్తుల సచ్చరిత్రలు ఫలరూపములుగ వెలువడినవి. అగాధమగు వైష్ణవమహిమ దెలిసికొనుటకు విరించికిని, వేదములకు నసాధ్యము. సత్కర్మను ప్రధానముగా ననుష్ఠించువారు బ్రహ్మపదమును బొందెదరు. యజ్ఞయాగాదుల జేయువారు స్వర్గసౌఖ్య మనుభవింతురు, పితృసేవ జేయువారు పితృస్థాన మలంకరింతురు. నానావిధ దేవతల నుపాసించువా రా యా దేవతాస్థానములను బొందెదరు. తామసగుణులు పిశాచముల నుపాసించి దేహాంతమునందు తద్రూపులగుదురు. భక్తుల కథలను శ్రవణముజేయువారు భగవత్సన్నిధి నలంకరింతురు. వారలకు గలుగు విఘ్నములను భగవంతుడు నివారణచేసి సర్వవిధముల రక్షించును.

తుంగభద్రా నదీతీరమున విద్యానగరమను (హంపీ) క్షేత్రము కలదు. అచ్చట రామరాజు 16 వ శతాబ్దమునందు పరిపాలన జేయుచుండెను. పంఢరీపురక్షేత్రమున గల నొక బ్రాహ్మణోత్తము డొక యాగమును జేయదలచి దేశదేశములకును ద్రవ్యసహాయమునకై దిరుగుచు నాకస్మికముగ విద్యానగరమున బ్రవేశించి స్నానసంధ్యలు నెరవేర్చుకొని రాజసభలో బ్రవేశించెను. రామరాజా బ్రాహ్మణుని జూచి యుచితాసనముపై గూర్చుండ నియమించి కుశలప్రశ్నము జేయగా ద్విజుడు రామరాజు ధర్మమూర్తియని యానందించెను. రామరాజా బ్రాహ్మణుని జూచి "తా మే కార్యార్థముగ నెచ్చటనుండి విచ్చేసితి" రని యడుగగా బ్రాహ్మణోత్తము డుల్లాసముతో "పరమ పవిత్రమగు పంఢరీక్షేత్రమున నేను వసించెదను. నే నా క్షేత్రమున యాగముజేయ సంకల్పించి ద్రవ్యసహాయమునకై పలు ప్రదేశముల దిరుగుచు మీ యౌదార్యమును విని యిచ్చటికి వచ్చితి" నని చెప్పగా రామరాజు విని సంతోషించెను.

రామరాజు బ్రాహ్మణోత్తముని జూచి "అయ్యా! నాకు పూజా సమయమైనది నేను త్వరితముగా బోయి చండికాదేవిని బూజించి యిప్పుడే వచ్చెదను! మీరును నా దేవిని దర్శింపగోరినచో రం"డని చెప్పగా ద్విజుడు హృష్టచిత్తుడై రామరాజుతో బోయెను. శోభాయమానమగు పుష్పవనమును, దానికి మధ్యగా దేవాలయము నుండెను. రామరాజు గర్భాలయమున బ్రవేశించి షోడశోపచారవిధుల బూజించుచుండెను. నానావిధములగు వాద్యములును, ద్విజుల మంత్రోచ్చాటనలును, నానందముగ జరుగుచుండెను.

రామరాజు చండికాదేవి కమూల్యములగు పీతాంబరములును, రత్నఖచితాభరణములును నలంకరించి ధూపదీపాదులను, నానావిధ పక్వాన్న నైవేద్యములును సమర్పించి మంగళహారతిజేసి ప్రసాదము నచటగల జనులెల్లరికి నిచ్చి స్వస్థచిత్తుడై మంటమున గూర్చుండి ద్విజోత్తముని బిలచి "విప్రోత్తమా! చండికాదేవితో సమానమగు దైవము త్రిభువనములందు శోధించినను గనబడదు. సౌందర్యయుక్తమగు శిల్పకళలతో జాతుర్య యుక్తముగ నిర్మించిన దేవాలయ మంటపములును, నానావిధ పరిమళములనొసంగు పుష్పవనమును, త్రికాలముల యందు మిగుల వైభవముగ జరగు సేవార్చనాద్యుపచారములును, పూజా సమయములందు నగరవాసులెల్లరు విచ్చేసి దేవిని దర్శించు నానందమును నమూల్యమగు నవరత్న ఖచితములై యున్న నానావిధములగు నలంకారముల శోభయు, నెచ్చటను లేదు. నీవు పంఢరీపురమున నే వసించి యుంటివిగదా! నా చండికాదేవితో సమమగు వైభవములును, నుపచారములును, నీ పాండురంగనికి జరిగియుండవు. ఆ క్షేత్రమున వసించు భక్తులును, ప్రజలును, దుర్బలులు, వార లమూల్య వస్త్రాభరణాదుల నెట్లు సమర్పింపగలరు? అందుచే శ్రీ పంఢరీనాథుడును దుర్బలుడుగనే యుండు"నని బలికెను.

అంత బ్రాహ్మణోత్తముడు క్రోధముతో "ఓ రాజా! నీవు పంఢరీక్షేత్రమును జూడకయే యభిమానముతో నీ దేవత గొప్పదని పలుకు

చున్నావు. పంఢరీపురము విశ్వకర్మచే నిర్మింపబడినది. శ్రీ విఠ్ఠలనాథుని సాన్నిధ్యమున కల్పవృక్షమును, చింతామణులును, గామధేనువులును గలవు. ఆ దేవాలయముపైగల పతాకము మెరుపువలె మెరయుచుండును అచ్చట రత్నఖచితమగు తులసి బృందావనము గలదు. దేవాలయ మంటపములు సువర్ణ రత్నములమర్చిన శిల్పములతో నిండియుండును. అచ్చట ప్రేమభక్తు లుల్లాసములతో సభామంటపమున హరి నామ సంకీర్తన జేయుదురు. ఆ క్షేత్రమునగల చంద్రభాగానదియందమృతము ప్రవహించును. రంభ తిలోత్తమ మొదలగు సుందరాంగనలు గరుడ మంటపమున నృత్య సంకీర్తనలు జేయుచుందురు. గంధర్వులు చేయుగాన మపారమై నాదబ్రహ్మముగ నాకాశమునంతయు నావరించియుండును. దేవాదిదేవుడగు శ్రీ రుక్మిణీకాంతుడు క్షీరసాగరము నందుండి పుండలీకుని భక్తికి వశవర్తియై యచ్చటికి విచ్చేసి కటిన్యస్త హస్తములతో నిలువబడి భక్తుల రక్షించుచున్నాడు. ఆతని సౌందర్యమును జూచి లక్ష్మీదేవి సిగ్గుపడును. కోటిసూర్య ప్రకాశమానమగు తేజముతో శ్రీ విఠ్ఠలనాథుడు విరాజమానుడుగ నున్నాడు. శ్యామల సుకుమారమైన శరీరము, నమూల్యరత్నము లమర్చిన సుందర కిరీటమును, మకరాకారములగు దివ్యకుండలముల, నమూల్య పీతాంబరములును, తులసీమిశ్రిత కోమల పుష్పహారములును, ధరించి భక్తాభిమానియై నిలువబడి యున్నాడు. ఆతని రూపమును దర్శించుటకై ముప్పది మూడు కోట్ల దేవతలును చేతులు జోడించుకొని సద్భావముతో స్తవము జేయుచు దర్శనమునకై వేచియుందురు. అహర్నిశము నాతని నామము జపించు కైలాసపతికిని, శ్రుతి శాస్త్రములకును, విరించికిని, సహస్రముఖములుగల నాదిశేషునకు నాతని మహిమ విశేషము వర్ణించుటకు దరముకాదు. పాండురంగనితో సమానమైన దైవమును, పంఢరీ క్షేత్రముతో సమానమగు పుణ్యతీర్థమును, త్రిభువనము లందునులేవు. మీరు నేత్రములతో జూడకయే వ్యర్థముగా మీ కులదేవతయగు చండికాదేవిని గొప్పగా బొగడుట నాకు యుక్తముగా గనబడుటలేదు. ఈ దేవత

శ్రీ పంఢరీనాథుని యాలయములో నుదక ప్రోక్షణముజేసి ముగ్గులు పెట్టుచుండు"నని చెప్పగా రామరాజు కోపోద్దీపిత మానసుడై "ఓరీ! నాయారధ్య దేవతయని కొంచెమైనను విచారింపక నిందించితివి. నీకు వినాశకాలము సమీపించినది. నిశ్చయముగ నిన్ను శిక్షింతును. నీవు జెప్పినదంతయు నసత్యమే. దేవాలయమున నమూల్యమగు రత్నము లును, సువర్ణమును, శిల్పమున నమర్చబడియున్నవని జెప్పితివి. నేనీ విషయ మెవరివలనను వినియుండ లేదు. అయినను నాకా విచారముతో బనిలేదు. కాని నాచే నారాధింపబడుచున్న చండికాదేవి యా దేవా లయమున దాస్యము చేయుచున్నదని పలికితివి. నిశ్చయముగ నాలో చించుకొని మరియొక పర్యాయము చెప్పుము. లేనిచో నిన్నిచటనే వధించెద"నని చెప్పెను.

అంత ద్విజోత్తముడు చేతులుజోడించి "నృపవరా! కోపింపకుము. నేను చెప్పినదంతయు యదార్థము. నీవు తత్క్షణమే పంఢరీక్షేత్రము నకువచ్చి శ్రీ రుక్మిణీకాంతుని దర్శింపుము. నేను చెప్పినదానికంటె కోటి గుణము లధికమహిమ విశేషము నీ దృష్టిలో గనబడని యెడల దప్పక నన్ను దండింపుము. ఆ దేవాదిదేవుని దర్శించు పర్యంతము చండికా దేవియే యగ్రదేవతగా నీకుదోచును. సూర్యోదయము కానంతవరకు దీపప్రకాశము గొప్పగ గనబడునట్లును, నైరావతమును జూడనివరకు నితర గజములు గొప్పగా గనబడునట్లును, చంద్రు డుదయింపనిచో నక్ష త్రములు తేజోవంతముగ గనబడునట్లును, సుధారసము లభింపనిచోనితర రసములు మధురములై యుండునట్లును, సముద్రము కన్పట్టనిచో నదియే ఘనముగా నుండునట్లును, గల్పవృక్షమును జూడనివానికి రసాలము ప్రియమైయుండునట్లును, వేదాంతజ్ఞానము వినని వానికి పాఖండజ్ఞాన మానందముగ నుండునట్లును, సువర్ణమును జూడనివాని కిత్తడివస్తువులు ప్రకాశముగ నుండునట్లును, శ్రీ పంఢరీనాథుని దర్శింపనివాని కితరదేవ తలు గొప్పగానుండు" నని జెప్పెను.

రామరాజు క్రోధముతో "నేనిప్పుడే పంఢరీపురమునకు వచ్చె దను. నీవు చెప్పినదంతయు నా దృష్టికి గనబడినచో దర్శించి యానందిం చెదను. నీవు చెప్పిన వసత్యవాక్యములైనచో నీ కచ్చటనే శిరశ్ఛేదము జేసెద" నని చెప్పి, ప్రధానిని, పరివారమును, రథ గజాశ్వములను, శిబి రాభరణములను, సైన్యమును వెంటబెట్టుకొని నానావిధములగు వాద్య ములతో, ద్విజోత్తముల మంత్రఘోషలతో బంఢరీపురమున కేగుచుం డెను. ద్విజోత్తముడు వెనుక నడచుచు, శ్రీ పంఢరీనాథుని మనమున నిలుపుకొని "ఓ రుక్మిణీవరా! దీనుడనగు నన్ను గాపాడుము. నేను చెప్పినవన్నియు రామరాజునకు గనబడనిచో నాతడు నన్ను శిక్షించు నని నాకేమియు భయములేదు, నే ననాథుడను; దీనుడను; బ్రాహ్మణు డను. నీ నామమును వర్ణించుచు, నీ కీర్తిని బ్రకటించుచు, నానాదేశ ములు తిరిగి కుటుంబపోషణము జేసికొనుచుంటిని. నీ యద్భుతకీర్తిని పూర్వము భక్తులు వర్ణించినరీతిని నేను యదార్థముగ రాజునకు జెప్పి తిని. నేను స్వబుద్ధితో నాతని కులదేవతయగు చండికాదేవి నీ దేవాల యమున బరిచర్య చేయుచున్నదనిమాత్రము చెప్పితిని. రాజా విషయ మున కుగ్రుడై తన యారాధ్యదేవత నీ సేవాపరిచర్యల జేయుట యస త్యమని పరీక్షించుటకై నా వెంట వచ్చుచున్నాడు. పంఢరీపుర మాహా త్మ్యమును మహాత్ములెట్లు వర్ణించిరో నే నా విషయములనే జెప్పితిని. పూర్వీకులు ద్రవ్యమును భూస్థాపితముజేసిన దరిద్రున కా స్థానము తెలియనట్లు పంఢరీపురమున గల నీ దేవాలయము రత్న సువర్ణమణుల శిల్పములతో విశ్వకర్మ నిర్మించినదైనను కలియుగమున మానవులు వికల్పచిత్తులగుటవలన భిన్నముగా గనబడును. కాన నేను రామరాజు నకు వర్ణించినరీతి నాతని దృష్టిలో నీ క్షేత్రమును, దేవాలయమును, నాతని చండికాదేవి నీకు దాస్యము జేయుచుండుటయు గనబడవలెను. నేను నా ప్రాణమునకై వెరువను. మహాత్ముల వచనము లసత్యములుగ నుండినచో పంఢరీక్షేత్ర మాహాత్మ్యమును శ్రవణముజేసి జను లవిశ్వా సులగుదురు. కాన ఓ అనాథనాథా, రుక్మిణీవరా, జగదుద్ధారా! ఈ సంకటసమయమున నన్ను గాపాడు" మని ప్రార్థించుచుండెను.

భక్తాభిమానియగు శ్రీ పంఢరీనాథుడు రుక్మిణీదేవిని జూచి "ప్రేయసీ! విద్యానగరమునుండి రామరాజు దర్శనమునకు వచ్చుచున్నాడు. నా కీర్తికి కళంకము రాకుండ క్షేత్రవాసియగు నొక బ్రాహ్మణు డమితోత్సాహముతో క్షేత్రమాహాత్మ్యమును వర్ణించెను. ఆతడు రామరాజుచే నారాధింపబడు చండిక మన దేవాలయమున దాస్యము జేయుచున్నదని చెప్పెను. అహంకారచిత్తుడగు నా రాజు క్రోధముతో బరీక్షించుటకై యాతనిని వెంటబెట్టుకొని వచ్చుచున్నాడు. కాన ద్వారకాక్షేత్రమునకంటె మిగుల వైభవముగను, విప్రోత్తముడు చెప్పినదానికంటె ననంతగుణము లధికవైభవముగను నొక క్షణకాలము రామరాజునకు జూపెదను. లేనిచో నాత డా బ్రాహ్మణు నిచ్చటనే శిక్షించును. దాన మనబిరుదున కవమానము కలుగును. సజ్జనులగు మహాత్ములు పరిహాసింతురు" రని చెప్పగా జగజ్జననియగు శ్రీ రుక్మిణీదేవి "ఓ దేవా! ఒక క్షణకాలము వైకుంఠమే రామరాజుదృష్టికి జూపు" మని చెప్పగా జగజ్జీవనుడు తన భక్తులకీర్తి నభివృద్ధిపరచుటకై వైకుంఠ వైభవమంతయు దత్కాలమందు పంఢరీక్షేత్రములో జూపుచుండెను.

రామరాజును, ద్విజోత్తముడు పంఢరీక్షేత్రములో ప్రవేశించిరి. ద్విజోత్తముడు భీతిచే భగవంతుని బ్రార్థించుచుండెను. రామరా జాతనిని జూచి "ద్విజవరా! ఆలోచించుకొనుము సంశయమున్నచో నిచ్చటనే చెప్పుము. జగజ్జననియగు చండికాదేవి శ్రీ పంఢరీనాథుని దేవాలయమున బరిచర్య జేయుట నిజమేనా? యదార్థము వచించు" మని యడుగగా, "ముంజేతికంకణమున కద్దమెందుకు? క్షేత్రమున ప్రవేశించితివిగదా! నేను చెప్పిన విషయములన్నియు జూచుకొ" మ్మని చెప్పి యా విప్రోత్తముడు భగవంతుని బ్రార్థించుచుండెను. రామరాజు గజేంద్రుని యంబారీలో గూర్చుండి పంఢరీపురమంతయు విలోకించుచు, నత్యద్భుతముగ జూచుచుండెను. పూర్ణిమదినమున నక్షత్రపరివేష్టితుడై చంద్రుడు శోభాయమానముగ నుండునట్లు శ్రీ పంఢరీనాథుని దేవాలయ గోపురమునకు గల కలశము శోభించుటను రామరాజు జూచెను.

తత్క్షణమే రామరాజు విస్మితచిత్తుడై ద్విజోత్తముడు పలికినదానికంటె పంఢరీక్షేత్ర మధికవైభవముగ నుండుటనుజూచి యనుతప్తచిత్తుడై యంగారీనుండి క్రిందికి దిగి దేవాలయ కలశమును దర్శించి సాష్టాంగనమస్కారము జేసెను. పిదప రామరాజు విప్రోత్తము నాలింగనముజేసికొని నీవు చెప్పినదానికంటె విశేషవైభవముగ నాకీ క్షేత్రము కనబడుచున్నదని చెప్పి యాతనికి నమస్కారముజేసి, చంద్రభాగానదిలో స్నానముజేసి భక్తశిరోమణియగు పుండలీకుని దర్శించి యచటనుండి భగవన్నామ సంకీర్తన జేయుచు దేవాలయమునకు బయలుదేరెను.

విప్రోత్తము డమితానందముతో "శ్రీ పంఢరీనాథుడు రక్షించె" నని యాతనిని బరిపరివిధముల బ్రార్థించుచుండెను. ఆ క్షేత్రమునగల భక్తజనులు తంబుర, తాళ మృదంగాది వాద్యములతో నాదబ్రహ్మముగ హరినామ సంకీర్తన జేయుచుండ రామరాజు వారితోగలిసి నృత్యము జేయుచు దేవాలయమునకు బోవుచుండెను. ముందుకుబోయి విలోకించినూడగా గల్పవృక్షమును, చింతామణియు, కామధేనువు గనబడెను. తత్క్షణమే రామరాజు విస్మితచిత్తుడై "నేడు ధన్యదినము. అగాధమగు మహిమ విశేషముగల పంఢరీక్షేత్రము జేరితి"నని పలుకుచు బ్రాహ్మణోత్తముని చేయిబుచ్చుకొని ముందునకుబోయి పరికించి చూడగా, రాజహంసలు, మయూరములు నృత్యము జేయుచు గానము జేయుచుండెను. తాపసు లనుష్ఠానమును, బ్రాహ్మణులు వేదాధ్యయనమును, భక్తులు కథాకీర్తనలను జేయుచుండిరి. భక్తులెచ్చట చూచినను గుంపులు గుంపులుగ గూర్చుండి యాధ్యాత్మిక విషయములను జర్చించుచుండిరి. సాధుజను లొకరినొకరాలింగన వందనాదులు జేసికొనుచుండిరి. అష్టోత్తర శతతీర్థములును మూర్తిమంతములై గనపడుచుండెను. రత్నఖచితమగు కనకతులసీ బృందావనమును, దివ్యమగు వస్త్రాభరణములు ధరించి పుణ్యాంగనలు పూజించుచుండిరి. మహాద్వారమున బ్రవేశించి రామరాజు సాష్టాంగ నమస్కారముజేసి యడుగిడుచుండగా నచ్చట నష్టసిద్ధులు దాస్యము జేయుచుండిరి. రామరాజాశ్చర్యముతో ముందు

నకు బోయిజూడగా నకస్మాత్తుగా జండికాదేవి కనబడెను. ఆదేవి హస్త మున చీపురుండుటనుజూచి రామరాజాశ్చర్యపడుచు "విద్యానగరమున సాచే యర్చింపబడు కులదేవతయేనా?" యని నిశ్చేష్టుడై చేతులు జోడించి "జగజ్జననీ! చండికా! నీవిచ్చట సేవాపరిచర్యలు చేయుచుండు టలో నర్థమేమి?" యని యడిగెను. అంత భవాని రాజునుజూచి "నీవు వ్యర్థముగ నహంకార పూరితుడవై (శ్రీ) పండరీనాథుని నిందించితివి. నావంటి దాసీలు (శ్రీ) విఠ్ఠలనాథున కనంతముగ గలరు. ఈ పండరీపుర క్షేత్రమున సకల తీర్థములుగలిసి పవిత్రము లగుచున్న"వని చెప్పగా రామరాజాశ్చర్యముతో విలోకించుచుండెను. నారద తుంబురు లచ్చట కీర్తన జేయుచుండిరి. మహాద్వారము మొదలు దేవాలయమువరకు గన బడు నారు లెల్లరును జతుర్భుజ రూపులుగనుండిరి. రామరాజమితా నందముతో నచ్చట సాష్టాంగ నమస్కారము జేసి నిరభిమానుడై ముం దునకు బోయిచూడగా జయ విజయులు శంఖ చక్ర గదాద్యాయుధ ములను ధరించి ద్వారమున కిరుప్రక్కల రక్షకభటులై నిలువబడి యుం డిరి. గరుడస్తంభమునకున్న పతాకము సౌదామినివలె మెరయు చుం డెను. రామరాజు విప్రోత్తముని హస్తమును బుచ్చుకొని దేవాలయ ములో ప్రవేశించి సభామంటపము, గరుడమంటపము, శేజార మంట పము దాటి గర్భాలయమున ప్రవేశింపగా శ్యామలాకారుడును సుకు మారుడును, పీతాంబర ధారియు, రాజీవనయనుడును, సుస్మిత వదనుడు నగు రుక్మిణీకాంతుడు సింహాసనముపై సమచరణములతో నిలువబడి కటిన్యస్త హస్తుడై యుండెను. యోగీశ్వరుల నిజధ్యానమును, శంకరుని యారాధ్యదైవమును, నిజభక్త హృదయ రమమాణుడునగు నా భగ వంతుని రూపమును వర్ణించుట కుపమానము లేవియును లభింపవు. అమృతముయొక్క రుచిని వర్ణించుట కుపమానముగా నేరసమును సరి పోసటా సమయమున దర్శించినవారికి మాత్రమే యా యనుభవసుఖము తెలియును. నిరుపమానుడగు నాపరబ్రహ్మమూర్తిని రామరాజు ప్రేమతో నాలింగనము జేసికొని యారూపమును దన నేత్రములలో నింపుకొని చరణములకు నమస్కరించెను.

రామరాజు విప్రోత్తమునకు నమస్కరించి "నీవు నాకు సఖుడవు; సద్గురుడవు; నీ యుపకారమునకు ప్రత్యుపకారముగ నేనేమియు నీయజాలను. నీవలన నాకు దేవాధిదేవుని దర్శనము లభించినది. నీవు చెప్పిన దానికంటె కోటిగుణము లధిక వైభవమును వైకుంఠనాయకుడు నాదృష్టికి జూపియున్నాడు. నా నేత్రముల కపారసుఖము లభించినది. నాకుల దేవతయగు చండికయు దేవాలయమున బరిచర్య జేయుట జూచితిని. దేవాంగనలు, దేవతలు, భగవంతుని సేవించుచున్నారు. పంఢరీపుర ముతో సమమగు మహాక్షేత్రమును, శ్రీ పాండురంగనితో సముడగు ప్రత్యక్షదైవమును చంద్రభాగతో సమమగు బుణ్యతీర్థమును, త్రిభువన ములందు శోధించినను లభింప"దని చెప్పెను.

రామరాజు "వ్యర్థముగ నిక చండికను బూజించి సార్థకమేమి? క్షీరసాగరమును విడచి నదీజలము నపేక్షించినట్లును, నమృత మెదుట నుండగా నౌషధమును సేవించినట్లును, గల్పవృక్షము కనబడుచుండ దానిని ద్యజించి సిందీవృక్షచ్ఛాయను గూర్చుండినట్లును, గృహమున సూర్యనారాయణుడు సాక్షాత్కరింపగా దీపమునకై ప్రయత్నించి నట్లును, బ్రహ్మాదులకు దుర్లభమగు శ్రీ పాండురంగదేవుని దర్శనము లభించినపిదప నే నీ చండిక నుపాసించుట వ్యర్థ" మని మనోనిశ్చయ ముతో ననుతప్తచిత్తుడై "ఓ దేవాధిదేవా, వైకుంఠవాసా! నా మనో రథమును బూర్తిచేయుము. నావెంట నీవు విద్యానగరమునకు విచ్చేసి యఖండముగ నాచే సేవాపరిచర్యల బొందుము. నాకభయమిచ్చి నా వెంట నీవు వచ్చువరకు నే నిచ్చటనుండి పో" నని దీక్షతో నచటనే యుండెను. రామరాజీ ప్రకారముగ త్రిరాత్రము భగవంతుని బ్రార్థిం చుచు దీక్షలోనుండగా శ్రీ పంఢరీనాథుడు సాక్షాత్కరించి "ఓ రాజా! నీ మనోనిశ్చయమునకు సంతసించితిని. నీవెంట విద్యానగరమునకు వచ్చుట కెట్టి యభ్యంతరమును లేదు. నన్నిచ్చటనుండి విద్యానగర మున స్థాపించు నిర్ణయస్థలమువరకు భూమిపై బెట్టక దీసికొని పోవల యును. ఎచ్చటనైనను నన్ను దింపినచో నే నచటనే యుండిపోయె

దరు. నీ వేవిధమగు నపచారము జేసినను నే నొక క్షణమైనను నీయొద్ద నుండక దిరిగి పంఢరీపురమునకు జేరెద" నని చెప్పగా, రామరాజమితా నందభరితుడై మంత్రిని, పరివారమును మార్గమధ్య గ్రామమునం దసంఖ్యాకులగు జనుల నేర్పరచి పంఢరీక్షేత్రమునుండి విద్యానగరమువరకు మార్గమున కిరుప్రక్కల జనులు నిలువబడి భగవంతుని చేతులతో మోయుచు విద్యానగరమున జేర్చుట కేర్పాటుచేసెను.

రామరాజు శ్రీ పంఢరీనాధునికి సాష్టాంగనమస్కారము జేసి "స్వామీ! ఇక మనము పోవుదమని చెప్పి సింహాసనమునుండి తానే భగవంతుని దీసి చేతులతో మోసికొనుచు దేవాలయము వెలుపలకు వచ్చి భగవంతుని దీసికొని పోవుచుండ నా క్షేత్రమున గల మఠాధిపతులును, భక్తులు, నితరప్రజలును రామరాజు నెదిరించు శక్తి లేక ఖిన్నవదనులై విలపించుచుండిరి. రామరాజు శ్రీ పంఢరీనాధు నెచ్చటను క్రింద దింపకయే చేతులతో మోయించుచు, విద్యానగరమున జేర్చి శ్రీ పంఢరీనాధుని తన యంతఃపురమునందు గల దేవాలయములో స్థాపించి నానావిధములగు నుపచర్యలతో త్రికాలములందును బూజించుచుండెను.

పంఢరీపురమున నాషాఢశుద్ధయికాదశికి యాత్రగ నసంఖ్యాకులగు భక్తులు వచ్చిరి. పంఢరీపురము కళావిహీనమై ప్రాణము లేని శరీరము వలెను, జలములేని నదివలెను, రాజులేని సైన్యమువలెను, చంద్రుడు లేని నక్షత్రమువలెను, భర్తలేని పతివ్రతవలెను, తేజోహీనమై యుండెను. అచ్చట చేరిన భక్తులెల్లరు ఖిన్నవదనులై నానావిధముల విలపించుచు భగవంతుడు విద్యానగరమునకు బోయెను. ఆతని భావము పూర్తిగ దెలిసినది. పుండలీకునికి నే నిచ్చటనే యఖండముగ నుండెద నని వరదానమిచ్చి యా వాక్యమును తిరస్కరించి, శ్రీ విఠ్ఠలనాధుడు వెడలిపోయెను. మనమిచ్చటనుండి యెవ్వరిని సేవింపవలెను? ఎవరిని గీర్తింపవలెను? భగవంతుడు లేని యీ క్షేత్రములో మనము వసింపబనిలేదు. కాన విద్యానగరమునకు బోయి శ్రీ విఠ్ఠలనాధుని దర్శించి




చండికాదేవి శ్రీవిఠ్ఠలనాథుని సన్నిధిని దాస్యము జేయుట.

పుండలీకునికి జేసిన యభయప్రదాన మసత్యము చేయరాదని తెలిపి దేవాధిదేవు నిచటకు దిరిగి తీసికొనివచ్చి స్థాపింపవలెను. కాన సమస్తు లగువా రెవ్వరైనను బోవు టుచితి" మని చెప్పుకొనుచుండిరి.

ఈ ప్రకారముగా భక్తు లొకరికొకరు ప్రలాపవచనముల జెప్పు కొనుచుండిరి. కొందరు "పుండలీకునే యుపేక్షచేసి పోయిన భగవం తుడు మనముపోయిన వచ్చునా?" యనుచుండిరి. మరికొందరు రాజ ద్వారమున బ్రవేశించుట కనుమతి లభింప దనుచుండిరి. కొందరు భగ వంతుని దీసికొని పోవుటకు వచ్చితిమని రామరాజునకు దెలిసినచో మరణదండన విధించునని పలుకుచుండిరి. మరికొంద రీ శ్రమయంతయు నెందులకు? హృదయస్థుడగు విఠ్ఠలుని నిర్గుణభావముతో నారాధింతమని చెప్పుచుండిరి. కొందరు "మనుష ప్రయత్నముతో నేమియు జరుగదు. ఈశ్వరేచ్ఛ వలననే సర్వకార్యములు జరుగు"నని చెప్పుచుండిరి. కాని యచటగల భక్తులలో నెవరును విద్యానగరమునకు బోవుటకు సంసి ద్ధులు కాలేదు

ఆ సమయమున వైష్ణవాగ్రగణ్యుడగు భానుదాసు నిలువబడి "శ్రీ రుక్మిణీ కాంతుని నేను తీసికొనివచ్చెదను. ఆతడు రానిచో నాజీవ మచటనే వాని కర్పించెద"నని ప్రతిజ్ఞ చేసి బయలుదేరి పాదచారియై కొంతకాలమునకు విద్యానగరము జేరెను. భానుదాసు విద్యానగర మంతయు దిరిగినను శ్రీ పంఢరీనాథుని రామరాజు స్థాపించిన ప్రదేశము కనపడనందున మిగుల చింతాక్రాంతుడై యచట గనబడు భావుకజను లనుజూచి "అయ్యా! పంఢరీ క్షేత్రమునుండి శ్రీ పాండురంగ మూర్తిని రామరాజిచటకు దీసికొనివచ్చి యెచ్చట స్థాపించెనో తెలుపుడు. నేను దర్శించుటకై వచ్చితి"నని చెప్పెను. రాజునకు వెరచి యెవ్వరును యదార్థ విషయము దెలుపనందున భానుదాసు మిగుల చింతాక్రాం తుడై యానగరమున నున్న భగవద్భక్తుల నడిగినచో నీ రహస్యము తెలియునని యాలోచించి యొక వైష్ణవోత్తముని మందిరమున బ్రవే శించి యాతనికి సాష్టాంగ నమస్కారముజేసి "అయ్యా! నేను శ్రీ పాం

డురంగదేవుని దర్శించుటకై వచ్చితిని. రామరాజు పంఢరీ క్షేత్రమునుండి (శ్రీ) విఠ్ఠలనాథుని దీసికొనివచ్చి యిచ్చటస్థాపించె"నని యడిగెను. అంత నా వైష్ణవుడు భానుదాసునుజూచి నృపనాథు డంతఃపురమునగల యొక దేవాలయమున స్థాపించి తానే స్వయముగ బూజ జేయుచున్నాడు. పూజా సమయమున తప్ప మిగిలిన సమయములందు కవాటములను బంధించి రామరా జంతఃపురములో నుండును. ఆ సమయమున ద్వార పాలకు లచట రక్షణ జేయుచుందురు. రాజు తాళములను దెరచి తాను పూజజేయుచు నచట నున్నంతవరకు ప్రజలు దర్శనమునకు బోవుటకు మాత్ర మనుమతి నొసంగెను. మిగిలిన సమయములం దెవ్వరును నచ్చట బ్రవేశించుట కధికారము లేదని' చెప్పెను.

ఆసమయమున రాత్రి రెండుజాముల వేళయై యుండెను. తత్ క్షణమే భానుదాసమితానంద భరితుడై సర్వజనులు నిద్రించుచుండ లోపల బ్రవేశించి యాలయము వెలుపల చుట్టును తిరిగి చూచుచుం డెను. తలుపులన్నియు బంధించి తాళములు వేయబడి యుండెను. భాను దాసు పూర్వ ద్వారము వరకుబోయి యచ్చట జూడగా రక్షకభటులు నిద్రించుచుండిరి భగవంతుని కృపవలన సింహద్వారము తెరువబడెను. భానుదాసు హృష్టచిత్తుడై నిశ్శబ్దముగ లోపల బ్రవేశించి సాష్టాంగ నమ స్కారము జేసి గర్భాలయములో జేరి సింహాసనముపై విరాజమానుడై యున్న (శ్రీ) విఠ్ఠల నాథునిజూచి, నేత్రములనుండి యానందాశ్రుధారలు విడచుచు, గద్గదస్వరముతో దీనుడై యాతని నాలింగనము జేసి కొని చరణములపై శిరముంచి చేతులు జోడించి ఓ పాండురంగా! "ఓ లక్ష్మీకాంతా, వైకుంఠవాసా, పుండలీకవరదా, 'యాదవరాయా'! మేమేమి యపరాధమును జేసితిమని యనాథులమగు మమ్ము విడచి యీ రాజమందిరమున బ్రవేశించితివి? నీవు పుండలీకునికి వరదాన మిచ్చి నప్పుడు నేనఖండముగ నిచ్చటనే యుండెదనని యాతనికిచ్చిన వరదాన మసత్యము జేసితివి. మేము దుర్బలులము నానా విధములగు నుపచార ముల జేయలేమని భావించి కాబోలు నీరాజమందిరమున బ్రవేశించి



రామరాజు విద్యానగరములో శ్రీ విఠ్ఠలనాథుని స్థాపించిన దేవాలయము. (హంపీక్షేత్రము)

తివి! నానావిధములగు దివ్యాలంకారములును, నమూల్యములగు పీతాంబరములును, మధురములగు వివిధ పక్వాన్నములను, రాజర్పించుటచే రాజ భోగముల ననుభవించుచు విలాసముగ నిచట గాలము గడుప దలచి మమ్ములను మఱచితివి. ఓ పురుషోత్తమా! రాధా రుక్మిణీ సత్యభామలను ద్యజించి రామరాజునం దమిత ప్రేమతో నిచ్చట వసించుచుంటివి. పరమ పవిత్రమగు పంఢరీక్షేత్రమును ద్యజించి విద్యానగరమును మహాక్షేత్రముగ జేయ నెంచితివి. నీవు లేనందున పంఢరీపురము శూన్యమై చంద్రుడు లేని పున్నమవలె శోభావిహీనముగ నున్నది. నీరాకకై ఋషులును, భక్తులును, నిరీక్షించుచున్నారు. ఓ దేవాదిదేవా! మేము దారుణమగు దోషములేవియో చేయుటచే నిచటకు వచ్చితివా? లేక యసంఖ్యాకులగు యాత్రికులకు నిరంతరము దర్శన మిచ్చుచు నిలువబడియుండుట కష్టమని తలచి యొంటరిగ నిచట నుండుటకై వచ్చితివా? నిన్ను ప్రేమదానము గోరుదుమని భయపడి వచ్చితివా? లేక యసంఖ్యాకులగు భక్తజను లఖండముగ నాదబ్రహ్మ మయమగు కీర్తన జేయుచుండ నిద్రపట్టలేదని నిశ్శబ్దమగు నీ స్థానమున వసింపదలచి వచ్చితివా!" యని దీనాలాపములతో ప్రార్థించుచు దన నేత్రములనుండి ప్రవాహరూపముగ వచ్చుచున్న యానందాశ్రుధారలచే శ్రీ విఠ్ఠలనాథుని రెండు చరణములను గడిగెను.

శ్రీ పంఢరీనాథుడు భానుదాసు నెత్తి యాలింగనము జేసికొని "ఓ భక్తశ్రేష్ఠా! నీవు కొంచెమైనను విచారింపక విరక్త వచనములను బలుకుచున్నావు. నాకు నానావిధోపచారములు రుచించుటలేదు. తుచ్ఛములగు నీ వస్త్రభూషణాలంకారములు నాకు విముఖత్వము కలిగించుచున్నవి. ఎప్పుడు చంద్రభాగాతీరమున జేరుదమాయని జింతించుచున్నాను. రామరాజు నన్ను బందిఖానాలో బంధించెను. నీవు నిష్ఠుర వచనములను బలుకుచున్నావు. చతుర్విధముక్తులయందు నీ కిచ్ఛలేదు. ప్రేమతో నఖండముగ నీవు నన్ను భజించుచు, జేయుచున్న సేవకు నేను ఋణస్థుడనైతిని. నీకు ప్రత్యుపకారముగ నే నేమి యీయదలచి

నను వలనుపడకున్నది. నీకు విభవసంపత్తియం దిచ్చెదే" దని చెప్పి శ్రీ పంఢరీనాథు డశ్రుధారలు విడచుచు గద్గదస్వరముతో భానుదాసు నాలింగనము జేసికొని 'కాకడా హారతి సమయమగుచున్నది. పూజా సామగ్రులను వెంటబెట్టుకొని రామరాజు సపరివారముగ నిచటకు వచ్చును. కాన నీవు త్వరితముగ బోయి దేహబాధలను, స్నానమును దీర్చుకొని పిదప దర్శనమునకు ర" మ్మని చెప్పి తన కంఠమున నున్న యమూల్య నవరత్నహారమును దీసి యాతని కంఠమున వేసి త్వరితముగ నడువుమని చెప్పగా భానుదా సచ్చటనుండి బయలుదేరెను.

భానుదాసు దేవాలయము వెలుపలకు రాగానే కవాటములు యథాప్రకారముగ బంధింపబడెను. పిదప రామరాజు నిద్రనుండి లేచి స్నానము జేసి పూజాసామగ్రులను వెంటబెట్టుకొని సపరివారముగ దేవాలయమున బ్రవేశించి కవాటములను దెరచి గర్భాలయమున జేరి కాకడా హారతిని వెలిగించి భగవంతునికి మంగళహారతి జేయుచుండగా నమూల్యమగు నవరత్నహారము కనబడనందున నచట గల జనులతో దస్కరు లెవరో నవరత్నహారము నపహరించిరని చెప్పి క్రోధముతో భటులను బిలచి "ఆ యమూల్య రత్నములు పృథ్వియంతయు శోధించినను లభింపవు కాన మీరు నగరమంతయును శోధించి, తస్కరులను బంధించి నా సమక్షమునకు దీసికొనిరం" డని చెప్పెను. రా జాజ్ఞప్రకారము భటులు నగరమునందు ప్రతి గృహమును శోధించి యెచటను జాడ తెలియనందున నగరము వెలుపల జూచుచుండిరి.

తుంగభద్రా నదీతీరమున భానుదాసు స్నానము జేసికొని, దేవతార్చన జేసికొనుచుండగా రాజభటు లచ్చటజేరి భానుదాసు మెడలో రత్నహార ముండుటను జూచి తస్కరుడు పట్టుపడెనని యాతనిని బంధించి రాజసమక్షమునకు దీసికొనిపోయిరి. మార్గమధ్యమునగల జను లెల్లరును నానావిధముల పరిహసించుచుండిరి. మరికొందరు దేవుని వస్తువుల నిర్భయముగ నపహరించినవా డెంత ధైర్యశాలియో జూడు డని చెప్పుచుండిరి. మరికొందరు "దేవుడేమి? దయ్యమేమి? కటికవానికి కపిల

గోవునందు విశ్వాస మేముండు" నని పలుకుచుండిరి. ఈవిధముగా బలువురు పలుతెరంగుల భానుదాసుని నిందించుచుండ నాతడు హర్షశోకవిరహితుడై హరినామసంకీర్తన జేయుచుండెను. రాజభటులు భానుదాసును గొనిపోయి రాజసమక్షమున నిలిపిరి. రామరాజు క్రోధముతో "ఇతడు భక్తవేషము ధరించి భగవంతుని యమూల్య రత్నహారము నపహరించెను. కాన నీతని శూలమునకు దిగవేయు" మని యాజ్ఞాపించెను. రాజాజ్ఞప్రకారముగా దూతలు భానుదాసును శూలమునకు దిగవేయుటకై తీసికొనిపోవుచుండిరి. తత్క్షణమే భానుదాసు చేతులు జోడించి నాకు తమ సమక్షమున మరణము సంప్రాప్తించినది. ఆనందముతో తాము విధించు శిక్ష ననుభవింతును. దయచేసి జీవితాంత సమయమున శ్రీ విఠ్ఠలనాథుని దర్శించుట కనుజ్ఞ నిమ్మని కోరెను. కొందరు జ్ఞాతులు "మరణదండన విధింపబడినదిగదా! ఒక పర్యాయము లోనికి బోయి దర్శనముజేసి రానిం" డని బలుకుచుండిరి. రాజభటు లాతనిని గర్భాలయము లోనికి దీసికొనిపోయిరి.

భానుదాసు శ్రీ పంఢరీనాథుని సన్నిధిమున నిలువబడి "ఓ దేవాధిదేవా! మంచి యుక్తి జేసితివి. నేను నిన్ను దీసికొనిపోవుటకై వచ్చియున్నందున నాకంఠమున నమూల్యరత్నహారమును వేసి రాజుతో నిక్కడ మరణదండన విధింపించితివి. నీ యభిప్రాయము తెలిసినది. నావలె నిన్ను దీసికొనిపోవుటకై వచ్చు భక్తు లెందరి నిచ్చట బలిచేయుదువో! తెలియుటలేదు. 'నేను పంఢరీపురమునకు రాను. ఇచ్చటనే స్థిరముగా నుండెద' నని చెప్పవచ్చు నిన్నెవరు బాధింతు"రని చెప్పి యశ్రుధారలు విడచుచు గద్గదస్వరముతో "ఓ రుక్మిణీపతీ! నే నెన్ని జన్మ లెత్తినను నిన్ను విడచుట యసత్యము. ఎప్పటికైనను నిన్నిచ్చటనుండి తీసికొనిపోయి పంఢరీపురమున నిశ్చయముగ స్థాపించెదను. ఈవిషయమును జ్ఞప్తియందుంచుకొనుము. నేను జీవితాంతమున నీయెదుట జేయు ప్రతిజ్ఞ యిదియే" అని చెప్పి సాష్టాంగనమస్కారము జేసెను.

రాజభటులు తొందరజేయుచు భానుదాసును దేవాలయము వెలుపలకు దీసికొనిపోయిరి. రాజవీధియందు శూలము బాతిరి. కౌతుకమును జూచుటకై యసంఖ్యాకులగు స్త్రీ పురుషు లెల్లరును జేరిరి. రాజభటులు భానుదాసుని కిరువైపులనుండి యాతనిని శూలమున దిగవేయుటకై నిలువబడియుండిరి. ఆ సమయమున భానుదాసు "ఓ రుక్మిణీకాంతా ఆకాశము విరిగిపడినను, సూర్యచంద్రులు గతులు తప్పినను సప్తసముద్రము లింకిపోయినను నిన్ను విడువను. నాశవంతమగు నీకాయమును నీకు మంగళహారతిగా నర్పించుచున్నాను. పృథ్వియంతయు లయమైను పంచభూతములకు ప్రళయ మాసన్నమైనను బడబాగ్నిచే త్రిభువనములు దహింపబడినను, నిన్ను మాత్రము విడువను. నేననంత జన్మము లెత్తియైనను నిన్నిచ్చటనుండి తీసికొనిపోయి యథాప్రకారముగ పంఢరీపురమున స్థాపించెదను. ఇదియే నా ప్రతిజ్ఞ" అని పలుకుచు, భగవన్నామమును స్మరించుచుండెను. రాజభటులు భానుదాసును శూలమును దిగవేయుటకై పైకెత్తిరి. తత్క్షణమే శ్రీ పంఢరీనాథుని కృపావిశేషమున నాశూలము పల్లవములును, పత్రములును, పుష్పములును, గలిగి వృక్షముగా మారిపోయెను. రాజభటు లీ విషయమును రామరాజునకు దెలియజేసిరి. రాజాశ్చర్యముతో జూచుటకై యచ్చటకువచ్చి యనుతప్తచిత్తుడై సద్భావముతో సాష్టాంగనమస్కారము జేసి యవివేకముతో నేనుజేసిన యపరాధమును క్షమింపుమని గోరి యాతనిని వెంటబెట్టుకొని శ్రీ పంఢరీనాథుని సన్నిధికి బోయెను.

భానుదాసు శ్రీ విఠ్ఠలనాథు నాలింగన వందనాదులు జేసికొనెను. భగవంతుడు భానుదాసును జూచి "నన్ను స్కంధముపై బెట్టుకొని పంఢరీపురమునకు దీసికొనిపొమ్ము. పుండలీకుని ద్వారమున నఖండముగ వసించెద" నని చెప్పగా రామరాజు భగవంతునికి వందనములు జేసి 'నావలన నపరాధము జరిగినది క్షమింపు" మని పరిపరివిధముల ప్రార్థించెను. శ్రీ విఠ్ఠలనాథుడు రామరాజును జూచి "ఓ రామరాజా! నీ సుకృతమున నేనిచ్చట కొంతకాలము వసించి, నీచే సేవా పరిచర్య

లను జేయించుకొంటిని, ఇక నీవు నారూపమును హృదయమున నిలుపు కొని యారాధింపుము. నే నిచ్చటికి వచ్చునప్పుడు 'నీ వపరాధ మొన ర్చిన నో నొక క్షణకాలమైనను నుండ' నని చెప్పియుంటిని. నా యంత రంగభక్తుడగు భానుదాసును శూలమున దిగవేయ నాజ్ఞాపించితివి. నీవు భాగవతాపచారము జేసిన దృష్టాంతము శాశ్వతముగ నుండుటకై తిరిగి యీ దేవాలయమున నాకు ప్రతినిధిగ విగ్రహస్థాపనము జేయరాదు. అట్లొనర్చితివేని, నీవు సర్వనాశనమగుదు" వని చెప్పి భానుదాసును జూచి "నీవు నన్నెత్తుకొని త్వరితముగా దీసికొనిపొ" మ్మని చెప్పగా "ఓ రుక్మిణీకాంతా! నేను రాజువలె సైన్యపరివారముతో మోసికొని పోవు శక్తి లేనివాడను కాన కృపతో నావెంట ర"మ్మని కోరగా భగ వంతుడు "నీకు నేను స్వాధీనుడనైయున్నా" నని చెప్పి యంగుష్ఠ ప్రమాణరూపుడాయెను.

భానుదాసమితానందముతో దన పూజాసామగ్రుల పెట్టెలో శ్రీ విఠ్ఠనాథునుంచి యానందముతో హరినామ సంకీర్తనము జేయుచు బోవుచుండెను. విస్తీర్ణమగు నాకాశము ఘటము చిన్నదైనను నాఘట ముతో బూర్తిగా గనబడునట్లు, భానుదాసు భక్తికి వశవర్తియై శ్రీపం ఢరీనాథుడు సూక్ష్మరూపమును ధరించెను. కృష్ణావతారమందు యశో దాదేవి కవ్వమునుబట్టి తరచుచుండగా కృష్ణుడా భాండములో నవనీత మును దినుచుండెను. యశోదాదేవి నవనీతమును దీయుటకై భాండ ములో జేయిపెట్టగా శ్రీకృష్ణుడామెచేతికి దొరకినట్లు భానుదాసు పూజా సామగ్రుల పెట్టెలో సూక్ష్మరూపుడై భగవంతుడిమిడిపోయెను భానుదాసు భగవంతుని వెంటబెట్టుకొని యత్యానందముతో హరినామ సంకీర్తన జేయుచు పాదచారియై కొలది దినములకు చంద్రభాగా తీరము నకు జేరెను. భగవంతుడు "నేడు ధన్యదినము భక్తులెల్లరి దర్శనమగు" నని యానందించుచుండెను. పద్మతీర్థమున భానుదాసు స్నానము జేయు టకై పూజాసామగ్రుల పెట్టె నచటబెట్టి నదిలోనికి బోయెను. తత్క్ష ణమే శ్రీ రుక్మిణీకాంతుడు యథారూపమును దాల్చి భానుదాసును

జూచి "నీవు నన్నీ విధముగ దీసికొనిపోవు టుచితముకాదు. నన్నిచట నుంచి నీవు నగరములోనికి బోయి భక్తులెల్లరినీ తంబుర తాళ మృదంగాది వాద్యములతో దీసికొనివచ్చి భజనతో రథముపై నధిష్ఠింపజేసి మంగళ వాద్య సమేతముగ దీసికొని పొమ్మ"ని చెప్పెను.

భగవదాజ్ఞ ప్రకారముగ భానుదాసు నగరమున బ్రవేశించి యచట భక్తులకును, విప్రులకును, మఠాధిపతులకును, దెలియజేసి నానా విధములగు మంగళ వాద్యములును, రథమును, పతాకములను దీసికొని భక్తజనులెల్లరును హరినామ సంకీర్తనజేయుచు పద్మతీర్థము జేరిరి. పంఢరీపురమునగల స్త్రీ పురుషు లెల్లరును నానందోత్సాహములతో భగవంతుని దర్శించిరి. అర్చకులు భగవంతుని రథముపై నధిష్టింపజేసి దేవాలయమునకు దీసికొనిపోయిరి.

ఆదినము కార్తీక ఏకాదశీ బ్రహ్మోత్సవ దినమగుటచే వివిధ ప్రాంతములనుండి యాత్రీకులు విశేషముగా వచ్చిరి. దేవాలయ సింహద్వారమువరకు రథమును దీసికొనిపోయిరి. పిదప భగవంతుని రథమునుండి దింపి చేతులతో గర్భాలయములోనికి దీసికొనిపోవుచుండ విప్రోత్తముల మంత్రఘోషయు, భక్తుల హరినామసంకీర్తనలును నాదబ్రహ్మముగ నుండెను. జగన్నివాసుడగు శ్రీ పంఢరీనాథు నా సమయమున సింహాసనముపై నధిష్ఠింపజేసి, పంచామృతాభిషేకముజేసి, వస్త్రభూషణాదుల నలంకరించి, షోడశోపచారవిధుల బూజించి, భగవంతునికి మంగళహారతి జేసిరి. అసంఖ్యాకులగు జనులు "భానుదాసుభక్తి ధన్యమైనది. వైకుంఠవాసుని దిరిగి పంఢరీపురమున స్థాపించె" నని పరిపరివిధముల గొనియాడుచుండిరి. శ్రీరాముడు చతుర్దశవర్షము లరణ్యములో సంచరించి యయోధ్యలో బ్రవేశింపగనే నగరవాసు లానందించిన ట్లా క్షేత్రమున గల జనులెల్లరును నమితానందమును బొందిరి. వసంత కాలమునందు వనస్పతులు శోభాయమానముగ నుండునట్లు శ్రీ పంఢరీ

నాథుడు తిరిగి పంఢరీపురమున ప్రవేశింపగనే యా క్షేత్రము శోభించు చుండెను.

ఇప్పటికిని కార్తీకమాసమునందు పంఢరీపుర క్షేత్రములో స్మారకముగ రథోత్సవము జరుగుచుండును. ఆ సమయమున నెల్లరును భానుదాసును స్మరించుచుందురు.

ఏబదిరెండవ అధ్యాయము సమాప్తము.

వసుదేవాత్మజాయ నమః.

# బహిరంభట్టు చరిత్ర

## —♦ ఏబదిమూడవ అధ్యాయము ♦—

నేడు భగవద్భక్తుల సచ్చరిత్రలు వర్ణించుటవలన జ్ఞానేంద్రియము లకు సంపూర్ణభాగ్యము సంప్రాప్తించి దురితములు సమూలముగా నశించినవి భక్తుల స్వరూపమును ధ్యానమునం దుంచినచో నేత్రములు పావనమగును. వారి సచ్చరిత్రలు శ్రవణముజేసినచో కర్ణములు పునీతములగును. భక్తకథాశ్రవణమునకై చేయు గమనమువలన చరణములు పవిత్రములగును. అలసట త్యజించి కూర్చుండిన సర్వాంగములు పావనమగును. భక్తుల సచ్చరిత్ర గ్రంథమునకు నమస్కారము జేసినచో కరములు పవిత్రమగును. మస్తకముపై ధరించిన నహంకారము నశించును. భక్తుల కథాశ్రవణము జేసిన మాయాజాలమునుండి విముక్తులగుదురు. కాబట్టి శ్రోతలారా! పూర్ణమగు నాసక్తితో శ్రవణముజేయుడు.

పైఠనపురమున వేదాంత జ్ఞాన ప్రవీణుడును, షట్శాస్త్రములం దతి నిపుణుడును నగు బహిరంభట్టను విప్రోత్తముడుండెను. పైఠనపురమునం దింకెందరో పండితులున్నను, వారు విద్యార్థులతో సమముగ నుండిరి. కాని బహిరంభట్టుకు సములగువా రెవ్వరును లేకుండిరి. అఖండ పాండిత్యము గల యాతడు నిత్యము గంగానదీ స్నానము జేసి నదీతీరమున తపోనుష్ఠానములను జేయుచు, నయాచితవ్రత మనుష్ఠించుచుండెను. మధ్యాహ్నకాలమైన పిదప నచటనుండి బహిరంభట్టు గృహమున జేరి వైశ్వదేవ పూజా నైవేద్యముల జేసి ద్విజోత్తములను పంక్తిలో గూర్చుండబెట్టుకొని భుజించుచుండెను. మూడవజామున పురాణ కాలక్షేపమును జేయుచుండెను. ఆధ్యాత్మజ్ఞానమునందు నిపుణులగు పండితులు, నసంఖ్యాకులగు సాధారణజనులును శ్రవణమునకు వచ్చుచుండిరి. ఇంత సామర్థ్యవంతుడగు బహిరంభట్టెన్నడును రాజసభలకు బోయి యుండలేదు.

ఒకనాడు బహిరంభట్టు భోజనము జేయుచు భార్యను జూచి "ఈరోజున లవణహీనమగు కూరలను నాకు వడ్డించితి" వని వినోద

ముగా బలికెను. ఆమె భర్తను జూచి "అరువది వత్సరముల ప్రాయము వచ్చియున్న మీకు జిహ్వాచాపల్యమెందు" కని చెప్పెను. తత్‌క్షణమే బహిరంభట్టు పశ్చాత్తప్తచిత్తముతో భార్యకు నమస్కరించి "నీవు నాకు తల్లివి. కనుకనే నాకు హితము నుపదేశించితివి. నేను పూర్వము చేసిన సుకృతము ఫలించినది. స్వజాతిసంబంధములగు బంధములనుండి విముక్తుడనైతి" నని పలికి తత్‌క్షణమే గృహమును విడచి పోయెను.

బహిరంభట్టు "సన్యాసాశ్రమమును స్వీకరించినచో పరమహంస వేషమునుజూచి బ్రహ్మరూపముగా భావించి సర్వజనులు పూజింతురు. దుర్జనులు పరిహాసింతురు. బంధుమిత్రాదులు నిందింతు"రని పరిపరివిధముల నాలోచించి యేమి జేయుటకును దోచక నచటనుండి మహమ్మదీయ గురువగు ఖాజీ గృహమునకు బోయి యాతనితో "హిందువులు మీ తురకమతములో జేరిన గొప్పపుణ్యమని మీ శాస్త్రమందు జెప్పబడియున్నది గదా! కాన సందేహించక నన్ను మీవలె జేయవలయు" నని కోరెను. అంత ఖాజీ బహిరంభట్టుతో "నేడు తామింత యుదాసీనులగుటకు గారణమేమి? మీ తత్త్వము పూర్తిగా మారినది. నేను మీ కోరిక బూర్తిచేసెదను. మీరు పండితులైయుండియు మీ మతమును విడచి మా మతములో జేరుటకు కారణమేమి? మీ యభిప్రాయము దెలుపు"డని యడుగగా బహిరంభట్టు "నేను సకామ విరక్తుడను కాలేదు. ఒక విధముగా నాలోచించి చూడగా భగవంతుని ప్రాప్తి పొందుటకు మీ మార్గమే యుత్తమముగా గనబడు చున్న"దని చెప్పెను

బహిరంభట్టు మనోనిశ్చయమును జూచి ఖాజీ యాతనిని తన మతములో జేర్చుకొనెను. ఈ వృత్తాంతమును విని యెల్లరును దిగ్భ్రమానసులైరి. ఏమియు నుపాయము తోచనందున బహిరంభట్టు మహమ్మదీయ మతమును స్వీకరించి మౌనముగా నుండెను. పైరన పురవాసులగు వికల్పచిత్తులీతనిని జూచి నిందించుచుండిరి. కొందరు వైరాగ్య తామస మనుచుండిరి. మరికొందరు వానినామము నుచ్చరించినచో




బహిరంభట్టు మహమ్మదీయ గురువునొద్దకు బోవుట.

మన సుకృతము నశించునని చెప్పుచుండిరి, కొందరు భాగ్యయాతనినిట్లు నిందించరాదని పలుకుచుండిరి, మరికొందరు కుటుంబ పోషణజేయు శక్తి లేక విరాగిగా మారెనని చెప్పుచుండిరి. కొందరతడు శాస్త్రవక్తయై యుండి సన్యాసాశ్రమము స్వీకరించి యుండినచో గొప్ప ఖ్యాతి యుండెడిది వ్యర్థముగా మహమ్మదీయులలో గలిసె"నని జెప్పుకొను చుండిరి. మరికొందరు విద్య, వయస్సు, ఉత్తమకులము, పుత్రకళత్రములు, సంపద, యుండి వైరాగ్యముతో నుండుట సాధ్యము కాదని చెప్పుచుండిరి. పైఠనపురమున గల జనులు కొందరు స్తుతించుచుండిరి. మరి కొందరు నిందించుచుండిరి. కాని బహిరంభట్టు నిశ్చల చిత్తుడుగ నుండెను.

ఒకనాడు గంగాతీరమున విప్రులు కూర్చుండి యుండగా బహిరంభట్టచ్చటకేగి యనుతప్త చిత్తముతో రోదనము జేయుచుండెను. విప్రులాతనిని జూచి "నీవు మహమ్మదీయ మతమున గలియుటకు గతంబేమి? ఆ మతమునందేమి మహిమ యున్నదని ప్రవేశించితివి" అని యడుగగా బహిరంభట్టశ్రుధారలను విడచుచు "నాకర్మ బలవత్తరమై యున్నది. ఈశ్వర ప్రాప్తికై నేను స్వేచ్ఛతో యవనులలో గలిసితిని. ఇప్పుడైనను నాత్మప్రాప్తి లభించు చిహ్నము లగుపడుటలేదు." అనగా విప్రులాతనిని జూచి "మన సత్కర్మయందే సద్గతి యున్న"దని యేకగ్రీవముగ బల్కి యాశ్చర్యముతో "ఈతడు సర్వశాస్త్ర నిపుణుడై యుండియు, గర్మను ద్యజించి భ్రష్టుడాయెను! కాన విధియుక్తముగ ప్రాయశ్చిత్తము జేసి మనలో గలిపికొను టుచితము. సర్వశాస్త్ర నిపుణుడగు నీతని శుద్ధునిగా జేయుట కెట్టి యభ్యంతరమును లేదు. మురికికాలువ లన్నియు గంగలో గలిసి పవిత్రములగున ట్లితర ప్రదేశములలో భ్రష్టులైన వారెవ్వరైనను నీ క్షేత్రములో ప్రాయశ్చిత్తముతో శుద్ధులగుచున్నారు." అని యాలోచించి శాస్త్రయుక్తముగ ప్రాయశ్చిత్తము జేసెదమని బహిరంభట్టుతో జెప్పి ప్రాయశ్చిత్తమును జేసిరి.

అంత మహమ్మదీయులెల్లగను గుంపులుగజేరి విప్రబృందములతో వాదోపవాదములను జేయుచు "మహమ్మదీయ మతస్థుని మీరు

బ్రాహ్మణునిగ నెట్లు చేసితిరి? రాజద్వారమునకు నడువుడు" అని చెప్పిరి. బహిరంభట్టు వారినిజూచి "నన్ను మహమ్మదీయునిగ నెట్లు చేసితిరి? నా కర్ణములకు రంధ్రము లున్నవికదా! నేను మహమ్మదీయ మతస్థుడ నైనచో హిందూమత సాంప్రదాయ చిహ్నములతో నుండుట సంశయాస్పదముగ నున్నది.) నేత్రములు కనబడుచుండ నంధుడని యెట్లు పిలతురు? నడచుచుండగనే కుంటివాడని యెట్లనెదరు? అహంకార ముండగనే ముక్తుడని యెట్లు పల్కెదరు? కర్ణములతో శ్రవణము జేయుచున్న యాతనిని జెవిటివాడని యెట్లనెదరు? మీరు నన్ను మహమ్మదీయునిగ జేసియుండిన నాకర్ణరంధ్రము లట్లే యున్నవికదా! హైందవమత సాంప్రదాయ చిహ్నాంకితుడనైయున్న నన్ను మహమ్మదీయు డనుటకు మీకు కొంచెమైనను లజ్జలేదా?" అని యడుగగా మహమ్మదీయులు నిశ్చేష్టులై వాదమును నిల్పిరి.

పిదప బహిరంభట్టు విప్రులను జూచి మీరు నన్ను ప్రాయశ్చిత్తముచే బ్రాహ్మణునిగా జేసితిమంటిరి. ఇది యే శాస్త్రప్రమాణమో నాకు దెలియుటలేదు. భస్మ గోమయములను లేపనము జేసితిరి. అంత మాత్రముచే నే నెట్లు పవిత్రుడనైతిని? నన్ను మహమ్మదీయునిగా యవనులు చేసినప్పుడు 'సున్తీ'ని జేసిరి. మీరు ప్రాయశ్చిత్తమును జేసినను నది యట్లేయున్నది. నాసికను గోసినపిదప ముఖమునకు సౌందర్యము రానటుల నేను యవనులలో గలిసిన పిదప నా బ్రాహ్మణత్వ మెచ్చట నున్నది. పూర్ణిమదినమున జంద్రుడు ప్రకాశముగ నున్నను నాతని ముఖమున గళంకముండునటుల నన్ను బ్రాయశ్చిత్తముచే శుద్ధునిగా జేసితిమని చెప్పుచున్నను, నాయందు మహమ్మదీయ చిహ్నము లటులనే యున్నవి. నా శిశ్నమున మచ్చ యటులనే యున్నది. మంగలిచే క్షౌరము జేయించి సిగనుమాత్రముంచితిరి. కాని నా చర్మమేమియు మారలేదు. అందుచే నాకు సంశయముగ నున్నది. నేను బ్రాహ్మణుడ నెన్నటికిని కాను. యవనుడ ననుటకును వీలులేదు. కుమ్మరి సానపె మట్టిసుద్దను పెట్టును. అది ఘటముకాదు. మట్టియుగాదు. అటులనే నా

స్థితి యున్న" దని చెప్పెను. బహిరంభట్టువచనముల నాకర్ణించి విప్రులు నిశ్చేష్టులై "ఈతనికి సంశయనివృత్తి నెట్లు చేయవలయును? అని పరిపరి విధముల నాలోచించుచుండిరి.

జ్ఞానులెవ్వరు కనబడినను బహిరంభట్టు "నే నే మతస్థుడ" నని విచారించుచుండ "నీవు యవనుడవు" అని వారు పలుకగా "యదార్థము మీకు దెలియదు. వ్యర్థముగ నన్ను జంచలుని చేయుచున్నారు. నేను యవనుడనైనచో నాకు గర్ణరంధ్రము లెట్లుండును? మూర్ఖత్వముచే నిటుల బలుకుచున్నా" రని చెప్పెను. ఒక విప్రుడు "మీరు బ్రాహ్మణులు. ప్రతిష్ఠానపురమున నసించు పండితు" లని చెప్పగా "నేను విప్రుడ నని మీరు చెప్పచున్నారు. లింగమునకు నాకు సున్తీ చేయబడిన" దని వారికి చెప్ప వా రాశ్చర్యమునొందిరి. ఈప్రకారముగ నందరిని విచారించుచుండ నాతని సంశయనివృత్తి జేయు సద్గురు డొక్కడును గనబడ లేదు. జను లాతడు పిశాచమని భావించుచుండిరి. ఇట్లు బహుకాలము బహిరంభట్టు తిరుగుచు నాగనాథసిద్ధుని మఠము జేరెను. ఆతడు సమాధిని పర్వతప్రాయములగు శిలలతో గట్టుచుండెను. బహిరంభట్టు సిద్ధుని జూచి తన సంశయ మిచ్చట నివృత్తియగునని తలచి యాతనియొద్దకు బోయి "నేను హిందువునా, లేక మహమ్మదీయుడనా? స్పష్టముగ దెలియజేయు" డని యడుగగా సద్గురుశ్రేష్ఠుడు కోపముతో తన చేత నున్న గట్టుతో గొట్టెను. ఆ దెబ్బకు బహిరంభట్టు నేలపైబడి మూర్ఛిల్లెను. ఆతని దేహమున జైతన్య ముండెనుగాని "నే నెవ్వరి" నను స్ఫురణమాత్రము లేదు. నాగనాథసిద్ధుడు బహిరంభట్టునకు గల సందేహమును దొలగించి యాత్మస్థితి నొందునట్లు చేయవలయునని తలచి ఖడ్గము నొకదానిని శిష్యులతో దెప్పించి యస్థిపంజరమును, మాంసమును తునకలుగా జేసి, యంతయు గలిపి యొక సుద్దగ జేసి, పిదప నాతని మూర్తిని నిర్మించి, వరదాభయహస్తముతో నాశీర్వదించగా నందు జైతన్యము వ్యాపించెను. సద్గురుకృపచే బ్రహ్మరూపమగు శరీరమును బొంది యోగస్థితియందు బహిరంభట్టుండెను.

సద్గురు డాతనిని జూచి “నీ వెవ్వరవో చెప్పు” మని విచారింప “నా సంశయ నిర్మూలనమాయె” నని యాతడు మౌనమును ధరించెను. పిదప సద్గురునాథుడు “నిన్ను యవనుడనుటకు శిశ్నముపై జర్మమున్నది. బ్రాహ్మణుడవనుటకు నీ కర్ణములకు రంధ్రములు కనపడుట లేదు! ఇప్పుడు సంశయ నివృత్తి యైనదికదా!” అని యడిగి యాతనికి మంత్రోపదేశము జేసి యాత్మజ్ఞానిగా నొనర్చి ‘రామకృష్ణహరి’ నామమును భజించుచుండుమని యాజ్ఞాపించెను. బహిరంభట్టు హృష్టచిత్తుడై “సద్గురువగు నాగనాథులు ధన్యులు. నాకు రెండవ జన్మము ననుగ్రహించె” నని యాలోచించి కాలమును వ్యర్థముగా బోనీయక భగవన్నామస్మరణ జేయుచుండెను. ఎందరో యాత్మజ్ఞానులగు గురువులు జనన మరణముల నివారింతురు. కాని దేహమును మార్చలేరు. భక్తులెందరో పాండురంగమూర్తి నుపాసించెదరు. కాని నామదేవునివలె భోజనము జేయించలేరు. నరులకు వృద్ధాప్యమున జ్ఞానము వృద్ధిజెందును. నానావిధ శ్రుతిశాస్త్రములను జెప్పుదురు. కాని జ్ఞానేశ్వరులవలె మహిషముచే వేదమును బలికించలేరు! ధన్యుడగు సావతాభక్తుడు దన హృదయమును జీల్చి శ్రీ పంఢరీనాథు నందు వసింపుమనెను. ఈప్రకారముగా భక్తు లొకరిని మించి యొకరు కలరు. వారు భగవంతుని వశుని జేసికొనిరి. వారి మహిమవిశేషముల వర్ణింప నెవరితరము? నాగనాథుని కృపవలన బహిరంభట్టు నిజాత్మజ్ఞానమును బొంది పంఢరీక్షేత్రమును సేవించి ప్రేమతో నృత్యకీర్తనలను జేయుచు శ్రీమద్భాగవతమునందలి దశమస్కంధమునకు మహారాష్ట్రభాషయందు టీక నమూల్యములగు నుపమానములతో వ్రాసెను. మరియు వివిధములగు కావ్యములను రచియించెను. ప్రేమతో నాతడు రచియించిన భాగవత శ్రవణముచే దురితములెల్ల పటాపంచలగును.

ఏబదిమూడవ అధ్యాయము సమాప్తము.

పుణ్యాయ నమః

---

# ఏకనాథ చరిత్ర

## —♦ ఏబదినాలుగవ అధ్యాయము ♦ —

శ్రోతలారా! ఈ సచ్చరిత్రను శ్రవణము చేసినచో భవరోగము తొలగ యంతఃకరణమున బూర్ణ వివేకమును, శాంతిసుఖములును గలుగును. యోగసాధనలను, దీర్థయాత్రలను జేయకపోయినను భక్తుల సచ్చరిత్రలను నిశ్చలచిత్తముతో శ్రవణముజేసిన వైకుంఠము జేరుదురు. శాస్త్రపరిచయము లేకపోయినను, వైరాగ్యవిహీనులైనను హరినామ సంకీర్తన ప్రేమతో జేసిన క్షణమాత్రములో పావనులగుదురు. వ్రత నియమములు జేయనివారు రామనామస్మరణ నఖండముగ జేసినచో వారు భగవత్స్వరూపము నొందెదరు. కృపణస్వభావమును, దారపుత్రాదులయం దమిత మమకారమును గలవారు భక్తుల సచ్చరిత్రలను శ్రవణము జేసినచో వారికి పశ్చాత్తాపము కలుగును. మలినమై వికృతరూపముగ నున్న లోహము స్పర్శవేది స్పర్శచే దత్కాలమందు సువర్ణమగునటుల భక్తుల సచ్చరిత్రలను విశ్వాసముతో శ్రవణముజేసిన నజ్ఞానము తొలగి వివేకము కలుగును. లేశమైనను పూర్వపుణ్య మొనర్చినవారికే భక్తుల సచ్చరిత్రలు శ్రవణముజేయుట కాసక్తి కలుగును. ఇతరజనులకు వికల్పము లధికముగ నుండును.

పరమ పవిత్రమగు గంగానదీ తీరమునందు ప్రతిష్ఠానపురము (పైఠనపురము) అను పుణ్యక్షేత్రము కలదు. దీనిని దక్షిణకాశి యనె దరు. ఆ క్షేత్రమున శ్రీ పాండురంగదేవుని కంతరంగభక్తుడగు భానుదాసను పరమ భావుకుడుండెను. ఆతనికి సద్గుణవంతుడును, వైష్ణవ జ్ఞానియు నగు చక్రపాణి యను సుపుత్రుడుండెను. ఆతడు జీవితమంతయు హరినామసంకీర్తన జేసెను. ఆతనికి సూర్యనారాయణుడను సుపుత్రుడు కలిగెను. ఆతడు దేదీప్యమానమగు జ్ఞానప్రకాశము కలవాడై సద్గుణవతియు, పతివ్రతాశిరోమణియు రుక్మిణీబాయి అను సత్కళత్రముతో గృహస్థధర్మమున నుండెను. ఈ దంపతుల గర్భమున సాక్షాత్ జగద్గురువే పుత్రరూపమున విక్రమశకమునందు 1450 వ సంవత్సరమున

నవతరించెను. ఈ బాలకునికి పండ్రెండవ దినమున జాతకర్మ గావించి "ఏకనాథ్" అని నామకరణము జేసిరి. ఈ బాలుడు మూలా నక్షత్రమున జన్మించుటవలన జననీ జనకు లిరువురును బాల్యమునందె దివంగతులైరి. ఈతనిని పితామహులు యమిత ప్రేమతో బెంచుచుండిరి.

దినదిన ప్రవర్ధమానముగ ఏకనాథ్ పెరిగి పెద్దవాడగుచుండగా క్రమముగా నక్షరస్వీకారమును, నుపనయన సంస్కారమును జేసి యమిత ప్రేమతో పితామహులు చూచుచుండిరి. ఏకనాథ్ విద్యను పూర్తిగా నభ్యసించి బ్రహ్మజ్ఞానసంపన్నుడగు సద్గురువు నాశ్రయింప దలచి దౌలతాబాద్ నగరమున నలుబది గ్రామముల కధిపతియును, శ్రీ దత్తాత్రేయోపాసకుడును, ఋగ్వేదిదేశస్థ బ్రాహ్మణుడును నగు జనార్దనస్వామియను పేరుగల మహాజ్ఞాని యుండెను. ఆతడు జనకమహర్షి వలె ప్రాపంచిక వ్యవహారములను జూచుచు విదేహుడై యుండెను. సాక్షాత్ దత్తాత్రేయుని దర్శన మాతనికి లభించుచుండెను. ఏకనాథు డీ విషయమును దెలిసికొని యాతనియొద్ద తత్త్వోపదేశము బొందనెంచి యచ్చటకేగి సాష్టాంగనమస్కారముజేసి బద్ధాంజలియై నిలుపబడియుండెను.

జనార్దనస్వామి యాతనిని జూచి విస్మితచిత్తుడై "నీ వెవ్వరు? ఇచ్చటి కేమిటకు వచ్చితివి? నీ వృత్తాంత మేమి? జననీ జనకులను విడచి ఖిన్నవదనుడవై విచారముతో నొంటరిగా వచ్చిన కారణము దెలుపుము" అని యడిగెను. ఏకనాథ్ చేతులు జోడించి మధురోత్తరములతో "నేను ఋగ్వేది బ్రాహ్మణబాలుడను, అనుతప్తచిత్తుడనై ప్రపంచ వ్యవహారములలో దగుల్కొనినచో కామక్రోధాదులు బాధించునని తలచి మిమ్ముల శరణుబొందుటకై వచ్చితిని. నిరంతరము మీ సమక్షమున వసించి యఖండముగ సేవ జేయవలయునని కోరికతో నున్నాను. నేను పతితుడను. సేవకునిగా నన్నంగీకరించి మీకు శుశ్రూష జేయుటకై నన్నాజ్ఞాపింపుడు" అని చెప్పెను. ఏకనాథ్ వచనములను విని జనార్దనస్వామి యత్యాశ్చర్యమును బొంది "ఈతడు బాల్యవయస్కు-

డైనను విజ్ఞానముతో నున్నా" డని తలచి యాతని శిరముపై దన యభయప్రదహస్తమునుంచి "నీ యిష్టప్రకారముగా సుఖముగ నిచ్చట నుండు" మన నేకనాథ్ అమితానందభరితు డాయెను. వ్యాసులు సంశయచిత్తులైయుండ నారదమహర్షి యాతనికి దర్శనమిచ్చి సంశయ నివృత్తి గావించినట్లును, హంసరూపమును ధరించి లక్ష్మీకాంతుడు విరించికి దర్శనమీయగా నాతడు సమాహితచిత్తుడైనట్లును జనార్దన స్వామి యభయమీయగా నేకనాథ్ సమాహితచిత్తుడాయెను.

ఏకనాథ్ నిరంతరము నేమరక సద్గురు సమక్షముననుండి నిశా సమయములందు జనార్దనస్వామి నిద్రించుచుండ పాదసేవజేసి యాతని పాదములయొద్దనే నిద్రించుచుండెను. జనార్దనస్వామి కఫబాధచే రాత్రులందుమియుచుండ ప్రాతఃకాలమునందా స్థలమంతయు శుద్ధిచేయుచుండెను. ముఖప్రక్షాళనమునకు దీర్థము నిచ్చుచు, సద్గురు నాథునకు స్నానము జేయించుచు, బూజకై గంధాక్షతలను, చందనాది సుగంధ ద్రవ్యములను, తులసీ పుష్పహారములు మొదలగు సర్వ సామగ్రులను సిద్ధపరచుచుండెను. జనార్దనస్వామి భుజించిన పిదప తాంబూలమును దెచ్చియిచ్చి వారి యుచ్ఛిష్టమును ప్రేమతో భుజించుచుండెను. ఈప్రకారముగా నేకనాథ్ సద్గురుని సేవించుచుండ జనార్దన స్వామి యాశ్చర్య చిత్తుడై "వీనిని మానవునిగా భావింపరాదు, సకల గురుభక్తులలో శ్రేష్ఠుడ"ని యాలోచించి యొకదినమున నేకానాథ్ నేకాంతముగా బిలచి "నీవు సర్వకాలములందు నా సమక్షమున నుండినచో వృద్ధులగు నీపితామహులు కుందుచుందురు" అని చెప్పగా నేకనాథ్ "స్వామీ నాకా చింత యేమియు లేదు. జననీ జనకులును, నాప్త బంధువులును, మిత్రులును, నా సర్వస్వమును మీరై యున్నా"రని చెప్పెను.

ఇట్లు కొన్ని దినములు జరిగినపిదప "వీని కేమైనను పని జెప్పవలయునని జనార్దనస్వామి యాలోచించి తన యింటిపద్దులను వ్రాయుచుండు"మని యాజ్ఞాపించెను. సద్గుర్వాజ్ఞానుసారముగా నేకనా థతి శ్రద్ధతో బద్దులను వ్రాయుచుండెను. ఒకనాడు జనార్దనస్వామి యేక

నాథుని బిలచి "నీవు వ్రాసిన పద్దులను నాకు జూపుము" అని యడిగెను. తత్క్షణమే యవశ్యమని యేకనాథుడు సద్గురు చరణములకు నమస్కారము జేసి యొకపర్యాయము పద్దులను సరిచూచి గురువులకు జూపవలయునని తలచి కూడికలను జూడగా నొకపైస తేడాకనబడెను. ఎన్నియో పర్యాయములు కూడి చూచుచున్నను తేడా తెలియనందున చింతించుచు దదేక ధ్యానమున దేడా యెచ్చటనో కనిపెట్టవలయు నని పద్దులన్నిటిని శోధించుచుండెను. జనార్దనస్వామి యాతని వెనుకనే నిలువబడి బహుకాలమునుండి వేచియున్నను సద్గురునాథుడు వచ్చెనను ధ్యాస యేకనాథునకు లేకుండెను. కొంతసేపటికి బద్దులలోని తేడా కనబడినందున నేకనాథు డమితానందముతో జప్పటలు చరచి 'భళీ'యని కేకవైచెను. పిదప జనార్దనస్వామి యేకనాథుని బిలచి "ఏమి యాశ్చర్యము కలుగుటచే నట్లు 'భళీ'యని కేకవైచితివి" అని యడుగగా దత్క్షణమే యేకనాథ్ సద్గురువునకు సాష్టాంగ నమస్కారముజేసి హస్తముల జోడించి "అయ్యా! పద్దులలో కొద్దిగ తేడా వచ్చినది. అది యిప్పుడు కనబడుటచే నమితానందముతో నట్లు కేకవైచితి"నని చెప్పెను.

అంతట జనార్దనస్వామి యేకనాథునిజూచి "నీ చిత్తమంతయు బద్దులయందే ప్రకారముగా లగ్నమై యున్నదో నదే విధముగ శ్రీకృష్ణభగవానుని చరణములందు లగ్నమై యున్నచో నీ జన్మ సార్థకమగు" నని చెప్పి యాతనికి మంత్రోపదేశము జేసెను. ఒక దినమున జనార్దనస్వామి యేకనాథుని బిలచి "నీకు దత్తాత్రేయుని దర్శనము జేయించెదను. నీవు మాత్రము నిర్భయముగ నుండుము. ఆతడు బహువికృతములగు రూపముతో వచ్చును. ఆరూపమునుజూచి దుర్జనులు నిందింతురు. నే నరణ్యములో నెవరికి నమస్కారముజేసి యాలింగనము జేసికొని సంభాషింతునో, యాతడే దత్తాత్రేయుడని యెరుగుము"అని చెప్పి యరణ్యమునకు దీసికొనిపోయెను. అనసూయ పుత్రు డకస్మాత్తుగా నచ్చటికి రాగా జనార్దనస్వామి యేకనాథుని బిలచి "అడుగో చూడుము. అశ్వవాహనులై యవింథరూపమున దత్తాత్రేయులవారు వచ్చుచున్నారు".

విశాల కపాలమును, నారక్త నయనములును, హస్తమున శస్త్రములను ధరించి జనార్దనస్వామితో దత్తాత్రేయులు యవనభాషలో మాట్లాడు చుండ నేకనాథ్ భయముతో వణకుచు "ఈతడు ప్రత్యక్షముగ నొక యవనుడని నిశ్చయించి, దూరముగబోయి, యొక వృక్షచ్ఛాయను గూర్చుండెను. దత్తాత్రేయులు జనార్దనుని జూచి "ఆ వృక్షచ్ఛాయ నధి వసించియున్న బాలకుని బిలువవలయునని కోరిక యున్నచో భోజనము నకు బిలువుము" అని చెప్పగా నేకనాథ్ వికల్పచిత్తుడై "యవనునియొద్ద నెటుల భుజించుట" యని యచటనుండి మరింత దూరముగ బోయెను.

పిదప దత్తాత్రేయు లదృశ్యులు కాగా నేకనాథు డాశ్చర్యముతో సద్గురు చరణములపైబడి సాష్టాంగ నమస్కారము జేసి "ఆ మహాత్ము డీయు డెవ్వరని" విచారింప జనార్దనస్వామి "ఆతడే యత్రినందనుడు. నీకు ప్రథమమున నేను జెప్పియున్నను వికల్ప చిత్తుడవైతివి. సాధకులు నానావిధ ప్రయాసల నొందినను నాతని దర్శనము వారలకుగాదు. నీక నాయాసముగ దర్శనము లభించినప్పటికి, వికల్పచిత్తుడవైతివి. అభా గ్యుడు మార్గమున బోవుచుండ నాకస్మికముగ గల్పవృక్షము కనబడిన దానిని త్యజించి పోవునట్లును, నమూల్యమగు ముక్తాభరణ మెదుట నుండగా దానిని చూడక దాటిపోయినట్లును, నమృత సింధువు కన బడినచో మృత్యువును సైతము జయింపవచ్చునని యెఱుంగక మూఢుడు విముక్తుడై చనినట్లును, దుర్లభమగు దత్తాత్రేయ దర్శనము లభించినను నీవు వికల్పచిత్తుడవై తొలగిపోతివి కఠినమగు వజ్రాసన యోగములు సాధింపవచ్చును. జీవమాత్రుల మనోగతము దెలిసికొనవచ్చును. సప్త సముద్రములకుబోయి స్నానము జేయవచ్చును. భూతభవిష్యద్వర్తమానము లను దెలిసికొనవచ్చును. కాని దత్తాత్రేయుల దర్శనమును బొందుట మాత్రము దుర్లభము. ఆతడనాయాసముగ నీకు దర్శన మిచ్చియుండ నీవు వికల్పము నొందితివి. ఇంకొక పర్యాయ మాతని నీకు జూపెదను. సావధానుడవై యుండు"మని చెప్పగా నేకనాథ్ "నేను తమకు ముద్రాంకి తుడనైతిని. ఇతరుల విషయమున నాచిత్తము వికల్పము గలుగును.

బాలకుడు తండ్రిని ప్రేమించినచో సహజముగ పితామహుడు సంతసించునట్లు నేను తమ చరణముల నాశ్రయించుటచే దత్తాత్రేయులు సంతసింతురు" అని చెప్పెను.

మరిగొకదినమున జనార్దనస్వామి ఏకనాథుని వెంటబెట్టుకొని యరణ్యమున ప్రవేశించెను. ఆ సమయమున దత్తాత్రేయులు ఫకీరు రూపముతో నచ్చటకు వచ్చిరి. కామధేనువు శునకరూపమును ధరించి వారివెంట వచ్చుచుండెను. జనార్దనస్వామి తత్క్షణమే యా ఫకీరునకు సాష్టాంగనమస్కారము జేసి యాతని నాలింగనము జేసికొని యవన భాషలో మాటలాడుచుండిరి. దత్తాత్రేయులు జనార్దనస్వామిని జూచి క్షుద్బాధ యధికముగ నున్నది. భుజింతము. కూర్చుండు" మని చెప్పి జోలెలోని మృణ్మయపాత్రను దీసి శ్వానరూపమున నున్న కామధేనువు పాలను పిండి పక్వాన్నములలో నా క్షీరమును బోసి యిరువురును భుజించుచుండిరి. దత్తాత్రేయులు; "ఓ జనార్దనా! ఆ బాలకుని బిలువుము" అని చెప్పగా నేకనాథ్ సంకుచితమనస్కుడై ఫకీరుతో భుజించుటెట్లని సందేహించుచుండ, జనార్దనస్వామి, "ఓ ఏకనాథా! జగద్గురు ప్రసాదమును దీసికొను" మని చెప్పి దత్తాత్రేయుల యుచ్ఛిష్ట ప్రసాదము నేకనాథున కిచ్చెను. వికల్పచిత్తముతో నున్న యేకనాథు డా ప్రసాదము నుత్తరీయమున గట్టుకొనెను.

భోజనము సమాప్తముకాగానే జనార్దనస్వామి దత్తాత్రేయుల పాదములపై నేకనాథుని బడవైచి, "ఈతని కృపాదృష్టితో వీక్షింపు"డని చెప్పగా, దత్తాత్రేయులు తమ వరదాభయ హస్తము నేకనాథుని శిరముపైనుంచి యాతని నాశీర్వదించిరి. "శ్రుతిశాస్త్రముల సారమగు శ్రీమద్భాగవతమును వ్యాసులు రచించిరి. దాని యర్థము గుప్తముగ నున్నది. రామాయణమును నట్లే యున్నది. కాన శ్రవణపఠనములచే బతితుల యుద్ధరణ యగురీతిని దేశీయ భాషలో నీ రెండు గ్రంథములను రచింపుము. శ్రీ హరిలీలా వైభవముల నభంగ సంకీర్తనలద్వారా ప్రబోధింపుము' అని చెప్పి దత్తాత్రేయు లంతర్ధానమైరి. జనార్దనస్వామి




ఏకనాథ్ దత్తాత్రేయుల దర్శించుట.

"ఓ ఏకనాథా! జగద్గురుప్రసాదమును స్వీకరించితివా?" అని యడుగగా నేకనాథు డుత్తరీయమున గట్టిన యా ప్రసాదమును గుర్వాజ్ఞచే దత్క్షణమే స్వీకరించెను. పిదప జనార్దనస్వామి ఏకనాథ్ హస్తమును బుచ్చుకొని స్వగృహము జేరెను. దీపమును ప్రకాశజ్యోతియును, సువర్ణమును కాంతియును, ద్రవము నుదకమును, భాస్కరుడును గిరణములును, జంద్రుడును శైత్యమును, వాయువును చాంచల్యమును, సముద్రమును తరంగములును, నమృతమును రుచియు, నవధానమును శ్రవణము, నాధ్యాత్మజ్ఞానమును సత్వగుణము నభిన్నమై యుండునట్లు జనార్దనస్వామియు, నేకనాథ్‌ను వారి నామములు భిన్నములైనను నభిన్నులుగ నుండిరి.

ఒకనాడు జనార్దనస్వామి "ఏకనా థఖండప్రజ్ఞావంతు డగుచున్నాడు. ఈతనిచే సేవ జేయించుకొను టుచితముకా" దని యెంచి యతనిని బిలచి "నా యాజ్ఞ నీకు పరమప్రమాణము. కాన ప్రతిష్ఠానపురమునకు బోయి గృహస్థాశ్రమమున నుండి స్నాన, సంధ్యా, దేవతార్చనలను, వైశ్వదేవాతిథిపూజలను, నిత్యనైమిత్తిక కర్మలను నాచరించుచు లోకమునకు జూపుము. నీ వధ్యాత్మజ్ఞానమునందు ప్రవీణుడవైనను, సత్కర్మము నెప్పుడును విడువరాదు. మిథ్యా కర్మయని తెలసినను లోకాచారమునకై యథావిధిగ నాచరించుచు, నా కర్మల నీశ్వరున కప్పగింపుము. నీ విట్లనుష్ఠించితివేని శ్రీ రుక్మిణీకాంతుని కృపకు పాత్రుడవగుదు" వని చెప్పి యాతని శిరముపై హస్తమునుంచి యాశీర్వదించి ప్రతిష్ఠానపురమునకు బంపెను. "గురుభక్తులకు సద్గురువచనములే ప్రమాణములు. గుర్వాజ్ఞాపాలనమునకు మించిన సాధనము లే" దను విషయము నేకనాథుడు తెలిసికొని స్వగృహము జేరి పితామహులకు సాష్టాంగనమస్కారము జేసి స్నాన సంధ్యా దేవార్చనలను గుర్వాజ్ఞ ప్రకారముగ జేయుచుండెను. అచ్చటకు సమీపమునం దొక గ్రామమునందు సదాచారియు, పరమభాగవతుడునగు బ్రాహ్మణోత్తము డుండెను. ఆతనిపుత్రిక యుక్తవయస్కురాలగుటచే వివాహప్రయత్నములను జేయు

చుండ నొకనాటిరాత్రి భగవంతుడు స్వప్నమున సాక్షాత్కరించి "పైఠన పురమున నేకనాథుడను మహాభక్తుడు కలడు. ఆతనికి కన్యాదాన మొనర్చి శాశ్వతకీర్తిని బొందు" మని చెప్పెను. ఆ ద్విజోత్తముడు స్వప్నవృత్తాంతమును మననముచేసికొని పైఠనపురమునకు బోయి భగవదాజ్ఞానుసారముగ దన పుత్రికయగు గిరిజాబాయి నేకనాథున కిచ్చి కన్యాదాన మహోత్సవమును జేసెను.

ఏకనాథుడు బహుకాలముగ దన పూర్వీకులు చేయుచున్న శ్రీ పాండురంగదేవుని పూజను దానును శాస్త్రోక్తవిధిని నిత్యనియమముతో చందనాది సుగంధద్రవ్యములచేతను, పరిమళముగల నానావిధములైన పుష్పములతోను, ధూప దీప కర్పూర నీరాజనములతోను, భగవంతు నర్చించి, నైవేద్యమును సమర్పించి, పుష్పాంజలి స్తోత్రములను జేసి భగవంతునకు ప్రదక్షిణ నమస్కారములొనర్చి "హే పతితపావనా, జగదుద్ధారా, ద్వారకావాసీ, రుక్మిణీరమణా, అనాథనాథా, కరుణాకరా, సర్వేశ్వరా, పాండురంగా!" అని ప్రార్థించి తులసీప్రసాదమును స్వీకరించి, సద్బ్రాహ్మణులను పంక్తిని బెట్టుకొని భోజనముజేసి, మూడవ జామున బురాణ కాలక్షేపమును, రాత్రి హరికీర్తనయు జేయుచుండెను. శ్రవణమునకై యసంఖ్యాకులగు జనులు వచ్చుచుండిరి. ప్రేమతో నేకనాథుని వాక్కునుండి వెలువడు రసవంతములగు పలుకులు విని యానందించుచుండిరి.

ఒకనాటిరాత్రి ఏకనాథ్ నిద్రించుచుండ స్వప్నమున శ్రీ రఘునాథుడు సాక్షాత్కరించి "వాల్మీకికృతమగు రామాయణము సంస్కృతమున నుండుటచే జనసామాన్యము పఠించుట కష్టముగా నున్నది. కాన నీవు మహారాష్ట్రభాషయం దద్దానికి టీకను దయారుచేయుము" అని చెప్పి యంతర్హితుడాయెను. ఏకనాథ్ తత్క్షణమే నిద్రనుండి లేచి భగవదాజ్ఞను ప్రమాణముగ భావించి యొక సుదినమున సప్తకాండలను శోధించి, యా యభిప్రాయమును ధ్యానమందుంచుకొని, తల్లీనుడై "అతి గంభీరమై, గహనమైయున్న యీ రామాయణమును నేను

ప్రాకృతమున నెట్లు వర్ణింపగల" నని సద్గురునాథుడగు జనార్దనుని స్మరించి యాతనిపై భారమువైచి గ్రంథారంభమును జేసెను. బాల కాండ నారంభించుటకు ప్రథమాధ్యాయమున మంగళాచరణమును, గణేశ శారదా ప్రార్థనలను, సద్గురు స్తవమును, సంతసజ్జనుల ప్రార్థనయు జేసి కావ్యమును వ్రాయుచుండెను. శ్రీ రఘునాథు డాతని వాక్కులో ప్రవేశించి పలికించుచుండ నేకనాథుడు నిమిత్తమాత్రుడై వ్రాయుచుండెను. ఏకనాథ్ గృహమునకు ప్రక్కగృహమున వసించు నొక గృహస్థు నిత్య మాతనిని నిందించుచు, సంస్కృతభాష యుండుచున్న గ్రంథమును ప్రాకృతమున వ్రాయుచున్నాడని దుష్ప్రచారము జేయుచుండెను. కొందరు భావుకజనులు "ఆతని కవిత్వము రసవంతమై యున్నది. శ్రవణమాత్రముచే మనశ్శాంతి యగుచుండె" నని చెప్పుచుండిరి

ఒకనాడు రాత్రి ఏకనాథ్ నిద్రించుచుండ శ్రీ జానకీరమణుడు స్వప్నమున సాక్షాత్కరించి "నిద్ర, నలసటను త్యజించి రామాయణమును రచియింపుము; నీ వాగ్ధారనుండి బహిర్గతమైన భాష నాకు మిగుల ప్రియతమము" అని చెప్పి గంటమును, దాళపత్రమును జేతి కిచ్చి యంతర్ధానమయ్యెను. తత్క్షణమే ఏకనాథ్ నిద్రనుండి లేచి రామాయణమును వ్రాయుచుండెను. ఇట్లు కొంతకాలము జరిగినపిదప నొకానొకదినమున నేకనాథ్ రామాయణమును వ్రాయుచుండగా నద్వైత స్థితినొందెను. సీతను శోధించుటకై హనుమంతుడు మహేంద్రపర్వతము నుండి యెగురుచున్న ఘట్టమును 'ఓవీ' రూపమున వ్రాయుచుండగా నావిర్భావుడై యచ్చటనుండి యెగిరి యా యర్ధరాత్రిసమయమున ప్రక్కయింటిలో బడెను. ఆ గృహస్థు జాగరూకుడై యుండి, యేకనాథచ్చట మూర్ఛితుడై పడియుండుట గాంచి విస్మితమనస్కుడై యాతని చేతనున్న తాళపత్రమును జదివిచూచి పశ్చాత్తాపముతో "ఏకనాథ సాకారమూర్తి, నే నతనిని వ్యర్థముగ నిందించితి" నని యాతనిని లేవనెత్తి భుజముపై మోసికొనిపోయి యాతని నింటదింపి "పినివలన నుప

దేశమును బొందవలె" నని నిశ్చయించెను. ఆ గృహస్థు దాంబికుడును, శుద్ధభావము లేనివాడు నగుటచే నేకనాథ్ యిది గ్రహించి "రేపటి దినము ప్రాతఃకాలసమయమున నేను పూజ జేసికొనునపుడు వచ్చి నా ప్రక్క గూర్చుండు" మని చెప్పెను.

మరునా డేకనాథ్ దేవ గృహమున బూజజేయుచుండగా నా గృహస్థచ్చట గూర్చుండి "స్వామీ! తమవరదహస్తము నా మస్తకముపైనుంచి నాకుపదేశము జేయు"డని యడుగగా నేకనాథ్ తన మనంబునం దిట్లాలోచించెను. "వీనిని బరీక్షింపనిది వీనికుపదేశించు టెట్లు? చవిటిభూమిలో విత్తనమునాటిన వ్యర్థమగును. ఓటికుండలో నీరుపోసిన కారిపోవు"నని యాలోచించి గృహస్థునితో "నీకు యోగ్యుడగు గురువునాశ్రయించి తదుపదేశము బొందుమని యాజ్ఞాపించెను. ఆత డెంతచెప్పినను వినక "మీవలననే నే నుపదేశము బొందవలయునని నిశ్చయించితి" నని బ్రతిమాలెను. అంత ఏకనాథట్లనుచో "రేపు ప్రాతఃకాలమున స్నానము జేసి శీఘ్రమే రమ్మ"ని చెప్పెను. మరునటి దినము ప్రాతఃకాలమున నా గృహస్థు స్నానము జేసి యుపదేశమునకై వచ్చి గూర్చుండెను. ఏకనాథ్ గృహమున దన భార్యతో 'నేను ధ్యానస్థుడనై గూర్చుండియున్నప్పుడు "మడిజలము" ఎవ్వరైనను దీసికొని రండని కేకవైచెదను, మీ రెవ్వరును దీసికొనిరావల"దని చెప్పి పూజా గృహమున బ్రవేశించెను. ఉపదేశమునకై వచ్చిన యా గృహస్థు, ఏకనాథ్ ప్రక్కనే గూర్చుండియుండెను. ఏకనాథ్ పూజలో గూర్చుండి దాంభికుడగు నా గృహస్థును బరీక్షింపనెంచి వెనుకకు దిరిగి చూడకయే "పూజకై మడిజలమును దీసికొనిరండు" అని కేకవైచెను. ప్రత్యుత్తరము రానందున నేకనాథ్ "ఇంటిలో నెవ్వరును లేరా? ఎవరైనను సరియే కాలాతీతముజేయక యుదకమును దీసికొనిరం" డని గట్టిగా కేకవైచినను దాంభికుడగు నాగృహస్థు మౌనముగ నటులేగూర్చుండి యుండెను. ఐదారు పర్యాయములు మరల నేకనాథ్ కేకవైచినను ప్రత్యుత్తరము లేనందున దానే స్వయముగ నిలువబడి వెనుకకు దిరిగి యా

గృహస్థుని జూచి నవ్వుచు "మీ రిచ్చటనే యున్నారా?" యని పలికి పూజకై యుదకమును దెచ్చుకొనెను. పిదప నేకనాథ్ "ఈ గృహస్థు కుటిలుడు. వీనిని బరీక్షించుటయైనది, వీడుపదేశమున కనర్హుడు. పూజకు జలముదీసికొనిరానివాడు, సేవయేమిచేయును? బ్రాహ్మణునకు నమస్కారము జేయని వాడాతనిని గృహమునకు దీసికొనిపోయి పక్వాన్నముల నెట్లు పెట్టును? బాటసారికి మార్గమును జూపనివాడు తన గృహమున నాతనికి వసతెట్లిచ్చును? గృహమునకు వచ్చినవారిని గూర్చుండుటకు జాపను వేయనివాడు వస్త్రముల నేమిచ్చును? పూజకు జలమును దెచ్చి యీయని యీతడింకేమి సాధన జేయును" అని యా గృహస్థును జూచి "ముహూర్తమంతరించినది. తరువాత నాలోచించెదను వెళ్లు"మని చెప్పెను. ఏకనాథ్ దాంభికుడేగిన పిదప "వ్యర్థముగ దాంభికుల కుపదేశము జేయుట తగ" దని నిశ్చయించి యుపాధిరహితుడై శ్రీ పండరీనాథుని భజించుచుండెను.

ఏబది నాలుగవ అధ్యాయము సమాప్తము.

లీలామానుష విగ్రహాయ నమః.

# ఏకనాథ్ గృహమున శ్రీ విఠలనాథుడు సేవజేయుట

—♦ ఏబది మూడవ అధ్యాయము ♦—

నేడు శ్రోతలకొరకమృతసింధువు పొంగినది. బ్రహ్మవిద్యా భాండారము తెరువబడినది. సూర్యుని తేజము హృదయములో ప్రతి బింబించినది. భాగ్యవశమున శుద్ధజ్ఞానము యొక్క బోధయు మోక్షము యొక్క మార్గము సముచితముగా కర్ణములలో బడినవి. మంగళసిద్ధి యగు మంత్రరాజమును, వైరాగ్య వివేకబుద్ధియు, దైవయోగము వలన భక్తక థారూపమున వెలువడినవి శాంతియొక్క నిజశాంతియు, వివేకవృక్షాంకురము నానందసుఖముయొక్క యానందమును, భూమండలమున ప్రకటితమైనవి. వైరాగ్యముయొక్క నిరపేక్షయు, భూతసమత్వమును, ప్రేమతత్త్వమును, రసవంతములగు భక్తక థారూపములను ధరించినవి. సాయుజ్యముక్తియొక్క నిజధామమును, కీర్తనసుఖము యొక్క ప్రేమయు, నిష్కామ నాశనయు వెలువడినవి.

ఏకనాథునకు "గోదూబాయి గంగాబాయి" యను నిద్దరు కుమార్తెలును, 'హరిపండితు' డను కుమారుడును గలిగిరి. పిదప పితామహు డగు సూర్యనారాయణుడును, గాతని ధర్మపత్నియగు రుక్మిణీబాయియు స్వర్గస్థులైరి.

ఏకనాథ్ నిత్యము షోడశోపచారవిధుల సద్భావముతో శ్రీ పండరీనాథుని భజించుచుండెను. భగవంతుడు ఏకనాథునకు వెంట సహాయకారులుగ నెవ్వరు లేరని తలచి తాను బ్రాహ్మణరూపమును ధరించి ప్రతిష్ఠానపురము జేరి యచ్చట గ్రామస్థులను "ఈ గ్రామమున వైష్ణవవీరుడును, నియమముతో భగవంతుని గీర్తించువాడును, నిరంతరము బ్రాహ్మణ సమారాధనజేయువా రెవరు? తెలుపు" డని ప్రశ్నించగా గ్రామస్థు లేకనాథని ప్రత్యుత్తరమిచ్చిరి. అంతసాక్షియు,

చైతన్యఘనుడును, బ్రహ్మాండనాయకుడును నగు భగవంతు డేకనాథ గృహమున బ్రవేశించి "మహారాజా! నేను తమసమక్షమున సేవ జేయుటకై వచ్చితి" నని చెప్పగా నేకనాథుతని జూచి "నీ వెవ్వరు? ఎచట వసించుచుందువు? దారపుత్రాదు లెవ్వరును లేరా? నీ చరిత్ర సవిస్తరముగ దెల్పు" మని యడుగగా బ్రాహ్మణవేషధారియగు భగవంతుడు "నేను ద్వారకాక్షేత్రమున వసింతును. నన్ను 'శ్రీఖండ్యా' యందురు. నేను నిజముగ మీయొద్ద సేవజేయుటకై వచ్చితిని. మీరు నాకు వేతనమేమియు నీయనవసరము లేదు. అన్నవస్త్రాదులిచ్చి లగ్నముచేసినచో చిరకాల మిచట నేయుందు" నని చెప్పెను. ఏకనాథ్ "నీకు దారపుత్రాదులు లేరా? తెలుపు" మని యడుగగా లేకేమి యున్నారు. ఉండియు లేనట్లే యున్నారు. నాకును నా భార్యకును సరిపడదు. అది యెప్పుడును చపలముగ నానాగృహములలో దిరుగుచుండును. ఇద్దరు పుత్రులుండిరి. కాని వారును దుస్థితియందే యున్నారు. ఒకడు కన్యారతుడయ్యెను. ఒకడు సజ్జనులను బీడించుచుండును. నా ప్రపంచస్థితి యిట్లున్నది. అధికముగ నేనేమియు జెప్పజాలను. మిమ్ముల నాశ్రయించి మీ సమక్షమున సుఖముగ గాలముగడుపవలయునని వచ్చితిని" అని ప్రత్యుత్తరమిచ్చెను. "అట్లయినచో నీకు దప్పక లగ్నముజేతు" నని ఏకనాథ్ బలికెను.

శ్రీ ఖండ్యా ఏకనాథునిజూచి "అయ్యా! నే ననేకస్థలములను జూచితిని, సంప్రదాయము నా కెచ్చటను నచ్చనందున మీ యొద్దకు వచ్చితి" నని చెప్పగా నేకనాథ త్యాశ్చర్యమున "మీయిచ్చవచ్చినంత కాలము నిశ్చింతగనుండు" డని చెప్పెను. శంకరుని నిజధ్యానమును, బ్రహ్మాదులచే బూజనీయుడును, లీలానాటక సూత్రధారియు నగు భగవంతుడు బ్రాహ్మణరూపమును ధరించి భక్తునకు సేవజేయుటకువచ్చెను. శ్రుతి శాస్త్రములకును, విరించికిని, శారదాదేవికిని, ఆదిశేషునకును, వర్ణించుట కలవికాని దేవాధిదేవుడు భుజముపై గావడి ధరించి భక్తుని సేవసేయుటకు సంసిద్ధుడుగ నిలువబడెను. సుకుమారుడును, శ్యామల వర్ణుడును, సాయుజ్యదాయకుడును, రుక్మిణీ కాంతుడు నగు భగవంతుడు



శ్రీ విఠ్ఠలనాధుఁడు శ్రీఖండ్యా యను పేరుఁతో
ఏకనాథ గృహమున సేవ జేయుట.

స్థలశుద్ధిజేయుచుండెను. సూర్య చంద్ర నక్షత్రాదులెవని కృపచే తేజమును బొందినవో, యా తేజోమయుడు తులసీ పుష్పహారములను గ్రుచ్చుచుండెను. ఏకనాథ్ బూజజేయు సమయమున నాతడు తులసీపుష్పములను, గంధాక్షతలను, ధూపదీపములను, నైవేద్యమునకు వివిధ పక్వాన్నముల నమర్చి పిదప నంతర్గృహమున బ్రవేశించి గృహమునందంతయు దుడిచి, యుదక ప్రోక్షణజేసి ముగ్గులతో నలంకరించి నంటపాత్రల నన్నిటిని శుభ్రపరచి, గిరిజాబాయియొద్దకువచ్చి "తల్లీ! పాకముజేయుటకు విలంబన మగుచున్నది; సామగ్రులను త్వరగా నమర్చు"మని చెప్పి తాను పాకశాలను శుద్ధిచేసి, గిరిజాబాయి యొద్ద సామగ్రిని దీసికొని, క్షణకాలములో వివిధములగు పదార్థములను దయారుజేసి, బ్రాహ్మణులెల్లరికిని వడ్డించి, యెంగిలి యాకులనెత్తి దూరముగా బారవైచి, భోజనస్థలమంతయు శుభ్రపరచి, యేయే సమయములం దెవ్వరెవ్వరికి యేయే వస్తువులు గావలెనో దెలిసికొని యాయావస్తువులను సిద్ధపరచుచు, నొక క్షణకాలమైనను విశ్రాంతి దీసికొనక యఖండముగ సేవజేయుచుండెను.

ఇట్లు కొన్ని దినములు గడచిన పిదప నేకనాథ్ జననీజనకుల శ్రాద్ధము వచ్చెను. బ్రాహ్మణులెల్లర కామంత్రణ పంపిరి. శ్రీఖండ్యా పదార్థములన్నియు నతివేగముగ దయారుచేసెను. విప్రోత్తములకు త్వరితముగ స్నానమాడి రావలయునని వర్తమానమంపిరి. సాక్షాత్ భగవంతుడే వారి గృహమున వసించియుండుటచే సర్వపదార్థములును గొదువలేక యున్నవి. బ్రాహ్మణోత్తములకై శ్రీఖండ్యా వస్త్రములను, దక్షిణలకై బంగారునాణెములను సమకూర్చియుంచెను. ఏకనాథ్ స్నానముజేసి ధౌతవస్త్రములను మేడపై ధరించుచుండెను. ఆ సమయమున నొనామకదంపతులు పక్వాన్నముల వాసన నాఘ్రాణించి "ఈదినమున మన యజమానుల గృహమున బిండివంటలను దయారు చేయుచున్నారు. భోజనములకై బ్రాహ్మణులు విశేషముగ వత్తురు; వారాకులలో విడచిన యుచ్ఛిష్టము మనకు బుష్కలముగ లభించును" అని యంత్యజాని

భార్య యానందించుచుండెను. అంత్యజుడు భార్యనుజూచి "నేడు పితృ శ్రాద్ధము. బ్రాహ్మణులు భుజించినపిదప నా మాకులను భూస్థాపన జేయుదురు అందుచే నేడు మన కా పక్వాన్నములు లభింపవు. వైవాహికర్మ జరుగు గృహమునకు వృషభము పోయిన దో దానికి గడ్డియో, తవుడో పెట్టిదరు? అట్లే మనకు పక్వాన్నభోజనములు ప్రాప్తించవు' అనెను. ఇట్లా దంపతులు పరస్పరముగ జెప్పుకొనుచుండిరి. ఏకనాథ్ మేడపైనుండి విని క్రిందికి దిగి గిరిజాబాయియొద్దకు బోయి "మన కోటలో బనిజేయు నస్పృశ్యదంపతులు పక్వాన్నభోజనము లపేక్షించుచున్నారు. కాన వారిని సత్వరమే బిలచి భోజన మేర్పాటుచేయు" మని చెప్పగా గిరిజాబాయి "భోజనపదార్థము లమితముగనున్నవి. అస్పృశ్యుల నెల్లరిని బిలిపించి వారలకు భోజనము పెట్టు టుచితము. మన మీ యిద్దరకుమాత్రమే పెట్టినచో నితరు లసంతృప్తులగుదురు. కనుక వారిని బిలిపించి సత్వరమే భోజన మేర్పాటు జేయింపుము. జనార్దనుడు సర్వభూతములందును వ్యాపించియున్నాడు. ప్రథమమున నస్పృశ్యులను దృప్తిపరచు టుచితము" అని చెప్పెను.

ఏకనాథ్ గృహము వెలుపలకు వచ్చి యా యస్పృశ్యదంపతులను బిలచి "మీకులములో నందరును బిడ్డలతో భోజనమునకు శీఘ్రమే రం" డని చెప్పగా వా రమితానందభరితులై యస్పృశ్యులెల్లరికీ విషయము నెరింగించిరి క్షణకాలములో నాపురమున గల యస్పృశ్యు లాబాల వృద్ధముగ భోజనమునకై ఏకనాథ్ గృహమునకు వచ్చిరి. ఏకనాథ్ వారి దీనస్థితిని జూచి ఖిన్నుడై బ్రాహ్మణపూజకై యేర్పాటుచేసిన గంధాక్షతలను, సుగంధద్రవ్యములను, నానావిధములగు పుష్పముల నంత్యజుల కర్పించెను. బ్రాహ్మణులకై తయారుచేయబడిన పక్వాన్నముల నస్పృశ్యులకు వడ్డించిరి. ఏకనాథ్ "సర్వం విష్ణుమయం జగత్" అను భావముతో భోక్త శ్రీకృష్ణనాధుడనియే తలచి యా యస్పృశ్యులకు నమస్కారముజేసి "మీరు గోవిందనామభజన గావించుచు భుజింపు" డని చెప్పెను. వారెల్లరును ఏకనాథ్‌కు వందనము లర్పించుచు "అయ్యా!

నే మస్పృశ్యులము. మా జీవితములో మధురమధుర పక్వాన్నములను దినియెరుగము. మీరు దయావంతులు వైష్ణవులు. మిమ్ములను భగవంతుడు సర్వవిఘ్నముల రక్షించుగాక!" అని పలికి తృప్తిగా భుజించిరి.

శ్రీఖండ్యా మరల స్నానముజేసి బ్రాహ్మణులకొరకై తిరిగి పక్వాన్నములను దయారుచేసెను. విప్రులెల్లరు క్రోధోద్దీపితమానసులై "ఏకనాథ్ భ్రష్టుడు. మనల నవమానపరచెను. భోజనమునకై నిమంత్రణ జెప్పి మనకొరకేర్పరచిన భోజ్యముల నస్పృశ్యులకు బెట్టెను. నేటినుండి యీ భ్రష్టుని గృహమునకు మనమెవరమును బోరాదు. వీనిని జాతినుండి బహిష్కరింపవలయు" నని చెప్పి శాస్త్రజ్ఞు లేకనాథ్ గృహమున కెదుట నిలువబడి, "ఓరీ కర్మభ్రష్టా! నీ చేష్టలన్నియు విపరీతముగ నున్నవి. బ్రాహ్మణులభోజనమునకు ముందే యస్పృశ్యుల నాదరించితివి. అనామకులతో శ్రాద్ధకర్మ నెరవేర్చుకొనుట యే శాస్త్రమున విధింపబడియున్నది. బ్రాహ్మణాచారమును ద్యజించి భ్రష్టాచారమును జేసితి" వని పలుకగా ఏకనాథ్ చేతులుజోడించి "అయ్యా! ప్రథమమున మీకొరకై తయారుచేయబడిన పక్వాన్నముల సువాసన నస్పృశ్యులాఘ్రాణించిరి. ఆ పదార్థములను మీ కర్పించు టనుచితమని తలచి యవియన్నియు నస్పృశ్యుల కర్పించి తిరిగి పవిత్రముగ పదార్థములను దయారుజేయించితిని. కృపామూర్తులగు తాము దయచేసి నా పితృ శ్రాద్ధమును పవిత్రముగ నెరవేర్చు"డని కోరెను. మహాయజ్ఞమునందు హావిర్భాగమును గాకి కర్పించినట్లును, రాజకాంతధరించు నాభరణములను దాసీ ధరించినట్లును, పవిత్రమగు భాగీరథి జలమును బహిర్భూమి నుపయోగించినట్లును, శుద్ధమగు చందనమును గాడిదకు బూసినట్లును, విష్ణుపూజకై వేయు తులసీవృక్షములను మసీదులో నాటినట్లును, నేడు మా కేర్పరచిన భోజ్యములను ప్రేమతో నస్పృశ్యుల కర్పించు టనుచితమై యున్నది. కర్మభ్రష్టుడవగు నీ గృహమున భుజించి మే మెన్నటికిని, వర్ణసంకరులముకామని" క్రోధముతో వారెల్లరు దమతమ గృహములకు బోయిరి.




ఏకనాథ్ గృహమున పితృదేవతలు భుజించుట.

ఏకనాథ్ చింతాక్రాంతుడై కూర్చుండియుండ శ్రీఖండ్యా యాతనికి సాష్టాంగ నమస్కారముజేసి "తాము ద్విగ్న మనస్కులై యుండుటకు గారణమేమి?" అని యడిగెను. అంత నేకనాథుడు "ఓరీ! శ్రీఖండ్యా! బ్రాహ్మణులు భోజనమునకు వచ్చుటకు నిరాకరించు చున్నారు. పితృశ్రాద్ధము నెరవేరు నుపాయము కనబడ" లేదని చెప్పగా శ్రీఖండ్యా స్మితవదనుడై, "బ్రాహ్మణులు భోజనమునకు రాలేదని చింతింపకుడు. పదార్థములన్నియు సిద్ధముగ నున్నవి. పాత్రలలో బక్వాన్నములను వడ్డించి పితృదేవతలకు నిమంత్రణ జేయుడు, సాక్షాత్ మీ పితృదేవతలే భోజనమునకు వత్తు"రని చెప్పగా నేకనాథాశ్చర్యాయత్త చిత్తుడాయెను. నానావిధ పక్వాన్నములను ఘృత, శర్కర, సహితం బుగా శ్రీఖండ్యా పాత్రలలో వడ్డించెను. ఏకనాథ్ చేతులు జోడించి పితృదేవతలను ప్రార్థించి "ఆగంతవ్యమ్" అని పలుకగా, పితృదేవతలు సాక్షాత్కరించి యాసనములపై నధిష్ఠించిరి. ఏకనా ధర్ఘ్యపాద్యముల పూజజేసి తాంబూలములను గోపీచందనమును, యజ్ఞోపవీతములను నెల్లరకిచ్చి హిరణ్య దక్షిణాల నర్పించెను. ఈశ్వర ప్రీత్యర్థమని యేక నాథు డుదకమును విడువగానే సాక్షాత్పితృదేవత లెవ్వరెవ్వరి కేయే పదార్థములు కాలయునో కోరుచు సంతృప్తిగ భుజించిరి. సద్గురు జనా ర్దన చరణముల నేకనాథ్ ధ్యానమందు నిలిపికొని, పితృదేవతలను జూచి యానందించెను. పితృదేవతలు కరశుద్ధిజేసికొని దక్షిణ తాంబూలాదు లను గైకొని యదృశ్యులైరి. బ్రాహ్మణులు గవాక్ష ద్వారములనుండి యీ కౌతుకమును జూచుచు నమితాశ్చర్య భరితులైరి. తాము చూచు చుండగనే పితృదేవతలు వచ్చి భుజించి యంతర్ధానమగుట యాశ్చర్య కరమైన విషయమని భావించి "ఏకనాథ్ మనుష్యమాత్రుడు కాడు. అవతారమూర్తి. మనము కర్మాభిమానముచే నాతని నవమాన పరచి తిమి. భగవంతు డాతనికి సహాయభూతుడై యున్నాడు. సాక్షాత్పితృ దేవతలేవచ్చి భుజించుట మన కవమానకరము. రేపటిరోజున ప్రాతః కాలము మనమెట్లైనను యుక్తిచేసి "నీకు ప్రాయశ్చిత్తముజేసి స్వజా

తిలో గలుపు కొనెదమని యాతనిని సమ్మతి పరచెదము"అని యాలో చించిరి.

మఱునాఁడు ద్విజులెల్లరును నదీతీరమున జేరి ఏకనాథుని బిలపించిరి. ఆతడు విప్రోత్తములకు నమస్కారము జేసి "ఏమి యాజ్ఞ"? అని యడుగగా "నీవు తెలియక జేసిన తప్పునకు విధియుక్తముగ ప్రాయశ్చిత్తమును జేయించు కొను"మని చెప్పిరి. ఏకనాథ్ విప్రోత్తములతో "నేనెప్పుడను ప్రాయశ్చిత్తము జేయించుకొనను. నా జననీ జనకులు సజీవులై యుండ నేను విపరీతకార్యము నెట్లు చేసెదను?" అని పలుకగా విప్రోత్తములు "మామాట వినుము. ప్రాయశ్చిత్తము జేయించుకొనని నీకో శుద్ధత్వము లభించ"దని చెప్పి యాతనిని నదిలో గూర్చుండబెట్టి భస్మ గోమయములను శరీరమునకు లేపనజేసి వేదోక్తముగా మంత్రములను జెప్పుచుండిరి. ఆ సమయమున త్రంబకేశ్వరమునుండి యొక బ్రాహ్మణోత్తము డకస్మాత్తుగా నచ్చటకు వచ్చి నదీతీరమున గుంపులుగా గూడియున్న జనులను జూచి "అయ్యా! ఏకనాథెచ్చట నున్నాడని విచారించుచుండెను ఆతని సర్వాంగములకు కుష్ఠు వ్యాపించి శరీరము కించిన్మాత్రమైనను శుభ్రముగ లేక సర్వాంగములందును క్రిములు వ్యాపించి యసహ్యముగ గనబడుచుండెను. అచ్చటగలజను లాతనిగాంచి "ఆఱుగో! నదిలో ప్రాయశ్చిత్తము జేయించు కొనుచున్నాడు. ఆతడే ఏకనాథ్. ఆతనితో నీకున్న పనియేమి?" అని యడిగిరి. అంత నా కుష్ఠరోగి "నేను త్ర్యంబకక్షేత్రములో శంకరుని గూర్చి యనుష్ఠానము జేసితిని. ఉమాకాంతుడు సాక్షాత్కరించి "పైఠన పురమున నేకనాథను విష్ణుభక్తుడు కలడు. ఆతడు పితృశ్రాద్ధదినమున నస్పృశ్యులకు సమారాధన జేసెను. ఆ సుకృత మపారమైనది. నీకాతడు కించిత్పుణ్యము నర్పించిన నీకుష్ఠ వ్యాధి యంతరించును" అని చెప్పెను. తత్క్షణమే నే నచ్చటనుండి బయలుదేరి యిచ్చటకు వచ్చితి"నని చెప్పగా నచటగల ద్విజోత్తము లెల్లరును "బ్రాహ్మణులను విడచి యస్పృశ్యులకు భోజనముపెట్టుట పుణ్యమని యే శాస్త్రమందు చెప్పబడినది. ఇదియంతయు నసత్య"మని

మరికొందరు "ముంజేతి కంకణమున కద్దమెందుకు? ఆతనికి శంకరుడిచ్చిన వరమును, ఏకనాథ్ జేసిన పుణ్యమును క్షణకాలములో బయట పడె"నని చెప్పుకొనుచుండిరి.

పిదప నా కుష్ఠురోగి నదిలోనికి దిగి ఏకనాథ్‌నకు నమస్కరించి 'అయ్యా! శంకరుడు నాకు సాక్షాత్కరించి 'మీరు పితృశ్రాద్ధదినమున ననామికులకు భోజనము పెట్టుటచే బొందిన సుకృతములోని సహస్రాంశ ఫలితమును నా కర్పించినచో నా కుష్ఠువ్యాధి తొలగు' నని చెప్పెను. కాన దయచేసి నా కా సుకృత మర్పింపుడు" అని యడిగెను. ఏకనాథవశ్యమని చెప్పి తత్‌క్షణమే కుష్ఠువ్యాధిగ్రస్తుని హస్తములో నుదకమును విడచెను. ద్విజోత్తములును, నదీతీరమునందు గూడిన యసంఖ్యాకజనులును కౌతుకమును జూచుచుండిరి. తత్‌క్షణమే యాతనికుష్ఠువ్యాధి తొలగి యాతని దేహము సుందరమగుట జూచి యెల్లరును నాశ్చర్యమునొంది "మనము కర్మాభిమానులమై ఏకనాథ్ నవమాన పరచితిమి. విష్ణుభక్తులకు ప్రాయశ్చిత్తము జేయుట మిగుల దోషము" మని చెప్పుచుండిరి.

ద్విజులెల్ల రేకనాథుని జూచి "నీవు మానవమాత్రుడవు కావు. కేవల మవతారమూర్తి వని తెలిసికొంటిమి. హిమాలయములకు గాలియు, నాకాశమున కావరణయు, నగ్ని దేవునికి స్నానమును, నమృతమునకు బక్వాన్నములును, సముద్రమునకు దీర్ఘాటనయు నవసరము లేనట్లు మీకు ప్రాయశ్చిత్తముతో బని లేదని తెలిసికొంటిమి. మీ రత్యద్భుతమగులీలలనుజూపుచున్నారు. ప్రత్యక్షముగ పితృదేవతలను భూలోకములో నెవరైనను రప్పించుట కని విని యెరుగము. మీకు శ్రీరుక్మిణీకాంతుడు వశుడైయున్నా" డని చెప్పి యాతని చేయిబుచ్చుకొని గృహమునకు దీసికొనిపోయిరి. ఏకనాథ్ ద్విజులకు దక్షిణలర్పించి వారి చరణతీర్థము స్వీకరించెను. ద్విజులెల్లరాతని నాశీర్వదించి స్వగృహముల కేగి "ఈ విష్ణుభక్తుడు ధన్యుడు. బ్రాహ్మణసేవలో నిరంతరము తత్పరుడై యున్నాడు. విధియుక్తముగా దేవతార్చన ప్రేమభావముతో జేయు

మన్నా" డని యానందించిరి. పైఠనపురవాసులు కొందరు స్తవమును మరికొందరు నిందయు జేయుచుండిరి. ఏకనాథ్ హర్ష శోకవిరహితుడై ప్రేమభావముతో భగవంతుని గీర్తించుచు భావార్థరామాయణమును రచియించి పూర్తిచేసెను.

ద్వారకా క్షేత్రమున నొక విప్రోత్తము డనుతప్తచిత్తుడై తప మొనర్చుచుండెను. అతనికి శ్రీ రుక్మిణీదేవి దర్శనమిచ్చి "భగవంతు డిచట లేడు. నీవు వ్యర్థముగా నిచట తపసుచేసినను నాతని దర్శనము దుర్లభము. ఆతడు పైఠనపురమున మహాభక్తుడగు ఏకనాథ గృహము నందు శ్రీఖండ్యా యను పేరుతో ద్వాదశవర్షములుగా శుశ్రూష జేయుచున్నాడు. నీవచటికిబోయి దర్శించు కొను' మని చెప్పెను ద్విజు డానందించి తత్క్షణమే బయలుదేరి పైఠనపురము జేరి పురవాసులను విచారించుచు నేకనాథుని గృహము జేరెను. ఏకనాథు డాతనినిజూచి సాష్టాంగ నమస్కారము జేసి యుచితాసనమున గూర్చుండ నియమించి "స్వామీ! తా మేయే తీర్థములను సేవించితిరి? ముందెచటికి బోయెదరు? తమ స్వస్థానమెచట? ఏమి కార్యార్థముగా నిచటికి వచ్చితిరి?" అని విచారించెను. అంత నా విప్రుడు "అయ్యా! నేను ద్వారకా క్షేత్రము నుండి వచ్చుచున్నాడను. మీ గృహమున బ్రాహ్మణ వేషధారియగు శ్రీఖండ్యాను జూడ నపేక్షతో వచ్చితిని" అని చెప్పగా ఏకనాథాత నితో శ్రీఖండ్యా కావిడి భుజముపై వేసుకొని జలమునకై నదీతీరము బోయెను ఒక క్షణకాలములో వచ్చును. మీరు స్వస్థముగా నుండు' డని చెప్పెను. ఇంతలో శ్రీఖండ్యా భుజముపై దీర్ఘపుకావిడి ధరించి గృహములో బ్రవేశించి ద్వారకనుండి వచ్చిన విప్రునిజూచి సంకుచిత మనస్కుడై "ద్వాదశ వర్ష ములనుండి నే నానందముతో నిచట సేవ జేయుచుండ నీబుణస్థు డెచటినుండి వచ్చెనో! నారహస్యమంతయు బహి రంగ మరచు"నని చింతాక్రాంతుడాయెను ఏకనాథుడా విప్రునితో "అయ్యా! ఈతడే శ్రీఖండ్యా బ్రాహ్మణుడు చూడుమని చెప్పగా నా విప్రుడు సాష్టాంగనమస్కారము జేసెను. శ్రీ రుక్మిణీకాంతుడు



జ్ఞానేశ్వరుల సమాధిని ఏక్‌నాథ్ జీర్ణోద్ధారణ జేయుట.

కావడితో సంతర్గృహములో బ్రవేశించి నీళ్ళబిందెలను క్రిందదింపి తత్‌క్షణమే యంతర్ధానుడాయెను. ద్విజుడు బహుకాలము నిరీక్షించినను శ్రీఖండ్యా వెలుపలకు రానందున సంతర్గృహము లోనికిబోయి చూడగా నాతడు కనబడనందున నా ద్విజుడు నేలపైబడి దొరలుచు దీర్ఘస్వరములతో "ఓ రుక్మిణీకాంతా! నన్ను జూడగనే యంతర్ధానమైతి"వని విలపించుచుండెను.

ఏకనాథా విప్రుని జూచి దుఃఖించుటకు కారణమేమి? తెలుపు" మని యడుగగా నాతడు వృత్తాంతమంతయు సవిస్తముగా జెప్పి ఏకనాథ్ పాదములపై బడెను. ఇరువురు నశ్రుధారలు విడచుచు రోదనము జేయుచుండిరి. ఏకనాథా విప్రుని జూచి "నీవు ధన్యుడవు. జగన్నివాసుని గుర్తించి నమస్కరించితివి. మేము ద్వాదశవర్షములనుండి గుర్తించక నాతని కెన్నియో పనులను కల్పించి శ్రమ గలుగజేసితి" మని చెప్పి భగవంతు నిట్లు ప్రార్థించెను. "ఓ భక్తవత్సలా! దీననాథా! నాకు దెలియనందున నిన్ను గష్టపెట్టి యనర్థము దెచ్చుకొంటిని. ఓ చక్రపాణీ! నీవు పరమసుకుమారుడవు. నీళ్ళకావిడి బహుదూరమునుండి శ్రమతో బాధుకారహితుడవై మోసితివి. ద్వాదశవర్షములు నీవు బ్రాహ్మణవేషముతో మాదగ్గర నుండినను కొంచెమైనను యోచించక నీతో బహుకార్యముల జేయించితిమి. నిన్ను బ్రహ్మాదులు పూజింతురు. శంకరుడు సదా నీ చరణచింతన జేయుచుండును. నీవు స్వకరములతో జందనము నరుగదీసితివి. ఆ విప్రుడు తప మాచరించి నీ దర్శనమునకు వచ్చినను నాతనికి క్షణకాలమైనను సావధానముగా దర్శనమీయవైతివి. దుర్లభుడవగు నీ యాంతర్య మెవరును దెలిసికొనజాలరు. యశోదాదేవి నిన్ను పుత్రునిగా భావించెను. నీవు గోకులమును విడచి మధురకు బోయినప్పుడు యశోదాదేవి నిన్ను గుర్తించెను. అదేవిధముగ నీ విచట ద్వాదశవర్షములుండినను నేను గుర్తించక నిన్ను శ్రమపెట్టితి" నని యనుతాపముతో ఖేదమును బొందెను. ఏకనాథుని భార్యయగు గిరిజాబాయి పరమ భావుకురాలును, పతివ్రతయునై యుండెను.

ఆహా భగవంతుడు తమగృహమున ద్వాదశవర్షములుగా సేవజేసెనను విషయము విని మిగుల దుఃఖించుచు "ఓ దేవాధిదేవా, రుక్మిణీకాంతా! నిన్ను మేము కష్టపెట్టితిమి. ఓ గోవిందా! నీవు పరమసుకుమారుడవు. మే మమర్యాదతో నిన్ను ప్రతిదినము ప్రాతఃకాలమునుండి రాత్రి నిద్రించువరకును విరామములేక నానావిధములగు పనులు జెప్పి చేయించితిమి! ఓ శ్రీకృష్ణా! నీవు సకలదేవతలకు బూజనీయుడవు. నీ యాకలి దప్పు లెన్నడును విచారించియెరుగము. మే మెల్లరము భోజనము జేసిన పిదప నీవు భుజించితివి. నేను నిన్ను మిగుల గష్టపెట్టిన యధమురాలను. కాన నా సర్వాపరాధములు క్షమించు"మని విలపించుచుండెను.

ఒకనాడు ఏకనాథ్ రాత్రి నిద్రించుచుండగా శ్రీ జ్ఞానేశ్వరులు స్వప్నములో గనబడి "ఓ ఏకనాథా! నీ వలకావతీ (అళందీ) క్షేత్రమునకు తత్క్షణమే వచ్చి నా సమాధిని దెరచి దర్శింపుము. అజానవృక్షముయొక్క వేళ్ళు నాపై ప్రాకుచున్నవి! కాన వానిని దీసి దక్షిణభాగమున నాటి తిరిగి సమాధిని యథాప్రకారముగా నిర్మాణము జేయు"మని చెప్పెను. తత్క్షణమే ఏకనాథ్ నిద్రనుండి లేచి యమితానందభరితుడై స్వప్నవృత్తాంతమును మననము జేసికొని, పిదప తంబుర తాళమృదంగాది వాద్యములతో హరినామసంకీర్తన జేయుచు భక్తసముదాయముతో నలకావతీక్షేత్రమునకు బయలుదేరెను, ఏకనాథ్ భక్తబృందముతో మకాములుచేసికొని కొంతకాలమున కలకావతీక్షేత్రసమీపమున చేరెను. ఆ ప్రదేశమంతయు నరణ్యమయమై జంతువులు సంచరించుచున్నందున భజనపరులెల్లరును భీతిజెందుచుండ నేకనాథ్ వారికి ధైర్యముజెప్పి తీసికొనిపోగా జ్ఞానేశ్వరుల సమాధిప్రదేశము తెలియక నా యరణ్యములో దిరుగుచుండెను. ఏకనాథ్ వారినందరి నొకప్రదేశమున నుంచి తాను సమాధిప్రదేశము గుర్తించి వచ్చెదనని చెప్పి యా యరణ్యప్రదేశము శోధించుచుండెను. జ్ఞానేశ్వరులా సమయమున సాక్షాత్కరించి ఏకనాథ్ చేతిని బుచ్చుకొని, సిద్ధేశ్వరస్వామి పురాతనాలయమున కెదురుగా నున్న నందిని దీసి దాని క్రిందనున్న భూగర్భ

మున సమాధిలోనికి దీసికొనిపోయి, "నాసమాధి నెవరును గుర్తించుటకు వీలుగాకున్నది. అజానవృక్షపు వేళ్ళు నాపై ప్రాకుచున్నవి. సమాధి పైభాగమున నున్న వృక్షమును దీసి, దక్షిణదిశగా నాటి, తిరిగి సమాధికి యథాప్రకారము మార్గమును మూసి నందిని స్థాపించి, సమాధి పైభాగమున గట్టడము గట్టించు" మని చెప్పి యథాప్రకారము తాను సమాధినిష్ఠలో నుండెను. ఏకనాథ్ వెలుపలకు వచ్చి పైఠనపురమునుండి తనవెంట వచ్చిన భజనపరుల నచటికి తీసికొనిపోయి పనివారలను రప్పించి యజానవృక్షమును వేళ్ళతోసహా యచటనుండి తీసి దక్షిణభాగమున నాటి తిరిగి సమాధిస్థలమంతయు శుభ్రపరచి సమాధి పైన కట్టడమును గట్టించుచుండెను. ఏకనాథ్ తనవెంట వచ్చిన యాత్రాజనులకు సమాధి ఛిద్రములలోనుండి శ్రీ జ్ఞానేశ్వర మహారాజ్ వజ్రాసనముపై సమాధినిష్ఠలో గూర్చుండియుండుట జూపగా వారెల్లరు నమితానందభరితులైరి. శ్రీ పండరీనాథుడు వర్తకుని వేషముతో వచ్చి యచ్చట కట్టడములకు రాళ్ళను, సున్నమును దెప్పించి తానొక చిల్లర దుకాణము నేర్పరచి పనివారలకును, యాత్రాజనులకును భోజనపదార్థములనిచ్చుచు "పైకమంతయు నంత్యసమయమున నీయవచ్చు" నని చెప్పి ద్రవ్యము దీసికొనకయే యా కట్టడములు పూర్తికాగానే దుకాణసహితముగా నంతర్థానమాయెను. ఏకనాథుడు, మిగిలినవారెల్లరును నీ కౌతుకమును జూచి "ఈ యరణ్యమున మనలకు శ్రమ లేకుండ భగవంతుడే వర్తకునిరూపముతో వచ్చి సర్వసామగ్రులను దెచ్చి యిచ్చుచుండెనని తలచి యానందభరితులైరి. ఏకనాథచ్చటనుండి భక్తబృందముతో గలిసి తిరిగి స్వస్థానమునకు జేరెను.

ఏబదియొకటవ అధ్యాయము సమాప్తము

శ్రీవత్స కౌస్తుభ ధరాయ నమః

# కాశీక్షేత్రమునందు ధర్మాధికారులు ఏకనాథ్‌ను శరణుబొందుట

—♦ ఏబది ఆరవ అధ్యాయము ♦—

ఏకనాథ్ శ్రీమద్భాగవతము నందలి యేకాదశాధ్యాయమునకు మహారాష్ట్రమునందు టీక వ్రాయుచుండెను. ఆ క్షేత్రమునందొక గృహస్థు డేకనాథ్ వ్రాసిన భాగవతములోని రెండధ్యాయములను దాను వ్రాసికొని నిత్య పారాయణ జేయుచు గాశీయాత్రకు బోయెను. ఒకదినమున గంగానదీ స్నానముజేసి మణికర్ణికా ఘట్టమునందు గూర్చుండి యేకనాథ విరచితమగు భాగవతమును పారాయణ జేయుచుండెను. ఆకాలమున కాశీక్షేత్రము సనాతన ధర్మమునకును, సంస్కృత విద్యకు నగ్రస్థానమై యుండెను. అచ్చట గొప్ప పండితులును, మఠాధిపతులును, ధర్మాధికారులు నుండిరి. ఆకస్మికముగ నా క్షేత్రము ముఖ్య మఠాధికారి శిష్యులు మణికర్ణికాఘట్టమున నేకనాథ విరచితమగు భాగవతమును పైఠన పురవాసియగు గృహస్థు పారాయణ చేయుచుండుటనుజూచి తమ గురువునకు దెలియ పరచిరి. ఆ మఠాధికారి క్రోధోద్దీపిత మానసుడై పైఠన పురవాసియగు గృహస్థుని రప్పించి, "శ్రీమద్భాగవతమును ప్రాకృతమున నే మూర్ఖుడు రచియించెనో తెలుపు"మని యడుగగా నాతడు భీతిజెంది పైఠనపురమున నేకనాథను మహాభక్తుడు వ్రాసెనని చెప్పెను. అంత నా మఠాధికారి శ్రీమద్భాగవతమును మహారాష్ట్రభాషలో నేకనాథ్ వ్రాయుట గొప్ప యపరాధమనియు, నీ గ్రంథము ప్రచారమైనచో సంస్కృత భాషయందు ఋషులు రచియించిన పురాణ గ్రంథములకు మాన్యత తగ్గుననియు, నిట్టి పాఖండ కవులను శిక్షింప వలయుననియు, దలచి తనశిష్యుల నిరువురను బిలచి యేకనాథుని నాతడు రచించిన శ్రీమద్భాగవత గ్రంథ సహితముగ నిచటకు దీసికొని రండని చెప్పి పైఠనపురమునకు బంపెను.

కాశీక్షేత్రమునుండి బయలుదేరిన బ్రహ్మచారు లిరువురును గొంత కాలమునకు బైఠనపురమునకు జేరి యేకనాథ్‌ను గలిసికొని సంస్కృత విద్యాపీఠసులగు మఠాధిపతులు మీరు రచించిన శ్రీమద్భాగవత గ్రంథమును దీసికొని రండని యాజ్ఞాపించిరి. కాన త్వరితముగ బయలుదేరు"డని చెప్పిరి. ఏకనాథొంటరిగనే వారివెంట కాశీక్షేత్రమునకు బయలుదేరి కొన్ని దినముల కచట జేరెను. ఆ మఠాధిపతి మూడు వందలమంది శిష్యులను వెంటబెట్టుకొని భిక్షాటనకు బయలుదేరెను. ఏకనాథ్ మణికర్ణికా ఘట్టమున నొక గృహస్థునింట మకాము చేసెను. పిదప మఠాధిపతి తన మఠముజేరి సింహాసనముపై నధిష్టించి యేకనాథుని దీసికొని రండని శిష్యులను బంపెను. వారు పోయి ఏకనాథున కీవృత్తాంతము జెప్పగా దాను రచించిన శ్రీ మద్భాగవత గ్రంథమును వెంట దీసికొని మఠాధిపతి యొద్దకేగెను. ఇంతలో మఠాధిపతి "సంస్కృత గ్రంథములను బ్రాకృతముగ మార్చినవాడు మహాదోషి, వాని ముఖము జూడ"రాదని యొక తెరను గట్టించి దానిలోపల దానుండెను. తెరవెలుపల మఠాధిపతి కెదురుగ నేకనాథ్ నిలువబడి చేతులుజోడించి "అయ్యా ధర్మాధికారులగు తమ యాజ్ఞానుసారము నేనువ్రాసిన శ్రీ మద్భాగవత గ్రంథమును దీసికొని వచ్చితి"నని చెప్పగా నామఠాధిపతి "నీవు గొప్ప యపరాధము జేసితివి. నిన్ను శిక్షింపవలయును. భక్తి మార్గమను పేరున కర్మ మార్గమును నాశనము జేయుటకై పురాతన సంస్కృత గ్రంథములకు పెడయర్థములు వ్రాసి జనులను మోహితులనుగా జేయుచున్నావు. నీవు వ్రాసిన గ్రంథమును బహిష్కరించితి" మని చెప్పెను. ఆ సమయమున నచ్చట మూడువందల మఠముల కధిపతులగు సన్యాసులు చేరిరి. వారెల్లర కేకనాథ్ కృష్ణరూపముగ గనబడుచుండెను. వారు "ఈతడు సామాన్యమానవుడు కాడు, అవతారమూర్తి కాన తెరను దొలగించి చూడు"డని ధర్మాధికారితో జెప్పగా నాతడందులకు నిరాకరించెను. ఏకనాథ్ చేతులు జోడించి "నావలన నపరాధము జరిగినచో క్షమింపుడు. నేనల్పమతిని, వేదశాస్త్రాదు లభ్యసించిన వాడను గాను, కవిత్వవిషయమున నాకభిమానమేలేదు. తమవంటి ధర్మాధికారులు

మరాధిపతులు, వేదశాస్త్రములందతి చతురులు నగు కవీశ్వరుల కంగీకారముగాని యీ గ్రంథము నిరుపయోగము; మీ యాజ్ఞను దప్పక పాలించెదను. సద్గురు కృపవలన నా సంకల్ప వికల్పములు దొలగి పూర్ణశాంతి సంప్రాప్తించి యున్నది. ఈ స్థితిలో నేను గ్రంథమును రచించితినని యభిమానమే లేదు. నేనిప్పటి కైదధ్యాయములు మాత్రమే లిఖించితిని. మీరానందముతో నీ గ్రంథమును మణికర్ణికా ఘట్టమునందు మీ పవిత్ర హస్తములతో గంగానదిలో గలిపి వేయు"డని చెప్పగా నచ్చట జేరిన సన్యాసులును, పండితులును, పదేపదే యేకనాథుని జూచుచుండిరి. ఆతడు చతుర్భుజములతో కృష్ణ రూపముగ గనబడుచుండెను. ధర్మాధికారి మాత్రము తెరను దీయించి యేకనాథుని దర్శింప డయ్యెను. ఏకనాథ్ వినయ విధేయతలకును, నాతని మృదుమధుర వాక్యములకును నెల్లరును నమితానందము నొందిరి; కాని ధర్మాధికారి మాత్రము తిరస్కార పూర్వకముగ "తుచ్ఛమగు నీ గ్రంథమును నా యాజ్ఞప్రకారము తప్పక గంగలో బడవేయు వలె"నని యాజ్ఞాపించి శిష్యులను బిలచి మీరు త్వరితముగ నా భ్రష్టుడు రచించిన గ్రంథమును గొనిపోయి గంగలో గలిపిరండని యాజ్ఞాపించెను.

ధర్మాధికారి యాజ్ఞప్రకార మాతని శిష్యు లేకనాథుని యొద్దనున్న భాగవతమును దీసికొని గంగానదికిబోయిరి. వారి వెంట మూడువందల మంది సన్యాసులును, పండితులును, బోయిరి. ధర్మాధికారి శిష్యులు తమగురువాజ్ఞను సారముగ నా గ్రంథమును గంగలోబడవేసిరి. తత్క్షణమే భాగీరథి సాక్షాత్కరించి రత్నకంకణయుక్తములగు తన కోమల హస్తములతో నా గ్రంథమును బుచ్చుకొని నేత్రముల కద్దుకొని శిరస్సున బెట్టుకొనెను. నదీతీరమున గల పండితులును, నితరజనులును, నమితానందము నొందిరి. శిష్యులీ కౌతుకమును ధర్మాధికారికి దెలుపగా నాతడు తెరదీసిచూచెను. ఏకనాథ్ ధర్మాధికారికి జతుర్భుజములతో గృష్ణరూపముగా గనబడుచుండెను. తత్క్షణమే ధర్మాధికారి సాష్టాంగ నమస్కారము జేసి యాలింగనము జేసికొని "మీతో సమమగు శాంతి

మూర్తి త్రిభువనములందును లేరు. నేనభిమానముచే దెలియక నపరాధము జేసితిని క్షమింపు''డని చెప్పి యేకనాథుని హస్తమును బట్టుకొని గంగానదీతీరమునకుబోయెను. ధర్మాధికారియు, మఠాధిపతులును, సన్యాసులును, పండితులును, నపారముగ జేరి చూచుచుండిరి. భాగీరథీదేవి తత్‌క్షణమే భాగవత గ్రంథము నేకనాథుని చేతబెట్టి యంతర్ధానమయ్యెను. అంత ధర్మాధికారి చెంపలు వాయించుకొనుచు ''నేనును, నాయధికారమును, నాశనమగుగాక! స్వానుభవపరుడును, శాంతమూర్తియు, నవతారపురుషుడునగు నేకనాథు నెదుట, మా పాండిత్యమును, ప్రతాపమును వ్యర్థము''లని చెప్పి తత్‌క్షణమే శిష్యులను బంపి యేనుగును, నంబారీయును రప్పించి శ్రీమద్భాగవతగ్రంథము నంబారీలో నుంచెను.

కాశీక్షేత్రమున గల బాల వృద్ధులుసహితము కౌతుకమును జూచుటకు వచ్చి యేకనాథునకు సాష్టాంగనమస్కారము జేయుచుండిరి. నానావిధములగు వాద్యములతోడను, బుక్కా తులసీపుష్పములు మొదలగు సుగంధద్రవ్యములచే నర్చనలతోడను, షోడశోపచారవిధుల పూజలతోడను, విప్రోత్తముల వేదఘోషలతోడను, భగవద్భక్తుల హరినామసంకీర్తనలతోడను కాశీక్షేత్రమునంతయు భాగవతగ్రంథము నూరేగించిరి. పిదప నా క్షేత్రవాసు లెల్లరును ప్రతిదినము నేకనాథ భాగవతమును శ్రవణము జేయుచుండిరి. ఏకనాథ్ భాగవతగ్రంథములోని యేకాదశస్కంధమందలి మిగిలిన యధ్యాయములను బూర్తిజేసి, కొంతకాలమచట వసించి, నిత్యము భాగవత కాలక్షేపమును, హరినామసంకీర్తనయును జేసి యా క్షేత్రమున భాగవతధర్మమును స్థాపించి క్షేత్రవాసుల యొద్ద నాజ్ఞదీసికొని కొంతకాలమునకు దిరిగి పైఠనపురము జేరెను.

ఏబదియారవ అధ్యాయము సమాప్తము

యశోదా వత్సలాయ నమః.

---

# కనాథ్ కుమారుని సమాధానపరచుట

— ♦ ఏ బ ది ఏ డ వ అ ధ్యా య ము ♦

ఏకనాథుని కుమారుడగు హరిపండితుడు గొప్ప విద్యావంతుడును, కర్మాభిమానియు, సనాతన ధర్మపరాయణుడై యుండెను ఆతడు తండ్రి రచించు గ్రంథములయెడ విముఖుడైయుండి మహాత్ములు రచించిన పురాణగ్రంథములను ప్రాకృతభాషలోనికి మార్చుట తగదని దుష్ప్రచారము జేయుచు, భక్తిమార్గ ప్రచారమను పేరుతో కర్మమార్గమును నాశనము జేయుట తగదని తండ్రితో ననేకపర్యాయములు వాదించి తానెంత చెప్పినను నాతడు విననందున కుటుంబసమేతుడై కాశీక్షేత్రమునకు బోయి యచ్చట కాపురముండెను. హరిపండితుని విద్వత్తు జూచి యచట ధర్మాధికారులును, మఠాధిపతులును, పండితులును నితర ప్రజలును నాతని గౌరవించుచుండిరి. గొప్ప పండితసభలందును, పురాణ వ్యాఖ్యానములందును హరిపండితున కఖండసన్మానములు జరుగుచుండెను. ఆతని కా క్షేత్రమున గొప్ప పేరు ప్రతిష్ఠ లేర్పడెను.

ఏకనాథ్ హరిపండితుడు కాశీక్షేత్రమున వసించుటచే ఖిన్నుడై "కుమారుని దన మార్గమునకు త్రిప్పుకొనలేని వాడితరుల నేమి యుద్ధరింపగలడని దుర్జనులు దుష్ప్రచారము జేయుదురు. కాన కాశీక్షేత్రమునకుబోయి కుమారుని సమాధానపరచి తీసికొనివచ్చి తనయొద్దనే యుంచుకొనుట యుచిత"మని యాలోచించి తాను కాశీక్షేత్రమునకు వచ్చుచున్నానని వర్తమానమంపెను. పిదప నేకనాథు నుద్ధవుడను శిష్యుని వెంటబెట్టుకొని కాశీక్షేత్రమును జేరెను. హరిపండితు డెదురుగవచ్చి తండ్రిని గృహమునకు దీసికొనిపోయెను. ఏకనాథ్ కాశీక్షేత్రమును జేరిన వార్తనువిని జనులెల్లరు నపారముగ దర్శనమునకు వచ్చుచుండిరి.

ఏకనాథ్ కొన్నిదినములచటనుండి కుమారు నేకాంతముగ బిలచి "హరీ! నీ విక మీదట నా సమక్షముననే యుండవలెను. నాకు మృత్యుకాలము సమీపించుచున్నది. శేషించిన యాయువును నీయొద్దగడప

వలెనని మిగుల గోరికయున్నది. నిన్ను గృహమునకు దీసికొని పోవుటకై నేను వచ్చితిని. నీకీక్షేత్రమున వసింపవలెనని కోరికయున్నచో నామరణానంతరము వచ్చి యుండవచ్చునని యాదరముతో బలికెను. హరిపండితుడు తండ్రికోరిక నంగీకరించి "తండ్రీ! నేను మీతోవచ్చుట కెట్టి యభ్యంతరమును లేదు; కాని నాకు రెండుకోరికలు కలవు; తాము కృపతో నంగీకరించినచో నేను మీవెంట వచ్చెదు"నని చెప్పెను. అందుల కేకనాథుడు "నీకోరిక నెరవేర్చుటయే నా పరమధర్మము. అఖండ ప్రజ్ఞావంతుడవు, మహాపండితుడవు, సనాతన ధర్మమును శ్రద్ధతో బాలనజేయువాడవు, నీవుకోరిన దానికి నేనవశ్యముగా నంగీకరించెదను. నీ కోరికలను దెలుపు"మని యడుగగా "మొదటికోరిక యేమన తామికమీదట మహారాష్ట్రభాషయందు బురాణములు జెప్పరాదు, నాకు సంస్కృతము నందపార పాండిత్యము గలదు. నేనే సంస్కృతభాషలో మీ సమక్షమున మీకు గావలసిన పురాణములను జదివి చెప్పెదను. రెండవకోరిక యేమన తామికమీదట పరాన్న భోజనమును వర్జింపవలయు"నని హరిపండితుడు చెప్పగా నేకనాథ్ "నీవు కోరినట్లే చేసెద"నని చెప్పగా హరిపండితు డమితానంద భరితుడై తండ్రితోగలిసి సకుటుంబముగా గొంత కాలమునకు పైఠనపురము జేరెను.

హరిపండితుడు ప్రతిదినము మూడవజామున దండ్రి సమక్షమున దండ్రికి బదులుగ దానే సంస్కృత భాగవత శ్లోకములకు వ్యాఖ్యానము జేయుచుండెను. కుమారుని కోరిక ప్రకార మేకనాథ్ మహారాష్ట్రభాషయందు పురాణములకు వ్యాఖ్యానము జేయుటయు, పరాన్న భోజనమును వర్జించెను. అందుచేత పరమార్థ మార్గోప దేశమునకును, నాతని యవతార కార్యక్రమమునకును విఘ్న మేర్పడెను. ఏకనాథ్ చేయు పురాణకాలక్షేపమున కసంఖ్యాలుగ వచ్చు ప్రజలు హరిపండితుని పురాణ కాలక్షేపమునకు వచ్చుట మానిరి. తండ్రికి కట్టడి జేసెనని హరిపండితునిపట్ల ప్రజలెల్లరును విముఖులై యుండిరి.

పైఠనపురమున ననాథయగు నొక వృద్ధస్త్రీ యుండెను. ఆమె శ్రీమంతురాలై యున్న సమయమున సహస్ర బ్రాహ్మణ సంతర్పణను జేయ సంకల్పించెను గాని దుర్దశచే గొలది కాలమునకే దరిద్రురాలై క్రమక్రమముగ కుటుంబ పోషణ మార్గమును లేక భిక్షాటనముచే నుదర పోషణము జేసికొనుచుండెను. ఒకరోజున నయ్యనాథస్త్రీ "సహస్ర బ్రాహ్మణ సంతర్పణను జేయసంకల్పించి క్రమముగ దారిద్ర్యము తటస్థించుటచే జేయలేకపోతిని. సంకల్పదోషము శాంతించునట్టి యుపాయము జెప్పు"మని యొక పండితుని విచారింప నాతనొక బ్రహ్మనిష్ఠావంతుడగు పురుషునకు భోజన మిడినచో ననంత పుణ్యము కలుగునని చెప్పెను. అంతనామె యాతనినిజూచి యట్టి బ్రహ్మనిష్ఠావంతు లెవ్వరని యడిగెను. అంత నాపండితుడు "ప్రస్తుత కాలమున నేకనాథునితో సమమగు బ్రహ్మనిష్ఠావంతు డెవ్వడును లేడని" చెప్పెను. పిదప నాయనాథస్త్రీ యేకనాథుని గృహమునకేగి పురాణ శ్రవణము పూర్తియైన పిదప సాష్టాంగ నమస్కారముజేసి "రేపటిరోజున నా గృహమునకు భోజనమునకు విచ్చేయవలయును. నేను పూర్వము సహస్ర బ్రాహ్మణ భోజనము జేయవలెనని సంకల్పించితిని. క్రమముగ హీనస్థితి సంప్రాప్తించి భిక్షాటనము జేయుచు కొలది కాలముగ నేను భిక్ష దెచ్చిన దానిలో గొంత భాగము మీకు భోజనము పెట్టవలయునని దాచితిని. నా ప్రార్థన యంగీకరింప వలె"నని యడుగగా నేకనాథు కుమారుని కోరిక ప్రకారము పరాన్న భోజనమునకు విఘ్న మేర్పడుటచే నాతని యనుమతి లేనిది బోవు టుచితముకాదని యాలోచించి హరిపండితుని బిలచి "ఈమె భావుకురాలు. ఈమె సంకల్పము పూర్తి చేయవలయును. దీని కుపాయ మాలోచించుము. నీవును నా వెంటరమ్ము. నీ చేతితోనే వంట దయారు చేయుము. మన మిరువురము భుజింత"మని చెప్పగా తండ్రిమాట నతిక్రమింప లేక హరిపండితుడు సమ్మతింప నిరువురును బోయిరి. హరిపండితుడు తాను స్వయముగ పాకము జేసెను. ఆయనాథస్త్రీ యేకనాథునికై పిండివంటలను జేసి యింటిలో నుంచియుం

చెను. హరిపండితుడు రెండు విస్తళ్ళలో బదార్థములు వడ్డించిన పిదప నిరువురును భుజింపుచుండిరి. అనాథస్త్రీ ఖిన్నవదనురాలై చూచు చుండ నేకనాథామెను జూచి ('అమ్మా! నా కొరకై నీవు చేసి యుంచిన పిండి వంటలను నాకు మాత్రము వడ్డింపు''మని చెప్పగా, నామె యేక నాథునకు మాత్రము వడ్డించెను.)

తండ్రి పరాన్న గ్రహణము జేయుచున్నాడని హరిపండితునకు వికల్పము కలిగెను. హృదయమున కోప మాపుకొనుట దుస్తరమగు చుండెను. ఏకనాథత్యంత శాంతమూర్తి యగుటవలన యుక్తి వచనము లతో కుమారుని కోపమును జల్లార్చెను, ఇరువుర భోజనమును పూర్తి యొనపిదప యేకనాథ్ కుమారుని జూచి "ఈయెంగిలి విస్తరి నీవుతీసి బయట పారవేయు''మని చెప్పెను. హరిపండితుడు ప్రథమమున తండ్రి భుజించిన విస్తరితీయగా క్రింద నింకొకటి తయారుగ నుండెను. దానిని దీయగా నింకొకటి యుండెను. ఈ విధముగ నొకదాని క్రింద మరియొక టిగా వేయి విస్తళ్ళుండెను. ఈ చమత్కారమును జూచి హరిపండితుడు తనకుగల కర్మాభిమానమును దొలగించుకొని "భాగవత ధర్మమున గొప్ప మహిమ యున్నది! మహాత్ములు కర్తృత్వ శూన్యులుగ గన బడెదరు. వారిలో గొప్ప యదృశ్యశక్తి యుండి పరాక్రమమును జూపు చుందురు. పూర్వ యుగములలో ప్రహ్లాదుడు, నంబరీషుడు, ద్రౌపది మొదలగువారు బహు చమత్కారములను జూపియుండిరి, పరాన్న సేవన పాతకమునకంటె పరేచ్ఛాతృప్తి పుణ్య మధిక''మని తెలిసికొని తండ్రికి సాష్టాంగ నమస్కారముచేసి "మీరు కేవలము పరబ్రహ్మావ తారులు. మీ మాహాత్మ్యమును యోగ్యతను దెలిసికొనలేక యపరాధ మొనర్చితిని. క్షమింపు'' డని పశ్చాత్తాప మొంది భాగవతధర్మము నను ష్ఠించుచుండెను కుమారుడు పశ్చాత్తప్తచిత్తుడై భక్తిమార్గమున ప్రవే శించుటవలన నేకనాథునకమితానందము కలిగెను.

ఏకనాథ్ కసమయమున కాశీనుండి గంగోదకమును దీసికొని పోయి రామేశ్వరమునం దభిషేకము జేయవలెనని సంకల్పించి హరి

పండితుని, కొందరు శిష్యులను వెంటబెట్టుకొని కాశీక్షేత్రమునకు బోయి కావిళ్ళతో గంగోదకమును మోసికొని ప్రయాణముజేయుచు, పైఠన పురమార్గముగ రామేశ్వరమునకు బోవుచుండెను. పురవాసులెల్లరును గోదావరీతీరమున నేకనాథుని దర్శించుటకై యెదురేగుచుండిరి. ఆ తీరమునందలి మండు టిసుకలో నొక గాడిద పడి కొట్టుకొనుచు మరణోన్ముఖమైయుండెను. ఏకనాథుఁ డా గార్దభమును జూచి కృపతో హరిపండితుఁడు మోయుచున్న యొక గంగోదకభాండమును దీసికొని త్వరితముగ బోయి యా గార్దభమునోట బోయుచుండెను. అచ్చట గల విప్రులును, హరిపండితుఁడును బవిత్రమగు గంగోదకమును గాడిదకు బోసెననియు, తాను మోయుచున్న కావిడిలోని జలమును దీసి, సర్వజనులలో తన్నవమానపరచెననియు దలచి మానభంగము, మనోభంగము జరిగినదనియు ఖిన్నవదనులై యుండిరి. ఆ రాత్రి యెల్లరును నిద్రించుచుండ హరిపండితుని స్వప్నమున రామలింగేశ్వరస్వామి దర్శనమిచ్చి "హరిపండితా! నీవు మోయుచున్న కావడిలోని జలము నీ తండ్రి గాడిదకు బోసెనని ఖేదమును విడువుము. నీవు నూరుకావిళ్ళ గంగోదకమును దెచ్చి నా కభిషేకము జేసినఫలమును బొందితి"వని చెప్పి యంతర్ధానుడయ్యెను. హరిపండితుడు సమాహితచిత్తుఁడై వికల్పమును విడచి యప్పటినుండియు తండ్రివిషయమున వికల్పములను బెట్టుకొనక నానందముతో రామేశ్వరము జేరి గంగోదకముతో నభిషేక మొనర్చి కొంత కాలమునకు స్వస్థానమును జేరెను.

ఏకనాథ్ చతుశ్శ్లోకి భాగవతమును, రుక్మిణీ స్వయంవరమును, భావార్థ రామాయణమును, ప్రేమానందలహరిని, గీతాసారమును, ప్రహ్లాదవిజయమును, స్వాత్మసుఖము, నానందానుభవమును, భాగవతైకాదశస్కంధమును రచించెను.

ఏబదిఏడవ అధ్యాయము సమాప్తము.

యశోదా వత్సలాయ నమః.



ఏకనాథ్ గంగాజలమును తాపముతొ పడియున్న గార్ధభమునకు పోయుట.

# ఏకనాథ్ నిర్యాణము

—♦ ఏబదియెనిమిదవ అధ్యాయము ♦—

పైఠనపురవాసులెల్లరు నమిత భక్తిశ్రద్ధలతో ప్రతినిత్యము నేకనాథ్ చేయు హరినామసంకీర్తన విని యానందించుచుండిరి. ఒకనాడు హరినామసంకీర్తనము జరుగుచుండగా శ్రవణమునకై వచ్చిన శ్రోతలను జూచి యేకనాథ్ "రేపటిరోజు ఉదయమున నేను దేహత్యాగము జేయ బోవుచున్నాను. మీరెల్లరు కృపతో విడువక నఖండముగ హరినామ సంకీర్తన జేయుచుండవలె" నని చెప్పగా శ్రోతలెల్లరు చింతాక్రాంతులైరి.

మరునాడేకనాథ్ ప్రాతఃకాలముననే నిద్రనుండి లేచి దేహబాధలను దీర్చుకొన్ని, గోదావరిలో స్నానముజేసి, త్వరితముగ సనుష్ఠానమును బూర్తిజేసికొని, భగవన్నామము నుచ్చరించుచు దేహత్యాగము జేసెను. ఏకనాథ్ ప్రాణమును విడచెనను వార్త తెలిసి వేలకొలది జనులు వారి గృహమును జేరి దుఃఖించుచుండిరి. గ్రామమున గల కుటిలు రచటజేరి యపారముగ జేరిన స్త్రీ పురుషులను జూచి"ఏమి యీ వెఱ్ఱితనము! ఇతరజనులవలె నాతడును మరణించెను. సత్పురుషుల మరణములో గొప్పవిశేషమున్నదనియా మీరందరిచటజేరి" రని కసరుకొనుచు, బరిపరివిధముల నవమానకరమగు బలుకులతో నిందించుచు, సంతర్మందిరము జేరి, యేకనాథ్ భౌతిక దేహమునకు నమస్కరించుచున్న స్త్రీ పురుషులను జూచి, "చచ్చినవారి కింకను నమస్కారము జేసెదరేల?" అని పరిహాసించుచుండిరి. తత్‌క్షణమే యేకనాథ్ లేచి కూర్చుండెను. కుటిలురీ కౌతుకమును జూచి యాతనికి సాష్టాంగనమస్కారము జేసి "మీ మహిమవిశేషములను దెలిసికొనలేకపోతిమి. క్షమింపు" డని ప్రార్థించిరి.

ఏకనాథుద్ధవుడను శిష్యుని బిలచి భజన నేర్పాటు చేయుమని చెప్పగా నాతడు గ్రామమున గల భజనపరు లందరకును వర్తమాన మంపెను. ఏకనాథ్ సజీవుడై తిరిగి మాటాడుచున్నాడని తెలిసి యా

నగరమున గల యాబాలగోపాల మీ కౌతుకమును జూచుటకై వచ్చిరి. ఏకనాథ్ తాను మృదంగాది వాద్యములతో హరినామసంకీర్తన ప్రారంభించి భజనపరులతో గలిసి నగరప్రదక్షిణమునకై పయలుదేరి మార్గమున గల స్త్రీ పురుషుల కెల్లరికిని నమస్కరించి దయయుంచుడు. మిమ్ముల నే నీ దినము విడచి పోవుచున్నా" నని చెప్పుచుండె జనులాతనికి పుష్పహారములను, తులసీహారములను వేసి యశ్రుధారలను విడచుచు విలపించుచుండిరి. పైఠనపురవాసుల నేత్రములనుండి యా సమయమున నశ్రుధారలు గంగాప్రవాహమువలె ప్రవహించుచుండెను. జనులెల్లరును మరల నాతని దర్శనము లభించునేమో గదా యని తదేక దీక్షతో జూచుచుండిరి. ఏకనాథ్ పురవాసులతో భజనచేయుచు గోదావరీ నదీతీరమున లక్ష్మీతీర్థమును జేరెను. అచ్చట నసంఖ్యాకులగు జనసముదాయమును "ఆ యిసుకనేలపై కూర్చుండుడు ఇదియే యంతిమ సంకీర్తన" యని చెప్పి నామసంకీర్తనము జేసి, పిదప ధార్మికోపదేశములను జేయుచుండగా కొందరు భావుకజనులు తా మీ భూమండలమున నెప్పు డవతరింతురని ప్రశ్నించిరి. అందుల కేకనాథ్ జ్ఞానేశ్వరీగ్రంథములో—

'పరిత్రాణాయ సాధూనాం, వినాశాయచ దుష్కృతాం।
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే'।

అను శ్లోకమునకు వ్రాయబడిన వ్యాఖ్యానమును జదివినచో మీ ప్రశ్నకు సమాధానము దొరకునని చెప్పి పిదప నచటగల జనులెల్లరికిని నమస్కారముజేసి యిక నాకాజ్ఞ నిప్పింపుడని చెప్పి కటిప్రదేశము వరకు గోదావరి నదిలో దిగి మీరెల్లరును నొక క్షణకాలము నిశ్చల చిత్తముతో నేను చెప్పు భగవన్నామమును నుచ్చరింపుడని చెప్పి 'రామ కృష్ణ హరి' నామమును దానుచ్చరించుచు జనులచే నుచ్చరింప జేయుచుండెను. అసంఖ్యాకులగు నాజనులు భక్తి శ్రద్ధలతో జేయు నామము నాదబ్రహ్మముగ నుండెను. సర్వజనులు నేత్రములనుండి యానందాశ్రుధారలు విడచుచుండిరి. తత్కాలమున నేకనాథ్ ప్రాణము విడచెను.

ఏకనాథ్ భౌతిక దేహము జలములో నటులనేయుండ హరిపండి తుడును, శిష్యులును యథావిధి నగ్ని సంస్కారములు జేసిరి. విక్రమ శకమున 1621వ సంవత్సరమునకు సరియగు వికారినామ సంవత్స ఫాల్గుణ బహుళషష్ఠి ఆదివార మపరాహ్ణ సమయమున నేకనాథ్ జల సమాధి నొందెను. భౌతిక దేహము నగ్ని సంస్కారము జేసి మరునాడు హరిపండితుడును, శిష్యులు, నస్థికలను బ్రోగు జేయుటకై పోయిరి. అస్థికలలో నొక పిప్పళవృక్షము మొలచి యుండెను. హరిపండితుడు దానిని భద్రముగదీసి యుత్తరదిశగ నాటి యా యస్థికలను భద్రపరచి యా ప్రదేశమున దులసి బృందావనమును నిర్మింపించెను. ఈ పవిత్ర దినమును మహారాష్ట్ర దేశమున నేకనాథ్ షష్ఠియని వాడుకగా బిల చుటయు, నెల్ల గ్రామములందును మిగుల వైభవముగ నుత్సవములు జేయుటయు జరుగు చుండును. పైఠనపురమున నా పవిత్రదినమున మిగుల వైభవముగ బ్రహ్మోత్సవము జరుగుచుండును.

[ఈ పైఠనపుర క్షేత్రము నిజాం సంస్థానములోని ఔరంగాబాద్ జిల్లాలోనున్నది. యాత్రికులచ్చట సర్వకాలములందును బోయి దర్శించి వచ్చుచుందురు. ఏకనాథ్‌వంశీయు లిప్పటికిని నా మఠమున కధికారులై యున్నారు.]

ఏబది యెనిమిదవ అధ్యాయము సమాప్తము

దేవకీ నందనాయ నమః



# రామదాసస్వామి చరిత్ర

## —♦ ఏబదితొమ్మిదవ అధ్యాయము ♦—

శ్రోతలారా! భక్తులకథా శ్రవణమువలన దురితములన్నియు నశించి పరమార్థాసక్తి కలుగును. మాయా మోహపాశములు తెగిపోవును. సంకల్ప వికల్పములు నశించును. భేదాభేదములు నిశ్శేషముగా దొలగును. అనాయాసముగా శాంతి సుఖములు లభించును. కర్మకిల్మలు తెగి భజనప్రేమ కలుగును. భక్తుల కథామహిమలు విశేషములను పురుషోత్తముడు చెప్పియున్నాడు. భాగ్యవంతులీ విషయము ననుభవమువలన దెలిసికొందురు. విరక్తులుసహితము భక్తకథా శ్రవణమువలన భక్తిమార్గమున ప్రవేశింతురు. లౌకికాభిమానమును విడచి భక్తుల సచ్చరిత్రలు శ్రవణము జేసినచో ప్రతిబంధకములన్నియు దొలగిపోవును. మీరు పూర్వసుకృత మపారముగ నార్జించిన భాగ్యవంతులు. కనుకనే యిట్టి భక్తకథా శ్రవణమునకు ప్రేమతో గూర్చుండియుండిరి.

కృష్ణానదీ తీరమున 'జాంగా' యను గ్రామము గలదు. అచ్చట సూర్యాజీ పంతను ఋగ్వేది దేశస్థ బ్రాహ్మణగృహస్థు శ్రీ రామోపాసన జేయుచుండెను. ఆతనికి పతివ్రతాశిరోమణియు, పరమ భావుకురాలును నగు 'రాణూబాయి' యను సత్క్షేత్రముండెను. ఈ పుణ్యదంపతులకు 1530 సంవత్సరమున శ్రీరామనవమి దినమున నొక సుపుత్రుడు కలిగెను. పన్నెండవదినమున జాతకర్మ గావించి యా బాలునికి రామదాసని నామకరణము జేసిరి. ఈ బాలుడు దినదిన ప్రవర్ధమానుడై పెరిగి పెద్దవాడగుచుండ నైదవసంవత్సరమున నక్షరాభ్యాసమును, నుపనయనసంస్కారమును జేసి యొక వైదికబ్రాహ్మణుని గృహమున విద్య నేర్పించుచుండిరి. రామదాసు వేదశాస్త్రములను సాంగోపాంగముగ నభ్యసించి, కావ్య వ్యాకరణములయందు నిపుణుడై శాస్త్రవేత్త యయ్యెను.

కొంతకాలము జరిగినపిదప 'రాఖాబాయి' భర్తతో, కుమారునికి వివాహము జేయుటకు తగినసంబంధము జూడుడని చెప్పి పురోహితులను బిలిపించెను. పురోహితులు సుకుమారియగు నొక కన్యకను రామదాసునకిచ్చి కన్యాదానము జేయుటకు నిశ్చయము జేసికొనివచ్చిరి. వివాహమునకు గావలసిన యలంకారములను వస్త్ర భూషణములను సిద్ధపరచుకొనిరి. బంధు మిత్రాదులను వెంటబెట్టుకొని 'ఆసన' గ్రామమున 'భాంజేబువా' గృహమునకు వివాహమునకై వెళ్ళిరి. సుముహూర్తమున పురోహితులును, దేవబ్రాహ్మణులును, జేరి సీమంతపూజనము జేసి విప్రోత్తములును వధూవరులను పీటలపై గూర్చుండబెట్టి వేదోక్తములగు మంత్రముల నుచ్చరించుచు వధూవరుల కిరువురకును మధ్య తెరను గట్టిరి నానావిధములగు వాద్యములు మ్రోగుచుండెను. బ్రాహ్మణులు మంగళాష్టకముల బలుకుచుండిరి. పురోహితులు 'సావధాన'శబ్దములను ఘోషించుచుండిరి. రామదాసా సమయమున 'సావధాన' శబ్దములు పలుకుచున్న యొక పురోహితుని బిలచి "మీరు సావధానయని పలుకుచున్నారు. దానియర్థమేమి? ఎవరు సావధానముగ నుండవలె"నని యడిగెను. పురోహితుడు వినోదముగ "నేటినుండి సంసార బంధము నీపై బడినది. నీవు సావధానుడవై యుండుము. దుఃఖరూపమగు సంసారమునం దణుమాత్రమైనను సుఖము లభింప"దని చెప్పెను.

తత్క్షణమే రామదాసు పశ్చాత్తప్త చిత్తముతో వైరాగ్యయుక్తుడై పలాయన మయ్యెను, ఆతనిని బట్టుకొనుట కెవరెన్ని విధముల ప్రయత్నించినను దొరకక యరణ్యములో ప్రవేశించెను; అన్నములో విషము గలిసియున్నదని తెలిసినచో భోజనమునకై కూర్చుండు వాడాకును వదలిపెట్టి లేచిపోయినట్లు, విషయసుఖ విముఖుడై యెవ్వరుచెప్పినను వినక రామదాసరణ్యములో జేరెను, రామదాసును వెదకుచు బంధువు లరణ్యములో నాతనిగాంచి పరిపరి విధముల సమాధానపరుప జూచినను "మీ రేల వ్యర్థముగ దుఃఖరాశియగు సంసారమున బడవేయ ప్రయత్నింతురు. కామేచ్ఛను దీర్చుకొనుటకై యీ దేహమును జీవిత

మంతయు నొకస్త్రీ కర్పించుట యెంత యవివేకము? ధనమార్జించి దాచుకొనిన పిదప దస్యులువచ్చి ప్రాణము దీసినట్లును, గాలమునకు గుచ్చియున్న మాంసముపుమనక కాశించిన మీనమునకు మరణము సంప్రాప్తించినట్లును, సంసార దుఃఖమున నమూల్యమగు జీవితము ద్వార పుత్రాదుల పోషణకై వ్యర్థముగ నాశనము జేయుట యవివేకము. నా కొఱకై మీరు వివాహ ప్రయత్నము లింతటితో విరమించుకొని గృహమున కేగుడు. లేనిచో నా జీవితమును వ్యర్థముగ గాడుచేసిన వారగుదు" రని పలుకగా బంధువులు "ఈతనికి వైరాగ్యము కలిగినది. ఎన్ని విధముల జెప్పిన నిక ప్రయోజనము లే"దని తెలిసికొని స్వస్థానమునకు బోయిరి.

రామదాసరణ్యములో నేకాంతముగ గూర్చుండి వైరాగ్య భరితుడై పరిపరి విధముల యోచింపుచు కలియుగమున తీర్థ వ్రతానుష్ఠానాది సాధనల వలన భగవత్ప్రాప్తి లభించుట దుర్లభము. సద్భావముతో నఖండముగ హరినామ సంకీర్తన జేసినచో భగవంతుని దయ లభించును. గనుక భగవన్నామమును భజించి వైకుంఠమున కేగెదను శ్రీరామ నామస్మరణచే వెంకటుని తాపము చల్లారె"నని విశ్వాసముతో నొక చోటగూర్చుండి యఖండముగ హరినామ స్మరణ జేయుచుండెను. నిష్ఠతో నాహారాదులను త్యజించి "ఓ అయోధ్యావాసీ! దశరథ కుమారా! కౌసల్యాతనయా! జానకీవరా! రావణాంతకా! జగదుద్ధారా! శ్రీరామా! నే ననాథుడను, దీనుడను, నిర్మానుష్యమగు నీ యరణ్యమున నీ దర్శనమునకై కూర్చుండి యుంటిని. నీవు పతిత పావనుడవు, భక్తాభిమానివి కృపతో నాకు దర్శనమిమ్ము" అని దీన వచనములతో రామదాసు ప్రార్థన జేయుచుండ నచట వికృతరూపముతో హనుమంతుడు సాక్షాత్కరించెను. కాని రామదాసునకు గొంచెమైనను భయము కలుగ లేదు. రామదాసు నిశ్చయమును జూచి హనుమంతు డానందించి తన యథారూపముతో దర్శన మిచ్చెను. రామదాసు హనుమంతునకు సాష్టాంగ నమస్కారము జేసి యాలింగనము జేసికొని "శ్రీరామ

దర్శనము లభించు నుపాయము జెప్పు"మని యడిగెను. హనుమంతు డాతని కభయమిచ్చి శ్రీరాముని కృపాపాత్రుడ వగుదువని యాశీర్వదించి తత్‌క్షణమే యదృశ్యుడాయెను.

రామదాసు నగరమున బ్రవేశించి పశ్చాత్తప్త చిత్తుడై భిక్షాటనజేయుచు నల్పాహారమును సేవించి తిరిగి యరణ్యమున బ్రవేశించి యఖండముగ శ్రీరామ నామస్మరణ జేయుచుండెను. అనుతాపము వలన నిద్రయు నలసటయు లేక మనస్సును సంభోధించుచు, రెండువందలయైన శ్లోకములను రచించెను. మనస్సే శ్రోత; మనస్సే వక్త; మనస్సే జ్ఞానదాతయగు సద్గురువని యాతడు నిశ్చయించి ప్రతినిత్యము నా శ్లోకములను పఠించుచుండెను. (ఆ శ్లోకములను మనస్సును సంబోధించు శ్లోకము లనెదరు. అసంఖ్యాకులగు భావుకులు నియమముతో నాశ్లోకములను పఠించెదరు.) రామదాసు శ్రీరాముని రూపమును తనమనస్సున నిలుపుకొని యా యరణ్యమున నానందాశ్రువులు విడుచుచు గద్గదస్వరముతో నృత్య కీర్తనల జేయుచుండెను. అచ్చట గల వృక్షములును, లతలును, పాషాణములును, పక్షులును, శ్వాపదములును, తనకు సఖులు సజ్జనులని నిశ్చయముగా భావించెను. మధ్యాహ్న సమయమున క్షణకాలము నగరమునకు భిక్షకై పోయి క్షుద్బాధను శాంతి పరచుకొని తిరిగి వచ్చుచుండెను. ప్రాపంచిక జనులెవ్వరును దగ్గరకు జేరినను సాంగత్య దోషముచే తన్ను మాయాజాల మావరించునని భయముతో పారిపోవుచుండెను. పరమార్థపరులును, జ్ఞానులును, ధైర్యవంతులును, విషయ లోలురైన జనుల సాంగత్యము జేసినచో దప్పక యనర్థమును పొందెదరు. అమూల్యమగు కస్తూరి క్షణకాల మింగువతో గలిసియుండిన దాని సువాసనయు, విలువయు పోవును. పొగాకు పొడవలన వక్కకు దుర్గంధ మబ్బినట్లు, సమూలముగ నవిద్యచే నావరింప బడియుండు ప్రాపంచికాజ్ఞానుల సాంగత్యమును విరక్తులును, సజ్జనులును, చేసినచో సంసార బంధమున దగుల్కొని మోసపోయెదరని తెలిసికొని

రామదాసు వైరాగ్య శీలుడై యేకాంతముగ సర్వకాలములందును నామస్మరణ జేయుచుండెను.

ఆషాఢ శుద్ధయికాదశీ బ్రహ్మోత్సవమును దర్శించుటకై భక్తులు తంబుర తాళ మృదంగాది వాద్యములతో హరినామసంకీర్తన జేయుచు బంఢరీపురమునకు బోవుచుండిరి. రామదాసు తానును బంఢరీపురమును దర్శింపవలెనని బయలుదేరి పోవుచుండగా మార్గమున నాతనికి హనుమంతుడు దర్శనమిచ్చి "పంఢరీపురమున నీకు శ్రీరామ దర్శనమగు" నని చెప్పి యంతర్ధానుడయ్యెను. రామదా సమితానందముతో త్వరితముగ నడచుచు గొలదికాలమునకు బంఢరీపురములో బ్రవేశించి చంద్రభాగా నదీతీరమున నసంఖ్యాకులగు వైష్ణవులు నృత్యసంకీర్తనలు జేయుచుండుట జూచి సంశయచిత్తుడై "నే నెవరిని ధ్యానముచేయుచున్నానో యాతని మహిమవిశేషమేమియు నీ క్షేత్రమున నగుపడుటలే" దని దలంచుచు, చంద్రభాగానదిలో స్నానముజేసి, శ్రీరామచరిత్రను గానము జేయుచు, మహాద్వారమున బ్రవేశించి యచటనుండి సభామంటపము జేరి గరుడ హనుమంతులను సేవించెను. అచ్చట వైష్ణవజను లానందముతో బతాకహస్తులై హరినామసంకీర్తన జేయుచుండిరి. రామదాసా ప్రేమసుఖమును జూచి యానందభరితుడై యచటగల భక్తులెల్లరికిని నమస్కారము జేసి గర్భాలయములో బ్రవేశించినగాడగా, సింహాసనముపై భగవంతుడు విరాజమానుడుగ సమచరణములను, కటిన్యస్త హస్తములను, నాసాగ్రదృష్టిని గలిగి యమూల్య రత్నఖచిత కిరీటమును, మకరకుండలములను, కౌస్తుభమణియును, వైజయంతీహారమును, కస్తూరీ తిలకమును, కోమల తులసీమిశ్రిత పుష్పహారములను, నమూల్య పీతాంబరములను ధరించి, సూర్య చంద్రులను మరుగుపడజేయు ప్రకాశము గలిగియున్న శ్రీ విఠ్ఠలనాథుని జూచి రామదాసు సంశయచిత్తుడై "నేను వీని కెట్లు నమస్కారము జేయవలెను. నేను ప్రతినిత్యము మానసపూజ జేయునప్పుడు నా హృదయమున సాక్షాత్కరించు శ్రీరామరూప మిచ్చట గనబడుటలే" దని తలచి నమస్కారము జేయకయే "ఓ శ్రీ

రామా! హస్తములందుండు ధనుర్బాణము లేమి జేసితివి? కటిప్రదేశమున హస్తములుంచుకొని వేషమును మార్పుచేసితివేమి? దీనికి కారణ మేమో త్వరితముగ దెలుపుము, సరయూనది నేమిచేసితివి? ఇచ్చట చంద్రభాగను గల్పించితివేల? అయోధ్య నేమిచేసితివి? ఈ పంఢరీపురములో నుంటివేల? జగజ్జననియగు సీతాదేవి నేమిచేసితివి? ఇచ్చట రుక్మాబాయి కనబడుచున్న దేమి? అమితమగు వానరదళ మిచట గనబడుటలేదు. అందరు భక్తులేయున్నారు. నీ సైన్యమేమియు గనబడక యొక్క హనుమంతుడుండుటకు గారణమేమి? నిన్ను రూపముతో నెవ రిచట నిలుచుండబెట్టిరి? ఈ రూప దర్శనమునలన నా చిత్తమునకు సమాధానము కలుగుటలేదు. నే నెవరి నాలింగనముచేసికొనిన చిత్తశాంతి యగును; నే నెవరికి సాష్టాంగనమస్కారము జేయవలయునో తెలియుటలే" దని యానందాశ్రుధారలు విడచుచు "ఓ యయోధ్యావాసీ, జానకీరమణా! త్వరితముగా నాకు దర్శనమిమ్ము. నే ననాథుడను. దీనుడ" నని ప్రార్థింపగా రామదాసు కరుణావచనములకు (శ్రీ) పంఢరీనాథుడు సంతోషించి రామదాసుభక్తి ధన్యమైనది. దీనినే యుపాసనయనెద" రని జగజ్జీవనుడు రుక్మిణీదేవితో "(శ్రీ)రామోపాసకుడగు రామదాసు వచ్చియున్నాడు; ఆతని మనోభీష్టము పూర్తిచేయవలసియున్నది. కాన నీవు సీతరూపమును ధరింపు" మని చెప్పెను. భగవదాజ్ఞప్రకారముగ (శ్రీ) రుక్మిణీదేవి సీతరూపమును దాల్చి వామభాగమున నిలువబడెను. తత్క్షణమే (శ్రీ) పంఢరీనాథుడు తనరూపమును మార్చి సుందరమగు మేఘశ్యామవర్ణమును, విరాజమానమగు కిరీటమును, కుండలములును, జేతులలో ధనుర్బాణములను ధరించి రామదాసునకు దర్శనమిచ్చెను. నిజభక్తుడగు రామదాసీ రూపమును జూచి హృష్టచిత్తుడై యాలింగనముజేసికొని, భగవంతుని పాదములపై తన మస్తకమునుంచి సద్భావముతో నమస్కరించి "బహుదినములనుండియు నీ రూపమునకై నిరీక్షించుచుంటిని. ఇప్పుడు నాచిత్తము సమాధానమైన" దని చెప్పగా భగవంతుడు "నీకోరిక ననుసరించి నేను (శ్రీ)రామరూప



శివాజీ మహారాజు రాజ్యమును దానపత్రము వ్రాసి
రామదాసస్వామి జోలెలో వేయుట.

మును ధరించిచితి. ఈ రూపమును నీమనమునం దుంచుకొని భేద భావమును దొలగించుకొనుము. శిష్యసాంప్రదాయమును వ్యాప్తిజేసి సద్భావముతో హరినామసంకీర్తన జేయుచు జడ మూఢాజ్ఞానులను భక్తిమార్గమున ప్రవేశపెట్టు" మని చెప్పి యాతని శిరముపై నభయ ప్రదహస్తముంచి తిరిగి యథాప్రకారముగ శ్రీ పాండురంగరూపమును ధరించెను.

శ్రీ విఠ్ఠలమూర్తి రామదాసు నాలింగనము చేసికొనగా నాత డుల్లాసముతో రామకృష్ణ రూపములు రెండను భేదములను సంశయ మును విడచి యభేదభావముతో నచట పూర్ణిమవరకు భక్తులతో హరి నామసంకీర్తన జేయుచు గోపాలకాలమహోత్సవమును సేవించి భగవం తుని యాజ్ఞనుబొంది రామదా సచటనుండి బయలుదేరి మార్గమున బోవుచుండగా నా దేశమును బాలించు శివాజీచక్రవర్తి యశ్వా రూఢుడై యా మార్గమున బోవుచు రామదాసును జూచి యశ్వమును దిగి సాష్టాంగనమస్కారము జేసి "నేను ధన్యుడనైన సుదినము. మహా త్ముల దర్శనము లభించిన" దని చెప్పి యాతనియొద్ద మంత్రోపదేశ మును బొంది తన యాస్థానమునకు దీసికొనిపోయెను. రామదాసుడు శివాజీ వెంట గొనిపోయి తా నేర్పరచిన 'సజ్జనగడ' లోని యాశ్రమ ములో నధిష్ఠింపజేసి ప్రతి గురువారమును నియమముతో దర్శనము జేసికొని యాతనివలన ధర్మములను దెలిసికొనుచుండెను. రామదా సొకదినమున భిక్షకై జోలెను వేసికొని రాజసభలో నిలువబడి భిక్ష వేయుడని కేక వేసెను. తత్క్షణమే శివాజీమహారాజ్ "సద్గురువుల కేమి సమర్పింపవలెను. నా సర్వస్వము వారిదే గదా!" అని భావించి సర్వరాజ్య మును రామదాసున కర్పించినట్లు దానపత్రమును వ్రాసి రాజముద్ర వేసి యాపత్రమును రామదాసుజోలెలో వేసెను. పిదప రామదాసు శివాజీని జూచి "రాజ్యము నాకర్పించితివి. ఇప్పు డేమిచేసెద" వని యడుగగా తమ పాదసేవ జేసెదనని శివాజీ ప్రత్యుత్తరమిచ్చెను. "అటులయిన చో నాకర్పించిన రాజ్యమును నీవు నిమిత్తమాత్రుడవుగ నుండి నాకు బ్రతి

సాధిగా బాలింపుము. ఇది హిందూరాజ్యమగుటచే పూర్వపద్ధతియగు 'జోహార్' యను శబ్దమును మార్చి 'రామ్ రామ్' యని వాడుచుండుము. స్వామిత్వదర్శకముగ కావిజెండా (భగవా జెండా) ను ధరింపు" మని చెప్పెను.

సద్గుర్వాజ్ఞానుసారముగా శివాజీ యట్లేచేసి రామరాజ్యమని ప్రజ లెల్లరానందించునట్లు సక్రమముగా బరిపాలన జేయుచుండెను. రామదాసు 'దాసబోధ' యను గ్రంథమొకటి రచియించి శిష్యులను వెంటబెట్టుకొని భక్తి ప్రచార మాదేశమంతయు జేయుచు నసంఖ్యాకులగు నజ్ఞాన మూఢజనులను తన హితోపదేశ వాక్యములచే భక్తిమార్గాసక్తులనుగా చేసెను. కొంత కాలమైనపిదప నొకదినము రామదాసు తన శిష్యులనుబిలచి దగ్గర కూర్చుండ బెట్టుకొని "నేనీ దినమున వెళ్ళుచున్నాను. ప్రయాణము సిద్ధము చేయు"డని చెప్పగా వారెల్లరును దుఃఖించుచుండ రామదాసు వారిజూచి "నాయొద్ద శుశ్రూష జేసిన దానికిదే ఫలమా? ఈ శరీరము నాశనవంతమైనది. ఒక దినమున మీ శరీరము నశింపక తప్పదు. దాసినిగురించి శోకింప పనియేమి? దాసబోధ గ్రంథమును పఠించుచుండుడు మీకు సమాధానము కలుగు" నని చెప్పి మీ రెల్లరును "శ్రీరామ జయరామ జయ జయరామ" యను త్రయోదశాక్షరీ మంత్రమును భజింపుడని చెప్పగా ఎల్లరును భజన ప్రారంభించి చేయుచుండిరి. అంత రామదాసస్వామి 'జయ జయ రఘువీర సమర్థ' యని కేకవేసి నిజధామమును చేరెను.

ఏబది తొమ్మిదవ అధ్యాయము సమాప్తము

నందగోప ప్రియాత్మజాయ నమః



# భక్త తుకారామ్ చరిత్ర

## అ[illegible]పదియవ అధ్యాయము

జయజయ కరుణాసాగరా, ఆనందఘనా, భక్తవత్సలా, రాజీవనయనా, విధిజనకా, దానవభంజనా, జగజ్జీవనా, జగదీశ్వరా, విశ్వవ్యాపకా, కమలాపతీ, సజ్జనజీవనా, ఆనందమూర్తీ, సగుణనిర్గుణా, విశ్వగాహు, విశ్వచక్రీ, విశ్వపాదే, గమనకర్తా, చిత్స్వరూపా, ఆత్మారామా, గుణనిధానా, ఉత్తమోత్తమా, స్వానందప్రకాశా, పురుషోత్తమా, అనుపమమగు నీమహిమవర్ణించుటకు వేదములు ప్రయత్నించి సాధ్యముకాక నేతి నేతియను వాక్యములు బలికినవి. తపస్తీర్థాటనానుష్ఠానమునవలన నీప్రాప్తి లభించదు. నీవు భక్తులుచేయు నామసంకీర్తన వినుటకు ప్రేమతో బోవుదువు. యోగులు వజ్రాసనములు వేసికొని కూర్చుండియున్నను వారలకు నీప్రాప్తి దుర్లభము. నీవు భక్తులను శోధించుచుబోయి దర్శన మిత్తువు. నీవు సర్వదేవతలలో శ్రేష్ఠమగు మకుటమణివి. సనకాదులు నిన్ను బూజింతురు. నీవు భక్తుల గృహమందు సేవ జేయుదువు. ఓ పంఢరీనాథా! నిజభక్తులకు సేవజేయుటకు మానావమానములను త్యజించెదవు. నీ నిజభక్తులు నిన్ను గష్టపెట్టరు. నీవువారిని ప్రపంచ దుఃఖములో గష్టపెట్టి వైరాగ్య వంతులనుగా జేయుదువు. అభక్తులు భక్తులను చలనము జేసినచో నీవు తత్క్షణమే యద్భుతలీలలను జూపి భక్తులకీర్తి త్రిభువనములందును వ్యాపింప జేయుచున్నావు.

పూనా నగరమునకు పదునాలుమైళ్ళ దూరమున నింద్రాయణీ నదీతీరమున "దేహు" యను గ్రామము గలదు. అచ్చట మహారాష్ట్ర శూద్రజాతియందు 'బోల్హాబా'యను భావుకుడుండెను. ఆతడు తమవంశపరంపరగా నడచుచున్న శ్రీ పాండురంగ దేవుని యారాధనను నియమముతో జేయుచు తన యేడవ తాతయగు 'విశ్వంభరబువా' నిర్మించిన శ్రీ పాండురంగ దేవాలయమునకుబోయి త్రికాలములందును

దేవునికి నిత్యోపచారములు యథావిధిగ జేయుచుండెను. ఆతడేకాదశీ వ్రతమును జేయుచు నాషాఢ కార్తీక శుద్ధయికాదశులకు పంఢరీపుర మునకుబోయి బ్రహ్మోత్సవమును సేవించుచుండెను. అతనికి భర్త యాజ్ఞను పాలించునదియు, పరమ భావుకురాలును, పతివ్రతా శిరోమణియునగు 'కనకాబాయి' యను సత్కళత్రముండెను. ఈ పుణ్యదంపతులు సంతానము లేదను చింతతో నుండగా 'కనకాబాయి' స్వప్నమున భగవంతుడు త్రిమూర్తి స్వరూపముగ సాక్షాత్కరించి "నీకు త్రిమూర్త్యంశులగు ముగ్గురు పుత్రులు గలుగుదు"రని చెప్పి యంతర్ధానుడయ్యెను. కొన్ని దినములు జరిగిన పిదప 'కనకాబాయి' గర్భవతియై శంకరాంశచే నొక పుత్రునిగనెను. ఆతనికి 'సావజీ' యని నామకరణము జేసిరి. మరల కొంతకాలము జరిగిన పిదప విష్ణు వరప్రసాదము వలన కనకాబాయి గర్భవతియై యొక సుపుత్రుని గనెను. ఆ బాలునకు 'తుకారామ్' అని నామకరణము జేసిరి. బ్రహ్మాంశచే మరి కొంతకాలమున కొక పుత్రుడు గలిగెను. ఆతనికి 'కాన్హోబా' యని నామకరణము చేసిరి.

పూర్వజన్మ సుకృతవిశేషముచే బోల్హోబాకు గృహమున ధన ధాన్యాదులును, ప్రజలలో మానమర్యాదలును విశేషముగా నుండెను. బోల్హోబాయును, కనకాబాయియును, ముగ్గురు పుత్రులను బహు ప్రేమతో బెంచుచుండిరి. దినదినప్రవర్ధమానముగా ముగ్గురును పెద్దవారగుచుండ వివాహము జేయ జననీ జనకులు సంకల్పించిరి. శంకరునివరమున జన్మించిన జ్యేష్ఠపుత్రుడగు సావజీ జననీ జనకులకు వందనము లాచరించి తాను వివాహము జేసికొనననని చెప్పి గృహమునువిడచి సన్యాసాశ్రమమును స్వీకరించెను. రెండవకుమారుడగు తుకారామ్‌నకు రఖుమాబాయి యను కన్యకను వివాహముచేసిరి. ప్రారబ్ధవశమున రఖుమాబాయికి కొలదికాలములోనే క్షయవ్యాధి సంప్రాప్తించుటచే తుకారామ్‌నకు పూనానగరమునందలి శ్రీమంతుని కుమార్తెయగు 'జిజీబాయి' ని ద్వితీయవివాహము చేసిరి.

తుకారామ్ యిరువురుభార్యలతో గలిసి గృహస్థధర్మమునం దుండి వ్యవహారములన్నియు జూచుకొనుచుండెను. ఇట్లు కొంతకాలము జరిగిన పిదప తుకారామ్ జననీ జనకు లిరువురును దివంగతులైరి. తుకారామ్‌నకు సంసారము దుఃఖరూపముగ గనబడుచుండెను. తనకు ప్రజల వలన రావలసిన ద్రవ్యమంతయు నిలచిపోయి క్రమక్రమముగా వర్షాకాలపు మేఘములు శీతాకాలమున నంతరించునట్లును, సూర్యోదయమైన నక్షత్రము లదృశ్యమగునట్లును, వార్ధక్యము రాగానే దేహమునందలి తరుణదశా చిహ్నములు గనబడనట్లును, వేసవికాలమందు తృణము నశించునట్లును, దేశమంతయు క్షామదేవత తాండవమాడుచుండ తనయొద్దనున్న ద్రవ్యమంతయు హరించెను. అన్నవస్త్రాదులు లేక దారపుత్రాదులు దుస్థితియందుండిరి. జ్యేష్ఠభార్యయగు 'రఖుమాబాయి' వ్యాధిగ్రస్తురాలైయుండి క్షుద్బాధవలన బీడింపబడుచు మరణించెను.

తుకారామ్‌నకు సంపత్తి నశించగనే ప్రజలలో మానసన్మానములు లోపించెను. ఆతనిని జూచి యెల్లరును బరిహసించుచుండిరి. ఎవ రాతనిని మానమర్యాదలతో గౌరవించుచుండిరో వారే నిందించుచుండిరి. అన్న వస్త్రములకు మిగుల నిక్కట్లుపడుచు నే కృషి చేయదలచినను సానుకూలము గాకుండెను. మానవునియొద్ద ద్రవ్యము హరించిన బంధువులు దూరమగుదురు. వృక్షమునకు పత్రములు రాలిపోయిన ఛాయకొరకెవరును బోజాలరు. రాజు రణమందు కూలినచో దేహలోభులగు సైనికులు పలాయనమగుదురు. దరిద్రస్థితి వచ్చిన దుర్జను లవమానపరతురు. కఠినమగు క్షామకాలము సంప్రాప్తించినందున తుకారామ్ లజ్జతో గూడియుండగా బంధుమిత్రాదు లెవరు నాతని నాదుకొనందున వివేకవంతుడై "ప్రపంచసుఖము క్షణికమగు మాయాజాలము. మానవదేహము నాశనంతమైనది. నేను జీవితమంతయు ప్రపంచవ్యవహారములకొరకు నాయువును వ్యర్థముగా వెచ్చించితిని. విషయాదులను సుఖముగా భావించుట మూర్ఖత్వము. వంధ్యస్త్రీకి సంతతి కలిగినదనిన

మూర్ఖులానందించునట్లు నేనీ ప్రపంచవ్యవహారములకు లోనై శ్రీ పంఢరీనాథుని సేవించుట మరచితి" నని విరాగియై సుఖ దుఃఖములను సమముగా జూచుచు నహర్నిశమును శ్రీ పంఢరీనాథుని భజించుచుండెను.

తుకారామ్ ఏడవతాతయగు 'విశ్వంభరబువా' దేహూగ్రామములో నిర్మించిన శ్రీ పాండురంగదేవాలయము శిథిలమై పడిపోవుచుండెను. తుకారామ్ జీర్ణాలయోద్ధరణ జేయదలచి యాలయమంతయు స్వయముగా నూడదీసెను. దేవాలయ పునర్నిర్మాణమునకు తుకారామెంత శ్రమపడుచున్నను నాతనికి ద్రవ్యసహాయ మెవరును జేయకుండిరి. దేవాలయమంతయు నూడదీసి బహుకాల మట్టులనే యుంచెను. పూనానగరమున నఖండైశ్వర్యవంతుడగు 'మహాదాజీపంత్' స్వప్నమున శ్రీ పంఢరీనాథుడు సాక్షాత్కరించి నీవు మహాపాపమును జేసి ధనము నార్జించితివి. కొంతభాగము సత్కార్యములకు వెచ్చింపనిచో రౌరవాది నరకములను భోగింతువు. దేహూగ్రామమున తుకారామభక్తుడు జీర్ణమైన శ్రీ పాండురంగదేవాలయము నుద్ధారణ జేయదలచియున్నాడు. కాన నీవచటికేగి యా దేవాలయ నిర్మాణమునకు ధనమును వెచ్చింపుము" అని చెప్పి యంతర్థానమయ్యెను. 'మహాదాజీపంత్' మరునాడు స్వప్న వృత్తాంతమును బంధుమిత్రాదుల కెరింగించి వారిని వెంటనిడికొని 'దేహూ' గ్రామము బోయి తుకారామ్‌ను దర్శించి తన స్వప్నవృత్తాంతమంతయు నాతనికి దెలిపెను. తుకారా మతనిని జూచి "నీవు ధన్యుడవు. నీ పూర్వ సుకృతవిశేషముచే భగవంతుడు నీకు 'దేవాలయమును నిర్మింపుము' అని యాజ్ఞాపించెను. ఆతని యాజ్ఞానుసారముగా నీ వా కైంకర్యమును జేసి దేవాలయ నిర్మాణఫలమును బొందు"మని చెప్పెను. 'మహాదాజీపంత్' అపారద్రవ్యమును వ్యయముచేసి దేవాలయ పునరుద్ధారణజేసి బ్రాహ్మణులకును, యాచకులకును విశేషముగా నన్నదానము చేసెను.

తుకారామ్ సర్వసాధనములలో నేకాదశీవ్రతము శ్రేష్ఠమని తెలిసికొని నిష్ఠతో వ్రతమును జేయుచు పూర్వము భక్తులు వర్ణించిన యభంగములను కీర్తన రూపముగా గానము జేయుచు సర్వభూతముల యందు దయకలిగి, పరోపకారము జేయుచు, సమాహితచిత్తుడై యుండెను. బాటసారు లెవరైనను గనబడినచో వారలకు దేవాలయావరణాలో వసతులు గల్పించుటయు, క్షుదార్తులకు భోజన సౌకర్యము లేర్పరచుటయు, వేసవికాలమున దృష్ణాక్రాంతుల కుదక మిచ్చుటయు, ముసలులు భారమును మోయుచుండ తా నద్దానిని గైకొని వారికి విశ్రాంతి నిచ్చుటయు, గోవుల కరణ్యమునుండి తృణమును దెచ్చి వేయుటయు, భక్తు లెవ్వరైనను గనబడినచో వారికి సాష్టాంగ నమస్కారము జేసి, తన గృహమునకు వారిం దీసికొనిపోయి వారి చరణ తీర్థమును గైకొనుటయు, నిత్యాది కార్యాచరణముచే శరీర తపము జేయుచుండ నాకస్మికముగ నాతనికి గవిత్వమలవడి శ్రుతి శాస్త్రాదులలో నిమిడియున్న గూఢభావమును బ్రాకృతమున నభంగరూపమున వ్రాయ వలయునని సంకల్పము గలిగెను.

ఒకనాటిరాత్రి తుకారామ్ నిద్రించుచుండ శ్రీ పంఢరీనాథుడు నామదేవ భక్తునితో గలిసి తుకారామ్ స్వప్నమున సాక్షాత్కరించి "నీవు గతజన్మమున నామదేవుడైయుండి నూరుకోట్ల యభంగములతో నన్ను గీర్తింపవలెనని సంకల్పించి యుంటివి. ఆ సమయమున నీసంకల్పమును నెరవేర్చుటకై నేను సరస్వతిని బిలచి "నీవాక్కున బ్రవేశించి కవిత్వమును జెప్పింపుము" అని యాజ్ఞాపించితిని. సమర్థుడగు విలేఖరి కావలయునని సరస్వతి గోరుటచే నేనే స్వయముగ గూర్చుండి నీవాక్కునుండి వెలువడిన వేదశాస్త్రాదులలోని గుహ్యార్థములను తొంబది యైదు కోట్ల తొంబది యెనిమిది లక్షల యిరువది యారువేల యభంగములను వ్రాసితిని తత్కాలమున పాంచభౌతిక శరీరము నీ కసహ్యముగా దోచుటచే దేవాలయ సింహద్వారమున నీవు సమాధి పొందితివి. శతకోటి యభంగములకు శేషించినవి పూర్తి చేయుటకై మరల నీరూపమున

జన్మించితివి కాన పూర్వజన్మ వృత్తాంతమును స్మరణకు దెచ్చుకొని యాయువును వ్యర్థముచేయక నభంగములను రచింపుము" అని చెప్పి శ్రీ పంఢరీనాథుడు నామదేవునితో గలిసి యంతర్ధాన మయ్యెను.

తుకారామ్ నిద్రనుండిలేచి చూడగా శ్రీ రుక్మిణీకాంతుడును, నామదేవుడును, నచ్చట గనపడలేదు. భగవదాజ్ఞను శిరసావహించి తాళపత్రములను, గంటమును దీసికొని, సప్రేమతో నభంగములను వర్ణించుచు వ్రాయుచుండెను. ఆతని వాక్కునుండి బహిర్గతమైన యుపదేశ వాక్యములను భక్తులు ప్రేమతో శ్రవణము జేయుచుండిరి. వికల్ప చిత్తులు కొందరు "ఇది నూతనకవిత్వము ప్రమాణముగ నంగీకరించుటకు వీలులేదు. పూర్వము మహాత్ములు పలికిన కవిత్వమును త్యజించి యాతని కవితా శ్రవణముజేయుట మూర్ఖత్వ"మని ప్రచారము జేయుచుండిరి. శ్రీ రుక్మిణీరమణు డాజ్ఞాకర్తయై పలికించుచున్న కవిత్వమును దుర్జనులు నిందించుచుండిరి. త్రేతా యుగమునందు వాల్మీకి శ్రీమద్రామాయణమును రచియించెను. ఆసమయమునగల నభక్తులది ప్రమాణము కాదని తలంచిరి. శ్రీరామచంద్రుడయోధ్యలో జన్మించి తన యవతార కార్యక్రమము నంతయు వాల్మీకి రచియించిన ప్రకారము జరిపించెను. ద్వాపరయుగమునందు మహాకవివరుగు వ్యాసులు పురాణ గ్రంథములను రచియింపగా కౌరవులు తృణీకరించిరి. పిదప నాతడు వ్రాసిన ప్రకారము జరిగెను. భావార్థముతో గూడిన కవిత్వమును ద్వేషించు దుర్జను లెల్లకాలములందును నుందురు. తుకారామ్ వ్రాయుచున్న యభంగములను పామరజను లప్రమాణములని నిందించుచుండిరి. చంద్రోదయమైన తస్కరుల కుత్సాహముండనట్లును, దాతయొక్క యశశ్శ్రవణముచే కృపణునకు ద్వేషము కలుగునట్లును, పండితుని వాక్ప్రవాహమువిని దుర్జనులు కఠోర శబ్దములని భావించినట్లును, గంధర్వులు గానము జేయుచుండగా గాడిదలచ్చట గూయుచుండునట్లును, సుందరమగు కపిలగోవును మహమ్మదీయులు పూజించనటులను, భావుకులానందముతో దుకారామ్ జెప్పిన యభంగములను వినుచుండ యుం

నులు వికల్పచిత్తులై నిందించుచుండిరి. తుకారామ్ నిందాస్తుతులను సమానముగ భావించుచు నఖండముగ హరినామ సంకీర్తన గావించుచుండెను. దినమంతయు వ్రాసిన యభంగములను నిశాసమయమున గీర్తన చేయుచుండెను. అసంఖ్యాకులగు జనులు శ్రవణమునకై వచ్చుచుండిరి. తుకారామ్ కవిత్వము రసవంతముగనుండి శ్రవణ మాత్రముచే శ్రోతలకు భక్తి సంస్ఫురింప జేయుచుండెను. అతనికీర్తి పరిసర ప్రాంతము లందంతయు వ్యాపించెను. ప్రత్యేకాదశీదినమం దాతడు చేయు హరినామ సంకీర్తన శ్రవణమునకై యసంఖ్యాకులగు జనులు వచ్చుచుండిరి. తుకారామ్ నిరపేక్షుడై ఆషాఢ కార్తీక శుద్ధయేకాదశులకు నియమముతో బంఢరీ పురమునకుబోయి బ్రహ్మోత్సవములను సేవించుచుండెను.

ఒకనాడు దేశమును పాలించు శివాజీమహరాజ్ తుకారామ్ కీర్తిని విని యాతని దర్శనము జేయవలయునను కుతూహలముతో సింహగడనుండి బయలుదేరి దేహుగ్రామమున తుకారామ్ గృహమునకు బోయి యొకపళ్లెముతో సువర్ణనాణెములను, రత్నములను, నమూల్య పీతాంబరములను నాతని యెదుట బెట్టి సాష్టాంగనమస్కారము జేసెను. తుకారామ్ రాజసన్మానమును జూచి గజగజ వణకుచు, జేతులు జోడించి "ఓ రాజా! నాకీ ద్రవ్యసన్మానమేల? శ్రీ విఠ్ఠల నాథుని నామము నఖండముగ గానముజేయుచు సంతుష్టచిత్తుడనై యుంటిని. ప్రాపంచికభోగములు నా కప్రియములు. విశాలహృదయుడవగు నీవు మిగుల నుదారుడవని నేను వినియుంటిని. నీ ద్రవ్యమును, రత్నములను విష్ణుభక్తుడనగు నాకు గోమాంసముతో సమానము" లని పల్కగా శివాజీ లజ్జితుడాయెను. తుకారామ శివాజిని జూచి "నన్ను సమాధానపరుపవలయునని నీకు గోరికయున్నచో నీవు విఠ్ఠలనామస్మరణ నఖండముగ జేయుము. నేనందుచే సురసంపన్నుడనగుదును. ఓ నృపనాథా! ఈ సన్మానము నాకు వలదు. నేను మట్టితో సమానముగ నెంచు దీనిని గొనిపొమ్ము. తులసీమాలను గళమున ధరించి నియమముతో నేకాదశీ

వ్రతమును జేయుము. అంతఃకరణపూర్వకమగు ప్రేమతో నీవు విఠోబా దేవునకు దాసుడవు కావలయునని నేను కోరుచున్నాను. నా కోరికను నెరవేర్చినచో నానందింతు" నని చెప్పగా శివాజీమహారా జాశ్చర్యచకితుడై తుకారామ్‌తో సముడగు నిష్ఠామభక్తు డెచ్చటను లేడని నిశ్చయించి యనన్యభావముతో సాష్టాంగనమస్కారము జేసెను.

ఆ నాడేకాదశీ పర్వకాల మగుటచే గీర్తన శ్రవణమునకై విశేషముగ జనులు వచ్చియుండిరి. ఆ సమయమున నాకస్మికముగ రెండు వేల మహమ్మదీయ సైన్యము శివాజీ, తుకారామ్ చేయుచున్న కీర్తన శ్రవణము జేయుచు దేవాలయమున నున్నాడని తెలిసికొని యాతనిని బంధించుటకై వచ్చిరి. దేహు గ్రామమంతయు మహమ్మదీయ సైన్యముతో నిండియున్నందున ప్రజలు భీతినొందిరి కథాశ్రవణము జేయుచున్న జనులకీ విషయము తెలిసి భయపడుచుండిరి. యవను లశ్వారోహణమొనర్చి "శివాజీ యెచ్చట నున్నాడు? ఆతనిని మాకు జూపుడు" సంకీర్తన స్థలముననున్న జనుల నడుగుచుండిరి. కొందరు జనులీవిషయమును శివాజీ మహారాజ్‌నకు దెలిపి "తత్‌క్షణమే యిచటనుండి పలాయనముకండని" చెప్పిరి. శ్రోతలు చింతాక్రాంతులై యుండుట తుకారామ్ దెలిసికొని "మీరొకరికొకరు రహస్యముగా గుసగుసలేమి మాట్లాడుచుంటిరి? తెలుపుడు"? అని యడిగెను. జనులు తుకారామ్‌తో "శివాజీని బంధించుటకు రెండువేలమంది యవను లశ్వారూఢులై వచ్చిరి" అని చెప్పగా తుకారామ్ "కథ జరుగుచుండగా, నది పూర్తికాకముందే లేచిపోవుట ధర్మవిరుద్ధ"మని చెప్పెను. శివాజీ తుకారామ్ చెప్పిన వాక్యములందు విశ్వాసముతో "నేడేకాదశి మహాపర్వకాలము. భక్తుల సాన్నిధ్యమున మరణ మాసన్నమైనను మహాఫలితము సంప్రాప్తించు"నని నిశ్చయించుకొని శ్రద్ధతో కథాశ్రవణము జేయుచుండెను.

మహమ్మదీయసైనికులు దేవాలయమును చుట్టును ముట్టడించి శివాజీని బంధించుటకై దేవాలయమున బ్రవేశించిరి. అంతస్సాక్షియగు



తుకారాం జీర్ణోద్ధారణజేసిన శ్రీ పాండురంగ దేవాలయము.

తుకారా మా సమయమున యవనులు ప్రవేశించుట జూచి హృదయ మందు పంఢరీనాథుని నిలిపికొని "హే అనాథనాథా, కృపావంతా! త్వరి తముగా భక్తుల గాపాడుము. నీ కీర్తన శ్రవణముజేయుటకు శివాజీ మహారాజ వచ్చియుండగా దారుణమగు నరిష్టము సంప్రాప్తించినది. నీ నామసంకీర్తనవలన సర్వవిఘ్నములు పటాపంచలగునని మహాత్ము లెందరో వర్ణించిరి. ఆ విషయము నేడసత్యమైనట్టుల గనబడుచున్నది. ఓ జగజ్జీవనా! నన్ను పరీక్షించుచుంటివా? మరణమనిన నాకు భయము లేదు. కాని సజ్జనులకు కలుగు నరిష్టములను నేను చూడలేను. పరం పరగా వచ్చుచున్న ధర్మములను భజనవిక్షేపముకంటె మరణమే శ్రేష్ఠ మని తోచుచున్నది. ఈ సమయమున శివాజీమహారాజ నకు ప్రమా దము సంప్రాప్తించినచో నీ సమక్షమున నేను ప్రాణములను విడతును అని ప్రార్థించెను. తుకారామ్ కరుణావచనములకు జగజ్జీవనుడు సంతో సించి యాతనికి దర్శనమిచ్చి యాలింగనముజేసికొని "భయపడవలదు. అరిష్టము నే నిప్పుడే దొలగింతు" నని చెప్పి శ్రీ పంఢరీనాథుడు తాను శివాజీరూపమును ధరించి యశ్వారూఢుడై దేవాలయము వెలుపలనుండి యవనసైనికులను 'గండ'ని కేకలువేయుచు, బోవుచుండెను. యవను లెల్లరు "అడుగో, శివాజీ పారిపోవుచున్నా"డని వెంటబడి పోవుచుండిరి. వారలకు ముందు, వెనుక శివాజీ కనబడుచుండెను. భగవంతుడు వార లకు బహుదూరము ముందుగా బోవుచు, కొంతసే పాగినట్లుగా గన బడుచు, నా యంధకారసమయమున వారెల్లరినీ యరణ్యములోనికి గొనిపోయెను. ఆ యవనులు చూచు వస్తువులన్నియు శివాజిరూపమున గనపడుచున్నవి. శివాజీయని భ్రమించి యేవస్తువును పట్టుకొని చూచి నను శివాజీగా గనపడనందున విడచుచుండిరి. "మనము రెండువేలమంది మహాశూరులముండియు నొక్కనిని బంధింపలేకపోతిమే!" అని కొందరు చెప్పుకొనుచుండిరి. భగవంతుడు శివాజీరూపమున నొకక్షణము నిలువ బడి మహమ్మదీయసైనికులు బహు సమీపమునకు వచ్చువర కటులనే యుండి పిదప వాయువేగమున బోవుచు, నైదుయోజనముల దూరమున

నున్న కంటకమయమైయుండు మహారణ్యములో వారిని ప్రవేశపెట్టి తా నంతర్ధానమయ్యెను.

ఆ యరణ్యమున వసించు క్రూరమృగముల గర్జన కర్ణములెల్ల భీతిల్లి డస్సియున్న యవనులను క్రింద బడవైచి చెల్లాచెదరై పోయినవి. వారెల్లరును బహు కంటకమయమైయున్న యీ యరణ్యమున చాల నికృష్టపాలైరి. శ్రీ విఠలనాథుడు తిరిగివచ్చి తుకారామున కెదుట కీర్తనలో నృత్యముజేయుచు "ఇక నిర్భయముగ కీర్తన జేయుచుండుము. యవనసైనికుల నెల్లరను నరణ్యములపాలుజేసితి" నని చెప్పెను. శ్రోతలెల్లరు కరతాళములువేయుచు జయజయధ్వనులు చేసిరి. శివాజీమహారాజ్ నకు జనులెల్లరును జరిగిన వృత్తాంతమంతయు సవిస్తరముగ దెలియ చేసిరి. ఆత డాశ్చర్యచకితుడై "శ్రీ రుక్మిణీరమణుడు నన్నీ దారుణ సంకటమునుండి రక్షించె" నని చెప్పి తుకారాంనకు సాష్టాంగనమస్కారము చేసెను. హరినామసంకీర్తనము పూర్తియైనపిదప శ్రీ విఠలనాథునకు మంగళహారతిచేసిరి. శివాజీ తన స్వస్థానమునకు బోవుటకు బయలుదేరగా గ్రామమున నున్న స్త్రీ పురుషు లాతనిని జూచి "మహారాజా! తాము రాత్రి మహమ్మదీయసైన్యమును తప్పించుకొని పోతిరిగదా! వారలనుండి యెట్లు తప్పించుకొని తిరిగివచ్చితి" రని విచారించిరి. శివాజీ యాశ్చర్యముతో "భగవంతుడు నారూపముతో యవనులకు గనపడి వారిని చెల్లాచెదరు చేసియుండును!" అనినిశ్చయించి స్వస్థానమును జేరెను.

ఒకనాడు శివాజీమహారాజ్ "తుకారాంనకు సన్మానము జేసిన నంగీకరింపబడలేదు. ఆతడు రాజసన్మానములను స్వీకరింపకపోవచ్చును. దీనరూపముతో నాతని గృహమునకు పోయి ధాన్యమునైన నర్పించ వలయునని తలచి జీర్ణవస్త్రములను ధరించి యొక వృషభముపై రెండు మణుగుల ధాన్యమును వైచుకొని, రాత్రి రెండుజాముల సమయమున తుకారాంగృహమునకు జేరెను. ఆ సమయమున తుకారాం చేత జపమాలను ధరించి తులసిబృందావనపార్శ్వమున జపము జేయుచుండెను. శివాజీ ధాన్యపుమూటలను గృహములో బడవైచి "అయ్యా! నేను కష్ట

పడి ధాన్యమును సంపాదించితిని. అనాథుడను, దీనుడను, మీ చరణ ములయందు విశ్వాసముగలవాడను. కించిత్ ధాన్యము మీ కుటుంబ వ్యయమునకై యీయవలయునను కుతూహలముతో దెచ్చితిని. నా ప్రార్థన నంగీకరింపు" డని చెప్పి నమస్కారము జేసి త్వరితముగ వెడలి పోయెను. తుకారాం శివాజీయే యిట్లువచ్చెనని గుర్తించి యాతనిప్రేమ ఖండితమగునని మౌనమును ధరించి జిజీబాయిని బిలచి, "శివాజీమహా రాజ్ ధాన్యమును దెచ్చి గృహమునబెట్టెను. అది మనము స్వీకరింతు నచో మన సుకృతము నశించును. ఒకపూటకు సరిపోవు ధాన్యమును మాత్రముంచి మిగిలినధాన్యమును యాచకజల కర్పింపు" మని చెప్పగా ఆమె కోపముతో "నే నభాగ్యురాలను. అయాచితముగ ప్రేమతో నితరులిచ్చు ధాన్యమును బిడ్డలకు బెట్టుటకైనను నోచుకొనలేదు. ఈత నితో సంసార మెట్లు చేయవలయును?" అని శిరమును బాదుకొనుచుం డెను. అంత తుకారాం జిజీబాయిని జూచి "మన సంచితమునం దెట్లు న్నదో యట్లు లభించును" అని చెప్పెను. పిదప తుకారాం గ్రామమున నున్న యాచకజనులనుబిలచి యా ధాన్యమునంతయు వారల కర్పించెను.

ఒకనాడు తుకారాం దేవాలయమునం దానందముతో గథా కాలక్షేపము జేయుచుండెను. తంబుర తాళ మృదంగాది వాద్యములతో హరినామసంకీర్తన బ్రహ్మానందముగ జరుగుచుండెను. శ్రోతలెల్లరు దేహభ్రాంతి విరహితులైయుండిరి. ఆ గ్రామమున 'కాసార్' అను సజ్జ నుడు ప్రతిదినము నియమముతో దేవాలయమునకు బోయి తుకారాం చెప్పు హరికథాశ్రవణము చేయుచుండెను. ఆ దినమున నాతని కుమా రుడు దారుణమగు వ్యాధిగ్రస్తుడై మరణావస్థయందుండెను. ఆతని భార్య "నేడు కథాశ్రవణమున కేగవలదు. పిల్లవానికి ప్రాణాపాయస్థితిగ నున్నది" అని చెప్పినను వినక 'కాసార్' దేవాలయమున కేగి తుకా రాం చెప్పుచున్న హరికథ శ్రవణము చేయుచుండెను.

ఇంటియొద్ద పిల్లవాడు మృతుడగుటచే నాతని భార్య రోదనము జేయుచు ప్రేతమును భుజముపై వేసికొని కథాస్థలమున బ్రవేశించి

తుకారామ్ పాదములయొద్ద నా ప్రేతమును బడవైచి యాతనితో "నా భర్తకేవియో మంత్రములనేర్పి, నీకు వశ్యువడగునట్లు చేసికొంటివి. బిడ్డడు మరణావస్థయందుండ నేనెన్నివిధముల బ్రతిమాలినను నా భర్త వినక నీ కథాశ్రవణమునకై వచ్చుటచే నా బిడ్డడు మరణించెను. మా వంశమున పూర్వమునుండియు హరినామసంకీర్తనజేయు నచ్చుబాటు లేదు" అని పలికెను. భిక్షుకుడు పక్వాన్నముల దినుచుండగా నాకస్మికముగ మట్టిపడినటుల, కథాస్థలమునకు ప్రేతమును దీసికొని వచ్చుటచే రసభంగమాయెను. జనులామెను జూచి "నీవు సాహసముతో ప్రేతము నిచ్చటకు దెచ్చితివి. నీ కుమారుని బ్రతికించుటకు తుకారాం నొద్ద సంజీవికలదా?" అని యడిగిరి.

తుకారాం శ్రోతలను జూచి "అయ్యా! హరినామసంకీర్తనకు మించిన సుధారసము లేదు అది యింద్రాదిదేవతలకును దుర్లభము. మీరనుభవమిప్పుడు చూడుడు. విఠ్ఠలనామస్మరణకు మించిన యమృత సంజీవిని లేదు. వికల్పములను విడిచి నిశ్చల చిత్తముతో నెల్లరును గరతాళ ధ్వనులను జేయుచు విఠ్ఠలనామమును భజింపుడు" అని చెప్పెను. జనులెల్లరును నిశ్చలమనస్కులై విఠ్ఠలనామమును భజించుచుండిరి. ఆ సమయమున జరిగిన యఖండనామావళి యాకసమువరకు వ్యాపించెను. మండపమునుండియును, గోడలనుండియును, రాళ్ళనుండియును, భూమి నుండియును, తాళములనుండియును, బతాకములనుండియును గూడ విఠ్ఠలనామము వెలువడుచుండెను. సురవరులాకాశమునుండి గౌతుకమును నేత్రోత్సవముగా జూచుచుండిరి. కథాస్థలమునగల జనులెల్లరును నద్వైత స్థితినొందిరి. వారలదృష్టికి గనబడునదంతయు విఠ్ఠలస్వరూపముగ నుండెను. తత్క్షణమే యాబాలుడు పునర్జీవియై నిద్రపోయి లేచునటుల లేచెను. ఎల్లరును విస్మిత మనస్కులైరి. శ్రోతలెల్లరును హరినామమునకు మించిన యమృతసంజీవిని లేదని దృఢముగ దెలిసికొనిరి.

అరువదియవ అధ్యాయము సమాప్తము.

బలభద్ర ప్రియానుజాయ నమః.



శివాజీమహారాజ్ తుకారామును శరణు పొందుట.

# తుకారామ్ జిజీబాయికి ధర్మోపదేశము జేయుట

♦— అరువదియొకటవ అధ్యాయము ♦—

జయ జయ కృపాసాగరా, రుక్మిణీవరా, నీవు సగుణరూపధారివై భక్తులకు గలుగు మహాసంకటములను స్వయముగ నివారింతువు. శ్యామలవర్ణుడవగు నీవు దివ్యపీతాంబరమును ధరించితివి; నీ హృదయస్థలమున రత్నఖచితమగు పసుపురంగుగల సువర్ణపతకమును ధరించుటచే శోభాయమానుడవుగనున్నావు. నీ కనక కిరీటప్రకాశమును జూచి చంద్రుడు లజ్జపడును; మకర కుండలములు కర్ణములకు శోభనిచ్చుచున్నవి. కంఠమున మోహనమాలయు, దానిమధ్య భాగమున కౌస్తుభమణియు, లలాటమున పసుపురంగుగల చందన తిలకమును, దేహమునకు చందనలేపనమును, జూచి భక్తులు తల్లీనులగుదురు. హస్తములకు నీర కంకణములును, శరీరముపై నాభరణములును, చరణములకు నూపురములును శోభించుచున్నవి. బ్రహ్మాదులకు దుర్లభములగు నీ చరణములు, ప్రపంచభ్రాంతులను త్యజించి నిన్నఖండముగ కీర్తనజేయు భక్తులకు లభించుచున్నవి. మానావమానములను, లౌకికస్థితిని, త్యజించి నిర్లజ్జతో నిన్ను సేవించువారు నీసన్నిధిని జేరుదురు; దురాశను త్యజించి సమత్వబుద్ధితో, స్వర్గసుఖములనాశింపక, సువర్ణమును గోమయమును సమానముగజూచువారు నీకు ప్రియులగుదురు. దేహభ్రాంతిని త్యజించి చతుర్విధముక్తులయం దిచ్ఛలేక నిరపేక్షతో నుండువారు నీసన్నిధిని జేరుదురు. నీభక్తులకు గష్టము గలిగిన సమయాసమయములను గ్రహింపక వారిని సర్వవిధముల రక్షించుచుందువు. వేదశాస్త్ర పురాణములందు కలియుగమున నీవు బౌద్ధావతారుడవై యున్నావని వర్ణింపబడియుండగా, నీవా వాక్యములను దిరస్కరించి సగుణస్వరూపుడ వగుచున్నావు. నీ వవతారముధరించు కాలము కాక పోయినను భక్తులు నిన్ను ప్రార్థింపవారలకు సాక్షాత్కార దర్శన మనుగ్రహించి వారి యిచ్ఛలను దీర

చున్నావు. ఓ పంఢరీనాథా! నీవు మందబుద్ధినగు నా వాక్కున బ్రవేశించి భక్తుల సచ్చరిత్రలను బలికించుట యాశ్చర్యముగనున్నది. బుద్ధిని ప్రకాశింపజేయు నీపై సర్వభారములను వైచితిని కాన గ్రంథరచనను బూర్తిగావింపజేయుము.

తుకారామేకాంతవాసము జేయనిచ్ఛతో భాండారా పర్వతమునకుబోయి యచట నొకవృక్షచ్ఛాయ నధివసించి దాంభిక, లౌకిక ప్రతిష్ఠను శ్వానవిష్ఠగాభావించి, మానసన్మానములను ద్యజించి యేకనిష్ఠతో హరినామ సంకీర్తనము జేయుచుండెను. ఎవరైనను తన్ను స్తుతించినచో నచటినుండి లేచిపోవుచుండెను. ఎవరైనను తన్ను నిందించినచో నచటకూర్చుండి శ్రవణము జేయుచుండెను. దినమంతయు భాండారా పర్వతముపై వసించుచు, నిశాసమయమునందు దేవాలయమునకువచ్చి కథాకాలక్షేపము జేయుచుండెను. ఈ విధముగా రెండు మాసముల పర్యంతము గృహమునకు బోనందున జిజీబాయి బంధువులతో "నాకర్మము బహువిపరీతముగ నున్నది. నాభర్త గృహమును విడచి పగలంతయు నేకాంత స్థలమున దిరుగుచు రాత్రి సమయములందు కథాకీర్తనలను జేయుటకై దేవాలయమునకు వచ్చుచున్నాడు. పనిపాటలు ద్యజించి నిర్లజ్జతో నాతడు నృత్యసంకీర్తనలను జేయుచుండ లోకులందరు నాతని "పిచ్చివాడని" యవమానముగ బలుకుచున్నారు. రెండుమాసములుగా బిడ్డలతో నేనొంటరిగా శ్రమపడుచు దుస్థితి యందున్నాను. ఆత డేసమయములందు గ్రామములో బ్రవేశించునో నాకు దెలియుటలేదు. మీకు గనబడినచో దయయుంచి యాతనికి నీతులు చెప్పి గృహమునకు వచ్చునటుల చేయుడు" అని చెప్పెను.

ఒకనాడు జిజీబాయి యింద్రాయణీ నదిలో బిందెతో జలమును దీసికొని వచ్చుచుండ తుకారాం స్నానముజేసి దేవాలయమునకు బోవుటగాంచి త్వరితగతి నాతనియొద్దకుబోయి యుత్తరీయమును బట్టుకొని క్రోధముతో "మీ తల్లిదండ్రులు సజీవులై యున్నంతవర కన్నవస్త్రాదులకు గొదువ జేయక సర్వవిధముల సౌఖ్యముగా జూచిరి. వారు

గళించిన పిదప లోకలజ్జను త్యజించి యహర్నిశములు హరినామ సంకీర్తన జేయుచు, ప్రపంచ వ్యవహారములను విడచి, నాకును బిడ్డలకును నన్న వస్త్రాదులు గల్పించు ప్రయత్నములు జేయక తిరిగినచో మా యోగ క్షేమములను విచారించు వారెవరు?" అని యడుగగా తుకారాం తన భార్యనుజూచి "నిన్నును, బిడ్డలను, నా జననీ జనకుల కొప్పగించితిని. సర్వవిధముల వారు మీ యోగక్షేమములు విచారించుచుందురు. చింతిల్లకు"మని చెప్పెను.

అంత జిజీబాయి "మీ జననీ జనకులు పరలోక గతులైయుండ వారలు నన్నెట్లు రక్షింతురు?" అని యడుగగా తుకారా మామెతో "శ్రీ విఠ్ఠలనాథుడు నా జనకుడు, విశ్వజననియగు శ్రీ రుక్మిణీదేవి నాజనని, ఘటమునందు ప్రతిబింబించిన సూర్యుడు ఘటము నశించినను నాతడు నశించనట్టుల సృష్టియంతయు నశించినను నా జననీ జనకులు నశింపరు. నీవు వారి చరణారవిందములను స్మరించినచో, నిస్సంశయముగ నీకును బిడ్డలకును నన్నవస్త్రాదులు వారే ప్రసాదింతు"రని చెప్పగా జిజీబాయి "ఓ ప్రాణేశ్వరా! ఇంటికి నడువుము. దుష్టులవలన విపరీతమగు నవమానముగ నున్నది. మీరు గృహముననుండి భగవద్భజన జేసికొన్నచో నాకును మీకును నపకీర్తి యుండదు. మీరు చెప్పినట్లే మీ జననీజనకుల చరణారవిందముల నేనఖండముగ స్మరించెద"నని చెప్పెను. అంత తుకారాం జిజీబాయితో "నాయాజ్ఞను పాలింతునని నీవు వాగ్దానముజేసినచో నేనింటికి వత్తు"నని చెప్పగా జిజీబాయి యట్లే వాగ్దానముజేసి యాతనిని గృహమునకు దీసికొనిపోయెను. గ్రామస్థులెల్లరు నాశ్చర్యముతో "జిజీబాయి భర్తను గృహమునకు దీసికొని వచ్చి తానును భక్తి మార్గమున బ్రవేశించినది. నాలుగు దినములు వైరాగ్యమును జూపి భర్తను సమాహిత చిత్తునిగా జేసి పిదప యథాస్థితిని బొందు"నని జెప్పుకొనుచుండిరి. గ్రామమున గొందరు దూషించుచు గొందరు భూషించుచు, కొందరుత్తముడనియు, మరికొందరధము




తుకారాం జిజీబాయికి ధర్మోపదేశము జేయుట.

డవియు, జెప్పుకొనుచుండెనను తుకారాం హర్షశోకములు లేక యఖండ ముగా (శ్రీ) విఠలనాథుని భజించుచుండెను.

ఒక యేకాదశినాడు తుకారాం తులసి బృందావనము ప్రక్కన గూర్చుండి, జిజీబాయిని బిలచి "నేడు హరిదినము. కాన నానందముతో హరికథాశ్రవణము జేయు" మని చెప్పి తంబురయును, చిరుతలును చేపట్టి పదునొకం డభంగముల నిట్లు గానముచేసెను. "ఎనుబదినాలుగులక్షల జీవరాసులలో మనుష్యజన్మ మిగుల శ్రేష్ఠమైనది. అది యొక్కొక్క జీవజాతియందు కోటిపర్యాయములు జనన మరణముల బొందినపిదప లభించినది. కేవలము పాపమొనరించినవారు నరకానుభవము నొందు దురు. పుణ్యమాచరించినవారు స్వర్గసౌఖ్యమును భోగింతురు. పాప పుణ్యములు రెండును మిశ్రమముగా జేసినవారీ కర్మభూమియందు మానవులై జన్మించి పాపపుణ్యములకు తగిన ఫలమనుభవింతురు. ఈశ్వ రుడు మానవులకు నూరుసంవత్సరము లాయువు ననుగ్రహించెను. అందు సగము కాలము నిద్రావస్థలో గడచిపోవుచున్నది. మిగిలిన సగములో నర్ధభాగము 'బాల్య వృద్ధాప్యము' లలో బోవుచున్నది. ఇక మిగిలిన యిరువదియైదు వర్షములలో నాల్గవభాగము నానావిధములగు వ్యాధుల యందును, దారపుత్రాది వియోగ దుఃఖములవలనను, ప్రపంచోప యోగకరమగు ధనార్జనమందును దరిగిపోవుచున్నది. నీటిపై నుద్భ వించు బుద్బుదమువలె నీజీవిత మెప్పుడు నశించునో తెలియదు. ధనము, సుతులు, గృహము, జననీ జనకులు, భార్య మొదలగునవన్నియు ప్రాపం చిక మాయాసంబంధములు. విషయాదుల నఖండము సేవించుచుండి నచో నమూల్యమగు జీవితము వ్యర్థముగా వ్యయమగును.

"జనన మరణ ప్రవాహమునుండి దాటి గమ్యస్థానము బొందు టకు గురుగూపుడగు భగవంతుని సేవింపవలయును. ఈ శరీరము త్రివిధము లుగ నశించును. భూస్థాపన జేసిన క్రిమి విష్ఠారూపముగ మారును. దహన సంస్కారము జేసిన భస్మమగును. ఇది దుఃఖనిలయము. ఇది రోగములతో నిండిన పర్వతమువంటిది. కాన నీవు దేహాభిమానమును

ద్యజింపుము. (ప్రథమమందు సజ్జనుల సేవజేసి వారికృపకు పాత్రురాల వైతివేని పిదప నీకు ధర్మాసక్తి కలుగును. ధర్మాసక్తి కలిగిన హరికథా శ్రవణమునందు ప్రవృత్తియు, తద్వారమున విమల జ్ఞానమును గలిగి యీశ్వరునియందు దృఢభక్తి కలుగును దృఢభక్తి యోగముచే సహజముగా భగవతత్వజ్ఞాన మలవడును. సజ్జన సాంగత్యమునందు మహాత్తరశక్తి యున్నది. చెట్టునుండి రాలిన పుష్ప సుగంధము మట్టికె సంప్రాప్తించును. కాని మట్టి దుర్వాసన పుష్పమున కంట నేరదు. అట్లే సత్సాంగత్యమువలనే ఖలునకు సాధుగుణము సంప్రాప్తించును. కాని సజ్జనులకు దుస్సాంగత్యమువలన దుస్స్వభావము మాత్రము గలుగనేరదు. కావ తప్పక సత్సాంగత్యము చేయుము. సత్పురుషుల లక్షణములను జెప్పెదను వినుము. (సాధు పురుషులు పృధ్వివంటివారు. ఉత్తములను ధరించి యధమములను ద్యజించు స్వభావము పృథ్వికి లేనట్లు, శ్రేష్ఠకనిష్ఠ స్వభావము సజ్జనులకుండదు. ప్రాణవాయువునకు రాజు దేహములో చలన వలనముల జేయుచు, దరిద్రుని దూరము జేయవలయునను భేదముండనట్లును, గోవునకు గలిగిన దప్పికను దీర్చు వ్యాఘ్రమునకు విషమై జంపవలయునను కోరిక జలమున కుండనట్లును, గృహములోని వారికి ప్రకాశమునిచ్చి యితరుల కంధకారము నొసంగవలయునను దలంపు దీపమున కెన్నడును గలుగనట్లును, గొడ్డలితో నరుకువానికిని, నీరుపోసి పెంచువానికిని, వృక్షము సమముగ నీడ నిచ్చునట్లును తన్ను పోషించు వానికి మధురముగను, గానుగలో వేయువానికి జేదుగను జెఱకుండనట్లును, సత్పురుషులు సర్వులందును భేదము లేక యుందురు. కాన వివేకముతో సంసారమునందు దాసవృత్తిగలిగి వర్తించుచుండుము. నీవిట్లొనర్చిన చో యిహలోకమున బ్రజలలో గౌరవమును బొందెదవు. పరలోకమున శాశ్వత సౌఖ్యములను బొందెదవు. ప్రాపంచికములగు నాశలను ద్యజించి ధైర్యముతో మనస్సును వజ్రమువలె కఠినముగా నొనర్చి తుచ్ఛములగు విషయసుఖములను ద్యజించి యత్యానంద సుఖమును బొందుము. ఇది యాచరించుట సర్వులకు సహజముగా దుర్లభము. సన

కాది మహర్షులెల్లరు నయ్యానందమునే నిరంతర మపేక్షింతురు. దాని వలన భవబంధములు తెగి యంత్యమున విష్ణులోకము లభించును. ఆసుఖము మనమిరువురము భోగించినచో విష్ణుదూతలు విమానము దీసికొనివచ్చి నిజధామమునకు దీసికొనిపోవుదురు. సంతులు, మహాంతులు, సిద్ధులు, కిన్నరులు, జయజయ శబ్దములను బలుకుచు మన కెదురుగవచ్చి స్వాగతమిత్తురు. నీకు యదార్థముగ నాసుఖమును భోగింపవలయునని కోరిక గలిగినచో నేవేవిధమగు శ్రమయునుబొందక నాశవంతమగు సర్వ సుఖములందు నిచ్ఛను త్యజించి పశ్చాత్తాప జలముచే సుస్నానము జేసి మహా పర్వకాలమగు రేపటి ద్వాదశి సోమవారమున గ్రామమునగల బ్రాహ్మణు లెల్లరిని బిలిపించి గృహమునగల సర్వస్వమును రేపటికి భుక్తి యెట్లుజరుగునను నాలోచన లేకయే త్యాగబుద్ధితో ధర్మము జేయుము. జననియు, జనకుడును, బంధుమిత్రాదులును, నాప్తులును, కుల గోత్రములును, ప్రాణమును శ్రీ పాండురంగడై యున్నాడు. ఆతడే సర్వసంకటములను దొలగించి సర్వవిధముల మనల రక్షించును. ఆతడు నాయొద్దనే యున్నాడు. నిన్నజ్ఞానంధకార మావరించుటచే నాతనిని గుర్తింపనైతివి. కాంతాకనకములను దమ ప్రాణములకంటె నతిప్రేమతో జనులు జూచుందురు. శ్రీ విఠ్ఠలనాథుడు హృదయమున సాక్షాత్కరించిన చో నవి పాషాణమునకంటె హీనముగ దోచి లౌకిక సుఖములందు విముఖత్వ మేర్పడును. ఆకలి దప్పులయందును, సజ్జనుల యందును, బంధువుల యందును, బట్టణములందును, వృక్షములందును, సమభావ మేర్పడును. సద్గురు కృపాకటాక్షముచే భగవంతుడు నావాక్కునుండి పలికించిన విషయములను నీవు శ్రద్ధతో శ్రవణము జేసితివి. నీ విట్లాచరించితివేని శ్రీ రుక్మిణీరమణుడు ప్రసన్నుడై మనల నిరువుర నంగీకరించును. నే నిప్పుడు నీకుపదేశించిన వాక్యములందు లక్ష్యముంచి గృహమంతయు శుభ్రపరచి, తులసి బృందావనమును శృంగారము చేసి యతిథులను

సద్భావనముతో బూజింపుము. త్రికరణ శుద్ధితో వైష్ణవుల కనన్యముగా దాస్యము చేయుము.

ఈ విధముగా భార్యకొఱ కనుమిషతో తుకారాం సాధకుల కొఱకై పై యభంగముల నుపదేశించెను. ఆ ప్రకారముగా నాచరించి నచో ననాయాసముగ భవపాశము తొలగి శాంతి సుఖము లభించును.

అరువది యొకటవ అధ్యాయము సమాప్తము.

యోగినాం పతయే నమః.



# జిజీబాయి తన
# సర్వస్వము దానము చేయుట

—♦ అరువదిరెండవ అధ్యాయము ♦—

హే కృపాసింధూ; 'జగజ్జేనీ!' నీవు కృపాదృష్టితో భక్తులను జూడగనే వారల భవపాశము తెగిపోవును. నీవు భక్తులయం దమిత వాత్సల్యము గలవాడవు. భక్తుల క్షేమ మాలోచించి సద్గుణవంతురాలగు స్త్రీ ననుగ్రహించినచో స్త్రీమోహమున దగుల్కొనునని గయ్యాళి యగు స్త్రీ ననుగ్రహించెదవు. సుపుత్రుల ననుగ్రహించినచో సంసార వ్యామోహమున దగుల్కొనెదరని శత్రుసములగు పుత్రుల ననుగ్రహించెదవు. ధనధాన్యాదులను బూర్ణముగ ననుగ్రహించిన. ధనేషణా మోహములో దగుల్కొనెదరని వారల కన్నవస్త్రాదులకు గొదువజేయుచుందువు. దుర్జనులకు భ్రాంతిని గలుగజేసి, వారివలన భక్తులను జలింపజేసి, నీవు స్వయముగ వారికి గలిగిన యరిష్టములను దొలగించి, భక్తుల చరిత్రములను జగద్విఖ్యాతముగ జేయుచుందువు. నీవు కృపాదృష్టితో జూచి వారిని మాయనుండి తొలగింతువు.

ఏకాదశినాడు జిజీబాయి తుకారాంతో గలిసి హరినామసంకీర్తనయు, జాగరణయుజేసి ద్వాదశిదినమున ప్రాతఃకాలమున నింద్రాయణీ నదిలో స్నానము జేసి యా గ్రామమున గల ద్విజులను, నతిథులను బిలిపించి క్షణికమగు వైరాగ్యముచే గృహమున గల పాత్రలను, వస్త్రములను, ద్రవ్యమును, భోజనపదార్థములను ధర్మముచేసెను. పిదప సంధ్యమున నొక సన్యాసి వచ్చి గృహములో బ్రవేశించి శోధించిచూడగా నేమియు గనబడనందున వంటయింట బ్రవేశించి పొయ్యిలోని బూడిదను దీసి సర్వాంగములకు బూసికొనుచుండెను. జనులెల్లరు నిది చూచి యాశ్చర్యచకితులై నవ్వుచు "సముద్ర మథనసమయమున బదునాలుగు రత్నములు బయలువెడలగా శంకరునకు హాలాహలము లభించిన ట్లి

దురదృష్టవంతునకు పొయ్యిలోని బూడిద లభించె” నని చెప్పుకొనుచుండిరి. తుకారాం మామూలు ప్రకారము దేవాలయములో శ్రీ విఠలనాథుని బూజించుచుండెను. కొంతసేపటికి ద్వాదశిపారణ కానందున క్షుద్బాధచే బిడ్డ లన్నముకావలెనని రోదనము జేయుచుండ నేమిచేయుటకును నాలోచన దోచక జిజీబాయి చింతాక్రాంతురాలయ్యెను. తుకారాం దేవాలయమునుండి గృహమునకు వచ్చుచుండగా జగజ్జననియగు శ్రీ రుక్మిణీదేవి తుకారాంను బరీక్షింపదలచి నీచ స్త్రీవేషమును ధరించి తుకారాంను జూచి “అయ్యా! నే ననాథను. తాము గృహమున గల సర్వస్వము దానము చేయుచుంటిరను కీర్తిని విని వచ్చితిని. నాకు ధరించుటకు మాఱువస్త్రము లేక యీ జీర్ణవస్త్రముతో గాలము గడుపుచుంటిని. నాకొక చీరనిచ్చి నాకోరిక దీర్పు” డని చెప్పెను. ఆ సమయమున జిజీబాయి తనచీర నారవేసికొని దొడ్డిలో స్నానము జేయుచుండెను.

తుకారాం అనాథస్త్రీ కోరిక దీర్చుటకై నిశ్శబ్దముగా గృహములో బ్రవేశించి యా చీరనువిప్పి తీసుకొనివచ్చి యా యనాథస్త్రీకిచ్చెను. ఇరుగుపొరుగు జనులెల్లరును నీ కౌతుకమును జూచి విస్మయచిత్తులై “వీరు విపరీతముగ బ్రవర్తించి సంసారమును మంటగలిపికొనిరని చెప్పుకొనుచుండిరి. ప్రక్కయింటిస్త్రీలు దొడ్డిలో స్నానము జేయుచున్న జిజీబాయి యొద్దకుబోయి ‘సఖీ! జిజియా, నీవారవేసిన చీరను నీభర్త యొక యనాథస్త్రీకి దానమిచ్చె”నని చెప్పగా జిజీబాయి క్రోధోద్విగ్న హృదయయై “నాప్రారబ్ధము విపరీతముగనున్నది. నలుగురిలో నాకు ప్రథమమునుండియు నపకీర్తి తప్పుటలేదు. రెండు మాసములనుండి నాభర్త గృహమునుద్యజించి భాండార పర్వతమున వసించుటచే వివిధజనులును జులకనగా జూచుచున్నారు. అందువలన నేను విన్నటి రోజున నాతనిని సమాధానపరచి గృహమునకు దీసికొని వచ్చితిని. రాత్రి ఏకాదశీ మహాపర్వదినము జాగరణమును మిషబెట్టి నానావిధములగు దృష్టాంత వచనములను బలుకుచు హరికథా కాలక్షేపమును

జేసెను. "నాజననీ జనకులకు శ్రీ విఠల రుక్మాబాయిలను ధ్యానము జేయుచుండినచో వారలే మనకన్నవస్త్రాదులు కల్పింతురని" చెప్పెను. ఆతని వచనములందలి విశ్వాసముతో నేను గృహమునందుగల ధన ధాన్యాదులను, పాత్రలను, వస్త్రములను, సర్వపరికరములను దానము జేసితిని. కట్టుకొనియున్న యొక వస్త్రముమాత్రము శుభ్రముగ నుదికి వాకిటనారవైచి స్నానము జేయుచుండగా నీచస్త్రీకి దానము చేసెను. నా ప్రారబ్ధమిట్లున్నది. నేను నానావిధముల శరీరకష్టము జేసి యుపాయముచే ధనమార్జించి బిడ్డలను పోషించుచుండ చివరకు ధరించుటకు వస్త్రమైనను లేని దుస్థితిని బొందవలసివచ్చినది. నే నెంతో ప్రమత్తతతో నుండినను సంత్యమున వ్యర్థముగా నాతని యుపదేశవాక్యములు విని దుస్థితినిబొందితిని. నేను రెంమూడుపర్యాయములు శ్రీ విఠ్ఠలనాధుని చరణారవిందములను స్మరించినంతమాత్రముచే దత్క్షణమే దారిద్ర్యము సంప్రాప్తించి తినుటకు తిండిలేక బిడ్డ లలమటించుచున్నారు. నావలెనే యూ కాలవన్నుని చరణధ్యానముచే నెందరో తమతమ సంసారములను నాశనము జేసికొనుచున్నారు. వేదశాస్త్ర పురాణాది గ్రంథములును, భక్తులును, యోగులును, సర్వులును నాతని చరణములు మహత్తరమైనవని వర్ణించుచున్నారు. అనర్థదాయకమగు నాతని చరణద్వయమును నలుగగొట్టినచో లోకమునకు "మేలు గలుగు" నని తలచి రాతిబండ నొకదానిని మస్తకముపై నుంచుకొని దేవాలయమునకు బోవుచు రుక్మిణీపతియొక్క చరణములను బ్రహ్మాదులు పూజింతురు. ఆ చరణములయం దమోఘ మహిమవిశేషమున్నదని నారదాది మహామును లెల్లరును వర్ణించిరి. నే నా చరణములను నలుగగొట్టెద" నని మార్గమున గనబడినవారెల్లరికిని జెప్పుచు మహాద్వారమున బ్రవేశించెను.

శ్రీ పంఢరీనాథుడు దేవాలయమున గజగజవణకుచుండెను. మత్స్యరూపమును ధరించి శంఖాసురుని సంహరించియు, కూర్మరూపుడై మంధరాచలమును మూపున ధరించియు, వరహావతారుడై హిరణ్యాక్షుని సంహరించి భూభారమును దగ్గించియు, స్తంభమున నరహరి రూప

ముగ ప్రకటనమై హిరణ్యకశిపుని సంహరించి ప్రహ్లాదునిగాచియు, దానాభిమానముతో నున్న బలిచక్రవర్తిని త్రివిక్రముడై పాతాళలోకమునకు ద్రొక్కియు, పరశురామావతారుడై రేణుకయుదరమున జన్మించి యవనిని క్షత్రియహీనముగ జేసియు సురవరులెల్లరను జయించిన దశకంఠుని సంహరించియు, దుష్టశిక్షణ శిష్టరక్షణ జేసిన భక్తభూషణుడు భయపడుచుండెను. కంసబాణాసురాది దైత్యులను స్వహస్తములతో సంహరించిన శ్రీకృష్ణనాథుడు జిజీబాయి పాదములు నలుగగొట్టునని భీతిల్లుచుండెను. శ్రీ పంఢరీనాథుని సర్వాంగములనుండి చెమట వెలువడుచుండగా రుక్మిణీదేవి విస్మితురాలై "ఓ దేవాదిదేవా! మీ మనమునం దేమి చింతయున్నది? ఎందుల కీవిధముగా వణకుచున్నారు? తెలుపు"డని యడుగగా భగవంతుడు శ్రీ రుక్మిణీదేవితో "నేడు నాకు మిగుల జింతకలుగుచున్నది. తుకారాం భార్య శిరముపై పాషాణము నొక దానిని ధరించి నా చరణములను నలుగగొట్టుటకై వచ్చుచున్నది. తప్పించుకొనుటకు నాకేమియునుపాయము తోచుటలే"దని చెప్పెను. అంత రుక్మిణీదేవి "కష్టమేమియు లేదు, మీ రిచటనుండి పలాయనమై జిజీబాయి గృహమున కేగిన పిదప మరలరండ"ని చెప్పెను. శ్రీ పంఢరీనాథుడు "ఓ రుక్మిణీ! నేను స్వతంత్రుడను కాను. భక్తుల కధీనుడనై యున్నాను. వారి యాజ్ఞప్రకారము వర్తింపవలసియుండును. బాలకుడు వస్త్రమును బట్టుకొని యుండగా, తండ్రి బలాత్కారముగ లాగుకొని పోవుటకు వీలుకానట్లు నేనిచ్చటనుండి పలాయనమగుటకు వీలులేదు. నా సగుణస్వరూపము కనబడనిచో తుకారాం ప్రాణములను విడచును. అతని మనోరథసిద్ధికై నేనిచ్చట నుండినచో జిజీబాయి తప్పక పాదములను నలుగగొట్టును. కాన నేమిచేయుటకును దోచకున్న"దని చెప్పెను.

జిజీబాయి క్రోధముతో దేవాలయమున ప్రవేశించుచుండగా తుకారాం చూచి "మస్తకముపై పాషాణమును ధరించి యెచ్చటికి బోవుచుంటి"వని యడుగగా "మీ తండ్రియగు శ్రీ రుక్మిణీకాంతుడు

నాకు ద్రోహముజేసెను. మీ యుపదేశానుసారము నాకును, బిడ్డలకును, అన్నవస్త్రాదులాతడు కల్పించునను నాశతో గృహమునగల సర్వస్వమును దానము జేసితిని. నేనా దేవుని చరణములను ముమ్మారు స్మరించిన మాత్రమున నీ దుస్థితి సంప్రాప్తించి బిడ్డలును, నేనును నాథులమైతిమి. ఇట్టిఘాతుక స్వభావముగల యీపాదారవిందముల నీ పాషాణముతో జితుకగొట్టెద"నని చెప్పగా తుకారాం చింతాక్రాంతమానసుడై యశ్రుధారలను విడచుచు "దీని కీవిపరీతపుబుద్ధి పుట్టినది. నమ్రవచనములతో సమాధానపరచుటకు పూర్ణముగ క్రోధస్వభావయై యున్నదని యాలోచించి జిజీబాయిని జూచి "ఆపాషాణముతో నా చరణములను నలుగగొట్టుము. దేవునకు మాత్ర మపచారము జేయవలదని చెప్పి వెనుకకు మరలెను. ఈ దృశ్యమును శ్రీవిఠ్ఠలనాథుడుజూచి చింతాక్రాంతమానసుడైయుండెను. శ్రీ రుక్మిణీదేవి విస్మితచిత్తురాలై వినోదముతో "ఓ దేవాదిదేవా! పంఢరీనాథా! ఇప్పుడే యాశ్రయము లభించినది? తెలుపు"మని యడుగగా దీనదయాళుడు "ఓ రుక్మిణీ! ఇంకొక యరిష్టము సంప్రాప్తించినది, తుకారామ్ భార్యను సమాధానపరుప దలచి పాషాణముతో దన చరణములను జితుక గొట్టుమని చెప్పెను. జిజీబాయి ద్వేషభక్తురాలు ఆమె చిత్తమున వివేక విచారణయే లేదు. అనాలోచితముగ తుకారామ్ చరణములనే నలుగ గొట్టినచో నాతని పాదముల కపాయముకలిగి కథాకీర్తనలకెట్లు నృత్యము జేయగలడని నాకు చింత యధికమైన"దని చెప్పెను.

అంత రుక్మిణీదేవి "ఓ స్వామీ! వ్యర్థముగా మీకు ఖిన్నులు కాకుడు. భాస్కరుడు ప్రసన్నమైనచో నంధకార ముండనట్లును, క్షీరసాగరమున నివాసము లభించినచో క్షుద్బాధ యుండనట్లును, నమృతము దొరకినచో రోగము బాధింపనట్లును, మీ నామమును తుకారామ్ సదాకీర్తించుచుండ నాతనికి భయములే"దని చెప్పి జగన్మాత గర్భాలయమున ప్రవేశించుచున్న జిజీబాయి కడ్డముగాబోయి, జిజీబాయి వెలుపలకు బోవుటకు వీలులేకుండ దలుపులను బిగించెను. జిజీ

బాయి సంతప్త చిత్తురాలై యున్నందున నా పాషాణముతో తుకా రామ్ పాదములను, నలుగ గొట్టకుండ (ప్రమాదమును రక్షింపదలచి బాలకు డగ్నిని బట్టుకొనబోదలచిన నాతని దల్లి రక్షించునట్లు, తుకా రామ్‌ను వెలుపలవిడచి జగన్మాత తలుపులను బంధించెను.)

జగన్మాత తలుపులను బంధించుటవలన తనభార్య ననుగ్రహించి తన్నుపేక్షించెనని తలచి, "నేను దేవాలయమున నుండినచో నఖండ ముగా సంకీర్తన జేయుచుండిన నిద్రించుటకు వీలులేదని తలుపులు బంధిం చితివా? లేక నీ చరణములను నలుగకొట్టుటకై పాషాణము దెచ్చు చున్ననాభార్యయొద్దనుండి నిర్బంధముగా పాషాణమును లాగుకొన లేదను కోపముతో దలుపులను బంధించితివా? నాభక్తికంటె జిజీబాయిభక్తియే నీ కంగీకారయోగ్యమైనదా? నన్నేల వెలుపల విడచి తలుపులు బంధిం చితి" వని రోదనము జేయుచుండెను. జిజీబాయి యాలయములో భగవం తుని చరణములను నలుగగొట్టుటకు సంసిద్ధురాలుకాగా జగన్మాత యడ్డుపడి "భగవంతు డేమియపచార మొనర్చెనని యాతని చరణము లను నలుగగొట్టదలచితివి. సందేహింపక వృత్తాంతమంతయు దెలుపు" మనెను. అంత జిజీబాయి "ఓ జగజ్జననీ! నే జెప్పు విషయము సావ ధానముగ వినుము. నీభర్తచరణములను మున్మారు స్మరించినంత మాత్రముచే నా సంసారమంతయు నీట గలిసినది. బిడ్డలాకలని విల పించుచున్నారు. లోకుల కపకారము గలుగజేయుచున్న యా చరణ ముల నలుగగొట్టదలచి వచ్చితి" నని చెప్పగా శ్రీ రుక్మిణీదేవి "ఓ జిజియా! నీ వేమియు దుఃఖింపకుము. నీకు వలయు వస్త్రాభరణములను ధనమును నిత్తు" నని చెప్పి బంగారునాణెములను, వస్త్రములను, నాభ రణములను నిచ్చెను. జిజీబాయి సమాహితచిత్తురాలై పాషాణము నచట బారవైచి జగన్మాత యొసంగిన చీరను ధరించి యామెకు సాష్టాంగనమస్కారము జేసి యచటినుండి గృహమునకు బోయెను.

అరువదిరెండవ అధ్యాయము సమాప్తము.

ధేనుకాసుర భంజనాయ నమః.

# తుకారామ్ విఘ్నేశ్వరుని భోజనమునకు రప్పించుట

—♦ అరువదిమూడవ అధ్యాయము ♦—

జయజయ కృపాసాగరా, చక్రపాణీ, భవభంజనా, సాయుజ్య ప్రదాయకా, కృపాదృష్టితో జూచి నన్ను గర్భపాశమునుండి దొలగింపుము. ఆశాపాశములను త్యజించి నిరపేక్షతో నుదాసీనవృత్తి నవలంబించి నిరంతరము నీభజన జేయుటకు ప్రేమ ననుగ్రహింపుము. నిరంతరము నా దేహమునందు వసించుచున్న యరిషడ్వర్గములను దొలగించి శుద్ధాంతఃకరణునిగా జేయుము. మహావిఘ్నములగు మానాభిమానములనెడి లౌకికప్రతిష్ఠలందు దగుల్కొనియున్న నా మనస్సును దొలగించి నీ చింతనజేయుట కాసక్తి ననుగ్రహింపుము. లోకాచారము ననుసరించి యవగుణములతో గూడియున్న పతితుడనగు నన్నభిమానముతో నుద్ధరింపుము. సర్వకాలములయందు చంచలరూపమున నున్న నా మనస్సు నీ చరణారవిందములందు స్థిరముగా నుండున ట్లనుగ్రహింపుము. ఓ పాండురంగా! హస్తములతో నిన్నర్చించి, షోడశోపచార విధుల బూజించుటయు, చరాచరాత్మకమగు సర్వప్రపంచమును, వికల్ప ద్వేషభావములు లేక నీరూపముగ జూచుటయు, నీ యాత్రాక్షేత్రములకు నడచుటయు, కథాకీర్తనలందు దేహాభిమానమును విడచి నిర్లజ్జతో నృత్యముజేయుటయు, నీ నిజభక్తుల మహిమవిశేషములను వర్ణించుటయు నను నీ భాగ్యవిశేషములు నాకు లభించున ట్లనుగ్రహింపుము.

జిజీబాయి శ్రీ రుక్మిణీదేవి యొసంగిన వస్త్రాభరణాదులను ధరించి గృహమునకు బోవుచుండ తుకారా మామెనుజూచి "నీవు పరమార్థహితమును నాశనముజేసితివి. పొలములో ఫలసాయమునకు రాని వరి కోసిన నిరుపయోగమైనట్లు నీవు జగన్మాతవలన తుచ్ఛమగు సిరిని బొందుటచే శాశ్వతసౌఖ్య మంతరించుచున్నది. కాన వివేకవంతమగు

చిత్తముతో వస్త్రాభరణాదులను, ద్రవ్యమును ద్విజులకు దానముజేయు" మని చెప్పగా జిజీబాయి సమాహితచిత్తురాలై తత్క్షణమే విప్రులను బిలిపించి వస్త్రాభరణాదులను, ధనమును విప్రులకు దానముజేసి, లోభ మును, మమతయును త్యజించి శ్రీ పంఢరీనాథుని ధ్యానించుచుండెను.

తుకారామ్‌కీర్తి దేశమంతయు వ్యాపించి ప్రజలెల్లరు నాతడవ తారమూర్తియనియు శ్రీ రుక్మిణీకాంతు డాతని పంక్తిని గూర్చుండి భుజించుచుండుననియు బరస్పరముగా జెప్పుకొనుచుండిరి. ఈ వృత్తాం తము 'చించవడీ' గ్రామముననున్న 'భగవాన్ శాస్త్రి' యను బ్రాహ్మ ణునకు దెలిసి "తుకారామ్ జాతియందు శూద్రుడు. భగవంతు డాత నితో నెట్లుభుజించును. నేను పూజనీయుడనగు బ్రాహ్మణుడను. వేద శాస్త్ర సంపన్నుడనై గణపతి నుపాసించుచు నాతని బ్రసన్నునిగా జేసి కొంటిని. ప్రజలు పలుకుచున్న యఘటితవార్త లెంతవరకు సత్యమో పరీక్షింపవలయును. తుకారామ్ నిచటకు రప్పించి దృష్టాంతము జూడ వలయు"నని తలచెను. ఈ విషయము తుకారామ్ తెలిసికొని "చించ వడీ గ్రామమునగల విప్రోత్తముడు స్మరించెను. కాన తత్క్షణమేపోయి యాతనిని దర్శింపవలె'నని తలచి యచ్చటనుండి బయలుదేరి చించవడీ గ్రామమును జేరెను. తుకారామ్ భగవాన్ శాస్త్రి గృహమున బ్రవే శించునప్పటికి మధ్యాహ్న కాలమైనందున నా విప్రోత్తముడు భుజించు టకు సంసిద్ధుడగుచు తుకారామ్ వచ్చెనను వార్తవిని తన మనంబునందు గలయిచ్చ యయాచితముగ బూర్తియైనదని యాలోచించి గౌరవ పూర్వకముగా గృహములోనికి దీసికొనిపోయి భోజనమున కేర్పాటు చేసెను.

తుకారామా విప్రోత్తమునితో "అయ్యా! నావెంట శ్రీపంఢరీ నాథుడునుభుజించును. కాన ప్రక్క నింకొక విస్తరివేసి యందును పదా ర్థములు వడ్డింపుడు. మీరును భోజనమునకు గూర్చుండి మీ ప్రక్క నింకొక విస్తరియందు పదార్థములను వడింపించి గజవదనుని బ్రార్థించి




తుకారామ్ చించవడి గ్రామమున

భగవాన్ శాస్త్రి గృహమునకు బోవుట.

యాహ్వానము జేయుడు.' మన నలుగుర మానందముతో భుజింత''
మని చెప్పగా నా విప్రోత్తము డాశ్చర్యచిత్తుడై మనమంత్రమే మనకు
ఫలించినదని యానందించి తుకారామ్ కోరినట్లుగా నాలుగు విస్తళ్లలో
పదార్థము లన్నియు వడ్డించిన పిదప నా విప్రోత్తముడు నానావిధముల
విఘ్నేశ్వరుని స్తుతించుచున్నను నాతడు రానందున "సద్భక్తిలేనిది
శాస్త్రయుక్తివలన భగవద్దర్శనము కాదని'', తలచి బాహ్యమునకు
బూజచేయుచు నాంతర్యమున వికల్పముతోనుండిన నేదైవమైనను దర్శన
మీయడని నిశ్చయించి "గజేంద్రునికి వైకుంఠపతి దర్శనమిచ్చెను? ఆతడే
శాస్త్రముల నభ్యసించెను? గోపికలు సప్రేమభక్తివలన భగవంతుని
కృపకు పాత్రులైరి. విధియుక్తముగా గర్మ మాయానుసారము యజ్ఞ
యాగాదుల జేసినవారలకు శ్రీకృష్ణప్రాప్తి యంతరించెను. ఋషిపత్నులు
భోజనము దీసికొనిపోవ జగజ్జీవను డానందముతో భుజించెను. భావుకు
లగు ప్రేమభక్తులకు భగవంతుడు స్వాధీనుడై యుండును. బహువిధ
ముల యోచించియు సార్థకములే''దని నిశ్చయించి తుకారామ్‌ను జూచి
"శిలావిగ్రహముగనున్న విఘ్నేశ్వరుడు పదార్థము లెట్లు భుజించును.
నైవేద్యము నాతని కర్పింప నందలి సువాసన మాత్రము గ్రహించు''నని
చెప్పెను. అంత తుకారామ్ విప్రుసిజూచి విఘ్నహరు డిచ్చట లేడు.
సముద్రమున నొకభక్తుడు స్నానము జేయుటకై బోయి యందుపడి
మునిగి పోవుచుండ నాతడు గజాననుని స్తవముజేయ నాభక్తుని రక్షిం
చుటకై యాతడచ్చటికి పోయెను. కాన నొకక్షణకాలమాగి పిదప
ప్రార్థన జేయు''డని చెప్పగా విప్రోత్తము డాశ్చర్యము నొందెను.

విప్రుడొక క్షణము మౌనముగనుండి సింహాసనముపైనున్న
విఘ్నేశ్వరుని పీతాంబరములు తడిసియుండి జలము కారుచుండుటజూచి
యత్యాశ్చర్యముతో సింహాసనముపై కారియున్న జలమును నోటవేసి
కొని పరీక్షింపగా క్షారమైన సముద్రజలముగా నుండెను. విప్రుడాశ్చర్య
చిత్తుడై "విఘ్నేశ్వరుని పీతాంబరములు తడిసి యుండుటకును, నాజ
లము క్షారముగా నుండుటకును, కారణ మే''మని తుకారామ్ నడు

గగా తుకారామ్ భగవాన్ శాస్త్రినిజూచి "గజవదనుడు సముద్రమున నున్న భక్తునిరక్షించి యిప్పుడే వచ్చెను. కాన మీరాతనిని ప్రార్థింపు డని" చెప్పగా నా విప్రోత్తముడు విష్ణుభక్తులమహిమ యద్భుతమైనదని భావించి తుకారామ్‌నుజూచి, "ఓ వైష్ణవవీరా! పార్వతీసుతుడు సముద్రమునకు పోయెనని నీకెట్లు తెలిసెను? నీవు రుక్మిణీకాంతు నుపాసించువాడివయ్యును గజవదనుని వృత్తాంతమంతయు నెట్లు దెలిసికొంటివి"వని యడిగెను. "సూర్యభగవానుడు ప్రసన్నుడైనచో కనబడని వస్తువుండ నట్లును, కల్పవృక్షము నాశ్రయించినవారికి కోరికలు నెరవేరుట కభ్యంతర ముండనట్లును, క్షీరసాగరమున వసించువాని కాకలిదప్పులు భాధింప నట్లును, నమృతము లభించినవాని కౌషధసేవతో బనిలేనట్లును, చంద్రుని విలోకించినచో నక్షత్రము లన్నియు గనబడునట్లును, శ్రీ పంఢరీనాధుని కృపకు బాత్రుడైనవానికి సకలదేవతలు వశ్యులగుదు"రని తుకారామ్ చెప్పెను.

తుకారాం విప్రునిజూచి "అయ్యా! శ్రీ పంఢరీనాధుడు భోజనమునకు వచ్చియున్నాడు. మీరు గజాననుని ప్రార్థించి భోజనమునకు రప్పింపు"డని చెప్పగా నాతడు కొంతసేపు ధ్యానమవలంబించి పిదప "శ్రీ పంఢరీనాథుని ప్రార్థించి రప్పించినట్లు మీరే విఘ్నేశ్వరునిగూడ రప్పింపు"డని చెప్పెను. అవశ్యమని తుకారాం చేతులుజోడించి "జయ జయ లంబోదరా! సకల విద్యాసాగరా! నీవు తాండవమాడుచుండ నుమాతనుడు హర్షించుచుండును. నీవు కృపాదృష్టితో జూచిన విఘ్నములన్నియు దత్‌క్షణమే తొలగును. నిన్నుపాసించినవో భవబంధవిముక్తి యగును. నీవు దయతో దర్శనమిచ్చి ప్రేమతో నైవేద్యమును భుజించి నాకోరిక దీర్చు"మని ప్రార్థింపగా తత్‌క్షణమే గజవదనుడు సాక్షాత్కరించి భుజించుచుండెను.

శ్రీ రుక్మిణీవరుడును, గజాననుడును, తుకారామ్ భక్తికి వశులై సాక్షాత్కరించి భుజించుచుండిరి. కాని యెవ్వరికి రూపములు గనబడక వడ్డింపబడిన పదార్థములు మాత్రము తరుగుటజూచి యెల్లరును నాశ-

ర్యచకితులైరి. గణేశోపాసకుడగు నా విప్రుడు "నేను బహుకాలము
నుండి యుపాసించుచున్నను లంబోదరుడెన్నడును దర్శన మిచ్చుటగాని,
నైవేద్యమును భుజించుటగాని చేసియుండలేదు. సాధకులకు దుర్లభుడగు
శ్రీ పండరీనాథుడు తుకారామ్‌నకు స్వాధీనుడై యద్భుతమగు లీలలను
జూపుచున్నాడు. క్షీరసముద్రము స్వాధీనమైనచో సముద్రము స్వాధీన
మగుట గొప్పకానట్లు శ్రీ రుక్మిణీరమణుడు కృపాదృష్టితో జూచిన
సర్వదేవతలు సంతుష్టిజెందుదురు. కామధేనువు గృహమునకు వచ్చిన
తదితర గోవులు సహజముగ వచ్చునట్లును చంద్ర దర్శనమైనచో సహ
జముగ నక్షత్రములు కనబడునట్లును, వజ్రాసనమందు గూర్చుండి
యున్న యోగీశ్వరులకు భక్తులకు దుర్లభుడగు భగవంతుడు సగుణ
స్వరూపముతో దర్శనమిచ్చి వారల సంకటములను నివారించుచుండును.
బ్రహ్మాదులకు దుర్లభుడగు శ్రీ రుక్మిణీనాథుని తుకారామ్ స్వాధీనము
జేసికొనె"నని పరిపరివిధముల స్తుతించుచుండెను. పిదప కరశుద్ధిజేసికొని
విప్రోత్తముడు తుకారామ్‌నకు తాంబూలమర్పించి యారాత్రి కథా
కాలక్షేప మేర్పాటుచేసెను.

తుకారామ్ చించీవడీ గ్రామమున హరినామ సంకీర్తనజేసి భగ
వాన్ శాస్త్రికి నమస్కారముజేసి యాతనియొద్ద ననుజ్ఞదీసికొని స్వస్థాన
మునకు బయలుదేరెను. తుకారామ్ గ్రామసమీపము జేరువరకు నొక
రైతాకస్మికముగ నాతనిని జూచి సాష్టాంగనమస్కారముజేసి చేతులు
జోడించి "నాపొలములోనుండి గ్రామములో బ్రవేశించుటకు మార్గ
మున్నది రమ్మ"ని కోరగా నాతని సద్భావమును జూచి తుకా
రామ్ పొలములో బ్రవేశించి యా రైతుకోరిక ననుసరించి చెఱకు
గడ నొకదానిని దినెను. ఆమాధుర్య మాతనికి రుచింపదయ్యెను. బ్రహ్మా
రసమును సేవించువాని కితరరసములు రుచింపనట్లును, సూర్యప్రకాశ
మును గోరువానికి దీపప్రకాశము తుచ్ఛముగ గనబడునట్లును, సిద్ధాంత
జ్ఞానమందు మగ్నమైయున్నవానికి పాఖండజ్ఞానమునందు విముఖత్వము
గలుగునట్లును, నామామృతమును సేవించువాని కన్యపదార్థము లప్రియ

ముగులైయుండెను. పిదప నా స్త్రీ తన చెఱకుగడల కట్ట నొకదానినిచ్చి "గృహమునకు గొనిపోయి బిడ్డలకిమ్ము" అని ప్రార్థించెను. ప్రేమతో నతడిచ్చిన చెఱకుగడల కట్టను భుజముపై వేసికొని యచటనుండి బయలుదేరి పోవుచుండగా నా గ్రామములోని పిల్లలు తమకొక చెఱకుగడనిమ్మని యడుగుచుండిరి. తుకారాం ముక్కొక్కరి కొక్కొక్కటి యొసంగెను. ఆతని దృష్టియందు స్వపర వృత్తి భేదభావనము లేదు. దీపము రాజునకును, దొంగకును సమానముగా ప్రకాశమిచ్చునట్లును, సూర్యుడు ధనికునకును, దరిద్రునకు తేజము సమముగా నిచ్చునట్లును, చీమయు, ఏనుగును భూమికి సమానమైయుండునట్లును, చెఱకుగడల నింటికి గొనిపోయి బిడ్డలకిమ్మని యీతనికి చెప్పిన విషయము ధ్యానమునందుండ కొనక సర్వభూతములయందును సమముగు భావముగల నాథస్తుడొక చెఱకుగడతో నిల్లుచేరెను.

తుకారామ్ చెఱకుగడలను గ్రామమునందు అడిగిన పిల్లలం దరి కిచ్చుటను దూరమునుండి చూచి జిజీబాయి క్రోధముతో "అడిగిన పిల్ల లందరికిని జెఱకులను బంచితివి. వారు నీ తాతకు చుట్టములా? నీకు చుట్టములా? ఇంట బిడ్డలు తినుటకు లేక ఆకలితో నున్నా" రని క్రోధముతో బలుకుచు నా చెఱకుగడను లాగికొని యాతని వీపుపై గొట్టగా నది రెండుతునకలై యొకటి భూమిపైబడి రెండవ దామె చేతిలోనుం డెను. తుకారామ శాంతచిత్తుడై తన భార్యతో "నీభాగము నీచేతి యందే యున్నది. భూమిపైబడిన భాగమును నేనును, బిడ్డలును బంచు కొనెద" మని చెప్పగా నాతని శాంతమునకు జిజీబాయి యత్యాశ్చ ర్యమునుగొంది "ప్రపంచభ్రాంతిని త్యజించి మాయామోహములను, మానావమానములను విడచి నిర్లజ్జతో నున్న యీతని నేమనినను సార్థ కములే" దని తలచి మౌనముగనుండెను. ఆ సమయమున జిజీబాయి యొద్ద తుకారామ్ చూపిన శాంతమును వర్ణించుటకు యోగ్యమగు దృష్టాంతమేదియు గనబడుట లేదు. గృహస్థాశ్రమమున నీ భక్తుడు మానావమానములను సమానముగ భావించియుండ భార్య కొట్టినదని

యణుమాత్రమైనను క్రోధము లేకుండెను. క్షీరసాగరమునకు సముద్రము నుపమానముగ వర్ణించుట యోగ్యముకానట్లును సాయుజ్యమునకు సామ్యముగ సాలోక్యసామీప్యములను వర్ణించు టుచితము కానట్లును, తుకారామ్‌నకు దుల్యునిగా నితరభక్తుని వర్ణించు టనుచితము.

కలియుగమునందు సహజముగా వైకుంఠమును భూలోకమున ధ్వజసమేతముగా ప్రతిష్ఠించిన వైష్ణవుడును, జగద్గురుడను, నామదేవుల పూర్ణావతారుడును నైయుండుటచే నాతనిని గొప్పవాడని వర్ణించుటకు మాత్రమే సాధ్యమగునుగాని సముద్రముయొక్క గాంభీర్యమును వర్ణించుట కుపమాన మింకొకటి కనబడనట్లును, సూర్యుని తేజము వర్ణించుటకు తత్సమమగు నింకొక ప్రకాశము లభింపనట్లును, చంద్రుని చల్లదనమును వర్ణించుట కట్టి శీతలవస్తువు పృథ్వియందు దొరకనట్లును, పృథ్వియొక్క క్షమను వర్ణించుట కుపమానమే లేనట్లును; వివేక శాంతిభూషణములు తుకారాముని యంగముపై నక్షయముగ ధరింపబడియుండెను. ఆతను మానసిక, వాచిక, కాయిక, తపస్సులను జేసెను. ప్రాణాంతము వచ్చినను నసత్యము బలికి యెరుగడు. ఇది సునిశ్చితముగా వాచిక తపస్సైయున్నది. విషమభావనలేక సర్వ భూతములను సమదృష్టితో జూచుట మానసిక తపస్సైయున్నది. పరోపకారము జేయుట శారీరక తపస్సైయున్నది. ఆతడీ త్రివిధములగు తపస్సుల ననుష్ఠించుచుండెను.

అరువది మూడవ అధ్యాయము సమాప్తము.

సచ్చిదానంద విగ్రహాయ నమః.



# తుకారామ్ శ్రీ విఠ్ఠలనాధునకు వినతిపత్రము బంపుట

—♦ అరువది నాల్గవ అధ్యాయము ♦—

జయజయ దీనదయాళో, హృషీకేశా, భక్తహృదయ నివాసీ, రుక్మిణీకాంతా, పంఢరీశా, సర్వేశా, జగద్గురో, లీలానాటక సూత్రధారీ, గుణనిధీ, యాదవరాయా, సముద్రతనయ నీ చరణారవిందములను స్మరించి తల్లీనురాలగుచున్నది. చరాచరనివాసా, అంతస్సాక్షీ, ఆదిపురుషా, సద్గుణవేషా, పుండలీకవరదా, పరేశా, అవినాశా, ఆత్మరూపా, కరుణాసాగరా, వైకుంఠపతీ, విరాట్స్వరూపా, వామనమూర్తీ, నీవు పరశువును ధరించి పృధ్విని యిరువదిఒక్క పర్యాయములు నిర్వీర్యముగ జేసితివి; అసురదమనా, ధర్మస్థాపకా, త్రైలోక్యపతే, విధిజనకా నీవు తప్ప భక్తులకు సఖులెవ్వరును లేరు. నిన్ను స్తుతించుటకు నాబుద్ధి కఖండస్ఫూర్తి లేదు. అనుతాపముతో దీర్ఘాటన జేయుటకు శరీరమునందు జవసత్వము లుడిగినవి. సత్పాత్రనుజూచి దానధర్మముల జేయుటకు ద్రవ్యము లేదు. విధియుక్తముగ వ్రతముల నాచరించుటకు క్షుధవలన ప్రాణము వ్యాకులమగుచున్నది. సర్వభూతములకు వందనము జేయుటకాంతర్యమున గుణదోషములు బయల్వెడలుచున్నవి. శాస్త్రాదులన్నియు పఠించుట కాయువుచాలదు. అనుతాపముతో ప్రపంచ భ్రాంతిని త్యజించుటకు వైరాగ్య మలవడుట లేదు. ఏకాంతముగ ధ్యానము జేయుటకు నామనస్సు చంచలమైయున్నది. ఇంద్రియ దమనము జేయుటకు జిహ్వానిరాకరించుచున్నది. నేనిట్టి యవగుణాంకితుడనై యున్నాను. నాయాంతర్యము నీవెరుంగుదువు. హే రుక్మిణీపతీ! నేను నిన్ను త్రికరణశుద్ధితో ప్రార్థించున దేమనగా నీకు ప్రియులగు నిజభక్తుల సచ్చరిత్రలను వర్ణించుటకు నాకు సప్రేమస్ఫూర్తి ననుగ్రహింపుము. నాకిదితప్ప వేరొండు యిచ్ఛలేదు. నామనో రథమును బూర్తిచేయుము.

తుకారాం నియమముతో నాషాఢ కార్తీకైదశీ బ్రహ్మోత్సవములను సేవించుటకై పంఢరీపురమున కేడు దినములునడచివెళ్ళి యుత్సవ

మును సేవించివచ్చుచుండెను. ఇట్లు బహుకాలము జరిగినపిదప నొక పర్యాయము శీతలజ్వరముచే భాధపడుచు శక్తిహీనుడై నడచుటకు గూడ శక్తిలేక "ఆషాఢైకాదశీ బ్రహ్మోత్సవముల దర్శించుటకు విఘ్నము కలిగినది. నేనే దోషముజేసితినో! నానియమమున కాటంకము వచ్చిన" దని చింతించుచు నియమముతో దనతో యాత్రజేయుచున్న భజనపరులగు భక్తులు తనగృహమునకురాగా వారినిజూచి మిగుల ఖేదమును బొంది "అయ్యా! నేనే పాప మొనర్చితినో! నాకీసంవత్సరము యాత్ర సేవించు భాగ్యము లభింప" లేదని చెప్పి యీ క్రిందియర్థము నిచ్చు నట్లుగా నిరువది యభంగములను వ్రాసి యావినతి పత్రమును శ్రీపంఢరీనాథున కిండని చెప్పి యాత్రికుల చేతికిచ్చెను.

"ఓ దేవాదిదేవా! రుక్మిణీపతీ! నిన్ను వర్ణించుటకు నాకశక్యము. పామరుడనగు నేను ధైర్యమవలంబించి ప్రేమతో వ్రాయుచుంటిని. నీ మహిమవిశేషములను వర్ణించుటకు శ్రుతిశాస్త్రములకు సాధ్యము కానప్పు డల్పమతినగు నేనెట్లు వర్ణింపగలను. అట్టివాడనై నేను వర్ణించిన యీ వినతి పత్రము నంగీకరింపుము. నీవు సకలదేవతలలో శ్రేష్ఠుడవు. గోపికాపతివని త్రిభువనములందు విఖ్యాతి వహించితివి. ఓ హృషీకేశా! నీ నామస్మరణ మాత్రముచే పాతకములెల్ల నశించి, కర్మ సహజముగ దగ్ధమై దారిద్ర్యము కనబడకుండ పోవును. ఓ విఠోబాదేవా! నీ చరణారవిందములలో సర్వసుఖములు నిండియున్నవి. అణిమాద్యష్టసిద్ధులును, చతుర్విధముక్తులును, నీ సాన్నిధ్యమున వసించుచున్నవి. ఇంద్రాదులకు దుర్లభమగు నక్షయపదము ప్రేమతో నిన్ను భజించు భక్తులకు లభించుచున్నది. విశ్వము జడమైయుండి విశ్వమునకు జీవనము నీవై యుండగా నా సంచితము ననుసరించి నీ సాన్నిధ్యమునకు రప్పింపకయుంటివి. నీకు వర్తమానమును బంపలేదని నాపై యుపకృపతో గూడి నన్ను దూరముజేయుచుంటివి. ఓ గోవిందా! నీకు పనులధికముగా నుండుటచే నన్ను మరచితివా? నీ చరణారవిందముల నొకపర్యాయము చూపుము. నాకు దర్శనమిచ్చినచో నేనేదైన గోరెదనని భయపడు

చుంటివా? ఓ విఠ్ఠలా! మరి నన్నేల దూరము చేసితివి? జననీజనకులు బిడ్డల నుపేక్షించిన వారల కష్టసుఖము లెవరికి జెప్పుకొందురు. ఓ పాండు రంగా! నా దుస్థితిని నే నెవరికి దెలుపుకొందును. నే నెవరి రాకకై నిరీక్షిం పవలెను? నా మనోగత మెవ రెరుగుదురు? నీవు తప్ప సఖు లెవరున్నారు? ఓ పంఢరీనివాసా! నాయందే దయవిసీతిసి జూచి నిర్దయుడ నుంటివి? నా నేత్రముల కొక పర్యాయము దర్శనమిమ్ము. అహర్నిశములందును నీనామము నుచ్చరించు నేను నీ కేమియు భారము గలుగజేయను. ఓ విఠ్ఠలా! హృదయస్థుడవగు నీకీ విషయము తెలియును బిడ్డలు బాల్య స్వభావముచే నహర్నిశములందును జననీజనకులను విడువకుందురు: నీ బిడ్డడనగు నేను నీ దర్శన వియోగముచే తబ్బిబ్బగుచున్నాను. నీవు చాల బిడ్డలను గనినవాడవు. నేను నీకొ బోరాడెదనని నన్ను దూరము చేసితివా? ఓ జగజేకి! ఇంత సామర్థ్యముగల నీకు నేను బిడ్డడనై యప కీర్తిని దెచ్చితిని. నాయందు నీకు దయ లేశమైనను లేకున్నది. నీ దర్శన మునకై నాచిత్త ముద్విగ్నమగుచున్నది. ఒకనిమేషమైనను ధైర్య మవ లంబింప నసాధ్యముగనున్నది. నామతి స్థిరముగ లేదు. ఓ పాండురంగా! నా దుస్థితి నీకు దెలిసియే యున్నది. నీవు శరణాగతుల నుపేక్షించితివని నే నెచ్చటను వినియుండలేదు. నా నేత్రము లేమి పాతక మొనర్చెనవో! నీ దివ్యమంగళ విగ్రహమును దర్శించు భాగ్యము లభించలేదు. ఈ చర ణము లేమి దుష్కర్మ నాచరించినవో! నీ క్షేత్రమునకు నడచివచ్చు యోగము లభింపలేదు. ఈ మస్తక మెంత దారుణ కర్మ గావించెనో! నీచర ణారవిందములపైబడు యోగ మబ్బలేదు. ఈ హస్తము లేమి పాపకార్య ము లొనర్చెనో! నీ నామమును వర్ణించుభాగ్యము లభింపలేదు. ఈ కర్ణము లేమి పాప మొనర్చెననో! నీ కథాకీర్తనల శ్రవణము జేయ నోచు కొనలేదు. ఈ యింద్రియము లెంత పాతకము జేసిననో! నిన్ను స్పృశించి పవిత్రములు కాలేదు. ఓ దేవాధిదేవా, కృపాసాగరా! నిన్ను నిష్ఠురము లాడి ప్రయోజనము లేదు. నా కర్మ విపరీతముగనున్నది. నీ మహాద్వా రమున నేలపైబడి సాష్టాంగనమస్కారము జేయు యోగ మెప్పుడు లభిం

చునో తెలియకున్నది. ఓ కరుణాకరా! యాత్రాజనుల ముఖమున నాకు వర్తమానమును బంపుము. నీదర్శనమునకై నేను వేచియుంటిని."

తుకారాం వినతిపత్రమును భక్తులకిచ్చి "అయ్యలారా! మీరీ వినతిపత్రమును శ్రీ విఠలనాథునకు సమర్పించి "తుకారామేమి యత్క్రమమును జేసెను, ఆతనియందే దుర్గుణములను జూచి మీరాతనిని దూరము జేసితిరి, ఆతడొనర్చిన యేయపరాధమునుజూచి మీరాతనిని మీ దర్శనమునకు దూరస్థునిగా జేసితిరి. మీరాహ్వానించినచో దత్క్షణమేవచ్చి మిమ్ములను మీభక్తులను దర్శనము చేయగలడు. త్రివిధ తాపములచే బీడింపబడుచున్న యాతడు చంద్రభాగా తీరమున నృత్య సంకీర్తనలనుజేసి శుద్ధుడు కాగలడు. మాతృదేవత పసిబిడ్డను త్యజించి నచో స్తనపానమిచ్చి పోషించువారెవరు? ఆతని గుణదోషముల నెంచక మీ చరణములను జూపుడు. ఆతని దురితములను బోగొట్టు సామర్థ్యము మీకులేక నిష్ఠురమానసులై యాతని పరదేశిగ జేసితిరా? పతిత పావన నామధారులగు మీకీర్తిని తుకారాం దివారాత్రములందును మీ దర్శనమునకై విలపించుచున్నాడు. ఓ జగజ్జీవనా! మీ చరిత్ర వర్ణించుటకు ప్రేమామృతమును మీ రనుగ్రహింపలేదని చింతాక్రాంత మానసుడై శోకించుచు గూర్చుండి యున్నాడు" అని శ్రీ పంఢరీ నాథున కెఱింగింపు"డని చెప్పి యాత్రాజనులకు సాష్టాంగనమస్కారము జేసి వారిని గ్రామము వెలుపలవరకు సాగనంపి "నా దుస్థితిని మీరు శ్రీ పంఢరీనాథునకు దెలియజేయు" డని చెప్పగా యాత్రాజనులు "అటులనే" యని చెప్పి హరినామసంకీర్తన జేయుచు దారిని వెడలిరి. చిత్రకారుడు సూర్యుని రూపమును చిత్రించునుగాని యా రూపమున ప్రకాశమును జూపలేనట్లును, పూర్ణముగానిండి నది పొంగి పొరలు చున్నను, నయ్యది సాగరమునకు సమముగానట్లును, తుకారాం దీనస్థితిని వర్ణించుటకు యోగ్యములగు నుపమానములేవియును దోచుటలేదు.

అఱువదినాల్గవ అధ్యాయము సమాప్తము.

మధురానాథాయ నమః.

# తుకారామ్‌నకు

# శ్రీ విఠ్ఠలనాథుడు దర్శనమిచ్చుట

## — అరువది యైదవ అధ్యాయము —

ఓ సచ్చిదానంద పరబ్రహ్మమూర్తీ! అపారమగు నీ కీర్తిని వర్ణించుటకు వేదశాస్త్రములకును, శేషునకును, బ్రహ్మదేవునకును నసాధ్యము. పసిబాలుడు పలుకు నపశబ్దములను విని యాతనితల్లి సంతసించునట్లు, సప్రేమభక్తితో నీభక్తులు చేయు స్తోత్రములను నీవు ప్రేమతో శ్రవణము జేయుదువు. విశ్వోద్ధారకుడవగు నిన్ను గోపికలు బంధింపగా నీవు భీతిజెందుట యాశ్చర్యకరము. నీప్రాప్తికై మహాత్ములు గొప్పగొప్ప యజ్ఞములను చేయుదురు, నీవు వారల కలభ్యుడవై భిల్లిణు లర్పించిన యెంగిలిఫలములను ప్రేమతో భుజించితివి! నీవు బ్రహ్మదేవునికి జనకుడవైయుండగా యశోదాదేవి తనపుత్రుడవని నిన్ను తొడలపైగూర్చుండ బెట్టుకొనెను. దుర్యోధనసార్వభౌముని యాదరణను నీ విచ్చగింపక దాసీపుత్రుడగు విదురునిగృహమున విందారగించితివి, నీవు ప్రేమకు వశవర్తివై గోపాలుర యుచ్ఛిష్టమును భుజించితివి. నా యార్త వచనము లంగీకరించి భక్తుల గుణములను వర్ణించుటకు మతిననుగ్రహింపుము.

దేహుగ్రామమునందు పంఢరీపుర బ్రహ్మోత్సవమునకు పతాకహస్తులై పదునాలుగునందల యాత్రాజనులు హరినామ సంకీర్తన చేయుచు తుకారాంయొద్ద ననుజ్ఞదీసికొని పంఢరీక్షేత్రములో ప్రవేశించిరి. వారనుత ప్తచిత్తులై చంద్రభాగలో స్నానముజేసి పుండలీకభక్తుని సేవించి నృత్యసంకీర్తనలతో క్షేత్రప్రదక్షిణమొనర్చి, మహాద్వారమున ప్రవేశించి, సాష్టాంగనమస్కారమొనర్చి, గరుడమంటపముజేరి తుకారాం శ్రీ విఠ్ఠలనాథునకు వ్రాసి పంపిన ఇరువదినాలు గభంగములను గలిగియున్న వినతిపత్రమును చేబట్టి ఆనందముతో గానముజేయుచు దానిని శ్రీ పంఢరీనాథునకు వినిపించిరి. లేగ వలలో చిక్కికొనినచో లేడి దుఃఖమొందునటుల, బాలకునకువ్యాధి సంప్రాప్తించినచో నాతని

జనని చింతించునటుల, ధన మపహరింపబడినచో కృపణుడు ఖిన్నుడగు నటుల, తుకారాం దుస్థితిని విని శ్రీ పంఢరీనాథుడు చింతాక్రాంతుడై యశ్రుధారలు విడచుచు రుక్మిణీదేవిని బిలచి "తుకారాం వ్యాధిగ్రస్తుడై ఖేదముతో నొక వినతిపత్రమునంపెను. బ్రహ్మోత్సవమున కసంఖ్యాకులగు యాత్రాజనులును, భక్తులును వచ్చినను తుకారాం కనబడనందున నామనస్సు శమించుటలేదు. కాన త్వరితముగా పోయి తుకారాంనకు దర్శనమీయవలయునని తలంచితి" నని చెప్పగా శ్రీ రుక్మిణీదేవి "ఓ దేవాధిదేవా! అసంఖ్యాకులగు యాత్రాజనులను, భక్తులను విడిచి యీసమయమున బోవుట యుక్తముగాదు. గరుడునిబంపిన నాతడు తన భుజముపై తుకారాంను గూర్చుండబెట్టుకొని క్షణకాలములో నిచటకు రాగలడు. వ్యర్థముగ జింతించుటచే ఫలితములేదు" అని పలుకగా శ్రీ పంఢరినాథుడు వైనతేయుని బిలచి "దేహుగ్రామమునకు బోయి ఒక కార్యమును సాధింపవలయు" నని చెప్పి భగవంతుడు తాళపత్రమును, గంటమును దీసికొని తుకారాంన కొక శ్రీముఖము నీవిధముగ వ్రాసెను.

చిరంజీవియగు తుకారాంనకు శ్రీ విఠ్ఠలనాథు డాశీర్వదించి వ్రాయు శ్రీముఖము:—

నీవు యాత్రాజనులద్వారా పంపిన వినతిపత్రము చేరినది. నీవ నారోగ్యముగ నుండుట దెలిసికొంటిని. నిన్ను జూచుటకై నా నేత్రములు కలవరము నందించుచున్నవి. నిన్నాలింగనము జేసికొనుటకు నా హృదయ మాతురత జెందుచున్నది. నీ వియోగముచే నామనస్సు తబ్బిబ్బగుచున్నది. నేను నీయొద్దకు వచ్చుటకు సంసిద్ధుడనై యసంఖ్యాకులగు యాత్రాజనులు దర్శనార్థమై వచ్చియుండుటచే రా జాలకపోతిని వైకుంఠ కైలాసములుండువరకు నీవు చిరంజీవివై యఖండముగ హృదయమందిరమున నన్నునిలిపికొనుము. నీవులేనిదే నాకిచ్చట బ్రహ్మోత్సవము చంద్రుడులేని పూర్ణిమవలె కళాహీనమై యున్నది. అందుచే

నిన్ని చటకు దీసికొనివచ్చుటకై గరుత్మంతుని కాజ్ఞనిచ్చి పంపించితిని. నీవెంతమాత్రమును సందేహింపక యాతని భుజముపై గూర్చుండి తత్క్షణమే వచ్చి నా దుఃఖమును దొలగింపుము.

అని వ్రాసి గరుత్మంతుని చేతికిచ్చి "ఓ వైనతేయా! నీవు త్వరితముగా నీ శ్రీముఖమును తుకారాంనకుజూపి యాతనిని నీభుజముపై గూర్చుండబెట్టుకొని తీసికొనిరమ్ము. నీవునాకు వాహనమై యుండుటచే నాతనిని భుజమున గూర్చుండ బెట్టుకొనుటకు సంశయింపకు"మని చెప్పగా గరుత్మంతు డవశ్యమని చెప్పి భగవంతునకు సాష్టాంగ నమస్కారముజేసి బయలుదేరెను. సరస్వతి ప్రసన్నమైనచో పండితులు సన్మానించునటులను, దేవగురువగు బృహస్పతి యంగీకరించినచో దేవతలెల్ల రంగీకరించునట్లును, భగవంతుడు తుకారాంను తనభుజముపై గూర్చుండబెట్టుకొనిరమ్మని చెప్పుటచే వైనతేయుడు నిష్కళంక మనస్కుడై 'దేహు' గ్రామమునకు బయలుదేరెను.

శ్రీ రుక్మిణీదేవి విస్మిత మనస్కురాలై "స్వామీ! మీవాక్కునుండి వెలువడు వచనము లసత్యమెన్నటిని కాజాలవు. తుకారాంను వైకుంఠ కైలాసము లుండువరకును చిరంజీవిగ వర్ధిల్లుమని మీరాశీర్వదించుట నాకాశ్చర్యముగ నున్న"దని పలుక, శ్రీ పంఢరినాథుడు స్మితవదనుడై "ఆతడఖండముగ ననాదికాలమునుండి నన్నాశ్రయించి చిరంజీవిగనే యున్నాడు. భవిష్యత్తునగూడ నటులే యుండగల డని చెప్పెను.

తుకారాం కపాలమున హస్తములుంచుకొని గ్రామపొలిమేరలో దీనవదనుడై కూర్చుండి తల్లిరాకకై నిరీక్షించు బాలకునివలెను, తృష్ణాక్రాంతమై యుదకము నపేక్షించు చాతకమువలెను, క్షుధచే జననికై విలోకించు శిశువువలెను, శ్రీ పంఢరీనాథుని వియోగమువలన దివారాత్రములు తబ్బిబ్బగుచుండగా నాకస్మికముగ గరుత్మంతుడాతని యెదుట

సాక్షాత్కరించెను. ఖగపతిని జూడగనే తుకారాం సాష్టాంగ నమస్కారము జేసి ప్రేమతో నాలింగనముజేసికొని, శ్రీ రుక్మిణీకాంతుని గూర్చి కుశలప్రశ్నలను వేసి “ఆదేవాదిదేవుని దర్శనము నాకెప్పుడు లభించును. ఆతడు మనస్సును కఠినముగ జేసుకొని నన్ను బరదేశిగా జేయుటచే నుద్విగ్నుడ నగుచుంటిని. అసంఖ్యాకులగు భక్తులాతని నఖండముగ సేవించుచుండుటచే నాతడు నన్ను మరచి యుండవచ్చును. లేనిచో నాయం దేదోషములను గనిపెట్టి నన్ను దూరునిగా జేసెనో తెలియకున్న”దని పలికి యశ్రుధారలను విడచుచు, విలపించెను. తుకారాం వచనములను విష్ణువాహకుడువిని “నీ దుఃఖమునకంటె నీదర్శనము లేకపోవుటచే శ్రీ పంఢరీనాధుని దుఃఖ మమితముగనున్నది. పసిబాలుని వియోగమును జనని సహింపజాలనటుల, లేగను లేడి విడువజాలనటుల తృష్ణాక్రాంతుడు జలమునకై తబ్బిబ్బగునటుల, శ్రీ రుక్మిణీపతి దివారాత్రములును నీదర్శనమునకై చింతించుచు నిన్ను నాభుజముపై గూర్చుండ బెట్టుకొని రమ్మని యాజ్ఞాపించి యాతడొక శ్రీ ముఖమును నీచేతికిమ్మని చెప్పి నాకిచ్చెను” అనిచెప్పి యా శ్రీముఖమును తుకారాంన కీయగా నాతడద్దానిని దీసికొని నేత్రముల కద్దుకొని శిరమున ధరించి పిదప నాపత్రమును జదువుకొని యశ్రుధారలు విడచుచు దానిని తన హృదయమున కద్దుకొనెను. వాడిన వృక్షము వర్షింపగనే తల యెత్తునటుల శ్రీ పంఢరీనాధుని శ్రీ ముఖమును జదువగనే తుకారామారోగ్య వంతుడాయెను.

గరుత్మంతుడు మధురోత్తరములతో “ఓ భక్తాగ్రేసరా! శ్రీపంఢరీనాధుని యాజ్ఞానుసారము నీవు నాభుజముపై నధిష్ఠింపుము. ఒకక్షణకాలములోనిన్ను పంఢరీపురమునకు దీసికొనిపోయెద” నని చెప్పగా తుకారామాతనితో “ఓ వైనతేయా! నేనశక్తుడనై యున్నాను. కానకృపయుంచి శ్రీ పంఢరీనాధు నిచటకు బంపుము” అని చెప్పెను.

గరుత్మంతు డాతనితో “సంశయింపకుము. భగవదాజ్ఞానుసారము విలంబనచేయక సంసిద్ధుడవుక”మ్మని చెప్పగా తుకారామ్ చేతులు

జోడించి "నీవు మాస్వామికి వాహనమవై సేవకులమగు మాచే బూజింపబడుచున్నావు. విచక్షణుడవు, చతురుడవై యున్నావు. దేవాధిదేవుడగు (శ్రీ) రుక్మిణీకాంతుడు నీభుజముపై గూర్చుండియుండ, నాతని చరణారవిందములు నీహృదయమున కాభరణములై శోభించుచున్నవి. నీవు భగవంతునకు వాహనుడవు, సఖుడవు, భక్తుడవైయున్నావు. నీ భుజముపై భగవంతు నధిష్ఠింపజేసికొని, యోగీశ్వరుల హృదయములలో సంచరించుచుందువు. మహాయోగ్యుడవగు నీగౌరవమును నే నెన్నడును భంగముజేయను. నీభుజమున గూర్చుండుటకు నా కధికారములేదు. కాన నాప్రార్థన నాలకించి సత్వరమే పంఢరీపురమునకు బోయి (శ్రీ) విఠ్ఠలనాథు నిచ్చటకు దీసికొనిర"మ్మని చెప్పి సాష్టాంగనమస్కారము జేసెను. గరుత్మంతుడు "నీకోరికప్రకారము భగవంతుని సత్వరమే యిచ్చటకు దీసికొనివచ్చెద" నని చెప్పి యచటనుండి బయలుదేరి జరిగిన వృత్తాంతమంతయును భగవంతున కెరింగించెను. శ్వశురగృహమున నిక్కట్లలో నున్న తనయు వర్తమానమంపగా నామెను జూచుటకై జననీ జనకు లాతురత జెందునట్టుల భగవంతుడు తుకారాంను జూచుటకై గరుడవాహనారూఢుడై పోవుటకు సంసిద్ధుడై రుక్మిణీదేవిని బిలచి యీ వృత్తాంతమునంతయు నామెకు దెలిపెను.

జగజ్జనని భగవంతునకు వందనముజేసి "ఓ స్వామీ! అసంఖ్యాకులగు భక్తులు తమ దర్శనార్థము వచ్చియుండ వారిని త్యజించి బోవుటుచితముకాదు. కాంతాహీనమగు గృహము శూన్యముగ నుండునటులను, జలములేని నది శోభాహీనమగునటులను, మీ రిచ్చటనుండి పోయినచో పంఢరీపురము శూన్యముగ నుండును. రాజులేని సైన్యమును, చంద్రుడులేని నక్షత్రములును, లలాటమున కుంకుమలేని యలంకారమును, శోభారహితములై యుండును. కాన తాము 'గోపాలకాల మహోత్స' వానంతర మావశ్యముగ బోయి తుకారాంనకు దర్శనమీయవచ్చును" అని చెప్పగా జగజ్జీవను డట్టులనే చేసెదనని చెప్పెను. భగవద్దర్శనార్థమై శేఖ్ మహమ్మద్, గణేశనాథ్, బోధలబువా, నింబ

ర్నాజు, సంతోశా మొదలగు భక్తులు విచ్చేసిరి. వారు తంబుర తాళ మృదంగాది వాద్యములతో హరినామసంకీర్తన జేయుచు బతాకహస్తులై సభామంటపమున సాష్టాంగనమస్కారములను జేసిరి.

ఆసమయమున శ్రీపంఢరీనాథుడు రుక్మిణీదేవిని జూచి "నింబ రాజు బహు శ్రమనొందియున్నాడు. ఆతనికిదర్శనమిచ్చి వరదాన మను గ్రహించు టుచితము" అని చెప్పెను, రుక్మిణీదేవి 'ఆత డెవరు? ఎచ్చట నుండి వచ్చెను? తెలుపు" డని యడుగగా భగవంతు డానందించి భక్తుని చరిత్ర స్వముఖమున రుక్మిణీదేవి కిట్లు చెప్పెను. "పైఠనపురమునం దీ నింబరాజు వంశపారంపర్యముగ వచ్చుచున్న కరిణీకవృత్తిని జేయుచుం డెను. గృహస్థాశ్రమమున నితనికి దారపుత్రాదులుండిరి. ఈతడు భావ పూర్వకముగ భక్తులను బూజించుచు, ననుత ప్రచిత్తుడై "ఈ సంసారము నశించునది. ప్రాపంచిక వ్యవహారములలో నాయుర్దాయము తరిగిపోవు చున్నది. దుర్లభమగు మనుష్యజన్మమునొంది యుచితరీతిని దీని సార్థక మొనర్పలేకపోతి' నని చింతించి వైరాగ్యముతో దీర్థాటనకై బయలు దేరి ద్వాదశజ్యోతిర్లింగములను, సప్తమోక్ష పురములను, మార్గమున గల పురాణవ్యాఖ్యాతములగు నానాపుణ్యక్షేత్రములను దర్శించి భాగీ రథీజలమును మూడుకావిళ్ళతో మోసికొనిపోయి రామేశ్వరమున నభి షేకము జేయించి సుకృతము నపారముగనార్జించి యాశ్రమమున వసిం చుచు నిష్కామబుద్ధితో నా నామసంకీర్తన నఖండముగ జేయుచు నిర్ల జ్జతో దేహాభిమానమును విడచి నృత్యము జేయుచుండును. 'హరికీర్త నను విడచి చేయు నితరసాధనములు వ్యర్థములు. బావిని శ్రమతో లోతుగ దవ్వినను జల ముద్భవింపనిచో వ్యర్థమగునటుల, క్షేత్రములో వరి యపారముగ పెరిగినను, ధాన్యపుకంకులు వేయనిచో వ్యర్థమగు నటుల, గృహమున సంతానము లేనిచో గృహస్థపారముగ ధనమార్జిం చుట వ్యర్థమగునటుల, లోకానుభవము లేనివాడు చేసిన శాస్త్రవ్యాఖ్యా నము వ్యర్థమగునటుల, శౌర్యతేజోవిహీనుడగు నృపతి సింహాసనము నధిష్ఠించుట హాస్యాస్పదముగ నుండునటుల నా గుణానుభవము జేయని

యితరసాధనములు వ్యర్థములగును' అని తెలిసికొని యఖండముగా నన్ను సేవించుచున్నా" డని చెప్పెను.

నింబరాజు సభామంటపమున నఖండముగ హరినామసంకీర్తన జేయుచుండ శ్రీ పంఢరీనాథుడు గజవదనుని బిలచి నింబరాజు నా అనంతకళ్యాణగుణములను వర్ణించుటకు స్ఫూర్తి నాతని కొసగుము" అని యాజ్ఞాపింప విఘ్నేశ్వరు డవశ్యముగా జేసెదనని చెప్పెను.

ఒకనాడు నింబరాజు నిద్రించుచుండ పార్వతీ సుతుడాతనికి సాక్షాత్కరించి యాతనిని మేల్కొలిపి తననోటనున్న తాంబూలము నాతని చేతబెట్టి "నీవభ్యాసముజేయకయే భగవంతుని యనంతకళ్యాణ గుణముల నఖండముగ వర్ణించుటకు శక్తినిచ్చితి"నని చెప్పి తత్క్షణమే యంతర్ధానుడాయెను. నింబరాజు విఘ్నేశ్వప్రసాదమును స్వీకరించి యుదకముతో హస్తప్రక్షాళన జేసినను ముద్రాంకితమైనటుల నా తాంబూల చిహ్నమటులనేయుండెను. గజాననుని కృపచే నాతనికఖండ విద్య లలవడినవి. శ్రీ పంఢరీనాథుడు రుక్మిణీదేవిని జూచి నింబరాజునకు వరదాన మీయుమనగా జగన్మాత విస్మిత మనస్కురాలై భగవదాజ్ఞ ప్రకారము నింబరాజునను గ్రహింపదలచి యొక కృషికస్త్రీ రూపమును దాల్చి దేవాలయమునకుబోవు మార్గమున గూర్చుండి యొకగంపనిండ చిరుగడదుంపలనుంచుకొని నింబరాజు దేవాలయమునుండి వచ్చుచుండ నాతనిని బిలచి మధురోత్తరములతో "నాయనా నేను పసిబాలుని గృహమునవిడచి వచ్చితిని. ఆతడాకలితో నేడ్చుచుండును. నేనొక క్షణ కాలములో గృహమునకేగి బిడ్డను దెచ్చుకొందును. దయచేసి నీవిచ్చట నీ గంపనుజూచుచుండుము" అని చెప్పగా నింబరాజు కరుణార్ద్ర హృదయుడై అవశ్యముగ జూచుచుందును త్వరితము గృహమునకేగి రమ్మ"ని చెప్పెను.

శ్రీ రుక్మిణీదేవి నింబరాజునకు చిరుగడదుంపలగంప నొప్పగించి కొంతదూరముపోయి యంతర్ధానమాయెను. నింబరాజొక జాముసేపు

చూచి ఆ స్త్రీ రానందున నాశ్చర్యచకితుడై యాగంపపై మూతగా గప్పియున్న వస్త్రమునుదీసి చూడ నమూల్యములగు బంగారునాణెము లుండుట జూచి విస్మితచిత్తుడై "ఆదిమాయ నన్ను మోహసాగరమున ముంచుటకై మహానర్థములగు నీ బంగారు నాణెముల నిచ్చె"నని తలచి యనుతప్తచిత్తుడై విప్రుడు తొందరపడి గృహమున బ్రవేశించి యచట మాంసమును జూచియేవగించుకొనునటులను, కుష్ఠవ్యాధిగ్రస్తునిజూచి జనులుదూరముగ నేగునటులను నింబరాజా సువర్ణమునుజూచి భయకం పితమానసుండై దేవాలయమునకు బోయి సద్భావముతో సాష్టాంగనమ స్కారముజేసి చేతులుజోడించి "ఓ దేవాధిదేవా! నన్నేల నైశ్వర్య మోహమున బడనైచెదవు నీకృపనుమాత్రమే యపేక్షించునాకు ధన సంపదలేల? అని ప్రార్థించి శ్రీ రుక్మిణీదేవికి సాష్టాంగ నమస్కారము జేసి సభామంటపమున గూర్చుండి యఖండముగ నామస్మరణజేయు చుండెను.

శ్రీ రుక్మిణీదేవి భగవంతునకు వందనజేసి "ఓ దేవా! నీవు చెప్పిన ప్రకారము నింబరాజునకు సువర్ణము ననుగ్రహించితిని. కాని యాతడు దానిని తృణీకరించె"నని చెప్పగా పంఢరీనాథుడు హాసవదనుడై "నా భక్తులు నాసేవమాత్రమే యపేక్షింతురు. పర్వతమునకు వర్ష ధారలు రుచింపనటుల వారలకు ధనసంపదలు రుచింపవు. వారిని మాయా మోహములు బాధింపజాలవు. దినకరుని చలి బాధింపజాలనటులను, సముద్రుని తృణముబాధింపలేనటులను నా భక్తుని మాయామోహ ములు బాధింపజాల"వని చెప్పగా రుక్మిణీదేవి విస్మితచిత్తురాలయ్యెను.

మరునాడు ప్రాతఃకాలసమయమున స్నానమునకై భక్తజనులు చంద్రభాగానదీతీరమునకు బోయిరి. నింబరాజు గూడ వారివెంట పోయెను. శ్రీ పంఢరీనాథుడు నింబరాజుననుగ్రహింపదలచి విప్రవేష ముతో గోపీచందనతిలకమును ధరించి శిరమునటోపీని, గళమున తులసి మాలను ధరించి నింబరాజువద్దకువచ్చి "అయ్యా! నేను నదిలో దిగి స్నానముజేసి వచ్చెదను. యాత్రాసమయమగుటచే దస్కరుల బాధ

యధికముగనుండును. ఈ టోపీని, జపమాలను, వస్త్రమును, జూచుచుండుము. త్రికాలములో స్నానము జేసివచ్చె"దనని చెప్పి నదిలో దిగి యదృశ్యుడాయెను. నింబరాజొక జాముపర్యంతము నిరీక్షించి యా విప్రుడు రానందున వర్తమానమున చటగల భక్తజనులకు దెలుపగా నా సమయమున నొక బ్రాహ్మణోత్తముడువచ్చి నింబరాజునుజూచి "నీకీ వస్త్రములను కాచుచుండుమని చెప్పినవాడు, శ్రీ రుక్మిణీకాంతుడు. ఆతడు నీవుధరించుటకై తులసిమాలను, టోపీయును, వస్త్రము ననుగ్రహించి యంతర్థానుడాయె" నని చెప్పగా నింబరాజు భక్తజనులకు సాష్టాంగ నమస్కారము జేసి, వానిని ధరించి నదీతీరమున భక్తజనులకోరిక ననుసరించి హరినామసంకీర్తన జేయుచుండెను. ఆస్థలమున వైదికులును, శాస్త్రజ్ఞులును, భక్తులును, విరాగులును, సాధులును, వైష్ణవులును, నష్టాదశవర్ణముల జనులును నార్తిజెందియున్న వీనుల నాలకించుచుండిరి. నింబరాజుహృదయమున శ్రీ రుక్మిణీకాంతుని నిలిపికొని, నేత్రములనుండి యానందాశ్రుధారలను విడచుచు, గద్గద స్వరముతో నఖండముగ సంకీర్తన జేయుచుండెను. అసంఖ్యాకులగు భక్తజనులు తాళములను వేయుచు సుస్వరములతో నఖండముగ గానము జేయుచుండిరి. ఆశబ్దము నాదబ్రహ్మమై యాకసమువరకు వ్యాపించెను. దేవత లాకాశమునుండి విమానస్థులై కౌతుకమును జూచుచుండిరి. భావార్థయుక్తములగు నింబరాజు బోధించు నుపదేశవాక్యములను, జ్ఞానులును, చతురులును, శ్రవణము జేసినానందపరవశులైరి. ప్రేమచిత్తుడై భగవంతునికీర్తించిన యాతడు సంతసిల్లును, కాని కళాచాతుర్య విద్యలకు భగవంతుడు వశ్యుడుకాడు. ప్రేమలేని గానమును, ప్రాణరహితమగు శరీరమును, లవణశూన్యమగు పదార్థమును, రుచింపవు. సుగంధములేని కస్తూరియు, నాసికలేని సుందరవదనమును, విధవచేసికొను నలంకారమును, శోభారహితము లగునటుల ప్రేమలేనిగానమును హరికథయని చెప్పుట వ్యర్థమగును.

నింబరాజు "కృష్ణా, రామా, గోవిందా, గోపాలా, పురుషోత్తమా, అచ్యుతా, నరహరీ, ఆత్మారామా!"యని భగవన్నామముల నుచ్చరించుచు నృత్యము జేయుచుండ గరుడధ్వజుడు సంతసించి బాలరూపుడై వింజామరమును జేపట్టి నింబరాజు భుజముపై నధిష్టించి యాతనికి విసరుచుండెను. క్షీరసాగరనివాసియు, శేషశయనుడును, లక్ష్మీకాంతుడును, భక్తాభిమానియగు శ్రీ విఠలనాథుడు వింజామరముతో భక్తునకు విసరుచుండెను. శంకరుడును, విధాతయు, దేవతాగణమును నా కౌతుకమునుజూచి యత్యాశ్చర్యము నొందిరి. అమృతముయొద్ద రోగ ముండనటులను, భాస్కర సాన్నిధ్యమున నంధకార ముండనటులను నింబరాజు చేయు హరినామ సంకీర్తనమందు పాల్గొనిన ప్రజలకు నిద్రయు నలసటయు, లేకుండెను. భక్తులెల్ల రాకలిదప్పులను మరచి కాలాకాల విచక్షణలేక నాలుగుజాము లటులనే భజన జేయుచుండిరి.

ఒకస్త్రీ స్నానమునకై చంద్రభాగకువచ్చి యచట భజనచేయుచున్న నింబరాజు భుజముపై శ్రీ పంఢరీనాథుడు బాలరూపమున కూర్చుండి వింజామరము వీచుచుండుటగాంచి యత్యాశ్చర్య చిత్తముతో సన్నిధికేగగా నాత డదృశ్యుడాయెను. అంత నాయువతి నింబరాజు చరణములపైబడి సాష్టాంగనమస్కారము జేసి విలపించుచుండగా నచటనున్న జనులామెను జూచి దుఃఖకారణమేమని యడిగిరి. ఆయువతి "నింబరాజుభుజముపై భగవంతుడు కూర్చుండి వింజామరమును వీచుచుండుటనుజూచి దర్శించుటకై సన్నిధికేగ నాత డంతర్ధాను డయ్యెనని విలపించుచుంటి"నని చెప్పెను. అచ్చటగల జనులెల్లరు నత్యాశ్చర్యము నొందిరి. నింబరాజు భుజముపైనున్న యుత్తరీయము భగవంతుని చరణధూళిచే నంకితమై యుండెను. జనులెల్లరు భగవంతుని చరణచిహ్నములనుజూచి నింబరాజునకు సాష్టాంగనమస్కారముజేసి యాలింగనము జేసికొనిరి. భావుకజనులాయువతికి వందనములుజేసి "తల్లీ భగవంతుని గుర్తించితివి. నీపుణ్యము వర్ణనాతీతమై యున్న"దని పరిపరివిధముల నామెను కొనియాడిరి. భక్తజనులెల్లరును భగవంతునికి మంగళహారతి



తుకారామ్‌నకు శ్రీ విఠ్ఠలనాథుడు

గరుడవాహనారూఢుడై వచ్చి దర్శన మిచ్చుట.

జేసిరి. నింబరాజును భక్తజనులు గోపాలకాలమహోత్సవము పూర్ణిమ నాడుసేవించి పిదపతమతమ నివాసములకేగిరి. శ్రీ విఠలనాథుడు రుక్మిణీ దేవినిజూచి "భక్తులెల్లరు తమ స్వస్థానముల కేగిరి. నాకీక్షేత్ర ముదాసీనముగ దోచుచున్నది. మనమిరువురమును గరుడ వాహనారూఢులమై 'దేహు' గ్రామమునకుబోయి తుకారాంకు దర్శనమిత్త"మని చెప్పెను.

శ్రీ పంఢరీనాథుడు గరుత్మంతుని బిలచి రుక్మిణీ సమేతుడై యాతనిపై నధిష్టించి యిచ్ఛామాత్రమున దేహుగ్రామము జేరెను. తుకారాముని కాసమయమున నుత్తమశకునములు కనబడుటచే "నేడు భగవంతుని దర్శనము లభించు"నని మనమున దలచెను. తత్క్షణమే శ్రీ విఠలనాథుడు రుక్మిణీసమేతముగ గరుడవాహనారూఢుడై దర్శనమిచ్చెను. తుకారా మత్యానందముతో భగవంతునకు సాష్టాంగనమస్కారముచేసెను. శ్యామలవర్ణుడు, నతిసుకుమారుడును, పీతాంబరధారియు, విరాజమానమగు రత్నఖచిత కనక కిరీటధారియు, మకరకుండల శోభాయమానుడును, గళమున వైజయంతీమాలాధారుడును, కంఠమున కౌస్తుభమణి విరాజమానుడును నగు శ్రీ విఠలనాథుని దివ్యస్వరూపమునుజూచి తుకారామానంద పరవశుడాయెను.

అరువదియొకటవ అధ్యాయము సమాప్తము.

గోప గోపీశ్వరాయ నమః.



# తుకారామిచ్చిన ప్రసాదమువలన మహార్ఘున కఖండజ్ఞానము కలుగుట

## —♦ అరువది యారవ అధ్యాయము ♦—

జయజయ కరుణాసాగరా! జగదుద్ధారా! సాయుజ్యోదారా! రుక్మిణీవరా! శ్రీ విఠ్ఠలా! నీవు భక్తులను కృపాదృష్టితో జూచి సంసారము నుండి విముక్తులుజేసి వారిని ప్రపంచ వ్యామోహములలో దగుల్కొన నీయక నక్షయపదము ననుగ్రహించుచున్నావు. నీ యౌదార్యమును వర్ణించుటకు సహస్రవదనునకును, మహాకవులకును సాధ్యము కాలేదు. అజ్ఞానబాలకుడే యపశబ్దములను బలికినను జనని యానందించునట్లు మందబుద్ధినగు నావాక్కునుండి వెలువడు నార్ష వచనములను నీవు కృపతో నాలకింపుము. ఓ రుక్మిణీపతీ! నీమహిమ విశేషమును వర్ణించుటకు వేదములకు సాధ్యము కాక ప్రయాసనుబొంది తుదకు నేతి నేతి వాక్యములను బలికినవి. ఓ యధోక్షజా! సామర్థ్యవంతుడవగు నీవు భక్తుల యాంతర్యము నెరిగి వారల యభీష్టమును దీర్చుచున్నావు. కృపతో నాకభయమిచ్చి భక్తుల సచ్చరిత్రలను వర్ణింపజేయుము.

తుకారామ్ శ్రీ విఠ్ఠల నాథునకు సాష్టాంగ నమస్కారముజేసి బద్ధాంజలియై నిలువబడియుండ శ్రీ రుక్మిణీరమణుడు కృపాదృష్టితో వీక్షించి వరదానమును కోరుమని చెప్పెను. అంత తుకారాం "ఓ దేవా దిదేవా! నాచిత్తమున నఖండముగ నీవు వసింపవలయును. నావాక్కునుండి ప్రేమతో నీ నామముచ్చరింప బడుచుండవలయును. నీయంతరంగ భక్తులతో సాంగత్యమువలన కాలము సద్వినియోగము పరుప బడవలయును. నేను ప్రతిజన్మమునను మీకుదాసుడనై జన్మింపవలెను? దేహావసాన పర్యంతము పంఢరీక్షేత్రమును నేను నియమములో వార్షికముగ దర్శించుచుండవలెను. నాకు చతుర్విధ ముక్తులును, ధనమాన సంతానములును, విద్యయు, మంత్రమును, లౌకిక మర్యాదల ననుగ

హింపకు మని కోరి వందనములను జేయుగా భగవంతుడాశ్చర్యచకితుడై గరుత్మంతునిజూచి "ఉదారవిరక్తుడగు ప్రేమభక్తుడు తుకారామ్ సర్వమునుద్యజించి నన్నారాధించుచున్నాడు. అతడు నావియోగ దుఃఖము వలన నన్నపానీయాదులను వర్జించుటచే దేహము కృశించిన" దని చెప్పగా వైనతేయుడు భగవంతునకు నమస్కారముజేసి "ఓ కృపావంతా! మీరు తుకారాంనకు బంపిన శ్రీ ముఖములో వైకుంఠ కైలాసము లంతవరకును చిరంజీవియై యుండునట్లాశీర్వదించిరి తమవచనము కల్పాంతములందైనను నసత్యము కానేరదు. ఈతడు చిత్తమఖండముగా భజనయందు లయమై యుండుటచే కలికాలు లీతని కంకితులైరి. ఈతడు సాక్షాత్ నామదేవుని యవతారమని భక్తులెల్లరు దెలిసికొనిరి. ఈతడనంత జన్మలలో జేసిన సుకృత విశేషముచే నేకాగ్రచిత్తుడై మిమ్ములను స్వాధీనపరచుకొని ప్రేమతో మిమ్ము గీర్తించుచున్నా"డని చెప్పెను.

శ్రీ విఠలనాథుడు తుకారాముని జూచి "భక్తాగ్రేసరా! నన్నాకలి మిగులబాధించుచున్నది. నీ గృహమునందు దినుట కేదియున్నను సందేహింపక పాత్రలో వడ్డించి తీసి "నీ"రమ్మని చెప్పెను. తుకారామ్ పాత్రతో జలమునుదీసికొని వచ్చి భగవంతుని చరణారవిందములను గడిగి కోమలతులసీహార మాతని గళమునవేసి ప్రీతితో తనగృహమున నున్న జొన్నరొట్టెలను నాకుకూరను నొకపళ్ళెములో వడ్డించి భగవంతు నెదుటబెట్టెను. భగవంతుడు తుకారాం మనోగతము నెఱిగి యాతనిని దృప్తిపఱచుటకై యాకలిగనున్నదని జెప్పి, జొన్నరొట్టెలను తినుచుండెను. సద్భావముగల భక్తులకు దర్శనమిచ్చునప్పుడే భగవంతుని కాకలి కలుగుచుండును. ఆతడు వారల ప్రేమభక్తికి వశవర్తియై కులగోత్రములను విచారింపక వారలర్పించు పదార్థము లేవియైనను పరమప్రీతితో నారగించుచుండును. దుర్యోధనుడు నానావిధ పక్వాన్నములను దయారుచేయించి శ్రీకృష్ణుని రాకకై నిరీక్షించుచుండ భగవంతు డచ్చటికి పోక విదురుని గృహమున భుజించెను సద్భావముతో ద్రౌపది పెట్టిన బచ్చలికూర నారగించెను. అతి నిర్మలుడగు యజ్ఞ పురుషుడు గోపికల

యొక్క యుచ్ఛిష్టమును, శబరియొసంగిన యెంగిలి పండ్లను, పరమ ప్రీతితో భుజించెను. శ్రీ విఠలనాథుడు తుకారామ్ గృహమున రొట్టెలను భుజించి కరశుద్ధిజేసికొని యుచ్ఛిష్ట ప్రసాదమును తుకారామున కివ్వగా నాతడు దానిని స్వీకరించెను. తుకారామ్ భగవంతునకు తులసీ దళమర్పింప నాతని ప్రేమనుజూచి దీనదయాళుడు సంతుష్టచిత్తుడై "తుకారామ్! నన్ను హృదయమున నిలుపుకొనుము. నీవుకోరినప్పుడు సగుణ స్వరూపముతో దర్శన మిచ్చుచుండెద" దని చెప్పి యాతని శిరముపై నభయప్రదహస్త మునుంచి యాశీర్వదించి రుక్మిణీసమేతముగా గరుడవాహనారూఢుడై పంఢరీపురమునకు వెడలెను.

అళందీ క్షేత్రమున నొకవిప్రుడు శ్రీ జ్ఞానేశ్వరుల జీవసమాధి వద్ద పురాణముల కర్థము చెప్పు పాండిత్యము నను గ్రహింపుమని యేకాగ్రచిత్తముతో ననుష్ఠానము జేయుచుండెను. జ్ఞానేశ్వరులాతనికి స్వప్నమున సాక్షాత్కరించి "నీవు దేహూగ్రామమునకు బోయి మహాభక్తుడగు తుకారామ్‌ను దర్శింపుము. ఆతడునీకు ప్రసాద మిచ్చును. నీవాప్రసాదమును భుజించిన నఖండమగు పాండిత్యమును, సభాపూజ్యతయుగలిగి విశేష ప్రజ్ఞావంతుడవగుదు"వని చెప్పిరి. విప్రోత్తముడు నిద్రనుండి లేచి స్వప్నమును మననముజేసికొని యమితానందముతో నచటికెనిమిది మైళ్ళదూరముననున్న దేహూగ్రామమునకు శీఘ్రగతినిబోయి తుకారాంనుదర్శించి యాతనికి సాష్టాంగ నమస్కారముజేసి జ్ఞానేశ్వరులు స్వప్నములో దెలిపిన వృత్తాంతమును సవిస్తరముగ దెలియజేసెను.

తుకారా మాశ్చర్యముతో "ఈతడు నిర్భాగ్యుడు. ఈతనికి విద్యయలవడు యోగము లేదు. కనుకనే జ్ఞానేశ్వరులు నిరాకరించి పతితుడనగు నాయొద్దకు బంపి"రని తలచి, యా విప్రోత్తమునితో "అయ్యా! నే నజ్ఞానుడను. జపతపోనుష్ఠానము లేమియు జేసినవాడను కాను. జ్ఞానేశ్వరులు నాయందు పెద్దరికముంచి తమ్ము పంపెను. సాక్షాత్పాండురంగదేవుడే లోకోద్ధారణమునకై జ్ఞానేశ్వరులరూపమున నవత

రించిరి. వారియాజ్ఞను నేను పాలించుట నాపరమధర్మ"మని చెప్పి పదు నొకండభంగముల నొక తాళపత్రముపై వ్రాసి, నారికేళమును, నా తాళపత్రమును నాతనికిచ్చి "నీ వీ నారికేళమును భుజించి యీ యభంగములను జదివితివో తత్క్షణమే నీకఖండజ్ఞానము కలుగు" నని చెప్పెను. విప్రుడు వికల్పచిత్తుడై "అభంగములను జదివి నారికేళము భక్షించినమాత్రమున జ్ఞానముకలుగునా?" అని శంకించెను. ఎదుట నున్న ద్రవ్యరాశి యభాగ్యునికంటికి పెంకులకుప్పగా కనబడునట్లును, రోగికి బక్ష్యాన్నములు చేదుగానుండునట్లును, దరిద్రుడు కల్పవృక్షమును తిరస్కరించునట్లును, నా విప్రుడు తుకారామిచ్చిన నారికేళమును, నభంగముల తాళపత్రమును నచటనే పడవేసి వెడలిపోయెను.

తుకారామ్ జ్ఞానేశ్వరుల కొక శ్రీముఖము నిట్లు వ్రాసెను. "సచ్చిదానందస్వరూపులగు జ్ఞానేశ్వరుల కనంత నమస్కారముల జేసి సేవకుడగు తుకారామ్ వ్రాసి పంపిన శ్రీముఖమేమనగా, ఓ జ్ఞానరాజా! తాము పంపిన విప్రోత్తమునకు తమ యాజ్ఞానుసారముగ నొక వారికేళమును, పదునొకండభంగములను వ్రాసి యొక తాళపత్రమును ప్రసాదముగ నిచ్చితిని. ఆతడు వికల్పచిత్తుడై వానిని త్యజించి వెడలి పోయెను. తాము పామరుడనగు నాకు పెద్దరికమిచ్చుట మిగుల నాశ్చర్యముగ దోచుచున్నది. సర్వశక్తివంతులగు తా మాతనిని నాయొద్దకు బంపినప్పుడే యాతని ప్రారబ్ధమున విద్య యబ్బుయోగము లేదని నేను భావించితిని. విషయము తమకు విశదమగుటకై యీ శ్రీముఖమును బంపితిని."

తుకారామ్ ఆ శ్రీముఖపత్రము నొక భావుకునకొసంగి యళందీ క్షేత్రమున జ్ఞానేశ్వరుల సన్నిధిని సమర్పింపుమని పంపెను. ఆ దేశమును పాలించుశివాజీమహారాజునొద్ద పురాణముజెప్పు శాస్త్రజ్ఞునియొద్ద మూర్ఖుడగు నొక బ్రాహ్మణుడుండెను. అత డొకదినమున తుకారామ్‌యొద్దకు బోయి సాష్టాంగనమస్కారము జేయగా, తనయొద్దనున్న నారికేళమును, పదునొకండభంగములు లిఖించిన తాళపత్రమును నాతనికిచ్చెను. ఆ

బ్రాహ్మణు డా నారికేళము నచ్చటనే పగులగొట్టి భక్షించి యా పత్రములోని యభంగములను చదివి స్వస్థానమునకు బోయెను. ఆ సమయమున శివాజీమహారాజ్ సభలో పురాణకాలక్షేపము జరుగుచుండెను. శ్రవణము జేయుటకై చతురులగు జ్ఞానులు, దశకంఠవిద్వాంసులు, వైదికబ్రాహ్మణులు నితర శ్రవణజనులు నపారముగ నుండిరి. ఆ మూర్ఖుడు సభలో బ్రవేశించి పౌరాణికుల జూచి "అయ్యా! మీరిప్పుడు చదివిన శ్లోకమునకు సరియగు ప్రతిపదార్థము దెలిపియుండలే" దని చెప్పగా నా సభయందున్న పండితులు "యీతడీ విషయ మెట్లు గ్రహించెను? విద్యావిహీనుడగు వీనికి శాస్త్రజ్ఞాన మెట్లుకలిగెనో తెలియుటలే"దని మిగుల నాశ్చర్యముతో నామూర్ఖుని "నీ కీ పాండిత్యమెటు లలవడిన" దని విచారింపగా నాతడు తనకు తుకారా మొక నారికేళమును, పదునొకం డభంగములు గల తాళపత్రమును నిచ్చెననియు, నా నారికేళము నచ్చటనే పగులకొట్టి భుజించి యా యభంగములను జదువు వరకు గీర్వాణభాష యలవడినదనియు చెప్పెను. పౌరాణికునకును, పండితులకును సంశయముగలిగి యా పురాణగ్రంథమును జదివి చెప్పుమని యిచ్చిరి. ఆమూర్ఖు డా పురాణగ్రంథమును బుచ్చుకొని మనమున తుకారామ్‌ను దలచి యనర్గళముగ బురాణముజదివి వ్యాఖ్యానము జేసెను. "విష్ణుభక్తుల మహిమవిశేషము వర్ణించుట యసాధ్యము, భగవంతుడు వారలకు వశుడైయుండి నానావిధములగు విచిత్రలీలలనుజూపి భక్తుల మాహాత్మ్యమును బ్రకటించుచుండు" నని యా సభలోని జనులెల్లరును పరిపరివిధముల గొనియాడిరి.

అరువదియారవ అధ్యాయము సమాప్తము.

శ్యామలా కృతయే నమః.



# తుకారామ్ పంఢరీపురమునుండి వచ్చిన హరిదాసునకు సన్మానము జేయుట.

—♦ అరువదియేడవ అధ్యాయము ♦—

హే పాండురంగా! నీ వనంతజడజీవుల నీభవసముద్రమునుండి తరింపజేసితివి. నన్నును తరింపజేయుము. స్నానసంధ్యలు, పితృతర్పణము జేయుటయు, యథావిధి నిన్ను షోడశోపచారములతో బూజించుటయు, నాకు దెలియదు. నేనశక్తశరీరుడనగుటచే యోగయాగాదులను, దీర్ఘాటనములను జేయజాలను. సత్పాత్రను జూచి దానధర్మముల జేయుటకు నా యొద్ద ధనములేదు, సద్గురుదాస్యము, సజ్జనసేవ జేయుటకు నాకు సాధ్యపడదు. మూఢమతినగు నేను సత్వహీనుడనై సర్వవిధముల నసమర్థుడనైయున్నాను. ఓ కేశవా! నీవిదియెఱుగుదువు. సర్వపాపములు నాలో మూర్తీభవించియున్నవి. నేను త్రివిధములగు విషయాదుల భోగించిన మహానీచుడనని నామనస్సు సాక్ష్యమిచ్చుచున్నది. నీవు పతితపావనుడవుగనుక నన్నీ భవాబ్ధినుండి తొలగించి నావిషయమున నీబిరుదును సార్థకముజేయుము.

తుకారామిచ్చిన నారికేళప్రసాదముచే మూర్ఖున కఖండజ్ఞానము గలిగెనని 'చించవడీ' గ్రామములోనున్న గణేశోపాసకుడగు విప్రునకు దెలిసి మిగుల నాశ్చర్యముతో నచటగల జనులెల్లరికిని నీవృత్తాంతమును దెలిపి "తుకారామ్‌ను సామాన్య మనుష్యమాత్రునిగా మనము దలంచుచుంటిమి, ఆత డీశ్వరాంశసంభూతుడని మనము మతాభిమానములో బడియుండి తెలిసికొనలేకపోతి" మని చెప్పగా నచటనున్న వారిలో కొందరు "తుకారాము నొకదినమున బిలిపించి నీవెవరవు యదార్థవిషయమును దెలుపుమని మనము ప్రశ్నింపవలె" నని చెప్పిరి. పిదప వారొకదినమున తుకారామ్‌ను దీసికొనివచ్చుటకై యొక మనుష్యుని 'దేహు' గ్రామమునకుబంపిరి. ఆతడు దేహుగ్రామము జేరు సమయమున తుకారామ్ హరికథాకాలక్షేపము జేయుచుండెను. అసంఖ్యా

కులగు జనులు శ్రవణముజేయుచుండిరి. తంబుర తాళ మృదంగాది వాద్యములతో సభాస్థలమున గల జనులెల్లరును తుకారామ్‌వెనుక హరి నామసంకీర్తన నాదబ్రహ్మముగ జేయుచుండిరి. ఆసమయమున సభాస్థలమున గల జనులెల్లరును ప్రపంచభ్రాంతిని విడచి తన్మయులైరి. దివిటీ బుచ్చుకొనియున్న నాతడును పరవశుడైయుండుటచే చేతనున్న దివిటీని పైకెత్తగా నచట వేయబడియున్న పందిరికి నిప్పంటుకొనెను.

'చాంబారుబూందిమా' గ్రామమున శేఖ్ మహమ్మద్ ఆనందముతో నృత్యముజేయుచు కీర్తనజేయుచుండెను. శ్రవణమునకై జ్ఞానులగు బ్రాహ్మణులును, పండితులును, చతురులగు శ్రీమంతులును, నష్టాదశ వర్ణములలోని చిన్న పెద్దలును నేకాగ్రమనస్కులై కథాశ్రవణము జేయుచుండిరి. కథాస్థలమున పాఖండులుసహితము పరవశులైయుండిరి. ఆ సమయమున శేఖ మహమ్మద్ కథాస్థలమునుండి యెగిరి గంతువేసి అర చేతులను రాచుకొనుటకు కారణమే" మని యడిగిరి. అందులకాతడు దేహుగ్రామమున వైష్ణవుడగు తుకారామ్ కథాకాలక్షేపము జేయుచుండ నకస్మాత్తుగా పందిరికి నిప్పంటుకొనెను, నేనదిచూచి యార్పుచున్నా" నని చెప్పగా నచటగల జనులెల్లరును నసత్యమని భావించి "బహుదూరమున నున్న దేహుగ్రామమున జరుగుచున్న యగ్నిప్రమాదమును మీరెట్లుగుర్తించితిరి. అచట నసంఖ్యాకులగు శ్రోతలుండగా మీరుమాత్ర మిచటనుండి యచట నగ్నిప్రమాదము నెట్లార్పుచుంటి" రని ప్రశ్నించిరి. అంత శేఖ మహమ్మద్ తుకారామ్‌చేయు కథాశ్రవణము జేయువారెల్లరును తన్మయులైయుండుటచే నగ్నినార్పువారు లేనందున నెవరికినీ ప్రమాదము కలుగకుండుటకై నేనిచటనుండియే యార్పితి" నని చెప్పెను. శ్రోతలు శేఖ మహమ్మద్‌తో "అయ్యా! తుకారామ్ కథజేయుసమయమున శ్రీ పండరీనాథు డాతనిసమక్షమున నుండునుగదా! మఱి యాతడు ప్రమాదమును జూచి యెట్లు సహించు" నని యడుగగా, "భగవంతు డద్వైతస్థితిని బొందియుండుటచే నభేదముగా తాను వేరు, తుకారామ్ వేరను భావములేకయే యుండెను.

అందుచే నచట ప్రమాదమును దొలగించువా రెవరును లేరు. ఇరు ప్రక్కల దివిటీలు పట్టుకొనినవారుసహితము, చేతులు పైకెత్తియేయుం డిరి. శ్రీ రుక్మిణీకాంతుడు తన దేవత్వమును మరచెను. తుకారాంను, శ్రోతజనులును మేము భక్తులమని స్పృహ లేకయుండిరి. మీకు సంశయమున్నచో నచటికి మనిషినిబంపి వర్తమానమును దెలిసికొను" డని చెప్పగా దేహు గ్రామ మునసబున కొకజాబువ్రాసి మనుష్యు నొకనిని పంపిరి. మరునాటికి విషయమంతయు యదార్థమని ప్రత్యుత్తరమువలన దెలిసికొని యాగ్రామ ప్రజలెల్లరును శేఖ మహమ్మద్ నకు సాష్టాంగ నమస్కారము జేసి యచటి వృత్తాంతమును మీ రెట్లు తెలిసికొనగలిగి రని యడుగగా "భావుకుల మనోగతమును భక్తులెరుగుదురు. అంతరిక్షమున విహంగము లే మార్గమునుజూచి యెగురునో యా పథము పక్షులకే తెలియును; గురుభక్తుల మనోగతము మాయాలోభములందు దగులొకనిన వ్యవహారజనులకు దెలియ" దని చెప్పగా నెల్లరును దండప్రణామము లాచరించిరి.

చించవడీ గ్రామమునుండి వచ్చిన గృహస్థు తుకారాం చేయు హరికథా శ్రవణముజేసి దేహభ్రాంతి విరహితుడై తానువచ్చిన కార్యమునుమఱచి గృహమునకు దిరిగి త్వరితముగ బోవలెనను తలంపులేక యచటనే స్థిరరూపముగ నుండెను! చించవడీ గ్రామమున నాగృహస్థు తిరిగి రాకపోవుటచే మరల నింకొకరినిబంపిరి. ఆతడును తిరిగిరానందున మూడవవానిని బంపిరి. ఆతడును దేహుగ్రామము జేరి తుకారామ్ జేయు కథ శ్రవణముజేసి యచటనే యుండెను. గణేశోపాసకుడగు విప్రుడమితాశ్చర్యమునొంది "తుకారామ్‌ను దీసికొని రాబోయిన ముగ్గురును తిరిగిరాలేదు. నదులుపోయి సముద్రములోగలిసి తద్రూపమగునట్లును, నానా పుష్పములలోని మకరందము వాయువులో గలిసి సమరసమగునట్లును, తుకారాంచేయు కథాకాలక్షేపములో లీనులై యుండవచ్చును, వారలు తుకారాంనకు వృత్తాంతమును దెలిపినచో నాతడు వచ్చుట కనుమానింపడు. మనమే వర్ణాభిమానమును త్యజించి యచటికిబోయి

తుకారాంను దర్శించి సంశయనివృత్తి జేసికొను టుచిత"మని తలచెను. అంతస్సాక్షియగు తుకారాం యీవిషయము నెఱిగి "గణేశోపాసకుడగు విప్రోత్తముడు పంపిన ముప్వురును వర్తమానమును దెలుపకయే యద్వైత స్థితిని బొంది యిచటనుండుటచే నచట బ్రాహ్మణోత్తములే స్వయముగా బయలుదేరి వచ్చుచున్నారు. మనము స్వయముగాబోయి వారిని దర్శింప టుచిత"మని తలంచి తత్క్షణమే బయలుదేరెను.

తుకారాం భగవన్నామస్మరణ జేయుచు చించవడీ గ్రామము బోవుచుండగా మార్గమధ్యమున గణేశోపాసకుడగు విప్రుడు కనబడెను. తుకారామాతనికి సాష్టాంగ నమస్కారము జేయ ధరామరు లాతనికి ప్రతి నమస్కారము జేసి "నీవు సాక్షాద్విష్ణుభక్తుడవు నిన్ను దర్శింప కుతూహలులమై వచ్చుచున్నాము. మా మనోరథము పూర్తియైన"దని చెప్పి యాతని నాలింగనము జేసికొని పిదప నెల్లరును కూర్చుండి కుశల ప్రశ్నలు జేయుచుండిరి. గణేశోపాసకుడగు నావిప్రుడు తుకారాంతో "ఓ భక్తశిఖామణీ! మీరీ కలియుగమున మానవ రూపమున నవత రించి యత్యద్భుతములగు లీలలను జూపుచున్నారు. మేము నేత్రములతో జూచి విస్మితచిత్తులమైతిమి. మీతో నేకాంతముగ గొన్ని విషయము లను జర్చింపదలచి వచ్చితిమి. మీరెవరో మాకు దెలుపు"డని యడిగిరి. ద్విజవరుల వచనములువిని వీరికేదైన దృష్టాంతము జూపువరకు సంశయ రహితులు కారని తలచి "విషయమును దెలిసికొను"డని చెప్పి కత్తిని దీసి తన తొడనుజీల్చి చూపెను. అందు రక్తమాంసములులేక దూదితో నిండియుండుటనుజూచి విప్రోత్తము లాశ్చర్యముతో శరీరములోపల రక్తమాంసాదులులేనిది చైతన్య మెట్లున్నది! ఈతనిది పాంచభౌతిక శరీర మనుట కవకాశము లేదని విప్రులెల్లరు నిశ్చయించి యనుభవ పూర్వకముగ "ఈతడు సామాన్య మనుష్యుడుకాడు. నిశ్చయము శ్రీ జగద్గురువే యిట్లవతరించె"నరి తెలిసికొనిరి. స్పర్శవేదిని పాషాణ మనుటయు, కనకమును సామాన్య ధాతువనుటయు. కల్పవృక్షమును సహజ వృక్షమనుటయు. సముద్రమును సాధారణ సరోవరమనుటయు,

మేరుపర్వతమును రాతికొండ యనుటయు, నవివేకమగునట్లు తుకారాంను మనుష్యమాత్రునిగా భావించుట యవివేకము. పక్షిజాతిలో నిజభక్తుడగు గరుత్మంతుడు జన్మించినట్లు శూద్రజాతిలో తుకారాం జన్మించెనని యుపమానముగా దలచుట యోగ్యముగ గనబడుటలేదు. గరుత్మంతుడు విష్ణునకు వాహనమై తనశరీరమును పావన మొనర్చుకొనెను. తుకారాం హరినామ సంకీర్తనజేసి జడజీవులను సంపూర్ణముగ నుద్ధరించెను. భవిష్యత్కాలమందును నీతడు రచించిన యభంగములను పారాయణము చేయుటచే సజ్జనులు సహితము భావుకజనులు కాగల”రని చెప్పి యా విప్రోత్తముడు తుకారాంనకు సాష్టాంగ నమస్కారము జేసి యాతని పాదములను తన మస్తకముపై నుంచుకొనెను. తుకారాం విప్రోత్తమునితో “భూదేవా! మీ రనుచితము జేయుచున్నారు. మీరు పూజనీయులగు దేవబ్రాహ్మణులు. నేను హీనజాతియందు జన్మించిన యనాథుడను. నాకు మీరు సాష్టాంగ నమస్కారము జేయు టనుచితమై యున్న”దని చెప్పగా నా విప్రోత్తముడు “విష్ణుభక్తులను నీచజాతివారని వర్ణింపరాదని శ్రుతివాక్యము. వానరులు రామసేవయందు తత్పరులైరి. వాల్మీకి భవిష్యద్రామాయణమును రచియించెను. గోపికలకీర్తి యత్యద్భుతముగ శ్రీ వ్యాసులు భాగవతమునందు వర్ణించిరి. విష్ణుభక్తుల యొక్క యత్యద్భుత కీర్తి త్రిభువనములందును వ్యాపించి యున్నది. కాన నాకు మిమ్ము స్తోత్రము జేయుట కధికారమున్నది. బహుదినముల నుండి మీతో నేకాంతముగ సంభాషింపదలచి నేడు మా మనోరథమును పూర్తిజేసికొంటిమి. చించవడి కేతెంచి తా మొకరాత్రి కథాకాలక్షేపము జేయవలె”నని కోరెను. ఆతనివెంటనున్న నగరవాసులును తుకారాం కథాకాలక్షేపమునువిని సార్థక జన్మలమగుదుమని చెప్పిరి.

లోహాగ్రామస్థులచటనుండి తుకారాంను తీసికొనిపోయి ప్రేమతో నాతడుచేయు హరికథా కాలక్షేపమును శ్రవణము జేయుచుండిరి. అచ్చటగల భావుకులు విశేషముగ ద్రవ్యమును తెచ్చించి దివ్యమగు పందిరివేయించి సభాస్థలము నలంకరించి కథా ప్రారంభ

మున సుగంధ చందనాదులతో తుకారాంను బూజించి పుష్పహారములు వేయుచుండిరి. సజ్జనులు నానావిధములగు మధురపక్వాన్నములతో బరిసర గ్రామములనుండి కథాశ్రవణమునకై విచ్చేయు శ్రోతలకును, నా గ్రామమునగల యనాథ దీనజనులకును సమారాధన జేయుచుండిరి. 'లోహా' గ్రామమొక నెలదినములు మిగుల వైభవముగ మహాపర్వకాలములందునటె నుండెను. ఆ గ్రామమునగల జనులెల్లరును రాత్రి యంతయు తుకారామ్ చేయుకాలక్షేపమును శ్రవణముజేయుచు పగలంతయు నిద్రించుచుండిరి.

పంఢరీపురమున వసించు హరిదాసొకడు దేశాటనజేయుచు నశ్వారూఢుడై 'లోహా' గ్రామమున బ్రవేశించి యచటిజనులెల్లరును పగలు నిద్రించుచుండుటచే నత్యాశ్చర్యమునుబొంది యచట నొక వర్తకుడు మేల్కొని యుండుటనుజూచి యాతని యొద్దకుబోయి "మీ గ్రామస్థులెల్లరును పగలు నిద్రించుచున్నారేమి? నాకాశ్చర్యముగనున్నది. కారణము దెల్పు" మని యడిగెను. అంత నా వర్తకుడు హరిదాసుతో "అయ్యా! ఒక నెలదినములనుండి మహాభక్తుడగు తుకారాం మీ గ్రామమున హరికథాకాలక్షేపము జేయుచున్నాడు. సర్వప్రజలు రాత్రియంతయు జాగరణజేయుచు పగలునిద్రించు టభ్యాసమైన" దని చెప్పగా నా హరిదాసు చింతాక్రాంతుడై "ఈ గ్రామమున మనకేమియు సన్మానము జరుగదు. తుకారాం చెప్పు కథను విడచి నేనుచేయు కథాకాలక్షేపమును వినుట కెవరువత్తురు? మధురమగు గానమునువిడచి డప్పువాద్యమును వినుట కెవరును బోనట్లును, నమృతముండగా దానినివిడచి యౌషధము నెవరును సేవింపనట్లును, నమూల్యములగు రత్నములుండగా గాజురాళ్ళ నెవరును గ్రహింపనట్లును, సూర్యు డుదయించినపిదప దీపప్రకాశము నెవరును గోరనట్లును, ప్రక్కగా గంగానది ప్రవహించుచుండ బావియొద్ద కెవరును బోనట్లును, మధురవాక్యములతో గూడియున్న తుకారాంచేయు హరికథను విడచి నా గానమును వినుట కెవరువత్తురు. ఇచట నేమియు లాభములే" దని నిరాశజెంది యింకొక నగరమునకు

బోవుట కుద్యుక్తుడయ్యెను. ఈవృత్తాంతము తుకారాంనకు దెలిసి తత్క్షణమే పోయి హరిదాసునకు సాష్టాంగనమస్కారముజేసి "తమరు గ్రామమునకు దయచేయుడు. మీరు పంఢరీక్షేత్రమున వసించు హరిదాసులు, మీ దర్శనమువలన నా కమితానందమైన"దని చెప్పి యాతని నాలింగనముజేసికొని గ్రామములోనికి దీసికొనిపోయెను. హరిదాసు తుకారాంనకు నమస్కారముజేసి "ఓ భక్తశిఖామణీ! వైశాఖమాసమున నాపుత్రుని వివాహము జరుగనున్నది. నేను దేశాటనజేయుచు ద్రవ్యాపేక్షచే నిచటకు వచ్చితిని. మీ రీ గ్రామవాసులకు దెలిపి నా కుమారుని వివాహమున కుచితరీతిని ద్రవ్యసన్మానము జేయింపు" డని కోరెను.

తుకారాం 'లోహాో' గ్రామస్థులకుజెప్పి హరిదాసునకు వసతులను కల్పించెను. ఆతడు భోజనముజేసికొని రాత్రిసమయమున తుకారాం చేయు కీర్తనలలో బాల్గొనుచు గొన్నిదినము లానందముతో నచట గాలము గడిపి తాను స్వస్థానమునకు బోవుట కాజ్ఞనిమ్మని తుకారాంనడిగెను. తుకారా మా గ్రామమునగల భావుకజనులను బిలిపించి "ఈబ్రాహ్మణున కుచితరీతిని మీమీ శక్త్యనుసారము ద్రవ్యమునర్పించి యాతనికుమారునివివాహముచేయించి పుణ్యమునుబొందు"డనిచెప్పెను. గ్రామస్థు లవశ్యమనిచెప్పి యుత్తమ మధ్యమ కనిష్ఠతరగతులుగ గ్రామములో చందాపట్టీని వ్రాసిరి. అందుత్తమతరగతివా రొకరూప్యమును, మధ్యమతరగతివా రర్ధరూప్యమును, కనిష్ఠతరగతివా రొక పావు రూప్యమును నీయవలయునని చందాపట్టీలో వ్రాసిరి. గ్రామస్థులు పట్టీప్రకారముగా చందా వసూలుచేసిరి. కాని యొక నిందకుడుమాత్రము నేమియు నీయక నిందించుచుండెను. గ్రామస్థులు చందా వసూలుకాబడిన ద్రవ్యమును మీహస్తముతో హరిదాసునకు సమర్పింపుడని తుకారాంను కోరిరి. అంత తుకారా మెవరిద్రవ్యము వారే సమర్పింపుడని చెప్పగా గ్రామస్థులు "అయ్యా! గ్రామమున నెల్లరును చందాలిచ్చిరి. కాని యొక నిందకుడుమాత్ర మేమియునీయలే" దని చెప్పగా తుకారాం




పంఢరీ పురమునుండివచ్చిన హరిదాసు
కథాకాలక్షేపము జేయుట.

"అయ్యలారా! నాప్రార్థన నా గృహస్థుని కెఱింగించి నీశక్తికి తగిన దే స్వల్పమైనను నీ ధర్మకార్యమున కీయుమని చెప్పి, యాత డిచ్చినదానిని ప్రేమతో దీసికొనరండు" డని చెప్పెను.

తుకారాం చెప్పినప్రకారము గ్రామస్థు లా గృహస్థునియొద్దకుబోయి యాతనితో నీ వృత్తాంతమంతయు దెలుపగా నాతడు "నాగృహమునకు వచ్చుపని మీ కేమున్నది? వచ్చినదారినిపొం" డని తిరస్కారముగా బలికెను. అంత గ్రామస్థులు "పంఢరీపురమునుండి వచ్చిన హరిదాసు కుమారుని వివాహమునకై ధనసహాయమును గోరెను. తుకారాంనాజ్ఞ ననుసరించి గ్రామములోనివారెల్లరును తమతమ శక్త్యానుసారముగా చందాలిచ్చిరి. గ్రామమున మీరొక్కరుమాత్రము చందానీయనందున ప్రత్యేకముగా మీకొఱకై తుకారాం మమ్ముల బంపుటచే మేమువచ్చితిమి. తా మే స్వల్ప మిచ్చినను ప్రేమతో గొనిపోయెద" మని చెప్పిరి.

ఆగృహస్థుభార్య భర్తనుజూచి తుకారామ్ మహాభక్తుడు, ఆతని వచనమును పెద్దలెల్లరును శిరసావహించి పాలింతురు. మీరు హితవచనములైనను బలుకక మహాత్మునియాజ్ఞను నుల్లంఘించుచున్నారు. ఇప్పుడైనను వివేకచిత్తముతో నేమైన నిచ్చి పంపుటుచిత" మని చెప్పగా నామూర్ఖుడు క్రోధముతో "గృహమునగల పాత యోటిచెంబు"నిమ్మని చెప్పెను. భర్తవాక్యములనువిని యయ్యతివ సమాహితచిత్తురాలై యాచెంబును దీసికొనివచ్చి యిచ్చెను. జనులెల్లరును నాశ్చర్యచకితులై పాషాణహృదయుడగు నాతడిచ్చినదానిని ప్రేమతో నంగీకరించి దవాగ్ని శీతలమైనట్లును, కాష్ఠమంకురించినట్లును నేడీ మూర్ఖుని హృదయమున నౌదార్యము గలుగుటదృష్టము.) మనము పోయినకార్యము సానుకూలమైనదని యానందించుచు తుకారాం యొద్దకుబోయి యోటిచెంబు నాతనికిచ్చి జరిగిన వృత్తాంతమంతయు నెఱింగించిరి. తుకారామాపాత్రను దీసికొని "ఇది స్వర్ణపాత్రమై యున్నది. ఆతడు పరమమూర్ఖుడని మీరు చెప్పియుంటిరి.) మీరు దీనిని గమనింప" లేదని చెప్పగా జనులాతనితో "అది యిత్తడిపాత్ర"యని చెప్పి పరీక్షించి

చూడగా శుద్ధ సువర్ణముగ నుండుటగని విస్మిత మనస్కులైరి. "మహాత్ములయొక్క మహిమ విశేషములను వర్ణించుట కసాధ్యము. మూర్ఖుడిచ్చిన యీ యిత్తడియోటిపాత్ర తుకారాం హస్తస్పర్శచే సువర్ణమాయె"నని జనులెల్లరు పరిపరివిధముల తుకారాం మహిమ విశేషమును గొనియాడుచుండిరి. పిదప నా గ్రామస్థులు హరిదాసును బిలిపించి యాతని గళమున పుష్పహారమువేసి వస్త్రములను ద్రవ్యమును నర్పించిరి. తుకారాం హరిదాసుతో "ఈ గ్రామస్థు లుదారులు. వీరొసంగిన ద్రవ్యమును పరమప్రీతితో దీసికొనిపోయి కుమారుని వివాహము జరుపుకొను"డని చెప్పెను. హరిదాసు సంతోషముతో నా సన్మానములను దీసికొని స్వస్థానమునకు బోయెను. తుకారాం అచటనుండి స్వస్థానమునకుబోయి సన్మానపూజలను త్యజించి హృదయమున సర్వోత్కృష్టుని నిలిపి యఖండముగ హరినామ సంకీర్తన జేయుచుండెను.

అఱువదియేడవఅధ్యాయము సమాప్తము.

పరంజ్యోతిషే నమః.

---

# తుకారామ్ ధర్మాధికారియగు రామేశ్వరభట్టుకు ధర్మోపదేశము జేయుట

—♦ అరువది యెనిమిదవ అధ్యాయము ♦—

హే గోవర్ధనోద్ధారా! నీవు నీలమేఘమువలె శోభించు శరీరమును, దేదీప్యమానమై ప్రకాశించు రత్నఖచిత కనకకిరీటమును గలిగి బాలచంద్రునివలె శోభించుచున్నావు. శ్యామలశరీరముపై చందనపుపూతతోను, విద్యుల్లతతో సమమగు పీతాంబరములతోను, రత్నములవలె ప్రకాశవంతమగు దంతములపంక్తితోను, కౌస్తుభమణి ప్రకాశముతోను, కోమల తులసీమిశ్రిత పుష్పహారములతోను శోభించుచు సింహాసనముపై నిలువబడి, కటిన్యస్తహస్తుడవైయున్న నీ దివ్యస్వరూపమును యోగీశ్వరు లానందముతో సేవింతురు. నిన్ను శంకరుడు పూజించుచు నీ నామమును సదా జపించుచుండును. నిన్ను సకలదేవత లారాధించుచుందురు. నీవు భక్తరక్షణకై సగుణస్వరూపమును ధరించి వారలకు నానావిధముల సేవజేసి వారిని సర్వవిధముల రక్షించుచుందువు.

ఒకనాటిరాత్రి ప్రేమభక్తుడగు తుకారామ్ నిద్రించుచుండ శ్రీపంఢరీనాథుడు విప్రవేషమున తా నింద్రాయణీనదికి స్నానమునకు బోవుచుండగా నెదురైనట్లు స్వప్నమున సాక్షాత్కరింప తుకారా మాతనికి సాష్టాంగనమస్కారము జేసి "స్వామీ! భోజనమునకై నాగృహమునకు విచ్చేయుడని జెప్పగా నా విప్రుడు నాకొక పావుశేరు నెయ్యిబోసినచో నేను వత్తునని చెప్పెను. తుకారా మవశ్యమని చెప్పి యా విప్రుని గృహమునకు దీసికొనిపోయి జిజీబాయిని బిలచి "ఈ విప్రునికి పావుశేరు నెయ్యితో భోజనము వడ్డింపు" మని చెప్పగా నామె కోపోద్దీపితమానసయై "బ్రాహ్మణు నెక్కడినుండి తీసికొనివచ్చితివి? నే నెక్కడినుండి నెయ్యి దెచ్చి వడ్డింపవలె" నని కఠినముగా బలికెను. లీలానాటకసూత్రధారియగు భగవంతుడు తుకారామ్ మస్తకముపై తన యుభయప్రదహస్తముంచి తనపేరు బాబాజీయనియు, తనది కేశవచైతన్య, రాఘవచైతన్య

శిష్యపరంపరయనియు చెప్పి 'రామకృష్ణహరి' యని మంత్రోపదేశము జేసి తత్క్షణమే యంతర్ధానుడయ్యెను.) తుకారామ్ నిద్రనుండి మేల్కాంచి స్వప్నవృత్తాంతమును మననముజేసికొని సద్గురుసేవ జేయకయే యుపదేశపాత్రుడనైతినని యానందించెను. ఈవిధముగా మాఘ శుద్ధ దశమి గురువారమురోజున తుకారామ్‌నకు భగవంతుడు మంత్రోపదేశము చేసెను.

తుకారాం విశ్వాసముతో దివారాత్రములును 'రామ కృష్ణ హరి' మంత్రము ననుష్ఠించుచు నానావిధములగు నుపమానాలంకారములతో రసవంతమగు కవిత్వ మభంగములుగ వ్రాయుచుండెను. సభాగ్యులగు జనులాతడుచేయు కథాకాలక్షేపమును విని తల్లీనులగుచుండిరి. బ్రాహ్మణులు సహిత మాతని చరణములపైబడి ప్రణామములు చేయుచుండిరి. ఆ సమయమున 'వాఘోలి' గ్రామమునందు చతుర్వేద కోవిదుడై రాజసన్మానముల నొందుచున్న రామేశ్వరభట్టను ధర్మాధికారి యుండెను. ఆతడు తుకారాంయొక్క కీర్తివిని ద్వేషమనస్కుడై "ఆతడు శూద్రుడైయుండి కవిత్వము జెప్పుచున్నాడు. ఆతని కవిత్వమును ప్రజలామోదించుటవలన బ్రాహ్మణపూజ్యత తగ్గిపోవును. భక్తి మార్గమునకు ప్రాముఖ్యమును కర్మమార్గమునకు హానియు కలుగును. బ్రాహ్మణులాతని చరణములపైబడి ప్రణామములుజేయుట యభ్యాసమైనచో భవిష్యత్తులో ప్రమాదములు కలుగును. కాన దీనినివెంటనే యరికట్టవలె" నని తలచి శిష్యబృందముతోగలిసి 'దేహు' గ్రామముజేరి దివాణదారుని బిలిపించి "తుకారాం శూద్రుడు ఆతనికి శ్రుత్యర్థములను వర్ణించు నధికారములేదు. హరినామ సంకీర్తనయను మిషతో నామమాహాత్మ్యమును సభలలో కథారూపమున కాలక్షేపము జేయుచున్నాడు. అందుచే వైదిక ధర్మమునకు హాని సంప్రాప్తించుచున్నది. శూద్రుడు బ్రాహ్మణులచే నమస్కారము జేయించుకొనుట ధర్మవిరుద్ధము. కాన ధర్మరక్షణకై మేముచెప్పిన విషయములను మనస్సులో బాగుగ

యోచించి యాతనికి తత్క్షణమే గ్రామ బహిష్కరణ యాజ్ఞాపింపు” డని చెప్పి తుకారాంను బిలిపించెను.

ధర్మాధికారుల యాజ్ఞానుసారము తుకారాం సభాస్థలమున జేరి రామేశ్వరభట్‌కు నమస్కారమును జేయగా నాతఁడు ‘దూరముగా నుండుము. దూరముగానుండుము. నీవంటి యధర్మపరులను చరణముల తాకనీయక దూరముజేయుదు”నని చెప్పెను. అంత తుకారాం “నేన ధర్మపరుడనా? యని యడుగగా “అవును నీవధర్మపరుడవే. నీవలన జను లెల్లరును నీ బోధావచనములను విని నీ యభంగములను పఠించి యధర్ములగుచున్నా”రని చెప్పెను. తుకారాం ధర్మాధికారితో “ఓ భూదేవా! నావలన జను లధర్మపరులగుట యదార్థమైనదో నేనుచేసిన యపరాధమునకు తాము విధించుశిక్ష నానందముతో భోగించుటకు సిద్ధముగా నున్నాను. తాము నిష్కారణముగా నాపై నిందమోపుచున్నా”రని పలుకగా రామేశ్వరభట్ “నిందయా? భక్తి మార్గప్రచారముజేసి కర్మ మార్గమును నాశనము జేయుటకు కంకణమును ధరించి నట్లున్నావు. సిగ్గులేక తలపైకెత్తి ప్రత్యుత్తరము నిచ్చుచున్నావు. నామ మహాత్మ్య మును ప్రచారముజేయు మహాపాపివి నీవొక్కడివే బయలుదేరితివి” అని పలికెను.

తుకారామ్ పాండురంగదేవుని మనమున నిలుపుకొని ధర్మాధి కారితో “ఓ భూదేవా! పరమేశ్వరుని ప్రాప్తిబొందుటకు వివిధ మార్గము లున్నవి. కఠినమగు మార్గము కర్మ మార్గము. సులభమగు మార్గము భక్తి మార్గము. ఈశ్వరుని శోధించుటకు కఠినములగు యోగములను జేయవలెను. లేక వానిని ప్రసన్నునిగా జేసికొనుటకు పూజార్చనాది కర్మవిధు లాచరింపవలెను. ఈ యోగమార్గము సర్వజనులకు సహజ ముగ నాచరణ యోగ్యముకాదు. సహజముగ సర్వ సాధారణ జనులు భగవంతుని బొందుటకై భక్తిమార్గ మేర్పడినది. స్త్రీ పురుషులు చిన్న పెద్దలను భేదభావములేక సర్వకాలమందు పాత్రవిచారణలేకయే సర్వ జనులు నాచరించు మార్గమిదియైయున్నది. సర్వ సాధనములలో సులభమై

యాచరణ యోగ్యమైనది. హరినామ సంకీర్తన దీనివలన జన్మాంతరములలో జేసిన పాపములన్నియు భస్మములగును. గృహస్థాశ్రమమును విడచి వనాంతరములకును గిరగహ్వరములకును బోవలసిన పనిలేదు. తమ తమ పనిపాటలు చూచుకొనుచు, దారపుత్రాదులతో గృహస్థధర్మము నిర్వర్తించుచు చిత్తమును పరమేశ్వరునియందు నిలిపి యఖండముగ హరినామ స్మరణజేసినచో భగవంతుడు స్వయముగ గృహమునకేవచ్చి దర్శన మిచ్చును. ఇదిమా భాగవత ధర్మసిద్ధాంత"మని చెప్పెను.

రామేశ్వరభట్ కోపోద్దీపిత మానసుడై భాగవత ధర్మము! దీనివలన వైదిక ధర్మము నాశనము కావలెననియా! నీ యుద్దేశ్యము. తెలుపు"మని యడుగ తుకారాం రామేశ్వర భట్తో "ఓ వేదమూర్తీ! మీరు చెప్పువిషయము యుక్తమైనదికాదు. భాగవతధర్మము వైదిక ధర్మమునకంటె ప్రకాశవంతమై సర్వవ్యాపక మైనది. ఈశ్వరుడు సర్వవ్యాపకుడై యున్నాడు. సర్వ సాంప్రదాయముల వారును వేరు వేరు విధముల నాతని వర్ణించియున్నారు. మీరా యీశ్వరుని నిర్వికార, నిరాకారోంకారుడని వర్ణింతురు. మేమాతనిని సాకార, సవికార పాండురంగడని పలుకుదుము. వేద మనంతవిధముల వర్ణింప బడియున్నది. వేదార్థమును సంపూర్ణముగ శోధించిచూడ నిజమైన నిష్ఠతో భగవంతుని శరణుబొంది యాతని నఖండముగ సేవింపుమని తెలుపు చున్నది. సర్వ శాస్త్రముల విచారణయు నష్టాదశ పురాణముల సిద్ధాంతమును నిదియే యైయున్న"దని చెప్పెను.

రామేశ్వరభట్ తుకారాంనుజూచి యేహ్యముగ "ఇదియే, యిదియే, యని నీవు బాగుగ దెలిసికొంటివి. వేదార్థమును వర్ణించుట కధికారములేని శూద్రుడవగునీవు గుహ్యములగు వేదవచనములను వ్యతిరేకార్థముగ నభంగము లనుపేరుతో గవిత్వమును జెప్పుచున్నావు. శాస్త్రవిరుద్ధమగు నీ కవిత్వమువలన నీవును, నభంగములను పఠించిన వారును రౌరవనరకమును భోగింతురు. నేటినుండియు నీవు కవిత్వమును

జేయుటకు వీలులేదు. నీవు గొప్ప యపరాధివి. నీవు వ్రాసిన యభంగములను కథాకాలక్షేపరూపముగ జనులకు వినిపించుటకు వీలులే” దని చెప్పెను.

తుకారామ్ చేతులు జోడించి నమస్కారముజేసి తాము ధర్మాధికారులగు బ్రాహ్మణోత్తములు. కేవల మీశ్వరాంశసంభూతులు. ఇప్పటివరకు శ్రీ పాండురంగదేవుడు నావాక్కునుండి యే యపశబ్దములను బలికించినను భగవదాజ్ఞానుసారము నేనవి కథాకీర్తనరూపమున బోధించుచుంటిని. మీయాజ్ఞను శిరసావహించి నేటినుండి కవిత్వము చెప్పుట నిలిపివేసెద” నని చెప్పగా, రామేశ్వరభట్ తుకారామ్‌తో “ఓరీ! దుష్టుడా! ఇంతమాత్రముతో నిన్ను విడిచెదననుకొంటివా! నీవు లోగడ రచియించిన యభంగగ్రంధములన్నియు రాతిబండలతో గలిపి కట్టగా గట్టి యింద్రాయణీనదిలో పారవేయుము” మని చెప్పెను. తుకారాం తత్‌క్షణమే తమయాజ్ఞానుసార మట్లె వేయుదనగా ధర్మాధికారి “ఏపాపిహస్తములతో వ్రాయబడినవో యాతనిహస్తములతో నదీప్రవాహములో బడవేయుటయే తగినశిక్ష” యని పలికెను. తుకారాం మౌనముతో ప్రత్యుత్తరము బలుకక గృహమునకు బోయి యభంగగ్రంధములన్నియు దీసికొని ధర్మాధికారియు, గ్రామప్రజలును వెంబడింప నింద్రాయణీనదికి బోయెను. ఆగ్రామమున గల కుటిలులు సంతోషముతో “నీతడు కవిత్వముజెప్పి జగత్తులో గొప్ప పూజ్యతను, కీర్తిని బొందుటకై ప్రయత్నించెను అపరసూర్యుడగు రామేశ్వరభట్ యెదుట నీతని మోసము బయటపడినది. మహావిద్వాంసుడును, ధర్మాధికారియు నగు రామేశ్వరభట్ కొన్ని గ్రంథములైనను విడువక సంపూర్ణముగ నాతడు రచియించిన సర్వగ్రంథములను నదిలో గలిపించుచుండె” నని యానందించుచుండిరి. భావుకజనులు చింతాక్రాంతమానసులై తుకారాం పాదములపైబడి యశ్రుధారలను విడచుచు నదిలో గ్రంథములను బడవేయవలదని కోరుచుండిరి. కౌతుకమును జూచుటకై గ్రామమున గల జనులెల్లరును నదీతీరమున బ్రవేశించిరి.

తుకారాం నదిలో దిగి "ఓ పాండురంగా! నీ వాజ్ఞనిచ్చి నన్ను నిమిత్తమాత్రునిగనుంచి వ్రాయించిన యభంగముల నింద్రాయణీనదిలో గలుపుటలో నర్థమేమి? భక్తవత్సలుడవను నీబిరుదు నేటితో నంతరింప నున్నది. నీకొఱకై నే నాశాపాశములను ద్యజించి, లౌకికవ్యవహారములను విడచి, దారపుత్రాదులయం దాశలేక సంసారమును నీటగలిపి దివారాత్రములయం దఖండముగ నీ చింతన జేసినదానికా యీ ఫలము నీవు సర్వశక్తిమంతుడవు. నీయిష్టమువచ్చినట్లు చేయింపుము. నా వాక్కునుండి వెలువడిన గుణవర్ణన నీకు ప్రియముగ లేదు. అందుచే యిట్టుల చేయించితివి. నేను నీభక్తి నెట్లు చేయవలయును. నేను జీవితమంతయు జేసిన సేవను నీ చరణారవిందముల కర్పించుచున్నాను. నేను నా దేహము నిచ్చటనే త్యాగముజేయుదు" నని యా గ్రంథములను రాతిబండలతో గలిపికట్టి ప్రవాహమునవిడచి ఘట్టముపై తులసిబృందావనముప్రక్క గూర్చుండి దీక్ష నవలంబించెను. తత్క్షణమే యింద్రాయణీదేవి యా యభంగ గ్రంథములను స్వీకరించెను. రామేశ్వరభట్ తుకారాంనకు విధించిన యాజ్ఞవలన నాత డభంగగ్రంథముల నింద్రాయణిలో గలుపుటవలన (శ్రీ) పంఢరీనాథుడు క్షోభించెను. వణ కుంభకర్ణాదులు రాముని ద్వేషించి మోక్షమునుబొందిరి; కాని భక్తులను ద్వేషించువారలుమాత్రము శాశ్వతముగ రౌరవాది మహానరకములను భోగింతురు. పరమేశ్వరుడు భక్తరక్షణనిమిత్తమై గదా చక్రములను ధరించి యభక్తులను శిక్షించుచుండును. రామేశ్వరభట్ భాగవతాపచారమొనర్చుటచే నాతని సుకృతమంతయు నశించెను. ఆతడు గొప్ప తపస్వియు, చతుర్వేదాధ్యాయనపరుడునై యుండి రాజసన్మానములను బొందుచు, దేశపు ధర్మాధికారియైయుండి, భక్తుని ద్వేషించుటచే నాతని పుణ్యమంతయు నశించి, తాపవ్యాధి బయలుదేరెను. ఆత డెన్నిపర్యాయములు స్నానముజేయుచున్నను నది యధికమై సర్వాంగరంధ్రములనుండి యగ్నిజ్వాలలవలె తాపజ్వాలలు బయలువెడలుచుండెను. ఆతనిశిష్యులు రామేశ్వరభట్‌తో "అయ్యా! ఇది భాగవతాపచార దోషఫలితమువలె నున్న"దని చెప్పగా నాతడహంకారముతో "దేవబ్రాహ్మణులమగు మనకు

శూద్రునివలన నేప్రమాదమును జరుగ" దని పలికి దారుణమగు నా తాపబాధ నాతడు సహింపలేక యళందీక్షేత్రమునకు బోయి యజాన వృక్షచ్ఛాయను గూర్చుండి జ్ఞానేశ్వరులస్తోత్రము చేయుచుండెను.

ఆరాత్రి జ్ఞానేశ్వరులు రామేశ్వరభట్ స్వప్నమున సాక్షాత్కరించి "విప్రోత్తమా! భక్తులలో శ్రేష్ఠుడును, నామదేవావతారుడునగు తుకారాం జగదుద్ధారణకై భూలోకమున జన్మించెను. నీవాతని కపచారము జేయుటచే నీసుకృతమంతయు నశించి దేహదుఃఖమునకు కారణభూతముగ తాపవ్యాధి బయలుదేరినది. నీవు సద్భావముతో తుకారామును శరణుబొందితివేని నీకీ వ్యాధి తొలగును. విష్ణుభక్తుల కపచారము జేయు పాపమే పుణ్యకార్యముల జేసినను దొలగనేరదు. కాన నీవు తత్క్షణమే పోయి యావశ్యముగ నాతని శరణుబొంది సార్థకజన్ముడవు కమ్ము" అని చెప్పెను.

తుకారా మన్నాహారములను త్యజించి దీక్షలో నుండుటను శ్రీ పంఢరీనాథుడు జూచి బాలరూపమును ధరించి తుకారాం యొద్దకు వచ్చి యాతని వీపునదట్టుచు "నీవు చింతింపకుము సర్వవిధముల రక్షణకర్తనగు నేనుండ నీకేమియును భయములేదు. ప్రహ్లాదుడు నా నామమును జపించుచుండ నాతని హిరణ్యకశిపుడు సముద్రమునబడద్రోసియు, పర్వతములనుండి దొర్లించియు, నగ్నిగుండములలో వేసియు, నానావిధముల హింసించెను. నేనంత హస్తములతో నవియన్నియు నివారణచేసితిని. ఉన్మత్తమగు గజమును ప్రహ్లాదునిపై విడచిపెట్ట నేనా సమయమున గజమునకు ప్రహ్లాదుని సింహరూపునిగా జూపగా నది యరణ్యమునకు బలాయనమయ్యెను. ప్రహ్లాదునిపై సర్పములను విడువగా నేను సర్పములకు ప్రహ్లాదుని గరుడరూపునిగా జూపితిని. అంత్యమున నాతనికి విషమునిచ్చిరి. ప్రహ్లాదుడావిషమును నామస్మరణ జేయుచు పానము జేయుటచే నది యమృతమయ్యెను. ప్రహ్లాదుని కోరిక ననుసరించి నేను నరహరి రూపమును ధరించి సభాస్తంభమునుండి యావిర్భవించితిని.

భక్తుల విషయములలో నేనుచూపు నత్యద్భుతములగు లీలావైభవములు నీకు దెలిసియుండియు చింతించెద వేల? ధైర్యము వహింపుము" అని చెప్పి భగవంతు డంతర్ధాను డయ్యెను.

తుకారాం పదమూడు దినములు దివారాత్రములందు నన్న పానీయాదులను వర్జించి యా తులసిబృందావనము ప్రక్కనుండి లేవక దీక్షలోనుండగా పదమూడవ నాటిరాత్రి యా గ్రామములోని భావుక జనులకు స్వప్నమున శ్రీ విఠ్ఠలనాథుడు సాక్షాత్కరించి "తుకారాం రచించిన యభంగగ్రంథములను నే నింద్రాయణీనదిలో గాపాడు చున్నాను. రేపటి ప్రభాతసమయమున నా యభంగ గ్రంథముల నింద్రాయణీదేవి తుకారాంన కర్పించును. కాన మీరు నదీతీరమునకుబోయి కౌతుకమును జూడు"డని చెప్పి యంతర్ధానుడయ్యెను. భావుక జను లెల్లరు స్వప్నవృత్తాంతమును తలంచుకొని యానందించి ప్రాతః కాల సమయమున కింద్రాయణీ నదికిబోయిరి. ఈ వార్త గ్రామమునవ్యాపించి యసంఖ్యాకులగు స్త్రీ పురుషులతో నింద్రాయణీ నదీతీరమంతయు నిండి యుండెను. ఇంద్రాయణీదేవి యా సమయమున సాక్షాత్కరించి యభంగ గ్రంథములను దీసికొని వచ్చుచుండెను. జనులెల్లరును జయ జయ ధ్వనులుజేసిరి. తుకారా మాసమయమున నేత్రములు విప్పి చూడగా తనయెదుట నింద్రాయణీదేవి నిలువబడి యుండుటయు, నామె హస్తమున నభంగ గ్రంథములుండుటను గాంచి యమితానంద భరితు డయ్యెను. ఇంద్రాయణీదేవి యభంగ గ్రంథములను తుకారామ్‌నకిచ్చి యాతని మస్తకముపై తన యభయహస్తమునుంచి కృపాదృష్టితో వీక్షించి యంతర్ధాన మయ్యెను.

రామేశ్వర్ భట్ దినదినము తాపవ్యాధి యధికమై దుస్థితిని బొంది విలపించుచు తుకారాం యొద్దకువచ్చి యాతని చరణారవిందము లను బుచ్చుకొని సాష్టాంగనమస్కారము జేయగా తత్క్షణమే యాతని తాపవ్యాధి చల్లారెను. రామేశ్వరభట్ పశ్చాత్తప్తచిత్తుడై "నేను

గొప్పయపరాధమును జేసితిని, నా సర్వాపరాధములను క్షమించి మీ శిష్యునిగా నంగీకరింపు"డని తుకారాం పాదములపై బడెను. తుకారా మాతని కృపాదృష్టితో జూచి "తన చేతనున్న యభంగగ్రంథములనాతని కిచ్చెను. రామేశ్వరభట్ నదీతీరమునగల యసంఖ్యాకులనుజూచి "భగవంతున కంతరంగభక్తుడగు తుకారాం నామదేవుల యవతారుడని మీ రెల్లరును దెలిసికొను"డని చెప్పి పల్లకీనొకదానిని రప్పించి యభంగ గ్రంథముల నందుంచి నానావిధములగు మంగళ వాద్యములతోను, భక్తులుచేయు హరినామ సంకీర్తనలతోను, విప్రోత్తముల స్వస్తివచనములతోను, నగర వాసులగు నాబాలవృద్ధులు వెంబడింప నఖండ వైభవముతో నభంగములను నూరేగించి రామేశ్వరభట్ తుకారాంన కర్పించి యాతని శరణుబొంది యాతనియొద్ద మంత్రోపదేశమునొంది శిష్యుడయ్యెను. అమృతసరోవరమున రోగము ప్రవేశింప వలనుపడనట్లును, సూర్యుని గృహమున నంధకారము ప్రవేశింపజాలనట్లును, చంద్రునకు తాపము బాధింపనట్లును, విష్ణుభక్తుల కరిష్టములు బాధింపవని జనులెల్లరు బరస్పరముగ జెప్పుకొనుచుండిరి. అంధునకు నేత్రములువచ్చిన నానందించునట్లు, తుకారాం హృష్టచిత్తుడై శ్రీ పంఢరీనాథుడు తన యభంగ గ్రంథములను రక్షించినందులకు భగవంతుని పరిపరివిధముల కీర్తించుచుండెను.

ఆరువది యెనిమిదవ అధ్యాయము సమాప్తము.

యాదవేంద్రాయ నమః.



# తుకారామ్ శరీరముతో వైకుంఠమునకు బోవుట

—♦ అరువదితొమ్మిదవ అధ్యాయము ♦—

హే గోపీజనవల్లభా! నే ననాథుడను; నిరాశ్రయుడను; మూఢుడను; భక్తిహీనుడను; జ్ఞానహీనుడను, శక్తిహీనుడనైయుండి వైరాగ్యములేని జడమూఢుడనైయుంటిని. నీవుతప్ప నన్ను రక్షించువారెవరును లేరు. నేను నిన్నాశ్రయించితిని. నీ కీ యభిమానముండవలెను. అమంగళములగు మురికికాలువలలోని జలము కూపములోనికి విడచిన యా కూపములోనున్న జలమంతయు నాశనమై ప్రాశనమునకు నిరుపయోగమగును. కాని ఆ మురికికాలువలే గంగలోగలిసిన పవిత్రమై సర్వజనవంద్యమగును. అట్లే నేను సర్వవిషయములలో బతితుడనై నిన్ను శరణుబొందితిని. కాన నన్నంగీకరింపుము.

ఒకనాడు శ్రీ పంఢరీనాథుడు తుకారామ్‌నకు సాక్షాత్కరించి "నీవు గతజన్మమున సంకల్పించిన శతకోటియభంగములు రచియించుట పూర్తయైనది. నీవు భూలోకమున జన్మించి విశ్వోద్ధారణజేసితివి నీవు వ్రాసిన యభంగములను పారాయణజేసి జడమూఢులుసహితము తరించుటకు మార్గమును జూపితివి. అపారమగు నీ సేవారుణమున నేను బంధింపబడియుంటిని. గృహస్థాశ్రమధర్మమున నీవుప్రథమమునుండి నానావిధముల గష్టపడితివి. నీవు దరిద్రుడనై యుండుటచే జనులెల్లరు నిన్ను మిగుల నీచముగజూచిరి. నీ పెద్దభార్యయగు రఖుమాబాయి తినుట కన్నములేక మృత్యుముఖయయ్యెను. నీ కఖండముగ సిరి ననుగ్రహించి లౌకికమర్యాదలలో సుఖింపజేయవలెనని కోరిక నాకున్నది. నీ యవతార కార్యక్రమము పూర్తియైనది. వలయు వరము వేడు" మనగా తుకారామ్ చేతులు జోడించి "ఓ దేవాధిదేవా! నాకు ధనమాన సంతానములు, నాయువును, మంత్రతంత్రాదులును, విద్యయు ననుగ్రహింపకుము. నే నఖండముగ నీనామమును భజించుచు ప్రాణమును విడచున

ట్లనుగ్రహింపు" మని కోరగా, శ్రీ పంఢరీనాథుడు హసితవదనుడై "నీ కోరిక మిగుల విపరీతముగనున్నది. నీవు ప్రాపంచికభోగములందు విముఖుడవైనచో వైకుంఠ కైలాసములను గోరు మిచ్చెద" నని చెప్పెను. అంత తుకారామ్ భగవంతునితో "ఓ భక్తకామకల్పద్రుమా! నేను గర్భవాసమునకు వెరచువాడను కాను, జన్మరాహిత్యము కావలయునని కోరువాడను కాను, నీ యాజ్ఞానుసారము భూలోకమునం దెన్నిపర్యాయము లైనను జన్మించి నీ చరణసేవలోని సామర్థ్యమును లోకమునకు జాటెద" నని చెప్పెను.

శ్రీ పంఢరీనాథుడు తుకారామ్‌నుజూచి "నిన్నిక నా సాన్నిధ్యమునకు గొనిపోయెదను. రేపటిదినము ప్రాతఃకాలమున మొదటిజాము నందు నీకొఱకై పుష్పవిమానమువచ్చును. నీవం దధిష్ఠించి వైకుంఠమునకు రావలె" నని చెప్పి యంతర్ధానమయ్యెను. భగవంతుడు తుకారామ్‌నకు వైకుంఠవాసమునం దిచ్ఛలేకుండుట నెఱింగి యాతనిదృష్టికి వైకుంఠవైభవమును జూపుచు మోహితునిగాచేసెను. ఆరాత్రి యఖండముగా తుకారామ్ హరినామస్మరణ జేయుచుండెను. అసంఖ్యాకులగు భావుకజనులును, నితరప్రజలును జేరి యాతని కథాకాలక్షేపమును శ్రవణముజేయుచు నత్యానందమును బొందిరి. ఆసమయమున తుకారామ్ "రేపటిదినము మొదటిజామున నేను వైకుంఠమునకు బోయెద" నని శ్రోతలతో చెప్పెను. ఆ రాత్రియంతయు జాగరణతో కథాకాలక్షేపము జరుగుచుండెను.

విక్రమార్క-శకము 1573 వ సంవత్సరమునకు సరియగు విరోధి నామసంవత్సర ఫాల్గుణ బహుళ విదియ సోమవారమురోజున ప్రాతఃకాలమున తుకారాం యింద్రాయణీనదిలో స్నానముజేసి, నిత్యానుష్ఠానములను బూర్తిచేసికొని జిజీబాయినిజూచి "నేనిక వైకుంఠమునకు బోయెదను, నాస్థితి యెట్లున్నదనగా నేను నావాడను కాను, మీవాడను గాను. నేనువిఠ్ఠలుడనైతి" నని చెప్పగా జిజీబాయి "ఇల్లు, వాకిలి, భార్యను,

బిడ్డలను విడచి యెప్పుడును వైకుంఠమునకు పోయెదనని పలికెద" రని చెప్పెను. అంత తుకారాం జిజియా! నీను నేకు యదార్థమును జెప్పు చున్నాను. నీ వన్ని యాశలను త్యజించి నాతో వైకుంఠమునకు రమ్ము. ఐహికసంసారము నందు నాహస్తమును బుచ్చుకొని ప్రాపంచిక వ్యవహారములన్నియు నీవే నిర్వహించితివి. ఈసమయమున నేను నిన్ను వెంట బెట్టుకొని వైకుంఠమునకుబోయి మన మిరువురమును నచటి యానంద మును భోగించుట నాధర్మమైయున్నది. నీవు ప్రపంచవ్యవహారములన్ని యును సాధించి నా యాయువునంతయు నేను పరమార్థసాధనలో విని యోగించుట కవకాశమును గల్పించితివి. నీవే నాకు భార్యవై యుండ నిచో నాకు మహత్తరములగు నీ దినములు సంప్రాప్తించవు. సంసార మున పతి నిష్ఠతో స్వకర్తవ్యమును నిర్వహించిన నిన్ను నేనాయుర్దాయ మంతయు వ్యయముచేసి సాధించిన పరమార్థఫలితమగు మహోత్కృష్ట మగు నానందమును భోగించుక్షణ మాసన్నమైనది. ఈసమయమున నిన్ను నావెంట దీసికొనిపోవుట, నా కర్తవ్యమైయున్నది. అవినాశమగు నా యానందము నొకపర్యాయము నీవు కంటితో జూచితివేని నీకు మధురముగనున్న ప్రపంచానందము కంటకముగ, విషప్రాయముగ నుండు" నని చెప్పెను.

అంత జిజీబాయి "బాగుగ జెప్పితిరి. నేనుకూడ మీతో గం తులువేయుచు భజన జేసియుండినచో సంసారము నీటగలిసి యుండె డిది. నా కా యానంద మక్కరలేదు. అక్కడేమున్నది? ఇల్లు, బిడ్డలు, పశువులు, నక్కడున్నవా? నేను మీతో జెప్పుచున్నాను. వైకుంఠము నకు బోయెదనని పదేపదే చెప్పవలదు. ఇష్టమైనచో బోవుడు. మరల తిరిగిరండు. నేనును మీరు తిరిగివచ్చినపిదప గ్రామదేవతకు పొంగలి నైవేద్యము పెట్టెదనని మొక్కెదను. మా పుట్టింటి వారిచ్చిన గేదె యీనునోజులు. బిడ్డలను గేదెను విడచి నేను వచ్చినచో సంసారము నాశనమగు"నని పలికెను.

తుకారాం భగవంతుని మనమున దలచి "ఓ పాండురంగా! ఈమెను సర్వవిధముల గాపాడు"మని ప్రార్థించెను. ఇంతలో గ్రామములోగల భావుకజనులెల్లరు నచటజేరిరి. తంబుర తాళమృదంగాది వాద్యములతో హరినామ సంకీర్తనము ప్రారంభముజేసి యచటగల జనులనుజూచి తుకారాం "మీ యందరికి నాయంతిమ ప్రార్థన యేమనగా సుఖముగా సంసారముజేయుచు పరబ్రహ్మమునందు చిత్తము నిలుపుడు అఖండ నామసంకీర్తనవలన నిస్సంశయముగ భగవత్ప్రాప్తి లభించునని నేననుభవమున దెలిసికొంటిని. శుద్ధచిత్తముతో భగవన్నామ స్మరణజేసినచో నేకీభావ ముత్పన్నమై మోక్షప్రాప్తి కొందెద"రని చెప్పెను ఆ సమయమున వైకుంఠమునుండి దేవతాపుష్పక విమానము బయలుదేరెను. ఘంటానాదము మ్రోగింపబడుచుండెను. పుష్పవిమానమునకుగల గంటలు విమాన చలనముచే మ్రోగుచుండెను ఆవిమాన శబ్దము జనులెల్లలకు వినబడుచుండెను.

శ్రీ పంఢరీనాథుడు గరుడ వాహనారూఢుడై శంఖ చక్రములను తేజోవంతమగు రత్నకిరీటమును, మకర కుండలములను, వైజయంతీ మాలను, దివ్యపీతాంబరములను, తులసీమిశ్రిత కోమల పుష్పహారములను ధరించి తుకారామునకు మాత్రము దర్శన మిచ్చెను. తుకారాం భగవంతుని స్నేహోత్సవముగా సేవించి "నా గృహామునకు వైకుంఠపీఠము వచ్చినది" అని యానందించుచు భావుక జనులతోగలిసి యఖండముగ హరినామ సంకీర్తన జేయుచు నింద్రాయణీ నదీ తీరమును జేరెను. గ్రామమున గల యాబాలవృద్ధులు తుకారాం వైకుంఠమునకు బోవుచున్నాడను వార్తవిని కౌతుకమును జూచుటకై నదీతీరమునకు చేరిరి. ఇంతలో వైకుంఠములో బయలుదేరిన పుష్ప విమాన మచట దిగెను.

తుకారాం భావుక జనులెల్లరకు వందనముజేసి "నేను నా స్వస్థానమునకు బోవుచున్నాను. నే నిప్పటివరకు మీ గ్రామమున నుంటిని.

నావలన జరిగిన లోపములన్నియు క్షమించి పూర్ణకృప నుంచుడు. మిమ్ములనందరిని నేను ప్రార్థించున దేమనగా భగవన్నామమును మీరు విడువక యఖండముగ భజించి భగవత్సాయుజ్యమునకు రండు. మధు మాధుర్యము నాస్వాదించిన తేనెటీగ తిరిగిరానట్లును, గంగాప్రవాహము సాగర సంగమయినపిదప మరల వెనుకకు రానట్లును, నేను మరల నిచటికి వచ్చుట జరుగనేరదు. భూలోకమున మానవులకొరకు పంఢరీక్షేత్రము వైకుంఠముగనున్నది. మీరు నియమముతో నఖండముగ హరినామ సంకీర్తనజేయుచు పతాక హస్తులై యాత్రజేయు చుండుడు. నేను బహుదూరముననున్న వైకుంఠమునకు బోవుచున్నాను"అని చెప్పి 'రామ కృష్ణ హరి'యను నామము నుచ్చరించుచు విమానములో గూర్చుండి పాంచభౌతిక శరీరముతో వైకుంఠమునకు బోయెను.

అరువది తొమ్మిదవ అధ్యాయము సమాప్తము.

వనమాలినే నమః.



# తుకారామ్ వైకుంఠమునుండి
# పంపిన అభంగములు

—♦ డెబ్బదియవ అధ్యాయము ♦—

తుకారాం దేవతా పుష్పకవిమానములో గూర్చుండి పాంచభౌతిక శరీరముతో వైకుంఠమునకు జేరెను. ఆతడు వైకుంఠము జేరిన మూడవదినమున దృష్టాంతముగ బంద్రెండభంగములు లిఖించిన తాళపత్రమును, తన యుత్తరీయమును, భజనజేయు చిరుతలను, మూటగట్టి భూలోకమునకు బంపెను. అవి దేహుగ్రామములో (శ్రీ) పాండురంగ దేవాలయమున కెదురుగ పడెను. భావుకజను లవి తీసికొనిపోయి (శ్రీ) పంఢరీనాథుని సమ్ముఖమున నుంచిరి. (శ్రీ) పంఢరీనాథుడు తానొకరెండభంగముల నిచ్ఛామాత్రమున జేర్చెను. అనసూయాసుతుడగు దత్తాత్రేయుడు స్వేచ్ఛతో భూలోకమున దర్శనమిచ్చుచుండునట్లు నిజభక్తులకు తుకారాం భూలోకమున దర్శనమిచ్చుచుండును. ఈవిషయమై సంతోయిందు బహిణాబాయి తుకారాం వైకుంఠము జేరినపిదప కొంతకాలమునకు నిజస్వప్నమున సాక్షాత్కరించి యుపదేశించెను. చిరంజీవియు, జగద్గురువగు తుకారాం శుద్ధచిత్తులగు భావుకులకు దర్శనమిచ్చుచుండును.

♦ తుకారాం వైకుంఠమునుండి పంపిన పండ్రెండభంగములు ♦—

౧

జన్మచే తే మూళపాహీ లే శోధూన। దుఃఖాశి కారణజన్మఘ్యావా ॥
పాప పుణ్యాకరూని జన్మయేతో ప్రాణీ । నరదేహీ యేఉనీ హానీకేలీ ॥
రజతమసత్వ ఆహేజ్యాచే అంగీ । యాచే గుణీజగీ వాయాగేలా ॥
తుమమ్హణజేకాయ నరకచీ కేవళ । రజతో సబళమాయాజాళ ॥
తుకామ్హణే యేథే సత్వాచే సామర్థ్య । కరావయా పరమార్థ అహర్నిశీ॥

తుకారాం పాంచభౌతికశరీరముతో వైకుంఠమునకు బోవుట.



తుకారాం పాంచభౌతికశరీరముతో వైకుంఠమునకు బోవుట.

తా॥ జన్మమునకు మూలమేమని శోధించి చూచిన దుఃఖమే కారణమని విశదమగుచున్నది. ప్రాణులొనరించిన పాప పుణ్యములవలన జన్మ లభించుచున్నది దుర్లభ మానవదేహము లభించియు, తిరిగి హానియే సంపాదించుచున్నారు. పాపము జేసినవారలు నరకలోకము నందు దుఃఖము ననుభవింతురు. పుణ్యము జేసినవారు స్వర్గలోకమున స్వర్గసుఖ మనుభవింతురు, పాపపుణ్యములు జేసినవారు భూలోకమును మనుష్యదేహము ధరించి తత్ఫలముగ సుఖదుఃఖముల ననుభవించుచున్నారు. జగత్తులో మూడుగుణములు (రజోగుణము, తమోగుణము సత్వగుణము) వ్యాపించియున్నది. తమోగుణము హింసాకార్యము లొనరింపజేసి నరకమునకు పంపుచున్నది. రజోగుణము మాయాజాలము ధనేషణ, దారేషణ, పుత్రేషణలయందమిత మోహమును కలిగింపజేయుచున్నది. సత్వగుణము సమర్థమైనది. సత్వగుణముతో బరమార్థ మాచరింపుడని తుకారాం చెప్పిరి.

౨

అహర్నిశీ సదా పరమార్థ కరావా । పాయనఠేవావా ఆడమార్గీ ॥
ఆడమార్గీ కోణీ నర జే జాతీల । త్యాంతూన కాఢీల తోచీజ్ఞానీ ॥
తోచీజ్ఞానీ ఖరా తారీ దుజీయాసీ । వేళో వేళా త్యాసీ శరణజావే ।
ఆపణత తరేల నహ్వే తేనవల । కుళే ఉద్ధరీల సర్వాచీ తో ॥
సరణగేలియా తేకాయహోతే ఫళ । తుకామ్హణే కుళ ఉద్ధరీలే ॥

తా॥ చెడుమార్గములందు ప్రవేశించక అహర్నిశమును పరమార్థ మాచరింపుము. చెడుమార్గములో నుండువారి నా మార్గము తొలగించి సన్మార్గము జూపువారు జ్ఞానులు. యధార్థముగా జ్ఞానులు పరుల తరింపజేయుదురు. కాన వారిని సర్వవేళలయందును శరణుపొందుము. తాము తరించుట విశేషముకాదు. అనేకప్రాణుల నుద్ధరింపజేయుట విశేషము. అట్టివారిని శరణుబొందినచో తమకు లోకోద్ధారణ కాగలదని తుకారాం చెప్పిరి.

3

ఉద్ధరీలే కుళఆపణ తరలా । శోచి ఏకరఘూలా త్రైలోక్యాంత ॥
త్రైలోక్యాంత ఝూలే ద్వైతచీ నిమాలే । ఏసేసాధియేలే సాధనబరలే ।
బరలే సాధన సుఖశాంతిమనా । క్రోధ నాహీంజాణా తిళభరీ ॥
తిళభరీ నాహీంచిత్తా సీకోమళ । తుకామ్హణే జళ గంగేచేతే ॥

తా॥ తానుతరించి తన కులోద్ధారణ జేయువాడు త్రిలోకము యందును శుద్ధుడగును. అట్టివానియొద్ద ద్వైతభావము (భేదభావము) ఉండనేరదు.) ఇది యన్నిసాధనలలో శ్రేష్ఠమైనది. ఈ సాధనచే శాంతి సుఖములు లభించును. కించిన్మాత్రమైనను క్రోధముండ నేరదు. చిత్తమందు మాలిన్యములేక గంగానదివలె శుద్ధచిత్త యగునని తుకారాం చెప్పిరి.

౪

జైసీ గంగావాహే తైసే జ్యాచే మన । భగవంత జాణత్యాచే జవళీ ॥
త్యాచా జవళీ దేవభక్తిభావే ఉభా । స్వానందాచా గాభాతయాదిసే॥
తయా దిసేరూప అంగుష్ఠప్రమాణ । అనుభవీ ఖూణ జాణ తీహే ॥
జాణతీ హేంఖూణ నాత్మఅనుభవీ । తుకామ్హణే పదవీ జ్యాచీ త్యాలా ॥

తా॥ గంగానది యేవిధముగ నిర్మలముగా ప్రవహించుచుండునో శుద్ధచిత్తుడట్లు నిర్మలముగా నుండును. (గంగ యేవిధముగ పవిత్రమై అపవిత్రమైన మురికికాలువలువచ్చి తనలో గలిసినను, మాలిన్యములేక నిర్మలమై యుండునో యట్లే శుద్ధచిత్తుడు ప్రకృతివశాత్తు నష్టములెన్ని సంప్రాప్తించినను నిశ్చలుడై యుండును.) వాడే భగవంతుని గుర్తించును. వాని భక్తిభావమునకు దేవుడు వశవర్తియగును. స్వానందానుభవపరుల కిది గ్రాహ్యమగును. ఆ దేవునిరూప మంగుష్ఠప్రమాణము గలిగియుండును. అనుభవజ్ఞానమువలన నిది విశదమగును, స్వాత్మానుభవపరులు దీని నెరుగుదురని తుకారాం చెప్పిరి.

౫

జ్యాచీ త్యాలా పదవీ ఇతరా నసాజే । సంతాలా ఉమజే ఆత్మసుఖ ॥
ఆత్మసుఖ ఘ్యారే ఉఘడా జ్ఞానదృష్టి । యావీణ నావటీకదూనకా ॥
కరూనకా కాంహీం సంతసంగధరా । పూర్వీచా జోధోరా ఉగవేల ॥
ఉగవేల ప్రారబ్ధ సంగేకరూనీ । ప్రత్యక్ష పురాణీ వర్ణియేలే ॥
వర్ణియేలే ఏకగుణ నామఘోష । జాతీలరే దోష తుకామ్హణే ॥

తా ॥ సజ్జనుల కనుభవజ్ఞానముచే నాత్మసుఖము కలుగును. ఆత్మసుఖము లభించిన జ్ఞానదృష్టి యేర్పడును, కాన నితరమార్గములను విడచి సజ్జనసాంగత్యము చేయుము. సజ్జనసాంగత్యమువలన నీ ప్రారబ్ధకర్మలు నశించి నీభాగ్యమను సూర్యు డుదయించును. ప్రత్యక్షముగా పురాణము లీ విషయమును వర్ణించుచున్నవి. ఏకనిష్ఠతో భగవన్నామస్మరణ జేసినచో నీ సర్వపాపములు తొలగునని తుకారాం చెప్పిరి.

౬

దోష తే జాతీల అనంతజన్మీచే । పాయత్యా దేవాచే నసోడావే ।
నసోడావేపాయ నిశ్చయేశోఖరా । ఆళవా శారంగధరా భావేబళే ॥
ధరూని కేశవ ఆణాభావభళే । పాపీయానకళే కాంహీం కేల్యా ॥
నకళే సో దేవ సంతసంగా వాంచునీ । వాసనాజాళునీ శుద్ధకరా ॥
శుద్ధకరా మన దేహాతీతహ్వావే । వస్తుసీ ఓళకావే తుకామ్హణే ॥

తా॥ భావమందు భగవంతుని చరణారవిందముల నిలుపుకొని యాఖండముగ భజించినచో ననంతజన్మలలో జేసిన పాపము తొలగును. ఈవిషయమై నేను ప్రమాణవాక్యముగా బలుకుచున్నాను. సజ్జనసాంగత్యములేనిది భగవంతుని దెలిసికొనుట సాధ్యముకాదు. పాపుల కీ విషయము తెలియదు. విషయవాసనల విడచి శుద్ధచిత్తుడవై దేహాతీతుడ వగుదువేని వస్తుతత్త్వజ్ఞాన మలవడునని తుకారామ్ చెప్పిరి

౭

ఓళఖారే వస్తు సాండా రేకల్పనా । నకా ఆడరానా జాఊర్షుణీ ॥
జాఊర్షుణీ కోరే బుడవాల హిత । విచారీ మనాంత ఆపులీయా ॥
ఆపులియాజీవీ శివాసీ పహావే । ఆత్మసుఖఘ్యావే వేళోవేళా ॥
ఘ్యావే ఆత్మసుఖస్వరూపీ మిళావే । భూతీలీన హ్వావే తుకామ్హణే ॥

తా॥ మాయాకల్పనలను త్యజించి, వస్తుతత్త్వజ్ఞాన మాచరణ యందుంచుము. చెడుమార్గములయందు మనస్సు ప్రవేశించిన నీహితము నీటగలియును. నీ వీ విషయమును మనస్సునందు బాగుగా యోచింపుము. జీవముతో శివుని జూడుము. ఎల్లవేళల నాత్మసుఖమును బొంది స్వస్వరూపజ్ఞానముతో భూతదయాపరుడవు కమ్మని తుకారామ్ చెప్పిరి.

౮

భూతలీనహ్వావే సాంగావే నలగేచీ । ఆతా అహంకారాచీ శాంతికరా ॥
శాంతికరా తుమ్హీ మమతా నసావీ । అంతరీ వసావీ భూతదయా ॥
భూతదయా రేవా మక కాయఉణే । ప్రథమసాధన హేంచీఅసే ॥
అసేహే సాధనజాచే చిత్తీవసే మాయాజాళ నాసే తుకామ్హణే ॥

తా॥ భూతదయాపరుడవై యహంకారమును శాంతింపజేసి మమకారమును విడచి భూతదయ నాంతర్యమున వసింపజేసికొనినచో నీకే మియు గొదువయుండదు. ఇదియే ప్రథమసాధనము. ఈసాధన మెవరి చిత్తమునం దాచరణలోనుండునో వారు మాయాజాలమును జయింతు రని తుకారామ్ చెప్పిరి.

మాయాజాళ నాసే యానామేకరూని । ప్రీతీ చక్రపాణీ అసోద్యావీ ॥
అసోద్యావీ ప్రీతీ సాధూచా పాయాసి । కథా కీర్తనాసీ సోడూనయే ॥
సోడూనయే కథా పురాణశ్రవణ । మనన నిదిధ్యాస సాక్షాత్కార ॥
సాక్షాత్కార ఝూలి సహజసమాధీ । తుకామ్హణే ఉపాదీ గేలీత్యాచీ ॥

తా॥ భగవన్నామస్మరణచే మాయాజాలము తొలగును. చక్రపాణియగు భగవంతుని ప్రేమింపుము, సజ్జనులైన మహాత్ముల చరణారవిందములను, కథాకీర్తనలను, విడువక ప్రేమతో సేవింపుము, హరికథాపురాణముల శ్రవణము, అనంతరము మనన, నిదిధ్యాసనలొనర్చిన సాక్షాత్కారము సంప్రాప్తించును. సాక్షాత్కారయోగమువలన సహజముగ సమాధినిష్ఠ యలవడి నీవు తరించెదవని తుకారామ్ చెప్పిరి.

౧౦

గేలే త్యాచిజాణతోచి బ్రహ్మరుఝాలా । అంతరీ నివాలా పూర్ణపణే ॥
పూర్ణపణేఝాలా రాహతో కైసారితీ । త్యాచీ ఆతాస్థితీ సాంగతోమీ
సాంగతోమీ తుమ్హా ఐకా మనోగత।రాహతో మూర్ఖవత జగామాఝి॥
జగాంత పిశాచ అంతరీశహాణా । సదా బ్రహ్మజాణ నిమగ్నతో ॥
నిమగ్నతో సదా జైసా మకరంద । అంతర్బాహ్యభేద వేగళాలే ॥
వేగళాలే భేదకితీత్యా అసతీ ।హృద్గన త్యాచీగతీ నకళేకోణా ॥
నకళే కోణాలా త్యాచే హేచీవర్మ । యోగీజాణే వర్మఖూణ త్యాచీ ॥
ఖూణత్యాచీ జాణే తైసేజే అసతీ । తుకామ్హణే భ్రాంతీ దుజీయాలా ॥

తా॥ సమాధినిష్ఠ యలవడిన నంతఃకరణము పరిపూర్ణమగు నానందముతో నిండియుండును. వాని స్థితి యెటులుండుననగా సర్వకాలములందును పరబ్రహ్మములో లీనమగును. నీవు వేరు బ్రహ్మము వేరను భేదములేక నీవు బ్రహ్మములో గలిసెదవు, జగత్తునకు పిచ్చివానివలెను, బుద్ధిమంతులకు జ్ఞానివలెను గోచరింతువు. నీయొద్ద భేదభావము వెదకినను దొరకదు. నిన్నెవరును గుర్తింపజాలరు, తుమ్మెదలు మకరందము నాస్వాదించుచుండునట్లు నీవానందమున లీనుడవయ్యెదవు. యోగులుమాత్ర మీ యనుభవమును గ్రహింతురని తుకారాం చెప్పిరి.

౧౧

దుజీయాలాభ్రాంతి భావికాలాశాంతీ । సాధూచీ వృత్తిలీనఝాలీ ॥
లీనఝాలీవృత్తీ బ్రహ్మతే మిళాలే । జళాంతఅటలే లవణజైసే ॥

లవణజై సేవున్హా జళాచే బాహేరీ । యేతనాహీ ఖరీ త్యాంతూనియా ॥
త్యాసారిఖే తుమ్హా జాణా సాధువృత్తీ । పున్హాన మిళతీ మాయాజాళ ।
మాయాజాళ త్యాలా పున్హా రే భాదేనా । సత్యసత్య జాణా తుకామ్హణే ॥

తా॥ భావుకులకు శాంతిలభించి సాధువృత్తియందు మనస్సులీన మగును. సాధువృత్తి యలవడినపిదప బ్రహ్మములో గలిసెదవు; లవణము జలములోగలిసి జలరూపమైన పిదప జలమునుండి లవణమును వెలుపలకు దీయుటకు సాధ్యము కానట్లు, నీకు సాధువృత్తి యలవడి బ్రహ్మములో లీనుడవైనచో మాయా వికారము ను నీలో ప్రవేశించవు. నీవు మాయా వికారరహిత స్వరూపుడ వగుదువు. నిన్ను మాయబాధింప జాలదని తుకారాం జెప్పిరి.

౧౨

స్వర్గలోకీహునీ ఆలేహే అభంగ । ధాడియేలే సాంగతుమ్హాలాగే ॥
నిత్యనేమయాసీ పఢతా ప్రతాపే । జళతీల పాపే జన్మాంతరీచీ ॥
తయామాగే పుఢేరక్షీ నారాయణ । మాండిల్యా నిర్వాణ ఉడీ ఘాలీ
బుద్ధి చాపాలట నాసేలకుమతీ । హోఈల సద్భక్తియేణే పంథే ॥
సద్భక్తిరఘూలియా సహజ సాక్షాత్కార । హోఈల ఉద్ధార పూర్వజాచా
సాధతీల యేణే ఇహపరలోక । సత్యసత్య భాక మాఝీతుమ్హా ॥
పరోపకార నాగీ సాంగీతలు దేవా । ప్రసాదిక మేవా గ్రహణకరా
యేణే భవవ్యథా జాఈల తుమచీ । సఖ్యావిర్గలాచీ ఆణమజ ॥
గాణ ఆణీకంథా ధాడిలీ నిశాణి । ఝ్యారే ఓళఖోని సజ్జనోహో ॥
మాఝే దండవత తుమ్హసర్వలోకా । దేహాసహిత తుకా వైకుంఠాసీ ॥

తా॥ స్వర్గలోకమునుండి మీ కొఱకే యభంగములను పంపితిని. నియమముతో నిత్య మీ యభంగములను పఠించిన జన్మాంతరములలో నొనర్చిన పాపములను నశించును. మీకే విపత్తు కలుగకుండా నారాయణుడు ముందు వెనుకలనుండి రక్షించును. మతిహీనులీ యభంగములను భావపూర్వకముగ పఠనశ్రవణములు జేసిన సద్భక్తి కలుగును.

సద్భక్తి కలిగినచో సహజముగ సాక్షాత్కారము సంప్రాప్తించును. ఈ యోగమువలన తమ పూర్వజులెల్లరు దరింతురు. మీరిహ పరలోక ములను సాధింతురు. ఇది సత్యవచనము. తుకారాముు భగవంతుని యాజ్ఞ ననుసరించి నేనీ ప్రసాదమును మీకు బంపితిని. కాన స్వీకరిం పుడు. మీ భవవ్యాధి సమూలముగ దొలగునని నేను విఠలేశ్వరుని పాదములసాక్షిగా తెలుపుచున్నాను, నేను భజనచేయు తాళమును, అంగవస్త్రమును. పండ్రెండభంగములుకల తాళపత్రములను గుర్తుగా పంపినాను. ఓ సజ్జనులారా! మీరివిగు ర్తించి స్వీకరింపుడు. మీ కంద రకు నా ప్రణామములు. తుకారామ్ దేహముతో వైకుంఠము జేరెను.

ఈదిగువ రెండుఅభంగముల పండ్రెండభంగములలో

భగవంతుడు చేర్చెను.

౧౩

సత్యసత్యజాణ శ్రీవాచానే మహా । అనుభవ పాహా పదో పదీ ॥
పదోపదీపహా శ్రీముఖా చాంగలే ప్రత్యక్ష పాఉలే విఠోబాచీ ॥
విఠ బాచీ భేటీ పిటేల గాచింతా । తుష్టలాంగీ అర్థసాంగీతలే ॥
సాంగీతలే ఖరే విశ్వాచియాహిత । అభంగవాచితీ జేకానర ॥
తేనరపరినీ జీవన్ముక్తఝాలే । పుష్పానాసీ - ఆలే సంసారాసీ ॥
సంసార ఉడాల సదేహాఫిటలా । పూర్ణత్వాచిఝాలా తుకాష్టణే ॥

తా॥ యదార్థముగా త్రికరణశుద్ధితో దెలిసికొనుడు, తుకారాం వైకుంఠమునుండి జగత్కల్యాణార్థము ఈ పై పండ్రెం డభంగములను పంపెను. అనుభవముతో బదేపదే చూడుడు. ప్రత్యక్షముగా దేవుని చరణములు, శ్యామలమగు శ్రీముఖమును దర్శింపుడు. ఆదేవుని దర్శ నమువలన మీ చింతలన్నియు దొలగును. తుకారామ్ ఆర్థుడై యీ యభంగములను పంపెను. ఈ యభంగములను నియమముతో పఠించిన వారు జీవన్ముక్తులై జన్మ మృత్యురూపమగు సంసారమునుండి తొలగి

దరు. నిశ్చయముగా సంసారబాధ తొలగును. సందేహములు నశించి పూర్ణస్థితి లభించును.

౧౪

చారకోటి ఏకలక్షా శేవట । చౌతిస సహస్ర స్పష్టసాంగితలే ॥
సాంగీతలే తుకా కథూనియాగేలో । బారా అభంగాలా సోడూనకా ॥
సోడూనకా త్యమ్హా సాంగీతలేవర్మే । భవపాశకర్మే చుకతీల ॥
చుకతీలా తాయాతీ విఠోబాచీఆణ । కరాహో పరసజీవే భావే ॥
జీవేభావే కరితాహో ఈలదర్శన । ప్రత్యక్షసగుణ తుకాస్వామీ ॥

తా॥ నాలుగుకోట్ల ఒకలక్ష ముప్పదినాలుగువేల యభంగములను తుకారాం భూలోకములో నున్నప్పుడు రచించి పాంచభౌతిక శరీరముతో దేవతా పుష్పకవిమానములో గూర్చుండి వైకుంఠమునకు జేరెను, దృష్టాంతముగా ప్రసాదరూపమగు ఈ పై పండ్రెండభంగములను వైకుంఠమునుండి పంపెను, నిత్యమము నియమముగా నీ యంభంగములను పారాయణజేసినచో ప్రారబ్ధకర్మలు నశించి భవపాశమునుండి తొలగెదరు, ఇది ప్రమాణవాక్యము. సగుణ స్వరూపముతో తుకారాం మీకు దర్శనమిచ్చి మిక్కిలి కృపతో రక్షించును.

డెబ్బదియ అధ్యాయము సమాప్తము.

నవనీత ప్రియాయ నమః.

# బోధరాజ చరిత్ర

— డెబ్బది యొకటవ అధ్యాయము —

జయజయ విశ్వభూషణా, విశ్వంభరా, మాయాతీతా, జగదుదారా, పీతాంబరధారీ, వైకుంఠనాయకా, ప్రజాపతీ, వేదోద్ధారకా, పాండురంగా! నీవు సర్వజీవుల హృదయములందు వసించియున్నావు. నీకృపవలననే సురలు పురందరుడు వర్తించుచున్నారు. సూర్యచంద్రులు నీకృపవలననే తేజోవంతులైయున్నారు. సూత్రధారి సూత్రముల నెటులాడించిన నటులనే బొమ్మలాడునటుల, సర్వజీవులును నీ వాడించు విధముననే వర్తించుచుందురు. చరాచరాత్మకమగు సర్వప్రపంచము నీ రోమకూపములందిమిడియున్నది. నీవు పుండలీకునికి వెనుకభాగమున కటిన్యస్తహస్తుడవై నిలువబడియున్నావు. నీ మహిమవిశేషమును బ్రహ్మాదులుసహితము తెలిసికొనజాలరు. నీవు భక్తులవచనములను పాలించుచు వారలకెప్పుడు నానావిధములగు సంకటములను నివారణజేయుచున్నావు. ఓ గరుడధ్వజా! నీచరణధూళిని లక్ష్మీదేవి యపేక్షించును. నీవు భక్తులను బూజించుచుందువు. యోగీశ్వరులు వజ్రాసనము వేసికొనియున్నను వారలధ్యానమున కగోచరుడవగు నీవు భక్తులుచేయు సంకీర్తనలలో నిర్లజ్జుడవై నృత్యముజేయుచుందువు. ఆ నిజభక్తుల సచ్చరిత్రలు మందమతినగు నేను వర్ణించుట యసాధ్యము. నాబుద్ధిని ప్రకాశింపజేసి నావాక్కునందుండి భక్తుల సచ్చరిత్రలను వర్ణింపింపుము.

మహారాష్ట్రదేశమునందు 'బాలేఘాటా' ప్రాంతమున 'ధామణ' యను గ్రామము గలదు. అచ్చట శూద్రజాతియందు మహావైష్ణవుడును నుదారుడునునగు 'బోధరాజు' అనుపేరుగల పాండురంగభక్తుడుండెను. ఆతనికి పరమభావుకురాలును, పతివ్రతాశిరోమణియు, భర్త్రాజ్ఞను పాలించునదియునగు 'మమతాబాయి' యను సత్కళత్ర ముండెను. ఆతని కుదాసీనవృత్తిగల 'యమాజీ'యను సుపుత్రుడును, సద్గుణసంపన్నురాలగు భాగీరధియను కోడలును నుండిరి. ఈనలుగురు నేక

చిత్తులై ప్రపంచవ్యవహారములందుండియు. నతివిరక్తులై శ్రీ పంఢరీ నాథుని హృదయమున నిలుపుకొని దివారాత్రములు భజనజేయుచుండిరి. గృహమునం దపార ధనధాన్యాదులును, మహదైశ్వర్యాస్వతలును, పశుసంపదయు, సేవకబృంద మనుండిరి పదునైదుదినముల కొకపర్యాయ మేకాదశీదినమున నాతడు నియమముతో పంఢరీక్షేత్రమునకు బోయి శ్రీ విఠలనాథుని సేవించి, యేకాదశీవ్రత మనుష్ఠించి యాదినమంతయు నఖండ హరినామసంకీర్తనతో గాలముగడపి. పవిత్ర కాలమగు ద్వాదశిసుదినమందు క్షుధాతురులగు దీన యాచకజనులకును. బ్రాహ్మణులకును నన్నదానము జేయుచుండెను.

ఇట్లు బహుకాలము జరిగినపిదప నాకస్మికముగ నా దేశమున తీవ్రమగు క్షామము సంభవించి యనాథజనులు తిండిలేక స్వస్థానమును విడచి వివిధప్రాంతములకు వలసపోవుచుండిరి. బోధరాజు కరుణగలవాడై మమతాబాయి నేకాంతముగబిలచి «క్షుధార్తుల కన్నపానీయాదుల నిడి సంతృప్తులజేయుము.) ఆకలితోనున్న వాని కన్నముబెట్టుటయు వాడి నెండి పోవుచున్న వృక్షమునకు నీరుపోయుటయు, శీతలబాధాపీడితునకు వస్త్ర మొసంగుటయు, ప్రయాణమార్గమున వ్యాధిచే బాధపడుచున్నవాని కౌషధమిప్పించుటయు, ప్రవాహమున మునిగిపోవుచున్న వానిని బైటకు దీయుటయు, దగ్ధమగుచున్న గృహము నార్పుటయు, ననాథప్రేతమునకు సంస్కారము జేయుటయు, దృష్టాక్రాంతున కుదిక మొసంగుటయు, బోనె మున బడిన జంతువుల విడిపించుటయు, యాచకునితో నమ్రవచనముల బలుకుటయు నను నివిచేయుటవలన నక్షయపుణ్యము సంప్రాప్తించును. ఈ సుకృతముచే సాత్త్విక వైరాగ్య ముద్భవించి, నానావిధ విఘ్నములు తొలగి భగవచ్ఛరణసేవ లభించును. ఉగ్ర జపతపాదులచేసినచో నాశ వంతమగు సుఖమును, తత్ఫలము భోగించుటయు దటస్థించును. పరోప కారమును జేసినచో విరక్తిగలుగును" అని బోధరాజు చెప్పగా మమతా బాయి "అవశ్యముగ తాము జెప్పినట్లే చేసెదను" అని చెప్పి యట్లే వర్తించుచుండెను.

ద్రుష్కాలమందు సర్వభూతములందు కరుణతో నన్నదానము జేయుచుండుటవలన దేశమంతయు కీర్తివ్యాపించి బోధరాజగృహమునకు యాచకులు విశేషముగ వచ్చుచుండిరి. చక్కెరరాశిని జూచి చీమలు నీగలును జేరునట్లును, వృక్షచ్ఛాయనుజూచి బాటసారులు చేరునట్లు నాళ్యములోనున్న యుదకమునుజూచి శ్వాపదములు చేరినట్లును, దృష్టార్తులు, క్షుధార్తులు బోధరాజు కీర్తివిని యాతనిగృహమునకు వచ్చుచుండిరి. ఆత డశ్వముపై సామగ్రులను వేసికొని దశమినాటికి పంఢరీపురము జేరి యేకాదశీ దినమున చంద్రభాగాస్నానము జేసి పుండలీకుని సేవించి తంబురను, జాలుతలను జేపట్టి, హరినామసంకీర్తన జేయుచు క్షేత్రప్రదక్షిణ జేసి, మహాద్వారమున ప్రవేశించి, శ్రీ విఠలనాథు నాలింగనవందనాదులచే బూజించి శ్వశురగృహమునుండి మాతృగృహమునకు వచ్చిన యతిని తన జననితో తన కష్టసుఖములన్నియు దెలుపునట్లు భగవంతునకు దనవిషయమంతయు దెలిపి సభామంటపమున ప్రవేశించి, రాత్రియంతయు కథాకాలక్షేపములతో జాగరణజరిపి ద్వాదశిదినమున విప్రులతో నన్నదానముచేయించి క్షుధార్తుల కన్నదానముజేసి భగవంతుని యాజ్ఞగైకొని స్వస్థానముజేరెను.

ఇట్లు కొంతకాలము జరుగువరకు గృహమునగల ధనధాన్యాదులన్నదానమునకై హరించుటచే భార్యయొద్దయు, కోడలియొద్దయుగల సువర్ణ రజతాభరణము లన్నిటిని వెచ్చించి యన్నదానమున కుపయోగించెను. గోవులును, వృషభములును, మేతలేక దుస్థితియందుండగా వానిప్రజల కుచితముగ నర్పించి, యుపాధిరహితుడై శరీర కష్టముచే లభించు ద్రవ్యముతో కుటుంబపోషణయు, నతిథ్యభ్యాగతుల నాదరించుటయు జరుపుచుండెను. తనకు దరిద్రస్థితి వచ్చినను తన నిశ్చయమును విడువక సద్భావముతో భగవద్గుణానుభవము జేయుచుండెను. ఆతని నిశ్చయమునుజూచి శ్రీ రుక్మిణీకాంతు డాతనికి సగుణరూపముతో దర్శన మిచ్చుచుండెను. చిత్తమున ప్రేమభావము లేనిది చేయు సాధనలు వ్యర్థము లగును. భక్తిలేనిది భగవత్ప్రాప్తి లభింపజాలదు. జ్ఞానినను

నహంకారము గలవాడందరితో గలసిమెలసి యుండనట్లును, వృద్ధుడగు ద్విజుడు వేదవచనములను స్వచ్ఛముగ నుచ్చరింపలేనట్లు, నగ్నిలో మాడిన బీజమంకురించనట్లును, నహంకారముతో గూడియున్నవానికి శాంతస్వభావ మలవడనట్లును, మానసమున భావవిశ్వాసములు లేనివారో హృషీకేశుడు లభింపజాలడు. బోధరాజు భక్తికి వశవర్తియై శ్రీ పంఢరీనాథు డాతనికి దర్శన మిచ్చుచుండెను.

ఒక యేకాదశికి బోధరాజు పంఢరీపురమునకు బయలు దేరగా మమతాబాయి చింతాక్రాంతురాలై 'దారి ఖర్చు'లకై ద్రవ్యమేమియు లేదని చెప్పెను. అంత బోధరాజు భార్యతో "ప్రియా! చంద్రభాగలో స్నానము జేసినప్పుడు సంకల్పము జెప్పు విప్రునకు దక్షిణ నిచ్చుటకొక పైసయేని గావలయును. ద్వాదశి దినమున నొక్క యతిథికైనను భోజన సామగ్రు లిచ్చుటకు ద్రవ్యము కావలయును. కాన నన్యోపాయ మేమియు తోచుటలేదు. నే నరణ్యమునకుబోయి కాష్ఠములనేరి యొక మోపుగ గట్టుకొని పంఢరీపురమున మహాద్వారము నెదుట బజారులో యాత్రా జనులకు విక్రయించి యా ద్రవ్యముతో నా యాత్రను బూర్తిచేసెద" నని చెప్పి గొడ్డలిని దీసికొని యరణ్యములో కట్టెలను నరికి మోపుగా గట్టుకొని పంఢరీక్షేత్రమునకు బయలుదేరెను ఆతనికి పాదములకు ధరించుటకు పాదరక్షలు లేవు. వస్త్రము లతిజీర్ణములై యుండెను. చినిగిన వస్త్రము నెత్తికి పాగగాజుట్టుకొని భగవన్నామము నుచ్చరించుచు బోవు చుండెను. ద్రవ్యము హరించినపిదప నాతడు సమాహిత చిత్తుడై భగవంతు డైశ్వర్యమాయనుండి తొలగించెనని యానందించెను. మేఘములు తొలగినపిదప నాకాశము నిర్మలముగ నున్నట్లును, భోధరాజు నిర్మల చిత్తుడై పంఢరీక్షేత్రముజేరి తన శిరముననున్న కట్టెలమోపును మూడు పైసలకు విక్రయించెను. పశ్చాత్తప్త చిత్తముతో జంద్రభాగా స్నానము జేసి సంకల్పము జెప్పిన విప్రునకొక దక్షిణ నిచ్చెను ఒక పైసతో బుక్కా-ను తులసి హారమును దీసికొని దేవాలయములో ప్రవేశించి భావ పూర్వకముగ శ్రీ విశ్వనాథుని బూజించెను. ద్వాదశి దినమున

ప్రాతఃకాలమున స్నానముజేసియు ద్విగ్నమానసుడై కూర్చుండెను. ఒక విప్రునికైనను భోజనసామగ్రి నిచ్చుటకును, తనకు భోజనమునకును ద్రవ్యములేదు ఒక పైసమాత్రము దగ్గర యుండుటచే దానిని దీసికొని యొక దుకాణమునకుబోయి యా దుకాణదారున కా పైస నిచ్చి "అయ్యా! దీనికెంతవచ్చునో యంత జొన్నపిండి నిమ్మని యడుగగా నుదారుడగు నా వర్తకు డర్ధశేరు పిండినిచ్చెను.

బోధరాజాపిండిని మూటగట్టుకొని చంద్రభాగా తీరమందు గూర్చుండి యతిథి యెవరైనను వచ్చి యీ పిండిని స్వీకరించినచో నేను ధన్యుడ నగుదునని మనమునదలచి యతిథి రాకకొఱకెదురుచూచు చుండెను. "బియ్యము, పప్పు, లవణములేని యీ పిండి నెవరంగీకరింతురు. ఈ క్షేత్రమున యాత్రిగావచ్చిన శ్రీమంతు లెందరో గొప్ప సమారాధనల జేయుచుండ దరిద్రుడనగు నేనిచ్చు పిండియెవరు గావలె యును? దివ్యమగు భవనమును త్యజించి పాకలో నెవరు వసింతురు? క్షీరయుక్తమగు పక్వాన్నమునువిడచి మజ్జిగ నెవరుకోరెదరు? గొప్ప గొప్ప పందిళ్ళనువేసి యసంఖ్యాకులగు దీనజనులకును, బ్రాహ్మణు లకును, మధురములగు భక్ష్యములతో బక్వాన్నములను బెట్టుచుండ వానిని త్యజించి నాయొద్ద కెవరువత్తురు? నేను ద్వాదశివారిణ నెట్లు జరుప వలయును" నని చింతించి శ్రీ విఠలనాథుని బ్రార్థించుచుండెను.

బోధరాజు శుద్ధభావము గలవాడగుటచే శ్రీ విఠలనాథుడు తత్క్షణమే యాతని చింత దీర్పదలిచి తానొక వృద్ధబ్రాహ్మణ రూప మునుధరించి హస్తమునందొక కఱ్ఱను బుచ్చుకొని శిరమున టోపీని ధరించి జీర్ణవస్త్రధారియై వణకుచు చంద్రభాగా నదీతీరముజేరి బోధ రాజునుజూచి "ఓ భక్తశ్రేష్ఠా! నీవు నాయజమానుడవు బహుకాల ముగా నీక్షేత్రమున నాకనేక పర్యాయములు నీవన్నదానము జేసి నావలన నాశీర్వదింప బడుచుంటివి. దుర్బలుడనగు నన్నెవరును నాదర రింపరు. నిన్ను వెదకుచు నదీతీరమంతయు తిరిగితిరిగి యిచ్చటకు వచ్చి

తిని. నాకు మిగుల క్షుద్బాధగానున్నది. నీయొద్ద నేమియున్నను నిస్సందేహముగ నాకర్పింపుము" అని చెప్పెను

బోధరాజు విప్రోత్తమునివచనము లాలకించి సమాహితచిత్తుడై నామొరవిని శ్రీ పంఢరీనాథు డీతని బంపెనని తలచి తనయొద్దనున్న మూటను విప్పి "ఈపిండిమాత్రమె టీతనికీయవలయు" నని చింతించుచు కపట బ్రాహ్మణవేషధారియగు భగవంతుని జూచి "ఓ స్వామీ! నాయొద్ద పిండిమాత్రమున్నది ఉప్పు, పప్పు, బియ్యము మొదలగు సామగ్రులేమియునులేవు తమకు జొన్నపిండి నె టర్పింపవలయునని చింతిగానున" దని చెప్పగా నా వృద్ధ బ్రాహ్మణవేషధారి బోధరాజుతో నాయనా! ఏమియును చింతింపక నీయొద్దనున్న పిండిని నా కర్పింపుము. సమయానుకూలముగా నేది దొరకిన దానితో తృప్తిపడు స్వభావము నాకున్నది. క్షుద్బాధా పీడితుడనగు నాకు పప్పులుప్పులతో బనియేమి" అని పలుకగా బోధరాజు తనయొద్దనున్న పిండి నాతని కర్పించి "ఓ స్వామీ! తామీ పిండితో నిచ్చటనే రొట్టెజేసికొని భుజింపు" డని చెప్పెను. అంత భగవంతుడు "నేను దేవాలయమునొద్ద వంటజేసికొనుటకు ధర్మకర్తలు నన్ను జేరనీయరు; నీవు కోరినచో నేనీ వృక్షచ్ఛాయయందు రొట్టెల జేసికొనెదను. నీవు కాష్ఠములనేరికొని రమ్ము. రొట్టెను కాల్చుటకొరకు మట్టిమూకుడెచటనైనను నదీతీరమున వెదకి తెమ్ము" అని చెప్పెను.

జగజ్జననియగు శ్రీ రుక్మిణీదేవి యీ విషయమును దెలిసికొని వృద్ధబ్రాహ్మణ సుమంగళిరూపమును ధరించి చంద్రభాగా నదీతీరమునకు జేరెను. బోధరాజు కాష్ఠములను, మట్టిమూకుడును దెచ్చి వృద్ధ బ్రాహ్మణునకిచ్చెను. జగజ్జనని తన స్వహస్తములతో రొట్టెల దయారు చేసెను. తానును భగవంతుడును నారగించిన పిదప నుచ్ఛిష్టప్రసాదమును బోధరాజునకిచ్చి యంతర్ధానులైరి. బోధరాజు భగవంతుడును జగజ్జననియు నన్ను సమాధానపరచుటకు వృద్ధ బ్రాహ్మణ దంపతుల రూపమున వచ్చిరి" అని యానందించి యా యుచ్ఛిష్ట ప్రసాదమును

ప్రీతితో నారగించి దేవాలయమున ప్రవేశించి భగవంతునకెదురుగా నిలువబడి చేతులు జోడించి "భక్తవత్సలా జగజ్జీవనా! నేను లవణహీన మగు జొన్నపిండి నాయొద్దనుండితీసికొని రొట్టెలను చేసికొని ప్రేమతో నారగించితివి. ఈ క్షేత్రమున యాత్రార్థమైవచ్చి శ్రీమంతులెందరో మధురాన్నములతో సమారాధన జేయించుచుండ నాపిసి ద్యజించి దీనుడనగు నన్ను దృప్తిపరచుటకై రుక్మిణీ సమేతముగ దర్శనమిచ్చి తివా!" అని పలికెను.

శ్రీ రుక్మిణీకాంతుడు బోధరాజునుజూచి "ఓ భక్తశ్రేష్ఠా! నేన చ్చటికేగినను నాకు భోజనము లభింపదు నీకు దృష్టాంతము జూపెదను రమ్ము" అనిచెప్పి యాతని చంద్రభాగా నదీతీరమునకు దీసికొనిపోయెను. సహస్ర బ్రాహ్మణ భోజనమొక శ్రీమంతుడు చేయించుచుండె భగవం తుడు భోధరాజు నాస్థలమునకు దీసికొనిపోయి తాను వృద్ధబ్రాహ్మణ రూపధారియై యొక కఱ్ఱనుజేబట్టి జీర్ణవస్త్రములను ధరించి వణకుచు "నీవు కౌతుకమునుజూచుచు నిచ్చటనే నిలచి యుండుము" అని చెప్పి సమారాధన జరుచున్న పందిరిలో ప్రవేశించి యచ్చట సహస్రద్విజు లకు పదార్థములన్నియు వడ్డింపబడియుండుట భగవంతుడు జూచి తానా పంక్తిలో నిలువబడి "నే ననాథ బ్రాహ్మణుడను, క్షుధితుడనై యిచ్చ టకువచ్చితిని. నాకును భోజనము పెట్టుడని కోరెను అచ్చట వడ్డన జేయుచున్న వంటబ్రాహ్మణులు వృద్ధబ్రాహ్మణ వేషధారియగు భగ వంతునితో "మరలిపొమ్ము. మా లెక్కప్రకారము సహస్రభోజనము పూర్తియైనది. కాన నింకెచటికైనను మరలి పొమ్ము" అని చెప్పిరి. పిదప భగవంతుడు వారినిజూచి "అయ్యా! వెయ్యిమంది బ్రాహ్మణులు భోజనము చేయుచుండ నతిక్షుడనగు నా యొక్కనికి భోజనము కొదువ యగునా? పాత్రలకంటిన పదార్థములైనను నాకుచాలును" అని చెప్పగా సమారాధన జేయించుచున్న సాహుకారుజూచి "మేము వెయ్యిమంది బ్రాహ్మణుల కామంత్రణ జెప్పితిమి. నన్నొక్కని నధికముగా జేర్చు కొనినచో నీబోటి వారింకెందరో చేరుదురు. కాన వేరొకచోటికి

పోయిన్నా" అని చెప్పెను. అంత భగవంతుడు బలాత్కారముగ నచట పదార్థములతో గూడియున్న వి సరియొద్ద గూర్చుండెను. వెలుపలినుండి బోధరాజీ కౌతుకమును జూచుచుండెను.

అంత సాహుకారు సేవకులను బిలచి, ఈ బ్రాహ్మణుడు తన మొండితనమును జూపుచున్నాడు. ఎంత చెప్పినను వెడలిపోక మూర్ఖత్వ మవలంబించి కూర్చుండియున్నాడు. కాన నీ మూర్ఖుని వెడల గొట్టుడు. ఉపేక్షించిన వీనికి సహవాసము నింక నెందరో తయారగుదురు. అని చెప్పగా యజమాని యాజ్ఞానుసారము సేవకులు నైకుంఠనాయకుని నిర్బంధముగ కాళ్లేతుల బుచ్చుకొని వెలుపలకీడ్చుకొని పోయిరి. ఆ సమయమున ఒకరికైనను వివేకము లేకుండెను. సహస్రవిప్రులు భోజనము జేయుచుండిరి. నైకుంఠనాయకుడు బోధరాజుయొద్దకువచ్చి "చిత్రము చూచితివా! ప్రాణముపోయినపిదప దేహము వెలుపలకీడ్వబడినట్లు నన్ను వెలుపలకుగెంటి నాకు విముఖులై చేయు ఈ సమారాధన కెన్ని విఘ్నములు వచ్చునో చూడుము" అని పలికెను

తత్ క్షణమే విపరీతమగు సుడిగాలి బయలుదేరి పందిరిని లేవదీసి కొనిపోయెను. నదీతీరముననున్న యిసుకతో వి స్తళ్ళునిండెను. వర్షము కుంభధారగ పడుచుండెను. అందుచే ద్విజవరులెల్లరును చెల్లాచెదరైరి. బోధరాజీకౌతుకమునుజూచి యత్యాశ్చర్యమునొందెను. జగజ్జీవనుడు విముఖుడగుటవలన విప్రులెల్లరు భుజింపకయే పోవలసివచ్చెను. వరుడు వివాహమంటపమునుండి విలపించుచు బోయినచో నాతని బంధువులెట్లు భుజింతురు? గోవు తనలేగకే పాలనీయనప్పుడు గొల్లవానికెట్లు పాల నిచ్చును? భోక్తయగు నైకుంఠనాథుడు విముఖుడైనందున విఘ్నమేర్పడెను. శ్రీ విఠ్ఠలనాథుడు బోధరాజునుజూచి "ఓ భక్తశిఖామణీ! లోకమున డాంబికజనులు కీర్తినపేక్షించి ధనవ్యయముచేసి, నాకు విముఖులగుచున్నారు నీ శుద్ధభావమునుజూచి నివొసంగిన జొన్నపిండె నమితె ప్రీతితో నంగీకరించితిని, నేను దుర్యోధనుని దిరస్కరించి విదురుని గృహమున భుజించితిని ద్రౌపదిపెట్టిన యాకుకూరను పరమప్రీతితో దింటిని.

గోపాలుర యుచ్ఛిష్టమును మక్కువతో నారగించితిని. గోపబాలురు తలిపిపెట్టిన [illegible]సము నా కతినిర్మలమై యుండెను" అని దీనదయాళుడు సంతోషముతో బలుకగా బోధరాజు భగవంతునకు సాష్టాంగనమస్కారము జేసి "నీమహిమవిశేషము నెవ్వరును దెలిసికొనజాలరు. వైష్ణవుడగు చోఖామేళుడు పెట్టిన ఘృతభోజనమును, శబరి యుచ్ఛిష్టఫలములను బరమప్రీతితో భుజించితివి" అని చెప్పి బోధరాజు భగవంతుని యాజ్ఞదీసికొని తనగ్రామమునకు బోవుచుండ మార్గమధ్యమున భయంకరమగు యరణ్యము తగిలెను. బోధరాజును క్షుత్తృష్ణలు బాధించుచుండెను. సమీపమున గ్రామములేవియు లేనందున వ్యాకులచిత్తుడై భగవన్నామామృతమును గ్రోలుచు బోవుచుండెను. వైకుంఠాధిపతి తన నిజదాసు నాంతర్యము నెరిగి యిచ్ఛామాత్రముచే బాటసారులకు విశ్రాంతి స్థానముగ నొకగుడిసెను నిర్మించి తాను కోటమాలిరూపముతో రుక్మిణీసమేతముగ నందుండి భక్తునిరాకకై యెదురుచూచుచుండెను. బోధరాజు కుటీరమునుజూచి లోనికిబోవుటకు సంశయించెను.

జగజ్జననియగు శ్రీ రుక్మిణీదేవి యొకగంపలో కందమూల ఫలములను, రొట్టెలనుంచుకొని బోధరాజున కెదురుగవచ్చి నాయనా! మాకుటీరమును పావనము జేయకయే పోవుచుంటివి. మన్నాథుడు తమ రాకకై నిరీక్షించుచుండెను. మీరు ప్రత్యేకాదశికి పంఢరీ క్షేత్రమునకు నియమముతో బోవుభక్తులు. అంతర్యమున సందేహమును విడచి మాకుటీరములో బ్రవేశించి మేమిడు స్వల్పాహారమును స్వీకరించి మమ్ములను ధన్యులను జేయుడు" అని ప్రార్థించెను. బోధరాజు విస్మితచిత్తుడై యీ స్థలమున నాకెన్నడీ కుటీర మగుపడలేదని తలచి యా కుటీరము లోనికి బోయి క్షణకాలము విశ్రాంతిని దీసికొనెను. ఆదంపతు లర్పించిన ఫలాదులను గ్రహించి క్షుద్బాధను దీర్చికొని మరల స్వగ్రామమునకు బయలు దేరెను. కొలది దూరమేగినపిదప వెనుకకు దిరిగిచూడ తా నిదివరకు దిగిన కుటీరమును, నందు వసించు దంపతులును, కనబడనందున నమితాశ్చర్యమునొంది "నేనాకలి దప్పులచే బాధింపబడుచుండ శ్రీ పం

ఢరీనాథుడే నా రకు కుటీరమును నిర్మించి జగజ్జనని సమేతముగ కోట మాలిదంపతుల రూపములను ధరించి కంద మూలాదులచే నాయాకలి దప్పులను దీర్చెను" అని తలచి హర్ష చిత్తుడై గృహమునకు జేరి జరిగిన వృత్తాంతమంతయు దార పుత్రాదుల కెరింగించెను.

ఒకనాడు బోధరాజు నామస్మరణ జేయుచు మొక్క జొన్న చేనును పక్షులనుండి రక్షించుటకై కూర్చుండి యుండెను. కంకులు తినుటకు వచ్చిన పక్షుల నుండేలుతో గొట్టినచో వానికి దుఃఖము కలుగునని తలచి హృదయమునందు నధోక్షజుని నిలిపికొని సర్వ భూతముల హృదయములందు భగవంతుడున్నాడను సజ్జనోక్తిని స్మరణకు దెచ్చి కొని యనుతప్త చిత్తుడై భగవన్నామ స్మరణ జేయుచుండెను. గృహము నుండి మమతాబాయి బోధరాజునకై యన్న పానాదుల దీసికొనివచ్చి యాతనికి వడ్డించెను. బోధరాజు భోజనము జేసి కరశుద్ధిని జేసికొనిన పిదప మమతాబాయి "ఓ నాథా! మీరిట్లు విపరీతముగ ప్రవర్తించి నచో చేనులోని జొన్న కంకులన్నియు, పక్షులకును, సాధువులకు, దక్కును. రాజ దివాణమునకు శిస్తు జెల్లించుట కిబ్బంది కలుగును. మీరు నావచన ముల నాలకించి వివేకచిత్తముతో బక్షులకును పాంథులకును, కంకుల నెరజేయక గాపాడు చుండు"డని చెప్పెను. బోధరాజామె వచనముల నాలకింపనందున "ఓ ప్రాణేశ్వరా మీచేతితో జొన్న కంకుల నెవ్వరికైన దానము జేసితి రేని విఠోబాదేవుని చరణముల దప్పినట్లు లని యానబెట్టి గృహమున కేగెను.

ఆ మార్గమునుండి హరినామ సంకీర్తన జేయుచు, భక్తబృందము పంఢరీక్షేత్రమునకు వెడలుచుండెను. బోధరాజు వారినిజూచి యమితా నంద భరితుడై యెదురుగబోయి సాష్టాంగనమస్కారము జేయగా నాభక్తబృందము "ఈతడు కోమలహృదయు"డని గ్రహించి "ఓ విష్ణు భక్తా! నీవు దుష్కాలమున విశేషముగా సన్నదానము జేసిన దాతవు. యాత్రాజనులమగు మాకు జొన్నకంకుల నిచ్చితివేని క్షుద్బాధా విము క్తులమై సంతసింతు" మనిచెప్పిరి. అంత బోధరాజు దయార్ద్ర హృద

యుడె 'ఓ భక్తులారా! నాభార్య నేనేరికిని జొన్నకంకులను విరచి ధర్మము చేయకూడదని పాండురంగ దేవుని చరణార విందముపై నాన బెట్టి యిప్పుడే గృహమున కేగెను. నే నాయాన నుల్లంఘింపజాలను. కాన నెవరికెన్ని కంకులు కావలయునో మీ మీ స్వహస్తములతో గోసికొనుడు" అని చెప్పగా వారిలానందించి విఠ్ఠలనామ గర్జనజేయుచు 'శ్రీ పంఢరీనాథుని కృపకు పాత్రుడవగుదువుగాక! దుర్భరక్షామము నందు నీవు పాత్రాపాత్ర విచారణ జేయకయే నిరంతర మన్నదానము జేసిన యగణిత పుణ్యశాలివి' అని పలికి రెండువందల జనులతో గూడిన యా భక్తబృందము జొన్న చేనులో బ్రవేశించి తమకు గావలసి నన్ని కంకులు గోసికొని యానంద కందళిత హృదయులై వెడలిపోయిరి. గ్రామమున నీవృత్తాంతము ప్రజలెల్లరికిని దెలిసెను. స్త్రీ పురుషులెల్ల రాశ్చర్యచకితులై బోధరాజు పొలములోని జొన్నకంకుల నెల్లను యాత్రాజనుల పరముజేసెనని చెప్పుకొనుచుండిరి.

బోధరాజు దారపుత్రాదులు కోపింతురని వెరచి గ్రామమున బ్రవేశింపక శ్రీ రుక్మిణీకాంతుని మనమున నిలిపికొని ప్రేమతో భజన జేయుచు నచ్చటనేయుండెను. ఆతని పుత్రుడగు 'యమాజీ' యీవృత్తాంతమునువిని చేనునుజూచుటకై యచ్చటకువచ్చి కంకులన్నియుగోయబడిన యా చేనునుజూచి యుద్విగ్నమానసుండై తండ్రితో నేమియు మాట లాడజాలక మౌనముగ గూర్చుండియుండెను. బోధరాజీ విషయమెఱిగి కుమారునియొద్దకుబోయి యొక యభంగమునుపదేశించెను. ఆ యభంగ ములోని భావమేమనగా

"నాయనా! నేజెప్పునది వినుము. తేనెటీగ యరణ్యమున తా నుప వాసముజేసి యపారముగ మధువును గూడబెట్టును. సమూలముగ గోసి కొనిపోవ నది విలపించుచుండునట్టుల సంసారమున గల గృహస్థులు తామును దమకుటుంబమును బూర్ణముగ ననుభవింపక, దృప్తిగ నితరు లకు బెట్టక గూడబెట్టిన ధనమొక కాలమున వ్యర్థముగ నశించును. మానవుడార్జించిన ధనమును బంచుకొనుటకు నలుగురు భాగస్వాములు

కలరు. ప్రథముడు ధర్మము, ద్వితీయుడు భూపాలుడు, తృతీయు డగ్ని, చతుర్థుడు తస్కరుడు. జ్యేష్ఠుడగు ధర్మునకు భాగమీయనిచో మిగిలిన మువ్వురును కోపగ్రస్తులై యా మానవు డార్జించిన ద్రవ్యమును నాశన మొనర్తురు. నీవు మనమున సందియంబును విడచి భక్తజనులకు మన యొన్న చేతిలోని కంకు లుపయోగపడుట మిగుల సుకృతమని యానంగ దింపుము."

బోధరాజు పలుకులువిని యమాజీ పశ్చాత్తప్తచిత్తుడై తండ్రికి సాష్టాంగనమస్కారము జేసి యాతనిని గృహమునకు దోడ్కొనిపోయి జరిగిన వృత్తాంతమంతయు మమతాబాయికి దెలుప నామె సమాహిత చిత్తయై యానందించెను. గ్రామమునగల కుటిలజనులు నిందజేయు చుండిరి. ఈ వృత్తాంతము క్రమముగ దివాణమువారికి దెలసెను. భూమిశిస్తు యేడు వరహాలు తత్క్షణమే వసూలుజేసికొని రమ్మని దివాణదారు భటుని బోధరాజు నొద్దకుబంపెను. గృహమున మూడు వరహాలు మాత్రముండెను. నాలుగు వరహాలను గ్రామములో నెవరి నద్దనైన అప్పుదీసికొని రేపటిప్రాతఃకాలమున శిస్తు జెల్లించెదనని బోధ రాజు భటునకు దెలిపెను.

బోధరాజు గ్రామమునగల 'నాగాఊ బ్రాహ్మణబాయి' యొద్దకు బోయి "అమ్మా! నాలుగువరహాలు బదులిచ్చితివేని స్వల్పకాలములో వడ్డీతోగలిపి తీర్చెద" నని పలుక నామె "యావశ్యముగ నుషఃకాల మున నిచ్చెద" నని చెప్పెను. బోధరాజు గృహమునకుబోయి మరునా డుషఃకాలమున నామెగృహమునకు బోయెను. ఆ శ్రీమంతురాలు గ్రామమునగల జనులెల్లరు బోధరాజవిషయమున నానావిధముల జెప్పుకొనుచుండు వచనములువిని "వడ్డీకాశించి బోధరాజునకు ద్రవ్యము నప్పిచ్చినచో అసలుకూడువచ్చుట దుస్సాధ్యము" అని తలచి బోధ రాజునుజూచి "నాయనా! రాత్రి నాకురావలసిన బాకీవసూలుకాలేదు, రాత్రివసూలగునను ధైర్యముతో మిమ్ముల నీ సమయమునకు రమ్మని

చెప్పితిని. ప్రస్తుతము నాయొద్ద ధనమేమియు లేదు. మరెచ్చటనైన ప్రయత్నింపుము" అని చెప్పగా బోధరాజు చింతాక్రాంతి మానసుడై 'ధామణ' గ్రామమున నామెకు మించిన శ్రీమంతులు లేనందున 'రాళే రాస' గ్రామమున దనను గుర్తించు భావుకజనులు విశేషముగనుండుటచే నచట నెవ్వరియొద్దనైన నాలుగు వరహాలప్పుదీసికొని దెచ్చి గృహమునకుబోయి దారపుత్రాదులకీవృత్తాంతిమును దెలపి యుచటనుండ బయలుదేర హరినామసంకీర్తనజేయుచు రాళేరాస గ్రామమును జేరెను. బోధరాజు పలాయనుడాయెనని గ్రామమున దుర్జనులు వారను వ్యాపింపజేయుటచే దివాణదారుని భటులు బోధరాజు గృహమును జేరి యాతని గృహమును జప్తుజేసిరి. దుర్జను లీ విధముగ బోధరాజున కపాయము గలుగజేయుచుండ శ్రీ పంఢరీనాధుడు తత్క్షణమె భక్తునకు గలిగిన ప్రమాదమును దొలిగించవలయునని తలచి 'విఠూమహార్' యను నామముతో యంత్యజరూపధారియై దివాణదారుని యొద్దకు బోయి యాతనికి నమస్కారముజేసి "బోధరాజు తాను చెల్లింపవలసిన శిస్తు యేడు వరహాలను నాచే బంపి తాను కార్యార్థముగ రాళేరాస గ్రామమునకేగెను. కాన దయచేసి యీ యేడువరహాలను దీసికొని రశీదు నిప్పింపు"డని కోరెను. ఆ దివాణమునగల జనులెల్లరు నీ సమయమున బోధరాజునకు ద్రవ్యమెచ్చట లభించినదని యత్యాశ్చర్యము నొందిరి. భగవంతుడు దివాణదారునియొద్ద రశీదును గైకొని బోధరాజు గృహమునకుబోయి మమతాబాయికి రశీదునిచ్చి "బోధరాజు రాళేరాస గ్రామమున కీర్తనజేయుచు నాచే నేడువరహాలను పంపెను. నేనా ద్రవ్యమును దివాణమున జెల్లించి రశీదును దెచ్చితి" అని చెప్పి దాని నామెకిచ్చి కొంతదూరముపోయి యంతర్ధానమయ్యెను.

బోధరాజు రాళేరాసగ్రామమున నొకభావుకునియొద్ద నాలుగు వరహాల నప్పుదీసికొని మరుదిన మునఃకాలమునకు గృహమును జేరి

మమతాబాయిని "మనయొద్దనున్న మూడువరహాలనిమ్ము. దివాణమున శిస్తు జెల్లించివచ్చెదను" అని పలుకగా నామె "నిన్నటిదినమున మీరేడు వరహాలను 'విఠూమహార్' ద్వారా బంపలేదా? ఆతడా ద్రవ్యమును దివాణమున జెల్లించి యారశీదును నాకు దెచ్చియిచ్చెను" అని చెప్పి యా రశీదునుజూపెను. బోధరా జాశ్చర్యమునొంది దివాణమునకేగి యచట 'విఠూమహార్' ద్రవ్యమును జెల్లించుట నిజము దెలిసికొని యాగ్రామమున వెట్టివాడగు విఠూమహార్ గృహమునకేగి విచారింపగా "నాకు దినుటకు గృహమున నన్నమైనను లేక నేను పస్తుపడుకొనుచుండ నాకేడువరహా లెచటనుండివచ్చును. నాకేవిషయమును దెలియదు" అని పలికెను. బోధరాజు భగవంతుడు దనకుగలిగిన సంకటమును దొలగించుటకై విఠూమహార్ రూపముతో ద్రవ్యమును జెల్లించి యుండునని నిశ్చయించి యానందాశ్రుధారలను విడచుచు గద్గదస్వరముతో "ఓ క్షీరాబ్ధివాసా! పంఢరీనాథా! నీ వంత్యజవేషమును ధరించితివేల? నేను ప్రపంచవిషయమును త్యజించి నీ చరణారవిందములపై చిత్తమును లగ్నముజేసి యఖండముగ నీ నామస్మరణ జేయుచుంటిని. నాశవంతమగు నీ శరీరమందు నాకభిలాష లేదు. త్వరితముగ సగుణరూపముతో దర్శనమిచ్చి నన్ననుగ్రహింపుము" అని భగవంతుని ప్రార్థింపగా శ్రీ పంఢరీనాథుడు నిజరూపముతో దర్శనమిచ్చెను.

బోధరాజు భగవంతునకు సాష్టాంగ నమస్కారము జేసి యాతని నాలింగనము జేసికొని "ఓ దేవాధిదేవా! దివాణమున కేడువరహాల నెచటనుండి దెచ్చి చెల్లించితివి" అని యడుగగా శ్రీ విఠ్ఠలనాథుడు హాసవదనుడై "నీవు రాత్రేరాస గ్రామమున కేగినపిదప గ్రామమున దుర్జనులవలన నీ కవమానము గలుగకుండ నీ గృహములోని మూడు వరహాలను, నా శ్రీమంతురాలు ద్రవ్యములో నాలుగు వరహాలును

దీసి మొత్త మేడునరహాలను దివాణమున జెల్లించితిని. నీకు వాగ్దానము జేసి యా శ్రీమంతురాలు ద్రోహము జేసినందున నేను నాలుగువరహాలామె ద్రవ్యమునుండి యపహరించితిని. తిరిగి నీవామెకు ద్రవ్యము నీయవలదు. అట్లిచ్చితివేని యామె యైశ్వర్యము నంతయును నే నపహరించెదను" అని చెప్పి యంతర్ధాన మయ్యెను. యాత్రాజనులకు ధర్మముగ బోధరాజప్పగించిన జొన్న జేను యథాప్రకారముగ కంకులతో నిండి యుండెను. ఈ కౌతుకమునుజూచి ప్రజలెల్ల రాశ్చర్య చకితులై బోధ రాజును జగజ్జీవను డనుగ్రహించెనని పరిపరి విధముల గొనియాడు చుండిరి.

డెబ్బది యొకటవ అధ్యాయము సమాప్తము.

సర్వతీర్థాత్మకాయ నమః.



# బోధరాజు సర్పదష్టుని బ్రతికించుట

—♦ డెబ్బది రెండవ అధ్యాయము ♦—

జయజయ విశ్వవ్యాపకా, రుక్మిణీపతీ! నీవే నా జననీజనకులును, బంధుమిత్రులునై యున్నావు. సాధన సంపత్తియు, నాధ్యాత్మిక జ్ఞానమును, శ్రవణమననములును, గీర్వాణభాషయు, (ప్రాకృతపు) బలుకులును, చాతుర్యకళలును, పలికించు వక్తయును. దీనదయాళుడవగు నీవె యున్నావు. నాయక్షయసుఖమును, సదుపువును, దారకుడవును, విశాల బుద్ధి ననుగ్రహించు వాడవును, నీవెయున్నావు నీవు నాకు సమయస్ఫూర్తిగ వచనములను స్ఫురణ జేయువాడవును, ప్రేమతో శ్రవణము జేయువాడవును నై యున్నావు! ఓ అనంతా! నీ కృపాకటాక్షము ప్రసరించినచో లోభమమతలు బాధింపవు. అజ్ఞానులు జ్ఞానులగుదురు. సూర్యోదయమువలన నంధకారము నశించునట్లును, లోహమునకు స్పర్శవేది సోకినచో మలినాకారము దొలగి సువర్ణమగునట్లును, నమ్మంగళములగు మురికికాలువలు గంగలో గలిసి పవిత్రములు లగునట్లును, నీవు కృపాదృష్టితో నెవని ననుగ్రహింతువో, వాని కీర్తి త్రిభువనము లందును నిశ్చయముగ వ్యాపించును. అతి విరక్తులగు ప్రేమభక్తులు నిన్నొకక్షణమైనను విడచియుండరు. ఆ భక్తుల యఘటితములగు చరిత్రలు నాహస్తముతో లిఖింపించుము.

బోధరాజు పొలములో జొన్నకంకులు యథాప్రకారముగ నుండుట గ్రామస్థులుచూచి యాశ్చర్యచకితులై "బోధరాజు కేవలవిఠ్ఠలాంశ సంభూతుడు. ఈతనిని మనమజ్ఞానముచే మనుష్యమాత్రుడని భావించితిమి. కమలము మకరంధమును మిళిందముల కొసంగునట్లును, మేఘము పృథ్వీపై నఖండముగా వర్షించునట్లును, రుక్మిణీకాంతుడు ప్రసన్నుడై బోధరాజున కఖండ ధాన్యము ననుగ్రహించెను" అని చెప్పుకొనుచుండిరి. ఈ విషయ మాప్రాంతము నందంతయు వ్యాపించి బోధరాజుకీర్తినివిని ప్రజలాతని మహిమవిశేషములను పరిపరి విధముల గొనియాడుచుండిరి.

ఒకనాడు బోధరాజు పొలములో భగవన్నామస్మరణ జేయుచు కూర్చుండియుండగా నచ్చటికి రెండుక్రోసుల దూరమునగల రాళేరాస గ్రామమునుండి బోధరాజు బాపమరుదుల యింటిలో సేవజేయు 'హాసీ' యను భావుకురాలు వచ్చి యాతనిపాదములపై బడి శరణుబొంది "నా జన్మ సార్ధకమగు నుపాయమును దెలుపు"మని కోరగా బోధరాజు ఈమె పరాధీనురాలు. జప, ధ్యాన, తీర్థాటనలేమియు జేయజాలదు. కాంతయు, దాసదాసీలును, గోవృషభ వాహనములును పరాధీనములు. దుష్కృతము ననుసరించి పరాధీనమగు జన్మలభించుచుండును, కాన వారు నిత్యనియమమును యథావిధిగా జేయజాలరు. ఇప్పుడీమెకు ప్రత్యుత్తరమీయక మౌనమవలంబించినచో నామెకుగల ప్రేమ నశించును" అని యాలోచించి "ఓ తల్లీ! నా వచనము వినుము. సంసారవ్యామోహమున దగుల్కొనియున్న వారలు భగవన్నామస్మరణచేతనే నిశ్చయముగ తరింతురు. పదిహేను దినములకొక పర్యాయము నీవేకాదశీ వ్రతము నాచరించుచు రాత్రివేళలయందిచ్చటికివచ్చి కథాకాలక్షేపములను శ్రవణముజేయుచు తిరిగిపోవుచుండుము. శ్రీ పాండురంగదేవుని చరణారవిందముల నఖండముగ హృదయమున నిలిపికొనినచో నిస్సంశయముగ నాతడు నీకు సగుణరూపముతో దర్శనమిచ్చి సార్థకజన్మురాలనుగా జేయును" అని చెప్పగా హాసీ సాష్టాంగనమస్కారముచేసి ప్రత్యేకాదశికి ధామణ గ్రామమునకు వచ్చి బోధరాజును దర్శించి యాతడు చేయు కథాకాలక్షేపములను శ్రవణముజేయుచుండెను. సజ్జనులధికారమునకు దగిన సాధనజెప్పుదురు. సద్వైద్యుడు రోగమును గుర్తించి యౌషధము నిచ్చునట్లును, నృపవరుడు సింహాసనముపై గూర్చుండి యధికారముతో ప్రధానికి తన యాజ్ఞను దెలుపునట్లును, గృహచారిణి చాతుర్యముతో గోడలితో పనిపాటలుజేయించునట్లును, వివేకియగు శ్రీమంతుడు యోగ్యుని జూచి యప్పిచ్చునట్లును, చతురుడగు వక్త సభనుజూచి కీర్తనజేయునట్లును. మహాత్ములు తమ్మాశ్రయించినవారి యోగ్యతనుజూచి వారల కుచితమగు సాధనల బోధింతురు. బోధరాజు జేసిన యుపదేశానుసారముగ హాసీ ప్రపంచవ్యవహారముల జూచుకొ

నుచు నఖండముగ హరినామస్మరణజేయుచు నేకాదశీదినమున కథా సమయమున 'ధామణ' గ్రామమునకేగి బోధరాజు కీర్తనజేయు సభాస్థలమంతయు శుభ్రపరచి యుదకమును బ్రోక్షించి ముగ్గులతో నలంకరించుచుండెను. బోధరాజు హరికీర్తనస్థలమున పృథ్వి యాసనముగను, నాకాశమే మండపముగను భావించుచుండెను. అతడు చేయు హరినామ సంకీర్తన విని సురవరు లానందించుచుండిరి. పరిసర ప్రాంతములనుండి యపారజనులు గుంపులుగుంపులుగా యాత్రాజనులవలె 'ధామణ' గ్రామమునకు బోయి బోధరాజు చేయు కథాకాలక్షేపములను శ్రవణము జేయుచుండిరి.

ఒక యేకాదశీదినమున 'రాళేరాస' గ్రామమునుండి బోధరాజు సంకీర్తన వినుటకై జనులపారముగ 'ధామణ' గ్రామమునకు బోవుచుండగా నొకనిని త్రాచుపాము కరచుటచే నాతడు తత్‌క్షణమే మరణించెను. ఆతని వెంటనున్న జనులెల్లరును ప్రేతముపై వస్త్రము గప్పి కథాస్థలమునకు దీసికొనిపోయి యాప్రేతము నొకచోట గూర్చుండబెట్టిరి. బోధరాజు నామమాహాత్మ్యము బ్రకటించి యెల్లరును కరతాళములువేయుచు భగవన్నామమును భజింపు" డని చెప్పెను. దుర్జనులొకచోట గుంపుగజేరి "ఈ గృహస్థుని ప్రాణము కీర్తనలో బోయినది. నామనామమునందు మహత్తరశక్తియున్నది. ప్రహ్లాదభక్తు నగ్నిలో బడద్రోసిన శీతలమయ్యెను. విష మమృతమయ్యెనని మీరు చెప్పియుంటిరి. ఈ కథాస్థలమునందు ప్రాణములు విడచిన యీతనిని సజీవునిగా జేసినచో మీరు చెప్పు నామమహాత్మ్యమును మేము విశ్వసింతు" మని యాతనిని బ్రశ్నించి యవమానపరుప దలచిరి.

బోధరా జా సమయమున కథాప్రారంభముజేసి శ్రవణజనులతో "భగవన్నామ మతిపవిత్రమైనది. అమృతమునకంటె మధురమైనది. కాన మీరెల్లరును కరతాళములను వేయుచు విఠ్ఠలనామమును గర్జనగా బలుకు" డని చెప్పగా శ్రోతలెల్లరు తదేకధ్యానముతో గరతాళ




బోధరాజు కీర్తన జేయుట

ములను వేయుచు, విఠ్ఠలనామము నుచ్చరించుచుండిరి. దుర్జనులు బోధ రాజునుజూచి "అయ్యా! యీ కూర్చుండియున్న గృహస్థుమాత్రము భగవన్నామ ముచ్చరించుటలేదు" అని చెప్పిరి. సర్పము గరచుటచే నాతడు మృతుడయ్యెనని బోధరాజునకు దెలియక నా ప్రేతముయొద్దకు బోయి, చేతులుజోడించి "నాయనా, ఎనుబదినాలుగులక్షల జీవరాసులలో నతి దుర్లభమగు నర దేహము లభించియు, జన్మ సార్థకమగు భగవన్నామమును జేయక నమూల్యమగు నాయువును నిద్రయందును నలసటయందును వ్యయము జేయుకుము. ఉల్లాసముతో గరతాళము వేయుచు భగవన్నామము నుచ్చరింపుము" అని చెప్పెను. బోధరాజు చేయు కథాకాలక్షేపమునకు లీలానాటకసూత్రధారియగు శ్రీ పంఢరీనాథుడు సగుణరూపమును ధరించి యచట గూర్చుండి యానందముతో శ్రవణము జేయుచు "బోధరాజు ప్రేతముయొద్దకు బోయి యాతని నామము నుచ్చరింపుమని గోరుచున్నాడు. ఆతడు సర్పదష్టుడై మృతిజెందెనని బోధరాజునకు దెలియదు. ఇప్పు డా ప్రేతము నామోచ్చారణ జేయనిచో బోధరాజు విక్షిప్తమనస్కుడగును. పాండురంగడనగు నేను సన్నిధియందుండగా, కథా కాలక్షేపమునం దానందమునకే విఘ్నమును నేర్పడరాదు" అని తలచి శ్రీ పంఢరీనాథుడు యమధర్మరాజుతో కథా స్థలమునకున్న ప్రేతమును దిరిగి పునర్జీవితునిగా జేయుమని చెప్పగా నా కృపాసింధువు పలికిన వచనములను విని యముడు చేతులు జోడించి నమస్కారము జేసి "తమయాజ్ఞ నవశ్యముగా పాలింతు" నని చెప్పి యా ప్రేతమును బునర్జీవితునిగా జేసెను. పునర్జీవితుడైన యా గృహస్థు కరతాళములను వేయుచు బోధరాజు చరణములపై బడి సాష్టాంగనమస్కారము జేసెను

రాళేరాస గ్రామమునుండి వచ్చిన భావుకు లాతడు సర్పదష్టుడై మరణించిన వృత్తాంతమును సవిస్తరముగ బోధరాజునకు దెలిపిరి. అసంఖ్యాకులగు శ్రోతలెల్లరు నాశ్చర్యముతో గరతాళములు వేయుచు జయ జయ ధ్వనులను జేసిరి. భావుకజను లానందించిరి. బోధరాజు

నేత్రములనుండి యానందాశ్రువులను విడుచుచు "ఓ దేవాధి దేవా; భక్తవత్సలా! అనాధుడనగు నేను చేయు కథా కాలక్షేపమునకు విఘ్నము రాకుండ ప్రేతమును పునర్జీవితునిగ జేసి నాకు దుర్జనులవలన నవమానము కలుగకుండ గాపాడితివి. మక్షిక మన్నములో బడినచో బాలకునికి దెలుపకయే యాతనితల్లి దానిని దీసివేయునట్లు నాకు దెలుపకయే నాకు ఘాతము గలుగకుండ నివారించితి"వని ప్రార్థించి శ్రీ రుక్మిణీకాంతునకు మంగళ హారతిజేసి సాష్టాంగ నమస్కారము జేసెను.

'ధామణ' గ్రామముననున్న స్త్రీ పురుషు లెల్లరును "బోధరాజేశ్వరావతారుడు. జడజీవుల నుద్ధరించుటకై భూలోకమున మానవరూపమున నవతరించె"నని యాతని మహిమ విశేషమును పరిపరి విధముల గొనియాడుచుండిరి. సాధకు లీశ్వర భజన జేయుచుండ వారలకనేక విఘ్నములు తటస్థించుచుండును. పాత్రలో క్షీరముండుటనుజూచి మార్జాలము లేచి యుండునట్లును, తస్కరులు ద్రవ్యమునకై వేచియుండు నట్లును, వ్యాఘ్రము శ్వాపదములను బట్టుకొనుటకై నిరీక్షించునట్లును, చంద్రునకు రాహువు కళంకము నాపాదించ యత్నించునట్లును, నీశ్వర భజనజేయువారికి దుర్జనులవలన విఘ్నములు తటస్థించుచుండును. బోధరాజుయొక్క యనుగ్రహము బొందుటవలన 'హాసీకి' పూర్ణజ్ఞానము కలిగి యేకాదశిదినమున ధామణ గ్రామముజేరి బోధరాజుచేయు హరికథా కాలక్షేపమును సావధానముగ మూడు సంవత్సరములు శ్రవణము చేయగా నామె చేయు భక్తికి మహావిఘ్న మేర్పడెను. ఆమె యజమానులగు బోధరాజు బావమరుదు లిరువురును పాలు పంచుకొనుచు నామెను విక్రయింపదలచిరి. ఈ వర్తమానము హాసీకి దెలిసి చింతాక్రాంతురాలై "నాకర్మ బలవత్తరముగనున్న"దని తలచి తత్క్షణమే ధామణ గ్రామమునకువచ్చి బోధరాజు చరణారవిందములను బట్టుకొని రోదనము జేయుచుండెను. బోధరాజామెతో "హాసీ' నాకాశ్చర్యముగ నున్నది. నీ దుఃఖమునకు కారణమేమి? తెలుపుము" అని యడుగగా "నా సర్వస్వము మీరని గొప్ప యాశతో గురుభావముతో పూజించు

చుంటిని. నేటినుండియు మీ చరణసేవజేయు భాగ్య మంతరించినది. నా యజమానులగు మీ బావమఱుదు లిరువురును నన్ను విక్రయింప బ్రయత్నించుచున్నారు. దూరమునుండి యెందరో గ్రాహికజనులు వచ్చిరి. వారలు నన్నుగొని తీసుకొని పోయినపిదప మీ కథాకీర్తన లను వినుభాగ్యము నాకుండదని విచారించుచుంటిని” అని చెప్పగా బోధరాజు “వ్యర్థముగా నీవు చింతింపకుము. తరంగములు సాగరమున నుద్భవించి యందే లీనమగుచున్నను నవి జలమయముగానే యుండును. అట్లే శ్రీ పాండురంగ డానందసాగరుడు. జీవులమగు మనము తరంగ ములము. నీవిది యంతరంగమున దెలిసికొనినచో నీ చిత్తమునందు వియోగమను భావము బాధింపదు” అని చెప్పగా హాసీ “గురుదేవా! నేనందులకై దుఃఖించుట లేదు. మీ చరణసేవా సాంగత్య మంతరించు చున్నదని విచారించుచుంటిని” అని చెప్పి మూర్ఛిల్లి కొంతసేపటికి లేచి గృహములోనికిబోయి మమతాబాకి వందనములుజేసి “తల్లీ! మీ సోద రులు నన్ను విక్రయించుచున్నారు. నేను దుఃఖసాగరమున బడి యున్నాను. నన్ను మీ గృహమున సేవకొరకై యుంచుకొని మీసోద రులకు ప్రతిఫలమిచ్చి నాచే సేవ జేయించుకొనుడు” అని కోరెను. మమతాబాయి ‘హాసీ’ యొక్క దుఃఖమునుజూచి మనమున కరుణ గలిగి బోధరాజుయొద్దకుబోయి “ప్రాణేశ్వరా! మీరు నాసోదరుల యొద్దకుబోయి ‘హాసీ’ని విక్రయమునకు గొనుడు. మీ యొద్ద ద్రవ్యము లేనిచో నామె నీ గ్రామమున నెవరికైనను విక్రయించుట కేర్పాటు జేయుడు” అని చెప్పగా బోధరాజు హాసీకి భయమొసంగి “నీవు గృహ మునకు బొమ్ము. నీవెనుకనే నేనువచ్చెదను” అని చెప్పెను. మృతజీవి పై నమృతము వర్షించునట్లు బోధరాజు వాక్యమునువిని హాసీ యమితా నందమునుజెంది ‘రాళేరాస’ గ్రామమునకు బోయెను. బోధ రాజామె వెనుకనేబోయి బావమరదులను జూచి “మీకు దాస్యము చేయుచున్న ‘హాసీ’ని విక్రయించెదరని వినియుంటిని. మీరు విక్రయింప దలచినచో మూల్యమేదైనను నేర్పాటుజేసి యామెను నా గృహములో సేవజేయు టకు బంపుడు. నేను గృహమునకుబోయి ద్రవ్యమును త్వరితముగ బంపె

ద"నని చెప్పెను. వారలు కోపోద్దీపిత మానసులై ధనవంతులమగు తాము దరిద్రుడగు బోధరాజునకు దాసీని విక్రయించు టవమానకర మనిదలచి "మా గృహమున సేవజేయు దాసీ నితరుల కుచితముగా నైనను నిచ్చెదముగాని మూల్యమునకైనను నీకీయ"మని యభిమాన ముతో బలికిరి. విఠ్ఠభక్తుడగు భోధరాజు మౌనముగ నూరకుండుటచే గృహమునందున్న హాసీ వెక్కివెక్కి యేడ్చుచు "నాకర్మము విపరీత ముగనున్నది. మహాభక్తుడగు బోధరాజు బావమరదులకు బ్రత్యుత్తర మీయలేక మౌనమవలంభించెను. నిశ్చయముగ నాకు దుర్గతి సంప్రాప్తించు"నని పరిపరి విధముల తన విపరీతకర్మను స్మరణకు దెచ్చుకొను చుండెను. అంత బోధరాజు హాసీయొద్దకువచ్చి తన బావమరుదులు చూచుచుండగనే "హాసీ! నీవు దుఃఖింపకుము. నేను విఠోబాదేవునికి దెలిపి యాతనిచే నిన్ను గ్రయమునకు గొనిపించెదను" అని చెప్పి ధామణ గామమునకుబోయి జరిగిన వృత్తాంతమంతయు మమతాబాయికి దెలియ జేసెను.

రాళేరాసగ్రామమునందు దుస్స్వభావముగల బోధరాజు బావ మరుదులిరువురును "విఠోబాదేవునిచే గొనిపించెద" నని చెప్పి బోధ రాజువచన మసత్యముజేయుటకై యామెను ద్వరితముగా విక్రయింప దలచిరి. పరగ్రామమునుండి యాదినమున గ్రాహికజనులు రాగా నిరు వదియైదువరహాల కామెను విక్రయించిరి. హాసీ పంఢరీనాధుడు రాలే డని దుఃఖించుచు "ఓ దీనదయాళో! పంఢరీనాధా! 'నేను విఠోబాదేవు నికి దెలిపి గొనిపించెదను, నీవు చింతింపకు' మని బోధరాజుపోయెను - నేను దేహమును త్యజించి ప్రాణముల నీకర్పింతు" నని ప్రార్థించుచుం డగా తత్ క్షణమే శ్రీ పంఢరీనాధుడు విప్రవేషముతో నచటికి బోయి హాసీనిజూచి "బోధరాజు నిన్ను బిలచుచున్నా" డని చెప్పగా నామె హృష్టచిత్తయై బ్రాహ్మణవేషధారియగు భగవంతుని చరణములకు నమస్కారముజేసెను. శ్రీ పంఢరీనాధుడు హాసీచేతిని బుచ్చుకొని యెల్లరును జూచుచుండ హాసీసహితముగ నంతర్ధానమై యామెకు దన

సాన్నిధ్య మనుగ్రహించెను. అచ్చటగల జనులెల్లరును నత్యాశ్చర్యము నొందిరి. గ్రాహకుడు మోసముజరిగినదని తలచి తన ద్రవ్యమును దిరిగి యిమ్మని యడిగెను. బోధరాజు భావమరుదులు గ్రాహకునితో "నామెను నేను విక్రయించితిమి, ఆ వచ్చిన బ్రాహ్మణుడు 'బోధరాజు బిలచు చుండె' నని చెప్పెను; కావున నీవు భామణగ్రామమునకు బోయి బోధరాజు నడుగు" మని చెప్పగా "బోధరాజునకు మీరామెను విక్రయించుటకు నిరాకరించుటచే నాతడు విఠోబాదేవునికి దెలిపి ఖరీదుజేయించెద నని బోయెను. ఆతడు చెప్పినట్లే జరిగినది. నాద్రవ్యమును నాకిం" డని పరస్పరముగా వాదించి గ్రాహకుడు వారలయొద్ద ద్రవ్యమును దీసి కొనెను.

డెబ్బదిరెండవ యధ్యాయము సమాప్తము.

సర్వాగ్రహ రూపిణే నమః.



# బోధరాజునకు నవాబు పెట్టిన మాంసాహారము ఫలములగుట.

—♦ డెబ్బదిమూడవ అధ్యాయము ♦—

'ధామణ' గ్రామమునం దతి వాచాలుఁడగు నంత్యాజు డొకడుండెను. ఆతడొకదినమున బోధరాజుయొద్దకు వచ్చి "మీ చరణారవింద ములయందు నా కమితప్రేమయున్నది. నాకు మంత్రోపదేశముజేసి నన్ను మీ శిష్యునిగా భావింపుడు" అని ప్రార్థించెను. బోధరాజాతని పలుకులువిని నేనెవరికి నుపదేశము నీయను. అయినను శ్రీ పంఢరీ నాథుని విచారించి ఆత డాజ్ఞాపించినచో జూచెదను" అని చెప్పి వైకుంఠ నాయకుని మనమున నిలిపికొని "ఓ దేవాధిదేవా! నా ప్రార్థన నాలకింపుము మన గ్రామమున నివసించు నస్పృశ్యుడు భావుకుడుగ గనబడుచుండును. ఆతడు బహుదినములుగ నుపదేశముగావలెనని కోరుచున్నాడు. ఆత డుపదేశమున కర్హుడా? కాదా? తెలుపుము" అని యడుగగా శ్రీ పంఢరీనాథుడు "నీచస్వభావుల కుపదేశము జేయరాదు. అఖండముగ నవిశ్వాసముతో గూడిన మనస్సుగలవారికినీ, శాస్త్ర వచనములయం దనాదరణ జూపువారికి నుపదేశము నీయదగదు. జ్ఞానవిరక్తులకును, భావుకులగు ప్రేమజనులకును నుపదేశమునిచ్చి శిష్యులనుగా జేసికొనవచ్చును. ఆయస్పృశ్యుడు కుమతి కాన వానిని నీవు పరీక్షింపుము. రేపటి రోజున గ్రామదేవత పూజయుండుటచే నీ దొడ్డిలోని వృషభమును వాని హస్తములతో జంపి యా మాంసమును వాని హస్తములతో దయారుచేసి రహస్యము నెవరికిని దెలుపక గుప్తముగా నా మాంసమును నీ గృహమునకు దెచ్చిపెట్టుమనియు, నట్లు జేసినచో నీకు మంత్రోపదేశము జేసెదననియు నా యస్పృశ్యునితో జెప్పుము" అని చెప్పెను. అంత బోధరాజు "ఓ పంఢరీనాథా! వ్యర్థముగ వృషభము నేల జంపవలెను. జీవహింస జేయుటకు నా మనస్సంగీకరింపదు" అని

చెప్పగా శ్రీ రుక్మిణీరమణుడు "నాయాజ్ఞ నీకు పరమ ప్రమాణము. హింసాకర్మ నిన్నేమియు బాధింపజాలదు" అని చెప్పెను.

మరునాడు ప్రాతఃకాలసమయమున నంత్యజుడు బోధరాజు యొద్దకువచ్చి యాతని చరణములకు నమస్కరించి కృపతో నాకు మంత్రోపదేశము జేయుమని కోరెను. బోధరాజాతనిఁజూచి "నీతో నొక రహస్య కార్యమున్నది. నేడు గ్రామదేవత పూజజరుగును. బంధువులకు విందుల నేర్పరచితిమి. గ్రామదేవత పూజదినమున మాంసాహారము శూద్రాచారమై యున్నది. కాన నీవు నాదొడ్డిలోనున్న తెల్లనివర్ణమును, నల్లనిమచ్చలను గలిగియున్న కోడెదూడను దీసికొనిపోయి గుప్తముగా వధించి యా మాంసమును దయారుజేసి నా గృహమున దెచ్చి యుంచుము. ఈ రహస్యము నెవరికిని నెరింగింపక యుండినచో నిన్ను సచ్ఛిష్యునిగా భావించి మంత్రోపదేశము చేసెదను" అని చెప్పెను. అవశ్యమని యాయంత్యజుడు పలికి యాతని కోడెదూడను వధించి మాంసమును దయారుచేసి యీయగా బోధరాజు గ్రామదేవత పూజకై వచ్చిన బంధువులకు మాంసాహారవిందులు చేసెను. బంధువు లెల్లరును హింసాకార్యమగు మాంసాహార భోజనము బెట్టుట కితడెట్లంగీకరించెనని యాశ్చర్యపడిరి. కాని కోడెదూడను జంపి యా మాంసమును పెట్టెనని బంధువు లెవరికిని తెలియదు. బంధువు లెల్లరు దృప్తిగా భుజించి దమతమ నివాసములకేగిరి. అస్పృశ్యుడు కోడెదూడను వధించినప్పుడు దానితలమును, పైచర్మమును పొలములో పాతియుంచెను.

అస్పృశ్యుడా రాత్రియంతయు పరిపరివిధముల మరాలోచనలను జేసి తెల్లవారినపిదప నీరహస్యమును గ్రామములో నెరింగింపవలయునని తలంచి నిదురింపకయే కాలముగడిపెను. సూర్యోదయమైన పిదప నా దురాచార గ్రామములో బ్రవేశించి యచట శూద్రుల గృహములలోనికి నిర్భయముగ బోయెను. అస్పృశ్యుడు భీతిజెందక నిర్భయముగ గృహములో బ్రవేశించుచుండ వారు కనుగొనగా "మీరాకును

నాకును భేదమేమున్నది? మీరును పశుమాంసము దింటిరి. నేనును మాంసము దినువాడను. మరి నన్నేల దూరునిగా జేసెదరు? నిన్నటి దినము బోధరాజు నన్ను బిలచి యాతని దొడ్డిలోని శ్వేతవర్ణమును, నల్లనిమచ్చలును కలిగియున్న కోడెదూడను నాచే వధింపించి యా మాంసముచే గ్రామదేవత పూజసందర్భమున మీకెల్లరికిని భోజనములో బెట్టెను. ఈరహస్య మితరులకు దెలుపవలదని యాతడు నన్ను పరిపరివిధముల బతిమాలెను. నేనా కోడెదూడయొక్క శిరమును, చర్మము నాతని పొలములో బాతియుంచితిని" అని పలికెను. గ్రామమునం దీ వర్తమానము వ్యాపించి బోధరా జనుచితముజేసెనని జను లెల్లరు జెప్పుకొనుచుండిరి. కొందరిది యసత్యమనిరి. కొందరది యదార్థమని పలుకుచుండిరి. మఱికొందరు బోధరాజుయొక్క కోడెదూడ దొడ్డిలో లేదని బలుకుచుండిరి. బంధువులెల్లరును నొకచోట గుమిగూడి "మనమెల్లరము బోధరాజుయొద్దకు బోయి యాతని నీ విపరీతకార్యము జేసితివేలయని యడుగుదము" అని యాలోచించి యస్పృశ్యునిజూచి "నీవు యదార్థము బలుకుము. మేమతనిని విచారించి నీవుచెప్పినప్రకార మాతడు పశుమాంసమును బెట్టినది నిజమైనచో తత్‌క్షణమే యాతనిని హత్యజేసెదము" అని పలుకగా నస్పృశ్యుడు వారితో "అయ్యా! ఆతని కోడెదూడను నాతడు చెప్పినప్రకారము నేను వధించి శిరమును, చర్మమును పొలములో పాతియుంచితిని, ఇప్పుడే నావెంట రండు. మీకు జూపెదను" అని చెప్పగా నెల్లరును సంతప్తమనస్కులై రాజదండన కైనను వెరువక బోధరాజును హత్యజేయదలచి బల్లెములను, కత్తులను దీసికొని బోధరాజుయొద్దకు బోయిరి. ఆసమయమున నాతడు నేత్రములను మూసికొని హృదయమున విఠ్ఠలుని నిలిపికొని నామస్మరణ జేయుచుండెను. బంధువు లాతనిని సావధానపరచి "నిన్ను వధించుటకై వచ్చితిమి నీవు మాకు పశుమాంసమునుబెట్టి భ్రష్టులనుగా జేసితివి! అని పలుకగా బోధరాజు "ఓ పంఢరీనాథా! ఈ సంకటసమయమున దీనుడనగు నన్ను రక్షించుటకు నీవుతప్ప కృపావంతులెవరును లేరు" అని ప్రార్థించు

ఖండ దురాచారు లాతనితో "నిన్ను రుక్మిణీకాంతుడు రక్షించును. మాకుమాత్రము పశుమాంసమునుబెట్టి భ్రష్టులనుగా జేసితివి" అని చెప్పిరి ప్రజ లస్పృశ్యునిజూచి దృష్టాంతముగా నీవు భూమియందు పాతియుంచిన కోడెదూడయొక్క శిరమును, చర్మమును దెచ్చి చూపు మనగా నాతడావశ్యమనిజెప్పి పొలములోనికిపోయి త్రవ్వి చూడగా శ్రీ పంఢరీనాథుడు భూమిలో పాతిన వృషభ శిరమును, చర్మమును మార్చి మేక తల, చర్మము నుంచెను. వాడు వానిని దీసికొని యథో ముఖుడై గ్రామప్రజలతో "అయ్యా! నేను కోడెదూడను నిశ్చయముగ జంపితిని. దాని శిరమును, జర్మమును భూమియందు పాతియుంచితిని. అవి విపరీతముగ మార్పుజెందిన" వని పలికెను.

గ్రామస్థులు బోధరాజునుజూచి "నీ కోడెదూడ యేమైనది తెలుపుము" అని యతని దొడ్డిలోనికిబోయి చూచిరి. పూర్వమునలె బోధ రాజుదొడ్డిలో కోడెదూడ యుండుటనుజూచి గ్రామస్థు లత్యాశ్చర్య మనస్కులై వ్యర్థముగ బోధరాజును చలనముజేసితిమని చింతించి యంత్యజుని వధించుటకు సంసిద్ధులైరి. గ్రామస్థుల క్రోధస్వభావమును జూచి యంత్యజుడు గజగజ వణకుచు బోధరాజునకు సాష్టాంగనమస్కారములనుజేసి "నా యనంతాపరాధములను క్షమింపుడు. నేను దుర్జనుడను. నీచజాతియందు జన్మించిన చండాలుడను. నా ప్రాణరక్షణము చేయుడు" అని ప్రార్థించెను. బోధరాజు దుర్జనుని వాక్యములను విని దయార్ద్రహృదయుడై యస్పృశ్యుని వధింపవలదని ప్రజలను కోరెను. గ్రామస్థులెల్లరును బోధరాజునకు సాష్టాంగనమస్కారముజేసి తా మనుచితకార్యము జేసినందులకు లజ్జితచిత్తులై తమతమ యిండ్లకేగిరి. శ్రీ రుక్మిణీకాంతుడు బోధరాజుహృదయమున సాక్షాత్కరించి "యస్పృశ్యుని బరీక్షింపవలెనని నేను గుహ్యార్థమును నీకు దెలిపితిని. నీ వనుభవ పూర్వకముగ దృష్టాంతము జూచితివిగదా! అని పలుక బోధరాజు "ఓ జగజ్జీవనా! నీ మహిమవిశేషముల నెవ్వరును నెరుగజాల" రని చెప్పి సాష్టాంగనమస్కారము జేయగా వైకుంఠాధిపతి హాసవదనుడై యాత

నిని గృపాదృష్టితో జూచి యంతర్ధానుడయ్యెను. ధామణ గ్రామమున సర్వజనులు, నీ కౌతుకమును జూచి "ఈతడు దాసుడు, పరమజ్ఞాని. కేవల మీశ్వరానతారుడు, వ్యర్థముగా నజ్ఞానముచే నాతని నిందించితిమి" అని పశ్చాత్తప్తచిత్తులై బోధరాజు మహిమవిశేషములను పరిపరి విధముల గొనియాడుచుండిరి.

ఒక సంవత్సరమున నాకస్మికముగ నా దేశమున వర్షములు లేక పొలములలో ధాన్యాదుల యుత్పత్తులను రైతులు మానుకొనిరి. కార్తికమాసమందు స్వాతికార్తెలో వర్షమపారముగ బడెను. బోధరాజు ధాన్యము నుప్పుదీసికొని తనభూమిలో జల్లెను. ఆ సమయమున తంబుర తాళమృదంగాది వాద్యములతో హరినామ సంకీర్తనజేయుచు బతాకహస్తులగు భక్తజనులు పంఢరీపుర యాత్రకు బోవుచుండిరి. బోధరాజు సద్భావముతో వారికి సాష్టాంగ నమస్కారముచేసి "నేడు నా భాగ్యము గొప్పదగుటచే మహాత్ముల దర్శన మాయె"నని పలుకగా వారు బోధరాజునుజూచి "నీవు దుష్కాలమున నన్నదానము జేసిన మహాదాతవు. నీకీర్తి విని వచ్చితిమి. యాత్రాపరులమగు మాకీ పూటభోజన మేర్పాటు జేసి క్షుద్బాధనుండి తొలగింపుము" అని కోరిరి. బోధరాజు వారలకు భోజన మేర్పాటుచేయుటకై గృహములో ధాన్యము లేనందున జింతించి సజ్జనులగు నా యాత్రాజనులకు భోజన మేర్పాటు చేయనిచో సత్యమునకు హాని సంప్రాప్తింపుననితలచి పుత్రు నేకాంతముగ బిలచి యాతనితో భూమిలో జల్లిన ధాన్యమునంతయు బ్రోగు చేసి యాత్రాజనులకు భోజన మేర్పాటుచేయుము. భూమి నిర్జీవమైనది. సజ్జనులు సజీవులు. వారల యుదరములలో నీ బీజములను వేసినచో మన కేమియు కొదువయుండదు" అని చెప్పగా నాతడు సంతుష్టచిత్తుడై పిత్రాజ్ఞానుసారముగ బొలములో జల్లినధాన్యమును శుభ్రముగ బ్రోగు చేసి యాత్రాజనుల కన్నదానమునకై మణుగుంపావు ధాన్యమును వినియోగించి పుచ్చగింజలను తన పొలములో జల్లెను. గ్రామస్థులెల్లరును విపరీతమగు నీ కార్యమునుజూచి పరిహసించుచుండిరి. కొలది

దినములకు బోధరాజు పొలములో విపరీతముగ బుచ్చకాయలుకాసెను ఒక దుర్జనుడు బోధరాజు పొలముయొద్దకువచ్చి, 'మేము బోధరాజు యొక్క ప్రజలము, ఆతడు లౌకికాభిమానములను త్యజించెను, ఈ పొలములో ఫలించిన పుచ్చకాయలన్నియు ప్రజలకొఱకే యాతడు ఫలింపజేసెనని యచట ప్రజలతో చెప్పి పొలములో ప్రవేశించి యొక పుచ్చకాయనుగోసి దానిని ముక్కలుచేసిచూడగా నీశ్వర మహిమావిశేషముచే నాకాయ గోధుమలతో నిండియుండెను. ఇది యా గ్రామాధికారికి దెలియ నాతడు నవాబున కీ వృత్తాంతమును లిఖిత పూర్వకముగా దెలిపెను. బోధరాజు కృత్రిమవిద్య ప్రజలకు జూపుచుండెనని భావించి నవాబైదుగురు భటులను బోధరాజును దీసికొని వచ్చుటకై ధామణి గ్రామమున కంపెను. రాజాజ్ఞప్రకారముగా భటులు బోధరాజును బంధించి రాజసభకు దీసికొనిపోయిరి. నవాబు బోధరాజునుజూచి క్రోధముతో "నీ పొలములో పుచ్చకాయలలో గోధుమలను బండించితినని కృత్రిమ వాక్యము లుపలికి ప్రజలను మోసగించుచున్నావు. పుచ్చకాయలలో గోధుమ లెట్లుండును? తెలుపుము" అని యడుగగా నావిషయము శ్రీ పంఢరీనాథునకు దెలియునుగాని నా కెంతమాత్రము దెలియదని బోధరాజు జవాబిచ్చెను.

గీతాశాస్త్రమును సంజయుడు చదువు చుండగా ధృతరాష్ట్రునకు నమ్మకము లేనట్లును, నిజభక్తుడగు బోధరాజు వాక్యములందు నవాబునకు విశ్వాసము కలుగక క్రోధాయమానుడై యాతని నిర్బంధముగ మహమ్మదీయులలో గలుపుకొనుటకై నిశ్చయించి మాంసాహారమును తెప్పించి యాతని యెదుటబెట్టి నిర్బంధపరచెను. బోధరాజా సమయమున శ్రీ పంఢరీనాథుని మనమునదలిచి ఓ దేవాదిదేవా! నన్నీ సంకటమునుండి కాపాడుము" అని ప్రార్థింపగా నాతనియెదుట నుంచబడిన మాంసాహారమంతయు వివిధ ఫలరూపముగ మారెను. నవాబీ కౌతుకమునుజూచి త్వరితముగ లేచి బోధరాజునకు సాష్టాంగ నమస్కారముజేసి "నీకు కావలసినంత ధనమిచ్చెదను కోరుము" అని చెప్పగా

బోధరాజు విముఖుడై తత్క్షణమే యచటనుండి లేచి "నాకేమియు గోరికలేదు కామధేనువు గృహమునందుండగా నింటింటికి దిరుగు పని లేనట్లును, కల్పతరువు వాకిటనుండ జింతింప బనిలేనట్లును, ఐరావతము వాహనముగనుండ గాడిదనెక్కుట యనుచితమైనట్లును, హరికీర్తన జరుగుచుండ డప్పువాద్యము వినుట కెవ్వరును బోనట్లును, పరమహంస దీక్షలో నున్నవారు గృహస్థాశ్రమములో బ్రవేశింపనట్లును, ప్రేమతో భగవద్భజనయందు లీనుడగువాడు రాజ సన్మానమును బొందడు" అని పలికి యచటినుండి తిరిగి స్వస్థానమును జేరి యఖండముగ నామస్మరణ చేయుచుండెను.

ఇట్లు కొంతకాలము జరిగినపిదప నొక దినమున శ్రీ పంఢరీనాథుడు గోసాయివేషమును ధరించి బోధరాజుకీర్తి జగద్విఖ్యాతము చేయనెంచి సర్వాంగములకు విభూతిని బూసికొని, జోలెను వేసికొని బోధరాజు గృహమునకు బోయి 'అల్లఖ్' వచనమును బలుకుచు దానము నడుగగా బోధరాజు భోజన పదార్థములు దెచ్చి యాతని జోలెలో వేసెను. పిదప సాధువేషధారి "ఓ బోధరాజా! నాకొక కోరికయున్న"దని చెప్పగా "అవశ్యము నీకోరిక దీర్చెదను చెప్పుమని" బోధరాజనెను. అంత గోసాయి "ఓ బోధరాజా! నీ కోడలగు భాగీరథీబాయిని నాకిమ్ము. పాండురంగనికృప నీపై పూర్ణముగ ప్రసరించును" అని చెప్పెను. బోధరాజు గృహములోనికిబోయి మమతాబాయితో "ప్రియే! గోసాయి కోరిన కోరిక నెరవేర్చెదనని ప్రథమమున నవిచారముగ వాగ్దానము జేసితిని. ఆతడు భాగీరథి నిమ్మని కోరుచున్నాడు" అని చెప్పగా కోడలి నర్పించు విషయములో నాకేమి యధికారమున్న"దని యామె ప్రత్యుత్తరము జెప్పెను. పొలమునందున్న యమాజీని బిలిపించి బోధరా జాతనితో "నాయనా! యామాజీ! నీభార్యయగు భాగీరథిని బైరాగి కోరుచున్నాడు. నేను ప్రథమమున నవిచారముగ నీకోరికను దీర్తునని యాతనికి వాగ్దానము నొసంగితిని. భాగీరథి నర్పించుటలో నాకును, నీతల్లికిని నేమి యధికారమున్నది"? అని చెప్పగా నాతడు

తత్ క్షణమే "మీరేమియు విచారింపక నవశ్యముగా భాగీరథిని గోసాయి కర్పింపుడు" అని చెప్పెను.

బోధరాజు భాగీరథీబాయిని జూచి "ఓ తల్లీ! భాగీరథీ! నీవు మహా పతివ్రతవు. నిన్ను గోసాయి గోరుటచే నాతని కర్పించితిమి. నీకొరకై యాతడు వేచియున్నాడు. ఆతనివెంట బోవుము" అని చెప్పగా నామె "తమయాజ్ఞ నవశ్యముగా బాలింతును" అని చెప్ప మమతాబాయికిని, బోధరాజునకును, భర్తకును సాష్టాంగనమస్కారములజేసి వేషధారియగు నాతనివెంట బయలుదేరెను బోధరాజు కోడలినిజూచి "ఓ భాగీరథీ! నామాట వినుము. నీవాతని విడచి తిరిగి రావలదు" అని చెప్పగా నామె యవశ్యమనిచెప్పి గోసాయివెంట బోవుచుండెను. గ్రామమునజనులెల్లరును 'బోధరాజునకు మతిభ్రమణము గలిగినది. భాగీరథిని గోసాయికి ధర్మముజేసె" నని పరిపరివిధముల బరిహసించుచుండిరి. బోధరాజు దారపుత్రాదులలో ప్రజలు నిందించు విషయములను వినక సమాహితచిత్తుడై యఖండముగ విఠ్ఠల నామస్మరణ జేయుచుండెను. గోసాయి భాగీరథిని వెంటబెట్టుకొని పంఢరీపుర మార్గముగ గ్రామమునుండి పావుక్రోశముదూరము పోయి సగుణస్వరూపమును ధరించి దేదీప్యమానమగు రత్నఖచిత కనకకిరీటమును, ప్రకాశవంతములైయున్న మకరకుండలములను, గళమున కోమల తులసీమిశ్రిత పుష్పహారమును, వైజయంతీమాలను, కంఠమున కౌస్తుభమణిని, నమూల్యములగు పీతాంబరములనుధరించి శ్యామలవర్ణుడై కటిన్యస్తహస్తములతో సమచరణయుక్తుడై భాగీరథికి దర్శనమిచ్చెను. తత్క్షణమే భాగీరథి భగవంతునకు సాష్టాంగనమస్కారముచేసి "ఓ దేవాధిదేవా! పంఢరీనాథా! నీ దర్శనముచే నామనోరథ మీడేరినది" అని పలుకగా శ్రీ పంఢరీనాథు డామెనుజూచి నీవిచటినుండి గృహమునకు బోవుమని చెప్పెను. అంత భాగీరథి నేను పోవుటకు వీలులేదు. నాభర్తవాక్యము నాకు పరమప్రమాణము. నా యత్తమామలు తిరిగి యింటరిగా రావలదని చెప్పిరి. నేను పోయినచో వారలు నన్నంగీకరింపరు. లోకధర్మము

ననుసరించి నేను పోవుటయు, వార లంగీకరించుటయు హాస్యాస్పదమై యుండును. నా కన్యమార్గము తోచుటలేదు. నేను నీవెంటనే వచ్చెదను. నన్ను నీవు విడచి పోయినచో మానరక్షణకై నేను నిశ్చయముగ నాత్మహత్య జేసికొనెదను. నా యాత్మహత్యవలన నీకు స్త్రీ హత్యా మహాపాపమంటి నీ దేవత్వము నాశనమగును. కాన నీ నా గౌరవ మర్యాదలు చెడకుండ నా యత్తమామలకును, భర్తకును నపకీర్తి గలుగకుండ బాగుగ నాలోచించుకొని నీ వీ సగుణస్వరూపముతో సర్వజనులు జూచుచుండ నావెంట నిలువలనే నడచివచ్చి నన్ను నా యత్తమామలకును, భర్తకును నప్పగింపుము నీ వట్లొనర్చితివేని భూలోకమున శాశ్వతకీర్తి మా వంశమునకును, నీకును గలుగు" నని చెప్పెను.

(శ్రీ) పంఢరీనాథుడు పతివ్రతాశిరోమణియగు భాగీరథి కోరిక ననుసరించి యామెవెంట రాజవీథి నడచుచు బోధరాజు గృహము జేరెను. గ్రామప్రజ లెల్లరును (శ్రీ) పంఢరీనాథుడును, భాగీరథియు నడచి పోవుటను జూచి యత్యాశ్చర్యముతో బోధరాజగృహమును జేరిరి. భాగీరథి భగవంతుని వెంటబెట్టుకొని గృహము జేరగనే బోధరాజును, మమతాబాయియు, యమాజీయును నమితానందభరితులై (శ్రీ) పంఢరీనాథునకు సాష్టాంగ నమస్కారము జేసిరి. భగవంతుడు వారలను కృపాదృష్టితో జూచి "మీరు భూలోకమున జన్మించి జన్మలను సార్థకము జేసికొంటిరి. మీ యవతార కార్యక్రమము పూర్తియైనది" అని చెప్పి వారలకు తన సాయుజ్యము ననుగ్రహించెను. బోధరాజు జీవితమంతయు భగవత్సేవకు వినియోగించి 'ధామణ' గ్రామమును మహా క్షేత్రముగ జేసెను.

డెబ్బది మూడవ అధ్యాయము సమాప్తము.

పరాత్పరాయ నమః.

# గణేశనాథ చరిత్ర

## — తొమ్మిది నాలుగవ అధ్యాయము —

జయజయ! అచలావ్యయావినాశా, అనామా, అరూపా, పరమ పురుషా, బ్రహ్మాండనాయకా, జగన్నివాసా, స్వానందాధీశా, శ్రీహరి! నిజభక్తులు నిన్ను స్మరించుచుందురు. నీవే వారల నిధిధ్యాసవై యున్నావు. బాలునిపై దల్లి కమిత వాత్సల్యముండునట్లును, నీ ప్రేమభక్తులపై నీక మిత వాత్సల్యముండును. పూర్ణిమనాటి చంద్రప్రకాశమునుజూచి సాగరు షుల్లాసముతో నుండునట్లు నిజభక్తుల కీర్తివిని జగజ్జీవనుడవగు నీవు సంతసింతువు. భక్తులు నీ లీలావైభవములను వర్ణింతురు. నీకును భక్తుల మాహాత్మ్యములను బ్రకటనజేయుటయం దఖండ ప్రేమయుండును. కాబట్టి భక్తుల సచ్చరిత్రలను నా హస్తమునుండి వ్రాయించుచుంటివి.

మహారాష్ట్ర దేశమునందు 'భాలేఘాటా' ప్రాంతమునందు సారసీ, ఉజ్జనీ యను గ్రామములుగలవు అచ్చట జ్ఞానియు, వివేకియు, నతివిరక్తుడును, సద్గురూపాసకుడునగు గణేశనాథుడను భక్తుడుండెను. ఆతడు కర్ణముద్రలను కౌపీనమును ధరించి, యుపాధిరహితుడై పగలంతయు నరణ్యమునవసించి యేకాంతముగ హరినామ సంకీర్తన జేసికొనుచు రాత్రివేళలయందు గ్రామములో బ్రవేశించి కథాకాలక్షేపములను జేయుచుండెను. ఆతడు నానా విధములగు సన్మానములందును, లౌకిక పూజా దాంభిక భజనములందును, వస్త్రాలంకారములందును, మృష్టాన్న భోజనాదులయందును విముఖుడై యుండెను.

ఒకానొక సమయమున నా దేశమును బరిపాలించు శివాజీ మహారాజు యాత్రార్థమై పంఢరీపురమునకు వచ్చి గణేశనాథుని కీర్తి విని యాతని దర్శనమునకుబోయి సాష్టాంగ నమస్కారము జేసి యాతడు చేయుచున్న హరినామసంకీర్తన శ్రవణము జేయుచు కూర్చుండెను. గణేశనాథుని విశాలజ్ఞానమును, రసవంతికమగు కవిత్వమును, నానావిధోపమాలంకారములతో గూడిన దృష్టాంతముల నుపదేశవాక్య

ములుగాం యభంగములను శ్రవణము జేయుటచే శివాజీ మహారాజు నకును, శ్రోతలకును నపార సుఖముగలిగెను. ఆతడు శయనించుటకై మంచము నొకదానిని జేయించి గణేశనాథుని యొద్దకుబోయి చేతులు జోడించి "స్వామీ! నేనొక క్రొత్తమంచమును దయారు జేయించితిని. తమరు నా భవనమునకు విచ్చేసి యొకరాత్రి యామంచముపై నిద్రింప వలెనని కోరగా నృపవరు నాదరవచనములకు సంతసించి యాతని కోరిక ననుసరించి యాంతర్యమున భయముతో వ్యాఘ్రముచే దీసికొని పోబడు చున్న లేడి కంపించునట్లు కంపించుచు నా వైరాగ్యశీలుడు కొన్ని కంకరరాళ్ళను మూటగట్టుకొని శివాజీమహారాజ్ వెంటబోయెను.

శివాజీమహారాజా తనిని పల్లకీలో గూర్చుండబెట్టుకొని తన భవనమునకు దీసికొనిపోయి పుష్పశయ్య నేర్పరచి గణేశనాథు నద్దానిపై నిద్రింప బ్రార్థించి నానావిధ విలాస భోగవస్తువులను, పరిమళ సుగంధ ద్రవ్యములను, నొక పళ్ళెములోనుంచి దానిపై వస్త్రమునుగప్పి యాతని యెదుటబెట్టి యామంచమునకు నాలుగువైపుల తెరలను గట్టించి తాను వెలుప గూర్చుండి చూచుచుండెను. గణేశనాథు డనుతప్తచిత్తుడై యవనుని మందిరమున వసించుటకు బ్రాహ్మణోత్తముడు విముఖుడగునట్లును, ఘృతమున బడిన మక్షికము తబ్బిబ్బగునట్లును, రాజోప భోగముల యందు విముఖుడైయుండెను. చిలుకను బట్టుకొని పంజరమున బంధించి నచో దానికిమేతయు, నీరును రుచింప నట్లా హంసతూలికాతల్పము గణేశనాథునకు గంటక ప్రాయముగ నుండెను. గణేశనాథుడు మూట గట్టుకొనివచ్చిన కంకరరాళ్ళను పరుపుపైబరచి వానిపై నిద్రించెను. ప్రాతఃకాలమున శివాజీ రాజేతెంచి గణేశనాథునకు సాష్టాంగ నమస్కారముజేసి శయ్యపై కంకరరాళ్ళను జూచి యాశ్చర్య చకితుడై కంకర రాళ్ళను శయ్యపైవేసిన కారణమడుగగా "నా మంచముపై నిద్రించి నచో గాఢముగ నిద్రపట్టును. దానివలన జీవితమున సుఖములభించి ముందు దారుణదుఃఖము భోగింపవలసి యుండును. నీ కోరికను దీర్చుటకై కంకరరాళ్ళను వేసికొని నిద్రించితిని. దురదయున్నవాడు గోకు

కొను సమయమున బరమ సుఖముగ నుండునుగాని యనంతరము సౌఖ్యముగ నుండనట్లును,) భుజించుటకు పదార్థములు మధురముగ నుండునుగాని వమనము జేయునప్పుడు కష్టముగా నుండునట్లును, ప్రథమమున శయ్యపై బరుండ సుఖముగా నుండునుగాని యంత్యమున దేహమునకు దుఃఖము సంప్రాప్తించును. విషయభోగములు యదార్థముగా దుఃఖములని దెలిసికొనుము” అని చెప్పెను.

శివాజీరా జాతడు చెప్పిన విషయములనువిని నేటినండి నేను మంచముపై పరుండనని చెప్పి నిశ్చయచిత్తముతో నా మంచమును బ్రాహ్మణుల కర్పించెను. సత్సాంగత్యములోని మహిమవిశేషము గణ్యమైనది. బ్రహ్మాదులు సహితము దానిని వర్ణింపజాలరు. గణేశనాథుడు వైరాగ్యభరితుడై గ్రామములో వాసమేర్పరచుకొనక నరణ్యములలో దిరుగుచుండెను. కథాసమయములందు దర్శనమునకై వచ్చు నసంఖ్యాకులగు భావుకజనులకు స్వేచ్ఛతో నుపదేశించుచుండెను. అతడు వరదాభయ హస్తము మస్తకముపైనుంచిన నపార వైరాగ్యము గలుగుచుండెను. ఇట్లొక సంవత్సరకాలము జరుగగా నాతనియొద్ద మున్నూటయరువదిమంది శిష్యులు కౌపీనధారులై యాత్మజ్ఞానమును బొందిరి. పైఠనపురమునగల జనులు గణేశనాథునియొద్ద నుపదేశమును దీసికొని వారు ప్రపంచ భ్రాంతులనుండి తొలగి సద్గురువుతో దిరుగుచురని చెప్పుకొనుచుండిరి. కొందరాతనియొద్ద మహామంత్రమున్నది ఆ మంత్రముచే ప్రజలను వశపరచుకొనుచుండెననియు పలుకుచుండిరి. కొందరీతడు సంపూర్ణముగా నాత్మజ్ఞానవంతుడని చెప్పకొనుచుండిరి. మరికొందరీతడు వేషధారియని పలుకుచుండిరి. కొందరు పాండురంగడే యీరూపమున యవతరించెనని పలుకుచుండిరి. కొందరీత డేవో నాలుగు విషయములనుజెప్పి యెందరో గృహస్థులను నాశనము చేయుచున్నాడని పలుకుచుండిరి. మరికొందరు మనము స్వయముగాబోయి సంభాషించినగాని యదార్థవిషయము నేమియు నిర్ణయించుటకు వీలుకాదని పలుకుచు నాతని దర్శించుటకై పోయిరి.

ఆ సమయమున గణేశనాథుడు వృక్షచ్ఛాయను గూర్చుండి ధ్యానస్థుడైయుండెను. మానసపూజ ముగించుకొని గణేశనాథుడు వారిని జూచి శిష్యులను బిలచి వారల మస్తకముపై తన హస్తముంచెను. దుర్జనులు నిలువబడి యంతయు జూచుచు "నీ వనాయకుల నెందరినో శిష్యులనుగా జేసికొని యనేక సంసారులను నీటగలిపితివి. నీవలన ప్రజల కెంతయో కష్టము కలుగుచున్నది. నేము చెప్పు విషయముల నంగీకరించి యట్లాచరింపుచుండుము. నీవు విరక్తుడవు. ఆత్మజ్ఞానివి. నీ దృష్టికి సర్వము సమానమేగదా! నేటినుండియు నీవు కృపతో జెట్లకుపదేశించుచుండుము" అని చెప్పగా గణేశనాథుడవశ్యమని చెప్పి తత్క్షణమే యచటగల పురాతన రసాలవృక్షమునకు దారకమంత్రోపదేశము జేసెను. అంత నా దుర్జనులు "మీరు మనుష్యుల కుపదేశించు వారలను ప్రపంచభ్రాంతివిరహితులనుగా జేయుచుంటిరి. మీ యుపదేశమువలన నీవృక్షముల కెట్టియనుభవముగలుగునో కృపతో మాకు జమత్కారమునుజూపి సంశయనివృత్తి జేయుడు" అని చెప్పి తామునైవేద్యముగా దెచ్చిన కూర నాతనికిచ్చిరి. గణేశనాథుడదిపుచ్చుకొని తానుపదేశించిన వృక్షముతో నిది భగవత్ప్రసాదము. కాన ప్రీతితో భుజింపుము" అని చెప్పెను.

సద్గురునాథుని వాక్యములను వినగానే యామ్రానిలో నొక తొఱ్ఱ యేర్పడెను. గణేశనాథుడు దానిలో ప్రసాదమును వేయగా యథాప్రకారముగా నాతొఱ్ఱ పూడిపోయెను. ఈయాశ్చర్యమునుజూచి జనులెల్లరును తన్మయులై గణేశనాథునకు నమస్కారము జేసి "మీతో సములగు నిర్మలహృదయులగు జ్ఞానులెవ్వరును లేరు. నే మహంకారముచే వ్యర్థముగా మిమ్మవమానపరుప వచ్చితిమి. మా తప్పిదములను క్షమింపుడు" అని ప్రార్థించి యాతని యాజ్ఞనొంది తమ స్వస్థానములకేగిరి. ఒకదినమున గణేశనాథు డరణ్యమున కథాకాలక్షేపము జేయుచుండ శ్రవణమునకై సజ్జనులగు పండితులును, వైష్ణవులును, వైదిక శాస్త్రజ్ఞులును, భావుకజనులును, నష్టాదశవర్ణములందలి యితరప్రజలును ప్రేమతో కథాకాలక్షేపమును వినుచుండిరి. తంబుర తాళమృదం

గాది వాద్యములతో హరినామసంకీర్తన మఖండముగ నాదబ్రహ్మమై జరుగుచుండెను. గణేశనాథుడు హస్తములను పైకెత్తి పతాకమును ధరించెను. జ్ఞానులగుపండితు లాతనిజూచి "నీవు హీనజాతివాడవు. నే మగ్రజాతియందు జన్మించిన బ్రాహ్మణులము. నీయాజ్ఞానుసారముగ నేము కరతాళములను వేయము" అని చెప్పిరి.

అంత గణేశనాథుడు "మనకంటె నీ తాళవృక్షము చాల నెత్తుగ నున్నది. కాని దానిఛాయ యెవరికిని నుపయోగపడుటలేదు. అట్లే యష్టాదశవర్ణములలో విప్రు లతినిపుణులై, ప్రాజ్ఞులైయుండియు హరినామసంకీర్తనకు వారికరము లుపయోగపడుటలేదు. కాబట్టి మీరు స్వస్థచిత్తులై శ్రవణముచేయుడు. మీ కృపాకటాక్షముచే పాషాణములు కరతాళము వేయును" అని చెప్పెను. వైరాగ్యశీలుడగు గణేశనాథుని పలుకువిని యచటగల రాళ్ళెగురుచుండెను. కరతాళములు వాయించు నట్లు రాళ్ళొకదాని నొకటి కొట్టుకొనుచుండెను. జనులెల్లరు కౌతుకమును తటస్థముగ జూచుచు రాళ్ళకు జీవ మెట్లువచ్చెనని యాశ్చర్య చకితులై గణేశనాథుని మహామహిమ దెలిసికొనుటకు యింద్రాదిదేవతలకు సహితము సాధ్యముకాదని పరిపరివిధముల గొనియాడుచుండిరి. బ్రాహ్మణులెల్లరు అనుతప్తచిత్తులై కరతాళములను వేయుచుండ గణేశనాథుడు సమాహితచిత్తుడయ్యెను. అప్పుడు మధ్యాహ్నసమయ మైనందున మంగళహారతిజేసి తమతమ నివాసములకేగి "మన మహంకారముతో వ్యర్థముగా నాతని మహిమవిశేషమును దెలిసికొనక యవమానపరచితిమి" అని చెప్పుకొనుచుండిరి. గణేశనాథుడు ప్రేమభక్తుడగుటచే శ్రీ పంఢరీనాథు డతనికి వరదానమిచ్చి యుజ్జని, సారసీలను మహాక్షేత్రములనుగా జేసెను. సజ్జనులును, మహంతులును, యోగీశ్వరులును నా క్షేత్రమునకు బోయి దర్శించుచుందురు. భగవంతుడు తన నిజభక్తులకీర్తి నాచంద్రార్కముగా ప్రపంచమున వ్యాపింపచేయును.

ఎబ్బదినాలుగవ అధ్యాయము సమాప్తము.

శంభుప్రియాయ నమః.

# కేశవభక్త చరిత్ర

## —♦ డెబ్బదియైదవ అధ్యాయము ♦—

ఓ పాండురంగా! నిన్ను నేప్రార్థించునదేమనగా, నేను వేదశాస్త్రములు, నాధ్యాత్మజ్ఞానము నెరుగనివాడను. నీ భక్తులకీర్తిని వర్ణింపవలెనని నా చిత్తమునందు కోరికయున్నది. నేను కవిత్వమునందు కుశలుడను గాను. నాకు బుద్ధిబలమును లేదు. నేను సర్వవిధముల భ్రష్టుడనై యున్నాను. దాతనాశ్రయించి పేదలెట్లు జీవింతురో, యంధుడు నేత్రములుగలవాని నాశ్రయించి యెట్లునడచునో యట్లే ఓ రుక్మిణీపతీ! నేను నిన్ను సద్భావముతో శరణుబొంది సర్వభారములను నీపై వేసితిని. కాన నాకభయమిచ్చి నీ భక్తుల సచ్చరిత్రలను మూఢుడనగు నావాక్కునుండి వర్ణింపించుము.

పరమ భావుకుడగు కేశవభక్తుడు విషమరూప ప్రపంచమునుండి విముఖుడై యఖండముగ భగవన్నామసంకీర్తన జేయుచు దేశాటన జేయుచుండెను. ఒక యేకాదశీదినమున నాతడు విజాపురమునకు బోయి యా నగరమున హరికథాకాలక్షేపము జేయుచుండెను. ఆతడు మహావిరక్తుడని యానగరప్రజలెరిగి వైదికులును, పండితులును, భావుకులును, విరాగులును, నష్టాదశవర్ణముల యితరప్రజలును, నసంఖ్యాకముగ శ్రవణమునకై వచ్చిరి. తంబురతాళమృదంగాది వాద్యములతో హరినామసంకీర్తన నాదబ్రహ్మముగ జరుగుచుండెను. ఆ నాదము నాకర్ణించి విజాపురములోని చిన్నపెద్దలును, స్త్రీలు నచట చేరిరి. కేశవభక్తుడు దేహభ్రాంతి విరహితుడై యానందాశ్రుధారలను విడచుచు నృత్యము జేయుచుండెను. ఆ సమయమున నాతని శిష్యుడగు వృద్ధబ్రాహ్మణుడచటనుండగా నాతనిని బిలచి "నేడేకాదశీ పర్వకాలము, సర్వులు నుపవాసముండిరి. నీవు బజారునకుబోయి శొంఠిని చక్కెరను దీసికొనిరమ్ము. దానినే జనులువోవు సమయమున భగవంతునకు నైవేద్యము జేసి ప్రసాదముగా నీయవచ్చును" అని చెప్పెను. ఆ వృద్ధబ్రాహ్మణుడు గుర్వాజ్ఞప్రకారము బజారునకు బోగా రాత్రివేళయైనందున



కేశవభక్తుఁడు సంకీర్తన జేయుట

కులు దుకాణములను మూసి నిద్రించుచుండిరి. ఒక దుకాణమునొద్ద కాతడు పోయి దుకాణదారును శొంఠి, చక్కెరను ప్రసాదమున కేడు శేర్లిమ్మని కేక వేయగా నాత డవశ్యమనిచెప్పి దుకాణము దెరచెను. దీపము లేనందున దుకాణమంతయు నంధకారమయముగా నుండెను. దుకాణదారుడు వృద్ధబ్రాహ్మణునిజూచి "అయ్యా! నేను కథాశ్రవణము నకు రావలెననుకొంటిని; నా కుమారుడు సంతకుబోయి రాలేదు. అందుచే వచ్చుటకు వీలుకాలేదు" అని చెప్పి నిద్రమత్తులోనున్న యాతడు శొంఠిసంచిని దీయుటకు బదులుగ నాభిసంచినిదీసి యా చీకటిలో నేడు శేర్లు నాభిని, చక్కెరను తూనిక వేయకయే సుమారుగనిచ్చెను

వృద్ధబ్రాహ్మణు డది చూచుకొనక వానిని దీసికొనిపోయి చక్కెరను, నాభిని కలిపి రోటిలో వేసి మెత్తగ దంచి సుద్దగాజేసి కేశవభక్తున కిచ్చెను. వర్తకుడు తెలియక పొరపాటుచే శొంఠికిబదులుగ విషము నిచ్చెను. వృద్ధబ్రాహ్మణుడును జూడకయే రోటిలోవేసి వానిని దంచెను. అది ప్రసాదముగా శ్రోతల కిచ్చిన పిదప భుజించి మరణముజెందినచో గొప్ప యనర్థము సంప్రాప్తించును. నే డేకాదశీపర్వకాలము. భావుకు లుపవాసముతో నుండిరి. వీరు మరణించినచో నికమీాదట నా కీర్తన శ్రవణ మెవరునుజేయరు. భక్తులవచనముల నెవరును విశ్వసించరు. పూర్వము మహాత్ములు వర్ణించిన నా మహిమ విశేషములను జను లెవ్వరును నమ్మ" రని శ్రీ విఠలనాథు డాలోచించి ప్రసాదమునందలి విషమును తాను గ్రహించి దాని నమృతముగ మార్చి ప్రసాదస్వీకార ముచే భక్తులకు జననమరణములు తొలుగున ట్లనుగ్రహించెను. కేశవ భక్తుడు ప్రేమానందముతో నృత్యసంకీర్తనలు జేయుచుండెను. మంగళ హారతియైనపిదప విషముతోగలిసిన చక్కెరప్రసాదమును భగవంతునకు నైవేద్యముజేసి యా ప్రసాదమును శ్రోతలందరికి నిచ్చెను. జనులెల్లరు నాప్రసాదము నచటనే భుజించి తమతమ నివాసములకు బోయిరి.

మరునాడు ప్రాతఃకాలసమయమునందు వర్తకుడు దుకాణమును సర్దుకొనుచుండగా నాభిసంచి యూడదీసియుండుట నకస్మాత్తుగ జూచి

"గొప్ప యనర్థము జరిగినది రాత్రి కేశవభక్తునకు కొంటికి బదులుగ జూడక చీకటిలో విషమునిచ్చితిని. ఇప్పు డేమిచేయవలయును? రాత్రి ప్రసాదమును భుజించినవారెల్లరును మృత్యుముఖులై యుందురు. ఈ మహాపాపము నాకుఅంటి నేను రౌరవనరకమును భోగింపవలసివచ్చును. ఈ వర్తమానము నగరప్రజలకు దెలిసిన నన్ను జంపివేయుదురు. నాకిహ పరలోకములయందు సహితము శాశ్వతనిందయు, దండనయు దప్పదు. నాతోసముడగు మహాపాపి త్రిభువనములందుండడు. చతుష్పాదజంతువు లలో గాడిదయు, పందియు హీనమైనవి. నేను వానికంటె నధముడను" అని తలచి దుకాణమును విడచి పోవుచుండెను. నగరమున నెవరైనను మృత్యుముఖులైన వార్తలను జెప్పుకొనుటగాని లేక యేడ్చుటగాని లేనందున కనబడిన జనులను జూచి "అయ్యా! రాత్రి మీరు కేశవ భక్తుని కథాశ్రవణము జేసితిరా? నేనును రావలెననుకొంటినిగాని నా కుమారుడు సంతకుబోయి రానందున నేను వచ్చుట కవకాశము లేక పోయినది" అనిచెప్పి విషయమంతయును గ్రహించి "భగవత్ప్రసాదమును రాత్రి మీరచట దీసికొనియుంటిరిగదా! మీవద్ద నున్నచో నాకు కొంచెమిప్పింపుడు" అని యడుగగా వార లేకాదశియుపవాస మగుటచే ప్రసాద మచటనే భుజించితి మనిచెప్పగా "అయ్యా! నిన్న నిరాహారులై యుంటిరి. మీకు కడుపులో వికారముగనుండును. త్వరితముగా నేడు పారణజేయుడు" అని చెప్పెను. అంత నాగృహస్థులు "ఓ సెట్టీ! మేము నీవలె తిండిబోతులము కాము. ఇంకొకదిన ముపవాసమైనను జేయు నభ్యాసముగలవార" మని పలికిరి. ఆ వర్తకుడు పరస్పరముగ సమా చారమంతయు దెలిసికొని స్మశానమునకు బోయి చూడగా నచట నొక ప్రేతమైనను లేనందున నాశ్చర్యచకితుడై పంఢరీనాథు డరిష్టమును తొలగించెనని తలచెను.

కేశవభక్తుడు స్నానముజేసి దేవతార్చన జేసికొనుటకై పూజా స్థలమున గూర్చుండి చూడగా, ధాతుమూర్తులు మలినాకారముతో నుండుటజూచి విస్మితచిత్తుడాయెను. చంద్రునికి గ్రహణము పట్టినచో

చంద్రుడు తేజోహీనుడై యుండునట్లు శ్రీ రుక్మిణీరమణుడు మలినాకారుడుగ నున్నాడని యాశ్చర్యముతో శిష్యులను బిలచి వారి కాలోహపు విగ్రహములను జూపెను. అంతలో నావ ర్తకు డచ్చటికి వచ్చి కేశవ భక్తుని చరణములపైబడి సాష్టాంగనమస్కారము జేసి "ఓ భక్తశిఖామణీ! నావలన గొప్ప యపరాధము జరిగినది క్షమింపుము" అని జరిగిన వృత్తాంతమంతయు దెలిపెను. కేశవభక్తు డాతడుచెప్పిన వృత్తాంతమంతయు విని యానందాశ్రుధారలను విడచుచు గద్గదస్వరముతో "ఓ దీన దయాళూ, శ్రీవిఠ్ఠలా! నీవు భక్తాభిమానివను నీబిరుదు సార్థకపరచి భక్తుల రక్షించితివి. శ్రోతలను మృత్యుముఖమునుండి తొలగించి నీవు విషభక్షణము జేయుటచే మలినాకారుడవైతివి. నీనామమును స్మరించి ప్రహ్లాదుడు విషపానముజేయ నాతనికి విష మమృతమయ్యెను. నిన్ని కించిద్విష మెట్లుబాధించినది. నీవు దేవాధిదేవుడవు. సర్వశ్రేష్ఠుడవు. శంకరుడు హాలాహలము భక్షింపగా నాతడు నీనామమును భజించగనే తాపము చల్లారెను. ఓ శ్రీవిఠ్ఠలా! నిన్ని విష మెట్లుబాధించినది. నీవు కాళింగుని మద మణచితివి. పూతన స్తన్యపానమను మిషతో విషపాన మీయగా దాసిని మర్దించితివి. నిన్నివిషము బాధించుట విచిత్రముగా నున్నది. నే డమృతమునకు మరణము తటస్థించినట్లు, నంధకారము సూర్యు నావరించినట్లును, భాగీరథి పాపములనుజేసి మలినాకారయైన ట్లును, పృథ్వికి తృణము భారమైనట్లును, చంద్రమండలమునకు తాపము కలిగినట్లును క్షీరసాగరమునకు క్షుద్బాధ కలిగినట్లును, శంకరునకు పిశాచబాధ కలిగినట్లును, దారిద్ర్యము కుబేరుని బీడించినట్లును, బ్రహ్మదేవు డసత్యము బలికినట్లును నిన్ను విషము బాధించినదా? ఓగోవిందా! నీవు భక్తుల మాహాత్మ్యమును బ్రకటనచేయుటకై నానావిధములగు లీలలను జూపుచుందువు, ఓ పంఢరీనాథా! నీవజుడవు; అజితుడవు? కలి కాలులకు నియంతవు. నాపై కృపయుంచి యథాప్రకారముగ ప్రకాశవంతమగు రూపముతో దర్శన మిమ్ము" అని ప్రార్థింపగా శ్రీ రుక్మిణీ కాంతుడు సంతసించి దేదీప్యమానమగు ప్రకాశముతో పూర్వరూప

మున దర్శనమిచ్చెను. ఈ కౌతుకమును జూచి యెల్ల రాశ్చర్యము నొంది కలియుగమునందు భగవత్ప్రాప్తికి నామసంకీర్తనకు మించినది లేదని యనుభవపూర్వకముగ దెలిసికొనిరి. ఆ వర్తకు డనుతాపముతో ప్రపంచవ్యవహారములను ద్యజించి కేశవభక్తునకు శిష్యుడై యఖండముగా సేవ జేయుచుండెను.

డెబ్బదియైదవ అధ్యాయము సమాప్తము.

రాధామనోహరాయ నమః.



# గోమాబాయి చరిత్ర

## —♦ డెబ్బది యారవ అధ్యాయము ♦—

ఓ అనాథబంధూ! శ్రీవిఠ్ఠలా! నీ కృపగలిగినచో ప్రాణుల భవ బంధములు తొలగి స్పర్శవేది స్పర్శచే నినుము బంగారమగునట్లును, సూర్యోదయముచే నంధకారము నశించునట్లును. మురికి కాలువలు గంగలో కలిసి పవిత్రములగునట్లును, దోషములన్నియు నశించును. అంత్య జాతి హీనజాతులవారిని వేదములు నిందించినవి. వారలను నీ వుద్ధరించితివి. పశుపతి జాతియందు జన్మించిన గజేంద్రునకు కలిగిన సంకటము తొలగించి నీ సాయుజ్యము నొసంగితివి. శ్రుతిశాస్త్రాదులయందు నిందింపబడిన హీనజాతులవారు నిన్ను ప్రేమతో భజించుటవలన వారలు నీ నామమహాత్మ్యమువలన వంద్యులైరి. మహాకవియగు వాల్మీకి జన్మించిన కులమును నీవు పవిత్రము జేసితివి. సద్భావముతో నిన్ను శరణు పొందిన యనంత భక్తులను నీవు తరింపజేసితివి. కాబట్టి నిన్ను నేను శరణు పొందితిని.

గోమాబాయియను బ్రాహ్మణ వితంతువు పరమ భావుకురాలై శమదమాది సద్గుణములతో గూడియుండి యఖండముగ భగవన్నామ స్మరణ జేయుచుండెను. ఆమె పూర్వజన్మ విశేషము ననుసరించి యమిత దారిద్ర్యముచే నన్నవస్త్రాదులులేక నుంఛవృత్తివలన జీవించుచుండెను. పంఢరీపురమున జరుగు నాషాఢ శుద్ధయేకాదశీ బ్రహ్మోత్సవమును సేవించుటకై యామె పంఢరీపురమునకు దశమినాటికి జేరెను. ఆ సమయమున చంద్రభాగానదీ ప్రవాహము విశేషమై యుండుటచే యాత్రాజనులు పడవలలో నెక్కి నదినిదాటి క్షేత్రములో ప్రవేశించుచుండిరి. యాత్రార్థముగా వచ్చిన శ్రీమంతులెల్లరు పడవవానికి ద్రవ్యమిచ్చి పడవలో గూర్చుండిరి.

గోమాబాయియొద్ద నొక పైసయైనను లేదు. ఆమె యాత్రికులతో బాటుగ పడవ నెక్కుచుండగా నావికుడామెను క్రిందికి దోసెను.

గోమాబాయి మిగుల జీర్ణవస్త్రమును ధరించెను. ఆవస్త్రముదప్ప నామెకు మరియొక వస్త్రములేదు. నావికు డామెను త్రోయుటవలన నదీజలములో పడుటచే నాజీర్ణ వస్త్రము తడిసినందున నామె విలపించుచు నదినిదాటి గ్రామములో బ్రవేశించు నుపాయము తోచనందున దీర్ఘస్వరముతో రోదనజేయుచు నావికుని ప్రార్థించగా పైసలిచ్చినచో నదిని దాటించెదనని యాతడు చెప్పెను. అంత గోమాబాయి నావికునితో "నాయనా! నాయొద్ద జొన్నపిండి మాత్రమున్నది. నీకు కొంత్త పిండి నిచ్చెదను"అని చెప్పగా నా దుర్మతియగు కఠినహృదయు డామెను పడవలో నెక్కించు కొనకయే పోయెను. యాత్రాజనులెల్లను నదిని దాటిపోయిరి. గోమాబాయి మాత్రము మిగిలియుండెను.

గోమాబాయి దుఃఖాక్రాంతురాలై "ఈ క్షేత్రవాసులు కఠిన హృదయులు వారికి దయారసమే లేదు" అని చింతించుచుండెను. తత్క్షణమే శ్రీ పంఢరీనాథుడొక నావికుని వేషమును ధరించి నావను త్రోసికొనివచ్చి గోమాబాయినిజూచి "ఓ తల్లీ! నీవు నదినిదాటి గ్రామములోనికి రాదలచినచో నా పడవలో గూర్చుండుము", అని చెప్పగా నామె నావికునితో "నాయనా! నేను నిరుపేదను. నాయొద్ద ద్రవ్యమేమియునులేదు. జొన్నపిండి మాత్రమున్నది నీకది యిచ్చెదను" అని చెప్పెను. నావిక వేషధారియగు భగవంతుడు "నేనెవరియొద్ద నేమియు ప్రతిఫలము దీసికొనకయే యనాథులను నదిని దాటించెదను, నేనీకార్యమును బహుదినములుగా జేయుచు నీక్షేత్రమునందు వసించుచుంటిని" అని చెప్పగా గోమాబాయి యానందించి నావికునిజూచి "నాయనా! నేను కట్టుకున్న జీర్ణవస్త్రముతప్ప మారువస్త్రము నాయొద్దలేదు. ఇప్పుడురాత్రి ప్రథమ యామము జరుగుచున్నది. కట్టుకొనిన వస్త్రము తడిసినచో చలిచే బాధపడవలసి వచ్చును"అని చెప్పెను.

శ్రీ పంఢరీనాథు డామెనుజూచి "తల్లీ! విచారింపకుము. నేను నీ వస్త్రములు తడియనీయకయే నిన్ను నామూపుపై గూర్చుండబెట్టు

కొని పడవలో నుంపెదను. నీ పాదములుసహితము తడియవు" అనిచెప్పి దీనదయాళుడు గోమాబాయి నెత్తి పడవలో గూర్చుండబెట్టి యామెను నదిదాటించి యొడ్డున జేర్పగా గోమాబాయి యత్యాశ్చర్యముతో నా నావికునిజూచి "నాయనా! నీపాదములు నీటిలో దడియకయే నీవు నన్ను నదినెట్లు దాటించితివి, ఇది మిగుల విచిత్రముగా నున్నది" అని పలికెను. అంత నావికవేషధారి "ఓ తల్లీ! నేను యీనదిని దాటించుటయేకాదు, దాసులను భవసముద్రమునుండి యిటులనే దాటింతును" అని చెప్పగా గోమాబాయి "నాయనా! నీయుపకారము కొనియాడ దగనది. నాయొద్దనున్న పిండి కొంత యిచ్చెదను తీసికొమ్ము" అని చెప్పెను. శ్రీ పంఢరీనాథుడు గోమాబాయితో "నేనెవరియొద్దను ప్రతిఫలము దీసికొనువాడనుగాను. నీపిండిని ద్వాదశినాడు బ్రాహ్మణులకర్పింపుము" అని చెప్పి యంతర్థాను డయ్యెను.

గోమాబాయి యానందముతో దేవాలయమునకుబోయి శ్రీ పంఢరీనాథు నానందముతో సేవించెను. మరునాడగు యేకాదశి రోజున చంద్రభాగలో స్నానముజేసి శ్రీ విఠలనాథుని సేవించి యుపవాసముతోనుండి యా దినమంతయు హరినామ సంకీర్తనతో జాగరణ జేసి ద్వాదశిరోజున ప్రాతఃకాలమందు స్నానముజేసి "యొక విప్రునికి కొంచెము పిండినీయనిది భుజించు టెట్లు? లవణము, పప్పు, చక్కెర, మొదలగు పదార్థములేమియు లేని యీ పిండిని మాత్ర మెవ రంగీకరింతురు" అని చింతించుచు నదీతీరమందు గూర్చుండియుండెను. బ్రాహ్మణులా మార్గమున బోవుచుండ నామె వారిని బిలచి "నాయనలారా! నాయొద్ద పిండియున్నది. స్వీకరింపుడు" అని చెప్పగా "ప్రాతఃకాలమున విధవ దర్శనమైనది. ఈరోజున మన కేమియు లాభముండదు" అని యా విప్రులు కసరుకొనుచు పోవుచుండిరి.

గోమాబాయి "ఓ పంఢరీనాథా! నేను ద్వాదశి పారణజేయు టెట్లు? నీక్షేత్రమునకు వచ్చి యతిథు లెవ్వరికైనను పిండినీయక నేనెట్లు



గోమాంశాయికి శ్రీ విఠ్ఠలనాథుఁడు దర్శ మిచ్చుట.

భుజింపవలెను? దరిద్రురాలనగు నాయొద్ద నింకేమియులేదు. ఉపాయ నేమియు దోచుటలేదు" అని చింతించుచుండగా గోమాబాయి సద్భావమునకు శ్రీ పంఢరీనాథుడు సంతసించి తత్క్షణమే వృద్ధబ్రాహ్మణ వేషధారియై యామెయెదుట నిలువబడి "తల్లీ! నన్నాకలి మిగుల బాధించుచున్నది. నేననాథుడను. నన్నెవరు నాదరించరైరి. నీయొద్ద నేమియైన నున్నచో నాకిచ్చి క్షుద్బాధ నివృత్తిజేయుము" అని కోరగా గోమాబాయి యమితానందముతో తనయొద్దనున్న జొన్నపిండినిచ్చెను. శ్రీ పంఢరీనాథు డది తీసికొని "తల్లీ! నేనేకాకిని. నే నెచటికిబోయి నను నన్నెవరును జేరనీయరు. కాన నీవు రొట్టెలను జేసి యిచ్చితివేని యానందముతో భుజించి క్షుద్బాధను నివృత్తిచేసికొనెదను" అని చెప్పగా గోమాబాయి రొట్టెలను 'దయూరు' చేసి యిచ్చెను. ఇంతలో జగజ్జననియగు శ్రీ రుక్మిణీదేవి సుమంగలిరూపముతో నచ్చటికి వచ్చి "ప్రాణేశ్వరా! నన్నొంటరిగ విడచివచ్చి భుజింపనున్నారా?" అనియడిగి తానును భోజనమునకు గూర్చుండెను.

గోమాబాయి వృద్ధబ్రాహ్మణ దంపతులకు రొట్టెలను వడ్డింపగా వా రామెనుజూచి "నీవును పంక్తిని గూర్చుండుము. ముగ్గుర మొకే పంక్తిలో భుజింతము" అని చెప్పగా గోమాబాయియటులనే వారలతో భుజించి కరశుద్ధిజేసికొని వారలకు తులసీదళముల నర్పించి సాష్టాంగనమస్కారము జేయగా వారామెను కృపాదృష్టితో వీక్షించి యంతర్ధానమైరి. గోమాబాయి పంఢరీక్షేత్రముననే వసించి త్రికాలములయందును శ్రీ విఠ్ఠలనాథుని సేవించుచు నఖండముగ హరినామసంకీర్తన జేయుచు కాలమును గడపి యవసానమున శ్రీ విఠ్ఠలనాథుని సాన్నిధ్యము నలంకరించెను.

ఎబ్బదియారవ అధ్యాయము సమాప్తము.

దానవేంద్ర వినాశకాయ నమః.

# లతీబ్ శాహా చరిత్ర

## —♦ డెబ్బదియేడవ అధ్యాయము ♦—

ఓ సచ్చిదానంద పరబ్రహ్మమూర్తీ! అపరిమితమగు నీ కీర్తిని వర్ణించుటకు నాదిశేషునకును, బ్రహ్మదేవునికిని సాధ్యము కాలేదు. బాలకు డే యపశబ్దములను బలికినను నాతని జనని యానాపలుకుల నాలకించి యానందించునట్లు నీభక్తు లపశబ్దములతో నిన్ను స్తోత్రము జేసినను ప్రేమభక్తియోగమువలన నీవానందింతువు. నిన్ను పరమభావుకలగు గోపికలు బంధించిరి. విశ్వోద్ధారకుడవగు నీవు వారలకు భీతిల్లుట గొప్ప యాశ్చర్యము; నీప్రాప్తికొరకు మహాఋషులు గొప్పగొప్ప యజ్ఞములను చేసిరి. నీవు వారలకు లభింపక శబరియిచ్చిన యెంగిలిపండ్ల నానందముతో భుజించితివి! నీవు బ్రహ్మకు పితవైయుండి యశోదాదేవికి బాలుడవైతివి, నిన్నామె తొడపై గూర్చుండబెట్టుకొనెను. సార్వభౌముడగు దుర్యోధనచక్రవర్తిని ద్యజించి దాసీపుత్రుడగు విదురునింట భుజించితివి. పక్వాన్నముల పళ్లెములను ద్యజించి గోపాలుర ప్రేమభక్తిని గుర్తించి నీవు వారల యుచ్ఛిష్టప్రసాదమును పరమప్రీతితో స్వీకరించితివి. నా యార్ద్రవచనముల నంగికరించి భక్తుల సచ్చరిత్రలు వర్ణించుటకు నుచితమగు మతి ననుగ్రహింపుము.

లతీబ్ శాహాయను మహమ్మదీయుడు, పరమభావుకుడు, వైష్ణవుడునైయుండి గీతాభాగవతములను శ్రద్ధతో శ్రవణము జేయుచు నిరంతరము రామభజన జేయుచుండెను. ఆతడు మహమ్మదీయమతమును ద్యజించి భగవన్నామసంకీర్తనయం దఖండప్రేమగలిగి నియమముతో నిత్యమును పూజార్చనలను జేయుచుండెను. యవనులందరీతని ప్రవర్తనను సహింపజాలక నవాబునొద్దకేగి "లతీబ్ శాహా హిందూమతములో ప్రవేశించి, హిందూశాస్త్రశ్రవణ మఖండముగ జేయుచున్నాడు. కాన మీరతనిని బిలిపించి తగిన దండన విధింపుడు" అని చెప్పగా నవివేకియగు నా నవాబు లతీబ్ శాహా నవమానపరుపదలచి దూతల బిలచి మీరు లతీబ్ శాహా యాశ్రమమునకుబోయి యచ్చటగల సామగ్రినంత

యును దీసికొనిరండు" అని యాజ్ఞాపింపగా రాజాజ్ఞానుసారముగ సేవక జనులు లతీబ్ శాహా యాశ్రమమునకుబోయి యాతని దర్శనము జేసి శాంతిసుఖములను బొంది యనుత ప్తచిత్తులై "ఇక మనము రాజసేవను ద్యజించి యీ మహాత్మునియొద్దనే యఖండముగ గీతా భాగవతాది సద్గ్రంథములను శ్రవణము జేయుచు వసింతము" అని తలచి యచటనే యుండిపోయిరి.

ఈ వృత్తాంతము నవాబునకు దెలిసి విస్మితచిత్తుడై "దోపిడికై వెడలిన సేవకజనులలో నొక్కడును తిరిగి రాలేదు. కాన నేనే స్వయముగ నేగి లతీబ్ శాహా నవమాన పరచెదను" అని తలచి యతడే బయలుదేరెను లతీబ్ శాహా నవాబు రాకనుగురించి తెలిసికొని భాగవత గ్రంథమునుదీసి తులసిబృందావనము ప్రక్కగూర్చుండి పఠనజేయుచుండెను, భావుకులగు సజ్జనులు ప్రేమతో శ్రవణము జేయుచుండిరి. ఆ సమయమున నవింధనృపతి యచటకు విచ్చేసెను. ఆ తులసిబృందావనము మిగుల శోభాయమానముగనుండి దశావతారముల చరిత్రను దెలుపు చిత్రములతో గూడియుండెను. నానావిధములగు క్షేత్రనామములును, వైకుంఠ కైలాసాదుల చిత్రపటములును పలురంగులతో జిత్రింపబడి శోభాయమానముగ నుండెను. ఆ తులసి బృందావనము మట్టును, వివిధ సుగంధ పుష్పపరిమళములచే బూజింపబడుటచే నవాబాస్థలమునుజూచి కోపోద్దీపిత మానసుండై లతీబ్ శాహా నవమాన పరుపదలచి యా తులసిబృందావనము నందున్న చిత్రపటములలో రాధ తన చేతనున్న తాంబూలమును కృష్ణునినోట బెట్టుచున్నటుల చిత్రింపబడియున్న పటమును లతీబ్ శాహాకు జూపి "ఇందు చిత్రింప బడిన దెవరు?" అని యడిగెను.

అంత లతీబ్ శాహా "ఇది రాధాకృష్ణుల చిత్రపటము. ఇందు రాధ శ్రీకృష్ణునకు తాంబూల మర్పించుచునటుల చిత్రింపబడినది" అని చెప్పెను. అంత నవాబు సంతప్త చిత్తుడై "నీ కృష్ణుడెందులకు తాంబూ




లతీబ్ శాహాను నవాబు శరణుబొందుట.

లమును భుజించుటలేదు" అని యడుగగా లతీబ్ శాహాలేచి చేతులు జోడించి 'ఓ ద్వారకానివాసీ! శ్రీకృష్ణా! భక్తకైవారీ! జగన్మోహనా! నా విజ్ఞాపన నాలకింపుము. రాధ సద్భావముతో తాంబూలము నీనోట బెట్టుచున్నది. ఓ హృషీకేశా! త్వరితముగ తాంబూలమును భుజింపుము' అని ప్రార్థించెను.

దేవాధిదేవుడగు భగవంతుడు తన భక్తులయందుగల వాత్సల్యమును ప్రకటించుటకై యాచిత్రపటములో ప్రవేశించి రాజు నెల్ల జనులును జూచుచుండ రాధ యిచ్చుచున్న తాంబూలమును భుజించెను. ఈ కౌతుకమునుజూచి నవాబమితాశ్చర్యముతో లతీబ్ శాహాకు వందనములుచేసి "నీవు ధన్యుడవు. నీవుచేయుభజన శుద్ధమైనది. వ్యర్థముగ నిన్నవమాన పరుపవలయునని తలంచితిని. నా సర్వాపరాధములను క్షమించి నన్ను దాసునిగ నంగీకరింపు"మని ప్రార్థించి యాతని మహిమ విశేషములను పరిపరివిధముల గొనియాడుచుండెను. నవాబు లతీబ్ శాహా యొద్ద మంత్రోపదేశమునుబొంది యఖండముగా నాతని సర్వకాలములయందును సేవించుచుండెను. అప్పటినుండియు నగరవాసు లెల్లరును లతీబ్ శాహాయందు భక్తి విశ్వాసములతోగూడి యాతడు చేయు హరినామ సంకీర్తనల నఖండముగ శ్రవణము జేయుచుండిరి.

డెబ్బదియేడవ అధ్యాయము సమాప్తము.

ధర్మ మూర్తయే నమః

---

# సంతోబాపవార్ చరిత్ర

## —♦ డెబ్బది యెనిమిదవ అధ్యాయము ♦—

జయజయ వైకుంఠవాసీ, మనమోహనా, శేషశయనా, ఉపి నాశా, కల్పద్రుమా, పురుషోత్తమా. పాండురంగా, కృష్ణా విష్ణు, సదా శివా! నీవు సకలజీవులకు విశ్రాంతిస్థానమునై యున్నావు. భక్తులకు సౌఖ్య మనుగ్రహించు దాతవై యున్నావు.) పరాధారుల నాధారుడవై యత్యుదారుడవై యున్నావు. దుర్జనులు నీభక్తుల నవమానపరుప నీవు స్వయముగ వారిని సంహరించి భక్తుల మాహాత్మ్యమును ప్రకటన జేయుచున్నావు నీవనాథనాధుడవు, దీనులకు బంధువువైయున్నావు. ఓజ గజ్జీవనా! మందబుద్ధినగు నా కభయదానమిచ్చి భక్తుల సచ్చరిత్రలను నాచే బలికింపుము.

సంతోబాపవార్ యను వైష్ణవుడు పరమభావుకుడు నత్యుదారుడునైయుండి, గృహస్థాశ్రమ ధర్మమును నిర్వర్తించుచు, నశ్వగజసంపదలతోగూడి విశేషముగా ప్రజాదరాభిమానముల జూరగొనుచు సత్యశీలుడై యఖండముగ హరినామ సంకీర్తన జేయుచు కాలము గడుపుచుండెను. ఒకదినమున సంతోబాపవార్ భక్తతుకారామ్‌చేయు హరి కథా కాలక్షేపమును శ్రవణముజేసి, పశ్చాత్తప్తచిత్తుడై మిథ్యారూపమగు సంసారమున మాయాభ్రాంతులకు లోనై యమూల్యమగు నాయువును వ్యర్థముగ వ్యయపరచుట యవివేకమని నిశ్చయించి తన పరిచారకులను బిలిపించి "మీ మీస్థానములకుబోయి స్వేచ్ఛతో ప్రవర్తింపుడు" అని చెప్పి విప్రులను బిలిపించి అశ్వ, గజ, రథములను, ద్రవ్యమును వారికి దానముజేసి పరిచారిక జనుల కీనాములిచ్చి నాలుగు మూరల జీర్ణవస్త్రమును ధరించి ఉపాధిరహితుడై "రాంజణ" గ్రామమునందు వసించుచు విరాగియై నిర్లజ్జతో నృత్య సంకీర్తనలను జేయుచుండెను.

సంతోబాపవార్ భీమానదీ సంగమస్థానమునకు సమీపమున గల యరణ్యములో గూర్చుండి, యనుతప్తచిత్తుడై భ్రమరములు కమలములోని మకరందము నాస్వాదించుటకై యందు ప్రవేశించునటుల, యేకాంత వాసము జేయ నిచ్ఛతో సంతోబాపవార్ ఆయరణ్యమున నేకాంతముగ గూర్చుండి భగవద్గుణానుభవము జేయుచుండెను. ఈవిషయమును ప్రజలెల్లరెరిగి యత్యాశ్చర్యము నొందిరి. సంతోబాపవార్ తల్లి మిగులచింతించుచు "ఎంత విపరీతము జరిగినది. సేహాసంపదలను ధర్మము జేసి లౌకికమునకై పెద్దల పేర్లనైనను నిలుపక పుత్రుడు విదేహియయ్యెను. దుర్జనులు నానావిధముల బరిహాసించుచున్నారు" అనితలచి కోడలి నలంకార భూషణాదులతో గుమారుని యొద్దకుబంపిన స్త్రీమోహమువలన నాతడు మరల ప్రపంచభ్రాంతికి వచ్చునని తలచి కోడలిని పల్లకీలో బంపెను.

సంతోబా యా సమయమున నొక శివాలయములో నామస్మరణ జేయుచుండెను. ఆతనిభార్య యాకస్మికముగ పల్లకీలోబోయి యచ్చటదిగెను. సంతోబాపవార్ భార్యనుజూచి "నీవిచ్చటికేలవచ్చితివి. మారుపలుకక మరలిపొమ్ము" అని చెప్పగా నామె "నేను మీసమక్షముననే యుండెదను. సముద్రమును జలచరములు విడువనటుల, వృక్షమూలమును పల్లవము లాశ్రయించి యుండనటుల, సువర్ణమునాశ్రయించి కాంతియుండునటుల, పతివ్రత భర్త ననుసరించియుండును" అని చెప్పగా, సంతోబాపవార్ భార్యతో "నేనుదాననీనవృత్తి యందున్నాను. నీవు బహువిధములగు వస్త్రాలంకారములను ధరించియున్నావు. నిన్ను భార్యయని బిలచుటకు నాచిత్తమునందు లజ్జ యేర్పడును. నీవు కఠిన మనస్కురాలవై నాతో నుండదలచితివేని వస్త్ర భూషణాదులను యాచకులకు దానముజేయుము. లేనిచో తత్క్షణమే గృహమునకు బొమ్ము" అని చెప్పెను. ఇదివిని యామె యనుతప్తచిత్తురాలై సర్వాలంకారములనుదీసివేసి దివ్య వస్త్రములనువిడచి చిరుగులగుడ్డను గట్టుకొనెను.

దంపతులిరువురు ఉదాసీనవృత్తి నవలంబించి భగవన్నామస్మరణ జేయుచుండిరి.

కొంతకాలము జరిగిన పిదప నొకనాడు సంతోబాపవార్ క్షుద్బాధాపీడితుడై భార్యనుబిలచి "నీవు నగరమునకుబోయి భిక్షను దీసికొనిరమ్ము సాలోమాలోయొక్క 'పార' గ్రామమునందు బంధుమిత్రాదులు కలరు. నీవచ్చటకు నిర్లజ్జతో బోయి మమతతో జనులు బిలచి నను ప్రతివచనమునీయక మౌనధారిణివై పూర్ణమగు రొట్టె నెవరైన నిచ్చిన స్వీకరింపక అర్ధభాగమునుమాత్రమే దీసికొనిరమ్మని చెప్పెను. ఆయువతి యవశ్యమని చెప్పి లౌకిక లజ్జను, మానావమానములను త్యజించి 'పారా'గ్రామమున ప్రవేశించి యింటింట బిచ్చమెత్తుకొనుచుండెను. స్త్రీపురుషులెల్లరును నామెనుజూచి "జన్మాంతరమున జేసిన సుకృతవిశేషముచే విరాగియైనది" అని చెప్పుకొనుచుండిరి. ఆమె ప్రతి గృహముయెదుట నిలువబడి 'హరివిఠ్ఠల్' అని కేకవైచుచుండెను. తత్క్షణమే యెవరైనను బిచ్చముపెట్టనిచో నాచోటునువీడి చనుచుండెను.

ఆగ్రామమున సంతోబా చెల్లెలి గృహముండెను. సంతోబాసతి భిక్షాటనజేయుచు తనయాడుబిడ్డ గృహముయెదుట నిలువబడి హరివిఠ్ఠల్ అని కేకవైచెను. సంతోబా చెల్లెలు సహజముగ వచ్చి భిక్షుకియనిదలచి జోలెలో భిక్షనువైచి పిదప నామెను గుర్తించి రోదనము జేయుచు నాలింగనముజేసికొని "వదినా! నీ వతిసుకుమారివి. లావణ్యగుణరాశివగు నీవు నిన్నటిదినమున వస్త్రాలంకార భూషణముల ధరించి పల్లకిలో నన్నుయొద్దకు బోతివి. నే డవియన్నియు త్యజించి యీ జీర్ణ వస్త్రమును ధరించుట మిగుల విపరీతముగనున్నది ఈశ్వరు డెందుల కిట్ల జేయించుచుండెనో దెలియుటలేదు" అని చెప్పి గృహములోనికి బోయి రెండురొట్టెలను, ఘృతమును, చక్కెరను నిర్బంధముగజోలెలో బడవైచెను. సంతోబాకాంత యదిజూచి "ఇంతయన్నము బెట్టెదవేల? ప్రాణనాథున కీవృత్తాంతము తెలిసిన నాపై గోపించు" నని చెప్పగా

నామె దుఃఖించుచు "నేను ప్రేమతో బెట్టితిని. ఆశ్రమమునకు తీసికొని పోయి యిరువురును భుజింపు" డని పలికెను.

సంతోబాకాంత భిక్షాన్నమును దీసికొనిపోయి ప్రాణనాథుని యెదుట బెట్టి "ప్రాణేశ్వరా! భుజింపుడు" అని పలికెను సంతోబా జోలెలోనున్న పదార్థములన్నియుజూచి విషయమంతయు నామె నడిగి తెలిసికొని యనుతప్తచిత్తుడై యామెతో "నీవు తిరిగి పార గ్రామమునకు బోయి భిక్షాన్నముల నెచ్చటనుండి దెచ్చితివో వారలకే తిరిగి యిచ్చి ర"మ్మని చెప్పగా, నా పతివ్రత ప్రాణేశ్వరా! నీచెల్లెలా పదార్థములను నిర్బంధముగ నిచ్చినది". అని చెప్పెను. అంత సంతోబా భార్యతో "నీవు తిరిగి యీపదార్థముల నామెకిచ్చిరమ్ము. లేనిచో నేను భుజింపను" అని చెప్పగా నా పతివ్రత భర్త నాజ్ఞానుసారముగ 'పార' గ్రామమునకు బోయి వారలకు భర్తయాజ్ఞను దెలిపి యాపదార్థముల నిచ్చి తిరిగి వచ్చుచుండ వర్షము విశేషముగ పడుటచే భీమానదీ ప్రవాహమపారమై పొరలి వచ్చుచుండెను. ఆయువతి నదినిదాటుటకు సాధ్యము కాక చింతాక్రాంతురాలై "భర్త నది కావలియొడ్డున నుండగా నాతని యొద్దకు బోవుటకు సాధ్యముకాకున్నది. సుకృతములేనిది భర్తసేవ లభింపదు" అని నిశ్చయించి భగవంతునిగూర్చి "ఓ కేశవా! నన్ను రక్షింపుము; వర్షమపారముగ గురియుచున్నది; నిశాసమయమైనది. నన్ను నా భర్తసన్నిధికి జేర్పుము" అని ప్రార్థింపగా తత్క్షణమే శ్రీ పంఢరీనాథుడొక నావికునివేషమును ధరించి యామెయొద్దకు వచ్చి "ఓతల్లీ! చింతాక్రాంతురాలవై కూర్చుంటివేల? మహాభక్తుడగు సంతోబాపవార్ నది కావలియొడ్డున నున్నాడు. నీవచటకు బోదలచితివేని నిన్ను నేను దీసికొనిపోదును" అని చెప్పెను.

సంతోబాకాంత నావిక వేషధారియైయున్న భగవంతునిజూచి నేను నీ ధర్మసహోదరినిగా భావించి దీసికొనిపొమ్ము" అని చెప్పగా భగవంతుడామెను తన భుజమున గూర్చుండబెట్టుకొని క్షణకాలములో

నదియావలియొద్దనకు దీసికొనిపోయి "ఓ తల్లీ! సంతోబాయిచ్చటకు బహు సమీపమున గూర్చుండి భజనజేయుచున్నాడు. నీవచటకు బొమ్ము" అనిచెప్పి యంతర్ధానమాయెను. అంత నా పతివ్రత భర్త యొద్దకుబోయి జరిగిన వృత్తాంతము నంతయు నాతనికి సవిస్తరముగ దెలుపగా "శ్రీ పంఢరీనాథుడు నీకు దర్శనమిచ్చెను, నాకు మాత్ర మింకను దర్శనమీయక నన్ను పరీక్షించుచుండెను. శ్రీ విఠలనాథుడు నాకు దర్శన మిచ్చు పర్యంతము నేను భుజింపను" అని చెప్పి ప్రతిజ్ఞ జేసెను.

'పార' గ్రామమునందు పరమ భావుకుడగు శ్రీమంతుడొకడుండెను. ఆతని స్వప్నమున శ్రీ పంఢరీనాథుడు దర్శనమిచ్చి "నీ గృహమున పక్వాన్నములను దయారుజేసి సంతోబాకును నాతని భార్యకును తీసికొనిపోయి యర్పింపుము. నీ సుకృతము విశేషమైయుండుటచే నీకు నేను దర్శనమిచ్చి యాజ్ఞాపించితిని" అని చెప్పి యంతర్ధానమయ్యెను. ఆ శ్రీమంతుడు నిద్రనుండి లేచి స్వప్నవృత్తాంతమును మననము చేసికొని యమితానందముతో నానావిధములగు పక్వాన్నములను గృహమున జేయించి వానిని సంతోబాయొద్దకు దీసికొనిపోయి వృత్తాంతము నంతయు నాతనికిదెలిపి "శ్రీ పంఢరీనాథుని యాజ్ఞానుసారముగ తమకు భోజనమును దెచ్చితిని గ్రహింపుడు" అనిచెప్పి సాష్టాంగనమస్కారము జేసెను. అంత సంతోబా యా శ్రీమంతునితో "నాయనా! నీకు శ్రీ పంఢరీనాథుడు దర్శనమిచ్చెను, నా దుష్కర్మమెంత విపరీతముగ నున్నదో తెలియుటలేదు. నా కింకను నాతని దర్శనములభించలేదు. ఆతడు దర్శనమిచ్చువరకు నేను భుజింపను" అని చెప్పగా యా శ్రీమంతుడాతని నిశ్చయమును జూచి వెడలిపోయెను. సంతోబా మనోనిశ్చయమునకు శ్రీ పంఢరీనాథుడు సంతసించి యాతనికి సగుణస్వరూపముతో దర్శనమిచ్చి యాతని కృపాదృష్టితో ననుగ్రహించి యంతర్ధానమయ్యెను.

అప్పటినుండియు ప్రతినిత్యము సంతోబా రాంజణ గ్రామమునకు భిక్షకై బోవుచుండెను. ఆ గ్రామమున నభక్తుడగు ద్విజుడొకడుండెను.

ఆతడఖండముగా భార్యతో బోరాడుచుండెను. భార్యయేమైనను ప్రత్యుత్తరమిచ్చినచో "నేను సంతోబాపవార్ వలె సంసారమును ద్యజించి విరాగి నయ్యెదను" అని కఠినముగ బలుకుచు నామెను భయపెట్టు చుండెను. బ్రాహ్మణుని కాంత భర్త గృహత్యాగము జేయునను భయముతో మౌనముగ నూరకొనుచుండెను. శాంతి విరక్తులు లేని యా బ్రాహ్మణుడు భార్యను మిగుల భయపెట్టుచుండెను. ఆమె చింతాక్రాంతురాలై మౌనమును ధరించుచుండెను. ఒక దినమున సంతోబా భిక్షకు రాగా నా బ్రాహ్మణ స్త్రీ తన గృహ విషయములన్నిటిని సవిస్తరముగ నాతనికి దెలిపి "ప్రతి దినము నానాథుడు నన్నిటులనే భయపెట్టు చున్నాడు. నాకొక సలహానిండు" అని యడుగగా సంతోబా యామెనుజూచి "నీతో నాతడు పోటలాడినప్పుడు నాయొద్దకుబంపుము. ఆతనికి మంత్రోపదేశముజేసి నీ స్వాధీనపరచెదను" అని చెప్పెను. ఆయువతి "అవశ్య" మనిచెప్పి సంతోబాకు వందనములుజేసి యాతనికి భిక్షను వేయగా సంతోబా తన యాశ్రమమున కేగెను.

బ్రాహ్మణుడు గృహమునుజేరి భార్యతో "వంటజేయుట కాలస్యము నేలజేయుచుంటివి? నా కాకలిగ నున్నది. ఇటులైనచో నేను సంసారమును ద్యజించి సంతోబాయొద్దకు బోయెదను" అని చెప్పగా అతనికాంత "నాథా! ఆలస్యము నేల జేసెదరు, మీరు సంతోబావలె విరాగులు కండు" అని పలికెను. ఆ బ్రాహ్మణుడు భార్యపలికిన వచనములనువిని విచారించుచు కోపోద్దీపిత మానసుండై యొక వస్త్రమును చెంబును చేతబుచ్చుకొని సంతోబా యొద్దకుబోయి యాతనికి సాష్టాంగ నమస్కారముజేసి "నేను సంసారమును ద్యజించి నీవలె విరాగినై వచ్చితిని. నేను నీ సాంగత్యము నెన్నడును విడువను; నాకు మంత్రోపదేశము జేసి నన్ను పరమార్థమార్గమున బ్రవేశింపజేయుము." అని చెప్పగా విష్ణుభక్తుడు "నీతో సముడగు విరక్తుడు త్రిభువనములందును లేడు. అవశ్యముగ మంత్రోపదేశము జేసెదను" అని చెప్పి యొక గుమ్మడిగుల్లనొకదానినిచ్చి "దీనితో జలమును దీసికొనిరమ్ము. తలపాగాను, నుత్త

రీయము నిచ్చటనే యుంచిపొమ్ము, ఈ ప్రాంతమున తస్కరులభయము కలుండుగనున్నది' అని చెప్పగా ఆ బ్రాహ్మణుడు నదీ తీరమునకు బోయి క్షుద్బాధ యధికముగ నుండుటచే వస్త్రమును చింపుకొని దన చేతనున్న ఘటంబును నదిలో బారవైచి గుమ్మడిగుల్లతో జలమునుదీసి కొని సంతోబాయొద్దకు జేరెను.

సంతోబా యా సమయమున కౌపీనమునుధరించగా బ్రాహ్మణుడు తానును కౌపీనమునుధరించి సంతోబాకు నమస్కారము జేసి "నన్నాకలి బాధించుచున్నది, ప్రాణము కంఠమునందున్నది" అని చెప్పెను. సంతోబా చేదుపుచ్చకాయ నొకదానినిదెచ్చి దానినిముక్కలుగాగోసి బ్రాహ్మణున కొక ముక్కనిచ్చి మిగిలిన దానిని తానును భార్యయు దినుచుండిరి. బ్రాహ్మణు డాముక్కను నోటబెట్టి "అయ్యా! ఇది బహుచేదుగనున్నది. నేనిది తినలేను" అని చెప్పగా సంతోబా యాతనితో "నాయనా! నీవు సర్వత్యాగము జేసికొనివచ్చితినని నాతో జెప్పితివి. నీకు జిహ్వాచాపల్య మెందుకు?" అనియడిగి యాతనికి క్షుద్బాధ నివృత్తి జేసికొనుటకై కందమూలాదుల నిచ్చెను. విప్రుడవి భుజించుచు "నా సంచితము విపరీతముగ నున్నది. గృహమున మృష్టాన్నముల భుజించు నాకీదుర్గతి సంప్రాప్తించిన" దని రోదనము జేయుచు నుపాయమేమియు దోచక క్షుధతో కృశించుచుండెను.

సంతోబా యాతనియవస్థను గ్రహించి "నీవు గృహస్థుడవై యుండి సంసారమును త్యజించి యిట్లు వచ్చితివేల?" అని యడుగగా నాతడు "నాకర్మము. వ్యర్థముగ భార్యతో గలహించి మీ యొద్దకువచ్చితిని, మీ సాంగత్యము జేయుట బహుకఠినము. వస్త్రమును చింపుకొంటిని, గృహమునకు బోవుటకు లజ్జగనున్నది. రాత్రి సమయమున బోయినచో "కౌపీనధారియగు నీ బైరాగి యెవరో" యని భార్య గృహమున నన్ను జేరనీయదు" అని చెప్పెను. అంత సంతోబా "నీవెప్పుడును భార్యతో సంతోబావలె విరక్తుడవై యరణ్యము

నకు బోయెదనని చెప్పుచుంటివి. నేటినుండి యట్లు పలుకనని శపథము జేసినచో నీవిషయము నేనెవరికిని తెలుపక నిన్ను గృహమునకు దీసికొనిపోయెదను" అని చెప్పగా నాతడు సంతోబా చరణములపైబడి సాష్టాంగనమస్కారము జేసి "నేను భార్యతో గలహించినచో నాజిహ్వ పోవుగాక" అని శపథము జేసెను.

సంతోబాభక్తు డార్త్రి ద్విజుని గృహమునకుబోయి వృత్తాంతమునంతయు నాతని భార్యకుదెలిపి "నీభర్తకు మంత్రోపదేశము జేసితిని. ఇప్పుడే యాతనిని బంపెదను. నీవాతనితో గలహింపకుము. ఆతనిని నీ స్వాధీనునిగా జేసితిని. ఆతడు కౌపీనమునుధరించి యిప్పుడే వచ్చును. నీ వాతనితో గలహింపకుము" అని చెప్పగా నామెసంతసించెను. సంతోబాయాశ్రమమునుజేరి బ్రాహ్మణుని బిలచి "నీవు గృహమునకుబోయి భార్యతో గలహింపకు"మని జెప్పగా నాతడు సంతోబాకు వందనములు జేసి యచ్చటనుండి బయలుదేరి యంధకారసమయమున "ఎవరైనను నన్ను జూచినను లేక బ్రాహ్మణుల కీవిషయము దెలిసినను కులమునుండి బహిష్కరింతురను భీతితో త్వరితగతిని గృహమున బ్రవేశించెను. ఆ గృహస్థు అప్పటినుండియు నిల్లాలితో గలహింపక నుల్లాసముతో గాలము గడుపుచుండెను.

అత్తవారింటియొద్దనున్న యువతి యుల్లాసముతో పుట్టింటికిబోవునటుల సంతోబా యాషాఢమాసమున పంఢరీపురమున జరుగు బ్రహ్మోత్సవములను దర్శించుటకై తంబుర తాళమృదంగాది వాద్యములతో హరినామ సంకీర్తనజేయుచు రెండువందలమంది యాత్రాజనులను వెంటబెట్టుకొని బయలుదేరి దశమినాటికి నరసింహపురమును జేరెను. వర్షము లధికము నుండుటచే నదీప్రవాహము పూర్ణముగనుండెను. యాత్రాజనులు "ఈ రోజున ప్రవాహము తగ్గనిచో రేపటిరోజున పంఢరీపురము జేరుట సాధ్యముకాదు. ఏకాదశినాడు భగవద్దర్శనము లభింపదు. ఒక నావ యుండినచో నదినిదాటి పోవుట సాధ్యమైయుండెడిది" అని నిరు

త్సాహచిత్తులై యుండిరి. సంతోబాభక్తుడదిచూచి దేహలోభము ధరించిన చో భగవద్దర్శనమెట్లగునని తలచి "రక్షించుచువాడును, శిక్షించువాడును, భగవంతుడేయని నిశ్చయించి ప్రవాహములోదిగి నడచిపోవుచుండెను. అపారమగు నది యాతనికి కటి ప్రదేశము లోతుగనేయుండుటచే నామస్మరణజేయుచు త్వరితముగ సంతోబాపోవుచుండెను. ఆతని వెంట నున్న యాత్రాజనులందరు "మిమ్ములవిడచి మీరెటులేగుచుంటిరి మీరీశ్వరావతారులని తలచి మీ సాంగత్యమునపేక్షించి వచ్చితిమి. మీ మహిమ విశేష మద్భుతమైనది. మీతో సమమముగ మేము రాజాలము ఇచ్చటినుండి మరలిపోయెద"మని చెప్పిరి.

యాత్రికులు చెప్పినవిషయమునువిని సంతోబా నదీమధ్యమున నిలువబడి చేయెత్తి వారిని సేకవైచుచు 'సర్వజాతులవారును, చిన్నలు పెద్దలును, స్త్రీ పురుషులును, చతుష్పాదాది జీవులు నేమియు విచారింపక, నిర్భయముగ నా వెంటరండు. మీరు చిత్తమునందు భయమును విడచి వచ్చినచో శ్రీ పండరీనాథుడు మీకేవిధమగు నపాయమును గలుగనీయక సర్వ విధముల రక్షించును' అని చెప్పగా నెల్లరును సంతసించిరి. యాత్రాజనులు "సంతోబా నదిలోనుండి నడచి పోవుచుండెను. ఆతనికి జలమెక్కువ లోతులేకుండెను. మనకునటులనే వెళ్లుకము" అని తలచి అశ్వముల పై మూటలువైచి యొకరి వెంటనొకరు నడచుచుండిరి. శ్రీ పండరీనాథు డది తెలిసికొని "సంతోబా నామధారకుడుగాన నౌతడు నదినిదాటి వచ్చెను. జలముపై కాష్ఠమునుకొని పాషాణమును వేసిన మునిగిపోవు నటుల సంతోబాతో సములగు నిశ్చల హృదయులెవరును లేరు. వీరిని నేను రక్షింపనిచో భక్తుని వచనము లసత్యములగును. వీరందరు నదిలో మృతిజెందిన నా దర్శనమెవరుచేతురు? పూర్వము మహాత్ములు పలికిన వచనములందు ప్రజలకవిశ్వాసము కలుగును" అని తలచి తనవీపుపై యాత్రాజనులను గూర్చుండబెట్టికొని పోవుటకు నిశ్చయించి, దేవాధిదేవుడు తన దాసులకు ప్రమాదమురాకుండ గాపాడుటకై బ్రహ్మాండమగు కూర్మరూపముతో నదిలోనుండి బయల్వెడలెను.




సం॥ బాపావార్ చంద్రభాగానదినిదాటి పంఢరీపురము జేరుట.

బ్రహ్మాదులచే పూజనీయుడగు భగవంతుడు తన వీపుపై యాత్రాజనులను కూర్చుండబెట్టుకొని మోసికొనిపోవుచుండుటయత్యాశ్చర్యకరము. అష్టాదశవర్ణముల చిన్న పెద్దలందరును హరినామ సంకీర్తన నాదబ్రహ్మముగ జేయుచుండిరి. చంద్రభాగానది యెంత వెడల్పు గలిగియున్నదో యంతవెడల్పున శ్రీ పంఢరీనాథుడు కూర్మరూపముగనుండ సర్వయాత్రాజనులును, సామగ్రులను మోయుచున్న అశ్వ వృషభాదులును, కూర్మరూపముపై బోవుచుండిరి. యాత్రాజనులెల్లరును నాశ్చర్యచకితులై కరతాళములను వేయుచు "మహాత్ములసాంగత్య మతి ఫలప్రదమైనదని పరిపరివిధముల గొనియాడుచుండిరి. యాత్రాజనులు భగవంతుడు కూర్మరూపధారియై తమను నదీప్రవాహమునుండి కాపాడెనని యెఱుగరైరి.

సంతోబా యాత్రాజనులతో గలిసి చంద్రభాగలో స్నానము జేసి పుండలీకుని దర్శించి, మహాద్వారములో ప్రవేశించి సాష్టాంగ నమస్కారము జేసి యచ్చటనుండి దేవాలయములో ప్రవేశించి శ్రీ విఠ్ఠలనాథుని సద్భావముతో నాలింగన వందనాదులుజేసికొని "ఓ దేవాధిదేవా! నీవు భక్తులను నానావిధముల రక్షించుచుందువు. నీ కీర్తి నాదిశేషుడు సహితము వర్ణింపజాలడు. నీవు కూర్మరూపమును ధరించి యాత్రాజనులను నదీ ప్రవాహమునుండి కాపాడితివి" అని ప్రార్థింపగా శ్రీ పంఢరీనాథుడు హాసవదనుడై "ప్రేమభక్తుడవగు నీవు సర్వకాలములయందును నా సాన్నిధ్యమున నుండుము" అని చెప్పి యాతనిని కృపాదృష్టితో వీక్షించి తన సాన్నిధ్యము ననుగ్రహించెను.

డెబ్బది యెనిమిదవ అధ్యాయము సమాప్తము.

కలి కలుష హరాయ నమః.

# నిళోబా చరిత్ర

## —♦ డెబ్బదితొమ్మిదవ అధ్యాయము ♦—

ఓ గోపీజనవల్లభా, నేననాథుడను, నిరాశ్రయుడను, జ్ఞానహీనుడను, శక్తిహీనుడను, వైరాగ్య విరహితుడనై సర్వవిధముల జడమూఢుడనై యుంటిని. నీవుతప్ప నన్ను రక్షించు వారెవరును లేరు. నీ పేరభిమాన ముంచవలెను. అమంగళజలమును కూపములో బోసిన నాకూపమునగల జలమంతయు నమంగళమగును, ఆ జలమును గంగానదిలో బోసినచో నది పవిత్రమై సర్వులచే వందనీయమగును. అట్లే నేను సర్వవిధముల పతితుడనై నిన్ను శరణుబొందితిని. కాన నన్ను దరింపజేయుము.

నిళోబాయను పేరుగల వైష్ణవోత్తముడు గృహస్థాశ్రమమున దార పుత్రాదులతోనుండి మానావమానములను త్యజించి యయాచితవృత్తి నవలంభించి యఖండముగ సద్భావముతో హరినామ సంకీర్తన జేయుచుండెను. ఒకానొకదినమున భక్త తుకారా మాతని స్వప్నమున సాక్షాత్కరించి కృపతో మంత్రోపదేశము జేసెను. ఆతడు తనపుత్రికకు వివాహ మేర్పాటు జేయ, దాంభికులు, నభక్తులు నగు బంధువులు వివాహమునకై వచ్చిరి. గృహమున సామగ్రు లెవ్వియు లేకుండెను. నిళోబాతో నాతనిభార్య "ప్రాణేశ్వరా! మీరుదాసీనవృత్తితో నున్నారు గృహమున సామగ్రులెవ్వియునులేవు. దుర్జనులవలనగొప్పయవమానము తటస్థించునటుల గనపడుచున్నది" అని పలికెను. ఆ సమయమున శ్రీ పంఢరీనాథుడు వృద్ధబ్రాహ్మణ రూపమునుధరించి జీర్ణవస్త్రధారియై యొక సామగ్రులమూటను భుజముపై నైచికొని యచ్చటకువచ్చి నిళోబానుజూచి "ఓ భక్త శిఖామణీ! నే ననాథుడను, నాయొద్ద భోజనసామగ్రు లల్పముగనున్నవి. వానితో బాకము జేయించి నాకు బెట్టింపుము"అని ప్రార్థించెను.



నిళోగాయొద్దకు భగవంతుడు బ్రాహ్మణ రూపమునవచ్చి
భోజనసామగ్రుల మూట నిచ్చుట.

నిళ్లోబా యాతనికి నమస్కారముజేసి "విప్రోత్తమా! నీవు సామ గ్రుల నెందుకిచ్చెదవు, కొంతసేపైనపిదప భగవంతునకు నైవేద్యము జరుగును. అప్పుడు మాతోపాటుగ నీవు భుజింపవచ్చును" అని చెప్పగా వృద్ధబ్రాహ్మణ వేషధారియగు భగవంతుడు "నాకు మృష్టాన్నభోజనములు కావలయును. నాయొద్ద సామగ్రితో భక్ష్యములను దయారు జేయించి పెట్టుము" అని చెప్పెను. అంత నిళ్లోబా భార్యనుబిలచి "ఈ బ్రాహ్మణోత్తముని యొద్దనున్న సామగ్రిని గైకొని యాతడుకోరిన వస్తువులను దయారుజేసి భోజనము పెట్టుడు" అని చెప్పగా నాతనికాంత సామగ్రినిదీసికొని "ఈ స్వల్పసామగ్రితో నాతని కడు పెటులనిండును" అని యోచించుచుండ వృద్ధబ్రాహ్మణ వేషధారి "ఓ తల్లీ! నేనిచ్చిన సామగ్రిని మీరు వంటలుజేయు సామగ్రిలో జేర్చుము" అని చెప్పగా నామె యటులే జేసెదననెను.

శ్రీ రుక్మిణీకాంతుడు నిళ్లోబాకాంతను బిలచి "మరల వంట జేయుట కాలస్యమగును. ప్రస్తుత మన్నమున్నచో నేను భుజించెదను" అని చెప్పి ప్రేమతో నిళ్లోబాపంక్తిలో గూర్చుండి భుజించెను. ఆరాత్రి నిళ్లోబా స్వస్థముగా గూర్చుండియుండగా జగన్నివాసు డాతనితో "రేపటిదినమున మీ కుమార్తె వివాహముగదా! నీవుజెప్పుట కెవరు లేనిచో నాకా కార్యము నియమింపుడు. మృష్టాన్నములను దయారుజేయు నభ్యాసము నాకు బాగుగగలదు. ఈశ్వర ప్రీత్యర్థము మహాభక్తులగు మీకు సేవజేయవలయునని కుతూహలముతో నున్నాను" అని చెప్పగా నిళ్లోబా యాతనికి వందనముజేసి నీ యిష్టానుసారము చేయుమని చెప్పెను.

మరునాడు ప్రాతఃకాలమునందు బ్రాహ్మణ వేషధారియగు భగవంతు డెవరికి దెలుపకయే గృహమునంతయు శుభ్రపరచి యుదకప్రోక్షణజేసి ముగ్గులతో నలంకరించెను. వివాహమునకై వధుని వెంట నాకస్మికముగ నైదువందలమంది బంధువులువచ్చిరి. వారెల్లరు విడిదిగృహములో బ్రవేశించి సీమంతపూజను జరిపించిరి. కల్పవృక్షచ్ఛాయను

గూర్చున్నవాని కుపవాసముండు దుర్గతి సంభవించనటుల, భాస్కరుని గృహమున కేగినచో నచ్చట నంధకారము కనబడనటుల, గంగాదేవి స్వయముగ గృహమునకువచ్చినచో నుదకమునకు గొదువయుండనటుల, సరస్వతి కృపగలిగినచో విద్యార్థి యవివేకి కాజాలనటుల, విధాత సౌందర్యవంతునిగ సృజించిన సాముద్రిక చిహ్నములకు గొదువయుండనటుల, జగజ్జీవనుడగు శ్రీ రుక్మిణీకాంతుడు నిళోబా గృహమునందుండ వివాహ సమయమున నే విషయమందును లోపము లేకుండెను.

భగవంతుడు త్వరితముగ భుజముపై కావడిని ధరించి యుదకమును దెచ్చెను. భగవంతుడు తెచ్చిన సామగ్రి గృహమున నపారముగ బెరిగి యందుండి యెంతదీసినను తరుగకుండెను. వివాహమునకువచ్చిన యెనుబందలమంది బంధువులకు భగవంతు డిచ్ఛామాత్రముచే నానా విధములగు పక్వాన్నములను దయారుచేసి వారెల్లరికినీ త్వరితముగ వడ్డనజేసి భోజనానంతర మెంగిలి విస్తళ్ళన్నిటిని బ్రోగుచేసి దూరముగా బారవైచి స్థలమునంతయు శుభ్రపరచెను. ఆతడు తయారుచేసిన పదార్థములన్నియు మిగుల మధురములై యుండుటచే బంధువు లెల్లరును దృప్తిగ భుజించిరి.

నిళోబా యాశ్చర్యచకితుడై "ఈ బ్రాహ్మణుడు మిగుల సజ్జనుడుగ నున్నాడు. సర్వవిషయములయందును కొదువలేక బంధువులకు మర్యాదలను జేయుచున్నాడు" అని యానందించి బ్రహ్మణవేషధారి యగు భగవంతునిజూచి "అయ్యా! మీకు చాలశ్రమగలిగినది. మీ రొక్కరు బంధువులందరికిని బహుశ్రమతో భోజనముల నేర్పాటుచేసితిరి. మీకు ప్రత్యుపకారము నేనేమియు జేయజాలను. తమ నామమేమి? తెలుపుడు" అని యడిగెను. అంత జగజ్జీవనుడు "నన్ను విఠోబా యని బిలతురు. నాలుగుదినములనుండి తృప్తిగ మీగృహమున మృష్టాన్న భోజనములను జేయుచుంటిని" అని చెప్పగా నిళోబా యమితానందభరితుడై, "యీతనియుపకార మెట్లుతీర్తును. ఈతడు పోవు సమయమున

మనోభావపూర్వకముగ నొకవస్త్రము నర్పింపవలయునని నిశ్చయించుకొనెను. భగవంతుడు నిళోబాకుటుంబముతోపాటు వరుని గృహమునకేగి యారవదినమున వారితో దిరిగివచ్చి యెల్లరుజూచుచుండ పూజాగృహమున బ్రవేశించి యదృశ్యుడాయెను.

నిళోబా ధోవతులచాపును జేతబుచ్చుకొని బ్రాహ్మణవేషధారియగు భగవంతునికిచ్చుటకై 'విఠోబా' యని కేకవేయగా ప్రత్యుత్తరము రానందున బూజాగృహము బ్రవేశించి యచ్చటను నాతడు గనబడనందున "శ్రీ పంఢరీనాథుడే వృద్ధబ్రాహ్మణవేషధారియై వచ్చెనని తలచి నేత్రములనుండి యానందాశ్రుధారలను విడచుచు గద్గదస్వరముతో "ఓ దేవాధిదేవా! పంఢరీనాథా! నాకొరకై నీవు చాల శ్రమపడితివి. విపరీతమగు సేవను జేయించుకొంటిని. నా సర్వాపరాధములను క్షమింపుము" అని ప్రార్థించెను. ఆరాత్రి నిళోబాస్వప్నమున శ్రీ రుక్మిణీకాంతుడు సాక్షాత్కరించి యాతనిమస్తకముపై దన యభయప్రదానహస్తముంచి కృపాదృష్టితో వీక్షించి నిరంతరము నీ సమక్షమున నేనుండెదను" అనిచెప్పి కటిన్యస్తహస్తుడై సగుణస్వరూపముతో నచ్చట నిలచెను. నిళోబాభక్తికి వశవర్తియై శ్రీ విఠ్ఠలనాథుడు "పింపళనేరీ" గ్రామమున ఫాల్గుణ బహుళ విదియనాడచ్చట నిలచుటచే ప్రతిసంవత్సర మా తిథియందు యాత్రోత్సవములు జరుగుచుండును.

డెబ్బదితొమ్మిదవ అధ్యాయము సమాప్తము.



# ఉద్ధవ చిద్ఘన చరిత్ర

—♦ ఎనుబదియవ అధ్యాయము ♦—

భీమానదీతీరమునం దిటుకరాతిపై సమచరణములతో గటిన్యస్త హస్తుడై నిలువబడియున్న సుకుమారమూర్తిని సేవించుటచే, దేహభ్రాంతి నశించును. భావుకులాతని ప్రేమతో దర్శించి గళమున కోమల తులసీమిశ్రిత పుష్పహారమువేసి యాతని చరణములపై సుగంధయుత మగు బుక్కాను జల్లెదరు. ఆతడంతలకే తృప్తిజెందును. పుండలీకుడు భగవంతుని కోరిన వర మేమనగా నానావిధ పాతకులు, చోరులు, జారులు, బ్రహ్మద్వేషులు, గోహత్యాపరులు నీ దర్శనమువలనను, నీ భక్తుల దర్శనమువలనను నుద్ధారింపబడవలెను. సాధకులు వైకుంఠమునకు బోవుట మిగుల కఠినముగాన మర్త్యలోకమున భూవైకుంఠముగా పంఢరీ క్షేత్రమును జేయుము. ఇచ్చట త్రిలోకములందు గల తీర్థములు మధ్యాహ్నసమయమున చంద్రభాగానదిలో గలియవలయునని కోరెను. స్వర్గవాసులగు దేవతలు విమానములందు గూర్చుండి వచ్చి చంద్రభాగానదిలో స్నానముజేసి (శ్రీ) విఠ్ఠలనాథుని సేవింతురు. ఆక్షేత్రము నుపమానముగా వర్ణించుటకు పృథ్వియం దన్యక్షేత్రము లేవియుజాలవు. ఆక్షేత్రమున భగవంతుని సేవించి తరించిన భక్తుల మహిమవిశేషము లను వర్ణించుటకు మూఢమతినగు నాకెట్లు సాధ్యమగును? ఆ దేవాధిదేవుడు నిమిత్తమాత్రునిగా నన్నుంచి యాతనిభక్తుల సచ్చరిత్రలు వర్ణింపించుచున్నాడు.

‘ధాగూర్’ నగరమున పరమభావుకుడును, నతివిరక్తుడు నగు ఉద్ధవ చిద్ఘను డను వైష్ణవోత్తము డఖండముగ హరినామసంకీర్తన జేయుచు కాలము గడుపుచుండెను. ఆతడు చేయు కథాకాలక్షేపము లను శ్రవణముజేయుటకై సజ్జానులగు భక్తులును, పండితులును, నితర జనులును నపారముగ జేరి శ్రవణముజేయుచుండిరి.



ఉద్ధవచిద్ఘనుడు రామనవమి ఉత్సవము చేయుట.

ఒకనా డుద్ధవచిద్ఘనుడు 'మాళిలావాపి' నగరమున హరినామ సంకీర్తనజేసి యచట ప్రజలతో శ్రీరామ జయంత్యుత్సవము నా స్వగ్రామమున జరుగనున్నది కాన నేనచ్చటికి త్వరితముగ బోవలయు నని చెప్పెను. ఆ నగరప్రజ లుద్ధవచిద్ఘనునిజూచి "అయ్యా! శ్రీరామ జయంతీ మహోత్సవము నిచ్చటనే జరుపు" డని ప్రార్థింప నగరవాసుల కోరిక ననుసరించి "మీయిష్టప్రకార మిచ్చటనే జేసెద" నని చెప్పి, విశాలమగు పందిరి వేయించి, తోరణములతోను, పతాకములతోను నలంకరించి యయోధ్యానాథు నందు ప్రతిష్ఠించి, హరిదాసులను, వైష్ణవులను రప్పించి హరినామ సంకీర్తనలతోను, పురాణ, హరికథా కాలక్షేపములతోను నన్నదానములతోను, నానావిధములగు మంగళ వాద్యములతోను మహావైభవముగ నుత్సవము జరిపించుచుండెను.

ఆ సమయమున మహమ్మదీయుల ప్రాబల్య మధికమై యుండు టచే నీతివిచారణలులేక "హరిదాసు నృత్యసంకీర్తనలు జేయుచుండ మసీదుయొద్దకు వాద్యములు వినబడుచున్న"వని యైదువందల దుండ గీండ్రు పతాకములను విరచిపారవైచి, యచటగల భక్తులెల్లరిని జావ గొట్టి, తంబురతీవిలను ద్రెంచి, మద్దెలను బగులగొట్టి యల్లకల్లోలమును జేయుచుండిరి. శిష్యులీవిషయము నుద్ధవచిద్ఘనునకు దెలిపిరి. పాలలో లవణముగలసిన రుచిచెడునటులను, పక్వాన్నములను శ్వానము దాకి నచో నవి యయోగ్యము లగునట్లును, దుర్జనులగు నవింధు లుత్సవ కార్యక్రమమునకు విఘ్నమునుదెచ్చిరి. ఉద్ధవచిద్ఘను డాసమయమున పూజాస్థలములో బ్రవేశించి "జయజయ రఘునాథా, విశ్వాత్మా, జానకీవరా, నీమనమునందిచ్ఛలేనిచో యీ యట్టహాసములను వ్యర్థ ముగ నేలజేయించితివి. సజ్జనులగు మహాత్ముల కవమానము కలిగినది. అందుచే నాకు మిగుల ఖేదముగనున్నది" అని చెప్పి శ్రీ రఘునాథుని విగ్రహమునెత్తి పందిరినివిడచి దూరముగ గూర్చుండియున్న హరిదాసు లకు నమస్కారముజేసి శ్రీరామభజన చేయుచుండెను.

అంత హనుమంతుడు కోపోద్దీపితమానసుడై "శ్రీరఘునాధు నుత్సవమున మ్లేచ్ఛులు విఘ్నములను దెచ్చిరి. భక్తుల నవమానపరచిరి. కాన వారి మసీదులను నాశనముచేసెద" నని పలుకుచు తన వాలమును బెంచి మసీదునుజుట్టి యైదువందల దుర్జను లచ్చట గూర్చుండి యుండగా మసీదు నూపుచుండెను. ఆమసీదు ప్రక్కభాగమున నొక ఫకీరు గుడిసె యుండెను. ఆతడు పరమ జ్ఞానియగుటచే విషయమంతయు గ్రహించి శ్రీరామభక్తుల నవమానపరచుటచే హనుమంతుడు క్షోభించి యిట్టుల జేయుచున్నాడని నిశ్చయించి యచ్చటికి పోయి దీనవదనుడై "నా గుడిసె కేవిధమగు నపాయమును గలుగనీయక గాపాడు" డని ప్రార్థించెను. అచ్చటగల దుర్జనులెల్లరును ఫకీరునుజూచి పరిపరివిధముల నవమానపరచుచుండిరి. అంత నాఫకీరు దుర్జనులనుజూచి "మీరిటనుండి త్వరితముగ లేచిపొండు. హనుమంతుడు తనవాలమును మసీదుచుట్టును జుట్టి యద్దానిని పడగొట్టుచున్నా" డని చెప్పగా వారు "రాళ్ళతోగట్టిన యీమసీదును గూలద్రోయుట కోతివలనగా" దని బల్కుచుండిరి. దుర్జనుల వాక్యములను విని రామదూత క్షోభించి క్షణకాలములో నా మసీదును గూలద్రోసెను. ఐదువందలమంది దుర్జనులును హాహాకారముల జేయుచు మరణించిరి.

ఈవిషయ మా గ్రామమునగల యవనులెల్లరెరిగి యచ్చటకు వచ్చి మసీదునుజూచి భయభ్రాంతులై ఫకీరువలన నుదంతమంతయు నెరిగి "మహాభక్తుడగు నుద్ధవచిద్ఘనుని నవమానపరచుటచే హనుమంతుడు క్షోభించి మసీదును గూలద్రోసె" నని నిశ్చయచిత్తులై వేలకొలది రూప్యములను దెచ్చి మహమ్మదీయులెల్ల రుద్ధవచిద్ఘనుని యొద్దకు వచ్చి యాతనికి సాష్టాంగనమస్కారమును జేసి క్షమార్పణ గోరుకొని రూప్యములనర్పించి "అయ్యా! సుఖముగ మీ మహోత్సవమును జేసికొనుడు. మిమ్ముల నవమానపరచిన దుర్జనులు మృతులైరి. మీరు హనుమంతుని బ్రార్థించి నగరమున కేవిధమైన యపాయమును గలుగకుండ గాపాడుడు" అని పరిపరి విధముల నాతని గొనియాడి తమతమ నివాసముల

కేగిరి. ఉద్ధవచిద్ఘనుడు యథాప్రకారముగ నయోధ్యాధీశుని మండప మును స్థాపించి తంబుర తాళ మృదంగాది వాద్యములతో నఖండ హరి నామసంకీర్తనమును, పురాణ హరికథా కాలక్షేపములను, నన్నదాన సమారాధనలను వైభవముగ జరిపించెను. సాధుసజ్జనులను నిందించు వారు జన్మాంతమువరకు దుఃఖములను భోగింతురు. భగవంతుడు వారికి నానావిధ విఘ్నములను గల్పించుచుండును (శ్రీ) విఠ్ఠలనాథుని చరణార విందముల నఖండముగ స్మరించినచో నానావిధ విఘ్నములును దూరము లై శరీరమున గల వ్యాధులు పటాపంచలగును.

ఎనుబదియవ అధ్యాయము సమాప్తము.



# విసోబా సరాఫ్ చరిత్ర

—♦ ఎనుబది యొకటవ అధ్యాయము ♦—

జయజయ క్షీరాబ్ధివాసా, మేఘశ్యామా, అనంతరూపా, అనంతనామా, అనంతావతారా, పురుషోత్తమా, వైకుంఠవిలాసీ, గుణసముద్రా, కరుణాలయా, గోకులవాసా, గోరసచోరా, మనమోహనా, మధురానివాసీ, కంసమర్దనా, ధర్మస్థాపకా, నీలవర్ణా, ద్వారకావాసీ, గరుడధ్వజా, లీలానాటక సూత్రధారీ, అధోక్షజా, భీమాతీరనివాసీ, పుండలీకవరదా, నీవు భక్తుల కభయదానమిచ్చి వారలను సర్వవిధముల గృపతో రక్షించుచున్నావు. ఓ రుక్మిణీపతీ! నీవు కృపతో మూఢమతి నగు నాచే నీ భక్తులచరిత్రలను లిఖింపజేయుట యీగ మేరుపర్వతము నెత్తునంతటి యాశ్చర్యకరమైన విషయము. నీ భక్తులు నీయనంత కళ్యాణగుణములను గానముజేయుచుందురు. ఆ భక్తుల సచ్చరిత్రలు నీకు ప్రియతమములు. నన్ను నిమిత్తమాత్రునిగానుంచి మతిని ప్రకాశింపజేసి వాక్కునుండి భక్తుల సచ్చరిత్రలను వర్ణించుచున్నావు.

పరమ పవిత్రమగు పంఢరీపురమునం దఖండైశ్వర్యములతో దుల్లదూగుచున్న "విసోబా సరాఫ్" అను పరమభాగవతు డుండెను. ఆతనికి పతివ్రతా శిరోమణియగు సత్కళత్రమును, పితృాజ్ఞా పాలకులగు నలుగురు సుపుత్రులు నుండిరి. ఆతడు ప్రపంచ వ్యవహారములలో నసత్యము నెన్నడును బలికియెరుగడు. అతిథ్యభ్యాగతుల నత్యాదరణతో జూచుచు, వారల కన్నపానీయాదుల గల్పించుచుండెను. ఇట్లు కొంత కాలము జరిగినపిదప నాదేశమున నాకస్మికముగ క్షామము సంప్రాప్తించుటచే, ప్రజలెల్లరును స్వస్థానములనువిడచి యన్నార్తులై పరిసర ప్రాంతములకు బోవుచు, నాహార ధాన్యాదులు లభింపని సమయము లందు గెనుసుగడ్డలను, గలితపత్రములను భుజించి క్షుద్బాధను నివృత్తి జేసికొనుచుండిరి.

ఆ సమయమున విసోబా ధైర్యమవలంబించి యుదారచిత్తముతో తనయొద్దనున్న ధన ధాన్యాదులను, క్షామపీడితులగు ప్రజలకన్న పానీయాది వసతులు కల్పించుట కుపయోగించుచుండెను. దుష్కాలమునం దన్నదానము జేయుచున్నాడను కీర్తి నలుదిశలు వ్యాపించి దూరప్రదేశములనుండి యాచకజనులు తండోపతండములుగ వచ్చుచుండిరి. విసోబా కృపావంతుడై విసుగులేక దివారాత్రము లన్నార్తులై వచ్చు జనుల నాదరించుచుండెను. ఇట్లు బహుకాలము జరుగగా నాతని యొద్దనున్న ధనధాన్యాదులు క్రమక్రమముగ క్షీణించెను. మాతృస్తనములయందు క్షీరము లేకపోయినను పసిబాలుడు స్తన్యపానమును విడువనట్లును, యాచకులు శ్రీమంతు నైశ్వర్యము క్షీణించినను దాత కీర్తి ననుసరించి యాతనిని విడువరు. అన్నార్తులగు యాచక జనులు విసోబాగృహమున కఖండముగ వచ్చుటచే నాతడు లౌకిక మానమర్యాదలను, సంసారచింతను ద్యజించి, గృహమునగల యలంకార భూషణములను వెచ్చించి యన్నదానమును జేయుచుండెను.

ఇట్లు కొంతకాలము గడచినపిదప క్షుధార్తులై వచ్చు యాచకజనుల కన్నదానము జేయుటకు గ్రాసమేమియు నింట లేనందున యాచకజనులు గ్రామమున నితరుల నాశ్రయించుచుండ వారలు యాచకజనులనుజూచి కసరుకొనుచు విసోబాను దివాళాతీయించి మా యొద్దకు వచ్చితిరాయని నిందించుచుండిరి. గ్రామమునగల త్రివిధజనులును, విసోబానుగురించి నానావిధముల జెప్పుకొనుచుండిరి. కొంద రాతడు కేవలము మూర్ఖుడు' తన హితము నెరుగక యజ్ఞాగ్రత్తతో బ్రవర్తించెననియు, కొందరు క్షామకాలమున నపారముగ నన్నదానము జేసి సుకృతము నార్జించిన పుణ్యపురుషుడనియు, మరికొంద రీతడు ద్రవ్యమునార్జించుట కపారమగు దుష్కార్యముల నెన్నియో జేసి, దానినీవిధముగ ఖర్చుపెట్టి యశము నార్జించెనని చెప్పుకొనుచుండిరి.

త్రివిధ జనులెట్లు చెప్పుకొనుచున్నను విసోబా సమాహితచిత్తుడై యఖండముగ భగవన్నామ సంకీర్తన జేయుచు కాలము

గడుపుచుండెను. ఆసమయమున "రాంపురీబాబా"యను సిద్ధపురుషుడు యాత్రార్థముగ పంఢరీపురమునకువచ్చి యాతని సత్వగుణములను పరీక్షింపదలచి మురికికాలువలో దుర్గంధమయమైయున్న బురదను దీసి శరీరమునకు బూసికొని, దుర్గంధయుక్తమై మలినముగనున్న కౌపీనమును ధరించి యన్నము భుజించుటకై పాతమూకుడు నొకదానిని దీసికొని రెండవయామమున పిచ్చివానివలె ప్రవర్తించుచు "నాకాకలివేయుచున్నది" అని కేకలువైచుచు బోవుచుండెను విసోబా కేకలనువిని గృహద్వారము వెలుపల వచ్చి దూరమునుండి యాతనిని జూచి మహాపురుషుడని గుర్తించి యెదురబోయి సాష్టాంగ నమస్కారముజేసి "మహాత్మా! నాయందు కృపయుంచి నా గృహమునకు విచ్చేసి భోజనముచేయుడు" అని ప్రార్థించెను.

అంత నా మహాపురుషు డాతడుకోరినప్రకారముగా నాతనిగృహమునకు బోయి మట్టిమూకుడును తన యెదురుగ బెట్టుకొని కూర్చొనెను. ఆతడు శరీరమంతయు బూసికొనిన బురద దుర్గంధయుక్తమై యుండెను. విసోబా సరాఫాతని నుష్ణోదకముచే స్నానముజేయించి శరీరమునంతయు స్వహస్తముతో తోమి యతడు కట్టుకొనుట కింకొక కౌపీనమునిచ్చి శరీరమునకంతయు చందనలేపనముబూసి తులసీమిశ్రిత పుష్పహారము గళమునవేసి, యొకవిస్తరిలో పదార్థములన్నియు వడ్డించి యాతనియెదుట బెట్టి సాష్టాంగనమస్కారముజేసి "స్వామీ! దయతో భుజింపుడు" అని ప్రార్థింప సిద్ధపురుషు డీత డాత్మజ్ఞానియని యనుభవపూర్వకముగా దెలిసికొని వ్యాఘ్ర గోవృశ్చికములందీతనికి సమభావము కలదు. రాజును దరిద్రుని, యాచకుని బ్రాహ్మణుని సమముగబూజించు భక్తుల గృహమునందు శ్రీ రుక్మిణీరమణుడు దివారాత్రములు వసించి వారి కేవిధములగు విఘ్నములు గలుగకుండ రక్షించుచుండును. ఆ సిద్ధపురుషుడు భోజనానంతరము విశోబాయొద్ద యాజ్ఞగైకొని తన యాశ్రమమునకు బోయెను.

'కాసే' గ్రామమునందు పఠానునియొద్దకు దుర్జనులు పోయి "విసోబా దివాళాదీసెను. అతడు నీకు వ్యవహారసందర్భములలో నీయ వలసిన ద్రవ్యమును వసూలుచేయుము" అని చెప్పగా ఆతడు పంఢర్ క్షేత్రమునకు వచ్చి "నా ద్రవ్యమునంతేయు నీ విచ్చువరకు నేనిచ్చట నుండి గదల" నని చెప్పి యాతని గృహమున గూర్చుండెను. విసోబా పఠానుడు జెప్పిన మాటలను విని చింతాక్రాంతుడై యేమిచేయుటకును దోచక కొంతసేపటికి ధైర్యమవలంబించి "అయ్యా! నీ కీయవలసిన ద్రవ్యమంతయు నేడవదినమున తప్పక పంపెదను" అని చెప్పగా పఠానుడు "నీవచనములందు నాకు విశ్వాసము లేదు. ఎవరినైనను పెద్దమనుష్యులను దీసికొనివచ్చి వారియెదుట జెప్పుము" అని కోరగా నచ్చట గల గృహస్థు లాత డసత్యమెన్నడును జెప్పడు. "ఆతడు చెప్పినప్రకారముగా నేడవదినమున ద్రవ్యమును నిశ్చయముగ బంపును" అని చెప్పిరి. అంత నా పఠానుడు "మరల నేనువచ్చు పని యుండరాదు. తప్పక నిర్ణీతదినమునకు బంపు" డని చెప్పి కాసే గ్రామమునకు బోయెను. ఆరు దినములు గడచిన పిదప విసోబా చింతాక్రాంతుడై "పఠానుడు నేను ద్రవ్యమును బంపెదనని యెదురుచూచుచుండును. ఇప్పు డేమిచేయవలయును" అని పరిపరివిధముల యోచించుచు స్థిమితచిత్తుడగుటకై పూజాగృహమున బ్రవేశించి భగవంతుని పరిపరివిధముల బ్రార్థించుచుండెను.

శ్రీ రుక్మిణీకాంతుడు విసోబాదుఃఖమును దీర్పదలచి పూర్వము విసోబాయొద్ద గుమస్తాగా జేసిన గృహస్థువేషమునుధరించి యేడువందల వరహాలను వడ్డీద్రవ్యమును దీసికొని కాసేగ్రామమునకు బోయి పఠాను గృహమున బ్రవేశించి "నేను విసోబాయొద్ద పురాతనపు గుమస్తానై యుంటిని. ఆతడు నీకీయవలసిన ద్రవ్యమును వడ్డీతో గూడ నావెంట బంపెను. కాన మీ లెక్కప్రకారము ద్రవ్యమును రాబట్టుకొని రశీదు నిండు" అని జెప్పి యాతనికి ద్రవ్యమునీయగా పఠాను డాశ్చర్యముతో విసోబా నమ్మకస్థుడని భావించి ద్రవ్యమును దీసికొని సాక్షుల సంతకములతో గూడిన రసీ దాతనికిచ్చెను. భగవంతు డారసీదును దీసికొని

పంఢరీపురము జేరి విసోబా నిత్యము పారాయణజేయు భగవద్గీతాగ్రంథములో బెట్టి యంతర్ధానమయ్యెను.

విసోబా గ్రంథపఠనకై భగవద్గీతాపుస్తకమును దెరచి చూడ నందు పఠానుని హస్తాక్షరములతో ద్రవ్యము ముట్టినట్లు వ్రాయబడిన రశీదును జూచి యత్యాశ్చర్యమునుబొంది కాసేగ్రామమునకు బోయి పఠానుని గృహమును జేరెను. ఆతడు గౌరవించి 'ఏమికార్యార్థమై వచ్చితిరి?' అని ప్రశ్నించి "మీగుమస్తా నిన్నటిదినమున నేడువందల వరహాలను, వడ్డిని యిచ్చి నాయొద్ద రసీదును దీసికొనిపోయెను" అని చెప్పగా విసోబా విస్మయచిత్తుడై భగవంతుడే తనకొరకు పాతగుమస్తా వేషముతో బోయి పఠానునికి ద్రవ్యము జెల్లించెనని నిశ్చయించి పంఢరీపురము జేరి దేవాలయమున బ్రవేశించి 'కృపాసాగరా! జగజ్జీవీ! నా కణుమాత్రమైనను దెలుపక నాకొరకై పఠానునియొద్దకు నా గుమస్తా వేషముతో బోయి ద్రవ్యమును చెల్లించితివా? నిన్ను మిగుల కష్టపెట్టితిని. నీభక్తులకు కలుగు ప్రమాదములను తొలగించుటకై కాల నిర్ణయము లేక గౌరవమర్యాదలను త్యజించి యెంతవేషమునైననుధరించి భక్తులను రక్షించి వారల కీర్తిని బ్రకటన చేయుచుందువు" అని ప్రార్థించగా శ్రీ పంఢరీనాథు డాతని కృపాదృష్టితో ననుగ్రహించెను విసోబా సరాఫ్ దేహావసాన పర్యంత మఖండముగా హరినామసంకీర్తన జేయుచు నవసానమున భగవత్సాన్నిధ్య మలంకరించెను.

ఎనుబదియొకటవ అధ్యాయము సమాప్తము.

# గోపీచంద్‌రాజ చరిత్ర

—♦ ఎనుబది రెండవ అధ్యాయము ♦—

ఓ పుండలీకవరదా! నీయనంత కళ్యాణ గుణములను వర్ణించుట కును నీమహిమవిశేషమును దెలిసికొనుటకును, వేదశాస్త్ర పురాణాదు లకు సాధ్యముకాలేదు. నేను మూఢుడను, అజ్ఞానిని, చాతుర్యము, కుశ లత, బహుజ్ఞత, వ్యుత్పన్నత, మొదలగు లక్షణములు నాలో లేవు. నీయాధారమువలననే లేఖినిధరించి నీభక్తుల సచ్చరిత్రలు వర్ణించుటకు సంకల్పించి సర్వభారము నీయందు వైచితిని. కాన నామనోభీష్టమును పూర్ణముచేయు కర్తవ్యము నీపైనున్నది.

బంగాళాదేశమునందలి కాంచనపురమున త్రైలోక్యచంద్రుడను రాజు ప్రజలను దనబిడ్డలవలెజూచుచు, సక్రమముగ బరిపాలించుచుం డెను. ఆతనికి రూపవతియు వినయశీలయునగు మైనావతియను సత్క్ళత్రముండెను. ఆమెను ప్రజలు వైరాగ్య ఖనియని పరిపరివిధముల గొని యాడుచుండిరి. ఈ దంపతులకు గోపీచందను సుపుత్రుడు కలిగెను. ఆతడు రూపమున మదనునిబోలియుండి పదునెనిమిదిమందల స్త్రీలతో విలాస భోగ మనుభవించుచుండెను. గోపీచంద్‌రాజు యుక్తవయస్కుడు కాగానే తండ్రియగు త్రైలోక్యచంద్రుడు దివంగతుడయ్యెను. గోపీ చంద్ పట్టాభిషిక్తుడై దేశమును పరిపాలించుచు దివారాత్రములందు విషయ భోగాసక్తుడై యుండెను.

జగత్తున రూపమును గుణమును, జాతుర్యమును, వినయమును, సర్వగుణములు నొకేచోట నుండుట దుస్తరము. మైనావతి చాతుర్య ములతో గూడియుండి సద్గుణ సంపన్నయై యుండుటచే సరస్వతిసహిత మామెను స్తుతించుచుండెను. ప్రజాపాలనాదక్షుడును, గుణవంతుడును నగు భర్త మరణించుటచే మైనావతిఖేదమునొంది మృత్యువునకుబాలురు, వృద్ధులు, తరుణులు, సౌందర్యవంతులు, మహారాజులు, దరిద్రులను

విచారణయుండదు. అది కేవలము ప్రళయాగ్నివంటిది. ఆయగ్నికి సకలము బలియగుదురు. కాన జన్మసార్థకమునకై సద్గురువు నాశ్రయించి తరింపవలెనని నిశ్చయించి తమ రాజ్యములోనున్న జాలంధరనాథుడను సత్పురుషుని యొద్ద నుపదేశమును బొందదలచెను. జాలంధరనాథుడు గళమున జపమాలను సర్వాంగములకు విభూతిలేపనము గలిగి కమండలమును జేపట్టి కృష్ణాజినముపై గూర్చుండి వేషమును జేయుచుండెను. ఆతడు ప్రతిదినము నరణ్యమునకుబోయి కట్టెలను దీసికొని వచ్చుచుండెను. ఇంకా నాశ్చర్యకరమగు విషయమేమనగా, నా కట్టెలమోపాతని శిరము నంటియుండక జేనెడెత్తున నిరాధారముగ నడచుచుండెను. మైనావతి తనమేడపైనుండి యీ చమత్కారమును జూచి యీతడు మహాపురుషుడనిభావించి "యీతనియొద్ద శాస్త్రగుహ్యమగు వస్తువున్నది. ఈయన చరణసేవ జేసినచో నజ్ఞానమంతేయు నశించును. ఉపదేశము నొందినచో నూతన చైతన్యము సంప్రాప్తించు' నని తలచి స్వయముగా జాలంధరుని యాశ్రమమునకు బోయి నమ్రతతో నాతనికి సాష్టాంగ నమస్కారముజేసి "ఓ దయానిధీ! నీవభయదాభయ హస్తమును నామస్తకముపైనుంచి త్రివిధతాపములను శమింపజేయుడు. మీరు పతితపావనులు. నన్ను మీదాసిపగా నంగీకరించి మంత్రోపదేశము జేయుడు" అని కోరెను.

అంత జాలంధరనాథుడు మైనావతినిజూచి "ఓ మహారాణి! ఉపదేశమనగా నేమో నాకుదెలియదు. నేను నీకెట్లనుగ్రహింప గలను. నీవిక గృహమునకు బోవుటుచితము. యోగములు, సమాధినిష్ఠ, జ్ఞానమార్గములు, మంత్రతంత్రములు నాకేమిదెలియవు. నేనెప్పుడును నదీతీరములందును నరణ్యములందును వసించుచుందును. నాయంతనీచుడగు భ్రష్టుడెవరునులేరు. నీవు రాజమాతవు. నేను స్మశానములందు వసించు బైరాగిని. సర్వకాలములందు నిర్జన ప్రదేశములందే వసించుచుందు నేను నీకుపదేశము నెట్లుచేయగలను? ఓ రాజమాతా! ప్రపంచము నెట్లు

నిరసింపవలెనో నాకు దెలియదు. నేనే యజ్ఞయాగాది పుణ్యకార్యము లొనర్చియెరుగను. మంత్రాధ్యయనము జేసి యెఱుగను" అని చెప్పెను.

మైనావతి చేతులుజోడించి నిలువబడి "స్వామీ! ఓ గురుదేవా! మీ శక్తియంతయూ నేనెఱుగుదును. మహాత్ములు తమ మాహాత్మ్యమహిమలను తాము వర్ణించుకొనరు. నేను తమ యుపదేశామృతమును యాచించుచున్నాను" అని దీనత్వముతో ప్రార్థించెను. జాలంధరనాథుడామె మనోనిశ్చయమునుజూచి దయార్ద్రహృదయుడై తన వరదాభయహస్తము నామె మస్తకముపైనుంచి యామెకు మంత్రోపదేశముజేసి పరమపద మార్గమును జూపెను. ఆ మంత్రప్రభావముచే మైనావతికి క్షణకాలములో జన్మ జరామరణముల భయములు తొలగి యాత్మానందము సంప్రాప్తించి పరబ్రహ్మ స్వరూపమునందు లీనమై గుర్వాజ్ఞనుబొంది తిరిగి రాజభవనములో ప్రవేశించెను. గురూపదేశము నొందినపిదప "బ్రహ్మసత్యం, జగన్మిథ్య" అను నిశ్చయముతో నుదాసీన వృత్తి నవలంభించి రాజభోగముల నసహ్యముగా జూచుచు వైరాగ్యస్థితిని బొందెను

గోపీచందు నాతనిభార్యలును, వైరాగ్యానుభవములు లేనివారగుటచే, మైనావతి జాలంధరనాథునియొద్ద మంత్రోపదేశము నొందియప్పుడప్పుడు గ్రామము వెలుపలనున్న యాతనిని దర్శించుటకు బోవుటను విపరీతముగ నర్థముజేసికొనిరి. నగరమునగల దుష్టులు మైనావతి రాత్రి సమయమునందు నగరము వెలుపలనున్న బైరాగియొద్దకు బోవుచున్నదని దుష్ప్రచారము జేయుచుండిరి. ఈ వార్తనగరమంతయు వ్యాపించి రాణులకును గోపీచంద్‌నకును దెలిసెను. ఒక దినమున గోపీచందంతఃపురమునకురాగా నాతని రాణులాతనితో "ఓ మహారాజా! దుష్ప్రచారము వాయువునలె వ్యాపించినది. మీరు తల్లియగు మైనావతిని నా బైరాగియొద్దకు బోకుండ నాజ్ఞాపింపవలెను. లేనిచో పవిత్రమగు వంశమునకు గళంకముగలుగును" అని చెప్పిరి. గోపీచంద్ సంతప్తమానసుడై సభా భవనమున ప్రవేశించి మంత్రినిబిలచి జాలంధర

యోగీంద్రుని జూడవలెనని నాకు కోరికయున్నది. కాన నాతనిని మంగళ వాద్యములతో నేనుగంబారీలో గూర్చుండబెట్టి యూరేగింపుతో దీసి కొనిరండు. మీ రెల్లరాతనితో మృదుమధుర వచనములను బలికి యెట్లయినను తప్పక దీసికొనిరావలెనని యాజ్ఞాపించెను.

రాజాజ్ఞ ప్రకారము ప్రధాని బయలుదేరి సైన్యములకు వెంట దీసికొని బయలుదేరి జాలంధరనాథు నాశ్రమమును జేరి యోగిరాజు నకు నమస్కారముజేసి "మహాత్మా! మా రాజు గోపీచంద్ తమ దర్శ నము జేయవలెనని మిగుల కుతూహలముతో దమను తీసికొనిరావలసి నదిగా నాజ్ఞాపించి మమ్ములనుబంపెను" అని చెప్పగా జాలంధరనాథుడు ప్రధానితో "అయ్యా! ఏ నెందులకు రాజు పిలిపించెను నాతో నాతని కేమి పనియున్నది.! నే నెప్పుడును రాజభవనమున బ్రవేశించుటజరుగదు. నేను పతితుడను, యోగ యాగములు తపస్సిద్ధులు తెలియనివాడను. దినమంతయు నీశ్వర స్మరణజేసికొని యానందముతో శ్మశానమందుపడి యుండి భిక్షాన్నముచే భుక్తిజరుపుకొనువాడను. నా కొఱకై గొప్ప సైన్యములను, గజ తురంగములను నెందులకై పంపెను. నే నచ్చటకు వచ్చినచో గొప్పయనర్థము సంప్రాప్తించును. అందుచే నేను రాజాలను నిర్బంధముగ నన్ను దీసికొని పోయినచో నేను రాజభవనములో బాదము పెట్టగనే గోపీచంద్ రాజు రాజ్యత్యాగముజేయును.! ఇది భవి ష్యద్విషయమై యున్నది. కాన మీరన్యవిధముల భావింపక మీరాజు క్షేమము నపేక్షించి నన్ను దీసికొనుపోవు ప్రయత్నమును విరమించి పొండు" అని చెప్పెను.

ప్రధాని యత్యాగ్రహముతో మారాజాజ్ఞ ప్రకారము మీరు వచ్చితీరవలెనని చెప్పగా జాలంధరనాథుడు తప్పని సరిగా మంత్రివెంట బయలుదేరి రాజసభకుబోయెను. జాలంధరనాథుని జూడగనే రాజున కత్యంతఖేదముగలిగి క్షణకాలము ఖేదమునాపుకొని యాతనికి నమస్కా రము జేసి సింహాసనముపై గూర్చుండబెట్టెను. సింహాసనమునందు దేదీ ప్యమానమగు ప్రకాశముతో నున్న యోగీశ్వరునిజూచి "నేడెంత సుది

నము. తాము నా భవనమున బ్రవేశించి నన్ను ధన్యునిగా జేసితిరి" అని పలికెను. ఈశ్వరమాయ విచిత్రమైనది. భవితవ్యాను సారము మనుష్యులకు దుస్సంకల్పములు గలిగి దుష్కార్యములజేయుదురు. సదాచారసంపన్నుడును, ధర్మనిష్ఠాపరుడును, దయాశీలుడగు గోపీచంద్ రాజున కాసమయమున పూర్వకర్మానుసారము జాలంధరనాథుని బావిలో బడవేయవలెనను సంకల్పముగలిగెను. జాలంధరనాథుడు గోపీచంద్ నాశీర్వదించి పిదప ననుష్ఠానమందున్న యా యోగీశ్వరుని గూపములో బడవేయుడని పరిచారకుల కాజ్ఞాపించెను. రాజాజ్ఞ ప్రకారము భటులాతని నెత్తితీసికొనిపోయి బావిలో బడవేసిరి. ఆతడు నీటియందు మునుగకయే పైనగూర్చుండి యనుష్ఠానముజేయుచుండెను. గోపీచంద్ భావిపై మూతవేయించి యీ విషయమెవరికిని దెలుపకుడని తన పరివారమునకు జెప్పి యాభావియొద్ద కెవరును బోకుండ గుఱ్ఱముల పేడ భావిచుట్టును, పైనను బ్రోగుగా వేయించి భావి కనబడకుండ జేయించెను.

"జాలంధరనాథుడు కనబడుటలేదు. ఎచటికి బోయెనో" యని నగర ప్రజలు చెప్పుకొనుచుండిరి. మైనావతీదేవి చింతాక్రాంతురాలై యశ్రుధారలను విడచుచు "సద్గురునాథు డెచ్చటికి బోయెనో" యని విలపించుచు గనబడినవారి నెల్లరిని "సద్గురుడగు జాలంధరనాథు డెచ్చటికి బోయెనో మీకు దెలియునా?" యని విచారించుచుండెను. కొందరాతడు నగరములో నున్నాడనియు, మఱికొందరరణ్యములో నుండెననియు మఱికొందరు నదీతీరముననుండెననియు జెప్పుచుండిరి. మైనావతి వారలు చెప్పిన ప్రకారమెంతశోధించిన నాతనిజాడ కించిన్మాత్రమైనను తెలియకుండెను. ఇట్లు కొంతకాలము జరిగినపిదప నొక దినమున గోపీచంద్ రాజాంతఃపురమున బ్రవేశించి చందనపుపీటపై గూర్చుండియుండెను. అచ్చటగల యంతఃపురకాంత లాతనికి సేవజేయుచుండిరి. సుగంధతైలమును, కస్తూరీమిశ్రితమగు నత్తరును నాతని శరీరమునకు మర్ధన చేయుచు మంగళస్నానముజేయించుటకై సువర్ణపాత్రలో జలమును దెచ్చి



గోపీచంద్ రాజా

యుంచిరి. గోపికలు (శ్రీకృష్ణునిపై సుగంధజలమును జల్లిన ట్లంతఃపుర స్త్రీలు గోపీచంద్రరాజానందాబ్ధి నోలలాడుచుండెను.

మైనావతి మేడ పైయంతస్థునుండి యాకస్మికముగ గోపీచంద్రుం తఃపుర స్త్రీలతో క్రీడించుటనుజూచి యమితఖేదమునొంది "గోపీచంద్ వలెనే యాతని తండ్రియగు త్రైలోక్యచంద్రుడును సౌందర్యవంతుడై యుండి చూచుచుండగనే మరణించి స్మశానమునందు దగముజేయబడి భస్మమయ్యెను.) నాపుత్రుడును నొకదినమున మృత్యుముఖుడగును. ఇందు సందియమేమియు లేదు. విలాసభోగములకై యీతడాయువును వ్యర్థముజేసినచో జన్మ సార్థకమెట్లగును" అని పుత్రమోహముచే నశ్రుధారలు విడచుచు విలపించుచుండెను. క్రీడలో మగ్నుడైయున్న గోపీచంద్ శరీరముపై మైనావతి నేత్రములనుండి కారుచున్న యశ్రుధారలు పడెను. గోపీచంద్ జలబిందువు లెచ్చటనుండి పడుచున్నవని తల నెత్తి చూడగా మైనావతి దుఃఖించుచుండుటను గాంచి తత్క్షణమే తల్లి యొద్దకు బోయి 'జననీ! నీకెవరివలన దుఃఖముగలిగినది. నారాజ్యమునందెవ్వరును దుఃఖించుటను నేను జూడలేదు. నీవు నాకు ప్రత్యక్ష జననివైయుండి నేడు నీవు దుఃఖించుచుంటివి. నారాణులలో నెవరైనను నిన్ను నిందించినచో జెప్పుము వారి నిప్పుడే శిక్షించెదను" అనిచెప్పగా మైనావతి "కుమారా! నన్నెవరును నిందింపలేదు. కాని నీసౌందర్య మెట్లున్నదో నీజనకుడగు త్రైలోక్యచంద్రుని సౌందర్య మట్లేయుండెడిది. నేడతడెచ్చటనున్నాడు? ఆతని సౌందర్యమంతయు నొకక్షణములో నగ్నిలో దగ్ధమై బూడిదయయ్యెను. నీతండ్రిసౌందర్యము ననుసరించి యాతనికి త్రైలోక్యచంద్రుడని నామము సార్థకమయ్యెను. నీవాతని పుత్రుడవైయుండి యాతనివలెనే మృత్యుముఖుండవు కానున్నావు. ఈ దేహము త్రివిధములుగ నశించును. ఈదేహముయొక్క పరిణామము మింకేమియును లేదు. సువర్ణముతో సమమగు నంగకాంతి గలవారినైనను క్షణకాలములో నగ్ని దగ్ధముచేయును. సుగంధతైలములతో బెంచబడిన కురుల నగ్ని గడ్డివలె మండింప జేయును. అస్థిపంజరము, ఎముకలు పటపటయని ప్రేలుచు నగ్నిలో దగ్ధమై భస్మమగును. కుమారా! ధనము,

సుతులు, గృహము, బంధువులు, జననీజనకులు, భార్య మొదలగువా రెల్లరును సంసారమాయకు సంబంధించినవారలు. ఈశరీరము వృక్షచ్ఛాయవలె మిగుల చంచలమైనది. ఇది యెప్పు డేరూపమున నశించునో దెలియదు. విషయాదులలో దగుల్కొన్నవార నందుండి విముక్తులగుట మిగుల కష్టము: ఈ భవసముద్రమునుండి తరించుటకు గురురూపుడగు భగవంతుని సేవించుటకంటె యన్యోపాయము లేదు" అని చెప్పెను.

గోపీచంద్ మైనావతి చెప్పిన వచనములు విని హసితవదనుడై "ఓతల్లీ! ఈశరీరము నశించకుండ నమరత్వమునొందిన సిద్ధులీ ప్రపంచమున గలరని నాకు దోచుటలే" దని చెప్పగా మైనావతి గోపీచంద్‌తో "కుమారా! సర్వపాపములను క్షాళనజేసి యమరత్వము నొసంగు శక్తి సామర్థ్యములుగల సద్గురుడు జాలంధరనాథుడు. ఆ యోగీంద్రుడు జమదగ్ని, వశిష్ఠుడు, విశ్వామిత్రుడు, బృహస్పతి మొదలగువారివలె గాక ప్రత్యక్ష శంకరునివలె నుండును. నా సద్గురుడగు జాలంధరనాథు డిచ్చట నుండినచో, నిన్నొక్క క్షణకాలములో నమరునిగ జేసియుండును. నా కాయమును, వృత్తియు, వాక్కును నాతని చరణములందు లీనమైనవి. ఓరీ పాపాత్మా! ఏదినమం దాయోగీంద్రుని నీవు రప్పించితివో యాదినమందుండి యాతనిదర్శనము లభించుటలేదు. పుత్రా! నాసద్గురునాథు డేప్రదేశమునందుండునో యాప్రదేశముయొక్క గాలి నాపై వీచుచుండవలయును. అందుచే నేను ధన్యురాలనగుదు" నని చెప్పెను.

గోపీచంద్ మైనావతితో "తల్లీ! నేను పండ్రెండుసంవత్సరములు మాత్రమే రాజ్యము జేసెదను. అందులకై నీవువిచారింప బనిలేదు" అని చెప్పగా మైనావతి పుత్రునితో "పుత్రా! నీవట్లు పలుకుట యోగ్యముగ గనబడుటలేదు. ప్రాణు లొక్కక్షణకాలము జీవించు నిశ్చయము లేనప్పుడు నీవు పండ్రెండుసంవత్సరములకు యోగినయ్యెదనని పలుకుచున్నావు. దీర్ఘముగ నాలోచించుకొనుము" అని చెప్పెను. మైనావతీదేవి పలుకులు విని గోపీచంద్ మౌన మవలంబించెను.

ఎనుబదిరెండవ అధ్యాయము సమాప్తము.

# జాలంధరనాధులను వెదకుచు కానీఫ్‌నాధుడు వచ్చుట

—♦ ఎనుబదిమూడవ అధ్యాయము ♦—

ఒకానొకదినమున గోరఖ్‌నాధుడు కాంచనపురమునకు వచ్చుచుండగా నచ్చట ద్వారపాలకు లాతనిని జూచి "ఓ యోగిపుంగవా! తాము నగరమునం దుండవలదు. ఈనగరమును పాలించు గోపీచంద్ రాజు యోగులను జంపును. ఇదివరలో జాలంధరనాధుడను నొకయోగి యిచ్చటికి రాగా నాతనిని బావిలో బడనైచి దానిపై మూతవేయించి గుఱ్ఱపుపెంటను బావిపై కుప్పగాబోయించెను" అనిచెప్పిరి. గోరఖ్‌నాధుడీ వార్తనువిని యారాత్రి మిగులకష్టములో గాలముగడిపి ప్రాతఃకాలమున నచ్చటనుండి పోవుచుండెను. కొంతసేపైనపిదప తన కెదురుగ కొందరు యోగులు వచ్చుచుండిరి. యోగిరాజగు జాలంధరనాధుని శిష్యుడగు కానీఫ్‌నాధుడు శిష్యులతో గురుదేవుల వెదకుచుండెనని గోరఖ్‌నాధుడు తెలిసికొనెను.

గోరఖ్‌నాధుడును కానీఫ్‌నాధుడును నొకేసాంప్రదాయమునకు జెందినవారగుటచే నొకరి నొకరు నమస్కారములను జేసికొనిరి. కొంతసేపైనపిదప వారిరువు రొకస్థలమున గూర్చుండి తమతమ విషయములను ముచ్చటించుకొనుచుండిరి. కానీఫ్‌నాధుడు గోరఖ్‌నాధునితో "నీగురువగు మత్స్యేంద్రనాధుడు సింహాళమున ప్రమీలాదేవియను రాణికి వశవర్తియై యచటనే నామెతో సంసారముజేయుచున్నాడు" అని చెప్పెను. అంత గోరఖ్‌నాధుడు "గోపీచంద్‌రాజు పాడుభావిలో జాలంధరనాధుని బడవేసెనని ద్వారపాలకులవలన వింటిని" అని చెప్పెను. కానీఫ్‌నాధునకు తన గురువృత్తాంతము దెలియుటవలన నమితానందముచెంది తన వెంటనున్న యేడువందలమంది శిష్యులతో గలిసి కాంచనపురమున కేగెను. గోరఖ్‌నాధుడు తనగురువును దర్శించుటకై సింహాళమునకు బోయెను.

కానీఫ్‌నాథుడు శిష్యులతో గలిసి కాంచనపురమునకు బోయి 'అల్లఖ్' శబ్దమును ఘోషించుచుండగా నగరవాసు లెల్లరు గుంపులు గుంపులుగ జేరిరి. కానీఫ్‌నాథుడు వారినిజూచి "యీనగరమును పాలించు గోపీచంద్‌రాజు గొప్ప ధనుర్ధరుడని వినియుంటి" మని పలికి "మేము మీనగరమును నాశనముజేయుటకై వచ్చితి" మని చెప్పెను. శిష్యులు సామదాన భేదోపాయముల నుపయోగించి మనకార్యము చక్కబడనిచో నంత్యమున నగరనాశనమునకై ప్రయత్నింతు మని చెప్పిరి. కానీఫ్‌నాథుడు నగరజనులను జూచి "నాపేరు కానీఫ్‌నాథుడందురు. నేను జాలంధరనాథుల శిష్యుడను. నేను నగరమున బ్రవేశించి నటుల మైనావతీదేవికి దెలుపవలసియున్నది. కాన నాశిష్యుల నిరువుర నామెయొద్దకు దీసికొనిపొండు" అని చెప్పెను. తత్‌క్షణమే వారా శిష్యులను మైనావతీదేవికడకు గొంపోయి కానీఫ్‌నాథుని రాక నెరింగించిరి. ఆమె కానీఫ్‌నాథునొద్దకు బోయి సాష్టాంగనమస్కారము జేసి చేతులుజోడించి స్తుతించెను. సంకటసమయమున నెవ్వరు సహాయగువారుండరు. గోపీచందాసమయమున నచ్చటకువచ్చి సాష్టాంగనమస్కారముజేసి స్తోత్రముజేయుచు "నాథజీ! నేను మహాపాపాత్ముడను. ఘాతకుడను. తాము పరమమహాత్ములు. నాయందు కృపయుంచుడు" అని ప్రార్థించెను.

గోపీచంద్ భాషణములను విని కానీఫ్‌నాథుడు "ఓరీ! మహాపాపీ! వ్యర్థముగా నా గురుదేవులను భావిలో నెందులకు పడవైచితివి? నీవు తప్పక తత్ఫలమును బొందెదవు" అని క్రోధముతో బలికెను. గోపీచంద్ కానీఫ్‌నాథుని క్రోధోక్తులు విని భయపడుచుండెను. అతని యంతరాత్మ నీవు మహాదోషివని పలుకుచుండెను. అందుచే నాతడు మాటాడలేక మౌనమవలంబించెను. మైనావతి తనపుత్రుని భయమును దీర్పదలచి, హితవచనములతో కానీఫ్‌నాథుని సమాధానపరచి యాతని దీసికొనిపోయి సింహాసనముపై గూర్చుండబెట్టి యత్యాదరముతో బూజించెను. గోపీచందాతనికి సాష్టాంగనమస్కారముజేసి "ఓ కరుణామూర్తీ!



జాలంధరనాథ్‌ను కానీఫ్ వెదకుచు వచ్చుట

నా ప్రార్థన నాలకింపుడు. నా జననీజనకులును, బంధుమిత్రులును, సఖులును, సద్గురువును, సర్వస్వమును మీరైయున్నారు! మీరు గొప్ప దయావంతులు, జ్ఞానసాగరులు. నన్ను సిద్ధపురుషునిగా జేయుటకు సమర్థులు. మీవలననే నేను తరింపవలసియున్నది" అని చెప్పెను.)

గోపీచంద్ దీనాలాపనలను విని కానీఫ్‌నాథుడు దయగలవాడై "నా సద్గురుడగు జాలంధరనాధుని బడ వేయించిన బావిపై మూతను దీయించి ప్రథమమున నా ప్రదేశమంతయు శుభ్రము చేయింపుము. సద్గురునాథుడు నిన్ను శపించును. అతని శాపము నిన్ను బాధింపకుండుటకై యొక యుపాయమున్నది.) ఇనుము, రాగి, వెండి, బంగారములతో నీ విగ్రహములను నాలుగింటిని జేయించుము" అని చెప్పెను. గోపీచంద్ మంత్రిని బిలచి "త్వరితముగ చతుర్లోహములతో నాలుగు విగ్రహములను నాయాకారముగ జేయించుము. భటులను బంపి జాలంధరనాథుని బడ వేసినభావి మూతను దీసి యా ప్రదేశమంతయును శుభ్రపరచుము" అని యాజ్ఞాపించెను. రాజాజ్ఞను మంత్రి నిర్వర్తించెను. కానీఫ్‌నాథుడు భావి యొద్దకు వచ్చి యినుముతో తయారుచేయబడిన గోపీచంద్ విగ్రహమును బావి ప్రక్కనే నిలువబెట్టి యావిగ్రహము వెనుక దాను నిలువబడి 'అల్లఖ్' శబ్దములను బలుకుచు 'సద్గురు జాలాంధరనాథ్‌కి జయ్!' అని కేక వేసెను.

ఆసమయమున బావినుండి జాలంధరరానాథుడు "ఓరీ! కానీఫ్‌నాథా! నీయెదుట నెవరున్నారు" అని ప్రశ్నించెను. అంత కానీఫ్‌నాథ్ "ఓ సద్గురుమూర్తీ గోపీచంద్ రాజు నిలువబడియున్నాడు" అని చెప్పగా జాలంధరనాథుడు క్రోధముతో "ఓరీ గోపీచంద్! నీశరీరము దగ్ధమగును గాక!" అని పలికెను. తత్‌క్షణమే 'యినుముతో దయారుచేయబడిన గోపీచంద్ విగ్రహము మండిపోయి భస్మమయ్యెను.) పిదప కానీఫ్‌నాథుడు తామ్రవిగ్రహమును బావియెదుట నిలుచుండబెట్టి 'సద్గురు జాలంధరనాథకీ జయ్' అని కేక వేసెను. బావిలోనున్న జాలంధరనాథుడు "ఓరీ! కానీఫ్‌నాథా! నీకోరికయేమి తెలుపుము" అని యడుగగా మీ

దర్శనమునకు వచ్చితినని యాతడు చెప్పెను. జాలంధరనాథుడు "నీయెదుట నెవ్వరున్నారు తెలుపు" మనగా, గోపీచంద్ రాజున్నాడని కానీఫ్ నాథుడు ప్రత్యుత్తరమిచ్చెను. జాలంధరనాథుడు కోపోద్దీపిత మానసుడై "ఓరీ గోపీచందా! నీవు తత్‌క్షణమే దగ్ధము కమ్ము" అని పలుకగా నా తామ్రవిగ్రహము మండి భస్మమయ్యెను. పిదప కానీఫ్‌నాథుడు వెండి విగ్రహమును, బంగారు విగ్రహమును నిలువబెట్టి "ఓ గురుదేవా! తమ కెదురుగా గోపీచంద్ రాజు" నిలువబడి యున్నాడని చెప్పగా సద్గురుశాపముచే నవియు మండి భస్మమయ్యెను.

కానీఫ్‌నాథుడు గోపీచంద్‌తో "నీవు కూపముయొద్దకు బోయి దీనత్వముతో జాలంధరనాథునకు నమస్కరింపుము. భయపడవలసిన పని లేదు" అని చెప్పెను. గోపీచం దాతడు చెప్పిన ప్రకారము బావియొద్దకు బోయి "సద్గురు జాలంధరనాథ్‌కీ జయ్" అని నమస్కరించెను. అంత జాలంధరనాథుడు "నీవెవ్వరు" అని ప్రశ్నింపగా నేను గోపీచంద్‌నని రాజు ప్రత్యుత్తరమిచ్చెను. అనాథనాథుడగు జాలంధరనాథు డాకాశము నందు సూర్యచంద్రాదు లున్నంతవరకు నీవమరుడవై యుండుమని యాశీర్వదించెను. పిదప గోపీచంద్ రాజు జాలంధరనాథుని భావిలోనుండి పైకి దీయుంచెను. మొదట కానీఫ్‌నాథుడును పిదప గోపీచంద్‌ను సాష్టాంగ నమస్కారముజేసి యాతనిని దీసుకొనిపోయి సింహాసనముపై గూర్చుండబెట్టి శ్రద్ధాభక్తులతో పూజించిరి. మైనావతి గొప్ప యానందముతో నచ్చటికివచ్చి గురుదేవులకు సాష్టాంగ నమస్కారముజేసి నా దురదృష్టముచే బహుదినములు మీసేవ దూరమయ్యెనని చెప్పెను. జాలంధరనాథుడు తన వరదాభయ హస్తమును గోపీచంద్ మస్తకముపై నుంచి కృపాదృష్టితో వీక్షించి యాతనికి మంత్రోపదేశము జేసెను. తత్‌క్షణమే గోపీచంద్ సర్వసంగపరిత్యాగము జేసికొని సద్గురువులను సేవించుచు సద్గురుకీర్తి నఖండముగ ప్రకటన జేయుచుండెను.

ఎనుబదిమూడవ అధ్యాయము సమాప్తము.

# గోరఖ్ నాధ్
# మత్స్యేంద్రనాధ్‌ను సేవించుట

—♦ ఎనుబదినాలుగవ అధ్యాయము ♦—

అయోనిసంభవుడగు గోరఖ్‌నాధుడు పదునాలుగు విద్యలలోను నరువదినాలుగు కళలలోను గూడియుండి తన సద్గురువగు మత్స్యేంద్ర నాధునికంటె నఖండ ప్రజ్ఞావంతుడనను నహంభావముతో నుండెను. మత్స్యేంధ్రనాధు డీవిషయము నెరిగి పుత్రునకు వ్రణము కలిగినచో నాతని యారోగ్యమునకై వుండు కోసి మందు వేసినటుల, శిష్యుని హృదయమున గలిగిన యాహంకారమును దొలగింపదలచి గోరక్షునితో "నేను తీర్ధయాత్రకు బోయివచ్చెదను" అని చెప్పి యిరువురు శిష్యులను వెంటబెట్టుకొని తానొక కొండగుహలో బ్రవేశించి వెలుపల శిష్యుల నిరువురను గూర్చుండబెట్టి "లోని కెవ్వరిని రానీయవలదు. నేననుష్టానము బూర్తిచేసికొని వచ్చుపర్యంతము మీరిచట గావలియుండుడు" అనిజెప్పి తనమాయను బ్రేరణజేసి నీవు నారూపమున భూలోకమున సంచరించి గోరక్‌నాధు నిచటికి దీసికొని రమ్మని జెప్పి యోగనిష్టయందుండెను.

సింహళమునందు ప్రమీలాదేవియను క్షత్రియస్త్రీ రాజ్యపరిపాలన జేయుచుండెను. మత్స్యేంద్రుని మాయాశక్తి తీర్ధాటనజేయుచు సింహళము జేరెను. ప్రమీలాదేవి యాతని సౌందర్యమును జూచి మోహించి తన భవనమునం దుంచుకొనెను. మత్స్యేంధ్రనాధు డామె సౌందర్యమునకు లోనయ్యెను. ఇవ్విధముగా నొకరినొకరు మోహించి యిరువురును విషయభోగ మనుభవించుచుండిరి. కొంతకాలము జరిగిన పిదప ప్రమీలాదేవి గర్భవతియై యొక సుపుత్రుని గనెను. ఆబాలునకు 'మీనానాధు'డని నామకరణము జేసి యతి గారాబముతో బెంచుచుండిరి. ఒకదినమున మత్స్యేంధ్రనాధుడు ప్రమీలాదేవిని జూచి "నేను తీర్ధయాత్రకై వచ్చి నీయందు మోహముచే నిచ్చటనే యుంటిని. నన్ను దీసి

కొని పోవుటకై యాకస్మికముగ నేసమయమందైనను గోరఖ్‌నాథుడు వచ్చును. ఆతడు వచ్చినచో మన యిరువురి ప్రేమసంబంధమునకు దప్పక నెడబాటు కలుగు"నని చెప్పెను. ప్రమీలాదేవి మిగుల చింతించి పరి పరవిధముల నుపాయమాలోచించి మంత్రులను బిలచి "మన నగరము చుట్టును రక్షకభటుల నమర్చి సన్యాసు లెవరైన వచ్చినచో శిరచ్ఛే దము జేయుడు' అని యాజ్ఞాపించెను. రాణియాజ్ఞ ప్రకారము మంత్రులు రక్షకభటుల నేర్పరచి రాణియాజ్ఞను దెలిపిరి. గోరఖ్‌నాథుడు దేశా టనజేయుచు కానీఫ్‌నాథునివలన మత్స్యేంధ్రనాథుడు స్త్రీలోలుడై సింహళమున ప్రమీలాదేవి సమక్షమున నున్నాడని వార్తవిని దుఃఖా కుల మానసుండై సింహళమునకుబోయి భిక్షుకై యొకవాకిట నిలచి 'అల్లఖ్' శబ్దము నుచ్చరించుచుండెను. ఆ గృహమునగల యువతి వెలు పలికివచ్చి యాతనికి భిక్షవైచి యాతని శాంతమును సౌందర్యమును జూచి యమితానందమునుబొంది నమస్కరించి "స్వామీ! యీ నగర మును బాలించురాణి సన్యాసులను నగరమున ప్రవేశింప నీయవలద నియు, వారిలు నగరములో ప్రవేశించినచో శిరచ్ఛేదము జేయవలసిన దనియు నాజ్ఞాపించెను. మీరు బహుమెలుకవతో నెవ్వరికిని గనపడకయే తప్పించుకొనిపోవుడు. ఈనగరమున వసింప వల" దని చెప్పెను.

గోరఖ్‌నాథు డాయువతి పలుకులు విని చింతించుచు "నా సద్గురు నాథునియొద్దకు బోవుటె"ట్లని పరిపరివిధముల నాలోచించుచు నానగ రము వెలుపల నొక వృక్షచ్ఛాయను గూర్చుండియుండెను. ఆసమయ మున గొందరు భాగవతు లామార్గమున వచ్చిరి. గోరఖ్‌నాథుడు వారిని జూచి "అయ్యా! మీరు విచారముతోనున్నట్లు గనబడుచున్నారు. కారణమేమి దెలుపుడు" అని యడుగగా వారు "ఓ యోగీంద్రా! మేము ప్రమీలాదేవియొద్దకు బోయి నాటకమాడి ద్రవ్యసన్మానమును

బొందుటకై పోవుచుంటిమి. మా గ్గమున మద్దెలవాయించువానికి వ్యాధి సంప్రాప్తించుటచే నేమిచేయవలయునని యాలోచించుచు కార్యము విఘ్నమైనదని చింతించుచుంటిమి” అని చెప్పగా గోరఖ్‌నాథు డది తగిన సమయమని యాలోచించి “నేను మృదంగవాద్యమునం దత్యంతనిపుణుడను. నాకులవృత్తి యదియే, మీకు గావలసినచో నే నుచితముగ మీ వెంట వచ్చి నా విద్యాచాతుర్యమును జూపెద”నని చెప్పెను. అంత వారమితానందభరితులై గోరఖ్‌నాథుని దమవెంట రమ్మని చెప్పిరి.

గోరఖ్‌నాథుడు తన వేషమును మార్చి భాగవతుల వేషమును ధరించి వారితో ప్రమీలాదేవి సమక్షమునకు బోయెను. ఆసమయమున మత్స్యేంద్రనాథుడు ప్రమీలాదేవితో దూగుటుయ్యాలపై గూర్చుండి యిరువురును తాంబూలభక్షణము జేయుచుండిరి. భాగవతులు వారి యెదుట తమ వేషచాతుర్యములను జూపుచు నాట్యము జేయుచుండగా గోరఖ్‌నాథుడు చాకచక్యముగ మృదంగము వాయించుచుండెను. ఆ సమయమున గోరఖ్‌నాథుడు వాయించు మృదంగమునుండి “సద్గురునాథా! త్వరితముగ లెమ్ము. నేగోరఖ్‌నాథుడను వచ్చితిని” అని శబ్దము వెలువడుచుండెను. మత్స్యేంద్రనాథునికంటె ముందే ప్రమీలాదేవి మృదంగమునుండి వెలువడుచున్న శబ్దమును గమనించి చింతాక్రాంతురాలై “మీశిష్యుడు వచ్చె” నని మత్స్యేంద్రనాథునకు దెలిపెను. మత్స్యేంద్రనాథుడు గోరఖ్‌నాథునియొద్దకు బోయి యాతని నాలింగనము జేసికొని మృదుమధురవాక్యములను బలుకుచుండెను. ప్రమీలాదేవి భాగవతులకు ద్రవ్యసన్మానము జేసి వారినిబంపి తనప్రియుని గోరఖ్‌నాథుడు తీసికొనిపోవునను దుఃఖముచే నన్నపానీయాదులం దిచ్ఛలేక చింతించుచుండెను.

గోరఖ్‌నాథుడు సమయమునుజూచి సద్గురునాథులకు సాష్టాంగ నమస్కారముజేసి “ఓ గురుదేవా! తాము తీర్థయాత్ర జేసుకొనివచ్చెద

మని జెప్పి యిచ్చటనే యుంటిరి. మీరిక నిచ్చటనుండ వలనుపడదు. నా వెంట దప్పక రావలయును" అని చెప్పెను. అంత మత్స్యేంద్రనాథుడు గోరఖ్‌నాథునిజూచి "నాకిచ్చట సర్వసౌఖ్యములు ననుకూలముగ నున్నవి. ఇన్ని సౌఖ్యములుగల ప్రదేశము వేరు కనబడుటలేదు. ప్రియురాలిని, పుత్రుని విడచివచ్చుటకు మిగుల దుఃఖముగా నున్నది" అని చెప్పగా గోరఖ్‌నాథుడు కోపోద్దీపిత మానసుడై రాణివలన ప్రమాదము సంభవించునని తలచి యుక్తితో గార్యమును సాధింపనెంచి కోపము నణచుకొని కొన్నిదినములా ప్రదేశముననే వసించి సమయమునకై యెదురు చూచుచుండెను.

ఎనుబదినాలుగవ అధ్యాయము సమాప్తము.



# మత్స్యేంద్రనాధుడు గోరక్‌నాధుని యహంకారమును దొలగించుట

—— ఎనుబది యైదవ అధ్యాయము ——

ఒకనాటి రాత్రి మత్స్యేంద్రనాధుడును నాతని కుమారుడును నుత్తమశయ్యపై నిద్రించియుండ నాతని పుత్రుడు మలమూత్రములను విసర్జించి శరీరమంతయు మలము జేసికొనెను. మత్స్యేంద్రనాధుడు ప్రాతఃకాలసమయమున లేచి గోరఖ్‌నాధుని బిలచి వీని శరీరమంతయు మలమంటి దుర్గంధమయముగనున్నది. కాన నీతని దీసికొనిపోయి శుభ్రపరచి తీసికొనిరమ్మని యాజ్ఞాపించెను. గోరఖ్‌నాధుడా పిల్లవాని నెత్తికొనిపోయి నదీతీరమున జేరి రాతి బండపై నాతని నుదికి నదీ జలములో గడిగి తుత్తునియలుగ జేసి యెండబెట్టి గృహము జేరెను. మత్స్యేంద్రుడు శిష్యునిజూచి కుమారుడెక్కడయని యడుగగా నదిలో శుభ్రముగా నుదికి యెండబెట్టితి"నని జెప్పెను. అంత మత్స్యేంద్రనాధుడు శిష్యుడు తన కుమారుని జంపెనని తెలిసికొని చింతించుచుండెను.

ప్రమీలాదేవి గుండెలు బాదుకొనుచు విలపించుచుండెను. కొంతసేపైనపిదప మత్స్యేంద్రనాధుడు "కుమారుని జంపుట యుక్తమా? ఆతనిని క్షణకాలములో దెచ్చియివ్వనిచో నేను జీవింపజాల" నని చెప్పగా గోరఖ్‌నాధుడు 'అలఖ్' శబ్దము నుచ్చరించి నూటయెనిమిది మంది మీననాధులను సృష్టించి సద్గురునిజూచి, "యిందు మీకుమారు డెవరో గుర్తించి తీసికొను" డని చెప్పెను. మత్స్యేంద్రనాధుడును ప్రమీలాదేవియు మిగుల నాశ్చర్యముతో నొకేరూపమున బాలురుండుటచే దమకుమారు డెట్టివాడని గుర్తింపజాలక గోరఖ్‌నాధునిజూచి "వీరెల్లరొకేవిధముగ నున్నారు. మాబిడ్డను నీవే గుర్తించి యిమ్మని దీనాలాపములతో బలుకగా గోరఖ్‌నాధుడు నూటయేడుగురు బిడ్డల నంతర్ధానముజేసి వారలకుమారుని ప్రమీలాదేవికిచ్చి "యీతడే మీ పుత్రు" డని జెప్పి సద్గురునాధునకు వందనముజేసి "గురుదేవా! తామీ

చోటును విడచి తత్‌క్షణమే నావెంట రావలయు" నని బలత్కారము చేసెను. మత్స్యేంద్రనాథుడు ప్రమీలాదేవినిజూచి "ప్రేయసీ! నేను గోరక్‌నాథునితో బోనియెడల నెన్నియో ప్రమాదములు సంప్రాప్తించును. ఆతనిని సమాహితచిత్తునిగా జేయకతప్పదు" అని చెప్పగా ప్రమీలాదేవి "నానాథుడు మహాభోగి. ఐనను నాతని నాపినచో నేమి ముప్పు కలుగునో" యని దలచి గోరక్‌నాథునకు దెలుపకయే బంగారు నాణెములను మత్స్యేంద్రనాథుని జోలెయందిడి విలపించుచు మరల మీ దర్శన మెప్పుడగునో'' యని యాలింగనముచేసికొనెను.

మత్స్యేంద్రనాథుడు సింహళమునువిడచి గోరఖ్‌తో ఘోరారణ్యమున బోవుచు "గోరఖ్! నిర్మానుష్యమగు నీమార్గమున దస్కరుల భయమున్నదా?'' అని యడిగెను. అంత గోరక్‌నాథుడు "గురుదేవా! సన్న్యాసులకు దస్కరులవల భయమేమి కలుగును?'' అని చెప్పెను. మత్స్యేంద్రనాథుడు ప్రత్యుత్తరమీయక కొంతదూరము పోయిన పిదప దనజోలెను శిష్యునకిచ్చి శౌచముజేయుటకై బోయెను. గోరఖ్‌నాథుడీజోలెలో నేదియో యనర్థమున్నది. లేనిచో 'తస్కరుల భయముండునా?' యని గురునాథు డడుగుటకు కారణముండదని తలచి యా జోలెలో జేయిపెట్టి యందున్న బంగారునాణెములను దీసి దూరముగ బారవేసి కంకరరాళ్ళను కొన్నిటిని బరువు సరిగా నుండునట్లు చూచి జోలెలో వేసియుంచెను.

మత్స్యేంద్రనాథుడు శౌచక్రియను బూర్తిచేసికొనివచ్చి జోలెను మెడలో దగిలించుకొని శిష్యునివెంట గొంతదూరము పోయి యరణ్యములో బ్రవేశించుచు "ఓ గోరఖ్‌నాథ్! ఈయరణ్యమున దస్కరులవలన భయముండునా?'' యని యడుగగా, నాతడు ''గురుదేవా! తస్కరుల భయ మిదివరకే తొలగినది'', అని ప్రత్యుత్తరమిచ్చెను. మత్స్యేంద్రనాథుడు వీడిట్లుపలుకుటకు కారణమేమని దలచి తనజోలెలో జేయిపెట్టి చూడగా నందు బంగారునాణెములకు బదులు కంకరరాళ్ళుండుటను జూచి వానిని దూరముగ బారవైచి "ప్రమీలాదేవి యిచ్చిన బంగారు

నాణెములను శారవైచి జోలెలో రాళ్ళను నింపితివి. నీవు చేయు పను లన్నియు విపరీతముగనే యున్నవి. లోకమున గల శిష్యులు గుర్వాజ్ఞానుసారము ప్రవర్తింతురు. నీవట్లుగాక నాకుమారునిజంపి వేరొకనిని సృష్టించితివి. బంగారునాణెములను బారవేసి కంకరరాళ్ళను సంచిలో నింపితివి. నీప్రవర్తన నాకెంతమాత్రము సరిగా గనబడుటలేదు. తత్క్షణమే నన్ను విడచిపొమ్ము" అని కఠోరముగ బలికెను.

గోరఖ్‌నాథు డహంకారముతో దనప్రజ్ఞను జూపదలచి యచటికి సమీపముననున్న యొక పర్వతముపై మూత్రవిసర్జనచేయగా నా పర్వతమంతయు సువర్ణాకారమయ్యెను. గోరఖ్‌నాథ్ గురుదేవునిజూచి "అయ్యా! తమకు కావలసినంత సువర్ణము నెత్తుకొనుడు" అని యా సువర్ణపర్వతము నాతనికిజూపగా మత్స్యేంద్రనాథుడు "నే నజ్ఞానముచే నావరింపబడియుంటి" నని భావించి శిష్యునిజూచి "గోరఖ్‌నాథ్! నీవు సాక్షాదీశ్వరావతారుడవని తెలిసికొనలేకపోతిని" అని చెప్పగా గోరఖ్‌నాథ్ సద్గురునింగాంచి "తాము పరమేశ్వరావతారులైయుండి యజ్ఞానముచే నావరింపబడి స్త్రీమోహమున దగుల్కొంటి" రని పలికి గురుదేవులకు నమస్కరింపగా మత్స్యేంద్రనాథుడు నవ్వుచు సువర్ణపర్వతము రాళ్ళకొండగాజేసి శిష్యునివెంట బయలుదేరెను. మార్గమధ్యమున జాలంధరనాథుడు, రాజా గోపీచంద్, కానీఫనాథుడు మొదలగు యోగిపుంగవులు మత్స్యేంద్రులను, గోరక్‌ను సేవించి వారలకు సాష్టాంగనమస్కారము జేసిరి.

సద్గురువగు మత్స్యేంద్రనాథుడు, గోరఖ్‌నాథును మిగిలిన వారిని వెంటబెట్టుకొని తాను తపము చేయుచున్న పర్వత గుహాద్వారము నొద్దకు దీసికొనిపోగా నచ్చట నిరువురు శిష్యులు కావలి గూర్చుండి యుండిరి. మత్స్యేంద్రనాథుడు చిరునవ్వు నవ్వుచు "గోరఖ్‌నాథ్! పర్వత గుహావెలుపల వీరిరువురును కావలిగా గూర్చున్న కారణమేమని తెలిసికొనుము" అని చెప్పెను. సద్గురునాజ్ఞానుసారము గోరఖ్‌నాథుడు వారిని



మత్స్యేంద్రనాథ్‌ను గోరఖ్ దర్శించుట

విచారింపగా "సద్గురువగు మత్స్యేంద్రనాథులు గుహలో ననుష్ఠానమున గూర్చుండియున్నారు; గుహలోని కెవ్వరినీ రానీయవలదని చెప్పి మమ్ము లను కావలి గూర్చుండబెట్టిరి" అని చెప్పెను. మత్స్యేంద్రనాథుడు హాసితవదనుడై "గోరఖ్‌నాథ్! నీవు నన్ను ప్రమీలాదేవి యొద్దనుండి తీసుకొని వచ్చుచుంటివి. వీరలు నే ననుష్ఠాన మందున్నానని చెప్పుట విచిత్రముగ నున్నది. లోనికిబోయి చూతము రమ్ము" అని చెప్పి, మత్స్యేంద్ర నాథుడు ముందుగ బోవుచుండగా నాతనివెంట గోరఖ్ మొదలగువారు పోయిరి. మత్స్యేంద్రనాథు డనుష్ఠానమునందు గూర్చునియుండుటను, తన వెంట యుండుటనుజూచి గోరఖ్‌నాథు డిదియేమి విపరీతమని యాలో చించుచుండ మత్స్యేంద్రుని మాయాశక్తి యనుష్ఠానమందున్న మత్స్యేంద్రనాథునితో లీనముకాగా నాతడు నేత్రములు తెరచి "గోరఖ్ నాథ్! నీవెచ్చట దిరుగుచుంటివి. తీర్థయాత్రల కింకను నేనుపోలేదు. మనమెల్లరము కలిసిపోవుదము" అని చెప్పెను.

గోరఖ్‌నాథుని హృదయమునను న్న యహంకారపర్వతము తత్క్షణమే కూలిపోగా నాతడు గురుదేవుల చరణారవిందములపై బడి సాష్టాంగ నమస్కారముజేసి "నాయపరాధమును క్షమింపుడు" అని ప్రార్థించెను. మత్స్యేంద్రనాథుడు తన అభయప్రద హస్తమునాతని శిరముపైనుంచి కృపాదృష్టితో వీక్షించెను. అప్పటినుండియు గోరఖ్ నాథుడు గురుదేవుల నమిత భక్తిశ్రద్ధలతో సేవించుచుండెను.

ఎనుబది యైదవ అధ్యాయము సమాప్తము.

---

*

# సఖూబాయి చరిత్ర

—♦ ఎనుబదియారవ అధ్యాయము ♦—

పరమపవిత్రమగు శ్రీకృష్ణానదీతీరమునందు కరవీరపురమను క్షేత్రము కలదు. అచ్చట సదాచార సంపన్నుడగు ద్విజోత్తము డొక డుండెను. ఆతనికి భార్యయు, కుమారుడును, కోడలును నుండిరి. ఆకుటుంబమున కోడలగు సఖూబాయి మాత్రము భక్తిపరురాలై యుండెను. మిగిలిన ముగ్గురును భక్తిహీనులై యుండిరి.

సఖూబాయి ప్రతిదినము సూర్యోదయాత్పూర్వమే నిద్రనుండి లేచి, భర్తకు నమస్కరించి, గృహకృత్యములను నెరవేర్చి, స్నానము జేసి, ధౌతవస్త్రములను ధరించి, శ్రీ పంఢరీనాథుని షోడశోపచారవిధుల పూజించి, మడితో వంటజేసి, పదార్థములను శ్రీ విఠ్ఠలనాథునకు నైవేద్యము జేసి, యత్తమామలకును భర్తకును భగవత్ప్రసాదమును వడ్డించి పిదప తాను భుజించుచుండెను. అత్తమామలును, భర్తయు, సఖూబాయి నడవడిని మార్చవలెనని తలచి "శ్రీవిఠ్ఠలభక్తి యశోదాయకము కాదు. నీ వాతనిభక్తి చేయరా" దని చెప్పి యామె వినకుండుటచే నన్నపానీయాదులు సహిత మీయక బాధించుచుండిరి. సఖూబాయిమాత్రము శ్రీ పాండురంగదేవుని హృదయమున నిలుపుకొని యహర్నిశము లాతని నామమును జపించుచుండెను.

ఇట్లు కొంతకాలము జరిగినపిదప పంఢరీపుర క్షేత్రమున జరుగు నాషాఢైకాదశీ బ్రహ్మోత్సవమును దర్శించుటకై వివిధ ప్రాంతములనుండి భక్తజనులు తంబుర తాళమృదంగాది వాద్యములతో బతాకహస్తులై మార్గమధ్యమునన్ను యాగ్రామమున నదీతీరమందు విడిది జేసిరి. ఆసమయమున సఖూబాయి బిందెనుదీసికొని, జలముదెచ్చుటకై నదీతీరమునకు బోయి, భక్తజనులుచేయు హరినామ సంకీర్తనను శ్రవణముచేసి. దేహభ్రాంతి విరహితురాలై. పంఢరీపురమును దర్శింపవలెనను కోరిక గలుగుటచే నత్తమామలును, భర్తయు, దండించినను తప్పక పంఢరీపురము

నకు బోవలెనని నిశ్చయచిత్తముతో భక్తులకు సాష్టాంగ నమస్కారము జేసి నేనును మీ వెంట వచ్చెదనని వారలతో జెప్పి వారలయొద్దనున్న పతాకమును దీసికొని తానును భజన పరులతో గలిసి భజన చేయుచుండెను. సఖూబాయి వెంట జలమునకై నదీతీరమునకుబోయిన పొరుగింటి సఖురాలు జలభాండమును గృహమునబెట్టి యామె యింటికిబోయి సఖూబాయి యత్తతో "మీకోడలగు సఖూబాయి భక్తజనులతో గలిసి హరినామ సంకీర్తనజేయుచు పంఢరీపురమునకు బోవుచున్నది" అని చెప్పెను.

తత్క్షణమే యామె పుత్రునిబిలచి "నీభార్యయగు సఖుబాయి యాత్రాజనులతో పంఢరీపురమునకు బోవుచున్నది కాన నీవు త్వరితముగాబోయి దానిని బంధించి గృహమునకు దీసికొనిరమ్ము" అని చెప్పగా నాతడు త్వరితముగబోయి యాత్రాజనులతో భజన జేయుచున్న భార్యనుజూచి కోపోద్దీపిత మానసుండై జుట్టుపుచ్చుకొని, కొట్టుచు గృహమున కీడ్చుకొనివచ్చి తల్లిదండ్రులనుబిలచి "యింక పదునైదు దినముల పర్యంతము పంఢరీక్షేత్రమునకు భక్తజనులు పోవుచుందురు. కాన నీపదునైదు దినము లీమెను బంధించి యుంచవలె" నని చెప్పగా వారలంగీకరించిరి. ముగ్గురును విచారించి యామె నొక స్తంభమునకు బంధించి యన్నపానీయాదులను సహిత మీయకుండిరి.

సఖూబాయి స్తంభమున బంధింపబడి "ఓ పంఢరీనాథా! నిన్ను దర్శింపవలెనని కుతూహలముతో నున్న నాకు బంధవ్రాప్తియైనది. నిన్నొకపర్యాయము దర్శింపవలెనని నాకు మిగుల కోరికయున్నది. నీ దర్శనమైనపిదప నాకు మరణము సంప్రాప్తించినను సరియే. తత్క్షణమే నీదర్శనమును నా కనుగ్రహింపుము" అని పరిపరివిధముల బ్రార్థించుచుండెను. సఖూబాయి కరుణావచనములు శ్రీవిఠ్ఠలనాథుడు విని యామెను రక్షించుటకై తాను కరవీరక్షేత్రమునకు బోవుటకు సంకల్పించెను. శ్రీ రుక్మిణీదేవి పంఢరీనాథునిజూచి "ఓ దేవాధిదేవా! ఏభక్తులకు ప్రమాదము సంభవించినది. మీ రెచ్చటికి పోవుచున్నారు?" అని



స్తంభమునకు బంధింపబడిన సఖూబాయికి శ్రీ విఠలనాథుడు దర్శనమిచ్చి
కట్లు విప్పుట.

యడుగగా శ్రీ పంఢరీనాథుడు "ఒక భక్తురాలు నన్ను దర్శింప సంకల్పించి స్తంభమున గట్టబడియున్నది. నేను తత్‌క్షణమే యచ్చటికి బోయి యామెకు దర్శన మిచ్చెదను" అని చెప్పి శ్రీ పంఢరీనాథుడు తత్కాలమున నంతర్ధానమై యర్ధరాత్రి సమయమున సఖూశాయి గృహమున బ్రవేశించి "సఖూ! సఖూ!" యని పిలుచుచుండను. శ్రీ పంఢరీనాథుడు తనకు భక్తులయందుగల వాత్సల్యమును జూపుటకై సఖూశాయి రూపమునుధరించి యామె యెదుట నిలువబడెను.

సఖూ శాయి తన రూపముననున్న భగవంతుని జూచి "ఓ తల్లీ! నీవెవరవో తెలుపుము" అని యడుగగా "నేను పంఢరీపురమునకు బోవుచున్నాను. నీ సాంగత్యము నపేక్షించి వచ్చితిని" అని భగవంతుడు ప్రత్యుత్తర మిచ్చెను. సఖూబాయి! "ఓ తల్లి! నేను పంఢరీక్షేత్రమునకు బోవలయునని సంకల్పింపగా నాయత్తమామలును, భర్తయు, నన్ను బంధించిరి. నేనెట్లు రాగలను. నీవు నాయొద్దకువచ్చి మాటాడుటను వారు జూచితిరేని వారు నిన్ను దండింతురు. కాన నీవు త్వరితముగా బోవుటుచితము" అని చెప్పగా శ్రీ పంఢరీనాథుడు సఖూబాయి భక్తికి వశవర్తియై యామెరూపమునుండి సఖూబాయితో "అమ్మా! నన్ను విఠలబాయి యందురు. నే నెన్నియో పర్యాయములు పంఢరీక్షేత్రమును సేవించితిని. నీకట్లు నేను విప్పెదను. నీవు నన్నీ స్తంభమున బంధించి త్వరితముగ పంఢరీక్షేత్రమునకుబోయి భగవంతుని సేవించిరమ్ము. నీవు వచ్చుపర్యంతము నేను నీకుబదులుగా నీ స్థంభమును నిటులనే గట్టుబడియుండెదను" అని చెప్పి సఖూశాయి కట్లనువిప్పి తాను స్థంభమున గట్టువడెను.

సఖూబాయి యానందముతో భగవంతుని స్మరించుచు శ్రీ పంఢరీక్షేత్రమునకు బోయెను. అత్తమామలును, భర్తయు, స్తంభమునకు బంధింపబడిన మాయాసఖూబాయిని జూడవలెనని వచ్చిచూచిరి. సఖుబాయి రూపముననున్న శ్రీ పంఢరీనాథుని వారు దర్శించిన మాత్రము

ననే వాళ్ళకూర స్వభావము తొలగి జ్ఞానోదయమై "యీమె కన్న పానీయాదులనీయక బంధించి యుంచినచో మరణించు"నని నిశ్చయించి యామెనుజూచి "యికమీదట జాగ్రత్తగా బ్రవర్తింపవలె"నని చెప్పగా "మీయాజ్ఞకు బద్ధురాలనై ప్రవర్తించెద"నని మాయా సఖూబాయి ప్రత్యుత్తర మిచ్చెను. అంత నామువ్వురు నామెకట్లువిప్పగా వారలకు సాష్టాంగ నమస్కారము జేసి భగవంతుడు మాయాసఖూబాయి రూప ముతో గృహమున బ్రవేశించి స్నానముజేసి ధౌతవస్త్రములను ధరించి వంటలను దయారుజేసి ముగ్గురకు వడ్డించి వారలు భుజించినపిదప తాను భుజించెను. అత్తమామలును, భర్తయును, "సఖూబాయికి బుద్ధివచ్చినది. బహు జాగ్రత్తతో బ్రవర్తింపుచున్న' దని యానందించిరి. ఇట్లు కొన్ని దినములు గడచుచుండ నొక దినమున సఖుబాయి వేషముననున్న భగ వంతుడు రాత్రిసమయమున మువ్వురకును వడ్డించినపిదప తాను భుజించి సఖుభర్తకు పాదసేవ జేయుచుండ నాత డేకాంతముగజూచి కామాతురు డయ్యెను. భగవంతు డాతని మనోభావమును దెలిసికొని చెంబుతీసికొని వెలుపలకుబోయి బహిర్భూమియైతినని చెప్పి దూరముగ గూర్చుండెను.

సఖుబాయి పంఢరీక్షేత్రము జేరి చంద్రభాగానదిలో స్నానము జేసి పుండలీకుని దర్శించి క్షేత్రప్రదక్షిణ మొనర్చి మహాద్వారమున బ్రవేశించి యచట సాష్టాంగ నమస్కారము జేసి సభామంటపమున గరుడ హను మంతులను సేవించి యచటినుండి గర్భాలయమును జేరి సింహాసనముపై కటిన్యస్త హస్తుడై సమచరణములతోడను, సాంద్ర నయనములతోడను రత్నఖచిత కనక కిరీటముతోను, దేదీప్యమానములై ప్రకాశించుచున్న మకర కుండలములతోను, తులసీమిశ్రిత పుష్పహారములతోను, నమూల్య పీతాంబరములతోను, శోభించుచున్న శ్రీ విఠ్ఠలనాధునిజూచి "జయ జయ పురాణపురుషా మేఘశ్యామా, అనంతరూపా, భక్త కామకల్ప ద్రుమా, సగుణస్వరూపా, ద్రౌపదీ లజ్జానివారణా, గజేంద్ర మోచకా, శేషశయనా, పయోబ్ధివాసా, కమలనయనా, భక్తభూషణా, పాండు రంగా! నన్నిక సంసారసముద్రమున బడద్రోయకుము. నీ చరణములలో

నన్ను గలుపుకొనుము" అని ప్రార్థించి తన ప్రాణజ్యోతిని శ్రీ విఠల నాథుని చరణారవిందములలో జేర్చెను. దేవాలయమునను న్న యర్చకు లత్యాశ్చర్యము నొందుచు సఖుబాయి ప్రేతమును సభామంటపమునకు దీసికొనివచ్చి "ఈమెయెవరో మహాత్మురాలు గర్భాలయములో ప్రార్థన జేయుచు తనప్రాణజ్యోతిని భగవంతునియందు లీనముజేసెను" అని చెప్పిరి. అచ్చటనున్న యాత్రాజనులలో గరవీరక్షేత్రమునుండి వచ్చిన ద్విజోత్త ములు సఖూబాయి కళేబరమును గుర్తించి యాప్రేతమును చంద్రభాగా నదీతీరమునకు దీసికొనిపోయి యామెశరీరమునందున్న యాభరణములను దీసికొని మూటగాగట్టుకొని యాప్రేతమున కగ్నిసంస్కారము జేసిరి.

శ్రీ రుక్మిణీదేవి సఖూబాయి మరణముపలన చింతాక్రాంతు రాలై "శ్రీ పంఢరీనాథుడు సఖూబాయివేషములో నామెయత్తమామ లకును, భర్తకును సేవజేయుచున్నాడు. ఇచ్చట సఖూబాయి మరణింప యామెకళేబరమునకు చంద్రభాగానదీతీరమున దహనసంస్కారము చేయ బడినది. భగవంతు డచటనుండి వచ్చు నుపాయమేమి" అని పరిపరివిధ ముల నాలోచించి చంద్రభాగానదికి బోయి సఖూబాయిని దహనము జేసిన స్థలమున బ్రవేశించి యస్థికలపై నుదకమును బ్రోక్షించి "సఖూ సఖూ! అని కేకవేసెను. భగవంతునిమహిమ లగాధములైనవి. జగజ్జనని యగు శ్రీ రుక్మిణీదేవి కృపాదృష్టితో వీక్షించగనే సఖుబాయి పునర్జీ వితురాలై రుక్మిణీదేవికి సాష్టాంగనమస్కారము జేసెను. అంత శ్రీ రుక్మిణీదేవి "ఓసఖూబాయీ! నీకొఱకై భగవంతుడు నీరూపమున నీ యత్తమామలకును, భర్తకును సేవజేయుచున్నాడు. నీవు విలంబనజేయక తత్క్షణమే పోయి యాతని నిచ్చటకు బంపుము" అనిచెప్పి యంతర్ధాన మయ్యెను. సఖుబాయి యత్యానందముతో భగవన్నామసంకీర్తన జేయుచు కరవీరక్షేత్రము బ్రవేశించునప్పటికి భగవంతు డాసమయమున జలభాండమును దీసికొని కృష్ణానదీతీరమునకు వచ్చి "యానందముతో పంఢరీపురయాత్రను సేవించితివా?" అని సఖుబాయినడుగ "నీకృపావిశే షముచే సేవించితిని" అనిచెప్పి సఖుబాయి తనరూపమున నున్న శ్రీ

విఠ్ఠలనాథునకు సాష్టాంగనమస్కారము చేసెను. భగవంతు డామెనుకృపా దృష్టితో వీక్షించి జలభాండము నామెచేతికిచ్చి యంతర్ధానమయ్యెను.

సఖుబాయి జలమునుదీసికొని గృహమును జేరెను. పంఢరీక్షేత్రము నుండి తిరిగివచ్చిన విప్రోత్తములు గృహములో ప్రవేశించి సఖుబాయి మామను, భర్తను బిలచి "మీకోడలగు సఖుబాయి శ్రీ పంఢరీనాథుని సమక్షమున ప్రాణమును విడచినది. మే మామెను చంద్రభాగానదీతీరమున నగ్నిసంస్కారము జేసి యామెశరీరముపై నున్న యాభరణములను దీసికొని వచ్చితిమి" అని చెప్పి యాభరణములను వారికిచ్చిరి. యాత్రా జనులు చెప్పిన విషయములు విని సఖుబాయి మామయు, భర్తయు నత్యాశ్చర్యమునొంది "ఓ విప్రోత్తములారా! మీ రసత్యమును బలుకుచున్నారు. సఖుబాయి గృహముననే యున్నది" అని చెప్పి యామెను బిలిపించిరి. యాత్రాజనులామెనుజూచి "అమ్మా! నీవు శ్రీపంఢరీనాథుని దేవాలయములో మరణింపగా నిన్ను మేమచట నగ్నిసంస్కారము జేసితిమి. నీవిచట నుండుట మాకు మిగుల నాశ్చర్యకరముగనున్నది. మే మచట నీ కగ్నిసంస్కారము జేయగా నీవిచటికెట్లువచ్చితివి తెలుపుము" అని యడుగగా సఖుబాయి యత్తమామలకును, భర్తకును, యాత్రా జనులకును నమస్కారముజేసి జరిగినవృత్తాంతమంతయు సవిస్తరముగ దెలియజేసి "జగజ్జననియగు శ్రీ రుక్మిణీదేవి చంద్రభాగాతీరమున నన్ను పునర్జీవితురాలినిగా జేసి పంపెను. నేను నదీతీరమునకు వచ్చునప్పటికి నారూపమున నిచట సేవజేయుచున్న శ్రీ విఠ్ఠలనాథుడు జలభాండమును నాకిచ్చి యంతర్ధానమొందెను" అని చెప్పెను సఖుబాయి యత్త మామలును, భర్తయు పశ్చాత్తప్తచిత్తులై "మనము మహాపాపము జేసితిమి" అని పరిపరివిధముల జింతించుచు నామెసాంగత్యముచే పంఢరీక్షేత్రమునకు బోయి శ్రీ విఠ్ఠలనాథుని సేవించి మధ్వనాథుడను మహాభక్తుని యొద్ద మంత్రోపదేశమునొంది వారును భక్తులై నియమముతో ప్రతి సంవత్సరమును పంఢరీయాత్ర జేయుచు నఖండముగ శ్రీ విఠ్ఠలనాథుని భజించి యవసానమున నీశ్వరసాన్నిధ్య మలంకరించిరి.

ఎనుబదియారవ అధ్యాయము సమాప్తము.

# పురందరదాసచరిత్ర

## —♦ ఎనుబదియేడవ అధ్యాయము ♦—

భూలోక వైకుంఠమని ప్రసిద్ధిచెందిన పంఢరీపుర ప్రాంతమునందు పురందరగడ యను నగరముండెను. ఆనగరమున విక్రమార్క శకము నందు 1404వ సంవత్సరమున 'వరదప్పనాయక్' అను పేరుగల సంపన్న బ్రాహ్మణ గృహస్థుడుండెను. ఆతనికొక పుత్రుడు గలిగెను. ఆ బాలకు నకు శ్రీనివాసని నామకరణము జేసి మిగుల గారాబముతో పెంచుచుం డిరి. ఇతడు విద్యను సంపూర్ణముగా నభ్యసించి తండ్రిచేయు వ్యాపార ములో పాల్గొనుచుండెను. జననీ జనకు లితనికి సగుణసంపన్నురాలగు నొక కన్యకను జూచి వివాహము జేసిరి. కొంత కాలము జరిగినపిదప వర దప్పనాయక్‌ను నాతనిభార్యయు దేహత్యాగము చేసిరి. శ్రీనివాస నాయక్ తనతండ్రి సంపాదించిన యపారధనమును బహుజాగ్రత్తతో గాపాడుచు వృద్ధిచేయుచుండెను. ఈతడు వ్యాపారములో గొప్ప కుశ లుడై విజయనగరము (హంపీ) గోల్కొండ మొదలగు రాజస్థానములకు బోయి రత్న మాణిక్యముల నధిక మూల్యమునకు జరకవస్తులకు విక్ర యించుచుండెను. ఆతడు జగమునం దన్నివస్తువులలో ధనమే గొప్పదను భావముతో నెల్లకాలమును ధనార్జన ప్రయత్నమునే జేయుచుండెను.

ధనార్జనపరుల కౌదార్యము, దయ, క్షమ, మున్నగు సద్గుణ ములు లోపించును. శ్రీనివాసనాయకుడు కౌశల్యముతో వ్యాపారము నందెంత ధనమార్జించుచుండునో, యాతనిలో నంత కృపణత్వము వృద్ధి యగుచుండెను. ఆతని కొకపైస పోయినచో ప్రాణముపోయినట్లు తల చుచు యాచకులను శత్రువులని భావించుచుండెను. ప్రతిజీవియు పూర్వ జన్మ కర్మననుసరించి తత్ఫలము ననుభవించుచుండును. భగవంతుని కృప కెవ్వాడు పాత్రులగునదియు నెవరును దెలిసికొనజాలరు. శ్రీనివాసనాయ కుడు ధనము నార్జించుటకై భూలోకమున జన్మింపలేదు. ఆతడు కృపణ త్వముతో సంచరించుచు పరమార్థ విముఖుడైయుండుటచే దయామయు

డగు శ్రీపంఢరీనాథుడొక దరిద్ర బ్రాహ్మణవేషమును ధరించి యొక దినమున నాతని యొద్దకుబోయి దీనత్వముతో "అయ్యా! నేనతి దరిద్రుడను. యుక్తవయస్కుడైయున్న కుమారునికి వివాహముజేయ ప్రయత్నముతో దమ సమక్షమునకు వచ్చితిని. నాకు ధనసహాయము జేయు" డని ప్రార్థించెను.

శ్రీనివాసనాయకుడు విప్రునిజూచి "నేడు నాకెంత మాత్రమును దీరిక లేదు. రేపటిరోజున రమ్ము" అని చెప్పెను. శ్రీనివాసుడీ "బ్రాహ్మణుడు రేపు తప్పకవచ్చును. రేపువచ్చినచో నీదినమున జెప్పినట్లే ప్రతి దినము జెప్పుచుండవలె"నని దలచెను. ఆ బ్రాహ్మణుడు ప్రతి దినము వచ్చుచుండగా శ్రీనివాసుడు 'రేపురమ్ము'నిజెప్పుచు నాలుమాసములు కాలము గడిపెను. తుదకు శ్రీనివాసునకీబ్రాహ్మణుడు మొండివాడుగ గనపడుచున్నాడని క్రోధముతో జెల్లని పైసలను రెండు గుడ్డసంచులలో బోసియుంచి యాతని యెదుటబెట్టి "యాసంచులలో నున్న పైసలలో నీకు నచ్చినపైస నొకదానిని దీసికొనిపొమ్ము" అని చెప్పెను. బ్రాహ్మణవేషధారియగు భగవంతుడు కొంచెము సేపాశ్చర్యముతో నాతనివంక జూచి యాసంచులలో జేయియైనను బెట్టక యటులనే దిరిగి వెడలిపోయెను. భగవంతుడు బ్రాహ్మణవేషముతో శ్రీనివాసనాయకుని గృహముజేరి యాతనిభార్యతో దనదైన్యమును దెలిపికొని కుమారుని వివాహమునకైనను సహాయము జేయుమని ప్రార్థించెను. ఆమె యుదారస్వభావ యగుటచే బతికృపణత్వమునుజూచి దుఃఖించుచుండెను. దేవబ్రాహ్మణులయందును భక్తులయందును నమితభక్తి గలిగియుండెను. కాని శ్రీనివాసనాయకుడు భార్యయాధీనమున నొక్కపైసయేనియు నెప్పుడు నుంచెడివాడుకాడు. ఆ పతివ్రత బ్రాహ్మణవేషధారియగు భగవంతునకు సన్మానము జేయుటకు తనయొద్ద నేమియు లేనందు లకుజింతించి తనతల్లియొసంగిన యాభరణములలో ముక్కుకుగల నత్తొకటిమాత్రమే ధరించియుండి యానత్తునుదీసి బ్రాహ్మణవేషధారియగు భగవంతునకు 'శ్రీకృష్ణార్పణమస్తు' అనిచెప్పి యర్పించెను.

శ్రీనివాసనాయకుడు బ్రాహ్మణుడు పైస దీసికొనిపోనందున దరిద్రునిపీడ వదలినదని సంతసించెను. ఆసమయమున నే దిరిగి బ్రాహ్మణ వేషధారియగు భగవంతు డచ్చటకువచ్చి "అయ్యా! ఈ ముక్కునత్తును దీసికొని నాలుగువందలవరహాలను నాకి"మ్మని చెప్పెను. శ్రీనివాసు డానత్తునందుకొని యది తనభార్యదని గుర్తించి భార్యయందు మిగుల క్రోధముతో నుండెను. ఆరుమాసములపర్యంతము ప్రతిదినమును తనచుట్టును దిప్పి యంత్యమున నొకపైసయైనను దానాతని కీయక పోగా దనభార్య జీవరత్నముతో గూడిన నత్తును బ్రాహ్మణునకు ధర్మమిచ్చెననుట సాధారణముగాదు. ఆతడు బ్రాహ్మణునిజూచి "యీ నత్తును నాయొద్దనుంచుము! రేపటిదినమున నీవు వచ్చితివేని నూరువరహాలిచ్చెదను" అనిచెప్పి యీనత్తును తనపెట్టెలో బెట్టి తాళమువేసి గృహమునకుబోవుట కుద్యుక్తుడయ్యెను. బ్రాహ్మణవేషధారియగు భగవంతుడు కొంతదూరముపోయి యంతర్ధానమయ్యెను. కొంతసేపటికి శ్రీనివాసనాయకుడు గృహమునుజేరి భార్యనుజూచి "నీ ముక్కునసుండెడి నత్తు నేమిచేసితివి. ఉదయమునుండి నీముక్కునం దా నత్తు కనబడుటలేదు" అనెను. భర్త క్రోధస్వభావము గలవాడని యామెకు తెలియును. అందుచే నామె మౌనముగ నుండెను. శ్రీనివాసుడు కేకలు వేయుచు లేచి "నత్తును త్వరితముగ దెచ్చియిమ్ము లేనిచో నిన్నిప్పుడే చంపెదను" అని చెప్పెను.

ఆమె యేమియు జేయజాలక ధర్మముజేసిన నత్తువిషయమున భర్తతో బలికిన నాతడు దండించుననుభయముచే నేను స్నానముజేయు నప్పుడు దానినిదీసి స్నానముజేసిన పిదప ధరించుట మరచితిని, అది యెక్కడబెట్టినదియు జ్ఞాపకములేనందున నుదయమునుండి వెదకుచుంటిని. త్వరితముగ శోధించి తమకిచ్చెదనని భర్తతో జెప్పి దొడ్డిలో బ్రవేశించి యాత్మహత్య జేసికొనుటతప్ప నన్యోపాయము లేదని యాలోచించి యొకగిన్నెలో విషమునుబోసి భగవంతుని మనముననిలిపి "ఓ దయామయా! నేను బ్రాహ్మణుని కుమారుని వివాహకార్యమునకై



పురంధరదాసు వ్యాపారం          లక్ష్మీబాయి భగవత్పూజ.          పంఢరియాత్ర

'కృష్ణార్పణ' మని నీపేరుతో నత్తును దానముజేసితిని. నాకు మృత్యు భయములేదు. నాభర్తను సద్గుణవంతునిగా జేసి దేవబ్రాహ్మణభక్తితో నాతడు ధర్మకార్యములను జేయుటకు సద్బుద్ధి ననుగ్రహింపుము. నేను నీచరణసాన్నిధ్యమునకు వచ్చుచున్నా" నని ప్రార్థించి యా విషపు పాత్రను చైకితీయుగా నచ్చట నామె'నత్తు'ండెను. "ఈనత్తెక్కడనుండి వచ్చిన" దని శ్రీనివాసుని భార్యయగు లక్ష్మీబాయి యానందాశ్రువు లను విడచుచు భగవంతునకు సాష్టాంగనమస్కారముజేసి కృపావంతు డగు భగవంతుని పరిపరివిధముల కీర్తించి నత్తును శ్రీనివాసున కిచ్చెను.

శ్రీనివాసు డానత్తునందుకొని "నేను దుకాణములో పెట్టెలో నత్తునుపెట్టి బంధించివచ్చితిని. ఆనత్తిచ్చట నున్నది. రేపు బ్రాహ్మణుడు వచ్చినచో నాతనికేమి ప్రత్యుత్తర మీయవలె" నని యాలోచించుచు దుకాణమునకు బోయి తాళమునుదీసి పెట్టెను దెరచి చూడగా నందు నత్తులేకుండెను. ఈ చమత్కారమును జూచి శ్రీనివాసు డాశ్చర్య ముతో గృహమునకు వచ్చి గంభీరస్వరముతో 'లక్ష్మీ!' యని కేక వేసి "నాకు మిగుల నాశ్చర్యముకలుగుచున్నది. నీవిచ్చిన నత్తును దీసికొనిన బ్రాహ్మణు డెవరు? ఆనత్తు ధర్మముజేసినపిదప తిరిగి నీకెట్లు లభించినది? తెలుపుము" అని యడిగెను.

లక్ష్మీబాయి భర్తస్వభావమును జూచి యాతనిలో మార్పు కలి గినదని నిశ్చయించి వృత్తాంతమంతయు శ్రీనివాసునకు దెలిపెను. ఆతడు భార్యచెప్పిన విషయమునంతయు సావధానముగ విని నేత్రములనుండి యానందాశ్రుధారలు విడచుచు చేతులుజోడించి "ఓ దేవాధిదేవా, రుక్మిణీకాంతా! నీవనాథబ్రాహ్మణరూపముతో నధముడనగు నన్ను యాచింపవచ్చితివా? నీచుడనగునేను నిన్నారుమాసములు త్రిప్పించి యొకపైసయైనను నీయక నీకు నత్తును ధర్మముజేసిన నా భార్యను జంపదలచితిని. నీవామెను విషపానమునుండి తప్పించితివి" అని ప్రార్థించి పశ్చాత్తాపతప్తచిత్తుడై తత్క్షణమే స్నానముజేసి ధౌతవస్త్రములను ధరించి భార్యతోగలిసి శ్రీ పంఢరీనాథుని షోడశోపచార విధుల

బూజించి తులసీతీర్థమును దీసికొని తన సంపత్తియంతయు శ్రీ కృష్ణార్పణమని జెప్పి భగవచ్చరణముల యొద్ద తులసి తీర్థమును విడచెను.

శ్రీనివాసనాయకుడు మరునాడు ప్రాతఃకాలమున నిద్రనుండి లేచి కాలకృత్యములదీర్చికొని స్నానముజేసి భగవత్పూజజేసికొని నగరమునగల దీనులను బ్రాహ్మణులను బిలపించి తనయొద్దనున్న ధనమంతయు తన భార్యకొఱకొక పైసయైననుంచక గృహమంతయు శోధించి యామెస్వాధీనముననున్న బంగారు బరిణెతోసహా ధర్మముజేసి హరినామసంకీర్తనజేయుచు పంఢరీపురక్షేత్రముజేరెను. చంద్రభాగానదిలో స్నానముజేసి శ్రీ విఠ్ఠలనాథుని త్రికాలములయందు సేవించుచు భిక్షాటనచే నుదరపోషణ జరుపుకొనుచు నఖండముగా హరినామ సంకీర్తన జేయుచు గాలము గడపుచుండ నా ప్రాంతమున మహమ్మదీయుల హింసాకాండ యధికమై యుండుటచే విజయనగరమునకు బోయెను.

విజయనగరేశుడగు శ్రీకృష్ణదేవరాయలు శ్రీనివాసునకు రత్నముల వ్యాపార సందర్భమున చిరపరిచితుడై యుండెను. శ్రీనివాసుడిప్పుడీ రూపమున నుండుటను జూచి శ్రీకృష్ణదేవరాయలాశ్చర్యపడి తన గురువగు వ్యాసరాయులను యతిశ్రేష్ఠుని రప్పించి శ్రీనివాసునకు వారి వలన మంత్రోపదేశముజేయించెను. యతీశ్వరుడు యోగ్యుడగు శిష్యునకు వేదశాస్త్ర పురాణములను సాంగోపాంగముగ నేర్పి పూర్వాశ్రమముననున్న శ్రీనివాసుడను నాతని నామమును మార్చి 'పురందర విఠ్ఠలుడు' అని నామకరణముజేసెను. ఆతనినే పురందరదాసని పిలుతురు.

పురందరదాసులో ప్రగాఢమగు భగవద్భక్తి యభివృద్ధిజెందెను. ఆతని గురుదేవులగు వ్యాసరాయుడు నిరపేక్షుడై భిక్షాటనచే జీవనము చేయుచు నఖండముగ భగవచ్చరణములను సేవించు భక్తుడు పురందరదాసొక్కడేయనియు, మహాసాధ్వియు, పతిసేవాపరాయణయునగు లక్ష్మీబాయితో సమమగు భక్తురాలు జన్మింపలేదనియు నాతడు తన కవిత్వగీతములలో వర్ణించెను. పురందరదాసు తాను భిక్షాటనచే సంపాదించిన యాహారముతో నతిథ్యభ్యాగతుల నాదరించుచు మరుసటి దినమునకు

నిలువయుంచుకొనకుండెను. ఇప్పటికిని దక్షిణదేశమున దరిద్రులయిండ్లను పురందరదాసు గృహమువలెనున్నదని యోహ్యముగ బలుకుచుందురు. ఆతని వృత్తి ప్రపంచమున కాదర్శ మయ్యెను.

ఒకసమయమున పురందరదాసు భిక్షాటనజేయుచు నొక గృహ ద్వారమునొద్ద బోయి నిలువబడియుండెను. ఆ గృహయజమాని తలుపులు వేసికొనగా పురందరదా సదిచూచి భిక్షుకులనుజూచి యెవరు ద్వారమును బంధింతురో వారి గృహమునందలి పాపములు ద్వారమును దాటిపోక గృహముననే వసించుచుండునని పలికెను. సద్గురు కృపాకటాక్షముచే నాతనికి కవిత్వరచనాశక్తి యలవడి కర్ణాటకభాష యందు లోకభిక్ష, వైరాగ్యము, తత్వజ్ఞానము, భగవద్భక్తి మొదలగు విషయములలో గంభీరమగు భావములతో గ్రంథములను రచించుచుం డెను. ఆతనిని కర్ణాటక సంగీతోద్ధారకుడని ప్రజలు పలుకుచుందురు. దక్షిణభారతమున నాతనికవిత్వము ప్రజల కత్యంతప్రియమై యుండెను. ఆతడు నాలుగులక్షల డెబ్బదియైదువేల శ్లోకములను రచియించి యనన్య ప్రాప్యమగు యశము నార్జించెను.

పురందరదాసు సుమారు నలువదిసంవత్సరములు తీర్థాటనజేసి తన యెనుబదియవయేట విక్రమార్కశకమున 1562 వ సంవత్సరమున భగవత్సాన్నిధ్య మలంకరించెను. ఆతని శిక్షణ, యాతని పదములు, నాతని గ్రంథములు జగన్మంగళకరములై యున్నవి. కన్నడభాషయం దాతని సాహిత్యము భక్తులకు ప్రియధనమైయున్నది.

ఎనుబదియేడవ అధ్యాయము సమాప్తము.

---

# కమలాకర చరిత్ర

## —♦ ఎనుబదియెనిమిదవ అధ్యాయము ♦—

భూలోకవైకుంఠమని ప్రసిద్ధినొందిన శ్రీ పంఢరీపురక్షేత్రము నందు పరమభావుకుడును, సకలశాస్త్రప్రవీణుడును, సర్వభూతదయా పరుండును నగు కమలాకరు డను పరమభక్తుడుండెను. అతనికి పరమ భావుకురాలును, పతివ్రతాశిరోమణియు, 'సుమతీబాయి' అను సత్కళత్రముండెను. ఈ పుణ్యదంపతులకు పద్మాకరుండను పేరుగల సుపుత్రు డుండెను. కమలాకరుడు ప్రతిదినము చంద్రభాగానదిలో స్నానము జేసి గోపీచందనతిలకమును ధరించి, దేవతార్చన ముగించుకొని హరినామ సంకీర్తన జేయుచు నాక్షేత్రమున ప్రతియింటికిబోయి భిక్షాటనముచేసి తనస్నాలముగా లభించిన భిక్షాన్నములో గొంతభాగము సాధుజనుల కొసంగి, పిదప దారపుత్రులతో భుజించి, యనంతరము కథాకాలక్షేప ములతో గాలముగడపుచుండెను.

ఇట్లు కొంతకాలము జరిగిన పిదప నొకనాడు కమలాకరుడు కుమారుని వెంటబెట్టుకొని భిక్షకు బోగా మార్గమధ్యమునం దొకచోట శ్రీ విఠ్ఠలనాథుని కంతరంగభక్తులగు నివృత్తిదేవ, జ్ఞానదేవ, సోపాన దేవ, ముక్తాబాయి, నామదేవ, గోరాకుంభార, చోఖామేళాదులు హరినామసంకీర్తనజేయుచు ధార్మికోపదేశములను జేయుచుండిరి. కమలాకరుడు వారినిజూచి సాష్టాంగనమస్కారముజేసి నిలువబడి "మహాత్ము లారా! నా పూర్వపుణ్యవిశేషముచే నతర్కితముగ తమదర్శనము లభించినది. తామెల్లరును నాగృహంబునకు విచ్చేసి నన్ను పవిత్రునిగా జేయుడు" అని ప్రార్థించెను. జ్ఞానేశ్వర, నామదేవాది భక్తులెల్లరు కమలాకరునిజూచి "నీవు విష్ణుభక్తుడవు, భాగవతసేవా తత్పరుడవునై యున్నావు. మేము చాలామందియున్నాము. నీకోరికననుసరించి మేము వచ్చుట కభ్యంతరములేదు. కాని మేమెల్లరము వచ్చినచో నీకు మిగుల శ్రమయగును" అని పలికిరి.

అంత కమలాకరుడు చేతులుజోడించి "అయ్యలారా! నా జననీ జనకు లఖండైశ్వర్యవంతులు. వారనంతబ్రహ్మాండమునందలి జీవకోట్లను పోషించుచు రక్షించుచున్నారు. వారి కృపాకటాక్షమునకు పాత్రుడ నైన నాకేవిధమగు శ్రమయులేదు. మీరు నాగృహమునకు విచ్చేసి సేవకుడనగు నేనొర్చు పూజాదు లంగీకరింపవలయును" అని ప్రార్థింప వారు కమలాకరునిజూచి "కమలాకరా! మేము చంద్రభాగకు బోయి స్నానానుష్ఠానములు నెరవేర్చుకొని వచ్చెదము. నీవు గృహమునకు బొమ్ము" అని చెప్పిరి. కమలాకరు డమితానందముతో గృహమునకు బోయి భార్యనుబిలచి "నేడు మహాభక్తులు మనసదనమునకు విచ్చేయు దురు. వారల కందఱకును భోజన మేర్పాటుచేయుడు" అని యాజ్ఞా పించి, భక్తులను వెంటబెట్టుకొనివచ్చుటకై చంద్రభాగకు వెడలిపోయెను.

సుమతీబాయి ప్రక్కయింటి సఖురాలియొద్ద వలయు వస్తుసామ గ్రులను బదులుతీసికొని యానందముతో వంటచేయుచుండగా వంట చెఱకులు చాలకపోయినందున తన పుత్రుడగు పద్మాకరుని బిలచి కొన్ని పిడకలనుదెమ్మని పంపెను. పద్మాకరుడు పిడకల దీయుచుండగా నందువసించియున్న కృష్ణసర్ప మాబాలుని గరచెను తత్‌క్షణమే పద్మా కరుడు పెద్దకేకలువేయుచు నేడ్చుచుండెను. సుమతీబాయి భయంకర మైన రోదనధ్వనినివిని, పరుగునపోయి, జరిగినవృత్తాంతమంతయు పుత్రుని వలన దెలిసికొని, దుఃఖించుచుండగా పద్మాకరుని శరీరమంతయు విషము వ్యాపించి కొంతసేపటికి మరణించెను.

అంత సుమతీబాయి, పూర్వము సౌందర్యప్రజ్ఞావంతుడగు రోహి తాస్యుడు సర్పముకఱచి మరణించగా, విలపించిన చంద్రమతికంటె ననంతగుణముల దుఃఖముకలదయ్యెను, భగవద్భక్తులసేవకు విఘ్నము కలుగకుండుటకై యాబాలకు నెత్తి గృహమునందొక మూలపరుండ బెట్టి,స్నానముజేసి, వంటపూర్తిచేసి భక్తులరాక కెదురుచూచుచుండెను. కమలాకరుడు సాధువులను వెంటబెట్టుకొని గృహముజేరి యర్ఘ్యపాద్యా ద్యుపచారంబులచే బూజించి వారల చరణతీర్థమును స్వీకరించి, పిమ్మట

భగవంతునికి పదార్థములు నైవేద్యముజేసి భగవత్ప్రసాదము నా మహా భక్తులకు వడ్డించి భుజింపుడని వారిని ప్రార్థించెను.

నామదేవులు శ్రీ విఠలనాథుని ప్రార్థించెను. స్మరించినంతనే విచ్చేయు భగవంతుడురాలేదు. అంత నామదేవులు చింతాక్రాంత మానసుడై శ్రీవిఠలనాథు ననేకవిధముల ప్రార్థించినను భగవద్దర్శనము కానందున చింతించి, దివ్యదృష్టితో విషయమునుదెలిసికొని కమలాకరునితో 'భక్తాగ్రగణ్యా! మీ పుత్రుని మా పంక్తిలో కూర్చుని భుజించుటకు తీసికొనిరండు" అని పలుకగా, సుమతీబాయి చేతులుజోడించి నామదేవులజూచి, "మహాత్మా! వాడిప్పుడే భుజించి నిద్రించుచున్నాడు" అని చెప్పెను. అంతనామదేవులు "మీ పుత్రుడు పంక్తిలోలేనిచో మేముభుజింపము. ఆతనిని లేపి పిలచుకొనిరండు" అని చెప్పెను. సుమతీబాయి నామదేవులతో "స్వామీ! ఆతని నెంతలేపినను లేచుటలేదు. తామెల్లరు భుజింపుడు" అని ప్రార్థించెను నామదేవులు శ్రీవిఠల నాథుని మనమున నిలుపుకొని "ఓ దేవాధిదేవా, రుక్మిణీకాంతా! నీవు దర్శన మీయనిచో మేము భుజింపమని ప్రార్థించగా, శ్రీ విఠలనాథుడు దర్శనమిచ్చి నామదేవులను జూచి నీ కోరికయేమి?" అని యడుగగా నామదేవులు, "ఓ పాండురంగదేవా! కమలాకరుని పుత్రుని నిద్రనుండి లేపి మా పంక్తినిగూర్చుండి భుజించున ట్లనుగ్రహింపుము" అని కోరెను.

శ్రీ విఠలనాథుని కృపావిశేషముచే నా బాలుడు లేచి తల్లిని దాహమునకు జలమును దెమ్మని యడిగెను. ఆ కంఠధ్వనివిని సుమతీబాయి లేచి త్వరితముగాబోయి పద్మాకరుని కౌగలించుకొని భక్తుల సమక్షమున కాతని నెత్తుకొనిపోయి నామదేవులచరణములపై పడవైచి, "అయ్యా! తమ కృపాకటాక్షముచే మాకు గలిగిన పుత్రవియోగ దుఃఖము పలాయనమయ్యెను" అని చెప్పగా భక్తులెల్లరును "మీ కుమారునకేమి ప్రమాదము సంప్రాప్తించిన"దని విచారించిరి. సుమతీబాయి జరిగిన వృత్తాంతమంతయు వారలకు దెలిపెను. భక్తులెల్ల రీవిషయమునువిని నామదేవులను జూచి "మీరు సాక్షాదీశ్వరాంశసంభూ



జ్ఞానేశ్వరులకు నామదేవులకు కమలాకరుఁడు భోజనమేర్పాటుచేయుట.

తులు” అని పరిపరివిధముల స్తోత్రము జేసిరి. పిదప భక్తులును పద్మాకరునితోగూడ పరమసంతోషముగా భుజించి కరశుద్ధిజేసికొని విశ్రమించి కమలాకరుని, సుమతీదేవిని పద్మాకరుని నాశీర్వదించిరి. అంత కమలాకరుడు నామదేవులనుజూచి “అయ్యా! మమ్ముల తమదాసులనుగా నంగీకరించి మాకు మంత్రోపదేశము జేయుడని ప్రార్థించెను.

నామదేవులు వారి యాచరణకును, వినయ విధేయతలకును జ్ఞానానుష్టానాది నియమములకును సంతసించి వారలకు శ్రీ విఠల తారక మంత్రము నుపదేశించి తదనుష్టాన క్రమమంతయు విశదముగా దెలిపెను. పిదప కమలాకరుడు దారపుత్రులతో నామదేవులకు సాష్టాంగవందనములుజేసి భక్తుల యుచ్ఛిష్టప్రసాదమును స్వీకరించిరి. పిదప కమలాకరుడు నిత్యము పూర్వమువలె తన పుత్రునితోగలిసి భిక్షాటనజేసి తన్మూలముగా వచ్చిన భిక్షాన్నముచే నతిధ్యభ్యాగతుల సంతుష్టిపరచుచుండెను. ఒకనాడు శ్రీవిఠలనాథుడు వృద్ధబ్రాహ్మణ వేషధారియై కమలాకరుని గృహమందు లేనసమయమునం దాతనియింటికిబోయి సుమతీబాయినిజూచి “తల్లీ! నాకు క్షుద్బాధ అధికముగ నున్నది. ప్రాణము పోవునట్లున్నది. కొంచెము గంజినీళ్ళయినవిచ్చి నన్ను కాపాడుము” అని బలికెను. ఆదినమున వారియింట నేమియు లేనందున సుమతీబాయి పొరుగింటికిబోయి వలయు వస్తుసామగ్రులను బదులు తెచ్చి వంటజేసి వృద్ధబ్రాహ్మణునికి తృప్తిగాభోజనముపెట్టి యాతడు నిద్రించుటకు శయ్యనేర్పరచి దానిపై పరుండుమని చెప్పెను. భగవంతుడా శయ్యపై విశ్రమింప నాయువతి యాతనికి పాదసేవ జేయుచుండెను.

కమలాకరుడును, పద్మాకరుడును గృహముచేరి సుమతీబాయి చేసిన అతిథిపూజ కానందించి, ఆమెనుజూచి “నీవు వంటజేయుటకు బొమ్ము. మేము యీ వృద్ధబ్రాహ్మణునికి సేవజేయుచుండెదము’ అని చెప్పి కమలాకరుడు వృద్ధబ్రాహ్మణుని చరణము లొత్తుచుండ పద్మాకరుడు విసరుచుండెను. భగవంతుడు వారుచేయు నుపచారంబులకు సంతసించి సుఖనిద్రనొందియుండెను.

సుమతీదేవి వంట పూర్తిజేసికొని కమలాకరునకు దెలుపగా నాతడు వృద్ధబ్రాహ్మణునకు నిద్రాభంగము జేయరాదని యెంచి యాకలిదప్పులను నురచి సేవజేయుచుండెను. భగవంతుడు రాత్రి జాము వేళయైన పిదప నిద్రనుండి లేచి "భక్తాగ్రేసరా! మీరింకను భుజించ కుండుటకు కారణమేమి? త్వరితముగా పోయి భుజింపుడు" అనెను. అంత కమలాకరుడు "స్వామీ! మీరును భుజించుటకు విచ్చేయుడు" అని ప్రార్థించెను. అంత నా వృద్ధబ్రాహ్మణ వేషధారియగు భగవంతుడు కమలాకరునియొక్కయు, నాతనిభార్య బిడ్డలయొక్కయు భక్తికి సంత సించి నిజరూపముతో దర్శనమీయగా వా రానందాబ్ధి నోలలాడిరి. భగవంతుడు వారలపంక్తిలో గూర్చుండి భుజించి కరశుద్ధి జేసికొని కమ లాకరుని జూచి "భక్తశ్రేష్ఠా! మీరు నాకృపకు పాత్రులైతిరి. నేను సదా మీ హృదయములందు వసించుచుండెదను" అని పలికి యదృ శ్యుండయ్యెను. కమలాకరుడు, నాతని దారపుత్రులు నప్పటినుండియు నేకొఱతలేక శ్రీ విఠ్ఠలనాథుని కృపచే గృహస్థాశ్రమధర్మంబుల ననుష్ఠిం చుచు మహదానంద మనుభవించుచు నవసానమున శ్రీ విఠ్ఠలనాథుని చరణసాన్నిధ్య మలంకరించిరి.

ఎనుబదియెనిమిదవ అధ్యాయము సమాప్తము.



# ఏకాదశీ మాహాత్మ్యము

—♦ ఎనుబది తొమ్మిదవ అధ్యాయము ♦—

భారత యుద్ధానంతరము పాండవు లొకదినమున శ్రీకృష్ణుని షోడశోపచారవిధుల బూజించి "హే కృష్ణా మాసర్వసము నీవై యున్నావు. స్వగోత్ర హత్యాపాపము హరించు నుపాయము తోచుటలేదు. మామానసములందు బాధగనున్నది. విశ్వతారకుడవగు నీవు దీర్ఘముగ నాలోచించి మేమా పాతకములనుండి తొలగి శుద్ధులమగు నుపాయము నెఱింగింపుమని ప్రార్థించిరి. ద్రౌపదీదేవి భగవంతుని చరణ కమలములకు సాష్టాంగ సమస్కారము జేసి "ఓ దేవాదిదేవా! సర్వ శక్తిమంతుడవగు నీవుండ మాకేమియు భయములే"దని చెప్పెను. అంత శ్రీకృష్ణభగవానుడు హాసవదనుడై "ఓ ధర్మరాజా! సర్వవ్రతము లలో శ్రేష్ఠమైనదియు, బ్రహ్మహత్యాది మహాపాపములను నాశనము జేయునదియు, మా దేవత్వమును రక్షించునదియునగు నేకాదశీ వ్రతము త్రిభువన విఖ్యాతమై యున్నది. మీరావ్రతము నాచరించిన స్వగోత్రజ మారణ పాపము హరించు"నని చెప్పెను. పాండవులును, ద్రౌపదియును భగవంతునకు వందనములజేసి "దేవా! మీరుచెప్పిన వ్రతవిషయము మే మెవరివలనను వినియుండలేదు. ఈ విషయము మాకాశ్చర్య కర ముగనున్నది. ఏకాదశి యెట్లు జన్మించినది? మీ దేవత్వము నెట్లు రక్షించినది? వృత్తాంతమునంతయు సవిస్తరము తెలుపు"డని ప్రార్థించిరి

శ్రీకృష్ణ భగవానుడు హాసవదనుడై యిట్లనెను. "ఓ ధర్మరాజా సావధాన చిత్తుడవై ఏకాదశీ సచ్చరిత్రను వినుము ఈ చరిత్ర శ్రవణ ముచే మహాపాపములు నశించును. పూర్వము కుంభదైత్యుని పుత్రుడగు మృధుమాన్యుడు శంకరునిగూర్చి తపంబు నాచరించెను. ఆతని తపశ్శక్తికి మెచ్చి శ్రీ కైలాసనాథుడు సాక్షాత్కరించి "ఓరీ మృధుమాన్యా! నలయు వరమును వేడుము" ఇచ్చెదననగా ఆత "డో మహాదేవా! నాకే ప్రాణివలనను మృత్యువు కలుగకుండునటుల వరము ననుగ్రహింపుము" అని కోరెను.

శంకరుడు "తథాస్తు" అనిపలికి పిదప "వీ డవిచారి, ఉన్మత్తుడు, వీని కిచ్చిన వరమువలన విశ్వమునకే విపత్తు కలగవచ్చు"నని మనమున దీర్ఘముగ యోచించి "నేను విచారింపకయే యందరికి వరముల నిచ్చుచుందును. విష్ణుభగవానుడు తిరిగి నేనిచ్చిన వరములనుండి విపత్తు గలుగకుండ రక్షించుచున్నా"డని తలచి మృధుమాన్యుని బిలచి "ఓరీ మృధుమాన్యా! నీవు కోరినట్లు నీకు మృత్యువు కలుగనేరదు. జననీ జనకులు లేకయే జన్మించు అయోని సంభూతియగు నొకకన్యకచే నీకు మృత్యువు సంప్రాప్తించునని సంశయముగ నున్నది. నీవు బ్రహ్మవిష్ణుల నింద్రాది దేవతలను నిస్సంశయముగ జయింతువు. వారలవలన నీకు మృత్యుభయ ముండ"దని వరదానమిచ్చి శంకరుడు తత్కాలమం దదృశ్యు డాయెను.

మృధుమాన్యుడు వరమదాంధుడై రాక్షస సేనలను బురికొల్పి, తనకంటె జెర్చికొని, వారిని వెంటబెట్టుకొని స్వర్గమునకుబోయి, రణభేరిని మ్రోగించి దేవేంద్రునిపై యుద్ధమును బ్రకటించెను. అంత దేవేంద్రు డాతని ప్రతాపమునుజూచి ప్రళయకాల మాసన్నమైనట్లున్నదని తలంచి స్వర్గమునువిడచి దేవతలను వెంటబెట్టుకొని సత్యలోకమునకుబోయి బ్రహ్మదేవునకు సాష్టాంగ నమస్కారముజేసి యాతనితో "మృధుమాన్యుడు స్వర్గలోకమును జయించె"నని చెప్పెను.

ఆ సమయమున రక్కసుల సేనతో మృధుమాన్యుడు సత్యలోకమును జేరి రణభేరిని పిక్కటిల్ల జేసి యుద్ధమును బ్రకటించెను. రక్కసుల బాధల నోర్వజాలక బ్రహ్మదేవుడు సత్యలోకమునువిడచి సావిత్రీ దేవిని వెంటబెట్టుకొని యింద్రాది దేవతలతో గలిసి వైకుంఠమును జేరెను. చతుర్ముఖుడును, నింద్రాది దేవతలును భీతిల్లుచు వచ్చియుండుటను శ్రీమన్నారాయణుడు జూచి "మీరెల్లరును భీతితో బరుగున వచ్చుటకు గతంబే"మని యడుగగా వారెల్లరును లక్ష్మీకాంతునకు వందనముజేసి "ఓ దేవాదిదేవా! శంకర ప్రసాదితమగు వరముచే మృధుమాన్యుడు మదాంధుడై స్వర్గ సత్యలోకముల నాక్రమించెను. నీవు

భక్తరక్షకుడవు త్రిభువన వ్యాపకుడవు. నిన్ను శరణుబొందుటకై నీసమక్షమునకు వచ్చితి''మని చెప్పిరి. మృధుమాన్యు డాసమయమున వైకుంఠమునుజేరి రణభేరీని మ్రోగించి విష్ణు సమక్షమునకేగి గర్జించుచు "ఓరీ! నారాయణా! నిన్నాశ్రయింప వచ్చిన దేవతలకేమి చెప్పితివి'' అని యడుగగా దేవతలెల్ల భయకంపిత గాత్రులైరి.

మహావిష్ణువు మృధుమాన్యునిజూచి ఓరీ ఉన్మత్తుడా! నీ వేవంశమున జన్మించిన వీరుడవు? నీ వెవరివరమువలన నిట్లున్మత్తుడ వైతివి?" అని యడిగెను. అంత మృధుమాన్యుడు "ఓ నారాయణా! ఈసమయమున నీవు నన్ను శరణుబొందుము! నీకును, వైకుంఠమునకును ప్రమాదము రాకుండ రక్షించెదను నేను కుంభదైత్యుని పుత్రుడను. నన్ను మృధుమాన్యుడని పిలతురు. నేను శంకరుని ప్రసన్నునిగా జేసికొని, యాతని వలన మృత్యువులేకుండునటుల వరమునుబొంది త్రిభువనములను పాలనజేయు నిచ్ఛతో నిచ్చటకు వచ్చితి"నని చెప్పి క్రోధముతో గదను దీసికొని యుద్ధమునకు సంసిద్ధుడాయెను. దేవతలెల్లరు విష్ణునాయకత్వమున మృధుమాన్యునితో యుద్ధముజేయుచుండిరి శ్రీమహావిష్ణువు తన సుదర్శనచక్రము నాతనిపై ప్రయోగించెను. శంకరునివరము ననుసరించి మృధుమాన్యుని సుదర్శనచక్రము సంహరింపజాలక వెనుకకు దిరిగెను. మహావిష్ణువు మృధుమాన్యునితో ద్వంద్వయుద్ధముజేసి పరాజితుడై లక్ష్మీదేవిని వెంటనిడుకొని వైకుంఠమును త్యజించెను. ఆసమయమున వైకుంఠమున హాహాకారములు బయల్వెడలెను.

లక్ష్మీనారాయణులును, సావిత్రీ బ్రహ్మదేవులును, శచీసహస్రాక్షులును, ముప్పదిమూడుకోట్ల దేవతలును, కైలాసమునుజేరి సింహాసనముపై నధిష్ఠించియున్న పార్వతీరమణుని షోడశోపచారవిధుల బూజించి కర్పూరనీరాజన మర్పించిరి. కైలాసనాథుడు శ్రీమన్నారాయణుని జూచి "ఓనారాయణా! దేవతాసమూహమును నీవు వెంటబెట్టుకొని వచ్చిన కతంబేమి?" అని యడిగెను. అంత శ్రీమహావిష్ణువు చేతులు జోడించి "ఓ కైలాసనాథా! అవిచారియగు మృధుమాన్యునకు మీరు

యోచింపక నిచ్చిన వరమువలన లోకాలోకములకు ముప్పువాటిల్లినది. ఆతడు స్వర్గ సత్యలోకముల నాక్రమించి పిదప వైకుంఠమును జయించుటచే మేమెల్లర మిచటికి వచ్చితిమి” అని చెప్పెను.

మృధుమాన్యు డప్పుడు కైలాసమునుజేసి రణభేరిని మ్రోగించి శంకరుని కభిముఖముగ నిలువంబడియున్న లక్ష్మీకాంతునిజూచి “ఓ నారాయణా! నీవిం కెచ్చటికేగెద” వని యడిగెను. ఆసమయమున లక్ష్మీదేవి శ్రీమహావిష్ణువును; సావిత్రి విధాతను; పార్వతీదేవి శంకరుని భీతిచే బట్టుకొనిరి. కైలాసనాథుడు మృధుమాన్యునితో యుద్ధమునకు సంసిద్ధుడై యరువదివేల ప్రమథులతో సంగ్రామమును బ్రారంభించెను. ఒకప్రక్క విష్ణుమూర్తి దేవతాసమూహముతో గలిసి దైత్యునితో యుద్ధముజేయుచుండెను. దైత్యులు సింహనాదముతో యుదమును జేయుచుండ కైలాసమంతయు హాహాకారమయమాయెను. పార్వతీరమణుడు క్రుద్ధుడై మృధుమాన్యునిపై తనత్రిశూలమును బ్రయోగింప నది వెనుకకుమరలెను. కొంతసేపటి కీశ్వరుడు మూర్ఛిల్లి పిదప లేచి ఇది మహాప్రళయకాలమని తలచి కైలాసమును విడచెను. త్రిమూర్తులును, వారి పత్నులును, దేవతాసమూహమును పలాయనమైరి. అంత మృధుమాన్యుడు వారినిబిలచి “మీరు ముగ్గురును నన్ను శరణుబొందినచో మీకు ప్రాణదానముజేసెదను. లేనిచో మిమ్ములనెట్లైనను సంహరింతు” నని పలికెను.

త్రిమూర్తులును, దేవతాసమూహమును పలాయనులై చిత్రకూటశిఖరమును జేరిరి. దైత్యులు స్వర్గ, మర్త్య, పాతాళలోకముల నాక్రమించిరి. త్రిమూర్తులును, దేవతాసముదాయమును, చిత్రకూట పర్వతమునందలి మహారణ్యమున బ్రవేశించి, ధాత్రీవృక్షచ్ఛాయ నధిష్ఠించిరి. వారలచట స్నానముజేసి నిరాహారులై శ్రమచే నిద్రించుచుండిరి. త్రిమూర్తుల శ్వాసలనుండి యొకకన్యక యవతరించెను. ఆమె త్రిమూర్తులయొద్ద కొంతసేపటివరకు గూర్చుండి వారు సావధానచిత్తులైనపిదప చేతులుజోడించి నిలువబడి నేను మీశ్వాసలనుండి జన్మించి



ఏకాదశీదేవి మృధుమాన్యుని వధించుట

తిని. నే నేమి చేయవలయునో యాజ్ఞాపింపుడు” అని యడుగగా త్రిమూర్తులు చేతులుజోడించి “ఓ స్వామినీ! నిన్ను శరణుబొందితిమి! మా దేవత్వమును గాపాడుము!” అని ప్రార్థించిరి. అంత నామె “మీకోరిక ననుసరించి మృధుమాన్యుని సంహారించెద” నని చెప్పి యచటనుండి బయలుదేరి యాయరణ్యమున రక్కసులసేనతో ప్రవేశించుచున్న మృధుమాన్యుని యెదుట గంభీరస్వరూపముతో నిలువబడెను. ఆమె చరణములు పాతాళమును, కిరీట మాకాశమున నంటునట్టుల విస్తృత రూపిణియై యుండెను. మృధుమాన్యుడు విస్మయమంది “ఓ సుందరీ! నీవెవరు? ఈ మహారణ్యమున ప్రవేశింప గతంబేమి? నీతో సమమగు సౌందర్యవంతురాలను నేను త్రిభువనములందును జూచియెరుగను. నీ పేరేమి? నీ వేవంశమున జన్మించితివి? తెలుపుము” అని యడిగెను.

అంత నాస్వామిని “ఓరీ భ్రష్టుడా! నానామముతో నీకేమిపని యున్నది. నేనిప్పుడే త్రిమూర్తులశ్వాసలనుండి జన్మించి, నిన్ను సంహరించుటకు వారలయొద్ద నాజ్ఞనుబొంది వచ్చితిని. నివిచ్చటనుండి యెచ్చటకు పలాయనమగుదువో చూచెద” ననుచు కోపోద్దీపితమానసయై ఖడ్గమును చేపట్టెను. అంత మృధుమాన్యుడొకశిల నెత్తి యామెపై విసరగా నామె ఖడ్గముతో దాని నాపివైచి యాఖడ్గమును మృధుమాన్యునిపై విసరెను. తత్క్షణమే మృధుమాన్యుడు సంహారింపబడి భూమిపైబడెను. ఆదేవి యచటనుండి బయలుదేరి త్రిమూర్తులయొద్దకు వచ్చి “మృధుమాన్యుని సంహారించితి” నని చెప్పగా వార లామెచరణములకు వందనములజేసిరి. అంత నాదేవి “నాయుదరమున చతుర్దశ భువనము లిమిడియున్నవి. నాకు జననీజనకులును, స్వామిస్వామినులును లేరు. నేను త్రిభువనములందు వ్యాప్తమైయున్నాను. నాపే రేకాదశి. మీవలన కృపాదానము బొందుటకై మీశ్వాసలనుండి నేను జన్మించితిని. మీరు నిరాహారులైయుండుటచే మీకు నా వ్రతఫలితము లభించినది. నా వ్రతమును నియమముతో నాచరించిన మహాదోషములు నశించును. మీరు త్రిలోకములం దెల్లరును తరించుటకై యీ వ్రతము నాచ

రించుచు ప్రకటింపుడు. మీ దేవత్వమున కెన్నటికిని భంగము కలుగ నేరదు'' అని చెప్పెను.

అంత శ్రీమన్నారాయణుండు ''నీవెప్పుడును నాయొద్దనే యుండుము. ప్రతి పదునైదు దినముల కొకసారి నీవ్రతమును నేజేయుచుందును. ఈవ్రతాచరణచే పునరావృత్తి రహితులై ప్రాణులు జీవన్ముక్తులగుదురు. మాతృసంగమము, సురాపానము, బ్రహ్మహత్య, గోవధ, పరస్త్రీ వేశ్యాగమనాది మహాపాతకము లన్నియు నశించును. జాతిభ్రష్టులు, గోత్రజ హత్యాపరులు, కన్యావిక్రయపరులు మొదలగు పాపులీవ్రతము నాచరించినచో శుద్ధులగుదురు'' అని చెప్పెను.

శ్రీకృష్ణభగవానుడు ''ఓ ధర్మరాజా! ఈ ప్రకారముగ నేకాదశి కృతయుగమునం దవతరించి మా దేవత్వమును గాపాడిన''దని చెప్పగా ధర్మరాజు చేతులుజోడించి ''ఓ లక్ష్మీపతీ! మీరిప్పుడు చెప్పిన పాపములలో గన్యావిక్రయ దోషమని వర్ణించితిరి; దాని విషయమేమి తెలుపుము'' అని యడిగెను. అంత శ్రీకృష్ణభగవానుడు ''ఓ ధర్మరాజా! కన్యను విక్రయించువాడు నాలుగు యుగముల పర్యంతము క్రిమియై జన్మించి దారుణమగు యాతనల ననుభవించును. కన్యావిక్రయ ధనముతో కుటుంబపోషణ జేసినచో యాకుటుంబము సూకరవిష్ఠను భుజించినదానితో సమమగు''నని చెప్పెను. పిదప ధర్మరాజు శ్రీకృష్ణునకు వందనము లాచరించి ''ఓ పురుషోత్తమా! ఏకాదశి వ్రతమాహాత్మ్యమును దెలుపుము'' అని యడిగెను. శ్రీకృష్ణుడు హాసవదనుడై ''ఓ ధర్మరాజా! ఎవ డేకాదశీ దినమున భుజించునో యాతనికి మాతృభోగమునకు మించిన పాపము సంప్రాప్తించును. మరియు కీటకములున్న గోమాంసము భుజించినపాపమును, వారణాసిక్షేత్రమున పితృవధ జేసిన పాపమును సంప్రాప్తించును.

ఓధర్మరాజా! త్రిమూర్తులును, వారిపత్నులును, దేవతాసమూహము నచటినుండి బయులుదేరి తమతమ లోకములకు బోయిరి.

శ్రీమహావిష్ణువు యేకాదశిని నీవు నాయొద్దనేయుండుమని కోరుటచే నామె వైకుంఠమును జేరెను. విష్ణుమూర్తి గరుత్మంతునిబిలచి "ఓ గరుడా! నీవు లోకాలోకములకు బోయి సర్వులు ఏకాదశీవ్రతము నాచరించవలసినదిగ నాయాజ్ఞను దెలుపుము. వ్రతము నాచరింపనివారిని వైకుంఠ ద్వారమున బ్రవేశింపనీయకుము" అని చెప్పెను. భగవదాజ్ఞప్రకారము గరుత్మంతుడు లోకాలోకములందును చాటించెను.

వైకుంఠమున శ్రీమహావిష్ణువు చేయు నేకాదశీవ్రతమును దర్శించుటకై దేవ యక్ష కిన్నర గంధర్వాదు లెల్లరును విచ్చేసిరి. విష్ణుమూర్తి విధియుక్తముగ నేకాదశీవ్రతము నాచరించెను. కైలాసనాథు డాసమయమున చేతులుజోడించి "ఓ లక్ష్మీకాంతా! వ్రతఫలితమును నాకుగొంత యిమ్మని యడుగగా భగవంతు డాతనికి వ్రతఫలితమును ధారదత్తము జేయగా మహావిష్ణు హస్తమున స్వల్పము మిగిలియుండెను, ఏకాదశీవ్రత పూర్ణ ఫలితమును శంకరుడు పొందుటచే వైకుంఠమునం దేకాదశి స్మార్త వైష్ణవ పక్షములుగ నేర్పడి, పూర్ణతిధి శైవులును, మిగులు వైష్ణవులును వ్రతమాచరించు సాంప్రదాయ భేదము కలిగినది.

నారదుడు "వైకుంఠమున శ్రీమహావిష్ణు వేకాదశీ వ్రతము నాచరించుచున్నాడని" తెలిసికొని యచ్చటికేగి "ఓ హృషీకేశా! నీవే వ్రతమును జేయుచుంటివి?" అని యడుగగా భగవంతుడు నారదుని జూచి "ఓ నారదా! మా దేవత్వమును రక్షించిన యేకాదశీ వ్రతమును జేయుచుంటి"నని పలికెను. నారదుడు భగవంతుని చరణములకు వందనములజేసి "ఓ దేవాదిదేవా! ఈవ్రతము నాచరించు విధానమును దెలుపు"మని యడిగెను. అంత శ్రీమహావిష్ణువు "ఓ నారదా! దశమి వ్రతారంభదినము. ఆదినమున రాత్రి హరినామ సంకీర్తనజేసి యల్పాహారమును సేవింపవలయును. ఏకాదశి దినమున సూర్యోదయాత్పూర్వమే నిద్రనుండిలేచి దేహబాధల దీర్చికొని స్నానముజేసి తిలకమును ధరించి భగవత్పూజజేసి తులసి తీర్థమును స్వీకరించి నిరాహారముతో నుపవసించి యారాత్రియంతయు హరినామ సంకీర్తనతో జాగరణ జరు

పవలయును. అశక్తులైనచో నవధాన్య రహితములగు నితర ఫలహారము లను, ఫలములను భుజించి యఖండముగా హరినామస్మరణతో గాలము గడుపవలయును. ఏకాదశిదినమున పాపములన్నియు నన్నము నాశ్రయించియుండును. కాన ధాన్యాహారములు కుక్క మొదలగు నీచజంతువులు తినిన యెంగిలియాహారముతో సమమైయుండును. ద్వాదశి దినమున ప్రాతఃకాలమందు స్నానము జేసి భగవంతుని షోడశోపచార విధుల బూజించి శక్త్యనుసార మొక్క యతిథికైనను నన్నమిడి తాను భుజింపనలయును. ప్రీతిపూర్వకముగ నేకాదశి వ్రతమును విధియుక్తముగ నెవరాచరించెదరో వారల సర్వపాపములు నిర్మూలమగును. నేను లక్ష్మీసమేతుడనై గదా చక్రములను చేపట్టి వారల గృహద్వారమున రక్షకభటుడనై నిలుచబడి సర్వ సంకటములనుండి వారిని గాపాడెదను. ఓనారదా! పదునైదు దినములందు జేసిన పాపము లేకాదశివ్రతముచే దొలగి శుద్ధుడగుచుండును. అఖండముగ నేకాదశివ్రతమును విధియుక్తముగ జేసినచో సహస్ర యజ్ఞము లాచరించిన ఫలితము లభించును. కాన నారదా! నీవావ్రతము నాచరించి భూలోకమున నీవ్రత ప్రచారనుజేసి ప్రజలచే నాచరింప జేయుము" అని చెప్పెను

నారదుడు భగవదాజ్ఞానుసారముగ నేకాదశివ్రత మాచరించుచు భూలోకమున వ్రతప్రచారము జేసెను. మహాపాపములన్నియు శ్రీమన్నారాయణుని యొద్దకువచ్చి "ఓ దేవాదిదేవా! త్రిలోకములందెలరు నేకాదశివ్రతము నాచరించుటచే సర్వులు పుణ్యాత్ము లగుచున్నారు. మరి మేమెచ్చట వసింపవలయును తెలుపుడు" అని ప్రార్థించెను. భగవంతుడు హాసవదనుడై "మీరేకాదశి వ్రతదినమున నన్నము నాశ్రయించియుండుడు. అన్నభక్షణ జేసినవారిని విడువక వారలను యమపురమునకు బంపి రౌరవనరకమున బడవేయుడు" అని చెప్పెను.

శ్రీకృష్ణుడు ధర్మరాజుతో "ఓ ధర్మజా! ఏకాదశీవ్రత మీప్రకారముగ నారదులవలన భూలోకమున వ్యాపించి రుక్మాంగదాంబరీషాదులచే ననుష్ఠింపబడెను. ఈ వ్రతమును త్రిమూర్తులును ముప్పదిమూడు

కోట్ల దేవతలును, నారదాది ఋషీశ్వరులు ననుష్ఠించిరి. కాన మీరు విధియుక్తముగ నీవ్రతము నాచరించితిరేని స్వగోత్రజ హనన పాపము పోవు"నని చెప్పెను.

శ్రీకృష్ణభగవానుని యాజ్ఞానుసారముగ పాండవు లేకాదశి వ్రతము నాచరించి స్వగోత్రజ హత్యాపాపమునుండి విముక్తులైరి. ఈ ఏకాదశిచరిత్రను శ్రవణము జేసినవారల కిహలోకమున సకలైశ్వర్యములును గలిగి పరలోకమున భగవత్సాయుజ్యము లభించును.

ఎనుబది తొమ్మిదవ అధ్యాయము సంపూర్ణము.

---

'ఏకాదశి వ్రతమాహాత్మ్యము' అను ప్రత్యేక గ్రంథము కలదు. అందు సంవత్సరమునకువచ్చు యిరువది నాలుగు ఏకాదశులకు ప్రత్యేక చరిత్రలు గలవు. ఆగ్రంథము తెలుగుభాషలో ప్రకటింప బడియున్నది.

# భక్తనరసింహచరిత్ర

—♦ తొంబదియవ అధ్యాయము ♦—

ఆంధ్రదేశమున విశాఖపట్టణ మండలమున నుత్తరావెల్లియను గ్రామముగలదు. అచ్చట విశ్వకర్మ కులోద్భవుడును, శైవమతస్థుడును సువర్ణ ఋషిగోత్రజుడునగు గంగాధరమను గృహస్థుడుండెను. ఆతని ధర్మపత్ని రామమ్మ సంతతిలేదను చింతచే బరమేశ్వరు నారాధింప నీశ్వరానుగ్రహమున నామె గర్భవతియై విరోధినామసంవత్సర చైత్ర శుద్ధ చవితి గురువారము రోజున (4-4-1889) రాత్రి మూడున్నర గంటలకు రోహిణీ నక్షత్రయుక్త కుంభలగ్నమునందు సుపుత్రుని గనెను ఆబాలకునికి 'నరసింహ'మని నామకరణముజేసి గారాబముతో బెంచుచుండిరి. ఆతడు దినదిన ప్రవర్థమానుడగుచు బూర్వజన్మ సుకృత విశేషముచే పరమార్థాసక్తుడై దైవభక్తిగలిగి పురాణ శ్రవణముజేయుచు కాలము గడపుచుండెను. సప్తమవర్షమున జననీజనకులు విద్యాభ్యాసమును జేయించిరి. ఆతడు విద్యనభ్యసించుచు తన సహచరులగు బాలకులతో నాటలాడు సమయములందిటుక రాతిముక్కలతో జిన్నచిన్న మందిరముల నిర్మించుచు దన భక్తిభావమును దోటిబాలురకు విశదపరచుచుండెను. ఆతనికి తొమ్మిదవ సంవత్సరమున మాతృవియోగము సంభవించుటచే జనకుడు గంగమ్మయను కన్యకను మరల వివాహము జేసికొనెను.

నరసింహము పండ్రెండవ సంవత్సరమున సూరమ్మయను కన్యకను వివాహముచేసికొనెను. ఆతనికి బాల్యమునుండియే కుటుంబ పోషణ భారము పైబడుటచే కష్టపడి ధనమునార్జించి కుటుంబపోషణము జరుపుచుండెను. ఆతనికి బాల్యమునుండియే శివనామమునందమిత ప్రేమ యుండుటచే, భక్తితో శంకరునారాధించుచు, శివనామమును లిఖించుచుండెను. ఆ సమయమున శివాలయము నొకదానిని నిర్మించవలెనను సంకల్ప మాతనికి గలిగెను.

ఇట్లు కొంతకాలము జరిగిన పిదప స్వస్థానమును విడిచి బొబ్బిలి నగరములో బ్రవేశించి యచ్చటనే వసించుచు శరీరకష్టముజేసి తనన్నాల

ముగ వచ్చు ద్రవ్యముతో నతిథ్యభ్యాగతుల నాదరించుచు కుటుంబ పోషణను జేయుచుండెను. ఆతనికి పదునెనిమిదవ సంవత్సరమున శరీరమున నొక వ్యాధి సంప్రాప్తింప శ్రీ వెంకటేశ్వరస్వామికి ముడుపులు కట్టెరి. ఈశ్వరానుగ్రహమున నరసింహ మారోగ్యవంతుడై సకుటుంబముగ దిరుపతియాత్రకై బయలుదేరి మార్గమధ్యముననున్న ముఖ్య బంధువుల జూచుటకై చిలకలపూడి గ్రామమున బ్రవేశించెను. ఆ సమయమున నచట నగల వ్యాపారము విశేషముగ జరుగుచుండుటచే, నరసింహము తిరుపతియాత్రను మరచి ధనార్జనాసక్తుండై యచట వ్యాపారము జేయుచు కాలముగడుపుచుండెను. పిమ్మట నాతనికి రామబ్రహ్మము, సత్యనారాయణ, వెంకటరత్నము అను ముగ్గురు పుత్రులు కలిగిరి.

నరసింహము సకుటుంబముగ తిరుపతి యాత్రకై బయలుదేరి మార్గమున కందిమల్లయపల్లెలో శ్రీ పోతులూరి వీరబ్రహ్మేంద్ర స్వాములవారి మఠమును దర్శించి యచటనుండి తిరుపతికేగి శ్రీ వేంకటేశ్వర భగవానుని సేవించి మొక్కును దీర్చుకొని, యచ్చటనుండి కాళహస్తి మొదలగు పుణ్యక్షేత్రములను సేవించి చిలకలపూడి జేరిరి.

నరసింహము ప్రతిదినమును గీతాభాగవతాది సద్గ్రంథములను బఠించుచు క్రీ. శ. 28–11–1916 వ సంవత్సరమున నొక స్థలమును గొని యందు గృహనిర్మాణముగావించి గృహప్రవేశసమయమున బీదల కన్నదానము జేయించెను. ఆ సమయమున నన్నదానమునకై యేర్పరచిన వస్తుసామగ్రులు నిలువయుండుటచే వేరొక పర్యాయము సమారాధన జేయ సంకల్పించెను. నరసింహము జేయు వ్యాపారము దినదినాభివృద్ధిగాంచుచుండెను. ఈ వ్యాపారమునందాతనికమితలాభము గలుగుచుండెను. ఆతడాదాయమును ధర్మకార్యముల కుపయోగించుటకు సంకల్పింప జనకు డంగీకరింపనందున, జనకునకును, నాతని ద్వితీయ భార్యకు గలిగిన పుత్రునకును భాగమును బంచియిచ్చెను. నరసింహ మప్పటినుండియు ధర్మకార్యములను జేయుచు 3–4–1915 వ, సంవత్స

రమున తన గృహమున కుత్తరదిశయందున్న స్థలమును గొని యందొక మఠమును గట్టింప సంకల్పించెను.

నరసింహాము భక్తవిజయాది సద్గ్రంథపఠనముచే శ్రీ పాండురంగదేవునియం దమితభక్తిగలిగి మహాపర్వదినమగు కార్తీక శుద్ధ పూర్ణిమ దినమున సమారాధన జేయదలచి, యాకార్యము నిర్విఘ్నముగ జరుపవలసినదని శ్రీ పంఢరీనాధునకు ప్రార్థనాపూర్వకమగు శ్రీ ముఖమును వ్రాసిపంపెను. కార్తీకశుద్ధ చతుర్దశి రోజున, నుత్సవము ప్రారంభించి యధావిధి పూజలజేయించి, ఆదినమంతయు హరినామసంకీర్తన జేయుచు, కాలమును గడపి మరునాడగు పూర్ణిమనాడు విప్రులకు దక్షిణాతాంబూలాదులను విరివిగ నర్పించి యష్టాదశవర్ణముల వారికిని వంటలు తయారుజేయించెను. నరసింహ మానాడు తన్మయుడై యుండి "జయ జయ విఠ్ఠల" అని నామగర్జన జేయుచు నానందముతో నృత్యముజేసి భూమిపైబడి "పాండురంగా! తాము దర్శన మిచ్చు వరకు లేవ"నని దీక్షనుబూనెను. త్రివిధజనులు నానావిధముల బలుకసాగిరి. కొంతసేపటికచ్చట గూడిన జనులలో నొకరి కావేశమై "వచ్చితి లెమ్మ"ని నరసింహాము చేయినిబట్టుకొని లేవదీసెను. పిదప భగవంతునకు నైవేద్యముజెల్లించి యష్టాదశ వర్ణములవారికిని భోజనములు వడ్డింపబడెను. ఆ దినమున సముద్రస్నాన పర్వదినమగుటచే సముద్రస్నానము జేసి వచ్చు సాధువులును, బిచ్చగాండ్రు నితరప్రజలును నపారముగా రాసాగిరి. రాత్రి యెనిమిదిగంటలవరకు వచ్చినవారి కేకొదువయు లేక భోజనములు జరుగుచుండెను.

ఆదినమున పూజామందిర సమీపమున నిరువది సంవత్సరముల ప్రాయముగల నొకసాధువు తృప్తిగ భుజించి యొక పాత్రనిండ నెయ్యిని బోయించుకొని దానినిత్రాగి విస్తరితో నంతర్థానమయ్యెను. ఆదినము సమారాధన మిగులవైభవముగ జరిగినదని గ్రామ ప్రజలెల్లరు బరిపరి విధముల గొనియాడుచుండిరి. అప్పటినుండియు నాగ్రామమున గొందఱు జనులు పరమార్థాసక్తులైరి. ఇట్లు కొంతకాలము జరిగినపిదప నొకనాటి

రాత్రి నరసింహము నిద్రించుచుండ ధర్మదేవత స్వప్నమున సాక్షాత్క-రించి "కీరపంఢరీక్షేత్ర నిర్మాణమును శ్రీవిఠ్ఠలనాధుని సగుణ సాక్షాత్కార దర్శనము నిచ్చుట జరుగు"నని చెప్పి యంతర్ధాన మాయెను. నరసింహము నిద్రనుండి మేల్కాంచి స్వప్నవృత్తాంతమును మననము చేసికొని "అన్నదానముతో సమమగుదానము వేరొకటిలేదు. అన్నదాన ఫలితముచే ధర్మదేవతా సాక్షాత్కార దర్శనము గలిగిన"దని యన్నదానమునందు శ్రద్ధవహించెను. కీరపంఢరీక్షేత్ర నిర్మాణమునకై ప్రభుత్వస్థలమునందు రెండెకరములు కావలయునని జిల్లాయధికారులకు నరసింహ దర్ఖాస్తుని దాఖలుచేసెను. జిల్లా అధికారుల కార్యాలయముల స్థలము నీయుటకు నిరాకరించిరి.

నరసింహమునకు దీర్ఘయాత్రాకుతూహలము కలిగి యొక శుభ దినమున బయలుదేరి పరమ పావనమగు కాశీక్షేత్రమునుజేరి, గంగా నదీస్నానము జేసి, శ్రీ విశ్వనాధస్వామిని అన్నపూర్ణా విశాలాక్షిని దర్శనము జేసికొని, మరునాడుదయమున కేదారేశ్వర ఘట్టమున కేదారేశ్వరుని సేవించి యానందాశ్రుధారలు విడచుచు, గద్గదస్వరముతో దేహభ్రాంతి విరహితుడై 'గోపాల కృష్ణ, రాధాకృష్ణ' యను నామములను భజించుచు నానంద నృత్యము చేసెను. ఆ సమయమున నొక సాధువు పరుగున వచ్చి యాతనిచేతిని బుచ్చుకొనగా నిరువురును గలిసి, నృత్యము చేసిరి. అచటగల జనులెల్లరును గరతాళములను వేయుచు, భగవన్నామమును భజించుచు నానందపరవశులైరి. ఆ సాధువు తత్క్షణమే యంతర్ధానమయ్యెను. నరసింహ మచ్చట పది దినములుండి బీదలకును, సాధులకును, దానధర్మములను జేసి గయ, ప్రయాగ, అయోధ్య, జగన్నాధము మొదలగు పుణ్యక్షేత్రములను దర్శించి యచ్చటనుండి పంఢరీక్షేత్రమునకు బోయి శ్రీ పాండురంగదేవుని దర్శింపవలయునని సంకల్పింపగా నాతని జనకుడంగీకరింపనందున నచ్చటనుండి స్వస్థానమునకు జేరెను.

ఒకదినమున రాత్రి నరసింహము నిద్రించుచుండ నాతడు స్వప్న ములో శ్రీ పంఢరీక్షేత్రమునకుబోయి దేవాలయమున బ్రవేశించు వరకు జగజ్జననియగు శ్రీ రుక్మిణీదేవి దర్శనమిచ్చెను. ఆమెనుసేవించి యచటనుండి శ్రీవిఠలనాథుని దర్శించుటకై ముందున కేగుచుండ నచట నగాధమగు నొకభావియుండెను. ఆభావిని దాటిపోయినవారికి దైవ దర్శనమగును. ధన, సతీ, సుత, భ్రాంతులు గలవారాభావిని దాటజాల రని యచ్చట నర్చకులు చెప్పిరి. ఆ భావినిదాటి భగవంతుని దర్శింప వలెనని నరసింహము ముందున కేగుచుండ కృపాసింధువగు శ్రీ పంఢరీ నాథుడు తన చరణములను నరసింహము శిరమునం దలంకరింప నాతడు చేతులుజోడించి "హే లక్ష్మీపతీ, భక్తవత్సలా! ఆకాశము విరిగి పడినను సూర్యచంద్రులు గతులు తప్పినను, నీనామస్మరణ నఖండముగ జేయు టకు వలయుప్రేమ నాకనుగ్రహింపు"మని ప్రార్థించెను. పిదప నిద్రా భంగ మైనందున స్వప్నవృత్తాంతమును మననము జేసికొని యానం దించెను.

ఇట్లుకొంతికాలము జరిగిన పిదప నా గ్రామమున గ్రామదేవత జాతరజేసి జంతుబలులిచ్చుటకు గ్రామస్థులు గొందరు ప్రయత్నించుచుం డిరి. నరసింహము విషయము నెరిగి వారల బిలిపించి జంతుబలి మహా పాపమనియు, గ్రామదేవతకు నారికేళముల నర్పింపుడనియు, నహింసా విషయములబోధించెను. పరంపరగవచ్చుచున్న జంతుబలిజేయక తప్ప దని వారుచెప్పిరి. జాతర స్థలము నరసింహము గృహమునకు సమీప మునందుండుటచే జాతర దినమున నాతడాదృశ్యమును జూడజాలక శివ గంగ దేవాలయమునకుబోయి యా దినమంతయు నచటగడపి భగవం తుని మనముననిలిపి "ఓ దేవా! నీవెప్పటికైనను ధర్మస్థాపనకై హిందూ సార్వభౌముడవుగ నవతరించి యహింసను నెలకొల్పి జగమున శాంతిని సమకూర్చుమని ప్రార్థించి యారాత్రి తిరిగి గృహమునజేరి నిద్రించు చుండెను. నరసింహము స్వప్నమున పంఢరీపురిమునకుబోయి దేవా లయమున బ్రవేశించి శ్రీవిఠ్ఠలనాథు నాలింగనము జేసికొనుటకు

ముందున కేగ యర్చకులు కోపోద్దీపిత మానసులై "దేవుని స్పృశింప రాదని చెప్పిరి. అంతట నరసింహము "అయ్యలారా! శ్రీవిఠ్ఠలనాథు నాలింగన వందనాదులచే బూజింపవచ్చునని భక్తవిజయగ్రంథమున దెలుపబడియున్నది. నేనెంతయో దూరమునుండి మిగుల యాశతో వచ్చితిని. దయచేసి పోనిండు" అని ప్రార్థించెను. వారలు వెలుపలకు బొమ్మని కసరుకొనిరి. ఆసమయమున శ్రీపంఢరీనాథుడు నృత్యము జేయుచువచ్చి యాతని నాలింగనము జేసికొనెను. అర్చకులీ కౌతుక మునుజూచి యమితాశ్చర్యము నొంది "తామరపువ్వు సమీపమున నుండు మండూక మందలి మకరందము నాస్వాదించి యెరుగనటుల మనము నిరంతరము సాన్నిధ్యమున సర్వోపచారములు భగవంతునకు జేయుచు నాతనికృపకు పాత్రులము గాకుంటిమి. మనకు కర్మనిష్ఠతప్ప భక్తినిష్ఠ లేదు. భాగవతాపచారమును భగవంతుడు సహింపజాల" డని చెప్పి నరసింహమును క్షమార్పణ కోరిరి. ఇంతలో నిద్రాభంగ మైనందున స్వప్నవృత్తాంతమును మననము జేసికొని యమితానందము నొందెను.

ఇట్లు కొంతకాలము జరిగినపిదప "అక్షయ" నామ సంవత్సర ఆశ్వయుజ బహుళ సప్తమీ బుధవారమున నరసింహము బంధుమిత్రులతోను, జనకునితోను, గలిసి హరినామ సంకీర్తన జేయుచు పంఢరీపురము జేరి, చంద్రభాగానదిలో స్నానము జేసి, పుండలీకుని దర్శించి, నగర ప్రదక్షిణంబొనర్చి మహాద్వారమున సాష్టాంగ నమస్కారమును జేసి, యచటనుండి గర్భాలయము జేరి, సింహాసనముపై సమచరణములతో కటిన్యస్తహస్తుడై నిలువబడి, రత్నఖచిత కనక కిరీటమును, ప్రకాశమానములగు మకరకుండలములు, కంఠమున కౌస్తుభమణిని, గళమున కోమల తులసీమిశ్రిత పుష్పహారములను, నమూల్యపీతాంబరములను ధరించి శ్యామలవర్ణుడై యున్న శ్రీ విఠ్ఠలనాథు నాలింగనవందనాదులచే దర్శించి "ఓ రుక్మిణీపతీ! నీ చరణముల దర్శించుటచే నా జన్మము సార్థకమాయెను. నీవనాథనాథుడవు, భక్తులకొరకెన్నియో లీలావైభ

వములను జూపుచు, వారలను సర్వవిధముల రక్షించుచుందువు. నీ మహిమవిశేషములను వర్ణించుటకు వేదశాస్త్రపురాణములకు, నాదిశేషునకును, బ్రహ్మకును, రమాదేవికిని, దేవ యక్ష, కిన్నర, గంధర్వాదులకును సాధ్యము కాదు. నా జీవితమంతయు సత్సాంగత్యముతో సార్థకముగ జరుగు నట్లనుగ్రహింపు"మని ప్రార్థించి, చాతుర్మాస్యభజనలానాయంత్రము సభామంటపమున జరుగుచుండ నచ్చటకుబోయి సద్గురు లక్షణములతో గూడియున్న (శ్రీ) మహీపతి మహారాజ్ శిష్యమండలితో "చక్రీభజన" జేయుచుండుట జూచెను.

నరసింహమా సద్గురుమూర్తినిజూచిన మాత్రముననే యానందాశ్రుధారలను విడచుచు గద్గదస్వరముతో గేకలువైచుచు పరవశుడాయెను. సద్గురు వాతనిని జూచి, భజనముగిసిన పిదప దన మఠమునకు రమ్మని జెప్పగా వారలవెంట మఠమునకు బోయి సాష్టాంగనమస్కారము జేసి బద్ధాంజలియై నిలువబడెను. మహీపతిమహారాజాతని చరిత్రనంతయు దెలిసికొని "(శ్రీ) విఠలనాథు నుపాసించువారు తులసిమాలాధారణయు, నేకాదశీవ్రతమును, సంవత్సరమున కొకసారి నిష్ఠతో పంఢరీపురయాత్ర జేయుటయు నావశ్యకము కాన నీ వేకాదశీవ్రతము ననుష్ఠించుచు, (శ్రీ) విఠలనామజపము నఖండముగ జేయుచుండు" మని చెప్పి, "తులసీమాలాధారణ జేయించి నీవు మరల యాత్రకు వచ్చినప్పుడు మహామంత్రము నుపదేశించెద"నని చెప్పెను.

నరసింహము కీరపంఢరీక్షేత్ర నిర్మాణము జేయ తినకు సంకల్పము కలదని గురువులకు దెలుప వారు భగవంతునకు ప్రియభక్తులగు జ్ఞానదేవ తుకారామ్‌లపేర నొకమఠమును గట్టించి వారల నామముల జపించితి వేని నీయిచ్ఛాపూర్తియగునని యాశీర్వదించిరి. నరసింహ మచ్చట కొలది దినములుండి యా క్షేత్రమునగల బ్రాహ్మణులకు, బీదలకు, దక్షిణ సహితాన్నదానము జేసి యాక్షేత్రమునగల మహాభక్తుల మఠములను దర్శించి రాధా, రుక్మిణీ, సత్యభామలయొద్దను, (శ్రీ)విఠలనాథుని యొద్ద నాజ్ఞదీసికొని, సద్గురునాథునివలన నాశీర్వచనమునుబొంది

యచ్చటనుండి స్వస్థానమును జేరి 6-3-1927 నుండి శ్రీవిఠ్ఠలకోటి వ్రాయుచు 17-8-1927 వ తేదీని శ్రీజ్ఞానదేవ, తుకారామ్ మఠ మును గట్టించెను. అప్పటినుండి యామఠమున భజనలు వైభవముగ జరుగుచుండెను. 18-7-1928 తేదీ నొకస్థలమునుగొని యందొక ధర్మ శాలను నిర్మించి దానికి "పుండలీక ధర్మశాల" అను పేరుబెట్టి అన్న దానము జేసెను. విభవ నామసంవత్సరమున మరల పంఢరీపురమునకు బోయి చంద్రభాగానదిలో స్నానముజేసి పుండలీకుని సేవించి క్షేత్ర ప్రదక్షిణంబొనర్చి, మహాద్వారమున సాష్టాంగ నమస్కారం బొనర్చి దేవాలయమున బ్రవేశించి, శ్రీవిఠ్ఠలనాథుని షోడశోపచారవిధుల బూజించి, యాలింగన వందనాదులు జేసికొని, యమితానందము నొం దెను.

నరసింహాము సద్గురు మఠముజేరి గురుదేవునకు వందనము లర్పించి "తమ యాజ్ఞానుసారముగా వచ్చితిని. తారక మంత్రోప దేశముజేసి నన్ను గృతార్థునిగా జేయు" డని ప్రార్థించెను. మహీపతి మహారాజాతని యిచ్ఛానుసారముగా శ్రీవిఠ్ఠల మహామంత్రరాజము నుపదేసించి, తదనుష్ఠాన క్రమముల విశదముజేసి, యాతనికి భక్తనర సింహామని నామకరణముజేసి యాశీర్వదించెను. ఒకనాడు భక్తనరసిం హాము గురుదేవులకు సాష్టాంగ నమస్కారముజేసి "ఓ గురుదేవా శ్రీజ్ఞానేశ్వరులు రచియించిన జ్ఞానేశ్వరియును, ఏకనాథ్ విరచితమగు భాగవతమును వినవలెనని కోరికగలదు. దయతో వినిపింపు" డని ప్రార్థింప గురుదేవుడా గ్రంథములలోని ముఖ్యాంశములను జదివి వినిపించెను. నరసింహామచ్చట నాషాఢైకాదశీ బ్రహ్మోత్సవమును సేవించి ద్వాదశి దినమున బ్రాహ్మణులకును బీదలకు నన్నదానముజేసి కొలది దినము లచట వసించి గురుదేవుల యాజ్ఞనొంది స్వస్థానమును జేరెను.

భక్తనరసింహాము సద్గుర్వాజ్ఞానుసారముగ నేకాదశీ వ్రతము నియమముతో నాచరించుచు ద్వాదశిదినమున బీదలకన్నదానము జేయు చుండెను. భక్తనరసింహాము కీరపంఢరీ క్షేత్ర నిర్మాణమునకై తన గృహ

మునకు తూర్పుభాగమున నున్న స్థలమునందొక తటాకమును ద్రవ్వించి శుక్లనామసంవత్సర ఆశ్వీజశుద్ధ విదియరోజున పంఢరీపురమునకుబోయి తమ సద్గురు సన్నిధికేగి శ్రీపంఢరీక్షేత్ర నిర్మాణము జేయుట కాశీర్వ దింపుడని ప్రార్థించెను. అంత సద్గురునాథుడు రేపటిదినమున శ్రీవిఠల నాథుని సన్నిధి నాశీర్వదింతునని చెప్పెను. భక్తనరసింహాము క్షేత్రశం కుస్థాపనకై నదిలోని గులకరాళ్ళను దీసికొనవలయునని తలచి చంద్ర భాగానదీతీరమునకు బోయిచూడగా నదీప్రవాహ మధికముగనుండుటచే నచట నావికులతో కొన్ని గులకరాళ్ళను దీయుడని చెప్పెను. వారలెంతె ప్రయత్నించినను సాధ్యముకాక విఫలులై యొడ్డునుచేరిరి భక్తనరసిం హాము చేతులుజోడించి చంద్రభాగ ననేకవిధముల స్తుతించెను. కొంత సేపటికి ప్రవాహముతగ్గి పుండలీక దేవాలయమునొద్ద నొక యిసుకదిబ్బ బయల్వెడలెను. భక్తనరసింహాము తత్క్షణమే పడవనెక్కి యాయిసుక దిబ్బనొద్దకుబోయి యిసుకను, గులకరాళ్ళను, దీయుచుండగా, స్పర్శ వేదివలెనుండు నొక చిన్నగుండురాయి యుందుండెను. దాని మాహా త్మ్యమును వర్ణింప నెవరికిని సాధ్యముకాదు. దానిని జూచునప్పుడెల్ల నాతడు తన్మయత్వము నొందుచుండెను. ఆయిసుకలో రత్నములవలె ప్రకాశించు మరికొన్ని రాళ్ళనేరి మనువాడు గురుదేవుల కిచ్చెను. గురు శిష్యులిరువురును శ్రీవిఠలనామ స్మరణజేయుచు దేవాలయమున ప్రవే శించిరి.

మహీపతి మహారాజ్ శ్రీవిఠలనాథుని చరణారవిందములపై శిష్యుడు తనచేతికిచ్చిన గుళకరాళ్ళనుంచెను. గురుశిష్యు లిరువురును ప్రార్థించుచు తన్మయులై యుండిరి. శ్రీ పంఢరీనాథుడు ప్రసన్నవదన ముతో దర్శనమిచ్చి తన పాదములపైనుంచిన రాళ్ళలో స్పర్శవేదివలె నుండు గుండురాతితో దనలీలను ప్రవేశింప జేసెను. వెంటనే సద్గురు నాథు డాశ్చర్యచకితుడై దానిని శిష్యునిచేతి కిచ్చి "నీ సంకల్ప మతి శీఘ్రముగ నెరవేరునని యాశీర్వదించెను. నాటిరాత్రి భక్తనరసింహాము స్వప్నమున శ్రీవిఠలనాథుడు సాక్షాత్కరించి రహస్యత్రయమును దెలిపి



శ్రీ హరిభక్తపరాయణు,
మహీపతి గుండా మహారాజ్‌గారు.
( భక్త నరసింహంగారి సద్గురువు )

కీరపంఢరీక్షేత్రమున కార్తీక శుద్ధయికాదశి బుధవారమునాడు పగలు నేను ప్రకటన కాగలనని చెప్పి యంతర్ధానమయ్యెను. భక్తనరసింహము స్వప్నవృత్తాంతమున కానందించి గురుదేవుల యొద్దను, భగవంతుని యొద్ద నాజ్ఞగైకొని స్వగ్రామమును జేరెను.

భక్తనరసింహము శుక్లనామసంవత్సర ఆశ్వీయుజ శుద్ధ దశమి దినమున స్నానానుష్ఠానములగావించుకొని ప్రహ్లాదాది మహాభక్తులను, భక్తవిజయావతారభక్తులను, గరుడ విష్వక్సేనాది నిత్యసూరులను, సనకాది జీవన్ముక్తులను, బ్రహ్మరుద్రేంద్రాది దేవతలను, వ్యాసాది మునులను, చిత్రరథాది గంధర్వులను, కపిలాది సిద్ధులను, గంగా యమునాది పుణ్యనదులను, గోబ్రాహ్మణులను, సావిత్ర్యనసూయాది మహాపతివ్రతలను, ప్రేమస్వరూపులగు గోపికలను, పిపీలికాది బ్రహ్మపర్యంతముగల జీవాత్మల నాహ్వానముజేసి, సువర్ణ (శ్రీ) విఠలపీఠమును భక్తిభావమున బ్రతిష్ఠించి, దానిచుట్టును నూటయిరువదైదు భక్తుల స్వర్ణ ప్రతిమలను స్థాపించి, సువర్ణపీఠముపైన చంద్రభాగలో దొరికిన స్వర్ణ వేదివలె నుండు గుండురాతిని స్థాపించి, దేవతలపేరులతోను, భక్తుల పేరులతోను నొక్కొక్కరాతిని చుట్టును బ్రతిష్ఠించి. చంద్రభాగాతీర్థమునను, క్షీరముతో నభిషేకముజేసి కీరపంఢరీక్షేత్రమునకు శంకుస్థాపనజేసి ధ్వజమును బ్రతిష్ఠించి (శ్రీ) జ్ఞానదేవ తుకారామ్ దశలక్ష కైంకర్యమును జరుప సంకల్పించెను. మిగిలిన చంద్రభాగాతీర్థము, నిసుకను కోనేటిలో కలిపి "లోకపావనీ, చంద్రభాగా! నీలో గ్రుంకులిడు వారి పాపములను బారద్రోలి (శ్రీ) పంఢరీనాధుని కృపకు పాత్రులగు నటుల జేయుమని ప్రార్థించెను.

భక్తనరసింహము దేవాలయపుపనుల సద్గురునాజ్ఞానుసారము జేయించెను. పంఢరీపురమున నొకనాటిరాత్రి మహీపతిమహారాజ్ నిద్రించుచుండ స్వప్నమున (శ్రీ) విఠలనాథుడు జ్ఞానేశ్వర తుకారామ్ భక్తులతో సాక్షాత్కరించి 'కార్తీక శుద్ధయికాదశి బుధవారమునాడు పగలు కీరపంఢరీక్షేత్రములో సాక్షాత్కరింతు" నని చెప్పి యంతర్ధాన

మయ్యెను. గురుదేవుడు స్వప్నవృత్తాంతమును విపులముగ భక్తనర సింహామునకు (శ్రీ)ముఖమును వ్రాసి పంపెను. ఆతడు దానినిజదువుకొని బ్రహ్మానందమానసుడై యుండ నా(శ్రీ)ముఖమును కొందరుద్యోగులును, పెద్దలును జూచి (శ్రీ) విఠలనాథుని మందిరమునకు కార్తీక శుద్ధవిదియ దినమున బీగము వేసి సీలుచేసిరి. ఈవిషయము పరిసరప్రాంతములందు వ్యాపించి కౌతుకమును జూచుటకై యసంఖ్యాకులై జనులు వచ్చుచుండిరి.

కార్తీక శుద్ధయికాదశిరోజున (శ్రీ) విఠలనాథుడు కీర్పంఢరీక్షేత్ర మున ప్రకటనయగునని దర్శించుటకై లక్షలజనులు విచ్చేసిరి. మందిరముచుట్టును రక్షకభటులు కాపుండిరి. భక్తనరసింహాము తటాకములో స్నానముజేసి మందిరమునకు ప్రదక్షిణజేసి భగవంతుని హృదయమున నిలిపికొని "ఓ సకలజగద్రక్షకా! సల్లక్షణుడవైన నీవే పుణ్యప్రభావమున సన్నిమిత్తముగా నీదీనునకు దర్శనమొసగదలచితివో యెరుగజాలకున్నాను. భవదీయ దర్శనలాభముచే నీదాసుల కృతార్థుల జేయువే" యని ప్రార్థించెను. చూడవచ్చిన జనులెల్ల రఖండముగ హారినామ సంకీర్తన జేయుచుండిరి. ఉదయము తొమ్మిదిగంటల సమయమున భక్త నరసింహాము మనోవికలతనొంది, హనుమాన్ మందిరమున ప్రవేశించి ప్రదక్షిణ సాష్టాంగనమస్కారములను జేసి తన్మయుడైయుండ, హనుమంతు డాతనికి దర్శనమిచ్చి "అపరాహ్ణసమయములోగా (శ్రీ) విఠలనాథుని దర్శనమగును. అట్లుగానిచో పంఢరీక్షేత్రమును బెల్లగించి యిచ్చట స్థాపింతు" నని జెప్పి యంతర్ధానమయ్యెను.

భక్తనరసింహాము (శ్రీ) విఠలనాథుని మందిరముజెంత నిలువబడి యెంతయో ప్రార్థించుచుండెను. కాలహారణమగుటచే ధైర్యము నిలుప లేక పంఢరీక్షేత్రమున (శ్రీ) విఠలుడు స్వప్నమందు దెలిపిన రహస్య త్రయము వ్యర్థమగునట్లున్నది. ధర్మదేవతవాక్యము లసత్యములగుచున్నట్లున్నవి. ఇక జీవములో నుండుటవలన సార్థకము లేదు. "ఓపాండురంగా! నేను (శ్రీ) జ్ఞానేశ్వర తుకారామ్ భక్తులను దర్శించి వచ్చు

నంతలో దర్శనముగానిచో నీద్వారమున నాశిరమును బగులగొట్టి ప్రాణములు మీకర్పింతు" నని దీక్షవహించి శ్రీ జ్ఞానదేవ తుకారామ్ మఠమునకేగి వారి యవతారమహిమలను గొనియాడి సాష్టాంగనమస్కారముజేసి తన్మయత్వమునొందియుండ నామహాభక్తులు సాక్షాత్కరించి "క్షణకాలములో శ్రీ విఠలనాథుని కీరపంఢరీక్షేత్ర భక్తరాజ్యాభిషిక్తునిగా జేసెద" మని చెప్పిరి. జ్ఞానేశ్వరమహారాజ్ ధ్యానధారణ యందుండెను. శ్రీ తుకారామ్ భజనజేయుచుండెను. వారల గానము శ్రీవిఠలనాథు నాహ్వానించెను. తత్ క్షణమే శ్రీ విఠలనాథుడు సాక్షాత్కరించినటుల భక్తనరసింహము తన్మయమున గని యచ్చటనుండి శ్రీ విఠ్ఠలనాథుని మందిరమును చేరెను. దేవాలయపు ద్వారము లెంతట దెరువబడునాయని లక్షలజనులు మేఘములనాశించు చకోరములవలె నిరీక్షించుచుండిరి. హరినామసంకీర్తన బ్రహ్మానందముగ జరుగుచుండెను. భక్తనరసింహ మాసమయమున భక్త్యావేశముతో దంబురయును, చిరుతలును తీసి ని మందిరద్వారమునొద్ద నిలిచి యీవిధముగ శ్రీ విఠ్ఠలనాథుని ప్రార్థింపసాగెను.

"జయజయ కరుణాసాగరా, ఆనందఘనా, భక్తవత్సలా, రాజీవనయనా, విధిజనకా, దానవభంజనా, జగజ్జీవనా, జగదీశ్వరా, విశ్వవ్యాపకా, కమలాపతీ, సజ్జనజీవనా, సగుణనిర్గుణా. విశ్వపతే, విశ్వబాహు, అపరిమితా, విశ్వచక్షో. విశ్వపాదా, నిగమవినుతా, చిత్స్వరూపా, ఆత్మారామా, గుణనిధానా, ఉత్తమోత్తమా, స్వానంద ప్రకాశా, పురుషోత్తమా! నీమహామహిమ యనుపమైనది. వేదములు మనుష్యానందము మొదలాత్మానందమువరకు నీ మహిమవిశేషమును వర్ణించుటకు ప్రయత్నించి సాధ్యముగాక నేతినేతివాక్యములను బలికినవి. శాస్త్రపురాణాదులు లజ్జనొందినవి తపస్తీర్థానుష్టానముల జేసిన వారికిని నీప్రాప్తి యలభ్యమగును. నీవు నిజభక్తుల ప్రేమకు వశవర్తివై వారల మనోభీష్టములను దీర్చెదవు. సాధకులు వజ్రాసనమునందు గూర్చుండ వారల ధ్యానమునందు నీవు గోచరింపక భక్తికిమాత్రమే వశవర్తివయ్యెదవు. సర్వదేవతలలో నీవు మకుటమణివి. సనకాదులచే

పూజనీయుడవు. నీవు భావుకభక్తుల గృహమున నానావిధముల సేవ జేసెదవు. ఓ పంఢరీనాథా! నీవు భక్తులకు సేవజేయు విషయమున మానావమానములను, దేవత్వమును త్యజించెదవు. భక్తులు నిన్నెప్పుడును కష్టపెట్టరు. వైరాగ్యబలముచే సర్వకాలములందు నిన్ను జింతింతురు. ఓ అనాథనాథా! రుక్మిణీపతీ! బ్రహ్మాదులకు దుర్లభమగు నీచరణారవిందములు, ప్రపంచభ్రాంతిని విడచి నిన్ను సేవించు భక్తులకు లభించుచున్నవి. నీవు కలియుగమునందు బౌద్ధావతారుడవై యుండియు శాస్త్రవచనముల నుల్లంఘించి భక్తులయభీష్టము ననుసరించి వారలకు సగుణరూపముతో దర్శనమిచ్చుచున్నావు. నాదీనావస్థనుజూచి ప్రేమామృతమును వర్షింపించి కాలవిలంబన జేయక దర్శనభాగ్యమొసంగుము."

అని స్తుతించుచు తన హృదయకమలమధ్యమున దివ్యతేజోమయ రూపముతో సాక్షాత్కరించి దర్శనం బిచ్చుచున్న శ్రీ విఠలనాథుని కన్నుల కరువుదీర దర్శించెను. తత్కాలమందొక ధ్వని వినబడెను. దేవాలయపుదలుపులు దెరచుటకై నీళ్లాడగొట్టి గొళ్ళెమును దీయుటకు ప్రయత్నించి యచటగల జనులు విఫలులైరి. శ్రీ విఠలనాథు డాసమయమున దివ్యమంగళవిగ్రహస్వరూపుడై శ్రీ జ్ఞానేశ్వర తుకారామ్ భక్తులచే సింహాసనముపై ప్రతిష్ఠింపబడి, కీ పంఢరీక్షేత్రమునకు భక్తరాజ్యాభిషిక్తుడై దర్శనార్థమై వేచియున్న యసంఖ్యాకులగు భక్తజనులకు దర్శనమీయదలచి తలుపులు దెరువబడునట్లు సంకల్పించెను. తత్క్షణమే భక్తవరసింహము ద్వారమునొద్దకు జని యిట్లు ప్రార్థించెను

"ఓ దయాసాగరా, దీనబంధో, ఆర్తత్రాణపరాయణా, భక్తరక్షణార్థ మవతరించు భక్తాధారా, దీనులకును పతితులకును, నాశ్రయదాతవగు నో లోకైకవంద్యా, భవతరములగు నీపావనచరణముల వినా నాకేమియువలదు. విద్య, బుద్ధి, ధనము, పరివారము, పుత్రులు పాతాళము, స్వర్గము, మొదలగు వాంఛ లెంతమాత్రమును లేవు. నేను గొప్పయోగియు, మహాత్ముడను, కాగోరుటలేదు. నీవైకుంఠము, నీముక్తి, నీపరమధామము, నీయష్టమహాసిద్ధులును నాకు వలదు. నీపూర్ణకటాక్షమును నాపై ప్రసరింపజేసి, నీదర్శనభాగ్యము ననుగ్రహించి, హృదయ


श्री पांडुरंग मंदिर, कीर पंढरपुर.
శ్రీపాండురంగదేవాలయము. కీరపంఢరీక్షేత్రం.
SREE PANDURANGA TEMPLE, KEER PANDHARPUR.
MASULIPATAM, KRISHNA DIST, (VIA BEZWADA)

శాంతి నొందించుము, లేకున్న నా ప్రాణము లెగసిపోవుటకు సిద్ధమగు చున్నవి. లక్ష్మీపతీ, ఆశ్రితభక్తవత్సలా! శరణాగత కల్పద్రుమా, దశరథనందనా, జానకీపతీ. రాధామనోహరా, గోవిందా!" అని ప్రార్థించెను.

వెంటనే శ్రీపంఢరీనాథుని సంకల్పముచే దలుపులు తెరువఁబడి మందిరములోపల పీఠమునుండి తేజోవంతములైన కిరణము లుదయించి యందుండి జ్యోతి బయల్వెడలి, ధూమము వ్యాపించెను, ఆ ధూమము నుండి శ్రీవిఠ్ఠలనాథుఁడు సమముగ చరణముల నుంచుకొని కటిన్యస్తహస్తుఁడై నాసాగ్రదృష్టిధారియై, శ్యామలవర్ణుఁడై దివ్యమంగళ రూపముతో నచట గూడియున్న లక్ష్మలాది జనులకు దర్శన మిచ్చెను. జనులెల్ల రానంద పరవశులై యశ్రుధారలు విడచుచు తన్మయులై భగవంతుని సేవించుచుండిరి. ఆ స్వరూపమును వర్ణించుటకు శారదా శేషులకైనను సాధ్యముగాదు. నిరంతర బ్రహ్మానందానుభవ సంపన్నులగు మునీశ్వరుల మోహింపజేయు మనోహర రూపమును వర్ణించుట కల్పజ్ఞానులగు మానవమాత్రుల కెట్లు సాధ్యమగును.

ఆ సమయమున భాగ్యవంతుడగు భక్తనరసింహాము చిత్తమున కెట్టి శాంతిలభించెనో, దాని నుపమానముగ వర్ణించుటకు యోగ్యములగు పలుకు లలభ్యములైనవి. అది వర్ణనాతీతము. అనిర్వచనీయము. అప్పుడనంత గరుడ విష్వక్సేనాది నిత్యసూరులును, భృగు ప్రభృతిమహర్షులును, నారదాది దేవర్షులును, వ్యాసాది మునులును, చిత్రరథాది గంధర్వులును, కపిలాది సిద్ధులును ప్రహ్లాదాది భక్తులును, సావిత్ర్యనసూయాది పతివ్రతలును, మూర్తిమంతములగు శ్రుతులును, పుణ్యనదులు, నానంద భరితులై స్వస్తివచనముల జెప్పుచు భగవంతుని బరివేష్టించి యుండిరి. ఈ కౌతుకమును జూడవచ్చిన భావుకులగు స్త్రీ పురుషులెల్లరు జయజయ ధ్వనులను జేయుచు సమాధిస్థితి నొందిరి. భక్తనరసింహాము నాటినుండియు, శ్రీవిఠ్ఠలమూర్తి నొకనిమేషమైనను విడువలేక యాశలను త్యజించి యనన్యభక్తితో నామందిరమున నేనివసించి, ప్రతిక్షణమును శ్రీపాండురంగమూర్తిని సేవించుచు బ్రహ్మానందము ననుభవించుచుండెను.

తొంబదియవ అధ్యాయము సమాప్తము.

# శ్రీ పాండురంగాష్టకం.

మహాయోగపీఠే తటేభీమరథ్యా, వరంపుండరీకాయ దాతుం మునీంద్రైః
సమాగత్యతిష్ఠం తమానందకందం, పరబ్రహ్మలింగం భజేపాండురంగమ్ ॥

తటిద్వాససం నీలమేఘావభాసం, రమామందిరం సుందరం చిత్ప్రకాశమ్,
వరంత్విష్టికాయాం సమన్యస్తపాదం, పరబ్రహ్మలింగం భజేపాండురంగమ్ ॥

ప్రమాణంభవాబ్ధేరిదం మామకానాం, నితంబఃకరాభ్యాం ధృతో యేనతస్మాత్
విధాతుర్వసత్యై ధృతో నాభికోశః. పరబ్రహ్మలింగం భజేపాండురంగమ్ ॥

స్ఫురత్కౌస్తుభాలం కృతం కంఠదేశే, శ్రియాజుష్టకేయూరకం శ్రీనివాసమ్
శివంశాంతమీడ్యం వరం లోకపాలం, పరబ్రహ్మలింగం భజేపాండురంగమ్

శరచ్చంద్రబింబాననం చారుహాసం, లసత్కుండలాక్రాంత గండస్థలాంగమ్
జపారాగబింబాధరం కంజనేత్రం, పరబ్రహ్మలింగం భజేపాండురంగమ్ ॥

కిరీటోజ్వలత్సర్వ దిక్ప్రాంతభాగం, సురైరర్చితం దివ్యరత్నై రనర్ఘైః,
త్రిభంగాకృతిం బర్హమాల్యావతంసం, పరబ్రహ్మలింగం భజేపాండురంగమ్ ॥

విభుంవేణునాదం చరంతం మరంతం, స్వయంలీలయాగోపవేషం దధానమ్
గవాం బృందకానందదం చారుహాసం, పరబ్రహ్మలింగం భజేపాండురంగమ్॥

అజం రుక్మిణీప్రాణ సంజీవినంతం, పరంధామ కైవల్యమేకం తురీయమ్,
ప్రసన్నం ప్రపన్నార్తిహం దేవదేవం, పరబ్రహ్మలింగం భజేపాండురంగం ॥

స్తవంపాండురంగస్య వైపుణ్యదం యే, పఠంత్యేక చిత్తేనభక్త్యాచ నిత్యమ్,
భవాంభోనిధిం తేఽపి తీర్త్వాంతకాలే, హరేరాలయం శాశ్వతం ప్రాప్నువంతి॥౯॥

— శ్రీ పాండురంగాష్టకమ్ సమాప్తము —

# శ్రీవిఠ్ఠలనాథుని మంగళహారతి

( భక్త-నామదేవ విరచితము. )

యుగే అఠ్ఠావీస విటేవరీఉభా, వామాంగీ రఖుమాఈ
దిసే దివ్యశోభా ।
పుండలీకాచే భేటీ పరబ్రహ్మ ఆలేగా, చరణీవాహేభీమా
ఉద్ధరీజగా॥

జయజయ దేవజయ దేవ జయపాండురంగా, (హరిపాండురంగా)
రఖుమాఈవల్లభ, రాహీంచ్యావల్లభ, పావేజీవలగా॥
జయ దేవ ॥౧॥

గళాతులసీమాల కరఠేవునికటీ, కాసేపీతాంబర, కస్తూరిలల్లాటీ!
దేవసురవర, నిత్యవతీ భేటీ, గరుడ హనుమంత సన్ముక
రహాతీ॥ జయ దేవ ॥౨॥

అషాఢి కార్తీకి, భక్తజనయేతీ, చంద్రభాగే మార్ఖిస్నానజేకరితీ
దర్శన హేళమాత్రే తేయహోయముక్తీ. కేశవాచీ నామదేవ
భావే ఓవాళితీ॥ జయ దేవ ॥3॥

---

మంగళహారతి- (గుండామహారాజ్)

నిర్వికారబ్రహ్మ వ్యక్తిసిఆలే, యేఉనివాళువంటీ ఉభేరాహీలే,
భక్తపుండలీక ధరుని ఉభేకేలే, ముక్తప్రాణతి ప్రాణతి మనాసీఆలే॥
జయ దేవ జయ దేవ జయజయవిఠ్ఠల, తుఝా దర్శనమాత్రే
బంధ తుటాలా॥ జయ దేవ॥

తుఝాచరణీ చరణీ, ఆలోజీతు కే, ఆవఘీ వైకుంఠీచే బసలే
భూమికే॥
తుఝనామఘేతా, తరలేజితు కే, పాపీసర్వహేముక్త
కేలేజితు కే ॥జయ దేవ॥

శివాకారముకుర కస్తూరిభాళీ. కచేపునికర, శోభివనమాలీ
బ్రిహ్మాసుఖాచా ఘేఊనవ్వోలీ గుండాప్రార్థిజ్యోతి ఆరతీ
ఓవాలీ ॥జయదేవ॥

—♦ ప్రదక్షిణ ♦—

ఘూలీనలోటాంగణ, వందీనచరణ, డోళ్యానీపాహీన రూపతుఝే
పేమఆలింగన, ఆనందపూజన, భావేఓవాళీన, మ్హణేనామ॥

—♦ ప్రార్థన ♦—

శ్లో॥ త్వమేవమాతా, పితాత్వమేవ, త్వమేవబంధూ సఖాత్వమేవ
త్వమేవ విద్యా, ద్రవిణం త్వమేవ, త్వమేవ, సర్వం
మమదేవదేవా॥

కాయేనవాచా, మనసేంద్రియైర్వా, బుద్ధ్యాత్మనావా
ప్రకృతిస్వభావాత్
కరోమియద్య, త్సకలం పరస్మై, నారాయణాయేతి
సమర్పయామి॥

అచ్యుతం, కేశవం, రామనారాయణం, కృష్ణదామోధరం
వాసుదేవం హరిం
శ్రీధరం మాధవం, గోపికావల్లభం, జానకీనాయకం
రామచంద్రం భజే॥

హరినారాయణ, దురితనివారణ, పరమానంద సదాశివశంకర
భక్తజనప్రియ. పంకజలోచన, నారాయణతవ దాసోహం॥
భక్తాభీష్ట ఫలప్రదాయ నమః.

శ్రీ పాండురంగ భక్తలీలామృతము సమాప్తము.

హైమావతీ ప్రెస్ లిమిటెడ్., విజయవాడ 1.